# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఫిబ్రవరి 1967



సంపుటము 44 : : సంచిక 2 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1967

# స్నిగ్ధ రావణము

## శ్రీ టి. ఏ. యం. అయ్యవారు

[నారదుని ప్రేరణమున యముని జయింపబోయి నరకయాతనల వ్రాగ్గు కొందఱు జీవులఁ జూచి మనస్సు కరగిన రావణుడన్న మాట లివి.]

భయద కులిశప్రహార సంపాతములకు
చెదరు బెఱుగని మన్మన స్సీమ—అకట!
వికట విధి వంచిత ప్రజా బృంద మిచటఁ
జేయు హాహారవమ్ములఁ జీలిపోవు!

ఈ కృపణ ప్రజాతుల స్రవించు నఖంపచ భాష్పవారి ధా
రా కలుషీకృతంబయిన రాజ్యము నేగతి దుర్విదగ్ధులై—
చేకొని యేలువారలొ వచింపగ సిగ్గగు—నిస్త్రపావరీ
పాకమె వేల్పు మూకల స్వభావమొ? యెవ్వడు చెప్ప వీనికిన్.

ఏదో మారుత వీచి వీచిన మనోహేలాగతిన్—జీవి స్వే
చ్ఛా దారిద్ర్య విచిత్రవర్తనుఁడు నిచ్చల్ పాపమో! పుణ్యమో!
పేదై భృత్యుని వోలెఁ జేయును—వృథాద్వేషమ్ముతో దానికే
యాదృగ్దండనమైన దుష్టవిభూతాహేవాకమోఁ గాదటే!

పాపంబేల నెవండు చేయునో! తలంపంజాల రీ కైతవ
వ్యాపార ప్రవణుల్—సుధాంధసులు—సంపన్మత్తు లిచ్ఛాను రూ
పా పారాగత భోగమగ్ను లసలీ ద్వంద్వంబు, లద్వైత వి
ద్యాపారీణుల మ్రోల నిల్చునె వృథాహంకార మెట్లోర్చెదన్.

ఎవనికి వాఁడుగా సుకృత మియ్యది—దుష్కృత మిద్దియంచు నై
జ వికృతబుద్ధి—శాస్త్రగఁ బ్రజావళి మాఱిమసంగఁ బూనుచో—
శివశివ! పృథ్విపై ననదజీవులు నిల్తురె? యీ దురంత తాం
డవమున కింక స్వస్తి వచనంబును పాడెద—మద్భుజాగతిన్.

మును పచలాయితంబగు సముజ్జ్వలభక్తి—శిరస్సరోరుహా
ర్పణ కలనాసమంచిత సపర్యకు—మెచ్చినదానికంటె దా
రుణమగు వేదనాధ్వముల రొప్పెడి..వీరి నిరంతరాశ్రు వా
హినుల శమించుచేత కెదనెక్కుడు నీలగళుండు మెచ్చడే!

అలసులు మందబుద్ధులు—రుజావిలదేహులు పాపవిూ మహీ
స్థలి ప్రజ లేమి చెప్పుదు వ్యథామయ గాథలతో నిరంతరో
చ్ఛలితకదుష్ణబాష్పఝరసంతతితో దినము భ్రమింతు రె
ట్టులో! దయమాలి వారల నిటుల్ గికురింతురె దంభధార్మికుల్.

సంపద లుబ్బినన్ సవనజాలము దీర్చి—హవిఃప్రదాన పా
రంపరిఁ దృప్తిపెట్టిన ఫలంబని స్వాదుసుధారసంబు—నై
లింప వధూ విహార మమరింతురు వేల్పులు లంచగొండులై
మంపెసగన్—దరిద్రులను మాడ్చుచు నీ నిరయాగ్ని కీలలన్

ఎన్ని యుగంబు లిట్లు జ్వలియించునొ? భీషణ నారకాగ్ను లా
పన్న విపన్న మానవ కృశాంగక భుక్తికి జిహ్వ లార్చుచున్—
మిన్నుల నేలు దేవతల నిష్ఠురపాలన నాట్యమాడగా
నెన్ని విశీర్ణజీవితము లిమ్మహి రాల్చునొ! శోణితాశ్రువుల్

కొందఱు తప్తశృంఖలలకున్ బలివెట్టి శరీరయష్టు లా
క్రందనముల్ పొనర్పగ—నిరామయులై మఱికొంద అప్సరో
బృంద దృఢోపగూహముల వేడ్కలఁ దేలెడి నిట్టి వక్ర నీ
తిం దశకంధరుం డనుమతింపడు—సైపడు కూటధర్మముల్.

మా ధరణి మండలమ్ముపై మచ్చరించి
యుగయుగాలుగ వేధించుచున్నయట్టి
అమరపరివృఢులకు నింక నస్మదీయ
దోరసిక్షేపమున బుద్ధి తోచుగాక!

మా పితామహు సృష్టికి మచ్చయైన
ఈ నిరయలోకమిది సాగునెట్టులింక?
పరమశివదత్తమీకరవాలరాజ
మిటు వినూత్న ధర్మమ్ము స్థాపించి తీరు!

ద్విషదసుమరుద్భుజిక్రియా దృప్తమైన
మద్భుజాభుజగస్ఫటామండలోరు
శిబిక నెక్కి యూరేగుత జృంభణముగ
నింక సమతా మహాదేవి—యెల్ల జగతి—

---

# శ్రీ సముద్రగుప్త చక్రవర్తి కృష్ణచరితము-I

శ్రీ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రి

కీర్తిసాంద్రులగు భారత చక్రవర్తులలో 'సముద్రగుప్త' మహారాజు సుప్రసిద్ధుడు. అతడు సార్వభౌముడేగాక సుకవితా సార్వభౌముడనుటకు అతని గ్రంథములు నేటివఱక యనుప లబ్ధము లగుటచే కొందఱతనిని చక్రవర్తిగా మాత్రమే గుర్తించి తమ తమ చరిత్రలలో వ్రాసియున్నారు.

అదృష్టవశమున సౌరాష్ట్రదేశీయులును సుప్రసిద్ధ పండితాగ్రేసరులును అగు రాజ వైద్య శ్రీ జీవరామ కాళిదాస శాస్త్రి గారికి 'సముద్రగుప్త' చక్రవర్తి విరచితమగు ఖిలమైన కృష్ణ చరితము కొంత దొరుకుట ఇప్పట్టున పేర్కొనదగిన విషయము.

హరిషేణ మహాకవి సముద్రగుప్తుని సార్వభౌముడేగాక కవిలోకచక్రవర్తియు విద్వత్కవిపోషకుడనియు ప్రస్తుతించి యున్నాడు. అట్టి ప్రస్తుతికి పాత్రములైన గ్రంథరత్నములు నేడనుపలబ్ధములౌట విచార్యము. మరియును ఈ మహారాజునకు కవిరాజను సార్థకనామ ముండియున్నట్లు కూడ ప్రసిద్ధము. ఇట్టి మహాకవిరాజు కావ్యరత్న మొక్కటి కూడ లభించకపోవుటయూ చాలకాలమునకు శ్రీ కాళిదాసశాస్త్రిగారి హస్త లిఖిత పుస్తక భాండాగారమున అంతయూ ఖిలమై మూడు పత్రములు మాత్రమే మిగిలిన కృష్ణచరితము లభించుటయు సంతోషావహమైన విషయము.

పై కృష్ణచరితమైననూ పూర్ణముగా దొరికి యుండినచో భారతీయ విద్వాంసులకు మిక్కిలి యానందము కల్గి యుండును. కాని ఈ మాత్రము దొరకుటయూ కూడ సముద్రగుప్త కవిరాజశేఖరుని కీర్తికాంతకు నిలువ నీడగల్గినది.

ఇట్టి యుద్గ్రంథములెన్ని భారతీయుల దురదృష్టముచే అణగారినవో గదా! శాంతంపాపం.

దొరికిన మూడు తాళపత్రములు కూడ కొంతవరకు ఖిలములు అయినను వీనిలో సముద్రగుప్తుడొనర్చిన కవిసంస్తవనము మనకు వీని వలన లభించినది. అందీతడొనర్చిన కవివిభాగ మెక్కడను జరిగియుండలేదు. మునికవులనియును, రాజకవులనియును, జీవికాకవులనియును కవులను ముత్తెరంగుల విభజించి క్రమముగా పూర్వ పూర్వులైన వారియెడ గౌరవమును ప్రదర్శించెను. అంతియేగాక మిగిలిన కవుల విభాగము కూడ సముద్రగుప్తుడే పేర్కొని యుండుననుటయు సమంజసముగా యున్నది. వారెవ్వరనగా అసూయాకవులు, గర్వకవులు, శాస్త్రీయ విషయనిదర్శనకవులు—మొదలగువారు.

(ఇట్టి కవివిభాగ మాంధ్రభాషలో కూడా జరుగవలసి యున్నది. నేటి కవులను గూడా ముందుతరములవారే ఆయా వర్గములలో చేర్చుకొనగల్గుటకు కూడ మార్గనిర్మాణము జరిగి నట్లగును. అది యట్లుండుగాక.)

దొరికిన పత్రములలో శ్రీ 'సముద్రగుప్త' చక్రవర్తి వక్కాణమిట్లున్నది:

"ఇతి శ్రీ విక్రమాంక మహారాజాధిరాజ పరమ భాగవత శ్రీ 'సముద్రగుప్త' కృతౌ కృష్ణచరితే కథాప్రస్తావనాయాం మునికవి కీర్తనం. శ్రీః శ్రీః." అని యున్నది. పరమభాగతావతంసుడగుటచేతనే కృష్ణచరితమువంటి కృతి సముద్ర గుప్తుని దైనది. విక్రమాంక మహారాజాధిరాజ బిరుదములు చరిత్ర ప్రసిద్ధములే. మరియు నీతని హయ మేధమును గూర్చి కూడ చరిత్రకారులు గుర్తించియున్నారు.

ఈతని కృష్ణచరితములో మనకు దొరికిన కొన్ని శ్లోకములనీ క్రింద లిఖించియున్నాను. మునికవయః.

.............................
................మివాకరోత్. 12

సాంఖ్యాయనాయ కవయే
నమోస్తు కంఠాభరణకర్త్రే
కావ్యం యస్య రసాఢ్యం
కంఠాభరణం సదా విదుషాం. 13

య స్వర్గారోహణం కృత్వా
స్వర్గమానీతవాన్భువి

కావ్యేన రుచిరేణైవ
ఖ్యాతో వరరుచిః కవిః. 14

న కేవలం వ్యాకరణం పుపోష
దాక్షీసుతస్యేరితవార్తికైర్యః
కావ్యేపి భూయో నుచకార తం వై
కాత్యాయనోసౌ కవికర్మదక్షః. 15

రసాచార్యః కవి ర్వ్యాడిః
శబ్దబ్రహ్మైకవాఙ్మునిః
దాక్షీపుత్రవచోవ్యాఖ్యా
పటు ర్మీమాంసకాగ్రణీః. 16

బలచరితం కృత్వా యో
జిగాయ భారతం వ్యాసం చ
మహాకావ్యవినిర్మాణే
తన్మార్గస్య ప్రదీపమివ. 17

సుయశా అభవ ద్భూమౌ
బృహస్పతిసమః కవిః
యత్కావ్య మింద్రవిజయం
భాసతే దేవలోంత్యజః. 18

విజయోద్రిక్త గుణయా
భూమా వమరతాం గతః
పతంజలిర్మునివరో
నమస్యో విదుషాం సదా. 19

కృతం యేన వ్యాకరణ
భాష్యం వచనశోధనం
ధర్మా వియుక్తా శ్చరకే
యోగా రోగముషః కృతాః. 20

మహానందమయం కావ్యం
యోగదర్శన మద్భుతం.
యోగవ్యాఖ్యానభూతం త
ద్రచితం చిత్త దోషహం. 21

భాసమాన మహాకావ్యః
కృతవింశతినాటకః
అనేకాంక విధాతా చ
ముని ర్భాసో భవ త్కవిః 22

యస్యామందరసా వాచః
స్యందస్యానంద ముచ్చకైః
అన్యేన కేన కవినా తుల్యతా
తస్య వర్తతాం. 23

అన్యః కః కర్తు మశకత్
కవి ర్ధర్మార్థ కామవత్
యథావాసవదత్తాఖ్యం
యస్య నాటక ముత్తమం. 24

వాల్మీకి వైభవ నిదర్శన మాదికావ్యం
రంగే నిదర్శిత మయం సురసంచకార.
వ్యాసస్య భారత మభారతయా సుదర్శం
కృత్వాచ తత్ర వివిధాః స్వకథా యుయోజ. 25

రూపకక్రమ మస్యైవ
కవయో స్వయయు ర్బుధాః
అయం చనాన్వయా త్పూర్ణం
దాక్షీపుత్రపదక్రమం. 26

అభిరామా స్సుబోధాశ్చ
యస్య వాచో మహాకవేః
రస్సైరగ్నిం శమం నిన్యుః
తస్య కిం వర్ణ్యతాం యశః. 27

దావ మబ్దఇవ క్షిప్తం
నిస్తాపం హృదయం సతాం
కరోతి వర్ధమానస్య
కవే ర్భీమజయం రస్సైః. 28

బాహ్యా వ్యాహా ఇహాగత్య
కవిసమ్మాన మాప్తవాన్
అకరో ద్బుద్ధచరితం
మాగధ్యా మృషివాచ్యపి. 29

పీయూష లిప్తవచనః
చీనదేవో వ్రతీ కవిః
యశఃశరీరేణ సదా
జీవత్యేవ మహామతిః. 30

కావ్యం చకార రమణీయ గుణం యశస్యం
సూర్యస్తవం శిఖరిణీ శతమాన మాప్తం
అత్రాస్తితో లభత భూరియశో బభూవ
భక్త స్సహస్రకిరణస్య తమోపహంతుః. 31

జాతో మహాత్మనాం మాన్యః
పర్శ్వవంశభవోపి సన్
చక్రే మిహిరదేవస్య
రమ్యం చాదిత్యమందిరం. 32

పీయూష సౌదర్యరసాః సుఖేన
ధర్మార్థకామాన్ సకలాన్ దదత్యః
యేషాం గిర స్తే కవయో మహాంతః
పూర్వం దశో మేభిహితా మయాత్ర. 33

## శ్రీ సముద్రగుప్త చక్రవర్తి కృష్ణచరితవ

తర్వాత "ఇది శ్రీ విక్రమాంక..." అని వక్కాణమున్నది. దొరికిన రెండు కాయితములలో ఈ విషయమై 12 శ్లోకములు పోను ఇయ్యవి మాత్రమే నిలిచినవి సముద్రగుప్త చక్రవర్తి కృష్ణచరిత శ్లోకములు.

ఇందలి మనోహరతరమైన శైలి రీతి పాకము స్పష్టత నైర్మల్యత ఇత్యాద్యుత్తమ గుణములతో రమణీయమైనవిగా ఇంచుమించూ ఇతఃడు పేర్కొన్న బుషికవుల శైలిని పురు ణించునవిగా నీ శ్లోకములు కన్పట్టుచున్నవి.

"అథరాజకవయః" అని దొరికిన మూడు పత్రములతో ప్రారంభింపబడి వారి గుణకీర్తమును ఇట్లు సముద్రగుప్తుఁడు గానము చేయుచున్నాడు.

"జయ త్యయం పూర్ణకలః
కవికీర్తి సుధాకరః
అకలంకో రసాంభోధి
ముద్వర్తయతి యస్సదా. 1

వ్యాహార సౌష్ఠవ ముదార రసం మహార్థం
యన్నాటకం సురభిగర్భితనాటకంచ.
త ద్వత్సరాజచరితం మృదుభావహారి
కృత్వా సుబంధు రభవ త్కృతినాం వరేణ్యః. 2

బిందుసారస్య నృపతేః
సబభూవ సభాకవిః
కింతు సేహే నతద్గర్వం
తిరశ్చక్రే చతాం సభాం. 3

ఉరగాభే నృపే తస్మిన్
కృద్ధే బంధమితం కవిం.
సరస్వతీ ముమోచాథ
తం దేశం సోత్యజ త్తదా. 4

విద్వాన్ జయీ వత్సరాజో
దృష్ట్వా వైదుష్య ముత్తమం
పంచగ్రామాన్ దదౌ తస్మై
నిజాం భగినికాం తథా.. 5

పురందరబలో విప్రః
శూద్రక శ్శస్త్ర శాస్త్రవిత్
ధనుర్వేదం చౌరశాస్త్రం
రూపకే ద్వే తథా కరోత్. 6

సవిపక్ష విజేతా భూ
చ్ఛాస్త్రైశ్శస్త్రైశ్చ కర్తయే.
బుద్ధి వీర్యే నాన్యవరే
సౌగతాశ్చ ప్రసేహిరే 7

తత స్తాదారిస్తైస్యస్య
దేశఖండై రణే మహీం
ధర్మాయ రాజ్యం కృతవాన్
తపస్విత్వత మాచరన్. 8

శస్త్రైస్త్రార్జితమయం రాజ్యం
ప్రేమ్ణాకృత నిజంగృహం.
ఏవం తత స్తస్య తదా
సామ్రాజ్యం ధర్మశాసితం. 9

తత్కథాం కృతవంతౌయౌ
కవీ రామిల సోమిలౌ.
తస్యైవ సదసి స్థిత్వా
తౌ మానం బహ్వావాప్నుతాం. 10

సతాంమతః సోశ్వమేధం
కృతవా నురువిక్రమః
వత్సరం స్వం శకాన్ జిత్వా
ప్రావర్తయత వై క్రమం. 11

భూయస్యమృచ్ఛకటికం
నవాంకం నాటకం వ్యధాత్
వ్యధా త్తస్మిన్ స్వచరితం
విద్యానయబలోర్జితం. 12

త దార్యకజయం నామ్నా
ఖ్యాతిం విద్వ త్స్వవిందత.
ఏవం బ్రహ్మక్షత్ర తేజో
రాశి రాసీ త్సశూద్రకః. 13

ఉపవేశ్య నిజం పుత్రం
దేవమిత్రం నిజాసనే.
వార్ధకే మునివృత్త్యైవ
న యత్కాలం వనం యయౌ. 14

తస్యాభవ న్నరపతేః కవి రాప్తవర్ణః
శ్రీకాళిదాసయుతియోఽ ...తిమప్రభావః
దుష్యంత భూపతికథాం ప్రణయప్రతిష్ఠాం
రమ్యాభినేయ భరితాం సరసాం చకార. 15

శాకుంతలేన సకవి
ర్నాటకే నాప్తవాన్యశః
వస్తు రమ్యం దర్శయంతి
త్రీణ్యన్యాని లఘూనిచ. 16

జన్మనాథ భవ ద్విద్వాన్
సౌగత స్తర్కవారిధిః

సౌనంద బుద్ధచరితే
మహాకావ్యే చకారయః. 17

తస్య శూద్రకవే ర్ఘోష
ఇతి నామా బభూత్తతః.
ధర్మవ్యాఖ్యాన రూపా స్ప
నవగ్రంధా పరిరచత్. 18

సౌగతానాం మహాసంస
త్సూరీయా భూ న్మహొజ్వలా
తస్యాం సభ్యో బభూవాయం
విప్ర విద్వచ్ఛిరోమణిః. 19

నిజకీర్తే ర్వైజయంతీం
కర్ణకీర్తిం చకార యః
హరిచంద్రో విజయతే
పాంచాలక్ష్మీపః కవిః. 20

మాతృగుప్తో జయతి యః
కవిరాజో న కేవలం
కాశ్మీర రాజో ప్యభవత్
సరస్వత్యాః ప్రసాదతః. 21

విధాయ శూద్రక జయం
సర్గాంతానంద మద్భుతం
స్వదర్శయ ద్వీరరసం
కవి రావంతికః కృతీ. 22

తుంగం హ్యమాత్యపద మాప్తయశః ప్రసిద్ధం
భక్త్యా చిరం పితు రిహాస్తి సుహృన్మమాయం.
సంధౌచ విగ్రహకృతేచ మహాధికారీ
విజ్ఞః కుమార సచివో నృపనీతి దక్షః. 23

కావ్యేన సోద్య—ఇతి ప్రసిద్ధో
యః కాలిదాస ఇతి లబ్ధమహార్హనామా
ప్రామాణ్య మాప్తవచనస్య చ తస్యధర్మ్యే
బ్రహ్మత్వ మధ్వర విధే మమ సర్వదైవ. 24

చత్వా ర్యన్యాని కావ్యాని
వ్యదధాచ్చ లఘూని సః
ప్రాభావయచ్చ మాం కర్తుం
కృష్ణస్య చరితం శుభం. 25

హరిషేణ కవి ర్వాగ్మీ
శాస్త్రశస్త్ర విచక్షణః
యశోలభత కావ్యైః స్వైః
నానాచరిత శోభనైః. 26

ఏషాం న కేవలం కావ్యం
శ్రేష్ఠం ధర్మార్థకామదం
రాజతా వా రాజనీతి
రూపకర్త్రీ మనస్థితా. 27

తే రాజకవయో మాత్యా
శుద్ధకర్మ గుణై ర్భువి
వర్ణితా అష గురవో
షణ్ణాగప్రతిపక్షిణః. 28

ఇతిశ్రీ విక్రమాంక మహారాజాధిరాజ పరమ భాగవత శ్రీ సముద్రగుప్త కృతౌ కృష చరితే కథాప్రస్తావనాయాం రాజ కవి కీర్తనం. ఓం నమోభగవతే వాసుదేవాయ. శ్రీశ్రీశ్రీ నమో భగవతే కృష్ణాయ. అథజీవికా కవయః.

## గ్రంథపాతము

జీవికా కవులను గూర్చి వ్రాసిన పత్రములు కూడ పోయినవి. సముద్రగుప్తుని దృష్టిలో జీవికాకవు లెట్టివారై యుండిరో తెలుసుకొనుటకు వీలులేకపోయినది. అది యట్లుండ నిండు.

ఋషికవులలో వాల్మీకి వ్యాసాదులను కాక పాణిన్యాదులను గూడ సముద్రగుప్తుడు స్తుతించినట్లూహించవలసి యున్నది. ఏలయనగా ''మివాకరోత్'' అని 12 శ్లోకభాగమున్నది. ఏదో యొక కవిచే రచింపఁబడిన కావ్యముతో మరొక కవి కావ ముపమింపఁబడినట్లు దీనిచే తెలియుచున్నది. అటుపై యున్న కవి పరంపరను చూచినచో పాణినియే ఇచ్చట వర్ణింపబడి యుండ వచ్చునను నూహ కవకాశమున్నదని శ్రీ జీవరాం కాళిదాసశాస్త్రి గారు గ్రంథవిమర్శలో వ్రాసియున్నారు. వారి వచనముల సారాంశ మిది. శబ్దానుశాసన కర్తయగు భగవాన్ పాణిని కవియై కూడ యుండెనని పాతంజల మహాభాష్యము వలన తెలియు చున్నది. అందుచే ''అకథిత'' మను సూత్రమందు, ''దధి.హియా చి రుధిప్రచ్ఛి భిక్షిచిఞాముప దేశనిమిత్తమపూర్వవిధౌ, బ్రూవి శాసిగుణేనచ యత్సచతే తదకీర్తిత మాచరితం కవినా,'' అను పట్టున కవి శబ్దము మేధావిపరము అని కయ్యటుడు వచించినప్ప టికిని పాణిని యొక్క కవిత్వ మప్రసిద్ధమైన దేమియూ కాదు.

రాజశేఖరుఁడు పాణిని కావ్యము పేరు జాంబవతీజయమని వచించెను. మరియూ రుద్రటాలంకార వ్యాఖ్యలో నమిసాధువు పాతాళ విజయ మహాకావ్యకర్తృత్వమును పాణినిదిగా వ్రాసెను. అంతయే గాక ఆ పాణిని కావ్యములో అశుద్ధ శబ్దములను కూడ నుదాహరించెను.

''సంధ్యావధూం గృహ్యకరేణభానుః.'' ఇచ్చట గృహ్య త్వోక్త్యాల్యబాదేశము, మరియు ఆ పాణినిదే అయిన అశుద్ధ దోషము.

''గతేర్ధరాత్రే పరి మందమందం
గర్జంతి య త్ప్రావృషి కాలమేఘాః

అపశ్యతీ వర్ష మిహేందు బింబం
తత్పూర్వ్ర్ శారివ హుంకరోతి.

ఇచ్చట పశ్యతిపదము యుక్తనకారము.

మరియు అమరకోశ వ్యాఖ్యాత ముకుటమహాశ పాణిని కావ్యదోషము నెత్తిచూపెను.

"పయః స్పృశంతిభిః స్పృష్ట్వా
వాంతి వాతా శ్శనైశ్శనైః"

ఇందు పయః స్పృశంతిదోషముగా గ్రహింపఁబడినది.

శార్ఙ్గధరపద్ధతిలో పాణినికృత పద్యములు కన్పడు చున్నవి. మరియు సదుక్తికర్ణామృతమున పాణిని పద్యము లెనిమిది యుదాహరింపఁబడినవి.

జర్మనీదేశ AUFRECHT మరియు PISCHAL అను విద్వాంసులచే సదుక్తికర్ణామృతము నుండి యొక శ్లోక ముద్ధరింపఁబడి అందుదాహరింపఁబడిన దాక్షీపుత్రుఁడు వ్యాకరణ సూత్రకర్త పాణినియే యని నిర్ణయము కూడ జరిగినది. ఆ పద్య మిది.

"సుబంధౌ భక్తిర్నః క ఇహ రఘుకారే న రమతే
ధృతి ర్దాక్షీపుత్రే హరతి హరిచంద్రోపి హ్లాదయం,
విశుద్ధోక్తి శ్శూరః ప్రకృతి మధురా భారవిగిరః
తథా ప్యంతర్మోదం కమపి భవభూతి ర్వితనుతే" అని.

ఈ విషయమును గూర్చిన కొన్ని విప్రతిపత్తులు విద్వల్లోకమున నున్నవి. వానినిగూర్చి కొంచెము చెప్పుచున్నాము. రాజశేఖరుని పద్యము ప్రమాణీకరింపఁ దగినదిగాదని కొందరు అనుచున్నారు. ఏలయనఁగా రాజశేఖరుఁడు రత్నావళీ ప్రియదర్శికా నాగానందములు భాసునివని చెప్పియున్నాఁడు. అందుచే పై మాట కూడా ప్రమాణీకరింప తగియుండదు. పై రత్నావళ్యాదులు హర్షకృతములేగాని భాసకృతములు కానేరవు. మేము రాజశేఖరుని మతమును ప్రమాణీకరించువారము కాకున్ననూ ఆమాట లేఖక ప్రమాదమో ప్రక్షిప్తమో అయియుండును. ఏలయనగా అనేక నాటకములను చూచిన రాజశేఖరుఁడు తన కాలమునకు చాలా దగ్గరివైన రత్నావళ్యాది హర్షకృత నాటకములను భాసునివని యనుటెట్లు జరుగును? అందుచే పై ప్రమాదము రాజశేఖరునిదిగా నంగీకరింపలేకున్నాము. ఇక నమిసాధువు చెప్పిన వ్యాకరణకర్త పాణిని కావ్యమునందలి అశుద్ధాభాసములు కనుపడుచున్న వాని విషయమై చెప్పుచున్నాము. ఇట్టి యశుద్ధాభాసములు రామాయణ భారతాదులలో కనుపడుచున్నవి. పాణిని కాలములో ఎట్టి గీర్వాణభాష వ్యవహారమందుండెనో అట్టి భాషను శాసించుటకే భగవాన్ పాణిని అష్టాధ్యాయి గ్రంథమును నిర్మించెను. తాను మాత్రము తన కావ్యమునందు వ్యాస వాల్మీకులనాటి సంస్కృతభాషనే యుపయోగించెనని భావింపవచ్చును.

లేదా వస్తువర్ణనలో ఎట్లు కవిసమయము లుండునో అట్లే శబ్దప్రయోగములలో గూడ ఆ నాడట్టి కవి సమయము లుండి యుండవచ్చును. అందుచేతనే భాస కాళిదాస భారవి మాఘాదుల కావ్యములలో పెక్కుచోట్ల అశుద్ధాభాసములు కనుపడు చున్నవి. లేక పాణిని తన సూత్రములందే తనమాటలకు విరోధము లైన కొన్ని శబ్దప్రయోగములనన్నిచో లట్లే తన కావ్యము నందును చేసెను. (ఈ విషయమున శ్రీ కాళిదాసశాస్త్రిగారి స్నేహితులు అల్మోరా నివాసులు శ్రీ గోవిందశాస్త్రిగారు ఈ పుస్తక పరిశిష్టములో వ్రాసియున్నారు సోపపత్తికముగా చూడవచ్చు.)

భారతాదులలో నున్న అశుద్ధాభాసములను మాటి యెవ్వరు గూడా వారు తెలియక వ్రాసినారనియనుటకు సాహసింపరు. ఎందులకనగా ఈ విషయమిట్లు వినుచున్నాము. పూర్వము మాహేశ్వరమైన వ్యాకరణము బహువిస్తారమైనది యుండినది. దానికి పాణిని వ్యాకరణము మిక్కిలి సంక్షిప్తతరమైనది. ఏవి పదములు పాణిని వ్యాకరణ దృష్ట్యా అశుద్ధములో ఆయా పదములు మాహేశ్వర వ్యాకరణ దృష్ట్యా శుద్ధములు. అందుచేతనే ఈ శ్లోకము చెప్పఁబడుచున్నది.

"యాన్యుజ్జహార మాహేశా
ద్వ్యాసో వ్యాకరణార్ణవాత్
కిం తాని పదరత్నాని
సంతి పాణిని గోష్పదే."

మధుసూదన సరస్వతి ప్రస్థాన భేదములో పాణిని వ్యాకరణమునే మాహేశ్వర వ్యాకరణమని వ్రాసెను. అందిట్లున్నది. వృద్ధిరాదైచ్ అని ప్రారంభమైన సూత్రపాఠము గల అష్టాధ్యాయిని మాహేశ్వర ప్రసాదముతో పాణినియే ప్రకాశింపఁ జేసెను. ఈ పాణిని సూత్రములకు కాత్యాయనముని వార్తికములను రచించెను. ఆ వార్తికముల మీఁద భగవత్పతంజలి మహాభాష్యమును రచించెను. ఇట్లు ముగ్గురు మునులచే రంచిపఁబడిన వ్యాకరణమే వేదాంగ వ్యాకరణమని మధుసూదన సరస్వతి యతి వ్రాయుచుయున్నాఁడు.

నిరుక్తాలోచనమున సత్యవ్రతసామశ్రమీ "అందుచే పాణిని కవిత్వములోని యశుద్ధములు ఇతర కవుల యందలి యశుద్ధములవంటివే యనుటకు దిఙ్మాత్రమిందు వ్రాయబడి యున్నది." అని వ్రాసిరి.

కొందరు పండితులు అశుద్ధాభాసములు గల పై పాణిని శ్లోకములను చూచి ఇవి పాణినివి కావను వారుందురు. అట్టివారీ విషయమును గమనింతురుగాకయని శ్రీ జె. కె. శాస్త్రి గారింత దూర మీ విషయమును గూర్చి వ్రాసియున్నారు. తెల్గువారి కీ విషయము తెలియవలసినదేగాన నే నింతవరకూ ఈ విషయమును వ్రాయవలసి వచ్చినది.

13 వ శ్లోకములో స్తుతింపఁబడ్డ సాంఖ్యాయనుని గూర్చి విచారించగా ఎవరీ సాంఖ్యాయనుఁడు? ఇతని పేరు, కర్తృత్వము, బ్రాహ్మణ చరణ గృహ్యశ్రౌత సూత్రముల యందు వినుచున్నాము. ఆగ్రంథములు మిక్కిలి ప్రాచీనములైనవి. అందుచే అతఁడేనా ఈతఁడను సంశయము గల్గుచున్నది. ఇతని

కావ్యము కంఠాభరణమని ఇందులో నున్నది. సముద్రగుప్తుని కాలములో గొప్పగా విద్వల్లోకమున ప్రచారమందినట్టిదియునై యున్నట్లు స్పష్టమే.

"వరరుచి కృతమైన కంఠాభరణ మొక్కటియున్నట్లు రాజశేఖరుఁడు సూక్తిముక్తావళిలో వచించియున్నాఁడు. అది వేరు కంఠాభరణమై యుండవచ్చు. లేదు కంఠాభరణమను విశేషణ పదమైననూ కావచ్చు. అంతకు మినహా ఈ సాంఖ్యాయన నామము మరెక్కడ వినబడదు" అని జె.కె. శాస్త్రిగారు వచించిరి.

పిప్పలాదసంహితకు సాంఖ్యాయన తంత్రమను నామాంతర మున్నది. అది కేవల మాథర్వణికము. సాంఖ్యాయన మహర్షి గోత్రజుఁడే పై కవియై యుండనోపు.

14—15 శ్లోకములలో పేర్కొనఁబడిన వరరుచి ప్రసిద్ధుఁడు. ఇతఁడు కవి కూడ నైయుండెననుటకు వివాద మవసరము లేదు. ఎందులకనఁగా పాతంజల మహాభాష్యమున 4—3—101 న వారరుచం కావ్యం అని కనువడుచున్నది. ఇందుచే వరరుచి కవి యనుటయేగాక పతంజలి మహాభాష్యమున కన్నమున్నే యుండినట్లు అందుచే సిద్ధించుచున్నది.

అయినచో ఈ వరరుచి యెవ్వరు? కథాసరిత్సాగరములో వర్షోపాధ్యాయునివలన అభ్యసించిన సమస్తవిద్యలు గలవాఁడునూ వ్యాకరణ శిరోమణియూ తద్వార్తికాకారుఁడునూ అయినట్లు వర్ణింపబడినాడు. కాని అతనిచే ఏదైనకావ్యము నిర్మించబడినట్లు చెప్పఁబడియుండలేదు. ఆ వరరుచికి గోత్రనామము కాత్యాయనుఁడని యున్నది. ప్రసిద్ధుఁడైన యోగానంద రాజునకు మంత్రిత్వమును కూడా ఈ వరరుచి చేసినట్లు కథాసరిత్సాగరము వలననే తెలియుచున్నది.

మరొక వరరుచి ప్రాకృత వ్యాకరణమునకు ప్రాకృత ప్రకాశమునకు కర్తగానున్నాఁడు. ఈ పై వరరుచియే ప్రాకృత వ్యాకరణమునకు కర్తయై యుండునా? యను సంశయము కలుగగా మొదటివరరుచి వార్తికాకారుఁడు వేరు. ఈ ప్రాకృత వ్యాకర్త వేరనియే శ్రీ జె. కె. శాస్త్రిగారి యభిప్రాయము.

ముందు వ్రాయబడిన రాజశేఖరుని శ్లోకముచే వరరుచి కవిత్వము తెలియుచున్నది. ఆకావ్యముపేరు కంఠాభరణమనియూ విద్వల్లోకమున సమ్మికయున్నది. ఆ కావ్యమునకు కంఠాభరణ మను పదము విశేషణ పదమనియూ గ్రహించుటకు వీలున్నది.

సముద్రగుప్తుఁడు వరరుచి కావ్యమును స్వర్గారోహణమని వ్రాకుచ్చి యున్నాడు. ఈ కాత్యాయనవరరుచి పాణిని చేసిన కంఠాభరణమువంటి దానిని వ్రాసినాడనిగాని అట్లుగా అనుకరించినాఁడనుటకుగాని వీలులేదు. ఇందులకు సూక్తిముక్తావళిలో నిట్లున్నది.

"యథార్థతా కథం నామ్ని మాభూ ద్వరరుచే రిహ.
వ్యధత్త కంఠాభరణం య స్సర్గారోహణప్రియః."

అని యున్నది. శార్ఙధర పద్ధతిలోననూ సదుక్తికర్ణామృతము నందుననూ సుభాషితవల్లిలోననూ వరరుచి కావ్యము నుండి కొన్ని శ్లోకము లుదాహరింపఁబడినవి. ఆ పద్యములు వరరుచి కవిత్వముయొక్క ప్రాశస్త్యమును నిరూపించుచున్నవి.ఆకావ్యము స్వర్గారోహణమను పేరుగలదనుట స్పష్టము, అయ్యది ప్రసిద్ధుడైన యుధిష్ఠిరుని స్వర్గారోహణ కథయే అయియుండనోపు.

## వ్యాడి

16—17 శ్లోకములలో వ్యాడి ప్రస్తుతింపఁబడి యున్నాడు. ఈ వ్యాడి వ్యాకరణ సంగ్రహకర్తగా పాతంజల మహాభాష్యము వలన తెలియుచున్నది. ఆ సంగ్రహము పాణిసూత్రములకు వ్యాఖ్యా గ్రంథము; లక్ష శ్లోకాత్మకమైనది. తత్సంగ్రహము భగవత్పతంజలి తన మహాభాష్యములో చేసెనని శ్రీ జె. కె. శాస్త్రిగారు పూర్వ పాణినీయ గ్రంథ ఉపోద్ఘాతములో వ్రాసియున్నారు. ఆ వ్యాడి కవియనుటలో లవమాత్రమైనా సంశయములేదు. కారణమేమనగా పతంజలియే ఈతనిని పాణిని సూత్రవ్యాఖ్యాతగా చెప్పియున్నాఁడు. అంతయేగాక ఈతనిని మీమాంసకుఁడనియును కీర్తించియున్నాడు.

శబ్దమునకు నిత్యత్వ అనిత్యములను విచారించు సందర్భమున పతంజలి వ్యాడికృతమైన సంగ్రహ గ్రంథము పేరును లిఖించె. ఇందుచే ఇతని మీమాంసకత్వము కూడ సిద్ధించె.

తన శాస్త్రము నధికరించి వ్యాడిచే యొకానొక ఆయుర్వేద గ్రంథము గూడ లిఖింపఁబడియుండును. ఎందుచేతననఁగా, వాగ్భటకృతమైన రసరత్నసముచ్చయములో నీ విషయము కొంతవరకు తెలియవచ్చు చున్నది. అది ఎట్లనగా

"…. ఇంద్రదో గోముఖ శ్చైవ కంబలో వ్యాడి రేవచ."
అధ్యాయము 1. శ్లో. 3.

మరియు ఈ వ్యాడి శబ్దబ్రహ్మల కేకత్వమును గూర్చి వ్రాసిన యొకానొక సంగ్రహగ్రంథ ముండి యున్నట్లు కనువడు చున్నది.

ఇతని చేతనే యొక మహాకావ్యము నిర్మితమైయున్నట్లు అది బలచరిత నామము గల్గియున్నట్లు సముద్రగుప్తుడు వచించియున్నాఁడు. ఈకావ్యమున వ్యాడి పూజ్యుఁడైన బలరాముని నాయకుడుగా గ్రహించెను. భగవద్వ్యాసముని భారతమున శ్రీకృష్ణుని నాయకుఁడుగా గ్రహించి వ్రాసెను. ఈ వ్యాడికవి అతని కన్నయైన బలరాముని నాయకుఁడుగాగ్రహించి కావ్యమును చెప్పె. అందుచే వ్యాసునీతఁడుపేక్షించె. అట్లే భారతమును గూడ.-ఈ వ్యాడి కావ్యమున కన్న పూర్వము మహాకావ్యములేవియూ లేనట్లు తెలియుచున్నది. ఈ వ్యాడి పద్ధతి నవలంబించియే అర్వాచీనులైన కవులు తమతమ కావ్యములను రచించిరి. ఇదంతయూ సముద్రగుప్తుని వర్ణనము వలననే స్పష్టమగుచున్నది. ఇపుడు ప్రచారములోనున్న మహాకావ్యముల కన్నింటికిని ఇతని బలచరిత కావ్యమే ఆదర్శమైనదనుట స్పష్టము. 84 గురు రససిద్ధులలో నీ వ్యాడి చాలాప్రాచీనుఁడు. అందులకు రసశాస్త్రములో అనేకోదాహరణములు గలవు. రసశాస్త్ర మర్వాచీనమని తలంచినవారికీ వ్యాడి వృత్తాంతము సదుత్తర మీయఁగలదు.

## దే వ లు డు

18వ శ్లోకములో పేర్కొన్న దేవలుడు బృహస్పతి సముడు. ఇతని కావ్యమింద్ర విజయము. ఇతడంత్యజుడైయున్న ప్పటికిని ఇట్టి సర్వోత్కృష్టిని నాటి కవిలోకమున నార్జించెను. ఇట్టి కావ్యము నేడు ఊరూపేరూలేని దగుట దురదృష్టము. ఇంతకన్న నీ దేవల కవినిగూర్చిన విషయమెచ్చటయూ కానరాకున్నది.

## ప తం జ లి

పతంజలి 19, 20, 21, శ్లోకములచే సముద్రగుప్త చక్రవర్తిచే కీర్తింపబడియున్నాడు. ఈమహర్షి వ్యాకరణ మహాభాష్యము సుప్రసిద్ధమే. ఆయుర్వేదమున ప్రమాణభూతమైన చరక సంహిత ప్రతి సంస్కర్త కూడ ఈ మహనీయుడే. అగ్నివేశ సంహిత ప్రతి సంస్కర్త పేరుచే నేటికి నిలిచియున్నది. ఈ విషయమును రసయోగసాగరోపోద్ఘాతమునసూ నిరుక్తాలోచన మందునసూ చూడదగు. అచ్చట శ్రీ జె. కె. శాస్త్రిగారి యభిప్రాయము నిరుక్తాలోచన పాఠము సమాదరించియే యున్నది.

శ్రీ జె. కె. శాస్త్రిగారి యభిప్రాయమున యోగశాస్త్ర ప్రణేతయైన పతంజలి వేరని నిర్ణయము జరిగినది.

మొదటి ఈ పతంజలి బ్రహ్మసూత్రకర్తయైన మహర్షి వేదవ్యాసునికన్న ప్రాచీనుడు. ఎందువలననగా బ్రహ్మసూత్రము లలో 2—1—3 సూత్రములో పతంజలి యోగశాస్త్రోల్లేఖము జరిగినది. యోగదర్శన భాష్యము మహర్షి వ్యాసుని కృతి. మరే మననగా మొదటి పతంజలి మహాభారత కాలమునకు కొంచెము ముందుగా నున్నట్లు నిశ్చయింప వీలులేదు. శ్రీ జె. కె. శాస్త్రి గారు ప్రచురించిన భాసనాటకమైన యజ్ఞఫలమున రామాయణ కాలమున మొదటి పతంజలి యోగదర్శనమున్నట్లు చూడనగు. ఇది యుక్త నిర్ణయమా? కాదా? యను విషయమ్ము పై నాటకోపోద్ఘాతములో విచారించబడినది కాన అచ్చట చూడనగునని వ్రాసియున్నారు. సముద్రగుప్తుని పై స్తుతి ప్రాచీన పతంజలిని గూర్చి కాదనుట నిశ్చితమే. కాని

యోగేన చిత్తస్య పదేన వాచాం
మలం శరీరస్య చ వైద్యకేన
యో పాకరోత్తం ప్రవరం మునీనాం.
పతంజలిం ప్రాంజలి రానతోస్మి.

అను శ్లోకము యెవరో యొకనిచే నిర్మించబడగా నా శ్లోకము ప్రచారములోనికి వచ్చియుండునని శంకను తలంచి పతంజలి యను నామసామ్యమును పురస్కరించుకొని ఈ పద్యము నిర్మితమై యుండనోపునని పలువురు పండితు లభిప్రాయపడినారు.

ఈ గ్రంథమును చూచిన తరువాత ఈ శ్లోకకర్త భ్రమ కాదు అనుట తెల్లము. మరేమనగా యోగశాస్త్ర సిద్ధాంత గర్భితమైన పతంజలియొక్క యోగదర్శనమును మరొక కావ్యమై యుండవచ్చును. ఆ కావ్యము నేడు దొరకుటలేదు.

ఈ విమర్శనము అసిదంపూర్వము అశ్రుతచరము. పతంజలు లిద్దరున్నట్లు, ఆయన లిర్వురు ప్రాచీన పతంజలు లున్నట్లు యిప్పట్లోనెవరు వినియుండలేదు. ఈ విషయమును గూర్చి విద్వాంసులు నిర్ణయించవలసియున్నది.

## భా సు డు

22, 23, 24, 25 శ్లోకములలో భాసుడు కీర్తింపబడినాడు. మహాకవియగు భాసుడు ఇరువది నాటకములు రచించినాడని సముద్రగుప్తుడనుచున్నాడు. నేడు మనకు దొరకు భాసుని నాటకములు పదునాల్గు మాత్రమే. మిగిలిన ఆరు నాటకముల పేరు లేవి? సముద్రగుప్తుడీ ఇరువది నాటకములను చూచియే వ్రాసెనో లేక ప్రసిద్ధినిబట్టియే వ్రాసెనో నిర్ణయించుటకు మన కాధారము లేదు. మరియూ ఈ ఇరువది నాటకములుగాక అంకములనబడు కొన్ని దృశ్య కావ్యములను కూడ భాసుడు రచించినట్లు ఇందుచే తెలియుచున్నది. అంకలక్షణం బిట్లు సాహిత్య దర్పణమున వచింపబడి యున్నది.

"ఉత్సృష్టికాంక ఏకాంకో నేతారః ప్రాకృతా నరాః
రసోత్ర కరుణా స్థాయీ బహుస్త్రీ పరిదేవితం
ప్రఖ్యాత మితివృత్తంచ కవిర్బుద్ధ్యా ప్రపంచయేత్
భాణవ త్సంధివృత్త్యంగా న్యస్మిన్ జయపరాజయౌ.
యుద్ధంచ వాచాకర్తవ్యం నిర్వేద వచనం బహు."

స్వర్గీయ శ్రీ గణపతిశాస్త్రిగారికి లభింపగా ప్రకాశింపఁ జేసిన కొన్ని భాస నాటకములు అంక లక్షణములు గలవి యున్నవి. ఆయంక లక్షణములుగల భాస నాటకములు పై ఇరువది నాట కములలో వేరనియే ప్రతీతియున్నది. ఇపుడు భాసుని నాటక ములు పదునాల్గింటిలోనసూ దొరికిన అంకములలోనూ సముద్ర గుప్తుడు పరిగణించిన నాటకము లెవ్వి? అంకము లెవ్వి? యని యూహించుట కిట లవిగాదు.

మరియు మహాకావ్యము నొకదానినే భాసుడు రచించి యుండెనా? లేక పెక్కు మహా కావ్యములను భాసుడు రచించెనా యను విషయమును లేల్చుటకును పై శ్లోకములపై సాధ్యపడదు.

భాసుడు పాఠకులకును వినువారికిని సరస్వతీ మహి మాన్వితమైన యానందమును కల్గించెనని కవిరాజు ఇందు వర్ణించెను. అప్రతిముడైన వాఁడీ భాసుఁడు. ఇతని ఇతర నాటకము లన్నింటికన్న వాసవదత్త నాటకము శ్రేష్ఠమైనట్టిదని సముద్రగుప్తుఁ డభిప్రాయమును వెల్లడించియున్నాఁడు.

ఇం దేమియు అనుపపత్తిలేదు. ఎందు చేతననఁగా మహానో భావులైన పెక్కురు మహాకవులు కూడ అటులనే తలంచి యున్నారు. వాల్మీకి మహాముని రచించిన ఆదికావ్యమైన శ్రీమద్రా మాయణమును సంగ్రహించినాటకముగా స్వల్పకాలములో ప్రదర్శన యోగ్యముగా నొనర్చిన కడిందియశంబునకు భాసుఁడే ప్రథ మార్హుఁడనుటలో నతిశయోక్తి యేమున్నది?

అట్లే మహాభారతమును కూడా సంక్షేపించి నాటకమునకు తగినట్లుగా మార్చుటయూ భాసుఁడే యొనర్చెను. అంత మాత్రమేకాదు మహాభారత కథలలో నీతఁడు స్వకల్పిత సన్నివేశములను జతగూర్చి చూచువారి కమితానందమును కూడ గల్గించెను. నాటకనిర్మాణ పద్ధతిని కాళిదాసాది మహాకవులు సైతము భాసుని నుండియే గైకొనిరి. ఇతని చేతనే భారతీయములైన నాట్యశాస్త్ర విషయములు మొదట మొదట గైకొనఁబడినవి. అట్లే ఇతర కవు లీతని ననుసరించిరి.

పాణినిపదక్రమము నీతఁడు అనన్వయ మొనెననుట స్ఫుటమైనదికాదు. పద్యార్థమునకు రెండర్థము లూహింప వీలున్నది. ఈ భాసుఁడు పాణిని పెక్కు సంజ్ఞలనువాడలేదు. అందుచేత నీ మాటననియుండవచ్చు. లేదా ఈతఁ డపాణినీయ్యమైన పదజాలమును స్వనాటకములలో వాడియున్నాఁడు. ఇందులకుస్వర్గీయ గణపతిశాస్త్రిగారు తక్కుఁగల పండితులు కూడ భాసుని నాటకములలో అపాణినీయ పదములు పెక్కులు వచింపఁబడినవైనను కావలయును, లేదా లేఖకాదులు కల్పించియైనఁ యుండవలయునని యనుచున్నారు. మహామహోపాధ్యాయ స్వర్గీయ గణపతిశాస్త్రిగారు ఈ భాసుని పాణినికన్న ముందున్నవాఁడని వచించియున్నారు. మరియూ శ్రీ జె. కె. శాస్త్రిగారు ప్రచురించిన యజ్ఞఫలనాటక టిప్పణిలో శ్రీ గోపాలదత్తశాస్త్రిగారును మరియూ పెక్కురు విద్వాంసులును విచారించి అశుద్ధాభాసములు పాణినీయ్యములేగాని భాసునివి కావనియూ మరికొన్ని అశుద్ధాభాసములు ఇతర కవులలో కూడ వాడుకలో నున్నట్టివేయని నిర్ధరించియున్నారు. ఇతని వాక్శుద్ధి ప్రభావముచే అగ్ని శాంతించెనని శ్రీ సముద్రగుప్తుఁడే పొగడియున్నాఁడనఁగా ఇఁక ఈతని శబ్దశుద్ధిని గూర్చి చెప్పవలసిన దేమున్నది?

ఈ విషయమును రాజశేఖరుఁడుకూడ తన సూక్తిముక్తావళిలో వచించియున్నాఁడు.

"భాస నాటక చక్రేఽపి
ఛేకైః క్షిప్తే పరీక్షితుం.
స్వప్న వాసవదత్తస్య
దాహకోఽభూ న్న పావకః

అనెను. అందుచేతనే వాక్పతిరాజా తన గరుడ వహమున భాసుని అగ్నిమిత్రుఁడనెను. ఆ శ్లోకమిది.

"భాసమ్మి జలణమిత్తే
కత్తోదేవే అజస్స రహుఆరే
సోబంధవే అబంధ
మ్మిహారి అందేల ఆణందో."

అనెను. భాసునిగూర్చి ఇంకనూ తెలియవలసిన యంశములు యజ్ఞఫలనాటక పీఠికలో చూడవచ్చును.

పదునెన్మిదవ శ్లోకములోని వర్ధమానుఁ డనునది భాసునికి విశేషణ పదమా లేక విశేష్య పదమని సంశయావహమై యున్నది. ఇది విశేషణ పదమేఅయియుండెనేని భీమజయమను కావ్యము భాసకృతమైన దొకటి యుండియుండవలె. ఊరుభంగకథకూడ భీమజయపద వాచ్యమై యుండవచ్చు. మరేమనఁగా,

"దావ మబ్ద ఇవ క్షిప్రం
నిస్తాపం హృదయం సతాం
కర్తుం సా న ప్రభవతి"

అందుచే విశేష్యపదమై యుండవచ్చు. ఎందుచేతననఁగా సత్పురుషుల మనస్సు వార్షిక మేఘమువంటిది. అట్టిది దావాగ్నిని నైనమా చల్లార్పజాలియున్నది. భాసునివంటివాఁడీ ఊరుభంగమును రచించియుండునా యను సందేహమున కాస్పదమగుటచే ఈ వర్ధమానమను పేరు విశేష్య పదమై యుండవచ్చు. భీమజయ కావ్యకర్తయైన కవిని జ్ఞాపకముచేయుచున్నది. ఈ సముద్రగుప్తుని కృష్ణ చరిత కథా ప్రస్తావనలో మునికవి కీర్తనాంత్యపద్యములో పదుగురు కవుల వర్ణనము చెప్పఁబడినదనియున్నది. ఒకవేళ మొదటి 12 పద్యములలో సముద్రగుప్తుఁడు ముగ్గురు కవులనే వర్ణించియున్న పక్షమున ఇది భాస వర్ణనమే యయియుండవచ్చు. లేక ఆ పన్నెండు పద్యములలో ఇరువురిని మాత్రమే వర్ణించియుండెనా భీమ విజయకర్తయైన వర్ధమానుఁడు మరొకడై యుండవచ్చును. మేము వర్ధమానుఁడను మరియొక కవియేయై యుండవచ్చునని తలంచుచున్నామని శ్రీ జె. కె. శాస్త్రిగారు వ్రాసియున్నారు.

## వ ర్ధ మా నుఁ డు

ఈతని కావ్యము ఎచ్చటను చూడబడలేదు. వినినదియూ లేదు. ఇతఁడెవ్వఁడు? ఎక్కడివాఁడనియూ తలంచుటకు వీలు లేదు.

## చీ న దే వుఁ డు

29—30 పద్యములలో వర్ణింపఁబడిన వాఁడితఁడు. ఇతఁడు ఆర్యావర్తములో జన్మనంది యుండలేదు అను విషయ మిందే వర్ణింపఁబడియున్నది. ఇతనిపేరే చీనాదేశస్థుఁడని వచించుచున్నది. ఇతని కావ్యము మాగధీప్రాకృతమున బుద్ధచరితమై యున్నది. ఇదియును అనువాదరూపమని ప్రచారములోనున్న మాట. ఇతని సంస్కృత బుద్ధ చరిత్రకు కూడా అదియే పేరై యున్నది.

ఇపుడీతని ప్రాకృత సంస్కృత బుద్ధ చరిత్రలు లభించుటలేదుకాని అశ్వఘోషకృత బుద్ధచరిత్రము లభించుచున్నది. అశ్వఘోష ప్రశంస రాజకవి కీర్తనలో ముందు వర్ణితమగును. ఈ పై రెండు బుద్ధ చరిత్రలు కూడ భగవంతుడైన బుద్ధుని చరిత్రలైనట్లు వానిపేరులనుబట్టియే తెలియుచున్నది. కాని అయ్యవి నేడు ప్రచారశూన్యములై యున్నవి.

## మి హి ర దే వుఁ డు

ఈ మిహిరదేవుఁడు పారశీక దేశీయ్యుఁడనుటకు ఇతని "పర్శువంశ సముద్భవః" అను 33 వ శ్లోకము

నిరూపించుచున్నది. 31–33 వరకు ఈ మిహిర దేవ సంకీర్తనము జరిగినది. పార్శీవారు తమ దేశమునుండి మన దేశమునకు వచ్చి స్థిర నివాస మేర్పరచుకొన్నవారు పెక్కురు గలరు. మిహిర శబ్దము సూర్యవాచిగా పర్షియన్ భాషలో ప్రసిద్ధమై యున్నది.

ఇతనిచేత భగవంతుఁడైన సూర్యునిపై శిఖరిణీ ఛందస్సులో నూరు పద్యముల శతక కావ్యము నిర్మించబడినది. ఆ నూరు పద్యములచేతనే యతని పాండిత్య గరిమ భారత వర్షీయ విద్వాంసులకు స్తుతిపాత్రమైనది. అంతయేకాదు. తాను సూర్య భక్తుఁడై యుండి సూర్యమందిరమును నిర్మింపజేసె నీతఁడు. మరియు నీతఁడు కట్టించుటయేగాక "అకరోత్" అనుమాటచే అందొకశిల్పిగా కూడా నీ కవి భాగస్వామియయ్యెను. శ్రీ సముద్రగుప్తుని కాలములో ప్రసిద్ధిలోనున్న ఆ శతక సూర్య దేవాలయములు రెండునూ నే డెక్కడ నున్నవో గదా?

ముందు చూచిన చీనదేవ మిహిరదేవు లిరువురును జన్మచేత భారతీయ్యులు కారనుట స్పష్టము. ఆ నాఁడు భారత దేశమున కేవలము భారతీయ పండితులకే సన్మానము జరిగి యుండలేదు. వైదుష్య విశేషముగల విదేశీయ విద్వాంసులు కూడా భారత దేశీయ పండిత ప్రకాండులతోపాటు సమానముగా గౌరవమునందియుండిరనుట కిచ్చట కావలసినంత దృష్టాంతము లభించుచున్నది. అప్పటి రాజులు కేవలము స్వదేశములో పుట్టినంతమాత్రముచేతనే పండితులను సన్మానించువారుకాదనియూ గుణపక్షపాతులైన ఆనాఁటి ఆర్యావర్తపు రాజులు విదేశీయులైననూ యోగ్యతగలవారై యుండిరేని అట్టివారిని సన్మానించెడివారనియూ స్పష్టమగుచున్నది.

మరియొక విశేషమేమనఁగా అంత్యజుఁడైన దేవలుఁడను కవిగ్రామణినికూడ ఇందు ఋషి కవులలో సముద్రగుప్తుఁడు సంస్మరించిన విషయము మరువరానిది. ఆనాఁడు భారతమున రాజులు ప్రజలు కేవలము గుణపక్షపాతులేగాని జాతి వర్ణాది పక్షపాతులు కారనుట కింతకన్ననూ వేరు దృష్టాంత మవసరములేదని చెప్పవచ్చును. ఇంతటితో సముద్రగుప్తుఁడు పేర్కొన్న ఋషి కవుల ప్రస్తావనము ముగియుచున్నది.

ఇట్టి యుత్కృష్ట విషయమును చీకటినుండి వెలికి తెచ్చిన శ్రీ రాజవైద్య జీవరాం కాళిదాసశాస్త్రి గారెంతయూ అభినందనీయులు. రాజకవులనుగూర్చియూ కావ్య ప్రయోజనమునుగూర్చియూ ముందుముందు చర్చ కొనసాగింతును.



# ఫస్ట్ కేస్

శ్రీమతి వీణాదేవి

"ఆనందరావుకేం తక్కువ?" అని ఆనందరావే అడిగే పరిస్థితిలో వున్నాడు. తల్లికడుపులో పిల్లలా అతనికేవీ తక్కువ లేదు. అన్నీ ఎక్కువగానే వున్నాయి. అతనికి డబ్బెక్కువ. అందం ఎక్కువ. ఆరోగ్యం ఎక్కువ. చదువుమాత్రం ఎంబీబియస్సుకెక్కువ కాదు.

ఎం బీ బి యెస్సు ఆఖరిపరీక్ష మొన్ననే పేసైన తను జీవితంలో చాలా సాధించినట్టు ఫీలయ్యేడు. సర్జరీలో గోల్డుమెడల్ కొట్టేసేడు. ఐదేళ్ళూ టెన్నిస్సులో ఫస్టుప్రైజు కొట్టేసేడు. అనసూయ హృదయం కొట్టేసేడు. ఒకనాడు ఆలస్యంగా సెర్వుచేసినందుకు హాస్టలు సెర్వర్ని కొట్టేసేడు.

అంచేత అతను నాకేం తక్కువని తన్ని తను నిందించుకోవడం తప్పుకాదు. మనిషికక్కావలసినవన్నీ అతనికున్నాయి. అతని సూట్లు సెర్లిన్వి. అతని సిగరెట్లు ఇంగ్లీషువి. అతని కారు ఫ్రెంచిది. అతని వూహాలు అమెరికన్వి.

అతనితల్లి సాధ్వి. భక్తురాలు. అతని తండ్రి ధనవంతుడు. పారిశ్రామికవేత్త. అతనిపేరు జగపతి. ఎముకలు గుండచేసే మిల్లు దగ్గర్నుంచి, కాలిస్తే కేన్సరొచ్చే సిగరెట్లు తయారుచేసే ఫ్యాక్టరీవరకు, అతనికనేకరకాల కంపెనీలున్నాయి. కేన్సరు మందులగాయతు కురుపు లాయింటుమెంటు వరకు తయారుచేసే మందుల ఫ్యాక్టరీ పెడదామని అతని కోరిక. అతనికి, అమెరికన్ కారుతోసహా ఆరు కార్లున్నాయి. వేసవికి ఊటీలో బంగళా, సిమ్లాలో కాటేజీ వున్నాయి. అతని స్నేహితుల్లో మూడు లక్షలకు తక్కువున్నవాడు ముష్టివెధవతో సమానం. ఒక్క ఇండియన్ కారే వున్నవాడింకా హీనం. రాజకీయ రంగంలోనూ, యితర రంగాల్లోనూ వున్నవాళ్ళని చాలామందిని అతనికి తెలుసు. తెలిసినంతమందినీ ఉపయోగించుకోవడం అతనికి బాగా తెలుసు. సోషలిస్టు మొదలు, స్వతంత్రపార్టీవరకు అనేక పార్టీల నాయకులు అతనింట్లోనే బసచేస్తారు. వాళ్ళతన్ని స్నేహితుడుగా, మంచి హోస్టుగా చూస్తారు. అతనుమాత్రం వాళ్ళని నేటినాయకులుగానో, రేపటి నాయకులుగానో మాత్రం చూడగలుగుతాడు.

ఊరికి బోలెడుదూరంలో వున్నతనిల్లు స్వర్గంనుంచి జారిపోయిన మనోహర హర్మ్యంలా వుంటుంది. దాని ఆవరణలో రెండు టెన్నిసుకోర్టులున్నాయి. ఒక స్విమ్మింగ్పూలుంది. స్విమ్మింగు పూల్లో నీలాలు పొదిగేరా అన్నంత నీలిగా వుంటాయి దాన్లో నీళ్ళు. ఆ యింట్లో 16 ఎం. ఎం. థియేటరుంది. ప్రసిద్ధికెక్కిన శిల్పసుందరులెందరో ప్రోవొకేటివ్‌గా, బట్టలు జారవిడుస్తూ, ఆ యింట్లో అన్నిమూలల్లో నిలబడుంటారు. నళినీ చౌదరీవేసి,యీమధ్యనే పదివేలకమ్మిన తైలవర్ణచిత్రం "ఓక్షుకి" సెంట్రల్‌హాల్లో ఎదురు గోడకి వేలాడుతూ వుంటుంది (సర్రియలిస్టిక్ పెయింటింగవటం వల్ల అది బిక్షుకో, బర్మాషెల్పంపో ఎవరికీ తెలియదు). ఆ యింటి ఆవరణలో మర్యాదకు భంగం లేనంతదూరంలో గెస్టులకి రోజ్ కాటేజుంది. ఆ యింటి ఆరో అంతస్తు మీంచిచూస్తే, ఆ యింటి చుట్టూవున్న లాన్ పచ్చ తివాసీలాగా, ఆ లాన్లో కుండీల్లోవున్న పూలమొక్కలు ఆ తివాసీలోని పూలలాగా కనిపిస్తాయి. అదేఅంతస్తునుండి దూరంగా చూస్తే, చాలాదూరంగా, చివికిపోయిన చిన్న గుల్లగడ్డివేట్లలా గుడిసెలూ, వాటిముందు తోకలమీద నడుస్తున్న నల్లపురుగుల్లా కూలీలు కన్పిస్తారు.

ఆ యింట్లో షర్బతు మొదలు, షాంపేను వరకూ అన్నిరకాల పానీయాలు రిఫ్రిజిరేటర్లలో వుంటాయి. ఆక్స్ టంగ్ (Ox tongue) మొదలు అల్లం మురబ్బావరకు అన్నీ టిన్నుల్లో వుంటాయి. అవి తాగడానికీ తిండానికీ చాలామందొస్తారు. సినీమా స్టార్లు నారాయణ్రావూ అనసూయా ఆ వూరొచ్చినప్పుడా యింట్లోనే బసచేస్తారు. చాలామంది అధికార్లుకూడా ఆ యింటికొచ్చి పోతుంటారు. "కలకటేరు మా యింటి కుక్కేననుకో" అని ఆ యింటి తోటమాలి గొప్ప చెప్పుకుంటూ వుంటాడు.

ఆ యింటికి రానివాళ్ళు అడుక్కుతినేవాళ్ళూ, ఒళ్ళమ్ముకునే వాళ్ళూమాత్రమే.

*　　　*　　　*

ఆనందరావు యిటుపైనేంచేయాలి? అతను ప్రాక్టీసు పెడితే డబ్బుకీ, రిచ్‌పేషెంట్లకీ కొదవుండదు. అభినేత్రి అనసూయ తన ఆస్త్మాకి అతన్దగ్గరే మందు పుచ్చుకుంటుంది. హీరో నారాయణ్రావు అతన్దగ్గరే ట్రీట్మెంట్‌మీ చేయించుకుంటాడు.

"ఒకడి పేగులుకోసి, మరోడి కురుపులు కడిగితే నెలయ్యేసరికి మహావస్తే ముష్టి మూడువేలు! అమెరికా వెళ్లి ఫార్మకోపియా ఎమ్. డీ. అయి తిరిగొచ్చి మందులఫ్యాక్టరీపెడితే, అర్నెల్ల కార్లక్షలార్జించొచ్చు." యిది జగపతి అభిప్రాయం.

తన ముందు జీవితం గురించి ఆనందరావింకా ఆలోచించ లేదు. మందులకంపెనీ పెట్టినా, ప్రాక్టీసు పెట్టినా, అతనెలాంటి వాడవుతాడన్న ప్రశ్నకి సమాధానం సులువుగా దొరకదు.అత నెలాంటివాడన్న ప్రశ్నకి సమాధానం బహుశా అతనే చెప్ప లేడేమో! అతనతి మంచివాడన్నా కావచ్చు. అతి చెడ్డవాడన్నా కావచ్చు. అతన్లో చెడ్డతనముంటే అది యీవేళ వరకూ బైట పడ్లేదు. అతని మంచితనానికి మాత్రం కొన్ని నిదర్శనాలున్నాయి. ఇచ్చిన అప్పు తీర్చమని అతనెప్పుడూ అడగడు. పక్కనెవరున్నా తన కార్లో లిఫ్టిస్తాడు. తోడున్న వాళ్లెవరినైనాసరే తన్తో సినిమాలకి, హోటళ్లకి తీసుకుపోతాడు. మంచివాళ్ల లిస్టులోనే స్నేహితులతన్ని వేస్తారు.

అతన్లోని మంచిచెడ్డలకు భీకర సంఘర్షణెప్పుడూ జరగ లేదు. అతని జీవిత మంతవరకూ కరగనికలలా ప్రశాంతంగా జరిగిపోయింది. అతని జీవితపు బాట బెక్నికలరుది. ఫోంరబ్బరుది. దాంట్లో కళ్లల్లో గుచ్చుకునే ముళ్లూ, కాళ్ల బద్దలు కొట్టే రాళ్లూలేవు. అతనికి జీవితమంటే, ఒంటరికాంక్రీటు రోడ్డు మీద, రంగువెన్నెల్లో, అమెరికన్కార్లో, ప్రియురాల్తో ప్రయాణం లాంటిది. అంచేతతనికి సౌదమెరికన్ కుట్ర ల్లగాయతూ, నార్త్‌మెరికన్ కేన్‌కేన్ వరకూ చాలా తెలిసినా, తన దేశంగురించే తనకి సమంగా తెలీదు.

పేదరికం, దరిద్రం, ఆకలి అనే పదాలకి అతని నిఘంటు వులో స్థానంలేదు. అతనెక్కడికెళ్లినా కార్లో వెళతాడు. అతను వెళ్లే యిళ్లకి సెంట్రల్ జైలు గోడల్లాంటి ఎత్తైన రాతి కాంపౌండు గోడలుంటాయి. ఆ యిళ్లలో జూలులేని సింహాల్లాంటి ఆల్సేషియన్లుంటాయి. ఆకాశంలో వేలాడుతున్నట్లుండే పోర్టికో లుంటాయి.

ఐనా అతనెప్పుడూ బీదరికం చూళ్లేదనడానికి వీల్లేదు. ఒకనాడు ట్రాఫిక్ జామ్‌లో చిక్కుకు పోయినప్పుడు, తన షెవర్లెట్ రేర్ వ్యూ మిరర్లో అతనికన్పించింది, ఏడుస్తున్న పిల్ల నోట్లో ఎండిన రొమ్ము కుక్కుతున్న ఒక ముష్టితల్లి.

మరోనాడు సూపర్ మార్కెట్ దగ్గరదిగి తన ఎర్ర స్పోర్ట్స్ కారు తలుపువేస్తున్నప్పుడు ఫ్రంటు మడ్‌గార్డులో కనిపించేడో మొహం చిరిగిన ముష్టివాడు.

కాని వీళ్లెవరూ అతన్ని బాధపెట్టలేదు. దేశం సుభిక్షం. కష్టపడే వాళ్లందరికీ తిండుంది. వళ్లువంచని వాళ్లే అడుక్కో డానికీ, దార్లు కాయడానికీ సిద్ధపడతారు. మహాకావలిస్తే మరికొన్ని ఫ్యాక్టరీలు పెట్టిస్తేచాలు—దరిద్రం జోలికట్టుకుని పాకిస్తానో, చైనానో పారిపోతుంది. ఇవీ అతని అభిప్రాయాలు.

అతను కళ్లారా ఒక్కనాడుమాత్రం దరిద్రాన్నీ, దరిద్రుణ్నీ చూశాడు. అవేళతని నాలుగో పుట్టినరోజు. ఆవేళా, అముందూ జగపతిగారు వూళ్లోలేరు. అంచేత జగపతి భార్య పార్వతి చొరవ చేసి బీదలకి సంతర్పణేర్పాటు చేసింది. సంతర్పణమధ్యలో, మండు టెండలో తిరిగొచ్చేడు జగపతి. పోర్టికోలో, కన్నతల్లిలా నిండుగా నవ్వుతూ, మెరుస్తున్న కళ్లతో పార్వతి నిలబడుంది. ఆమెపక్కనే నిలబడిన ఆనందరావు, చిరిగిన అస్థిపంజరాలకు తోలు తొడిగినట్టున్న యిద్దరు ముష్టిపిల్లలు, దేవుడో దెయ్యమోవచ్చితమ ముందున్న అన్నం లాక్కుపోతారేమోనన్నట్టు ఆత్రంగా అన్నం తింటుండడం చూస్తున్నాడు. ఆ ముష్టిపిల్లల పక్కనున్న ఆనందరావు, తోడేళ్లపక్కనున్న బొచ్చుకుక్క పిల్లలాగ జాలిగానూ, పార్వతి కళ్లల్లో వెలుగు—చీకటిరాత్రి పులి కళ్లలో మెరుపులాగ భయంకరంగానూ జగపతికి కనిపించేయి. దేశంలో ఆకలంతా తమ కడుపుల్లోనే వున్నట్లు, ఆయాస పడేంత తొందరగా అన్నం తింటున్న కాంపౌండులోని ముష్టి వాళ్లు, అతని కళ్లకి మైక్రోస్కోపులోని జబ్బు పురుగుల్లా కనిపించేరు.

ఆ సంఘటన జగపతికి నచ్చలేదు. అని అతనెవ్వరితోను అన్లేదు. కాని మళ్లీ అటువంటి సంఘటనలు పీడకలల్లా తిరిగి రాకుండా కొన్ని కట్టుదిట్టాలతను చేశాడు. పార్వతిని భక్తి మార్గంలో పెట్టేసేడు. ఆనందరావుని కిండర్ గార్డెన్ స్కూల్లో పెట్టేసేడు. అంద్రాసిన భగవద్గీత వ్యాఖ్యాలూ పార్వతికి కొన్నాడు. అన్నిరకాల బొమ్మల పుస్తకాలూ ఆనందరావుకి కొన్నాడు.

కిండర్‌గార్డెన్ స్కూల్తరవాత కాన్వెంటులో చదివేడానంద రావు. కాన్వెంటొదిలేసరికి ఆనందరావు చేతికి సిగరెట్టొచ్చింది. నోటికి బూతుల్తోసహా ఇంగ్లీషు క్షుణ్ణంగా వచ్చింది. తన హక్కులకోసం పోరాడ్డం కూడా వచ్చింది. ఆనందరావు''లిటిల్ జంటిల్మన్'' అవుతున్నందుకు జగపతి ఆనందించేడు.

* * *

పరీక్షలయ్యేక ఆనందరావు తన స్నేహితుడు రాజుతోసహా తనింటికొచ్చేడు. రాజతని క్లాస్‌మేటూ, రూమ్మేటూ కూడా. అతనికి ముప్ఫై ఎకరాల భూముంది. యశోదనబడే మంచి తల్లుంది. మంచివాళ్లుగాని, చెడ్డవాళ్లుగాని, అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ లేరు. అతన్నాన్న పోయి ఎన్నాళ్లో ఐంది. అతన్ది ఒక పట్టణానికి దగ్గరున్న ఒక పల్లె.

వారంరోజులున్నాక ఆనందరావుని తనూ రాహ్వానించేడు రాజు. యశోద మళ్లీ పెళ్లి చేసుకునే వుద్దేశంలో లేదనీ, పెళ్లీడు ఆడపిల్లలెవరూ వాళ్లింట్లోలేరని యుక్తిగా తెలుసుకొని మరీ సమ్మతించాడు జగపతి ఆనందరావు వెళ్లడానికి.

రాజుగా రూరొచ్చేక తను ప్రపంచంలో చూడవలసింది చాలా వుందనిపించిందానందరావుకి. అలసిపోయిన మనసుకి చల్లగాలిలా కన్పించిందాపల్లె. కొత్తకోడళ్లలా ఉత్సాహంగా గంతులువేసే బిగువురవికెల ఆడకూలీలతనికి సంతోషం కలిగించేరు. ఆస్త మిస్తున్న చంద్రుడికన్పించకుండా, పూలతోటనడుంచుట్టూ చెయ్యిచేర్చి, నిద్రపోతున్న ప్రియురాల్లావున్న ఏరు అతని వళ్ళని ఎముకల్లో కోరిక రేకెత్తించింది. తలంటుపోసుకున్న శ్రావణ మాసం నోముల పెళ్లికూతుళ్లలా వున్న కొబ్బరిచెట్లు అతనిలో కళాతృష్ణ పెంచాయి.

# ఫస్ట్ కేస్

ఏతాంతొక్కుతున్ననాయుడి తడిసిననల్లశరీరంలోసూర్యుణ్ణి చూసినప్పుడూ, ఏతాంకింద, చీర మోకాళ్లమీదకెగ్గట్టి కుడి చేత్తో గూనవేస్తున్న పిల్ల ఎడంచేత్తో తుడుచుకుంటున్న నుదుటి నీటి ముత్యాలు చూసినప్పుడల్లా అతనికి చిత్రకారుడవ్వాలనిపించింది.

* * *

రాజింటినుండి కాలవొడ్డునే నడుస్తే నాలుగు ఫర్లాంగుల్లో పల్లె తగుల్తుంది. పల్లెనిదాటి మరో నాలుగు ఫర్లాంగులు వెళ్తే రాజుగారి తోట వస్తుంది.

ఆ వూరొచ్చిన నాలుగోనాడు సాయంత్రం సినిమాలో హీరోతండ్రిలా ఊలు శాలువా కప్పుకొని, "చలేస్తుంది బాబూ" అంటూ లాన్లో ప్లాస్టిక్ కుర్చీలో కూర్చున్నాడు రాజు. అతని కెదురుగా యశోదా, పక్కగా ఆనందరావూ రెండు కుర్చీల్లో కూర్చున్నారు.

శీతాకాలం సాయంత్రం ఎండ వెచ్చగా ఊలురగ్గులా వుంది. పక్కనే వున్నాగచెట్టు నుండి రాలేపువ్వులు ఎండలో బంగారు పువ్వుల్లా వున్నాయి. ఎండ ఎర్రరంగులో, పంటబరువుకి వోరగా వాలిన చేలు బంగారం కాసి, దాని బరువుకి ఒరిగి పోయినట్టున్నాయి. ఎక్కణ్నించో ఆవుపెయ్యొకటి పరుగెత్తుకొచ్చి మెడగోకమన్నట్టు యశోదదగ్గర కెళ్లి మెడ చాపింది. యశోద దానిమెడ గోకుతూ వుంటే, ఏపాపమూ ఎరగని పసిపిల్ల కళ్లల్లా దానికళ్లు నిండుగా, నిర్మలంగా, అమాయకంగా, నీరూరుతూ మెరిసేయి.

దేవుడు సృష్టించిన యీ ప్రపంచంలో లోటేలేనట్టుందంతా. యీలోగా ఎనిమిదేళ్ల పిల్లొకర్తె వచ్చి యశోదపక్కన నిలబడింది. దూరంనుండి చూస్తే తడిసిన కాకిపిల్లలా అసహ్యంగా వుంది. సంవత్సరాలు తపస్సుచేసి పెంచిన బైరాగి జడల్లా ఆ పిల్లజుట్టు ఎక్కడికక్కడ పెనవేసుకు పోయింది. జుట్టు మొహంచుట్టూ కప్పెయ్యడంవల్ల భయంతో కన్నంలోంచి చూస్తున్న ఎలక మొహంలా ఆ పిల్లమొహం బెదురుతున్న కళ్లతో వుంది. ఐనా అర్థంకానాకర్షణతో ఆ పిల్ల పొలంగట్టునపూసి వాడిపోతున్న పిచ్చి పువ్వులా, బాధకలిగించే అందంతో కూడుకొనుంది. ఆమెపక్కనే తేనెరంగు పట్టుచీర కట్టుకొని నిలబడున్న యశోద మొహం, తేనెరంగు గ్లాస్‌ఫ్లవర్‌వేజులో గుచ్చిన వాడబోతున్న గులాబీ పువ్వులా వుంది.

ఆర్రోజులై అన్నం మొహం ఎరగనట్టుందా పిల్ల. "డిస్టింక్ట్లీ ఏన్ ఎడ్వాన్స్‌డ్ కేస్ అఫ్ మాల్ న్యూట్రిషన్." (Distinctly an advanced case of mal-nutrition) అనుకున్నాడానందరావాపిల్లని చూడగానే.

"ఎందుకొచ్చేవ్?" అని యశోదాపిల్లని ప్రశ్నించి, "మా తోటమాలీ కూతురు" అని ఎపోలజిటిక్‌గా ఆనందరావ్వేపు తిరిగి అంది.

"మా సెల్లికి జబ్బు సేసింది" అని, ఎవరైనా ఏమైనా అడుగుతారేమోనని ఆశించినట్టూరుకుంది ఆ పిల్ల. ఎవరూ ఏమీ అడుగలేదు. అంచేతాపిల్లే అంది "అబ్బాయిగోర్నోసారి అంపమన్నాది మాయమ్మ" అని.

అబ్బాయిగారి వేపు చూసింది అమ్మ. "నాకొళ్ల బాగాలేదు బాబూ" అన్నాడబ్బాయిగారు, అమెకికాకైనా తనప్పుడు రాలేనన్నట్టు మొహంపెట్టి.

రాజువైపు చూశాడానందరావు. అతను కాళ్లు రెండూ ఎదురుగా టీపాయ్‌మీద పెట్టుక్కూర్చున్నాడు. అతను టైట్‌గా వున్న తెల్ల టెర్లిన్ పేంటు, షర్టులో, కాస్త పెద్దసైజు పొర తొడుక్కున్న నాగుపాములా వున్నాడు. అతని కాళ్లకున్న ఎంబాసిడర్ జోడు అడుగు, తెరచిన మొసలినోర్లా వుంది.

"నే వెళ్తా" అన్నాడానందరావు.

"నువ్వా?" తల్లీ, పిల్లదూ ఒక్కసారాశ్చర్యపోయేరు.

"ఏం?" అన్నాడానందరావు రాజువైపు తిరిగి. "ఏమో!" చెప్పలేదు రాజు.

"జేగిరా బాబూ!" తొందరచేసింది పిల్ల.

"మీచెల్లి కేంటి జబ్బు?" అనడిగేడానందరావు.

"వోరం రోజులై ఒకటే యిరేసినాలు. ఆశారిగోరు మందియ్యడం మానీసినారీపొద్దు" అందా పిల్ల.

తనకు తోచిన మందులు జేబులో వేసుకొని బైల్దేరేడానందరావు. తోవలో నడుస్తున్నంతసేపూ ఎంతో ఆత్రుతపడ్డాడు. ఇది తన ఫస్ట్‌కేస్. యిది ఫెయిలవడానికి వీల్లేదు.

సూర్యాస్తమయమయ్యే సమయానికి పాముల్చేరిన పులి గుహలావున్న తోట చేరారు వాళ్లిద్దరూ. రకరకాల శృతుల్లో ఏడుస్తున్న పురుగుల్తో ఆ తోట చూడ్డానికి భయంకరంగా వుంటుంది. అది పట్టపగలే చావులా చల్లగా, చీకటిలా నల్లగా వుంటుంది. ఆ తోటలో దట్టంగా పెరిగిన చెట్లన్నీ చేతుల్లా వున్న తమ కొమ్మలడ్డంగా చాపి ఎండనంతా ఆపేస్తున్నట్టున్నాయి. చెట్లకి దొరక్కుండా కిందకు జారిన ఎండ, అక్కడా అక్కడా పచ్చగా మచ్చల్లా పడటంవల్ల, ముడుచుకు పడుకున్న పచ్చల పాములా వుంటుందాతోట పగటిపూట. ఇసక రేణువైనా కన్పించకుండా, పచ్చని పిచ్చిమొక్కలు పెరగడంవల్ల, నాచుతో కుళ్లిపోతున్న మొసళ్ల చెరువులా వుంటుందితర సమయాల్లో. ఆ తోటలో ఒకవార ముసలిమఱ్ఱిచెట్టుంది. దాని మాను వాన కోసేసిన పాడు కోట బురుజులా వుంది. వేలాడుతున్న దాని వూడలు రాక్షసులారేసిన చింకిగుడ్డల్లా వున్నాయి. ఆ మఱ్ఱిపక్కనే విరిగిన అగ్గిపుల్లల్తో చేసినట్టున్న ఒక పూరిగుడిసుంది. దాన్ని ఎన్ని సార్లు చూసినా, ఎంతసేపు చూసినా, పుస్తె అమ్ముకున్న పుని స్త్రీ మెడలో పసుపుకొమ్ముని చూసినట్టు బాధగానే వుంటుంది.

ఎంతవంగినా, ఆ గుడిసెలోకి వెళ్లినప్పుడానందరావు తలకి చిన్న దెబ్బ తగిలింది. విరిగిన తడకల్తోటీ, చిరిగిన తాటాకు

ల్తాటీ చేసినట్టున్న ఆ గుడిసెలో కెళ్లగానే, తనేదో మోసంచేసినట్టు ఫీలయ్యే డానందరావు. ఇంత దరిద్రం, ఇంత మంచిగా కనిపించే తన ప్రపంచంలోనే వుంటుందని అతనూహించలేక పోయేడు. చచ్చిన పాముల్లా, ఒక తడకకి రెండు ఏరంగువో తెలీని చింకిగుడ్డలు వేలాడుతున్నాయి. అస్థికలేరిన్నాడు కడిగేసిన శ్మశానంలాంటి కడిగిన పొయ్యి పక్కని రెండు బోర్లించిన కుండలుమాత్రం ఒకవార వున్నాయి. ఆ ఒంటిగదిలో మూలనున్న కిరసనాయిలు బుడ్డి నీరసపుకాంతి ఎర్రచీకటిలా వుంది. దీపం గాలికి కదిలినపుడల్లా చీకటి చలికి వణికినట్టుంటుంది.

ఒకమూల తాళ్లుతెగిన నులక కుక్కిమంచంలో విరిగిన బొమ్మలాంటి ఒక ఆరేళ్లపిల్ల పడుకొనుంది. ఆరేళ్లు కేవలం వాయు భక్షణం మాత్రం చేసినట్టుంది. ఏ క్షణాన్న తోలు చీల్చుకొని ఎముకలు బైటకొచ్చేస్తాయోనన్నట్లు ప్రతిజాయింటు దగ్గరా ఎముకలు సూదిగా కన్పిస్తున్నాయి. చేపల్లాంటి ఆ పిల్లకళ్లు తెరచివుండటంవల్ల చచ్చితేలిన ఎర్రచేపల్లా వున్నాయి, కిరసనాయిలు బుడ్డి ఎర్రకాంతిలో. పిల్ల కమ్మానుముక్కూ తీరుగా వున్నా, ఆ పరిసరాల్లో పాడుగోడమీద పుట్టిన పువ్వులమొక్కలా చూడ్డానికి బాధగావుంది. ముష్టి దానిముక్కున ముత్యపు ముక్కుపుడకలా పరిసరాలకు సరిపడకుండా, మంచం పక్కనే తెల్లగా తోమిన ఇత్తడి బిందొకటి వుంది. ఆ బిందె ఆ పిల్లతల్లి తెచ్చుకున్న అరణమేమోనన్న ఆలోచనరాగానే ఆనందరావుకి గుండె ఒక్కసారి ఆగినట్లైంది. ఆ బిందిపట్టుకొని కాపురానికొచ్చినప్పుడామెకున్న ఆశలు.......

నశించిపోతున్నాశలా మంచం వారనే ఆ పిల్ల తల్లి నిల్చొనుంది. ఆమె కెన్నేళ్లుంటాయి? ఎన్నున్నా నూరేళ్లూ నిండిపోయినట్టుంది.

ఆలస్యం చెయ్యకుండా తననితాను పరిచయం చేసుకొని వెంటనే పరీక్ష ప్రారంభించే డానందరావు. పేషంటు వళ్లు బ్రతికుండగానే కాలిపోతున్నట్టు అతివేడిగా వుంది. పరీక్ష చేస్తున్నప్పుడు బలవంతంగా పక్కకి ఒత్తిగించినప్పుడాపిల్ల, పామునోట పడ్డ కప్పపిల్ల చివరి మూలుగులా మూలిగింది.

తన పరీక్షవల్లా, తల్లిచెప్పిన దానివల్లా, పిల్లకి నెల్లాళ్లైటైఫాయిడనీ, వారంరోజులై డయేరియా కాంప్లికేషననీ గ్రహించేడానందరావు. అదివరకు ఆ పిల్లకి ఆయుర్వేదం చేసినాచారి, ఆ పిల్లకి ఐదురోజులై ఎటువంటి ఆహారం పెట్టనివ్వలేదుట.

పిల్ల జబ్బువల్ల కాకపోయినా, ఆకలికి చచ్చిపోయేట్టుంది. ఆ అమ్మాయికి వెంటనే పుష్టికరమైన ఆహారం యివ్వాలి.

''హార్లిక్సుగానీ,వోవల్టీనుగానీ, గ్లూకోజుగానీవున్నాయా?'' అని ఆ పిల్లతల్లి నడగడానికి నోరురాలేదానందరావుకి. ఏమనాలో తెలీక ''పిల్ల తండ్రేడీ?'' అన్నాడు.

''జైల్లో బడేసినారు'' అందామె.

''జైల్లోనా?'' ఆశ్చర్య పడ్డాడానందరావు.

కథ మామూల్దే. ఆ పిల్లతండ్రి ఐదు రోజులక్రిందట రిక్షా తొక్కడానికి పట్నం పోయేట్ట. రాత్రీపగులూ తొక్కి మూడ్రోజుల్లో పిల్ల మందుకి డబ్బు పట్టుకొస్తానని వెళ్లేట్ట. ఒక రాత్రీ, ఒక పగలూ తొక్కేక, మరితొక్కలేక పాతఅలవాటు ప్రకారం సారా తాగేట్ట. తాగి పట్టుబడితే కేసుపెట్టేర్ట.

''జరీమానా కట్టనేకపోతే జైలుకుక్కేసినారు, రెండోరాలు'' ముగించిందామె.

''పిల్లకేదేనా అర్జెంటుగా తిండానికివ్వాలి. ఏమైనా వుందా?'' అపరాధం చేసినవాడిలా అడిగాడు.

''బిందెలో నీల్లూ, బొందిలో పేనాలుతప్ప నాకాడేట్నేవు'' అంటూ, బిందెలో నీళ్లున్నాయన్న తన మాట నమ్మమన్నట్టు, బిందెమూతతీసి గ్లాసుతో నీళ్ల ముంచి తీసిందామె. కన్నీళ్లలా స్వచ్ఛంగావున్నాయి బిందెలో నీళ్లు. కాని కొంచెమే వున్నాయి. వీళ్లక్కడుపునిండా కన్నీళ్లుకూడా వుండవా అన్పించిందానందరావుకి ఆమె ఏడవక పోవడం చూసి.

''యింకేవీలేదా?'' అర్థంలేని ప్రశ్నేసాడు.

''కొంపలో గిద్దెడు గింజలుంటే నిన్న సంపుకుతిన్నం తొట్టు'' అంటూ ప్రారంభించిందామె తన కథ. జబ్బుపిల్ల నొదిలేసి తను కూలికి పోలేదట. మొగుడు చూస్తే జైల్లో కూర్చున్నాట్ట. వాళ్లకి రెక్కాడినా, పూర్తిగా డొక్కాడదట. ఐదురోజులై ఆ జబ్బుపిల్లా,ఆ పిల్లతల్లీ ఏవీ తిన్లేదుట.''ఆఖరికి యీ గుంటైనా మూడ్రోజులై మెతుకు ముడితే యీ గంగమ్మ తల్లి మీదొట్టు. తల్లీ, పిల్లలూ నాసినమై పోతామన్నమాట'' అంటూ ముగించి గట్టిగా ఏడుపుకి తగులుకుంది.

''దేశంలో యింత దరిద్రమా?'' అని బాధపడ్డా డానందరావు. తను నమ్మిన దేవుఁడు తనని మోసంచేసినట్టూ, తను పెంచిన పావురం పెనుపక్షై గోళ్లతో తనపీక పట్టుకున్నట్లు ఫీలయ్యేడు.

''సర్లే. యింటికెళ్లి మందులూ, పాలూ పట్టుకొస్తా నుండు'' అని ఆమెతో అని పెద్దపిల్లని తీసుకొని బయల్దేరేడు.

యీ కేసు ఫెయిలవడానికి వీల్లేదు. యిది తన మొదటి కేసు. తను ఎన్నాళ్లనుండో కలలు కంటున్న ఫస్ట్ కేసు. ప్రతి డాక్టరుకి మొదటికేసు తొలివలపు లాటిది. డాక్టరు సున్నిత హృదయుడైతే, అతని మనః ప్రవృత్తినే మార్చెయ్యవొచ్చు ఆ కేసు. యీ పిల్ల మందులేక ఛస్తే తనకీ, తన వృత్తికీ మాత్రమే అవమానం. కాని తిండిలేక చస్తే దేశానికి అప్రతిష్ఠ, మానవత్వానికే కళంకం. మనిషి రాక్షసుడన్న సత్యానికి ఋజువు. తను చెయ్యని పాపమేదో తనని వెంబడిస్తున్నట్టు, తను చెయ్యని తప్పు తనని వెక్కిరిస్తున్నట్టు ఫీలయ్యే డానందరావు.

ఈ పిల్లలాంటి వాళ్లెంతమందో...? పూర్తిగా విడివడని ఆలోచన మనసుని కోసినట్లైంది.

తోటబైటకొచ్చేసరికి అప్పుడే సూర్యాస్తమయం అవుతోంది.

తలదించి, తోకపైకెత్తి, బుసకొడుతూ పరిగెత్తే యముని ఎనుబోతు తన యినపడెక్కలతో లేపిన, యుద్ధ రంగంలో రక్తంలో తడిసి ఎండి ఎఱ్ఱబారిన ధూళి పడమటాకాశంలో లేసినట్టుంది.

ఆ ఎఱ్ఱ బేక్ గ్రౌండులో చాపు చాపిన ఎముకల చెయ్యిలా వుంది వో మోడు బారిన చెట్టు.

రసినిండిన కురుపుల్లా వున్నాయి పల్లెలో మురికి గుంటలు.

పసిపాప సమాధిమీద లేచిన లేతగడ్డిలా జోడుకింద గడ్డి అతిమెత్తగా తగుల్తోంది.

*  *  *

జోరుగా ఇల్లు చేరేడానందరావు. హాల్లో బ్లూలైటు వేసుకుని రాజూ, యశోదా కుర్చీల్లో కూర్చున్నారు. దూరం నుండి చూస్తే ఆ హాలు నీనీల్లతో నిండిన ఎక్వేరియం లాగా, అందులోవున్న యశోదా, రాజూ అడుగునున్న ఎఱ్ఱచేపల్లాగా వున్నారు.

హాల్లో కొచ్చేడానందరావు. నువ్విదివరకెప్పుడో విసిరి పారేసిన ఎంగిలి మెతుకులు తిన్న విశ్వాసానికి నీ వెనకాలే నీ మహల్లో కొచ్చేసిన వూరకుక్కలా, ఆనందరావు వెనకాలే ఆ పిల్లకూడా హాల్లో కొచ్చేసింది.

హాల్లో కొస్తూనే "అర్జంటుగా హార్లిక్స్ పెట్టించండి, ఆకలికి చచ్చి పోయేట్టుందా పిల్ల" అన్నాడానందరావు.

"ఆకలికా?" అని ఆశ్చర్యపోయి, యశోద హార్లిక్స్‌పెట్టి ఫ్లాస్కులో పోసి, మూణ్ణిముషాల్లో వచ్చేసింది. కాని ఆ మూణ్ణిమషాల్లోనూ రాజు పారేసిన మందుల బీరువా తాళాలు దొరకలేదు. మరో రెణ్నిమషాల్లో కూడా దొరకలేదు. ఆ పిల్ల బతికుండగా దొరకవేమోనని భయపడి, ఆనందరావు ఫ్లాస్కు ఆ పిల్ల చేతికిచ్చి, "నువ్వర్జంటుగా పరుగెత్తికెళ్లి మీ చెల్లి కియ్యి. ఆలస్యం చేస్తే చచ్చిపోతుంది. నువ్వు పరిగెత్తు" అని ఆ పిల్లని పంపించేసి, మళ్లీ తాళాలు వేటలో పడిపోయేడు. తాళాలు దొరికేసరికి సరిగ్గా పదిహేన్నిముషాలు పట్టింది. తనక్కావలసిన మందులు తీసుకుని, సిరెంజి బోయిలు చేసేసరికి మరో ఐదు నిముషాలు గడిచిపోయేయి. పక్కకళ్లం పాకలో వున్న పాలికాపుని పిల్చి సాయమిస్తానని యశోదంటున్నా లక్ష్యపెట్టకుండా పరుగెత్తాడానందరావు, ఆలస్యమై పోతుందేమోనని.

తోవలో గజాలు గొలుసుల్లాగా, విఘడియలు ఘడియల్లాగా కనిపించే యతనికి.

*  *  *

అతను తోట చేరగానే, ఆ సమయంలో మనిషలికిడి అలవాట్లేని పక్షులు కరకర అరిచేయి. గుడిసెకు దూరంగా వుండగానే, తను వెళ్లడం అనవసరమనిపించిందతనికి. పిల్లని బైటపడేశారు. ఆ పిల్లతలదగ్గర హరికెన్ లాంతరెవరో పెట్టేరు. ఆ పిల్లచుట్టూ పదిమంది దుప్పట్లు కప్పుకొని కూర్చున్నారు. వాళ్ల తలలు మాత్రం బైటకుండడం వల్ల, వాళ్లు దిక్కుమాలిన శవం చుట్టూచేరిన రాంబందుల్లా వున్నారు. కొనాశతో నడచివెళ్లి వాళ్ల పక్క నిలబడ్డాడానందరావు.

"పిల్ల పోనాది" అన్నారెవరో. పిల్ల మొహంమీదున్న దుప్పటి ఎవరో ముసిల్ది తొలగించింది. పిల్లమొహం చుట్టూ దట్టంగా లాంతరు వెల్తురు పడ్డంవల్ల ఆహుతై పోయిన సెయింటు బొమ్మలావుందామె. కళ్లుమాత్రం దేనికోసమో ఎదురు చూస్తున్నట్టున్నాయి. తర్వాత కళ్లు మూసేసి దుప్పటి కప్పింది ముసల్ది.

సర్వం పోగొట్టుకున్న దాన్లా, మోకాలమీద తలపెట్టుకుని కూర్చునుందాపిల్లతల్లి. ఆనందరావు వెళ్లిపోబోతూ వుంటే ఆమె తలెత్తి చూసిందతనివైపు. ఆమె మొహమంతా కళ్లే ఆక్రమించుకున్నట్టు వున్నాయి. ఒక కంట్లో నీటి బొట్టూరి, రెప్ప మీద నిలిచి, లాంతరు ఎఱ్ఱకాంతిలో కెంపులా మెరిసి, పైట తొలగిన ఆమె ఎండుగుండె మీద పడి బద్దలైంది.

*  *  *

తోట వదిలొచ్చేసినప్పుడు తన్లోని ముఖ్యమైన భాగాన్ని దేన్నో వెనక మరచిపోయినట్టు అనిపించిందానందరావుకి. కాళ్లు మొయ్యలేనంత బరువెక్కి పోయిందతని మనసు.

తోట బైట కొచ్చేసాడతను.

విరిగిపోయిన పాలల్లావున్నాయి గుడ్డి చంద్రుని చుట్టూ తెల్ల మేఘాలు.

ఎత్తైన చెట్లతో ఆ తోట పొగమంచులో పాడుపడ్డ కోటలా వుంది.

పల్లెలో గుడిసెలు కాలి ఆరిపోతున్నట్టు, ప్రతియింటి మీద వంటపొగ, మంచుబరువుకి నిలిచి పోయింది.

పల్లెలో మనుషులు పొగమంచులో ఆవిరై పోతున్న దయ్యాల్లా వున్నారు.

చివికిపోయినాలోచనల్తో యిల్లు చేరాడానందరావు. కాంపౌండు గోడ పట్టుమని పదిగజాలైనా లేదు. అప్పుడతనికి వినిపించిన భయంకర శబ్దానికి, కాళ్లు సీలలువేసి భూమికి బిగించేసినట్టు నిలబడి పోయాడు. ఐదుతలల్తో ఆదిశేషువే బుసకొట్టినట్లైంది. శబ్దం వచ్చినవేపు టార్చి వేశాడు. కళ్ల పడ్డ దృశ్యం గుండెను కంపించి వేసింది.

ఇందాక ఫ్లాస్కుపట్టుకెళ్లిన పిల్ల గోడకు గజందూరంలో గోడవేపు మొహంపెట్టి పడుకొనుంది. బతికుండగానే కప్పే

స్తున్నట్టు, ఎత్తుగా పెరిగిన గడ్డి, ఆ పిల్లఒళ్ళు సగం కప్పేసింది. ఆ పిల్ల వీపువెనక కసిగా పడగవిప్పి ఒక నల్లతాచు నిలబడి ఉంది. గడ్డిలో దానివళ్ళు కూడా కప్పబడి పోవడంవల్ల, భూమే పామై ఆ పిల్లని కరవబోతుందా అన్నట్టుంది. ఆ పాము పొలుమలమధ్య పగుళ్లలో విషం పూరుతున్నట్టు మెరుస్తున్నది దాని శరీరం. మనిషి మనసులోని అంధకారంలా అతినల్లగా వుందది. ఘనీభవించిన గరళపు చుక్కల్లా మెరుస్తున్నాయి దానికళ్ళు. మనిషిలోని స్వార్థంలా ఎత్తుగా లేచింది దాని పడగ.

ఈలోగా అమాయకంగా పామువైపు ఒత్తిగిలిందాపిల్ల. మరో పాముని చూసినట్టైంది ఆనందరావుకి, ఆ పిల్ల వెనకాల రాతిపలకమీద పడుకోబెట్టిన ఖాళీఫ్లాస్కుని చూసినప్పుడు. ఫ్లాస్కు మూత తీసేసివుంది.

ఆకాశంలో కారుదున్నలు పరిగెడుతున్నట్టూ, తన కాలి కింద సగంపడిన వానపాము వెక్కివెక్కి ఏడుస్తున్నట్టూ అనిపించిందానందరావుకి.

*　　　*　　　*

అమెరికా వెళ్లి పైచదువుల్చదివి, తిరిగొచ్చి, మందుల కంపెనీపెట్టి, తనకఖ్ఖర్లేని లక్షలార్జించడమా?

లే క

మురికిపేటలో ప్రాక్టీసు పెట్టి, లక్షలుగావున్న ఆ పిల్లలాంటి పేదలకు సేవచెయ్యడమా?

అ నే

ఆనందరావు సమస్య ఆర్నెల్లలో అతనమెరికా వెళ్ళిపోవడం మూలంగా పరిష్కారమై పోయింది.

---



# అల్లాడ వేమ భూపవరము - పినపళ్ల తామ్రశాసనము

శ్రీ ముసునూరి సాంబశివరామమూర్తి

ఈ తామ్రశాసనము తూర్పు గోదావరిజిల్లా, రామచంద్రపురము తాలూకా, "పినపళ్ల" గ్రామమందు జీర్ణ రామాలయమును పునరుద్ధరించుటకై స్థల పరిశోధన జేయుచుండగా నిలువు లోతున మట్టిలో ఆ యూరి గ్రామపెద్దలకు 1965 మే నెలలో దొరికినది. ఆ విషయమును మిత్రులవలన విని ప్రయత్నింపగా ఆ యూరి పంచాయతీబోర్డు ప్రసిడెంటు గారైన శ్రీ సంగితపు వెంకటరెడ్డిగారును, వారి మిత్రులు శ్రీ గోవిందుగారును నా కపరిచితులయ్యును నన్నాదరించి 1966 జూలై 11 తేదీన పరిశీలించి ప్రచురించవలసినదిగా ఈ శాసనము నాకు సంతోషాతిశయమున వశపరచియున్నారు. అందులకా మిత్రద్వయమునకును, ఆ యూరి పెద్దలకును నా అభివందనములు. ఈ శాసనపు రేకులు నావద్దనే భద్రపరుపబడియున్నవి.

## శాసన స్వరూపము

ఇది అయిదు రేకుల తామ్రశాసనము. సంపూర్ణముగానున్నది. ప్రతి రేకును 25 × 13 సె. మీ. కొలత గలిగి ఎడమనుండి 2½—4½=2 సె. మీ. రంధ్రము కలిగియున్నది. అందుండి 1½ సె. మీ. ఉరవగల రాగి కడియము 12 సె. మీ. వర్తులము కలిగియుండి ఆ అయిదు రేకులను (ఒక తాటాకు పొత్తమువలె) బంధించియున్నది. అందువలన ఆ రేకుల పుటలను పాఠకులు సులువుగ త్రిప్పుచు జదువుకొన ననువు కలుగుచున్నది. ఆ రాగి కడియముపై 6 × 4 సె. మీ. ఉరవగలిగి తలపైకెత్తి పరుండి గమనించుచున్న నంది విగ్రహము (శివాలయమందలి నందీశ్వరుని భాతి) సర్వాంగసుందరమును, సర్వాభరణ సంశోభితమునై, నిత్య సత్య పవిత్రతను జాటుచు జూడ తనివిదీరకున్నది. అదియే ఆనాటి రాజముద్రిక. అయితే ఆ కడియము ఎప్పుడు, ఎవరివలన, ఎందుకు, ఎట్లు ఛేదింపబడినదో ఎవ్వరికిని తెలియరానిదైయున్నది. ఆ కడియపు సందునుండి ప్రతి రేకును స్వేచ్ఛానుసారముగ బయట తీసికొనుటకును, వాటిని తిరిగి ఆ కడియమున చేర్చుటకు వీలుగానున్నది. ఈ శాసనపు రేకులు 2,200 గ్రా., కడియము (రాజముద్రికతో) 500 గ్రా. మొత్తము 2,700 గ్రా. బరువు కలిగియున్నది.

శాసనము సంపూర్ణముగా నున్నది. శాసనపు రేకులుగాని అందలి అక్షరపంక్తిగాని, కడియము రాజముద్రికలుగాని ఏ భాగమందును ఏమాత్రము శిథిలము కాలేదు. ప్రతి రేకునకును చుట్టును కొలది గోడుగా జవ యున్నది కావున శాసనాక్షరములు భద్రముగా నున్నవి. అయితే ప్రతి రేకునకు చుట్టునున్న ఆ జవ నునుపులేక (గట్టి దెబ్బలుతిని యుండుటచే గాబోలు) గంట్లు వడియున్నది. అంతియగాక కొన్నిచోట్ల లోపలివరకు (బీటలు), పగుళ్లు వాఱినది. అచ్చటచ్చట కొన్ని అక్షరములును దెబ్బలు తిని కానరాక గుర్తింప గష్టతరమౌచున్నవి. ఈ శాసనము నాకు జేరుటకుముందే యొకరివలన పరిశుభ్రము గావింపబడినది. వారు చాల జాగ్రత్తగానే శుభ్రపరచిరి. వారి దోషమావంతయు లేదు. అయినను ఆ శాసనపు రేకుల నంటియున్న తెల్లసున్నము, సన్న యిసుక, సిమ్మెంటు పాళ్లమాత్రము విడివడియుండలేదు. అందువలన కడకు జాగ్రత్తగా నేతి పిడకల మధ్యను కాల్చి, సాంగశీతలమైన వెనుక (యిసుప బ్రెష్) వరాకట్టచే తోమి పరిశుభ్రము చేయవలసి వచ్చినది. అట్లు కడియము తెగియుండుట, రేకుల పైనను లోపలను సున్నము, సన్నయిసుక, సిమ్మెంటు కూరబడియుండుట జూడ చాల ఆశ్చర్యజనకము. బాగుగా వాలోచింప పూర్వ మొకానొకప్పుడు ఈ శాసన మెవ్వరిచేతనో బడి తిరిగి భయలోభాదుల కాకరమై భూమియందు పూడ్చబడెనని తోచును.

## శాసన లిపి

ఈ శాసనమునగల అయిదు రేకులలోను మొదటి రేకు మొదటిపుటనేమియు (లిపి) వ్రాయబడియుండలేదు. మిగతా రేకులపుటలందీ రీతిని శాసనలిపి గలదు. 1 రే. 2పు. 13 పం, 2—1 మొదలు 4—1 వఱకును గల 5 పుటలకు ఒక్కొక్క పుటకు 14 పంక్తులు వంతున 5 × 14=70 పం. 4—2= 13 పం. 5—1=13 పం. 5—2=3 పంక్తులను కలిసి మొత్తము 13+70+13+13+3=112 పంక్తులు గలవు. అనగా అయిదవ రేకు రెండవపుటయందు (ఆఖరు పుట) గూడ 3 పంక్తులు వ్రాయబడియున్నవి. శాసన

మంతయు సంపూర్ణముగా సంస్కృతమే. సరిహద్దులుగాక మిగిలినదంతయు శ్లోకములే (నిర్గద్యము). లిపి మాత్రము 14 శతాబ్దమునందలి ప్రాచీన తెలుగు (హళ—కన్నడ) లిపియై యున్నది. అక్షరములు గుండ్రకత్తున సమానమైన యుతవ కలిగి సమ(తం) రేఖపై నిలిచియున్నట్లుండి చూడ ముచ్చట గొలుపుచున్నవి. అక్షర లిపి ప్రస్తుత లిపిని చాలవరకు బోలి యున్నను చదువునప్పుడు చాల అక్షరములు ఎక్కువగ భేదించి యున్నవి. వ్రాయుటలోగల (అక్షర) దోషములు 14 వరకును శాసన ప్రతిబింబముల క్రింద సవరణలందు జూపబడినవి.

### శా స న భా ష

శాసనమంతయు సంపూర్ణముగా సంస్కృతభాష. ఫలశ్రుతిలోని 53, 62 ను, ఆశీర్వాచకమైన 65 ను, ఆజ్ఞప్తి హస్తముద్రయైన 66 తప్ప మిగిలినదంతయు (శ్లోకములే) పద్యాత్మమే. సరిహద్దులందలి గ్రామములు పుంతలు మొదలైన వన్నియు సంస్కృతమునందే వాడబడినవి.

### శాసన విషయములు

1—3 దైవప్రార్థన. 4—6 వంశోదితము. 7—17 వంశక్రమము వారి ఔన్నత్యము. 18, 28 అల్లాడవేమ వీరభద్ర సోదరుల గుణగణ వర్ణనము. 28—36 దాన ప్రతి గ్రహీతయైన శ్రీగిరి పితృ, మాతృ వంశవర్ణన, వారి వీరశైవ విధానము, మహిమ. 37 (స్వామిద్రోహ మిథ్యాపవాదనివృత్తి కరమగు) అగ్ని దివ్య పరీక్ష. 38—43 (ప్రతిగ్రహీత) శ్రీగిరి గుణవర్ణన, 44—45 దానకాలము. 46—52 దానస్థలము సరిహద్దులు. 53—63 దానపాలన ఫలితము, అపహరణ దోషము. 64 శాసన కృతికర్త. 65 ఆశీస్సు 66, హస్తముద్ర.

### శాసనానువాదము

సముద్రమును చిన్న మడుగుగాచేసి, విశ్వమును పైకెత్తి విశ్వంభరుడను సార్థక నామముపొందిన వరాహమూర్తి విశ్వమును రక్షించుగాక! భూమియును విశ్వంభరుడగు వరాహ మూర్తితో ఉద్వాహము (వివాహము, మోయుట) పొంది విశ్వంభర యను నామధేయము పొందెను. (1) దానముచే (మదజలముచే) సురభియు (గంధముగలవాడును), దానముచే (ఈవిచే) సురభియు (కల్పవృక్షమయినవాడునూ) అగు శంకర కుమారుడగు గజాననుడు మీకు అనుదినము శుభంకరుడగుగాక! (2) గౌరీదేవికి అలంకార సమయములో అద్దమువలెను, రతి సమయమున దీపమువలెను నగుచు, చదలేటి అంచగములు తామరతూడుతుంటయను భ్రమచే చంచువులతో పలుమారు పొడుచుటవలన మెరుగుపెట్టినట్లయి అత్యంత విమలుడయిన శంభు శిరోరత్నమగు బాలచంద్రుడు ప్రకాశించునుగాక! (3) దేవ తలకు స్వస్తికరమును, ఆద్యమును అగు కమలనాభమను మహస్సు విరాజిల్లుచున్నది. దాని నాభీ కమలమునుండి త్రిలోక నిర్మాణ కర్మదక్షుడును, చిరంతన వాక్కులకు ఘంటాపథమువంటి వాడును, విశ్వస్రష్టలలో ముఖ్యుడునగువాడు ఉద్భవించెను. అతని ముఖ బాహూరు పాదములనుండి క్రమముగా వర్ణములు ఉద్భవించెను. (4) ఆ పురాణ పురుషుని పాద పద్మముల నుండి యుద్భవించిన కులము అల్పాచారము కలిగియున్నను సహజముగా పరిశుద్ధమయినది గనుక, కలియుగమున ఈ కులమునం దుద్భవించిన ప్రభువులు తేజశ్శౌర్యౌదార్య వదాన్య తాది సద్గుణవంతులై వన్నెకెక్కిరి. (5) అనేక శాఖోపశాఖలతో విస్తరించిన వృక్షమునందు మంచి రంగు, రసముగల గుండ్రని మధుర ఫలమువలె నీ కులమున సరసము, రమ్యచరిత్రము, ఉజ్వలమునగు పంటకుల మనునది ఏర్పడినది. (6) ఆ పంటకులము నందు విబుధరంజకుడగు దొడ్డయభూపతి సముద్రమునుండి సంతాన వృక్షమువలెను, రత్నాకరమునుండి చంద్రునివలెను ఉద్భ వించెను. (7) కోరినదానినే చింతామణి యిచ్చును. తలంచిన దానినే కల్పతరువు కొదువలేక ప్రసాదించును. కామ్యములను పెక్కింటిని కామధేనువు ఇచ్చును. (అయితే) అహేతుకముగానే యన్నింటిని యీ దొడ్డ భూపతి యిచ్చును. (8) త్రిపుర వైరియగు వృషభధ్వజుడగు ఈశ్వరుని భార్యయైన అపర్ణ, సర్వ మంగళయగు గౌరివలెనే దొడ్డభూపతికి చెన్నాంబ భార్య అయ్యెను. ( ) జగముల సృష్టి స్థితి లయకర్మలు నిర్వహించుటకు గుణభేదముతో పరమ పురుషుని మూడు అంశములు మూడు రూపులుగా అవతరించినట్టు దొడ్డభూపతికి సహజ తేజో వంతులు, తమోగుణాలను అణచినవారు, లోకోపకారనిష్ఠులు అయిన ముగ్గురు కుమారులు ఉద్భవించిరి. (10) మొదటి వాడు ప్రోలయ. రెండవవాడు కోటయ. మూడవవాడు అల్లాడ భూపతి. (ఈ) మువ్వురును వంశ ప్రతిష్ఠాపకులు. (కేతనవంటి వారు) (11) ఆ మువ్వురిలోను అల్లాడ భూపతి స్వభావముచేతనే సత్త్వగుణముకలవాడు, పురుషో త్తముడు లక్ష్మీవంతుడు అగుటవలన సాక్షాత్ (శ్రీ) మహా విష్ణువుతో సమానమైనవాడుగా ప్రసిద్ధి గాంచెను. (12) అతనిని కవులు బాణునివంటివాడనియు, స్త్రీలు పంచబాణుడనియు, యుద్ధరంగమున శత్రువులు (మృత్యువనియు) యముడనియు, ఉపాసించువారు మృత్యుంజయుడనియు ప్రస్తుతించిరి. (13) అతడు తన చక్కని రూపముచే జయంతుడనియు, లోక రంజనమున వసంతుడనియు, యుద్ధమున కృతాంతుడుగను, అశ్వారోహణమున రేవంతుడు (ఉత్తమ అశ్వికుడు)గను ఖ్యాతుడయ్యెను. (14) అల్లాడ భూపతి అశ్వికులైన యవనుల జయించి, పూర్వదేశరాజులను అవమానపరచి అధిక ప్రతాప వంతుడై, రక్షణయందు ఓర్పుగలవాడై భూమి నేలెను (15) చోడ వంశోద్భవుడైన భీమలింగరాజుని పుత్రియు, పవిత్ర మైన నడవడికగలదియునగు వేమాంబిక సద్గుణ గరిష్ఠయైన అల్లాడభూపతికి కులపత్ని యయ్యెను. (16) చతుస్సాగరముల వలెను, రూపొందిన చతురుపాయములవలెను, వేమాంబిక యందు అల్లాడభూపతికి నల్వురు పుత్రులు గనిగిరి. (17) వారిలో వేమభూపాలుడు పెద్దవాడు. వీరభద్ర నృపాలుడు రెండవవాడు. వారిర్వురును అశ్వినీ దేవతలవంటివారు. (18) తరుణసరసిజాస్యులగు వా రిర్వురు సకల భూపాలశ్రేష్ఠులై సజ్జన శరణ్యులై, దానశౌండులై సూర్యచంద్రులవలెను, రామలక్ష్మణులవలెను శూరులై లోకప్రసిద్ధినందిరి. (19)

పాలేశ్వరి వంశార్ణవ పూర్ణచంద్రులైన వారిద్దరును యుద్ధములయందు మహాశూరులుగా కీర్తిగాంచిరి. వారి కీర్తి వెన్నెల వలె సకల దిక్కులను ఒరసిపారుతూ వ్యాపించెను. 20) శ్రీ మార్కండేయస్వామివారికి ప్రియతమమైన గోదావరీ తటమునందున్న చక్కని రాజమహేంద్రవరము వారికి నివాసము. (21 అప్పటి చంద్రకాంతసౌధములందలి వెన్నెలకాంతులు చీకట్లను బోగొట్టుచున్నవి. కృష్ణపక్షమందు ప్రాంతమందలి చీకట్లనుగూడ నిల్వ నివ్వుటలేదు. (22) లోభాకృష్టులైన రాజపుత్రులు కొందరు దేవ బ్రాహ్మణ మాన్యములపై నసంబద్ధముగా కల్పించిన పన్నులన్నిటిని వారిరువురు శ్రీమార్కండేయస్వామి, గౌతమీనది సాక్షిద్వయముగా శాశ్వతముగా తీసివేసిరి. (22) సమస్త గుణములచేతను శ్రీరామచంద్రుని వలెను, రాచకార్యములందు పరాకు(మాంద్యము)లేనివాడై అల్లాడ వేమభూపతి గొప్ప కీర్తిగలవాడయ్యెను. (23) అల్లాడపుత్రుడగు వేమభూపతి అధిక పరాక్రమవంతుడై నిజ భుజబల వీర్యముచే శత్రువుల జయింపగా, బ్రాహ్మణులు దేవతలు గూడ (తమ) కోర్కెలు తీరినందున నందన (వన) విహారాభిలాషులవలె సంతోషించిన వారైరి. (24) కాటయవేమ నృపాలునిపుత్రుడైన కాటయుని కుమార్తెయు, మూడు సముద్రములును ఎల్లలుగాగల సమస్త పృథ్వీ సామ్రాజ్యమును శాసించిన హరిహరరాయలకు మనుమరాలును (నప్త్రీ పౌత్రీ సుతాత్మజా పుత్రస్య పుత్ర్యా వా అపత్యం పౌత్రీ ఇత్యమరః),పవిత్రురాలును, అదృష్టభాగినియునై ఆ తాతగారిపేరితోనే వెలసిన హరిహరాంబ వేమభూపాలుని భార్యలలో ముఖ్యురాలయ్యెను. (25) ఎల్లప్పుడు పరిపూర్ణుడును, కళంకములేనివాడును, దోషరహితుడును, సంతతము పద్మాశౌస్యుడును, మిత్రసహితుడును, బ్రాహ్మణాశీర్వచనములబొందువాడునగు అల్లాడ భూప తనయుడైన వేమ పృథ్వీపతిని గాంచిన చంద్రుడు అట్టి సద్గుణ విహీనుడగుటచే నెక్కువగా సిగ్గుపడువాడయ్యెను. (26) నిరుపమాన గుణ నిలయుడగు వేమభూపాలుడు తన రాజ్యమును భాగ్యములకు పుట్టినిల్లుగను, శత్రురాజులకు మృత్యువుగను, పుణ్యములకు కాటపట్టుగను, సమస్త దురితములకు వ్యతిరేకిగను, సత్కీర్తికి ఉనికిపట్టుగను చేసి విరాజిల్లుచున్నాడు. (27) వేమభూపాలునకు రాజవేశ్యా భుజంగుడు, వైరికుల పరశురాముడు, జగనొబ్బగండడు అను బిరుదులు గలవు. (28) అల్లాడవేమభూపాలునికి రాజ్యసంరక్షకుడును హరితస గోత్రికుడునైన శ్రీగిరి అను పేరుగల మంత్రియుండెను. (29) శ్రీగిరి మంత్రివర్యుడు ఎల్లపుడును జాగరూకుడై రాజును ధీరలలితునిగా జేయుచు (క్షయ స్థాన, వృద్ధులు) త్రివర్గములను పోషించుచుండెను (30) అతనికి సమస్త గుణములచే ప్రసిద్ధి నొందిన విశ్వేశ్వరుడు ముత్తాత. మాచయ మంత్రి తాత. మిక్కిలి అదృష్టశాలియైన అయ్యలార్యుడు తండ్రి. (31) నిర్మల మనస్కుడైన విశ్వేశ్వరుడు, శైవలింగార్చనాపరుడైన లింగనార్యుడు, పూతచరితుడైన అనపోతుడు శ్రీమంతుడగు గిరీశుడు అతనికి పిన్నతండ్రులు. (32) కౌండిన్య గోత్రోద్భవుడైన ప్రోలయ (ఈతని) తల్లికి ముత్తాత. పురుషోత్తముడైన పెమ్మన్న తల్లి తాత. (33) ప్రసిద్ధి గాంచిన వల్లభార్యుడు (ఈతని) మాతామహుడు. పవిత్రవంతురాలు. సాధ్వీమతల్లి, అదృష్టవంతురాలునగు లక్ష్మి (ఈతని) తల్లిగారు. (34) ఎఱ్ఱయమంత్రి, మాచిరాజు, పండితుడైన వల్లభుడు, గుణనిధియైన మాధవుడు అను సహోదరులు గలరు. వారు ఆచారవంతులు, విద్యాధికులు, సిరిసంపదలు, పురుషార్థములు, చతుస్సాగరములు, చతురుపాయములు రూపుకొన్నట్టివారు. (35) పినతండ్రియైన విశ్వేశ్వరయ్య శంకలేని వీరశైవుడై శ్రీశైలేశునికి తన రెండు కన్నులూడబెరికి పూజించెను. భక్తుని భక్తికి మెచ్చిన ఆ దైవము ఒక కంటి నిచ్చెను. రెండవకన్ను లేకుండుటచే ఆ కంటిని తిరిగి ఆ శివునకే అర్పించెను. ఆ భక్తుని కీర్తి వ్యాపింపచేయుటకై ఆ రెండు కండ్లను (ఈశ్వరుడే) ప్రసాదించెను. (32) మంత్రిసత్తముడైన శ్రీగిరి తనపైనను తన వంశమువారిపైనను మోపబడిన (నిష్కారణ) నీలాపనిందా స్వామిద్రోహనేరమును పారద్రోలుటకై శ్రీ మార్కండేయస్వామివారిదగ్గర బ్రాహ్మణులు, రాజులు మొదలైనవారి సమక్షమున అగ్ని దివ్య పరీక్ష (చితి నురుకుట) నిచ్చి తన్ను తన వారిని పరిశుద్ధులను కావించుకొనెను. (37) ఆ మంత్రివర్యునికి స్వామి కార్య నిర్వహణ, దైవపూజ, పండితపోషణ, గంగోదకస్నానము, నిరతాన్న దానములే గాని వేరుపనులు కానరావు. (38) గుణాకరుడు, ద్విజవరుడునగు శ్రీగిరి శ్రీగిరికి (శ్రీశైలమునకు) వెళ్లగా, ప్రకాశించుచున్న శ్రీగిరి తటమునందు నివసించు ఈశ్వరుడు ఈయన మనస్సులో నివసించుటకు కాంక్షించును. (39) సజ్జనుల కుపకరించుటయందు గొప్పవాడు, ప్రజ్ఞాపాటవముచే విద్య నేర్చినవాడు, విద్యచేతను, చిత్తశుద్ధిచేతను ఆనందించువాడును, సంతోషాంతరంగుడునైన శ్రీగిరి జయమును పొందుచున్నాడు. (40) పండితుల కాధారభూతుడును, కులమువారికి నిధియైనవాడును, ఆశ్రయించినవారి కాశ్రితుడును, విద్యకు నిలయుడును, పరిణతినందిన బుద్ధిగలవాడును నీతికి నిలయుడును, దీనులకు శరణ్యుడును, కీర్తికి గనియు, ధర్మమును రాచబాటవంటివాడును అయిన శ్రీగిరి దీర్ఘాయుష్మంతుడై జయమందెను. (41) నియమముగలవారు ఇతని ఆచారమును, కవులు స్తవమును, స్త్రీలు రూపమును, మంచివారు సౌజన్యమును, స్వజనులు బంధుత్వమును, పెద్దలు బుద్ధిని, శైవులు శంకరపూజను, నేర్పుగలవారు రాజకార్య నిపుణత్వమును, ఆర్తజనులు త్యాగమును, యాచకులు దయను, కృపణులు కృపను పొగడుచున్నారు. (42) వంశౌన్నత్యము, ఆచార పరాయణత, శివార్చనా భక్తి, స్వకార్యదక్షత గలిగినవాడు, ఆశ్రితుడునగు శ్రీగిరిని గుణజ్ఞుడగు అల్లాడ వేమభూపాలుడు సత్పాత్రమని తలంచి (43) శాలివాహన శకము 1346 క్రోధికార్తిక బ 30 సోమవారమున అల్లాడ వేమభూపాలుడు గోదావరీతీరమందున్నట్టి "పినపళ" గ్రామమును (44) హరితసగోత్రుడును, విద్వాంసుడునగు శ్రీగిరికి "అల్లాడ వేమభూపవరము" అను పేరుతో ఆచంద్ర

తాతార్కమునగ సకలైశ్వర్య భోగములతో దానముచేసెను. (45) ఈ గ్రామమునకు సామంత సమ్మతముగా ఎల్లలు వ్రాయబడుచున్నవి. తూర్పున ప్రత్యేకింపబడిన "రెడ్లఖారి" అను పేరుగల క్షేత్రము. (46) దక్షిణమున ప్రఖ్యాతికెక్కిన పాడవైన యాతపుంత (తాలపూడికి పోవు పుంత). ఆగ్నేయమున మహామార్గము కలుపు (త్రోవలోని) పెద్దపుట్ట. (47) దక్షిణమున తియ్యమామిడాడ, సంధిపూడిచెరువు (జలాశయము) నుండి చింతలూరుప పోవుపుంత. నైరృతిని నేరేడుతో గలిసిన రావిచెట్టులో గూడిన పుట్టమీదుగా పోవు పుంత. (48) పడమట క్రొత్తగా రాజ సమ్మతమైన పాతమాల చెరువుతో గూడిన రావిపుంత. (50) వాయవ్యమున ఈ పుంత నక్కరి చెట్టుకు దక్షిణముగా పాత పుంతకు ఉత్తరముగా నాగకుల్యానదికి చేరును. (51) ఉత్తరమున (అవిధమైన) అదే పుంతలో అబ్బరాజుచెఱువు, ఈశాన్యమున రెడ్లఖారిలోని పడమటి పెద్దపుంత. (52) (దాన) పాలన సుకృతము, అపహరణ దోషము వెల్లడి చేయు నిమిత్తము పురాణ శ్లోకములు కొన్ని వ్రాయబడు చున్నవి. (53) దానమువలన స్వర్గము కలుగుచున్నది (దాని) పాలనవలన మోక్షపదవి కలుగుచున్నది. (కావున) దానమునకంటే, దానమును పాలనము చేయుట శ్రేయస్కరము. (54) చాల మందిచే భూమి యీయబడినవి. అనేకమందిచే పాలింపబడినవి. ఏ యే (పరిస్థితులు) పాత్రతనందునో, ఆ యా ఫలితమే కలుగును. (55) శత్రువులైనను చేసిన ధర్మము దీక్షతో పాలింపబడవలసియున్నది. శత్రుత్వముచే శత్రువులైనప్పటికి ధర్మమున కెప్పుడును శత్రుత్వ ముండదు. (56) తనచే నీయబడినను ఇతరులచే నీయబడినను సరే. ఆక్షేత్రము నెవ రపహరింతురో (వారు) అరువదివేల సంవత్సరములు మలమునందు పురుగై పుట్టుచున్నారు. (57) వేయి చెఱువులు త్రవ్వించినను, అశ్వమేధములు, కోటిగోదానములు గావించినను భూమి నపహరించిన వాడు పరిశుద్ధుడుకాడు. (58) (కేవలము) విషమును విషమని చెప్పరు, బ్రహ్మస్వము (బ్రహ్మార్పణమైనది) విషము వంటిది. విష మొక్కరినే చంపును (గాని) బ్రహ్మస్వము పుత్ర పౌత్రయుక్తమైన వంశమునే చంపివేయును. (59) అందుచే దాత వాక్యము (60) ఈ అల్లాడ వేమభూపతి రాబోవురాజులను సమస్త విధములచేతను నా ధర్మము మీచే రక్షింపబడు గాకయని వేడుకొనుచున్నాడు. (61) శ్రీరామచంద్రునిచే నిట్లు చెప్పబడినది. (62) ఈ ధర్మసేతువు రాజులకు సామాన్యమైనదే. మీ చేతను ప్రతికాలమునందును పాలింపబడతగినది. ఈ విధముగా రాబోవు రాజులనందరను తిరిగి తిరిగి రామచంద్రుడు వేడుకొనుచున్నాడు. (63) కణ్వగోత్రోద్భవుడును అక్కిమ వల్లభార్యల కుమారుడును అగు వల్లభునిచే సద్వికాసనమైన ఈ శాసనము (కృతి) వ్రాయబడినది. (64) శ్రీ వరాహమూర్తి రక్షించుగాత. (65) శ్రీ మార్కండేశ్వర వేమ హస్తముద్ర. (66).

ఈ శాసనమంతయు మనోహరమైన కావ్యమువలె వర్ణింపబడినది. ఇందలి వివిధ వృత్తములు (ఛందములు) అలంకారాదులు చాల ప్రౌఢముగనున్నవి. ఇందు 28 అనుష్టుపులు, 8 ఆర్యా వృత్తములు, 3 శిఖరిణీ, 2 వసంత తిలక, 10 శార్దూల విక్రీడిత, 1 మాలినీ, 1 శాలినీ, 6 ఇంద్రవజ్ర, 1 స్రగ్ధర, 2 రథోద్ధత(వరాంతిక) 3 వాతాంగి(ఉపజా)1 వారాంగి (వై.ఉ.జా.) 1 వ్యత్యస్థ ఉపజాతి, వృత్తములు, 3 గద్యలు, 1 హస్తముద్ర—ఈ విధముగా మొత్తము 66 న్ను సమయానుకూలముగా వివిధములైన ఛందములనుండి వివిధ వృత్తములను (13 రకములు) వాడబడి శాసనకృతికి శోభ తెచ్చెను. ఇందొక విశేషము: అనుష్టుపు ఛందనందు విషమ వృత్తముల వాడెను. అవి ఛందమునందల చతుర్దశ వృత్తములందు గానరావు. మఱియొక విశేషము. ఈ శాసన కృతికర్తయైన కాణ్వవల్లభార్యులే దీని కొకదశ పూర్వమే కాటయ వేమారెడ్డి కాలమున (ముమ్మిడివరము)మల్లవరపు శాసనకృతికర్తయైనందున ఈశాసనమునందలి మొదటి ఏకునగల 13 పంక్తులుగల 7శ్లోకములు దానియందు యథాతథముగ నుండియున్నవి. అల్లాడరెడ్డి వంశము చక్కగ నీయబడినది. వారి ధైర్య సాహసాదాద్యాదికము లితర శాసనములం దుల్లేఖించినవే.

## గమనింప వలసిన విషయము

1. కంటికి గన్పింపని దేవుని విషయములును, దైవలీలలును తద్వారా దైవభక్తులును, వారి మహిమలును ఈ నవ నాగరికతా కాలమున సందేహాస్పదములై వర్తిల్లినవి. అయితే ఏ విషయము నైనను నొక్కి వక్కాణించునపుడు అది అట్లు జరుగవలెనని రాజశాసనమున్నది. రాగిప ట్టాను వ్రాసియిచ్చినారా అనునానుడి మాత్రము దేశవ్యాప్తముగా మిగిలియున్నది. అనగా రాజశాసనమును, రాగిపట్టాను పరమ ప్రమాణమని లోక మంగీకరించుచున్నది. అట్టివి (ఆ శాసనములు) రాజాజ్ఞలు. అవి ప్రజాసూత్ర ధర్మాలు లేక దానములై యున్నవి. దైవదానములును, భక్తియు ఆశాసనాంతర్గతమై యున్నవి. శాక్తేయమున శ్రీరామకృష్ణ పరమహంసాదులును, వైష్ణవమున ప్రహ్లాదాదులు, శైవమున బసవన మల్లికార్జున పండితారాధ్య సోమానాథాదులు పెక్కుర పురాణ, కావ్యాదులందు వారి వారి మహిమలతో గాన్పించుచున్నారు. మహాభక్త విజయమున శివ కంచి, విష్ణుకంచి తగవులలో వీరశైవ భక్తుడు శిరచ్ఛేదము గావించుకొని కంచినంతను ఆక్రమించి శివపరాయణత్వము గావించునటులు గాన్పించుచున్నది. కాని ఆధునికులు కల్పితగాథ యనుచున్నారు. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యమున తిన్నని నయనార్పణ గాథను శంకించుచున్నారు. ఇట్టి వనేకములు గలవుకాని (రాజ) శాసనములందు గానరాక సందేహించుచున్నారు. ఆ కొరతను ఈ రాజ శాసనము తీర్చుచున్నది. ఈశ్రీగిరి మంత్రి పినతండ్రి విశ్వేశ్వరయ్య నిశ్శంకమైన వీరశైవుడై శ్రీశైల మల్లికార్జునార్చన సమయమున అత్యంత భక్తితో తన నేత్రద్వయకమలముల బూజించెనట. అందుల కా స్వామి మెచ్చి యొక్క కంటిని ప్రసాదించెను. అయితే రెండవ కంటి నిమిత్తముగా తిరిగి ఆ కంటిని పెరికి ఆ శివునికే సర్పించెను. శ్రీశైలేశు డా భక్తికి మెచ్చి భక్తుని ప్రఖ్యాతి కెక్కజేయుటకై రెండు కన్నుల బ్రసాదించెను. ఇయ్యది రాజ నిర్మిత

శాసన ప్రకటితమగుటచే నాచంద్రార్కము నిశ్శంక సాక్షీభూతమై యున్నది. ఇంచుమించుగా నా కాలమందు వీరశైవము, శివభక్తుల మాహాత్మ్యము అనేకము అనేక విధముల ప్రఖ్యాతమైనవి యథార్థములని శ్లాఘించుచున్నది. ఈ నేత్రముల ప్రసాదించుటలో శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యమునందలి తిన్నని లేక కన్నని గాథ లోక విఖ్యాతి గన్నదే. వైష్ణవ ప్రముఖుడగు చక్రపాణి రంగనాథ కవి కృత "నయన" రగడ బఠించిన శివదూషణవలన అంధుడై శ్రీరంగనాథునిచే ప్రబోధింపబడి, శ్రీశైల మల్లికార్జున స్తవమువలన నొక్కకంటిని, పాల్కురికి సోమనాథుని ప్రసాదమువలన రెండవకంటిని బొంది వీరశైవుడై ప్రసిద్ధిగాంచినటుల దెలియుచున్నది. అందుచే విఖ్యాతి గాంచిన వీరశైవ గాథలు యథార్థములని యెలుగెత్తి చాటుట కీతామ్ర శాసనమే ప్రత్యక్ష సాక్ష్యము కాగలదు.

2. దివ్యపరీక్షా ఘట్టము:— సీతాదేవి అగ్ని ప్రవేశమును భీముని జలనిపాతనము, ప్రహ్లాదుని విషపానము, సారంగధరుని కరచరణఖండనలు ఆధునికులు శంకించువారైరి. అట్టివారికిని ఈ తామ్రశాసనమే నిశ్శంకమైన సాక్షీభూతమై నిల్చియున్నది. ఈ దాన ప్రతిగ్రహీతయగు శ్రీగిరి మంత్రిపైనను వానివర్గమునందును రాజద్రోహ నేరము సంభవింపగా ఆ మృషాపవాదనేరము దొలగించుకొనుటకై అగ్ని దివ్య మాచరించెనట. అయ్యది రాజధానీ నగరమైన రాజమహేంద్రనగరమున శ్రీ మార్కండేయ స్వామివారి సమక్షమున ధర్మశాస్త్రవేత్తలైన బ్రాహ్మణవర్గమును పాలకులైన ప్రభువర్గమును స్వామిద్రోహవిందులైన తన వర్గమును సాక్షీభూతులుగా నీ శ్రీ గిరి మంత్రి అగ్ని దివ్యమాచరించెను. అగ్నిదివ్యమున చితిని చేర్చి అందు ప్రవేశించి సిగపువ్వైన వాడకుండ వెడలివచ్చెట. ఇందుకు ప్రమాణము ధర్మశాస్త్రములందు వ్యవహారకాండను నేరస్థుల పరీక్షార్థము పంచదివ్యములు విధింపబడినవి. 1 భూ, 2. జల, 3. విష, 4. అగ్ని, 5 కోశ దివ్యములు. ఇవన్నియులు హిరణ్యకశిపుడు తనకు శాత్రవుడుగా బయలుదేరిన పుత్రుని ప్రహ్లాదునిపై ప్రయోగించినటుల శ్రీమద్భాగవతమున గానవచ్చును. ఆ పంచ దివ్యములు 14 శతాబ్దమునందు రెడ్లరాజ్యమందుగూడ అమలు నందున్నట్లే తామ్రశాసనమే రుజువు.

## చర్చనీయాంశము

"పుత్రీ కాటయ వేమభూపతనయ శ్రీ కాటయ క్ష్మాపతేః
పౌత్రీత్ర్యర్ణవశా శితు ర్హరి హరస్యోర్వీశ చూడామణేః ।
తన్నామ్నా ప్రథితా చ సా హరిహరాభిఖ్యా మహాభాగినీ
ముఖ్యా దేవ్య భవత్ పవిత్ర చరితా శ్రీ వేమ పృథ్వీపతేః॥"

అని 25 వ శ్లోకముననుండుటచే "కాటయవేముని కుమారుడైన కాటయకు పుత్రియు,మూడుసముద్రముల పర్యంతము శాసించిన హరిహరరాయ పృథ్వీశ్వరుని మనుమరాలు(=దౌహిత్రియు "నప్త్రీ పౌత్రీసుతాత్మజా=పుత్రస్య పుత్ర్యావా అపత్యం పౌత్రీ"ఇత్యమరః) పవిత్రవంతురాలును, అదృష్టభాగినియునై ఆ తాతగారి పేరుతో వెలసిన హరిహరాంబ వేమ భూపాలుని ముఖ్య భార్య అయ్యెను" అని తెలుపుడు జేయుచున్నది. ఈ విషయమునే అల్లాడరెడ్డి కోరుమిల్లి శాసనములో

పౌత్రీం కాటయ వేమయ క్షితిపతేః
పుంత్రీంచ కాట ప్రభోః
దౌహిత్రీం చతురర్ణవీం హరిహర
క్షోణీపతే శ్శాసితుః
తన్నామ్నావిదితాహ్వయాం హరిహరాం
బాం చారు మద్గాహయ
త్పాణౌ వేమ మహీశ మల్లనృపతి
స్సామ్రాజ్య లక్ష్మ్యాస్స్వయం॥

అను శ్లోకమును పై విషయమునే సమర్థించుచున్నది. కాటయ వేముని మనుమరాలును, కాటప్రభుని కుమార్తెయున్ను, హరిహరరాయల దౌహిత్రియునగు హరిహరాంబను అల్లాడ వేమ నృపతి పాణి గ్రహణము గావించెను అనియే గదా దాని భావము. అల్లాడ వేమవరపు శాసనమందు గూడ ఈ శ్లోకమే యిట్లే యుల్లేఖింపబడినది. అనగా వేర్వేరుకాలములందు వేర్వేరు శాసన కృతికర్తలచే ఈ హరిహరాంబా వేమనృపాలుర పాణిగ్రహణ సంబంధ మొకే రీతిని వ్రాయబడి హరిహరాంబ కాటయవేముని మనుమరాలును అతని కుమారుడైన కాటప్రభుని కుమార్తె యనియు చాటుచున్నవి. ఈ విషయమునే—

Elliots collections, Page 320 :

The Vemavaram plates of Allaya_vema which will be mentioned in the next peragraph, refer to Kata prabhu who was the son of Katayavema and who married the dghter of Harihara, evi-dently of the Vızayanagara King Harihara." (Annual report of Ephigraphy; 1906 para 63.)

ఈ విషయమునే ఆంధ్రుల చరిత్రము, మూడవభాగము 175 పుటయందును, అపోత్తమందే 259, 261, 374 పేజీలందును నొక్కి వక్కాణించియున్నారు. అట్టితతి కవితా సమీక్ష — రెడ్డి రాజుల చరిత్రమున (శ్రీనాథ కవితా సమీక్ష ద్వితీయ సంపుటము) 77, 99, 104, 193 పేజీలందు హరి హరాంబ కాటయవేముని పుత్రియని వక్కాణించుచున్నారు. అంతేగాక 102 పేజీలో "కాటయవేమునకు జన్మించిన యేకైకసుతుడు కుమారగిరిరెడ్డి" అని వ్రాసియున్నారు. కాని ఆంధ్రుల చరిత్రము మూడవ భాగమున 257 పేజీలో కాటయ వేమభూపాలునికి, గాటయ, కుమారగిరి యను నిరువురుకొమాళ్లు గలరనియు. "261 పేలో అల్లాడభూపతిపరిపాలనము ప్రారంభమగునప్పటికి కాటయప్రభువు మరణించెనని యూహింపవలసియుండును...అప్పటికి గాటయ మరణము నొందియుండునని నే నూహించుచున్నాను" అనియు వక్కాణింపబడినది. అయితే తెలుగు విజ్ఞాన సర్వసమునందు రెడ,

చరిత్రలో హరిహరాంబ కాటయవేముని కూతురని చెప్పబడినది. ఇట్లు హరిహరాంబ కాటయవేముని కుమారుడైన కాటయకు కూతురు, కాటయవేముని కుమారుడైన కాటయకు కూతురు, కాటయవేముని మనుమరాలు అని పై మూడు శాసనము లందును స్పష్టముగా వక్కాణింపుచుండగా నీ రెండవ వాదమైన కాటయవేముని కుమార్తె అనుటకు గల కారణ మేమన కవితా సమీక్ష, రెడ్డిరాజుల చరిత్రలో 173, 174 పేజీలలో వేమవరము శాసనమందు ''పౌత్రీం కాటయవేమ యక్షితిపతేః పుత్రీంచ కాట ప్రభో'' అను దానిని ''పుత్రీం కాటయ వేమక్షితిపతేః పౌత్రీంచ కాట ప్రభో'' అని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు సవరించినటుల వ్రాయుచున్నారు. ''ఈ శ్లోకము చెక్కియున్న రాతిరేకులో మొదట ''పౌత్రీం'' రెండవచోట ''పుత్రీం'' అని యున్నది. ఈ శాసనమును తొలుత జదివిన బార్నెటు దొరగా రట్టులనే ముద్రించియుండగా కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు దీనిని సవరించి ''పై విధముగ సరిపెట్టియున్నారు. వారు సవరించిన పద్ధతియే సరియైనది'' అని వ్రాసియున్నారు. అందుకుగల కారణమును ఆ వెంటవే ఆ శాసనమందే గల ''కాటయ వేమ క్షితిపతి తనయా—మని తల్లి విఖ్యాతామ్) కుమారామివ కమలాక్షః, తాముదవహ దల్లభూపవీరేంద్రః॥'' అను తరువాతి శ్లోకమునందు ''కాటయ వేమక్షితి తనయాం'' అని యుండుటచే పై శ్లోకమునందు గూడ మొదటి పదమున ''పుత్రీం, అనియే యుండవలయునని నిర్ధారణ యగుచున్నది'' అని వ్రాసియున్నారు. అయితే వేమ, వీరభద్రులను పెండ్లాడిన హరిహరాంబా, అనితల్లులను విడి విడిగా రెండు శ్లోకము లందు వర్ణింపబడిరేగాని ఒకే శ్లోకమునందు వర్ణింపబడలేదు. పోనీ ఆ రెండు శ్లోకములను కుళకములు గావించి ఒకే క్రియా పదముతో బంధించినారెమోయన్నచో మొదటి శ్లోకమున ''అగ్రాహయత్'' అను సంపూర్ణ క్రియాపదముతోను, రెండవ శ్లోకమున ''ఉదవహత్''అను సంపూర్ణ క్రియా పదముతోను చెప్పబడియుండెను. అందుచే వేర్వేరు శ్లోకముల నొక బాలను పౌత్రిగాను వేరొకబాలను పుత్రిగాను స్పష్టముగా వ్రాయుట కేల యాక్షేపణీయము సంభవింపగలదు? అట్లుగాక హరిహరాంబ కాటయవేముని కుమార్తెయగుచో అల్లారెడ్డి కోరుముల్లి శాసనమునందును, అల్లాడ వేమవరశాసనమునందును అతని అల్లాడ భూపవర శాసనమందును, ఈ అల్లాడ భూపవరశాసన మందును గూడ వేర్వేరు కాలములందు వేర్వేరు లేఖాచార్యులచే వ్రాయబడినవగుటచే నీ మూడు శాసనములందును గూడ (అతి ముఖ్యమగు విషయమున) ఒకేచోట నొకే (రకమైన) అక్షరపు తప్పులుండుననుట విశ్వాసార్హము కాదు. ఇక కర్తలచే యా దోషమున్నచో వేర్వేరు కాలముల బాధ్యతా యుతులైన శాసన కృతికర్తలు ప్రముఖమైన విషయముల నజాగ్రత్త (నిర్లక్ష్యము) గ నుండుటగాని ఒకే రకమైన ఒకే అక్షరపు తప్పులు సంభవించె ననుట సమంజసముగా గానరాదు. విషయమే వారి కవగాహన కాలేదనుట అతి సాహసమగును. ఆ కాల మున అన్ని విషయముల వారి ప్రత్యక్షముగ గాంచి బాధ్యతా యుతముగ శాసనముల తయారుజేసి, రాజముద్రికను (హస్త ముద్రను) బొందు పఱచినవారు కావున వారజ్ఞులనుటకు తావే లేదు కదా !

అంతియగాక అనితల్లి కలువచేరు శాసనములో ''అనితల్లీ పతి దైవా ఘన సచివీభూత భావుకా భువ మవతి'' అనియుండుటచే రాజ్యాధిగారిణి అని తల్లి, బావగారైన (వేమారెడ్డి) ముఖ్య మంత్రియనియు తేలుచున్నది గదా? దానికి తోడు ''కాటయ వేముని తరువాత నాతని పుత్ర సంతానము నిలిచియుండని కారణ మువనే, అతని పుత్రికయైన అనితల్లికి అల్లాడ రాజ్య సంక్రమము గావించెనని మాత్రము కలువచేరు శాసన శ్లోకమును బట్టి తెలియుచున్నది.'' అని కవితా సమీక్ష 103, 104 పేజీల లోనే యుదాహరించియున్నారు. అనగా కాటయవేముని తరువాత అతనికి పుత్రసంతానము లేదనియు అనితల్లిమాత్రము నిల్చి రాజ్యాధికారిణి యయ్యెననియు ధ్రువమగుచున్నది అట్లుగాక నిజముగా హరిహరాంబ కాటయవేముని కూతురే యైనచో నామె పెద్దవాడైన వేమునికే గదా యీయబడినది. అనితల్లి, భర్త వీరభద్రుడు వేమునికంటె చిన్నవాడేగదా? అప్పచెల్లెండ్ర నిర్వురను (సాపత్నీ సోదరులు) అన్నదమ్ముల కిర్వురకును వివాహము చేయునపుడు పెద్దవానికి పెద్దకుమార్తెను, చిన్నవానికి చిన్నకూతురును వివాహము జరిగియుండవలెను. అట్టితఱి పెద్దవాడైనవేముని భార్య హరిహరాంబ పెద్దకూతురు గావలెను. అపుడు కాటయవేమని తరువాత ఆ రాజ్యము పెద్ద కూతురైన హరిహరాంబకు సంక్రమింపవలెను. అట్లుగాక చిన్న వాని భార్యయైన అనితల్లికి సంక్రమించుటచే నిజముగా అనితల్లిమాత్రము రాజ్యాధినేతయైన కాటయవేముని కూతురని నిశ్చయించిరి. ఇక అనితల్లి కాటయ వేమునకు కూతురుగాక తన యన్న (సాపత్నీ సోదరుడు) యైన, తండ్రికన్న ముందే మృతి జెందిన కాటయకూతురని నిశ్చయింపవలసియున్నది. అపుడు మేనత్త, మేనకోడళ్లిద్దరు తోటి కోడండ్రైరి. అనితల్లికంటె హరిహరాంబ పెద్దదగుటచే పెద్దవాడైన వేమున కీయబడెను. ఆమె తండ్రియైన కాటయ దేశమేరిన ప్రభువు కాకపోవుటచే నీ రాజ్య మామెకు సంక్రమింపక చిన్నదైనను కాటయవేమ నృపాలుని కూతురగుటచే నామెచే సంక్రమించెనని ధ్రువమగుచున్నది. ఎన్ని విధముల యోజించినను హరిహరాంబ కాటయవేముని పౌత్రికాని పుత్రి కానేరదు.

## దానకాల నిర్ణయము

శా. క. 1346 (క్రీ. శ. 1424) సం. క్రోధినామ సం. కార్తిక బ 30 సోమవారమున దర్శ మహా పర్వ పుణ్యకాల మందు శివార్చనా పరతత్త్వ పరమ పవిత్రుడును తనకు ప్రేమాస్పదుడైన మంత్రియునగు హరితసగోత్ర పవిత్రుడై సకలవిద్యలు (లౌకిక, వైదిక, భక్తి, జ్ఞాన, వైరాగ్యాది సంపత్తులు) గల శ్రీ గిరి మంత్రికి పినపసల గ్రామమును అల్లాడభూపవర మను పేరున సకల భోగైశ్వర్యముల నిమిత్తము దానము చేసెను.

## దానస్థల నిర్ణయము

దాన స్థలమగు అల్లాడ భూపవరమను పేరుగల యీ పిన పనల గ్రామము (గంగా) గోదావరీ ప్రాంతమని యుదాహరించి యున్నది. ప్రస్తుత మీ శాసనము దొరకిన "పినపళ్ల" గ్రామము (గంగా) గోదావరీ నదీ ప్రాంతమున ఉత్తర తీరము 2 మైళ్ల లోపున నున్నది. అనగా నిది ప్రస్తుతము తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురము తాలూకాలోని ఆలమూరునకు ఈశాన్య దిశయందు ఒక మైలు దూరమున నున్నది.

## గ్రామ సరిహద్దులు

ఇందు హరింపబడిన (చందేపూడి) సంధిపూడి, చింతలూరు (యాతఃపూడి) తాతపూడి ఇప్పటికిని ఆ పేర్లతోనే నిల్చి యున్నవి. ఈశాన్య తూర్పు దిక్కులందున్న రెడ్లభ్యారాఖ్య క్షేత్ర మనసేమో తెలియరాదు. ఖారి=పుట్టెడు విత్తనములు చల్లెడి భూమియని యర్థము గానవచ్చుచున్నది కావున "రెడ్డి పాలు లేక రెడ్డివారి పాలు" అను నొక రకము ధాన్య మా కాలమున బండించెడి భూమియని యూహింపవలసి వచ్చుచున్నది. శ్రీనాధునికాలమున "ప్రసంగు వరిచేలు" అని వర్ణించినాడు. ఈనా డా మాట వాడుకలేక "రసంగి, బిసంగి" అను వరి వాడుక యందున్నది. అట్లే "రెడ్డివారి పాలధాన్యము" అను నొక జాతి కలదని కృషీవలులనుచున్నారుకాని ప్రత్యక్షముగ జూడలేదు. దక్షణమున "రసాలాం కచ్చందేపూడి జలాశయం" అని వ్రాయుటచేదానిని సంధిపూడికి సంబంధించిన తియ్యనీటి చెఱువు" అని చెప్పవలెనో లేక సంధిపూడి సరిహద్దున ఆదినములతో "తియ్యమామిడాడ" అను గ్రామ ముండెడిదో నిశ్చయింప ననువుగాకున్నది. ఏలననగా ప్రస్తుతము రామచంద్రపురము తాలూకాలో బిక్కవోలు దగ్గఱ "గొల్లల మామిడాడ" గ్రామమును, కాకినాడ తాలూకాలో ద్రాక్షారామమునకు సమీపమున "తర్లంపూడి మామిడాడ" యు కనబడుచున్నవి. కావున అట్లే "రసాలాంకాఖ్య" అన "తియ్య మామిడి అను పేరుగల" = తియ్యమామిడాడ అను గ్రామము నాడు చింతలూరు, సంధిపూడి, తాతపూడి మధ్యస్థమున నుండెడి దేమో యని యూహింప ననువు కలుగుచున్నది. వాయవ్యమున "అసౌ పుంత స్తరో ర్షక్క రే రవాక్। పురాణ పుంతగ శ్చోదక్ నాగ కుల్యాముపాగతః" అనుటచే నాకాలమున ఈ పినపనల గ్రామమునకుత్తరమున సమీపముగ పరమ పవిత్రమైన యొక గోదావరి పాయ "నాగ కుల్య" ప్రవహించినట్లు గవబడుచున్నది. అదియే గౌతమీ మాహాత్మ్యమునందు వర్ణింపబడిన గోదావరి సప్తశాఖలందున్న "భరద్వాజీయా" లేక భీమఖండమునందు ప్రఖ్యాతి గాంచినట్టి "కౌంతేయా" నదియో పరిశీలింపవలసి యున్నది.

## మఱియొక విశేషము

(1) ఈ దాన శాసన కృతికర్తయైన కాణ్వగోత్రోద్భవుడైన లక్ష్మీమ వల్లభార్యుల పుత్రుడగు (కుమార) వల్లభుడే కాటయ వేమారెడ్డి కాలమున కాటయవేముని భార్య మల్లాంబికచే గావించబడిన మల్లవరము (ముమ్మిడివరము) శాసనకర్తయై యున్నాడు. అనగా నీ శాసనకర్త ఈ రాజ మహేంద్రవర రాజ్యమున కాటయ వేమారెడ్డి, అల్లాడరెడ్డి, అల్లాడవేమారెడ్డి కాలములందు సుమారు ఇరువది సంవత్సరములకు పైగా దాన శాసన కృతికర్తగా నిలిచియుండి సమస్త విషయములు ప్రత్యక్షముగా గాంచిన యనుభవశాలిగా గన్పించుచున్నాడు (2) అని తల్లి రాజాధినేత్రిగా వచ్చిన వెంటనే క్రీ.శ. 1423 యిచ్చిన మార్కండేశ్వర గంగా (గోదావరి) సాక్షిద్వయముగా సర్వకర పరిహార శాసన ముదాహరించియున్నాడు. (3) ఈ శాసనకర్తయైన అల్లాడ వేమారెడ్డియే దీని కొక దిర తరువాతను, తుల్యానస గోదావరీ మధ్యస్థమైన చిన మహేంద్రవాడ—వెదురుపాక గ్రామద్వయమును "అల్లాడ వేమవరమను" పేరున దాన కర్తయై విరాజిల్లినవాడు.

## హస్తముద్ర

ఈ శాసనము తుదను ప్రత్యేక పంక్తిలో "శ్రీ మార్కండేశ్వర వేము వ్రాలు" అనియున్నది. అది శాసనాక్షరములకు భేదించియుండుటచే నీ హస్తముద్ర శాసనాక్షర లేఖరిగాక వేములే స్వయముగా (చెక్కను) లిఖించెనని రుజువగుచున్నది.

## ఇందలి విశేషము

అదివరలోని రెడ్డిరాజులందరును తమ శాసనములందు "అనవేము వ్రాలు, కోమటి వేము వ్రాలు, కాటయవేము వ్రాలు" అనితమ తండ్రులపేర్ల జతచేర్చి హస్తముద్ర లిఖించియున్నారు. ఈతడును అల్లాడవేడవర శాసనమునందును "అల్లాడ వేమాయ రెడ్డి వ్రాలు" అని హస్తముద్రను మార్చి వ్రాసియున్నాడు. అయితే ఈ శాసనమందు అట్లు "అల్లాడ వేమాయరెడ్డి వ్రాలు" అను హస్తముద్రను గావింపక తన కత్యంత ప్రియ దైవతమైన శ్రీ మార్కండేయేశ్వరస్వామివారి కంకితముగ (భక్తి పురస్సరముగ) "శ్రీ మార్కండేశ్వర వేము వ్రాలు" అని హస్తముద్రను గావించుట బాగుగా పరిశీలింపదగియున్నది.

ఆశా పరిపూరితావేశమున నాయోపినకొలది అల్పజ్ఞుడనైన నేను పెద్దల యాశీస్సు ననుసరించి ఈ శాసనమింత వరకు విమర్శనతో వివరించి లోకమునకు (పాఠకులకు) సమర్పించుకొని ఆత్మ సంతృప్తుడనైతిని. అయితే యిందలి దోషముల గమనించి పుత్ర వాత్సల్యమున దెల్పు ప్రాజ్ఞులకును, ఈ శాసనదాతలకును నా కృతజ్ఞతాభివందనములు. ఇందే విషయమైనను లవలేశమైనను విజ్ఞులకు, దేశమునకు, భావుకులకు నుపకరించుచో నా కృషికి తగిన ఫలిత మొనగూడి ధన్యత నందగలనని మనవిచేసికొనుచున్నాను.



## మొదటి రేకు రెండవ పుట

1. విశ్వంభరో వ్యా(త్) భూదారో విశ్వం పల్వలితాంబుధిః। విశ్వంభరా భృత్ సాపి యేనో
2. ద్వాహ మవాప్య భూః॥1 భవేతాం భవతాం నాగః శాంకరిః శంకరో న్వహం। దానేన సు
3. రభి స్వస్య దానేన సురభి శ్చ యః॥2 శిరోరత్నం శంభోః శశధరః కిశోరః కలయుతా దలం
4. కారే గౌర్యా ముకురతి రతే దీపతి చ యః। భిసాంకూర భ్రాంత్యా గగనతటినీ హంస ప
5. టలీ ముహశ్చంచూఘుష్టా ద్విమల విమల స్తేజిత ఇవ॥3 అస్తి స్వస్తిమ దాద్య మధ్వర
6. భుజా మంభోజనాభం మహ స్తంనాభీకమలా దభూత్ త్రిజగతాం నిర్మాణ క
7. ర్మ క్షమః॥ ముఖ్యో విశ్వసృజాం చిరంతనగిరాం విశ్రామ ఘంటాపథ
8. స్తస్యాసన్ ముఖబాహు సక్థిపదతో వర్ణాః క్రమేణోదితాః॥4 పుం
9. స స్తస్య పురాతనస్య చరణాంభోజాతజాతం కులం స్వల్పాచార విధానతోపి విమ
10. లం శుద్ధ స్వభావా దిదం। అసీత్ కించ కలౌ యుగే నృపతయః ప్రాయేణ య
11. త్రో దితా స్తేజః శౌర్య వదాన్యతా ప్రభృతిభి ర్యుక్తా గుణైః ప్రాభవన్॥5 తత్ర పంట
12. కులం నామ ప్రసూతం బహుశాఖిని। తరా వివ ఫలం రమ్యవృత్తం సరస ము
13. జ్వలం॥6 తత్రాపి ద్దొడ్డయాధీశః కులే విబుధ రంజకః। పయోధా విప సంతానో



## రెండవ రేకు మొదటి పుట

14. రాజరత్నోద్భవాకరే॥7 చింతామణి ర్జగ యతి చింతిత మేవ దత్వా సంకల్పితం దిశతి
15. కల్పతరు స్త్వనల్పః॥ కామ్యా న్నికామ వ.పి కామగవీ దదాతి దత్తే మపాధి సకలం
16. భువి దొడ్డభూపః॥8 జాయా వృషధ్వజ స్యాసీత్ చెంనాంబా దొడ్డ భూపతే1 గౌరీ ద్వి
17. షత్పురాం భేత్తు రపర్ణా సర్వమంగలా॥9 త్రయోజాతాః పుత్రా జగదుపకృతా వే
18. వ నియతాః స్వభావాత్ భాస్వంతో దలిత తమసో దొడ్డయ విభోః॥ సముద్భూతా
19. ః సర్గ స్థితి లయ విధానాయ జగతాం పరస్యాంశాః పుంస స్త్రయ ఇవ విభింనా2 గు
20. ణవశాత్॥10 పూర్వః ప్రోలయ నామాసీత్ ద్వితీయః కోటయాహ్వయ
21. ః॥ తత శ్చాల్లాడ భూపాల స్త్రయ స్తే వంశకేతవః॥11 స్వభావత స్సత్వ గుణో
22. దితత్వా దల్లాడ భూపః స్సురుషోత్తమత్వాత్5। తేషు త్రిషు శ్రీ సతతానుషంగా దతిప్రశ
23. స్తో భవ దచ్యుతాభః॥12 య మాహుః కవయో బాణం పంచబాణం తు యోషితః
24. శ్శత్రవ స్సమరే మృత్యుం మృత్యుంజయ ముప3 సకాః॥13 జయంతో నిజరూపేణ వస
25. ంతో జనరంజనే కృతాంతో యో భవే ద్యుద్ధే రేవంతో శ్వాధిరోహణే॥14 తురంగ మా
26. ర్గాన్ యవనాన్ విజిత్య పౌరస్త్య భూపాన్ పరిభూయ భూయః॥ అల్లాడ భూ
27. పః ప్రథిత ప్రతాపః క్షమా మరక్షత్ క్షమయో4 పపంనః॥15 చోడేశ వంశోదిత



## రెండవ రేకు రెండవ పుట

28. భీమలింగ నృపాల పుత్రీ చరిత్రైః పవిత్రా॥ వేమాంబికా సత్ కులజా ప్రియాసీ దల్లా
29. డ భూపస్య గుణార్ణవస్య॥16 అల్లాడ భూపతే రస్యాం చత్వార స్సూనవో భవన్। మూ
30. ర్తిమంత ఇవో పాయా మధురా స్సాగరా ఇవ॥17 తేషు వేమమహీపాలః పూర్వ జ
31. స్తదనంతరః। వీరభద్ర నృప శ్శోభా ప్రభూతా వశ్విసంర్ నిభా॥18 తరుణ సరసిజాస్యౌ
32. తా వభూతాం ప్రశస్యౌ సకల నృపవరేణ్యౌ సజ్జనానాం శరణ్యౌ। రవి హిమక
33. ర కల్పౌ రామ సౌమిత్రి తుల్యౌ వితరణ గుణ ధుర్యౌ విశ్వ విఖ్యాత శౌర్యౌ॥19 ద్వావ ప్య
34. భూతాం ప్రధనేషు శూరౌ। పాల్వోరి గోత్రార్ణవ పూర్ణచంద్రౌ। కూల
35. ంకషా స్తే కకుభాం యదీయ కీర్తి ప్రవంతీ భువి చంద్రికేవ॥20 ఆసీ ద్రా
36. జమహేంద్రనామ నగరం రమ్యం యయో ర్వారసభూ మార్కండేయ మహేశ్వర ప్రి
37. య తమం గోదావరీ రోచిసి॥ యత్ప్రాసాద సుధా సుధాకర విభా దూరావలీఢం
38. తమః పక్షే చాప్యసితే యదంతికభువాం ప్రాంతేషు న ప్రేంఖతి॥21 దేవ బ్రాహ్మణ సీవిన్న
39. యః క్షితిధరా భాస్సైః కరః కల్పితో లోభా త్త్వం సకలం చ వేమనృపతి శ్రీ వీరభద్రేశ్వ
40. రౌ। దేవ బ్రాహ్మణసా ధుభా వతనుతాం హర్యక్షత్రైః శాశ్వతం। మార్కండేయ శివ
41. ంచ గౌతమనదీం చాధాయ సాక్షిద్వయం॥22 అల్లాడ వేమక్షితి పాల చం



## మూడవ రేకు మొదటి పుట

42. ద్రో భూపో భవత్ భూరియశోతిసాంద్రః। గుణ్యై స్సమస్తై రపి రామచంద్రః। కార్యేషు
43. రాజ్యాంగ భవే స్వతంత్రః॥23 అల్లాడ వేమ నృపతా వధిక ప్రతాపే జాతే సుజాత భుజ వీ
44. ర్య వినిర్జితారౌ। భూదేవతా శ్చ సకలా దివి దేవతా శ్చ నందంతి నందన విహార కృతా
45. భిలాషః॥24 పుత్రీ కాటయవేమభూప తనయ శ్రీకాటయక్ష్మాపతేః పౌత్రీ త్ర్యంబ
46. వ శాసితు హరిహర స్యోర్వీశ చూడామణేః। తంనామ్నా ప్రథితాచ సా హరి హ
47. రా భిఖ్యా మహాభాగినీ ముఖ్యా దే వ్యభవత్ పవిత్ర చరితా శ్రీ వేమ పృథ్వీపతేః॥25
48. సంపూర్ణకాం సతతం కలంక రహితం సంన్యస్త దోషాగమం పద్మా
49 శాస్య ముపేతమిత్ర మనిశం విప్రాశిషా మాస్పదం। అల్లాడ క్షితి పాల సూ
50 ను మతులం శ్రీ వేమ పృథ్వీపతిం దృష్ట్వా తత్ గుణ విప్లుతో హిమకరః శంకే ముహు లజ్జా
51 జ్జతే॥26 నిధానం భాగ్యానాం నిధన మభిమాతి క్షితిభృతాం నివాసః పుణ్యానాం నిఖిల
52 దురితానాం నిరసనం। నిధానం సత్ కీర్తే6 నిరుపమ గుణానాం చ నిలయో నిజా ము
53. ర్వీశం కుర్వన్ జయతి నితరాం వేమనృపతిః॥27 బిరుదైస్తు రాజవేశ్యా భుజంగ నామా
54. చ వేమభూపాలః। వైరి కుల పరశురామ స్సమభూ జ్జగవొబ్బగండ సంజ్ఞశ్చ॥28
55. * అల్లాడ వేమ భూపస్య రాజ్యాంగ భరణక్షమః। మంత్రీ శ్రీ గిరినామాసీత్



## మూడవ రేకు రెండవ పుట

56. విప్రో హరిత గోత్ర (మే)॥29 త్రివర్గం పోషయన్ రాజ్యే శ్రీగిరి మంత్రి కుంజరః। రాజాన
57. ం ధీరలలితం కృత్వా జాగర్తి సర్వదా॥30 అతి ప్రశస్తః ప్రపితామహో స్య విశ్వేశ్వరో విశ్వ
58. గుణాంబురాశిః। పితామహో మాచయ మంత్రివర్యః పితా య్యలార్యో బహు
59. భాగధేయః॥31 విశ్వేశ్వరాఖ్యో విమలాంతరంగ శ్రీ లింగనార్యోర్చిత శైవ లింగః। అ
60. ధాంనవోత శ్చరిత్రైః పవిత్రః శ్రీ మాన్ గిరీశోస్య బుధాః పితృవ్యాః॥32 కౌండిన్యగోత్రా
61. ం బుధి మాతనేందు రాసీత్ చ మాతుః ప్రపితామహో స్య। ప్రోలాభిధానః పురుషా
62. గ్రగణ్య శ్రీ పెంమనో మాతృపితామహ శ్చ॥ 33 శ్రీ వల్లభాఖ్య స్సచి
63. వ ప్రశస్య మాతామహో యస్య మహామహాశ్చ। అనన్య సాధారణ
64. భాగధేయా సాధ్వీ పవిత్రా జననీ చ లక్ష్మీ మ్మః॥ 34 శ్రీమా నెఱ్ఱియ నామధేయ సచివ శ్రీ
65. మాచిరాజ స్తతో విద్వాన్ వల్లభ సంజ్ఞితో గుణనిధి ర్ధీమాం స్తథా మాధవః। చత్వా
66. రో స్య చ సోదరా స్సమభవ న్నాచార విద్యాధికా నీతిజ్ఞాః పురుషోత్తమా సాగర న్ర
67. పోపాయ్యై స్సకాయ్యై స్సమాః॥ 35 నిఃశంకం వీర శైవో నిజనయనయుగం పాట
68. యిత్వా చకాయత్ శ్రీశైలేశం దేవదేవో వృతిముదితమనాః సోక్షి దత్త్వైక మస్మై। నే
69. త్ర స్యాన్యస్య సిద్ధ్యై త మనయ దమలం విస్మయ శ్రీ గిరీశాభ్యాశం భక్తస్య



## నాల్గవరేకు మొదటి పుట

70. కీ త్త్యైర్ స చ నయన మదా దస్య శస్యః పితృవ్యః॥36 మార్కండేయ మహేశ్వరస్య పురతో
71. భూదేవ భూపాంతికే స్వామి ద్రోహ మృషాపవాద ముదితం స్వస్య స్వవర్గస్య చ। స
72. ం మాష్టార్ణం స్వయ మగ్నిదివ్య మనఘః కృత్వైక ఏవాఖిలా నాత్మానం చ విశోధ్య దీవ్య
73. [7]రితరాం మంత్రీశ్వరః శ్రీగిరిః॥37 స్వస్వామికార్యం పరమేశ్వరస్య పూజా బుధానాం
74. పరిపోషణం చ। గంగాంభసి స్నాన మథాం[8] నదాన మాసీ దమాత్యస్య నజా[9] క్రియా
75. స్య॥38 శ్రీ గిరౌ ద్విజవరే గుణాకరే శ్రీ గిరౌ స్వయ ముపేత్య దివ్యతః। శ్రీ గిరే స్తట
76. ఇవేశ్వరో స్య చ శ్రీగిరే మానసి వస్తు మీహతే॥39 సజ్జనోపకరణో విశా
77. రదః ప్రజ్ఞయా పరిగృహీత శారదః। విద్యయా విమలయా సనందన
78. ః శ్రీ గిరి విజయతే సనందనః॥40 ఆధారో విదుషాం నిధిః కులభువాం సర్వాశ్రియా మా
79. శ్రయో భారత్యా భవనం మతేః పరిణతి ర్నీతే శ్చ విశ్రామభూః। దీనానాం శరణం ఖ
80. ని శ్చ యశసో ధర్మస్య ఘంటాపథో మంత్రీ శ్రీ గిరి సంజ్ఞితో విజయతే దీర్ఘాయు
81. షా మాదిమః॥41 ఆచారం నియతా స్తువంతి కవయో వాచం చ రూపం స్త్రియ స్సౌ
82. జన్యం సుహృద శ్చ[10] భంధు జనతా స్వాజన్య మార్యా ధియం। శైవాః శంకర పూజన
83. ం నయవిదో భూపక్రియా[11] చతురిం త్యాగం చార్థిజనాః క్షమాం చ కృపణా మంత్రి



## నాల్గవరేకు రెండవ పుట

84. ప్రభోః శ్రీ గిరేః॥42 కులీన మాచార పరం శివానాథరతం స్వకార్య క్షమ మాశ్రితంచ। అ
85. చింతయక్ పాత్ర మిమం పవిత్ర మల్లాడ వేమక్షితిపో గుణజ్ఞః॥ 43 శాకే రసాబ్ధి విశ్వే
86. సోమదినే క్రోధి కార్తీకే దర్శే। అల్లాడ వేమభూపః పినపనలం గ్రామ మదిత సచివా
87. య॥44 శ్రీగిరినామ్నే విదుషే హరితా యాల్లాడ వేమభూపవరం। కృత్వా భోగైశ్వర్యై
88. గంగాప్రాంతస్థ మాశశాంకాకర్ణం॥45 *॥ అస్యగ్రామస్య లిఖ్యంతే సీమా స్సామంత
89. సమ్మతాః। పూర్వస్యాం రెడ్ల ఖార్యాఖ్య క్షేత్ర ప్రత్యక్[12] సముద్భవః॥46 దక్షిణా ముఖతా
90. ం యాతః పుంతో దీర్ఘో మహాస్ఫుటః। ఆగ్నేయ్యాం దిశి వల్మీకో మహా
91. ం స్త్రిగ్రామ సంధిజః॥47 దక్షిణస్యాం రసాలాంక శ్చందేపూండి జ
92. లాశయం। ప్రవిశ్య చోర్ధ్వితః పుంత శ్చింతలూరో న్ము పుంతగః॥48 నైఋత్యాం దిశి
93. సాశ్వత్థ జంబూ వృక్ష సమన్వితః। సతాక వల్మీకయుర(తః) పుంతో నిస్సంశయ
94. ం స్థితః॥49 ప్రతీచ్యా మస్య[13] చండాల వాటి పూర్వ్వాతటాకయుక్। తతోశ్వత్థ యుతః పు
95. ంతో నూతనో రాజసంమతః॥50 వాయవ్యా మ స్యసౌ పుంత స్తూరో నగాక్కవిరే రవా
96. క్। పురాణ పుంతగ శ్చోద క్ నాగకుల్యా ముపాగతః॥51 ఉత్తరస్యాం తథా పుంత



## ఐదవరేకు మొదటి పుట

97. వ్యాప్యరాజ తటాకయుక్। ఐశాన్యాం రేఖ్లా భాకీణాం పశ్చిమః పుంఠ ఊరికః॥52 ఈ
98. పాలన సుకృత స్యాపహరణ దోషస్య ప్రకాశనాయ చేయన పురాణ శ్లోకా
99. లిఖ్యంతే॥53 దానపాలనయో ర్మధ్యే దానాత్ శ్రేయో నుపాలనం। దానాత్ స్వ
100. ర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥54 బహుభి ర్వసుధా దత్తా బహుభిః సరి
101. పాలితా। యస్య యస్య యదా భూమి స్తస్య తస్య తథా ఫలం॥55 ఏకైకాపి స్థిరో ధర్మః
102. పాలనీయః ప్రయత్నతః। శత్రు రేవహి శత్రు స్యా ద్ధర్మః శత్రుర్న కస్యచిత్॥56 స్వ
103. దత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం। షష్టిర్వర్ష సహస్రాణి
104. విష్ఠాయాం జాయతే క్రిమిః॥57 తటాకానాం సహస్రేణ చాశ్వమేధ శతేన చ। గవాం కో
105. టి ప్రదానేన భూమిహర్తా న శుధ్యతి॥58 న విషం విష మిత్యాహు ర్బ్రహ్మస్వం విష ముచ్య
106. తే। విష మేకాకినం హంతి బ్రహ్మస్వం పుత్ర పౌత్రకం॥59 కించేత ద్వార్ప వచనం॥60 అల్లాడ వే
107. మ భూపోయం యాచతే భావినో నృపాన్। రక్ష్యై భవద్భి ర్మద్ధర్మ స్సర్వ సాధారణో
108. ప్యయం॥61 శ్రీరామచంద్రేణా ప్యేవమేవోక్తం॥62 సామాన్యోయం ధర్మసేతు ర్నృపాణాం
109. కాలే కాలే పాలనీయో భవద్భిః। సర్వా నేవం భావినః పార్థివేంద్రాన్ భూ



## ఐదవ రేకు రెండవ పుట

110. యో భూయో యాచతే రామచంద్రః॥63 కృతం14 శ్రీవల భేనేదం శాసనం సద్విశా
111. సనం। కణ్వ గోత్రేణ పుత్రేణ లక్ష్మీ శ్రీవల్లభార్యయోః॥64 శ్రీ వరాహో రక్షతు॥65
112. శ్రీ (మా) ర్కండేశ్వర వేము వ్రాలు॥ 66

---

శ్లోకములు:—1, 2 అనుష్టుప్పు. 3. శిఖరిణి. 4. శార్దూల విక్రీడితము. 6, 7 అనుష్టుప్పు. 8. వసంతతిలక. 9. అనుష్టుప్పు. 10. శిఖరిణి. 11. అనుష్టుప్పు. 12. వాతాంగి (ఉ. జా.) 13, 14. అనుష్టుప్పు. 15. 16. వాతాంగి (ఉ. జా.) 17, 18. అనుష్టుప్పు. 19. మాలిని. 20. ఇంద్రవజ్ర. 21, 22. శార్దూల విక్రీడితము. 23. ఇంద్రవజ్ర. 24. వసంతతిలక. 25. శార్దూల విక్రీడితం. 26. శార్దూల విక్రీడితం. 27. శిఖరిణి. 28. ఆర్యావృత్తం (64 మాత్రలు). 29, 30. అనుష్టుప్పు. 31. వ్యత్యస్తపదజాతి (1—3 ఉ. వ. 2—4 ఇ. వ.) 32, 33, 34. ఇంద్రవజ్ర. 35. శార్దూల విక్రీడితం. 36. స్రగ్ధర. 37 శార్దూల విక్రీడితం. 38. ఇంద్రవజ్ర. 39, 40 రథోద్ధతము (పదాంతిక). 41, 42 శార్దూల విక్రీడితం, 43. వాతాంగి (వైపరీత్యోపజాతి). 44. ఆర్యావృత్తం. 45. అనుష్టుప్పు. 53. గద్య. 54, 61 అనుష్టుప్పు. 62. గద్య 63. శాలినీ. 64. అనుష్టుప్పు. 65. గద్య. 66. ఆజ్ఞప్తి వ్రాలు.

## స వ ర ణ లు :

1. భూపతే=భూపతేః 2. విభింనా=విభిన్నా. 3. ముపసకా=ముపాసకా 4. పపంనః=పపన్నః. 5. సంనిభా=సన్నిభా 6. సత్కీర్తేర=సత్కీర్తేః 7. దీవ్యరితరాం=దీవ్యతితరాం. 8. మధాంనదాన=మధాన్నదాన. 9. నజాక్రియాస్య=నచాక్రియాస్య. 10 భంధు=బంధు. 11. క్రియాచతురిం=క్రియాచాతురీం. 12. సముద్భమః=సముద్భవః. 13. మన్యచండాల=మన్య చండాః. 14. వలభే=వల్లభే.

---

# మచ్చలు

శ్రీమతి ఆర్. వసుంధర

తెల్లవారింది. నిద్రనుంచి మెలకువ వచ్చినా ప్రక్క మీదనుంచి లేవాలని బుద్ధిపుట్టలేదు. రోజూ అంతే. ముందుగా లేచి పాపకూ, బాబుకూ పాలు కాచిపెట్టి, మా యిద్దరికీ కాఫీపెట్టి వాళ్లలేపేసరికి, ఏడుగంటలకంతా తయారుగా వుండాలి. రోజూ ఆ వేళకు 'ఏం, కాసేపు ఆలస్యమైతే' అనిపిస్తుంది. నాకు ఏ జబ్బొచేస్తే ఏమౌతుందేమిటి? అప్పుడెల్లా జరుగుతుంది? ఏడు గంటలకు పాలూ, కాఫీ లేవని ముగ్గురూ వెర్రిగంతులు వేసుకుంటారు కాబోలు—అనుకున్నాను. నవ్వు వచ్చింది.

జబ్బుమాట గుర్తుకొచ్చేసరికి అప్రయత్నంగానే చేతి వ్రేళ్లు చూసుకున్నాను. ఎడమచేతి వ్రేళ్లకూ, కుడిచేతి వ్రేళ్లకూ నిన్న ఎంత భేదం వుందో యివాళా అంతేవుంది. ఈ మధ్యన ఏమంత తేడా రాలేదు.

కొంచెం వచ్చిందా?

ఏమో!

ఎడమచేతివేళ్లు సన్నగా వుంటాయి. కుడిచేతివేళ్లు కణుపులదగ్గర కాస్త మొద్దుబారి నట్లుగా మచ్చలతో వుంటాయి. వాటిని చూసినాకు ఎప్పుడూ అనుమానం వస్తూ వుంటుంది—కుష్ఠువ్యాధి ఏమైనా ప్రథమదశలో వుందేమోనని. దానికి ముందుగా కణుపులు మొద్దుగా అవుతాయని విన్నాను.

కుష్ఠువ్యాధిఅంటే నాకు చాల అసహ్యం. ఎక్కడచూసినా ఆ చీదర మొహాలే యీ చిత్తూరునిండా. అబ్బ, తలచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది! వీడికి వేలులేదు. దానికి కాలులేదు. వాడి చేతులనిండా పొడలాగా మచ్చలు! ఛీ, ఛీ. దేశంలోవుండే కుష్ఠు వాళ్లకందరికీ అడుక్కోవటానికి యీ వూరే దొరికినట్లుంది—ఆ దరిద్రపు రోగం వూరంతకీ అంటించడానికి! వీళ్లందర్నీ కట్టగట్టి తగలేస్తే పీడా వదిలిపోతుంది!

అట్లా అంటే వూరుకోదు లోకం. సానుభూతి, సానుభూతి— ఏదీ నీ సానుభూతి? అని కేకలేస్తుంది.

నాకు లేదు సానుభూతి.

అందుకని నన్ను కూడా తగలేస్తారా?

ఏమిటో పాడువ్రేళ్లు—యీ కుడిచేతివేళ్లు—మొద్దుగా యింతకీ కారణం ఆ వెధవ్వంటే! ఆవాలూ, పచ్చిమెరపకాయలూ పెటపెటలాడి నామీదే చిందుతాయి. అవెటి ఎక్కడనుండి బయటకొచ్చినా నా చెయ్యి అక్కడేవుంటుంది ఎలాగో. గంజి వార్చితే అదీ అయస్కాంతం దగ్గరికి పరుగెత్తుకొచ్చే యినుప ముక్కలాగా నామీదికే వస్తుంది. పాలు పొంగుతూవుంటే పాత గుడ్డ చుట్టుప్రక్కల్లో వుండదు గిన్నెదించటానికి. మొదట్లో చెయ్యి కాల్తుందని భయపడి, ఏం చెయ్యాలో తెలియక, పాల పొంగునీ గిన్నెనీ పొయ్యినీ కూడా ముట్టుకున్నాను.

యిప్పు డట్లా చెయ్యను. ఎదురుగ్గా నిలుచుని 'ఫో! పాడు పాలా, నీ యిష్టం వచ్చినట్లు పొంగి చావు!' అను కుంటాను. నీళ్లు దగ్గర్లోవుంటే చల్లుతాను. లేకుంటే లేదు. పొంగు పొయ్యిలో పడి పొయ్యి ఆరిపోతే, అదేపోతుంది పొంగు.

యింతకూ ఆ వెధవ్వంటంటే నాకు సరిపడదు. మా అమ్మ నాకు నేర్పలేదు. ఆవిడ చాలా Enlightened మనిషి—బాగా చదువుకుంది - అన్నీ తెలుసు ఆమెకి—హ, హ, హ చాలా తెలిసిన మనిషి మా అమ్మ!

అందుకే మా నాన్నని పెళ్లి చేసుకుంది. మా నాన్న డెప్యూటీ కలెక్టరుగా చాలా ఏళ్లువుండి రిటైరయ్యారు. కలెక్టరుగా ప్రమోషన్ రాలేదు. ఎప్పటికైనా కలెక్టరు భార్య నౌతానని అనుకునివుంటుంది. హ, హ, హ, ఎంతతెలిసినావిడైనా ఆయన కర్మని నడిపే శక్తి లేదుగా! లంచాలు ఏమంతగా తీసుకోకపోయినా కర్మచాలక ఆ తీసుకున్న కొద్దిపాటివే బయట కొచ్చి బ్లాక్ మార్కు పడింది మా పితృదేవులకు. మా అమ్మ హ, హ, అంత తెలిసీ చదువుకొనీ దీనికి ఏం చేస్తుంది? బ్రూటస్ పొడిచినప్పటి సీజర్‌లాగా గుండెల లోపలికి లోతుగా దెబ్బతిని వుంటుంది. తినటమూ మంచిదే. ఎదురు దెబ్బలు తగులుతూవుంటే జ్ఞానం, వేదాంతం అన్నీ తెలుస్తాయంటారు గదా!

మమ్మల్నిద్దర్నీ—నన్నూ, సూర్యాన్నీ—చాలా జాగ్రత్తగా పెంచింది ఆమె. జాగ్రత్తగా ఆలోచించి కన్నదికూడా. ఆవిడే చెప్పింది. Facts of Life — జీవిత సత్యాలు—యుక్త వయస్సు రాగానే నాకు చెప్పినప్పుడు. తర్వాత సూర్యానికీ చెప్పివుంటుంది—వాడు మగవాడు ఎందు కయ్యాడో నేను ఎందుకు కాలేదో. Effeminate వెధవ—ఆణంగి కోణంగి—వాడికి అమ్మ చెప్పేదాకా ఏమీ తెలిసుండదు.

బుద్ధిమంతుడువాడు—ఎప్పుడూ బుద్ధిగా చదువుకోవటమే పని. అందుకే అమ్మకీ, నాన్నకీ ముద్దుల కొడుకు వాడు.

అంతా Hypocrisy. చదువుతప్ప ఏమీ తెలియకుండా వుండటం మాంఛి బుద్ధి అవుతుందా? మిగతాదంతా తప్పయినట్లు, ప్రపంచంలో యింకేమీ లేనట్లు! ఆవిడ నాన్న దగ్గరికి వచ్చినప్పుడంతా కళ్లు మూసుకొని ఏమీ జరగటం లేదనుకొనివుంటుంది. మేము ఆవిడ తల్లోంచీ పుట్టాం—తలకాయలోంచి!

లోకమంతా ప్లాను ప్రకారం నడుస్తుంది ఆవిడకి—ఇండియా, పంచవర్ష ప్రణాళికల ప్రకారం నడిచినట్లు! మన గవర్నమెంటుకంటే ఆమే తెలివైంది. పెళ్లయినాక అయిదేళ్లకి నన్ను కనాలనుకుని కన్నది. తరువాత అయిదేళ్లకి వాడిని, సూర్యాన్ని కనాలనుకుని కన్నది. ఆ తరువాత వద్దనుకుని మానేసింది.

నన్నూ అట్లాగే కనమని చెప్పింది నేను పెళ్లిచేసుకున్నాక. నేను విననని తెలుసు. బాధ్యతవుంది గనుక చెప్పింది. అసలు నేను పెళ్లి చేసుకోవటం ఆవిడ ప్లానును భగ్నం చెయ్యాలని చేశాను. కాదు, నేను పెళ్లి చేసుకోవటం ఆవిడ ప్లానును దెబ్బతీసింది.

నాకు పదిహేనేళ్లు రాగానే, ఆవిడ యింకా నేను పసిపిల్లనని ఫ్రాకులూ, పరికిణీచొక్కాలూమధ్య వూగిసలాడుతుండగానే ప్రక్కయింటి మేడమీద అబ్బాయిని ప్రేమించి ఉత్తరాలు రాశేశాను. ఆ యబ్బాయినితప్ప యింకోళ్లని చేసుకోనని మొండిపట్టు పట్టాను. వూరంతా గోలయిపోయి ఆవిడ దిగిరాకతప్పలేదు. అప్పటికీ చేతనయినంతా చెప్పిచూసింది. మంచి ఇంజనీరుకో, డాక్టరుకో యిచ్చి చేస్తానన్నది. అప్పుడు డబ్బూ మనుష్యులూ పుష్కలంగా వుంటారు, రాజభోగంవుంటుంది. బి. ఏ. పాసు కాలేక తప్పుతూ కట్టుతూ తప్పుతూవుండే బడుద్ధాయిని చేసుకుంటే తరువాత నానాపాట్లూ పడతాను. వాకబుచేస్తే ఆ యబ్బాయికి ఆస్తి కూడా లేదని తెలిసింది. అప్పుడు ఆవిడ ఆరాటం, బాధ చూస్తుంటే నాకు లోపల మహా సంతోషం కలిగింది. నా కోసరమా యీ ఆరాటం? తన తలకాయలోని కూతురికోసం. నన్ను ఇంజనీరుకిస్తే యీవిడ హోదా పెరుగుతుందట, ఎట్లానో!

అంత జాగ్రత్తగా పెంచిన నేను యిట్లా తయారు కావటం ఆవిడకి అర్థం కాలేదు. ఎంత ప్లాను ప్రకారంచేసింది అన్నీ! ఫ్రాయిడ్ కాంప్లెక్సులూ, ఆడ్లర్ కాంప్లెక్సులూ అన్నీ చదివి మరీ పెంచింది. నేను చేసే ప్రతి పనికీ, మాట్లాడే ప్రతిమాటకూ వెనుక ఏం కాంప్లెక్సువుందోనని వెతికి వెతికి జాగ్రత్తపడేది. అమ్మా, నాన్నా చీకటితప్పును ఏ నిద్రలోనో గభాల్న లేచిచూస్తే— సగం నిద్రలో, మసగ్గా—అప్పుడు గొప్ప ఫ్రాయిడ్ కాంప్లెక్సు వస్తుందట. ఆ సూర్యం గాడు

అట్లాగ వున్నాడేమిటని చిన్నప్పుడు అడిగితే అదిరిపోయింది. తరువాత అన్నీ వివరంగా చెప్పింది.

ఆఖరికి నా సంగతి బాగా తెలిశాక, ఎంతో ఆలోచించి యిదంతా లష్కర్ చెప్పినట్లు మొదటి పిల్లంకువచ్చే Dethronement —రాజ్య పదవీ భ్రష్టత్వం—వాడికు కాంప్లెక్సు అని నిశ్చయం చేసుకుంది. సూర్యాన్ని యింకొంచెం, యింకో అయిదేళ్లు ఆలస్యంగా కనివుంటే బాగుండేది. పొరపాటై పోయింది అని నాన్నతో చెప్తుంటే విన్నాను. నాన్న ఒప్పుకున్నారు. ఒప్పుకోక ఏం చేస్తారు గనుక—కలెక్టరన్నా కాలేక పోయాక!

సూర్యంగాడు ఎప్పుడదేమో కట్టికలు—యిది నా చదువు కొంటున్నాడు. మా ఆయనను తనకు తెలిసిన వాళ్లద్వారా కలెక్టరాఫీసులో గుమాస్తాగని యిప్పించారు నాన్న. ఆరేళ్లనుంచీ గుమాస్తాగా వుంటున్నారు. మొదటి రెండేళ్లలోనే బాడిసీ, పాపనీ కనేశాను. తరువాత పోషించలేక మానేశాను. పిల్లల్తో మహా చీకాకు— అమ్మా పాలు—పొట్టకి పెయ్యి వచ్చేశాకే— ఒకటి కొట్టుకున్నాము — ఇద్దరితో వచ్చేసరికి సంసారగోళం అయిపోయింది. ఆయనాలా వంట మనుష్యులా వుండటానికి ఆయన కలెక్టరాఫీసులో గుమాస్తాయేగదా.

అప్పుడే ఆయనవెళ్లి తలుపు తీసి వచ్చివుంటారు. పని మనిషి పాలు లోపలపెట్టి అంట్లు తోమేసి వుంటుంది.

ఈ కుడిచేతివేళ్లకివుండే మచ్చలు ఆవిరి తగిలిన తాలూకా లేక కుష్ఠుపాడలా అని తెలియలేదు, దేవుడున్నాడా లేడా అని తెలియనట్లు. ఒక్కోరోజున అవి కుష్ఠుమచ్చలే ననుకుంటాను. ఆరోజున పాలుపొంగిపోతై. చేతులుకాలి తీరతై. పిల్లలు మహా చీరాకుపెట్టి తిట్లూ దెబ్బలూ తిని ఏడుస్తూవుంటారు. వాళ్లు ఏడుస్తే నేనూ ఏడుస్తాను. ఎందుకంటే వాళ్లు నా దగ్గరకేవచ్చి నన్ను పట్టుకొని అమ్మా అని ఏడుస్తారు గనుక. అట్లా ఏడవటం చాలా ఉదాత్తంగా వుంటుందిగనుక.

ఒక్కోరోజున అవి ఒట్టి ఆవిరి మచ్చలే అనుకుంటాను. ఆరోజున చాల ఉల్లాసంగా వుంటుంది. డబ్బుంటే పిల్లల కేమైనా పిండివంట చేస్తాను. ఆయన ఆఫీసులో కష్టపడ్డందుకు సానుభూతి కూడా చూపిస్తాను. నా సానుభూతితో ఆయనకేం పనిలేదు. నేను తిట్టినా సానుభూతి చూపించినా ఒకటేగా చిరునవ్వు సమాధానం. ఏమీ తెలియదు. వట్టి గుమాస్తా.

ఇవాళ ఆ మచ్చలు కుష్ఠుపాడలాగే కన్పిస్తున్నాయి. నిన్ననే నాన్న ఉత్తరం వ్రాశారు తిరుపతినుంచీ. దగ్గర్లోకి వచ్చాం గనుక ఒక్కసారివచ్చి వారంరోజులుండి పొమ్మని. సూర్యంగాడు యం. యస్సీ.లో చేరాడట. హాస్టల్లోవుంటే ఆణంగి వెధవ కందిపోతాడని ఒచ్చారు. దీపావళి దగ్గరకొచ్చింది. ప్రతిపండగకీ రమ్మని వ్రాస్తారు విధాయకంగా. పెళ్ళయి ఆరేళ్లవుతున్నా యింతవరకూ ఒక్కసారికూడా పుట్టింటికి వెళ్ళలేదు నేను. నామ జన్మలా, రైళ్లా యిష్టంలేదు.

కాన్పులకూడా చివరిదాకా ఎట్లాగో గడిపేసి, ఆస్పత్రిలోచేరి కనేసి యింటికొచ్చాను. తొలిసారి మొదటిసారి అమ్మ వచ్చి పదిరోజులుండిపోయింది. రెండోసారి ఆయన స్నేహితుల తాలూకు వారంరోజులసాయం వుండింది. అప్పట్నుంచీ మళ్లీ పని, పని. ఆయనా సగం చేస్తారు పని—అర్ధరాత్రి పిల్ల ఏడిస్తే పాలుపట్టడం, ఉత్పుడ్డలు మార్చటంలాంటివి. గుమాస్తాలయి చెయ్యలేం చేస్తారు—ఏం కలెక్టరా?

'అమ్మా, లేమ్మా—పాలివ్వవే' బాబు గోల ప్రారంభించాడు.

నాకు పెద్దరోగం వస్తుంటే వీడికి పాలు కావాలిట. వెధవ!

'కాసేపున్నాక యిస్తాలే, ఫో' అన్నాను.

వీధిలోకి పరుగెత్తాడు.

అసలు యీ గోలపిల్లలు, పాడుపిల్లలు లేకుంటేనేం? న్యూసెన్సుతప్ప మరేమన్నా పాసిటివ్ లక్షణం వుందా? నాక్కు సగం రోగం వీళ్లనుంచీనే పుట్టుకొస్తోంది. వాడికీ పూర్తి attention కావాలి. దానికీ పూర్తి attention కావాలి. వంటకీ పూర్తి attention కావాలి. ఆయన గుమాస్తా గనుక, అక్కర్లేదు గనుక, సరిపోయింది. నేను ఒక్కదాన్ని, మూడు పూర్తి attention లు ఎట్లాగ supply చేస్తాను? అదే రోగం!

ఇప్పుడు గభాల్ని వీళ్లు లేకుండాపోతే? దొంగలెత్తుకు పోతే—రోగమొచ్చి పోతే—

అప్పుడు గోలేవుండదు. ఇల్లంతా ప్రశాంతంగా వుంటుంది. నేను తొమ్మిది గంటలకు నిద్రలేస్తాను!

''ఢాం''

అబ్బ, ఏమిటది? ఒళ్లే అదిరిపోయింది. పిడుగుపడ్డదా ఏమిటి? మబ్బులూ, మెరుపులూ లేకుండానే? ఎంత పెద్ద శబ్దం!

అది కాస్తా లేచేసింది. ఇహ గోల మొదలు. ఇంకాస్సేపు నిద్రపోతే ఏం మునిగిపోతుంది?

అబ్బ, ఒళ్లు అదురు తగ్గనేలేదు.

''ఏమిటండీ ఆ శబ్దం?''

''ఇదుగో, చూసొస్తా.....ఏదో పెద్ద టపాకాయ వేసినట్లున్నారు'.

''అమ్మా, అమ్మా......పిల్లకాయలు డబ్బాలో మందు పాడి పెడితే పేలిపోయిందంట. మన వాకిటిముందే...... నలుగురో ఏమో పొయ్యారంటుండారు'' పనిమనిషి లక్ష్మి.

'ఒళ్లు అదిరిపోయిందే......మన వాకిటిముందేనా?'

'మన బాబిగాడేడీ, రాధా?'

'అయ్యో, అయ్యో, వాడు బయటికి పోయాడండీ. అట్లా చూడండీ.....లక్ష్మీ పోయిరావే......అయ్యో నా నాయనా, నా బంగారుస్వామీ......నా చందమామా......'

'వుండు, వుండు, నేను చూసొస్తాను......ఖంగారు పడకు' ఆయన ఖంగారుగా బయటికి వెళ్తున్నారు.

'అమ్మా, బయటే......వాళ్లు చచ్చిపోయారే' బాబిగాడు భయపడి లోపలికి వచ్చాడు.

'వెధవా, నన్ను వూరికే హడలగొడితివిగదరా.....నిన్ను చంపేస్తానుండు........' వాడిని చంపటానికి ప్రక్కమీది నుంచీ లేచాను.

ఆయన వచ్చి పట్టుకున్నారు. 'రాధా, వూరుకో..... వాడసలే భయపడిపోయివుంటే........'

ఆయన భుజమ్మీద వాలిపోయాను. వూరికే ఏడుపొచ్చింది........ఆపుకోలేకుండా......

ఆయన నా వీపుమీద చిన్నగాతట్టి 'కాసేపు కూర్చో...' అదేపోతుంది.........భయపడ్డావు......' అన్నారు.

'కాదండీ......నాకు......నాకు..... చేతివేళ్లకు మచ్చలు వచ్చాయండీ.......కుష్ఠురోగమో ఏమో' అంటూ ఏడిచాను.

'డాక్టరు దగ్గరకుపోయి చూపెట్టుకుందాంలే ..ఏడవబోకు.....వూరికే భయపడితే ఎట్లా?... ' అన్నారు.

వెంటనే భయపడి దూరంగా జరగటం కూడా తెలియదు. వట్టి గుమాస్తా!

---



# మేఘసందేశము - మేఘుని మార్గ సమన్వయము

శ్రీ ఎ. రాజగోపాలరావు

**1966** డిసెంబరు భారతిలో ప్రచురితమైన 'మేఘ సందేశములో మేఘుని మార్గము— భౌగోళిక వాతావరణ విశేషములు' అను వ్యాసము జిజ్ఞాసాస్ఫోరకమైనట్టిది. పాఠకలోకమునకు దాని నందించిన భారతి అభినందనీయ. ఆ వ్యాస రచయితగైకొనిన శ్రమయు మెచ్చదగినది. కాని అవ్యాసాంతమున వెలువరింపబడిన యూహాపోహములు సమన్వయములు కాజాలమిచే విచారించి, వానిని క్రమపరచుటకై నేనొనర్చిన ప్రయత్నము యొక్క యక్షర రూపమీ ప్రకృత వ్యాసము. దీని యుద్దేశము సత్యాన్వేషణము. విమర్శకాదు.

భారతదేశ మాసేతుశీతాచల మొక్కటే సమగ్ర భూఖండమను భావము త్రేతాద్వాపర యుగమునుండియే స్పష్టముగ నున్నది. ఇతిహాస పురాణము లీభావమును ప్రతిఫలింపజేయుచున్నవి. దేశ మేకచ్ఛత్రాధిపత్యము క్రింద లేని యప్పుడును ఈ భావము భారతీయుల భావనాక్షేత్రముల యందు అంతస్స్రోతస్వినియై యలరారుచునే యుండినది. కాళిదాసీ దేశ చరిత్రలో స్వర్ణయుగమున నివసించిన వాడు. కవులలో పేరెన్నిక గన్నవాడు. ఆతనికిగల కాళీవరప్రసాదాది విశేషములం నమ్మజాలకున్నను, ఆత డతి ప్రజ్ఞావంతుడను విషయము నెవ్వరును కాదనలేరు. నాటి యుజ్జయిని సర్వ శాస్త్రములకు కేంద్రము. ఆనాటి దేశము సుభిక్షము, శాంతి యుతము. వర్తక వ్యాపారములు, దేశమున గల పలు ప్రాంతముల మధ్య రాకపోకలును, అభివృద్ధి చెందిన కాలమది. రాజాస్థానము నుండుటచే నెవ్వరికైన, వినుటవలనగాని, ప్రత్యక్షముగ పయనించి గాని దేశమందలి విశేషముల నెఱుంగుట కవకాశములు మెండు. శాస్త్ర విజ్ఞాన మభివృద్ధి చెందిన కాలమున, కవులకును శాస్త్ర పరిచయ ముండితీరును. శాస్త్రీయ దృష్టిని,కావ్య శిల్పములను మేళన మొనర్చి యుత్తమ కావ్య సృష్టి నొనర్చుట ప్రజ్ఞావంతులగు కవుల కసాధ్యము కాదు. కేవల శాస్త్ర విశేషములు కావ్యమునకు శోభ నొసంగవు. అట్టివానిని సూచన ప్రాయముగ కావ్యమునం దంతర్గత మొనర్చు యందే యుత్తమ కవుల చాతుర్యము కన్పించును. 'మేఘ సందేశము' నందును భౌగోళిక ప్రకృతి వాతావరణ విశేషాంశము లిట్టివిగనే కన్పట్టును.




పూర్వ మేఘమున వర్ణితమైన మేఘునిమార్గ మీ క్రింది ప్రదేశములను, పట్టణములను స్పృశించుచున్నది. పూర్వ వ్యాసకర్త వానికి నేడుగల వ్యావహారిక నామముల నొసగి యుండెను. మఱియు కొన్నిటి నుల్లేఖింపలేదు.

| | |
|---|---|
| రామగిరి | నాగపూర్ సమీపమునగల రాంటెక్. ఇది వైన్‌గంగ సమీపముననున్నది. |
| మాలక్షేత్రము | —— |
| ఆమ్రకూటపర్వతము | మహాదేవకొండలు |
| వింధ్యపాదము | వింధ్యలోయ |
| రేవానది | నర్మదానది. |
| దశార్ణదేశము | భోపాల్— బుందేల్‌ఖండ్ |
| విదిశాపట్టణము | బెస్‌నగర్ లేక భిల్సా. |
| వేత్రవతీనది | బేట్వా |

| | |
|---|---|
| నీచైర్గిరి | —— |
| నిర్వింధ్యానది | —— |
| అవంతిదేశము | —— |
| విశాలానగరము | —— |
| శిప్రానది | షిప్రానది |
| ఉజ్జయిని | ఉజ్జయిని |
| గంభీరనది | —— |
| దేవగిరి | —— |
| చర్మణ్వతీనది | |
| (దశార్ణదేశము) | చంబల్ నది |
| దశపురము | మాండసార్. |
| బ్రహ్మావర్తము | హరియానా ప్రాంతము |
| సరస్వతి,దృషద్వతి | రావి సట్లెజ్ నదులకు సమానాంతరముగ ఆగ్నేయముగ ప్రవహించిన నదులు. ఇవి నేడు లేవు. |
| కురుక్షేత్రము | కురుక్షేత్రము |
| 'శైలరాజావతీర్ణాం.. | |
| జహ్నోఃకన్య' | హరిద్వారము వద్ద గంగానది. |
| అచలం.....గౌరంతుషారైః | హిమాలయము |
| హంసద్వారం....క్రౌంచ | |
| రంధ్రమ్ | —— |
| మానసము | మానస సరోవరము |
| కైలాసము | కైలాసశిఖరము |
| అలక | (ఊహాకల్పితము మాత్రమే). |

మేఘుని మార్గమును పటములో పరిశీలింపదగును. భౌగోళికాంశములు కాళిదాసుని కాలమున నెట్లుండినవో నేడును అట్లేయున్నవి. నేటి వ్యవహారమునగల పేరులు మారియుండ వచ్చును. కాని మేఘ సందేశమున పేర్కొనబడిన ప్రదేశము లను నేడును గుర్తింప వీలగును. ఇది కాళిదాసుని భౌగోళిక విజ్ఞాన నిష్ణాతత కొక చక్కని నిదర్శనము. ఏయే ప్రదేశము లెచ్చటెచ్చట నున్నవో ప్రత్యక్షముగ గాని పరోక్షమునగాని బాగుగ తెలిసికొనియే ఆతడు వానిని తన గ్రంథములో పేర్కొనెనని తెలియుచున్నది. ఇట్టి సునిశిత పరిశీలనమే వాతావరణ విశేషములను, మేఘునిమార్గమును వర్ణించుటయందు కన్పించును.

మేఘము గాలివీచు దిక్కునకు పయనించును. అందు చేతనే 'త్వా మారూఢం పవన పదవీ' అను శ్లోకమున 'ఆకాశమ్' అనక 'పవనపదవీ' అని 'పవన' పదమునకు ప్రాధాన్య మిచ్చి నాడు కాళిదాసు. పవనములే మేఘము నొకచోటి నుండి మరియొక చోటికి కొనిపోవును. మరియు 'మేఘ సందేశమున' పవన మనుకూలమైనట్టిదని 'మన్దం మన్దం నుదతి పవన శ్చానుకూలో యథా త్వాం' అను వివరణ వలన తెలియుచున్నది. మేఘుని మార్గమున పర్వతములు జల ప్రవాహములు అనేకము లున్నవి. ఆ మార్గమిట్లు వర్ణింపబడినది.

> మార్గం తావ చ్ఛృణు కథయత
> స్త్వత్ప్రయాణాను రూపం
> సందేశం మే తదను జలద
> శ్రోష్యసి శ్రోత్రపేయం
> ఖిన్నః ఖిన్నః శిఖరిషు పదం
> న్యస్య గన్తాసి యత్ర
> క్షీణః క్షీణః పరిలఘుపయః
> స్రోతసాం చోపభుజ్య

పటములో మేఘుని మార్గమును గమనించిన ఈ శ్లోక మెంత తగియున్నదో విశదమగును. కావున ఆషాఢ మాసమున వీచు నైఋతి ఋతుపవనములు మేఘుని ప్రయాణమును సుకర మొనర్చునవియే అని కాళిదాసుని వర్ణనల సారాంశము. ఇట దక్షిణానిల ప్రసక్తి వచ్చుట కవకాశములేదు.

ఇక నైఋతి ఋతుపవనములు మేఘుని చూపబడిన మార్గముననే ఎట్లు నడిపెనను విచారింపవలసి యున్నది. ఇందు ఈ క్రింది విషయములను మనసునం దుంచుకొన వలెను. 1. భారతదేశమున గల వివిధ పర్వతశ్రేణులు— వాని యునికి. 2. ఆషాఢ మాసమున పశ్చిమ పయోధి (అరేబియా సముద్రము) మీదుగ నైఋతి ఋతుపవనములు వీచు చుండును. ఇవి జూన్ మొదలు సెప్టెంబరువరకు (సుమారుగ జ్యేష్ఠము మొదలు భాద్రపదంవరకు) పశ్చిమ తీరముపైకి వీచి అచట ఉత్తర దక్షిణములుగ నున్న పడమటి కనుమలచే నడ్డగింపబడి ఆ తీరమున వర్షించును. ఇట గమనింపవలసిన విషయ మొకటి గలదు. జూన్, సెప్టెంబర్ మధ్య కాలమున సూర్యుడు కర్కటరేఖ భూమధ్యరేఖల మధ్య ప్రకాశించుటచే ఆ ప్రాంతమున గాలి పీడనము తగ్గి, అచటికి వాయుపీడన మధికముగ గల మకరరేఖా ప్రాంతమునుండి గాలులు వీచును. అవి భూమధ్య రేఖ వరకు ఆగ్నేయముగ పయనించి ఆగ్నేయ వ్యాపార పవనము లనబడుచున్నవి. అవి భూమధ్యరేఖను దాటగనే నైఋతి దిశగా మరలి హిందూమహాసముద్రము మీదగ వీచుచు రెండు శాఖ లగును. ఒకటి: అరేబియాసముద్రము నుండి వీచునది. రెండవది:బంగాళాఖాతము మీదుగవీచి తూర్పుపాకిస్తాన్, పశ్చిమ బెంగాల్‌నకును, గారో కాశీ కొండలడ్డగించుటచే అస్సామునకును వర్షము నిచ్చి హిమాలయములను దాటలేక పర్వత పంక్తినంటి కాశ్మీరమువరకును ఆగ్నేయపవనమై వీచును. మొదటిశాఖయు ఉత్తరమున సులేమాన్ హిందూకుష్ పర్వతములచే నిరోధింప బడి ఈశాన్యముగ మరలును. ఇవియును రెండవశాఖయొక్క పవనములు తర్వాత ఈశాన్య ఋతు పవనములుగ మారును. 3. మరియు ద్రవములకు (అనగ ద్రవ వాయు పదార్థములకు)

ఒక నిరోధ మెదురైన వాని తలము నంటి పయనించు నైజము గలదు. నీరు కాలువ గట్లెట్లుండిన ఆ మార్గముననే ప్రవహించును. అట్లే వాయువులు పర్వత పంక్తుల నంటి వీచును.

## మేఘుని మార్గ సమన్వయము

1. మేఘుడు రామగిరి నుండి బయలుదేరును. రామగిరి మధ్యయిండియాలో తూర్పు పడమటి తీరములకు దాదాపు మధ్యగ నుండు ప్రదేశము. నైఋతి ఋతుపవనములు— అరేబియా సముద్రముపై నుండివచ్చు శాఖ సాత్పూరా పర్వతములు, పడమటి కనుముల ఉత్తరభాగము మధ్యగ (తపతి నదీ లోయలో) వీచి రామగిరికి చేరును. అనగ నవి పశ్చిమము నుండి తూర్పుగ వీచును. కాని అవి పూర్తిగ తూర్పునకు చేరక మునుపే, రామగిరి ప్రాంతము చేరునప్పటికి బలహీనమగును. ఏమన తూర్పున బంగాళాఖాతము నుండి వీచు నైఋతి ఋతు పవనముల మరియొక శాఖ వీచుచుండుట ఒక కారణము. రెండవది—రాజస్థాన్‌లో థార్ ఎడారి ప్రాంతమున, కర్కాటరేఖా ప్రాంతమున వాయుపీడనము తక్కువగ నుండును. అందుచే అటువైపునకు లాగబడుటవలన. (జూలైలో సింధు, థార్ ఎడారి ప్రాంతమున దేశము నంతటిలో అత్యధిక ఉష్ణోగ్రత యుండును. అందుచే నచ్చట పీడనము తగ్గును). ఫలితము— పశ్చిమమునుండి తూర్పుదిశకు పోవు శక్తి తూర్పున వీచు మరియొక శాఖచే తటస్థీకరింపబడును; పశ్చిమోత్తరమున గల యల్ప పీడన మటు లాగును గాన మేఘు డాదిశకే వీచు పవనము లచే నెట్టబడును.

2. ఇంతలో ఆమ్రకూట మెదురగును. రామగిరికిని ఆమ్ర కూటమునకు మధ్యగల మాలక్షేత్రమున వర్షించి ఆమ్ర కూటమందలి యెత్తైన శిఖరములనంటి యించుక పశ్చిమోత్తరముగ పోవునరికి మేఘునకు రేవానదీ లోయయు, వింధ్యపాదమును ఆసన్నమగును.

3. అచ్చటినుండి సాత్పూరా, ఆమ్రకూటముల నడుమ గల మార్గమున బలముగ, నించుక ఈశాన్యముగ వీచు గాలుల యొక్కయు, సాత్పూరా, వింధ్య పర్వతముల నడుమ గల గరాటా వంటి ప్రాంతముగుండా తూర్పునకు వీచి వింధ్య, మేఖల, ఆమ్రకూటములచే నిరోధింపబడు గాలులయొక్కయు ఫలశక్తి (Resultant Force) వలన నెట్టబడి మేఘుడు ఉత్తరముగ గల విదిశకు చేరుట కవకాశమున్నది. విదిశ దశార్ణ దేశమునకు ముఖ్యపట్టణము.

4. ఇచ్చటినుండి ఉత్తరమునకు పోవలసిన మేఘుని, చుట్టు దారియైనను ఉజ్జయినిని దర్శించి పోవలయునని యక్షుడు కోరును. ఇది కావ్యశిల్ప దోహదకారి యగునేమో కాని యాథార్థ్యమునకు న్యాయము చేకూర్చునదిగ లేదని పూర్వ వ్యాసకర్త అభిప్రాయపడిరి. ఇచ్చట గమనింపదగిన విశేషమిది.

విదిశ నుండి యుజ్జయినికి మధ్యగల ప్రాంతమంతయు దాదాపు కర్కాటరేఖపై నుండు. ఆషాఢ మాస ప్రారంభమున (జులై నెలలో) అచ్చట పూర్వ పశ్చిమములుగ ఉష్ణోగ్రతయు వాయుపీడనమును ఒకే రకముగ నుండును. అప్పుడు, థార్ ఎడారి ప్రాంతమునను, సింధు ప్రాంతమునను ఉష్ణోగ్రతలు అధికతర అధికతమములుగ నుండును. అచ్చటి భూమిపై వాయు పీడన మట్లే తక్కువగ నుండును. అప్పుడే నైఋతి పవనములు కొన్ని థార్ ఎడారి, సింధు ప్రాంతములవైపు వీచు చుండును. ఆ ప్రాంతములందు తక్కిన వాయు పీడనములందును, అటుకు వీచు ఇతర పవనముల బలాధిక్యత చేతను మేఘుని విదిశకు దెచ్చిన పవనములు పశ్చిమముగ లాగబడి, మేఘుని విదిశ నుండి ఉజ్జయినికి చేర్చుట కవకాశమున్నది. అయితే చుట్టుదారి యైనను ఉజ్జయినిని దర్శింపుమని కోరుట. సమయము గమనించి, ఆయా ప్రదేశముల యునికి నెరుంగదగును. ఈ మార్గమున పేర్కొనబడిన నిర్వింధ్యయు, అవంతీదేశము, విశాల నగరము వేత్రవతికి, శిప్రానదికి మధ్య నుండవలెను. ఈ ప్రదేశము మధ్యప్రదేశ్‌లోని మాళవ ప్రాంతమునకు సరియగును. విశాలా నగరమునకు నేటి వ్యావహారిక నామమును గూర్చి పరిశీలింపదగును.

5. ఉజ్జయినీ ప్రాంతమున వింధ్య, ఆరావళీ పర్వత శ్రేణులు దాదాపుగ విలీనమగుచు నేర్పడియుండుట గమనార్హము. కావున మేఘు డా వంపు వెంబడి పయనించి, ఉజ్జయిని నుండి గంభీర నదిని దాటి దేవగిరిని గాంచి చర్మణ్వతిని విడిచి దశపురము చేరును. గంభీరము, దేవగిరియు నుజ్జయినికి చర్మణ్వతికి నడుమ గల ప్రాంతమున నుండవలెను. దేవగిరి కుమార స్వామి యుండు క్షేత్రముగ వర్ణింపబడినది. నేటి వ్యవహారిక నామమేదియో పరిశీలింప దగియున్నది.

6. అచ్చట కాంతే, కచ్ ప్రాంతములపై నుండి వీచు నైఋతి ఋతుపవనముల మార్గమునబడి దశపురము నుండి ఆరావళి పర్వతముల ఉత్తరపు టంచును దాటి బ్రహ్మావర్తము నకు మేఘుడు చేరుటకు అవకాశమున్నది.

7. బ్రహ్మావర్తము నేటి హర్యానా ప్రాంతము. కురు క్షేత్రము బ్రహ్మావర్తముననే యున్నట్లు వర్ణితము. అది నేటి 'అంబాలా'కు సమీపము. మేఘుడు కురుక్షేత్రమును భజించి అటనుండి తూర్పునకు పోవలెను. అది ఇట్లు సాగ వచ్చును. నైఋతి ఋతుపవనములు పశ్చిమశాఖకు చెంది నవి. (అరేబియా సముద్రముపైనుండి వీచునవి.) కర్తార్, సులేమాన్, హిందూకుష్ పర్వత శ్రేణుల నంటి వీచి, తుదకు ఉత్తరము జేరి తిరిగి ఆగ్నేయముగ హిమాలయముల వెంబడి వీచును. మరియు ఆరావళికి పశ్చిమముగ థార్ ఎడారి గుండా వీచునవియును బ్రహ్మావర్తము చేరును. ఈ రెండింటి ఫల శక్తివలన మేఘుడు తూర్పునకు నెట్టబడును.

8. "శైల రాజావతీర్ణా...... జహ్నోః కన్య"కు చేరి అచ్చటి నుండి క్రౌంచరంధ్రముగుండ మేఘుడు మానససరోవరమును జేరును. ఈ క్రౌంచరంధ్రము హిమాలయములలో నుత్తర దక్షిణములుగ నుండునొక యిరుకైన పర్వతసానువై యుండునేమో. అట్లు మానసమును చేరి తుదకు కైలాస పర్వతమున గల అలకా నగరమునకు మేఘుడు చేరవచ్చును.

ఇట్లు మేఘుని మార్గమును సమన్వయ పరుపవచ్చును.

ఈ వివరణముపై జిజ్ఞాసువు లొక సందేహము వెలి బుచ్చు అవకాశమున్నది. అది 'ఋతుపవనములు పటములో చూపబడినట్లే ఖచ్చితముగ వీచునా?' అని. దానికి సమాధాన మిది. పర్వతముల ఉనికి, ఎత్తుపల్లములు, పర్వత సానువులు, వాని వైశాల్య భేదములు, ఆయా ప్రదేశముల ఉష్ణోగ్రతావాయు పీడనములలో భేదములు, పవనముల బలాబలములు ఇత్యాది అనే కాంశములపై పవనములు పయనించు దిశ ఆధారపడి యుండును. మేఘుని మార్గమున నీ యంశముల ప్రభావ మెంతేని గలదను విషయము విస్మరింపదగనిది.

మఱియు యక్షుడు మేఘుని రామగిరినుండి ఉత్తరముగ (యించుక ఈశాన్యముగ) పయనించి గంగా యమునా మైదానములను దాటి కైలాస శిఖరమునకు సూటిగ పొమ్మని కోరి యుండలేదు. నిజమున కది దగ్గరిదారి. అందుచే మేఘుని మార్గమును వర్ణించుటలో వాతావరణ విశేషములు కాళిదాసుని మనసునందుండి యుండవలెను. ఆషాఢ కాలమునాటి ఋతు పవనములు— పై అంశముల నవగతము చేసికొనినచో— నాడును, నేడును 'మేఘ సందేశము' నందు వర్ణింపబడినటులే ఆయా ప్రాంతములలో యించుమించుగ వీచుచుండునని గ్రహింపవచ్చును. రెండు వేలేండ్లకే వాతావరణమున పెద్ద మార్పు రాదు. కాళిదాసుని వర్ణనమునకును నేటి పరిస్థితికిని విప్రతిపత్తి లేదు. చరిత్ర కారుల యభిప్రాయము ప్రకారము కాళిదాసు, చంద్రగుప్త విక్రమాదిత్యుని (క్రీ. వె. 375——415) నవరత్నములలోనివాడని గ్రహించితిమేని ఈ కాలపరిమితి మరియొక ఐదువందల యేండ్లు తగ్గును. కాళిదాసు యిన్ని విషయములను నిజముగ ఆలోచించి వ్రాసెనా అను ప్రశ్నమున కిట్లు సమాధానము చెప్పతగును. కాళిదాసుని కాలము సర్వశాస్త్రములకును స్వర్ణయుగము. రవి గాంచనిది కవి గాంచగలడు. మహాకవులు వశ్యవాక్కులు. కాళిదాసు కవికుల గురువు. అట్లేల కాకూడదు?

---

* సరస్వతి దృషద్వతీనదులు రావి సట్లెజ్‌లకు సమాంతరముగ ప్రవహించి యుండినవి గాన అవి నైఋతిముఖమై ప్రవహించి యుండవలెను. ఆగ్నేయముగ కాదు. అటైన అవి గంగా యమునలకు సమానాంతరములగును. అవి నైఋతి ముఖముగ ప్రవహించి పశ్చిమ పయోధిలో, నేటి సింధునది వలె కలియుచుండినవి. అందుకే ఆ ప్రాంతమున కొకనాడు 'సప్తసింధు' అని ప్రతీతి.

ఈ వ్యాసరచనమున సహాయభూతములైనవి 1. ఆక్స్‌ఫర్డ్ పిక్టొరల్ అట్లాస్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ. 2. వేదం వారి ఆంధ్రవ్యాఖ్యతోగల మేఘ సందేశము. 3. ది ఎడింబర్గ్ జియోగ్రఫికల్ ఇన్స్టిట్యూట్‌చే నిర్మింపబడిన అట్లాసు. మఱియు (4) డిసెంబర్ 1966 భారతిలో ప్రచురితమైన వ్యాసము.



# బూడిదలో పుటల చరిత్ర

"ఆకాశరాజు"

దశాబ్ది పొందులో
దట్టంగా పేర్చిన పుటల్లో
గడచిన చరిత్ర
స్పష్టంగానే కనబడుతోంది.

బాధల్ని తమాయించుకుని
వ్యాధుల్ని హరాయించుకుని
బ్రతుకంతా యీడ్చాను.

చిన్న చిన్న కథల్ని చేర్చి
జీవితాన్ని కూర్చాను —
గ్రంథంగా పేర్చాను.

జీవనాడుల్ని త్రెంచి
భావజాలాన్ని నింపి
ప్రజలమీద ప్రయోగించి
ఫలితం చూద్దా మనిపించింది!

సంపుటాలుగా, మొదట్లో—
పెంపు చేద్దామనుకున్నాను.
చదువులో సగం గడిచింది.
సగం చదువుకన్నా—
మిగిలిందే మిలియన్ల సంపుటాలు
మోయలేనంత బరువైంది, ఇప్పటికే.

ఒక్కోపుటా వెనక్కు తిప్పతుంటే
చక్కనైన అనుభూతులకన్నా—
బక్క నీరసా లెక్కు వున్నాయి.

స్మృతిపథంలో—
మతిపోగొట్టుకున్న
బాటసారిని నేను,
విధి వక్రగతిలో కాలసర్పం
కాటేసిన వాడిని!

గ్రంథంలో—
బాధను రంగరించుకున్న
కథలున్నాయి,
మోదాన్ని సంతరించుకున్న
గాథలున్నాయి.
సుఖాంతాలు కొన్ని,
విషాదాంతాలు మరిన్ని.

మొదటి పుటల్లో అక్షరాలు
చెదురు చెదురుగా వున్నాయి
చిరుత వయసులో అల్లరికి
చిహ్నా లనిపించాయి!

అల్లరి చిల్లరి పనుల్ని
చిన్నపిల్లల చిట్టి చేతుల్తో
బొమ్మలుగా చిత్రించాను—
నవ్వొచ్చింది!

ఇంకా—
అధునాతన చిత్రకళ లాంటి
గజిబిజి గీతలున్నాయి.

రవివర్మ రాసిన
రంగు చిత్రాల్లాంటివీ ఉన్నాయి.
అంగనలు వేసిన
రంగవల్లిక లున్నాయి.

యుక్తవయస్సులో వున్ననాడు
ముక్త ఛందస్సులో వ్రాసినట్లు—
అపహాస్యం పాలైన
అపసవ్యపు వ్యాసం ఒకటి!

ఒకనాటి ప్రణయ కథకు
రంగులు పూశాను—
మనో రంజితంగానే వుంది

పాటల్లో అనుభూతి
ఆటల్లో లేదు,
చేతల్లో అనుభూతి
మాటల్లో రాదు.

ఏ బొమ్మలో చూసినా నా ప్రతిరూపం,
ఏ కథలో చూసినా నేనే నాయకుణ్ణి.
రంగురంగుల ఇంద్రధనస్సు, నా చుటూ
చెంగుచెంగున గెంతుతోంది.
రంగులరాట్నం, నా చుట్టూ వేయి—
భంగుల తిరుగుతోంది.
రకరకాల మనుష్యుల మధ్య
వివిధ మనస్తత్వాల నిరికించుకున్న రథ్య
రంగుల రాట్నాన్ని ఛేదించాలి,
ఇంద్రధనసుల్ని ఛేదించాలి
ఎగిరిపడే గుఱ్ఱాల్ని సరిచేయాలి
ఎగుడు దిగుడు బాటల్లో నడవాలి.

ఆస్తికునిగా ఉన్నప్పుడు, నాకు
స్వస్తి చేకూరలేదు.
భగవంతుడు కనిపించనే లేదు.
నాస్తికుడి నైనప్పుడే
'నరుడా నీ కోరిక?'—అన్నాడు.
దేవుణ్ణి తలచుకున్నప్పుడు
తిట్టాలనిపించింది,
తిట్టాలనిపించినప్పుడు
దేవుడు కనిపించాడు!

లీలామానుష విగ్రహుడు
నాలో మానిసిని తరిమేశాడు.
అజ్ఞాన తిమిరాన్ని అణచి,
జ్ఞానజ్యోతిని వెలిగించి—
గానుగెద్దు జీవితానికి
గీతను గానం చేశాడు.

జీవితం మలుపు తిరిగినప్పుడు—
కామితం యీడేరనప్పుడు—
గ్రంథాన్ని కాల్చేద్దామనిపించింది
పుటల్ని చించేద్దామనిపించింది.

శూన్యంలో మాన్యం చూసుకుని
సున్నాలో యిల్లు కట్టుకుని
కష్టయ్యలో కలిసిపోదామనుకున్నాను.

నారుపోసింది, వెంటనే
నాలో కలుపుకునేందుకు కాదు,
నీరు పోస్తాను
'మరిన్నినాళ్ళు మను'—అన్నాడు.

అంతే—

సుడిగుండపు సున్నాల్లోపడి,
నడిచింది మరిచాను.
కళ్ళు తెరచేసరికి, దినము—
నెలలు గడిచిపోయాయి.

తడియారిన గుండెల్లో
గుడిగంటలు మోగాయి.

వర్షం వచ్చినప్పుడు
వర్షంలో తడిశాను
వర్షం వెళ్ళినప్పుడు
చెట్టుక్రింద నిలిచాను.

కనుకొలకుల్లో
నీళ్ళు నిలిచినప్పుడు
ముత్యాలని భ్రమశాను.
కన్నీళ్ళు సెలయేళ్ళుగా మారినప్పుడు,
నిరర్థకంగా—
కడలిలో కలిసిపోతాయనుకోలేదు!
తడిసి, ఘుడిసి పోతాననుకోలేదు!!

గతాన్ని స్మృతంలో దాచి
రథాన్ని ముందుకు సాగిద్దామని,
సమన్వయం చేసి—ముందు ముందు
స్వర్గానికి మెట్లువేద్దామనేది—ఆశ!

'అబూజెనాదమ్'లాగా
నభూతో నభవిష్యత్తనే
పేరు తెచ్చుకుందామనేది పేరాస!

---



# ఋత - చిత్

## శ్రీ వేలూరి శివరామ శాస్త్రి

'యత్ర సుప్తో న కంచన కామం కామయతే, న
కంచన స్వప్నం పశ్యతి, తత్ సుషుప్తమ్! సుషుప్త
స్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏ వానందమయో
హ్యానందభుక్ చేతోముఖః ప్రాజ్ఞస్తృతీయః పాదః'*

మాండూక్య—5, 6

సర్వాయతనమూ సర్వస్రష్టా సంపూర్ణమూ ఐన ఈ అతిమానసం లేక ఋత—చిత్, పరమపురుషుని స్వ—భావం. ఇది ఆయన స్వయంభూ—స్వభావం కాదు, మరి విశ్వేశ్వరమూ విశ్వభావనమూ ఐన పరిభూః—స్వభావం[1]. మనం ఈ సత్యాన్నే ఈశ్వరుడు లేక దైవం అని అంటాం. పడమటి దేశాలవారు రాజాధిరాజువంటివాణ్ణి సద్గుణసంపన్నుణ్ణి దయామయుణ్ణి ఒకానొక ఛాయా మానవుణ్ణి ఈశ్వరుడని అంటారు. సృష్టి పరమయిన అతిమానసమూ జీవుని అహంతా: వీని నడుమ నున్న సంబంధ విశేషాన్ని ఆశ్రయించే పాశ్చాత్యుల కల్పనలో ఈ యీశ్వర మానుష కల్పప్రతిమ మలచబడ్డది. అయితే మనము చెప్పే దివ్యపురుషుడున్నూ 'పురుష ధుడే' అనేమాట మరవ రాదు.[2] ఎంచేత నంటే అతడు నిర్విశేషమైన సన్మాత్రంయొక్క ఒక ముఖమే. దివ్యపురుషుడు సర్వమయమైన సత్తారూప మయినట్లే అద్వితీయ సత్స్వరూపుడు కూడా. అద్వితీయ చిత్ పురుషు డయియున్నా పురుషుడే కాక పురుషోత్తముడున్నా. అతని ఈ రూపును గురించి పైపై ఆలోచన జరిగిందికాని మనం ఇప్పుడు ఈ దివ్యపురుషుని అపురుషవిధస్వరూప (Impersonal) మననంలో మునుకవేదాం. ఈయెడనే మన భావన గభీరమూ విశదమూ కావాలి.

విశ్వమం దంతటా ఋత—చిత్తు 'ఋతంభరా' ప్రజ్ఞా రూపంగా (Ordering Self-Knowledge) అనగా సర్వమునూ క్రమబద్ధంగా చేసే ఆత్మజ్ఞానరూపంగా ఉంది. ఇందువల్ల అఖండసత్తు తుదిలేని తన బహుత్వాన్ని విచిత్ర మైన సామరస్యంతో స్ఫుటంగా అభివ్యక్తం చేస్తుంది. ఈ ఋతంభరాప్రజ్ఞ, (Ordering Self-Knowledge) లేకపోతే అతనిలో అనంతంగా ఉన్న యోగ్యతలు (Potentialities) నియతంగా పరివర్తన చెందే మహావిశృంఖలా రూపంగా (Chaos) బయటబడి అతడు చేసే సృష్టి యావత్తూ సామరస్యంగా అభివ్యక్తం పొందేది కాదు. అమేయ మయిన ఆతని అభివ్యక్తీకరణశక్తిని ఎవరు క్రమబద్ధం చేయ గలరు? ఎక్కడ అనంతమయిన యోగ్యత (Potential) యే ఉండి దాన్ని నియమించే ఆత్మదృష్టి (Ordering Self-Knowledge) ఉండదో అథవా అభివ్యక్తిక్షేత్రంలో పరిణ మించేందుకు నాటబడ్డ బీజంలో తనకు పూర్వమేఏర్పాటయియున్న విజ్ఞానంగాని భావంగానిలేకపోతేఅదిఎట్లాచక్కగా సమరసంగాపరిణ మిస్తుంది? అనియమం ఏర్పడి అంతర్యామి ప్రేరణ లేక మహా విశృంఖలయే (Chaos) విజృంభిస్తుంది. అపుడు ఈ జగత్తంతా అవ్యాకృతపు నురుగు పొంగియిపోయేది. కాని ప్రజ్ఞానమే యీ విశ్వాని కంతటికీతల్లి. ఆ యమ్మకు అది ఆత్మరూపం. ఆత్మరూప మయిన ఆత్మశక్తియే సృష్టిలో అభివ్యక్త మయేది. మరి అనాత్మ శక్తి కాదు. కాబట్టి ప్రత్యేకమయిన ప్రతిసంభావ్యాన్నీ సత్యమూ ఋతమూ అయిన విధానం నియంత్రితమూ పరిచారితమూ చేస్తున్నది. అట్టి నిండు చూపు ఆ ప్రజ్ఞానంలోని సత్తాలో ఉంది. ఇంతేకాక ప్రతిప్రత్యేక సంభావ్యంతో (Potential) మరొక సంభావ్యానికి ఉన్న సంబంధమూ, అవి ఎట్టి సామంజ స్యంతో పరస్పరమూ మిళితం కాగలవో అట్లు చేయగల యథార్థ

---

* The Supreme truth—Conciousness (Life Divine I st Part Cha-XV) అతిచేతనా. సుషుప్తిలో ఉన్నతడు ఏటుక ముద్ద, ఆనందమయుడు ఆనందాన్ని అనుభవించే అతడు. అతడు సర్వేశ్వరుడు సర్వజ్ఞుడు అంతర్యామి సకలకారణము.

1. 'ఈశ' చూచేది. పరమపురుషుని నిర్విశేషమైన కేవల సత్తాయొక్క ప్రకృతి కానేకాదుగాని అతడు విశ్వేశ్వరుడూ విశ్వస్రష్టా ఐనప్పుడు అతనిలో ఉన్న ప్రకృతి ఇది. గీత—7 అధ్యా—4, 5, 6 శ్లో. చూచేది. (అనువాదక)

2. 'పురుషాన్నపరం కించిత్' 'అసంగో హ్యయం పురుషః' మొదలయినవానిని చూచేది. బృహదారణ్యకంలో పురుషవిధ బ్రాహ్మణం చూచేది. (అను)

బోధయుగాత్మ[ప్రజ్ఞానంలో ఉన్నవి. అది నియమించే సార్వభౌమ సముంజసతలో అయినా రూపాలనూ శక్తులనూ బీజరూపంగా ధరించి ఉంది. అదియే లయబద్ధమయిన ప్రపంచ భావం (Real idea) ప్రపంచ జన్మలగ్నంలోనే దానిగుండెలు ఆడటం మొదలుపెట్టినపుడే ప్రపంచానికి మూలమయిన ఋతంభరా ప్రజ్ఞ. లేక ప్రజ్ఞానంయొక్క 'పూర్వచితి' నుండి ప్రపంచం యొక్క నలుసునలుసునా క్రమబద్ధమయిన వికాసం సంచారితి మవుతుంది. ఈ ప్రజ్ఞయే జగత్తులో ధర్మాల కన్నిటికీ చెలమ. 'ధర్మధుక్', 'గోపా ఋతస్య'. ఆ ధర్మంలో ఎక్కడా యదృచ్ఛచే నయిన అనియమంలేదు, ఎంచేతనంటే ఆ ధర్మం ప్రతివస్తువు యొక్కయు స్వ—భావ స్ఫురణం. ఆ స్వభావమున్నూ సద్భూత విజ్ఞానం యొక్క అడ్డ మాకలు లేని సత్య బలంతో వస్తువు యొక్క బీజభావంలో నిహితమై ఉంది. కాబట్టే సృష్టి— పూర్వక్షణంలో సమగ్రపరిణామక్రమం సృష్టియొక్క గూఢమయిన ఆత్మసంవిత్తులో విధృతమై ఉంటుంది. ఇంతేకాక ప్రతిముహూర్తమునందున్నూ స్వతః ప్రవృత్తి లీలతో పరిణామం ఉత్సారితం అవుతుంది. అందువల్ల సృష్టి పరిణామం చెందుతూ వుండే ప్రతిముహూర్తంలోనూ ఆ సృష్టిలో గూఢమూ అనాదీ ఐన స్వరూప—సత్యం నియతంగా స్ఫురిస్తూ వుంటుంది; ఆ సత్యవేగమే పెట్టబోయే అడుగడుగునా అమోఘమయిన బలంతో నియంత్రణం చేస్తుంది. ఈరీతిగా సృష్టి - బీజసత్తాలో దాగి ఉన్న ఆకూతి[3] పరిణామంలో పూచికాచి పండబారుతుంది.

స్వరూప సత్యము ననుసరించి యీ విశ్వమంతా పుష్టిని ఉన్నతిని పొందుతూ వుంటే దాని మూలంలో కాలకలనయున్నూ దేశపు వ్యవస్థయున్నూ నిమిత్త పరంపరయున్నూ కలిగినవి. (Time Space and Casuality) అభివ్యక్తికి ముందు వెనుకలలో కాలమున్నూ అవస్థితి సంబంధాన్నిబట్టి దేశమున్నూ కనిపించినై. దేశంలో ఉనికి చూపిన వస్తువు లన్నిటియు పరస్పరక్రియతో కాలపరంపర కలిసి నిమిత్తబోధ కలిగింది. దర్శనాల ఉద్దేశంలో దేశకాలాలు కల్పనలే కాని వానికి వాస్తవ సత్తా[4] లేదు. కాని పదార్థాలన్నీ సచేతనమయిన సత్తాయొక్క నిజ చైతన్యంచేత రూపు పొందు తున్నపుడు దేశకాలాలు కేవల కల్పనా కథలని అనుకో డానికి ఎంతమాత్రమూ ప్రయోజనం లేదు. ఆ యీ తత్త్వదృష్టిలో దేశకాలాలు చిత్‌స్వరూపం యొక్క ఆత్మవ్యాప్తిలో స్వానుభవం,—దాని పరాక్—వ్యాప్తియే దేశం, ప్రత్యక్ వ్యాప్తియే కాలం. మన మనస్సు పరిమాణగర్భంలో నుంచి ఈ రెంటినీ చూస్తుంది. మనస్సు విభజన ధర్మి, ఖండ ప్రవృత్తి దానికి స్వభావం; అందువల్ల అపరిమితాన్ని పరిమితం చేయడం మనస్సుకు నైజం. నిరవచ్ఛిన్నమయిన గతిప్రవాహాన్ని క్షణాలతో అవచ్ఛిన్నం చేసి లేక కొలిచి దాని ఒక బిందువు ముందు నిలుచుండి చూపును ముందుకును వెనుకకును నడపి మనస్సు కాలకల్పన చేస్తుంది; దానివల్లనే సత్తాయొక్క అవిచ్ఛిన్నమయిన ధార మనశ్చేతనలో భూత భవిష్య ద్వర్తమాన తరంగాల ఖేలచేత పరిమిత మవుతుంది. ఇక అభివ్యక్తమయిన స్థితి యొక్క వ్యాప్తిలో ఒక బిందువు ముందు నిలిచి విభాగ కల్పనచే పరిమితం చేసి దేశాన్ని చూస్తుంది. తాను నిలిచిన బిందువు నలుతట్టులా ఉన్న వస్తు వ్యవస్థను చూచి జటిల మైన సంబంధ కల్పనలు చేస్తుంది.

వ్యావహారిక జగత్తులో మనస్సు ఘటనలను బట్టి కాలాన్ని జడవస్తువులవల్ల దేశాన్ని పరిమితం చేసికొని గ్రహి స్తుంది. కాని విశుద్ధమయిన మనస్సు అనగా సంకరం కాని మనస్సు ఘటనాప్రవాహాన్ని వస్తుసంస్థానాన్ని ఉపేక్ష చేసియే, అ దేశకాలాలకిన్నీ స్వరూప ధాతువయిన అనగా మూల ఉపాదాన మయిన చిచ్ఛక్తి యొక్క శుద్ధక్రియను అనుభవం చేసికో వచ్చు. అప్పుడీ దేశకాలాలు విశ్వవ్యాపియయిన చైతన్యశక్తి యొక్క రెండు ఆకారాలుగా (Aspects) బోధపడతై. మరిన్నీ నానావిధాల సంబంధంతో వాని క్రియ వాని మీదనే పడుగు పేకలుగా అల్లబడియున్నటులున్నూ బోధపడుతుంది. మనస్సుకు అందని ఒక చైతన్యం ఉంది, అంటే ఉన్మనీదశ, ఆ దశలో భూత భవిష్యద్వర్తమానాలు ఒక అఖండ సత్తాగా పర్యవసితం చెంది కాలత్రయమూ చేతన కాధారంగా కాక ఆధేయంగా ఉంటుంది. అట్టి కాలాన్ని చూడడానికి ఏక్షణ బిందువు ముందూ నిలువ నక్కరలేదు. ఆ అనుభవంలో త్రికా లాలూ ఒక వర్తమానంగానే ఉంటై. ఇంతేకాక ఆ చేతన

---

3. ఆకూత,ఆకూతి శబ్దాలకుగూఢమయిన అభిప్రాయం అని అర్థం. (అను)

4. 'కాలము ఆత్మవలె అఖండము నిత్యము ఏకము' అని నైయాయికులూ వైశేషికులూ, 'కాలము—మహాకాల రూపముగాగాని క్షణాదికముగాగాని లేదు, ఆకాశమే ఉపాధి విశిష్టమై క్షణము మొదలుకొని మహాకాలము తుదగాగల కాలవ్యవహారము నడిపించుచున్నద'ని సాంఖ్యులు, 'కాలము నిత్యమ'ని చెప్పు శ్రుతి స్మృతులు ప్రవాహ నిత్యతాపర ములు; అవశ్యకం కాబట్టి క్షణమనేదే కాలంకాని మహాకాల మంటూ వేరే లేదు'. 'క్షణ తత్క్రమయో ర్నాస్తి వస్తు సమాహార ఇతి బుద్ధి సమాహారో ముహూర్తాహోరాత్రాదయః, సఖల్వయం కాలో వస్తుశూన్యోఽపి బుద్ధినిర్మాణః శబ్దజ్ఞానాను పాతీ లౌకికానాం వ్యుత్థిత దర్శనానాం వస్తుస్వరూప ఇవావభాసతే' యోగభాష్య 3—53 చూ.

క్షణిష్మానం ఏ దేశబిందువున్నూ కాదు, ఎంచేతనంటే అన్ని బిందువులకూ ఆ చేతనయే ఆధారం, కాగా దేశం కూడా అఖండమయిన దాని ప్రత్యగ్వ్యాప్తి. ఆ చేతనకు ఆకాశం చిదాకాశం కాలం మహాకాలం. సంవిన్మయమూ అఖండదృష్టీ అయిన ఒకానొక ఏకాత్మ ప్రత్యయంలో ఈ మహావిశ్వం యొక్క స్పందలీల ధరింపబడి ఉన్నదనే అనుభవం కూడా ఒకానొకప్పుడు మనకు మెలకువ పొందవచ్చు కాని ఈ దేశకాలాల అసలు స్వరూప సత్యం మాట ఏమిటి అని ప్రశ్నిస్తే ఆప్రశ్న వృథాప్రశ్న. ఎంచేతనంటే ఆ స్వరూప సత్యాన్ని తెలిసికోవడం ప్రాకృత మనస్సుకు సాధ్యం కాదు, ఆ అఖండ—అద్వయతత్త్వం, ఈ విశ్వాన్ని ఇంద్రియ మనస్సహాయం వినాగా కూడా తెలిసికోగలదని ఒప్పడానికికూడా ప్రాకృత మనస్సు రాజీకి రాదు,

అతిమానసం, అఖండమున్నూ సర్వగ్రాహియున్నూ ఐన దృష్టి ద్వారా కాలపరంపరనూ దేశఖండతనూ ఎట్లా ఒక లాడిమెలో ఐక్యపరచికొని ఉంచో దానిని ఆభాసగా గ్రహించగలం గాని దీని పూర్ణానుభూతి ఎటుక్కు సాధన చేసి పొందగల పురుషార్థం. కాలకలనయూ దేశవ్యవస్థయూ సృష్టికి అవసరం. కాలగమన మనేదే లేకపోయినట్లయితే ఏ పరివర్తనంగాని ఏ ఉన్నతిగాని సంభవించేది కాదు. అపుడు విశ్వలీల పరిపూర్ణ సౌషమ్యం యొక్క నిత్యప్రకాశమే ఉండి—సౌషమ్యం యొక్క దశాలన్నీ ఒకే ఒక శాశ్వతక్షణవృంతంలో సంహతమై, అతీతంనుంచి భవిష్యం వరకూ వ్యాప్తమైన అలల ఊయాల ఉండేది కాదు. కాని మనం నిత్యమూ వృద్ధి చెందుతూవుండే క్రమపరిణామాన్ని—అతీతకాలం యొక్క తపస్యను ఆత్మసాత్కరించిన వర్తమానంయొక్క అభ్యుదయాన్ని చూస్తున్నాం. ఈ రీతిగానే విశ్వసృష్టి మూలంలో ఖండితమైన దేశభావన లేకపోతే రూప—రూప వైచిత్ర్యంలో పరివర్తనశీలమై ఉన్న నానాసంబంధాలు అథవా శక్తితో శక్తికి స్పర్శగాని సంఘాతంగాని ఉండడానికి వీలులేకపోయేది.విశ్వాని కప్పుడు సత్తా ఉన్నప్పటికీ స్ఫురత్తార్ ఉండేది కాదు, అనగా సకల పదార్థాలూ ఉన్నా దేని స్ఫురణం కాని బహిః ప్రకాశంకాని ఉండేదికాదు, దేశహీనమూ విశుద్ధమూ ఐన ఒక ప్రత్యక్ చేతన అంతరావృత్తమయిన ప్రత్యయం అనే పిడికిట విశ్వంయొక్క సమస్త సంభూతినీ — హిరణ్యగర్భుడనే మహా విశ్వకవి మనసులోని కలలాగా—పట్టుకొని ఉండేదికాని తన్ను అన్నింటిలో రూపోల్లాసం యొక్క అనంతమైన వ్యంజనలో ఆత్మ సిసృక్షి యొక్క పరాక్—వ్యాప్తిలో గుప్పిపెట్టేది కాదు. అంటే దేశం లేకపోతే ఆ అవస్థలో ఆత్మచైతన్యం తనలోనే సర్వవస్తువులనూ అనంతమయిన ఒక అంతర చైతన్యబంధనంలో, ఒక విశ్వకవి యొక్క మనసులో లేక విశ్వపురుషుని మనసులో కలవలె బంధించి ఉంచేదిగాని బహిర్ జగత్తులో ఆత్మ ప్రసారం యొక్క నానారూపాలలో వానిని వెదజల్లి ఉండేది కాదు. మరి కేవలం కాలమే సత్యమయితే ఒక గాయకుని మనసులో గాని కవిమనసులోగాని ఒక కొత్త పాటగాని ఒక కొత్త కల్పనగాని ఒకదాని తరువాత మరియొకటి భాసించినట్లు విశ్వాత్ముని అనంతచైతన్యంలో ఒకటి తరువాత మరియొకటిగా స్వతః స్ఫూర్తమైన అభివ్యక్తిచిత్రం భాసించేదిగాని దానికిబాహ్యరూపం కనిపించేది కాదు. కాని అసలు సర్వాధారమయిన దేశపరివ్యాప్తితో కాలవశాన నానారూపాలూ శక్తులూ పరస్పరమూ కలిసి సంబంధపడి సామరస్యక్రమంలో వికసిస్తున్నవి, రూపమూ శక్తి ఘటనల ఎడతెగని ప్రవాహమూ కాలపరంపరగా మన కనుల ముందర జరిగిపోతున్నది.

దేశకాలాలలో అవ్యక్తంగా ఎన్నో శక్తులు దాపెట్టి ఒకదానితో మరి యొకటి ఏదో సంబంధంలో జతపడి పైకి ఉబుకుతున్నవి,ఒకొక్క శక్తి తన సామర్థ్యములో సంభావనలతో ఇతరములయిన నానాశక్తుల సామర్థ్య సంభావనల (Potentialities) కు ముఖాముఖిగా నిలబడుతున్నది, అవన్నీ అనాయాసంగానూ స్వతఃస్ఫూర్తంగానూ దొరలిపోయే కాలపరంపరగుండా ప్రకాశం పొందక ఒకదానొంటి సంఘాత విక్షోభాలలో వానికి పరిణామం జరుగుతున్నటులు మనకు కనబడుతుంది. కాని వస్తుతః ఈ పరిణామంయొక్క అంతరంలో సహజమయిన ఒక స్వతఃస్ఫూర్తి వుంది, సంఘాతమూ విక్షోభమూ బయటికి సంఘాత విక్షోభాలవలె కనబడటమే. ఏమిటయ్యా అలా కాన రావడం? దీనికి ఏమిటి కారణం? అని అంటే ఏకమూ అఖండమూ అయిన సత్తాలో జరిగే ప్రతీదీ స్వ-భావజమైన ధర్మం, అది తప్పక సామరస్యం చేకూర్చే తీరుతుంది. ఐతే పైకి సంఘర్ష స్థితిలో ఉన్న చందంగా కనబడే కొన్ని అంశల యొక్కయు రూపాల యొక్కయు పరిణామక్రమాయాతమయిన ధర్మాన్ని సత్తాలో ఉన్న ఆంతర ధర్మమే సమపరుస్తుంది. అతిమానస దృష్టికి పరిణామ సుషమ సామంజస్యములలోగల సత్యమే గోచరిస్తుంది. అది చాలా గొప్పదీ లోతయినదీ. ప్రతి పదార్థాన్నీ వేరుపరచి చూస్తుంది కాబట్టి మనస్సుకు సంఘాత సంఘర్షాలు విరోధ వైషమ్యాలవలె కనబడతాయి కాని అతిమానసానికి నిత్యంగా ఉండి వృద్ధి పొందే క్రమపరిణామానికే ఆ సంఘాత సంఘర్షాలు అంగమనియో ఉపాదానమనియో అనుభూత మవుతుంది; ఎంచేతనంటే అతిమానస దృష్టిలో విశ్వం అంతా ఒకే

5. ఆ మహాప్రకాశానికి విమర్శరూపమయినస్ఫురించడమనే శక్తి ఉన్నది (విమర్శశక్తిస్పందశక్తి) శివుడు దాని కూడికవలననే జగత్తు సృజించి కాచి ఉపసంహరించుచున్నాడు అనే అర్థం కల: 'నైసర్గికీ స్ఫురత్తా విమర్శరూపాఽస్య వర్తతే శక్తిః తద్యోగా దేవ శివో జగదుత్పాదయతి పాతి సంహరతి' పరివస్యారహస్య మా. —1—4. (అను)

ఒకదాని యొక్క నానారూపం. అట్లాకాక మనోదృష్టి ఒక విశేష దేశ కాలాల నడుమ ఆకట్టబడి ఉంది కాబట్టి అది ఆ దేశ కాలాల నడుమ అనేకసంభావ్యాలను చూచి (Potentialities) ఒకొక సంభావ్యంలో కొద్దీ, గొప్పా, సార్థకం కావడానికి విచిత్ర తారతమ్యాభాసతో సంకులమై దారీతెన్నూ లేకుండా విశృంఖలంగా ఉన్నటులు భావిస్తుంది. కాని దివ్యమయిన అతిమానస దృష్టిలో దేశకాలాల సమగ్రప్రసారం భాసిస్తుంది. అందువల్లనే దానికి మనఃకల్పితమయిన సంభావనలే కాక ఇంకా చాలా సూక్ష్మమయిన సంభావనలు కూడా గోచరిస్తాయి. ఆ చూపులో పొరపాటుగాని వెతుకుకోటంగాని ఒకటనుకోడానికి బదులు ఇంకొకటి అని అనుకోడంగాని ఏమాత్రమయినా ఉండదు; ఎందువల్లననగా ప్రతిసంభావ్యమూ ఏ శక్తివశంచేత ఏ మూలప్రయోజనంతో చాలితమవుతూందో దానితో ఇతర సంభావ్యాలకు సంబంధం ఏమిటో, ఏ సమయంలో ఏ చోట ఎటులు అది క్రమంగా అభివ్యక్తం కాగలదో, దాని శేషపరిణామం ఎచటనో పీని అన్నిటిలో ఏదిన్నీ దానికి అగోచరం కాదు. స్థిరభావంతో సమగ్రదృష్టితో దేనినయినా చూడగలగడం మనసుకు చేతకాదు గాని అతీంద్రియమయిన అతిమానసానికి సమగ్రంగా గోచరమవడమే స్వభావమూ స్వధర్మమూనున్నూ.

అతిమానసపు చేతనశక్తి సృష్టించే విభూతియావత్తూ, ఆత్మరూపాలు యావత్తూ, దాని చూపులో ఉండటంమాత్రమే కాదు, మరి యీ అతిమానసం వాని అన్నిటిలో అంతర్యామియై ఒక ఆవిర్భావరూపంగా అనుస్యూతమై, ఆత్మప్రకాశకమయిన ఒక జ్యోతీరూపంగా ఉంటున్నది. ఆ అంతర్యామి రహస్యంగా విశ్వంలోని ప్రతిరూపంలోనూ ప్రతిశక్తిలోనూ వ్యాపించిఉన్నది.6 అతిమానసపు అకుంఠమయిన ఆజ్ఞచేతనే విశ్వవ్యాకృతీ శక్తీ ప్రవృత్తీ నిరూపితం అవుతూంది. అదే 'బహుత్వాన్ని ఒక గీటులో) ఉంచుతుంది, శాసిస్తుంది. అది సిస్పృక్షాతేజస్సున్న సంహతం చేస్తుంది, వెదజల్లుతుంది, పరిణామ మార్గంలోకి తీసుకపోతుంది. రూపంయొక్క జన్మలగ్నంలో లేక శక్తికి స్పందం మొదలయిన బ్రాహ్మముహూర్తంలో, దీని ఆత్మజ్ఞానంలో ఏది స్థిరీకృతం అయినదో దాని ప్రథమ ధర్మం దాని ననుసరించి అనగా విధానము ననుసరించి ఇదంతా జరిగిపోతుంది.—'తాని ధర్మాణి ప్రథమా న్యాసన్'7. ఇదియే ఈశ్వరరూపంగా భూతాల అన్నిటియు హృదయ దేశంలో ఉండి తన మాయచే సమస్తమునూ యంత్రం మీద కూచున్న బొమ్మలవలె తిప్పటం8 ఇతడే 'కవి' మరిన్నీ 'పరిభూః' అనగా సత్యద్రష్టా సర్వవ్యాపకుడూ ఇతడే. అనాదినుంచీ అన్ని పదార్థాలనూ ఉండవలసిన రీతిగా నియమించి పరిచాలితం చేసేది ఇతడే.

మన అందరలోనే కాక సమస్త ప్రపంచంలోనూ—సజీవంగానీ నిర్జీవంగానీ, సచేతనంగానీ అచేతనంగానీ సకల పదార్థాలలోనూ ఉండి వాని సత్తాక్రియలను పరిచాలితం చేసే శక్తీ—ప్రజ్ఞాఉభయమయమయిన అంతర్యామి ఉన్నదని (ఆ అంతర్యామి మనలో ఉన్నా) మనకు తెలియదు. కాబట్టి అంతర్యామి ఉన్న సంగతి ఎవరయినా చెప్పినప్పుడు ఆ అంతర్యామి అచేతనమో లేక అవచేతనమో అని అనుకుంటాం కాని అంతర్యామి నిశ్చేతనం కాకపోగా గభీరమయిన సార్వభౌమరూపంగా సచేతనం కాబట్టి ప్రతిపదార్థమూ బుద్ధియుక్తం కాకున్నా ప్రతిపదార్థంలోనూ మనకు బుద్ధితో కూడుకొన్న ఖేల కనబడుతుంది; ఎంచేతనంటే ప్రతిపదార్థమూ లోపల నున్న దివ్య—అతిమానసంయొక్క సద్భూత విజ్ఞానాన్ని (Real idea) మన్నిస్తూ పోవలసిఉన్నది, పశువులూ ఉద్భిదాలూ అంతర్యామిని అవచేతనంగానూ మనుష్యులు అర్ధచేతనంగానూ తలుస్తారు—ఈ పశువులకూ మనుషులకూ ఇంతే తేడా.

అంతటా అన్నిటా ఉండి అంతర్యామిరూపమయిన యీ నియమనం మనోమయమయిన తెలివితేటలు కాదు; అది అన్నివస్తువులను తెలుపుతుంది, వానితో అన్వితమవుతుంది. అంతర్యామియో ఉనికి నుండి విడదీయరాని ఎరుకయొక్క చేతనతో గూడిన సత్యం. ఇదే ఋత చిత్, లేక సత్యచైతన్యం. ఆ అంతర్యామికి లేక సత్యచైతన్యానికి భావన చేసిగాని మననం చేసిగాని దేనినీ తెలిసికోవలసిన పని పట్టదు. శుద్ధమూ అపాపవిద్ధమూ అయిన ఆత్మదృష్టి యొక్క అఖండ శక్తి ప్రభావంచే సజ్ఞానంగా ప్రతిదానినీ ఆ అంతర్యామి అన్నిటిని వికసింపజేసేయగలదు. మానసికమయిన తెలివితేట లయితేనో భావనయో మననమో చేయాలి, ఎందుచేతనంటే ఈ మానసికమయిన తెలివితేటలు చైతన్యంయొక్క ప్రతిఫలితమయినశక్తి లేక ఆభాస మాత్రం, దీనికి అసలేమిటో తెలిసికొనే ప్రకృతజ్ఞానం లేదు, కాని తెలిసికోవాలని ప్రయత్నిస్తుంది; అదియో కాలాన్ని తన గుప్పిట బట్టుకొని భూత భవిష్య ద్వర్తమానాల నొకేసారి

---

6. బృహదారణ్యకమునందలి అంతర్యామి బ్రాహ్మణము చూచేది (3-7-5) 'భూతములలో భౌతికములలో ఒకటేమిటి అన్నింటనూ ఉండి అన్నింటినీ నియమిస్తాడు అంతర్యామి. అత డున్నటులు వేనికీ తెలియదు అని ఆ బ్రాహ్మణానికి అంతటికీ అర్థం. ఈ 'అంతర్యామి ఎవరు?' అనే విశేష విచారణ బెల్లంకొండ రామారాయల గీతావ్యాఖ్యలో చూచేది. గీత 18-61 (అను.)

7. ప్రథమధర్మముల ననుసరించియే దేవతాగణం పని చేస్తుంది. ఈ ధర్మం లేక వ్రతం 'పూర్వ్యం' అనగా మౌలికం కాబట్టి 'పరమం' లేక సర్వశ్రేష్ఠం. ఇదే పదార్థాలలో అంతర్నిహితమయిన సత్య విధానం.

8. 'ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని
మాయయా' గీత—18—61. (అను.)

తెలిసికొనగల శాశ్వతమయిన ఒకానొక ప్రజ్ఞను తనకంటె ఉన్నతమయిన దానిని కాలపరంపరలో సోపానక్రమంగా అనుసరిస్తూ వెళుతూ ఉంటుంది.

అతిమానసమైన దివ్యచేతనయొక్క ఆదిప్రవర్తన ఈలాటిది: ఇది అఖండమయిన ఒక సత్యపు చూపు—ఇది సర్వాయతనమూ సర్వాభివాసమూ సర్వగతమూ దేశకాలాతీతమూ అవిభక్తమూ స్వాత్మావభాసమూ అయిన దాని ప్రత్యక్—చేతనలో విశ్వమూ విశ్వమూ సమాహితమై ఉన్నది; కాబట్టి దేశంలోనూ కాలంలోనూ విశ్వం యొక్క ఈ పరాక్—రూపనిర్మితి కనుపు కలుపునా అతిమానసపు సంఘాతి—సంవిత్ క్రమపరిణామమే కనబడుతుంది.

అతిమానస చేతనలో తెలిసికొనేవాడూ తెలివీ తెలిసికోదగినదీ ఈ మూడూ వేరు కావు, ఇవి మూలంలో ఒకటే. ప్రాకృత మనస్సు ఈ మూటిని వేరుచేసి విడివిడిగా చూస్తుంది, అలా చూడకపోతే దాని పనిపాటులు నిలిచిపోతై. త్రిపుటి లయమయితే మనస్సుకు సాధన మేమీ ఉండదు, స్వాభావికమయిన ప్రవర్తనాక్రమం అంటూ ఉండదు కాబట్టి, మనస్సు నిస్పందమూ నిష్క్రియమూ అవుతుంది. ఇందువల్ల మనస్సు ఏ రూపులో నేను నన్ను చూచుకోబోయినా నాకు ఈ త్రిపుటీ భేదాన్ని గురుతు పెట్టుకోవలసి ఉంటుంది. అపుడు మనసుకు 'మొదట నేను తెలిసికొనే వాని రూపులో ఉన్నానని, రెండు—నాలో నేను దేనిని చూస్తున్నానో అది నేను నా ఎరుకకు విషయముగా అనగా జ్ఞేయరూపంగా మనసులో తలపోస్తున్నాను, ఇది నేనేకాని మళ్ళా నేను కానట్లే; మూడు—జ్ఞానక్రియ లేక జ్ఞానవృత్తి ద్వారా ఈ తెలిసికొనేవానినీ లేక జ్ఞాతనూ మరి జ్ఞేయాన్నీ కలిపివేస్తున్నాను. కాని మననం కోసం ఈ భేదంయొక్క కృత్రిమ ధార వ్యావహారిక ప్రయోజనాన్ని అనుసరింపవలసి ఉన్నది, మూలసత్యాన్ని ఇది స్పష్టం చేయదు. ప్రకృతంలో తెలియువాని రూపులో ఉన్న నేనే తెలిసికొనే ఆ చైతన్యాన్ని, అనగా తెలిసికొనే వాడూ తెలివీ ఒకటే పదార్థమన్నమాట. నేనే వృత్తిరూపంగా ఉన్న తెలివిని, మళ్ళా తెలిసికోదగినదేదో అదీ నేనే, ఒకటే చైతన్యం యొక్క ఒక స్పందం లేక పరిణామం, గతి, లేక క్రియ అది, స్పష్టంగా మూడూ ఒకే ఒక సత్తా ఒకే క్రియ; వేరుగా మనసుకు తోచినప్పటికీ అవిభక్తం,—అవిభక్తం యొక్కయే విభక్తంవలె మనసుకు తోచే ప్రతిభా.; రూప - రూపంలోనూ వ్యవస్థితం అయిన రీతిగా ప్రతిభాతమయినప్పటికీ వస్తుతః అది అ-వ్యవస్థితం, అఖండితం. నేనులో ఈ అఖండమయిన ఎరుకను మనసు చేరలేదు, యుక్తిని బట్టి అందుకోగలదు, అర్థం చేసికోగలదు కాని ఈ భిత్తిమీద సహజమయిన వ్యావహారికరంగంలో సచేతనంగా మనస్క్రియను సాగించలేదు. ఏ 'చైతన్యాన్ని' నేను అని అంటామో దానికి వెలుపల వస్తువు లన్నీ ఉన్నవి, అక్కడ మనస్సు ఈ మూటిని ఒకటిగా చూస్తే ఒకే రంబాలు తెచ్చిపెట్టుకుంటుంది. లోకవ్యవహారంలో ఏకత్వం అనుభవానికి తెచ్చుకోడమే ఒక విషమ వ్యాపారం, ఏకత్వ బోధను కాపాడుకొంటూ ఎల్లప్పుడూ దాని ననుసరించి పని చేయడం మనసుకు విపరీతము, అది దానికి చేతకాని పని. ఎంత తరచి చూచినా ఇది ఒక వైజ్ఞానిక సత్యం అనే లెక్కలో మనసు దీనిని మన్నించగలదు; భేదజ్ఞానం మీద నిలిచిన దాని స్వాభావిక క్రియ దానిని నడిపేది కాబట్టి ఈ సత్యాన్ని బట్టి 'ఈ మూడూ ఒకటే' అని మాత్రం అనుకోవచ్చు. మనః ప్రక్రియతో ఈ సత్యసంబంధం తెలిసికోబోతే ఒక దృష్టాంతం మనం తీసికోవచ్చు. భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూందనే వైజ్ఞానిక సత్యం మనకు తెలుసు, కాని వ్యవహారదశలో ఇంద్రియాలకు సూర్యుడే భూమి చుట్టూ తిరుగుతున్నటులు బోధ ఉండిపోయింది. ఆ బోధ కృత్రిమమూ భ్రమపూర్ణమూ ఐనా దానిని పరిహరించలేము కాని ప్రకృత సత్యాన్ని వ్యావహారికబోధను శోధన చేసే పనికి లగింపజేయగలం, ఇంతమాత్రమే.

(మిగిలి ఉంది).



# నీటిబొట్టు

'కొలకలూరి'

ఎక్కడిదో నీటిబొట్టు
ఇక్కడ బడి చెడిపోయెను.
ఎక్కడిదో ఇసుకనేల
నింకిపోయి కృశియించెను.

ఆకాశ భవన నిర్మితి
కడుసు నంది యిచ్చు పేద
తనువు నురలి తావు దప్పి
ధరణి బడ్డ చెమట బొట్టొ!

నింగి పంట పొలముల కడ
నిలిచి కనులఒత్తులతో
వాన నిరీక్షించు రైతు
నానిన కన్నీటి బొట్టొ!

స్వర్లోకాక్ష
నవరించెడి అమృత పాత్ర
చింది పుడమి నాలికి పడ్డ
చిరచింతన సురబిందువొ!

నింగి లోగిలిలో కడుపు
నిండు కొరకు స్త్రీలు ఆవు
పాదుగు, బిందె నిండి పొవ
పిదుక బడిన పాల చుక్కొ!

ఎక్కడిదో జల బిందువు
ఇక్కడ బడి నశియించెను
ఎక్కడిదో నీటి బొట్టు
ఇసుకనేల కృశియించెను.

# నీ టి బొ ట్లు

ఇది యొక్కటి ఎటులిటులై
నది నిష్ఫల భావ జీవన వృధావ్యధలన్ !
ఇది యొక్కటె గతి పాడై
నది క్రూరవిధి కరతలమున చిదికి పోవన్ !

ఇది యొక్కటె యన నేమిటి ?
అవి యిది యనరాని యే యనంతపు గతులన్
ఉపబిందువులు పడినవో
ముదము చెడి విధము చెడి [illegible]ము చెడిన స్థితులన్ !

ఇది దివిలో సుఖాల నివ
సించి, వియత్తల మేఘ మాలికా
పదవి చరించి, జారె భువి
ప్రాణము నిల్పెడి నీటి బొట్టునై
కుదిరిన ప్రేమతో నిసుక
గుట్టలపై బడి యింకుచున్నదా?
కదలని గుండెకాయ నతి
కష్టముపై నడిపించుకొంచునున్.

భూదేవి స్వేదమువలె
బొటబొటబడె నీటిబొట్లు!
అణువణువున తనువంతట
కనుపించెను నీటిబొట్లు!

కొండ రాతిగుండె మీద
కురిసి బాధ పలవించెను.
కాలు పెనము వేడి మీద
సోలి చిట్లి విలపించెను.

నింగి వీడి నేల బడక
నిలచిన కడలిని కనియెను.
అనంత జలరాశి లోన
అడుగిడి చవిగొని మనియెను.

చివి కొమ్మల చిగురుటాకు
చిరునవ్వెడి నేలబడెను
పెనులోయల పచ్చికపై
కనుపించెను ప్రవహించెను.

## భా ర తి

పంట చేల నడుమన బడి
పైరుల ప్రాణము నిలిపెను
కాల్వ నదుల గట్టుల పడి
వదలి క్షేత్రాలు కలిపెను,

మంచి నీటి బావి చొచ్చి
మానవ దాహము తీర్చెను
ఊరు ప్రక్క చెరువు లోన
ఊరట పశువుల కిచ్చెను.

గరిక పోచ శిరము మీద
మెరిసిపోయె జల బిందువు
పూరేకల చెక్కిలిపై
పులకరించె ఉదబిందువు

మురిసి తామరాకు పైన
ముత్యమువలె కనుపించెను
ఆలచిప్పలోన చేరి
ఆణిముత్యమై మెరసెను

ఎక్కడిదో నీటిబొట్టు
ఇక్కడ బడి చెడిపోయెను
ఎన్నోవేల బొట్లు లోన
ఈ కొన్నియ స్థితి దప్పెను

ఏ బిందువు గుండె బరువు
ఎంతదన్న ప్రశ్నలేదు
ఏ బిందువు ఎట బడునో
ఈశ్వర సంకల్ప సిద్ధి !

పతన స్థితివలన నేమి
ప్రాధిక్యము లభియింపదు
పరమార్థము పరికింపగ
ప్రతి బిందువు భువి బంధువు.

---

# పాశ్చాత్య ప్రపంచంలో మార్క్సిస్ దర్శనం-5

## శ్రీ సిడ్నీ హుక్

మార్క్సిస్‌ను గురించి ఇప్పుడు వెలువరించబడుతున్న నూతన వ్యాఖ్యానము ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతానికి సంబంధించి వుంటున్నది కనుక, ఆ సిద్ధాంతం గురించి కొంచెం ఇచ్చట పరిశీలించవలసి వుంది. అయితే, మార్క్సిస్ తన చిన్నతనంలో వ్రాసి వదిలిపెట్టిన వ్రాతప్రతులను పరిశీలన చేయడం మాత్రం ప్రాయశః అన్యాయ మనిపిస్తుంది. దానిని, ఉత్తరకాల మార్క్సిస్టులు ఉద్ధరించకపోయినట్టయితే ఆ ప్రతి విశేషమంతా మార్క్సిస్ జీవితాన్నిగురించి కొన్నివిషయాలు తెలుసుకోగలంతవరకే పరిమితమై వుంటుంది. ఈ గ్రంథంలో మార్క్సిస్ యొక్క సాహసికత, ఉదాత్తమైన ఆత్మధర్మమూ అన్నీ గోచరిస్తాయి. ఇంగ్లండులో ఫ్యాక్టరీ సిస్టమును అమలుపరచిన అనంతరం అచ్చటి కార్మికవర్గం స్థితిగతులను గురించి ఏంగిల్స్ ఏవిధమైన ధార్మికాగ్రహాన్ని వ్యక్తం చేసి వున్నాడో అదే విధమైన ధార్మికాగ్రహాన్ని మార్క్సిస్ ఆదిమ ధనికవాద వ్యవస్థ క్రింద కార్మికవర్గం పడుతున్న అవస్థలను, ఆ తన తొలి గ్రంథంలో వివరించి వున్నాడు. మార్క్సిస్ సూక్ష్మపరిశీలనశక్తి, పదబంధ కల్పనా శక్తి కూడ ఇందులో గోచరిస్తాయి. ''పొలిటికల్ ఎకానమీ'' గ్రంథాలను మార్క్సిస్ విపరీతంగా చదువుతూ వుండిన పద్ధతి గూడ కనిపిస్తుంది. ఆ రోజులలో మార్క్సిస్ మీద మోజెస్‌హెస్ ప్రభావం అధికంగా వున్నట్టు చెప్పవచ్చు. ఆ ప్రభావం వల్లనే మార్క్సిస్ దృష్టి కమ్యూనిజం మీద పడిందనిపిస్తుంది. సర్వ విధాలైన నిర్బంధాల నుంచి మనుష్యునికి విముక్తి లభించాలంటే, ఒక్క కమ్యూనిస్టు సమాజంలోనే అది సాధ్యమన్న భావం కూడా ఆ రోజుల్లోనే మార్క్సిస్‌కు కలిగినట్టు తోస్తుంది. ఆ తర్వాత మార్క్సిస్ చాల పెరిగాడు. అందువల్ల నిజాయితీ కలిగి చెప్పాలంటే ఈ గ్రంథంలో మార్క్సిస్ విషయ ప్రస్తావం చేసిన పద్ధతి తాత్త్వికంగా అతుకుల బొంత వలె వున్నదని మాత్రమే చెప్పవలసి వుంటుంది. ఆ తర్వాత, మార్క్సిస్ చారిత్రక సత్పదార్థవాదాన్ని రూపొందించాడు. ఏ సిద్ధాంత పద్ధతులకు కూడా ఈ తొలి గ్రంథంలోని పద్ధతులు సరిపోని స్థితిలో మాత్రమే వున్నాయి. అందులో చెప్పబడిన యధార్థ విషయము లన్నవి స్వోపజ్ఞాలు కూడాకావు. అతిశయోక్తులు ఎక్కువ. స్పష్టత తక్కువ. శ్లేషలు, పునరుక్తులు మొదలైన విశేషాలు మెండు. ఎవడో ఒక కవి 'పొలిటికల్ ఎకానమీ'' అందలి ఉద్వృత్త విషయాలను చూచి వికటంగా విరసిస్తున్న విధంగా ఈ గ్రంథంలో కొన్ని భాగాలు నడిచాయి. విలియం బ్లేక్, విలియం మోరిస్ ఇంతకంటే, ఇటువంటి విషయాలను అందంగా వ్రాశారు.

ఇంతకూ, ఆత్మధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతం మతంలోంచి, ప్రత్యయవాద సంప్రదాయాలలోంచి పాదుర్భావం చెందిందని చెప్పవలసి వుంది. దాని చరిత్ర అంతే. దానిని చెప్పడంతో తత్సంబంధులైన సిద్ధాంతులు ప్రకృతి సిద్ధ మానవుణ్ణి ఒకణ్ణి భావన చేసుకున్నారు. ఈ భావనకు చరిత్ర లేదు. మూర్త స్థితి లేదు. అచటి భాషలోనే, దాని ఉత్పత్తి స్థాన లక్షణాలు అభివ్యక్తమవుతున్నాయి. మత సంప్రదాయాన్ని అనుసరించి చెప్పాలంటే, ఈ ఆత్మధర్మ ప్రత్యాఖ్యానం ఎడబాటు వంటిది. అది భగవంతుని నుండి ఎడబాటు. ఇలా ఎడబాటు చెందడం పాపం; భగవంతుని యందు అవిధేయంగా వుండడం. ప్రత్యయ వాద సిద్ధాంతం దృష్ట్యా అయితే, ప్లొటినస్ దగ్గరి నుంచి కూడా ఈ ఆత్మధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతం అన్యత్వ ధర్మంగాను, బహుత్వ స్థితిగాను చెప్పబడుతూ వచ్చింది. ఐక ప్రత్యయంలో విధాయకంగా జరిగే ఒకరకమైన విచ్ఛిత్తివలన ఇది సంభవమవుతున్నది. ఇది మార్మికమూ గూఢమూ అయిన విషయం. అనగా, ఎట్లా జరుగుతున్నదో చెప్పరానిదనిఅర్థము. ఇచ్చట మనుష్యుడు, ఆత్మ(Soul) అన్న మాటలకు అర్థం ఒక్కటే. ఈ మనుష్యుడు, లేక ఆత్మ ఆత్మధర్మ ప్రత్యాఖ్యానాన్ని ఎట్లా పొందుతున్నారంటే ఆ మనుష్యుడు లేక ఆత్మ పదార్థప్రపంచంలో, క్రియాప్రపంచంలో, బాధాప్రపంచంలో దిగి పడిపోవడంవల్ల పొందుతున్నారు. ఇలా పతనం చెందిన లేక భ్రష్టమయిన ప్రత్యగాత్మ యొక్క (Soul లేక Man యొక్క) ఆనందధామముఖీనమయిన యాత్రయే తదధిగమనానికి మార్గం. అనగా ఐకప్రత్యయం నుంచి లేక భగవంతుని నుంచి పతనం చెందిన మానవుడు తిరిగి ఆ భగవంతుని లేక ఐకప్రత్యయాన్ని చేరడానికి చేసే ప్రయత్నమే ప్రత్యగాత్మ జీవన మవుతున్నది. హెగెల్ ఈ సిద్ధాంతాన్ని ఇంకా లోతుగా ఆలోచించాడు. దానికి బాధతను, గాఢతను చేకూర్చాడు. అతని

చేరుల్తో దాని రూపం మారిపోయింది. ఇచ్చట అన్యత్వ స్థితి అన్నది, అపూర్ణత అన్నది లేదు. ఇప్పు డది పెరుగుదల పద్ధతిలో, అభ్యుదయ వ్యవస్థలో భాగమయిపోయింది. ఇది విడదీయరాని భాగం. ప్రకృతిలో, సమాజంలో, ఆత్మ(self)లో తుదకు జ్ఞానం ముందడుగులో ఈ పెరుగుదల విధాయక విషయమైంది. ఇచ్చట భగవంతుడు, లేక ఐకప్రత్యయం లేక పరమార్థ సత్తా తన్ను తాను లేక తన సంభావ్య సత్తాను తాను నిత్యమూ పుష్టిని పొందుతున్న వైవిధ్యంద్వారా సాక్షాత్కరింపజేసుకుంటుంది. ప్రపంచమూ—మనిషి, మానవ సమాజమూ—చరిత్ర అన్నవి సంఘర్షణ యొక్క, పాపం (evil) యొక్క లక్షణాల వలన క్రమక్రమ వర్ధితంగా యుక్తిసహములై అవభాసిస్తున్నవి. హెగెల్ దృష్టిలో ఆత్మప్రత్యాఖ్యాతము కాని మానవుని జీవితం వృధా జీవితం, అర్థసంలేని జీవితం, భావస్థితిని పొందని జీవితం అయిపోతున్నది. ఆత్మప్రత్యాఖ్యాతుడు కానివాడు రాయివలె పెరుగుదల లేక ఆగిపోతున్నాడు; సంఘర్షణ లేక చెడిపోతున్నాడు. అందువలన పెరుగుదల లేక, అభ్యున్నతి లేక వృధా మనిషి అయిపోతున్నాడు. పాపాన్ని అర్జనచేత జయించాలి. అప్పుడే మానవుడు నిరుద్ధమైపోయిన ఆత్మ సాక్షాత్కార గతినుంచి విముక్తుడు కాగలుగుతాడు.

ఫ్యూయర్ బాక్ ఈ సిద్ధాంతంలో మరికొన్ని మార్పులు చేశాడు. హెగెల్ చెప్పిన దానిలో మెట్ట వేదాంతం ఎక్కువగా వుంది. ఫ్యూయర్‌బాక్ దానిని తీసి వేశాడు. దానితో ఇచ్చట వటి ఆత్మధర్మ ప్రత్యాఖ్యానం మిగిలిపోయింది. మనుష్యుడు ఆత్మధర్మాన్ని వదులుకున్న వాడవుతున్నాడు. ఎందుచేత? మనుష్యుడు తన నైజధర్మం అర్థం చేసుకోనివాడయినాడు. తన అవసరాలను, తన కోరికలను, తన భ్రాంతులను, తనయందలి ధర్మభావప్రపంచాన్ని అర్థం చేసుకోలేనివాడయిపోయినాడు. అందువల్ల తనకు తనకే దూరమయినాడు. ఆత్మధర్మ ప్రత్యాఖ్యాతుడైనాడు. మతంలో మానవుడు తన యొక్క అవసరాలను అతిలోక విషయాలుగా పొడిగించి వానిని ఆరాధించడం జరిగింది. మతం ఎన్నిరకాలుగా వున్నా దాని రహస్యం జాతి ధర్మానికి తాత్త్విక స్థితిని కల్పన చేయడం. ఈ లద్విక్ ఫ్యూయర్‌బాక్ యువకులైన హెగెల్ సిద్ధాంతులను కదిపివేశాడు. ఆయన భావప్రపంచం యువ హెగేలియనులను ఊపి వేసింది. ఇప్పుడు వారు ఇలా అనడం మొదలుపెట్టారు: మనుష్యుని నిసర్గధర్మం అధఃకరింపబడుతుంది. ఈ అధఃకరణంలోనే మానవుని సర్వవ్యవస్థల రహస్యము ఇమిడి వుంది. వీరు మనుష్యుణ్ణి ఇప్పుడు వుద్ధరించడానికి, కార్యక్రమం పన్నడం మొదలుపెట్టారు. మనుష్యుడు నీతి అనీ, రాజకీయాలనీ, ఆర్థిక ధర్మమనీ ఏవో వృధా కల్పనలు చేసుకుంటూ ఒకరకమైన అసంబద్ధ ధర్మాలను కల్పించుకుంటున్నాడు. ఆ అపధర్మం నుంచి మానవునికి ముక్తిని, విముక్తినీ చేకూర్చాలి. ఇప్పుడు, ఈ ఆత్మధర్మ ప్రత్యాఖ్యానమన్నది పదార్థేతర ధర్మ సంబంధి అయిన భావం గాని, మత సంబంధమైన సిద్ధాంతంగాని కాకుండాపోయింది. ఇప్పు డిది మేధావిషయకమైన మానసికతత్త్వసంబంధమైన సిద్ధాంత మయిపోయింది.

చివరకు దానికి సమాజ తత్త్వ సంబంధమైన స్థితి కూడా ఏర్పడిపోయింది. మానవుని మనస్సు అనేక విధాలైన అమూర్త భావ వాయువుల చేత తాడితమవుతున్నది. అందువలన మానవుని దృష్టి అసలు విషయాల నుంచి తిర్యఙ్ముఖం చెందుతున్నది. మానవుడు తన వ్యవస్థలను తానే అర్థం చేసుకోలేకపోతున్నాడు. ఈ వ్యవస్థలకు వేరే ప్రాణం ఏదో వున్నట్లు కనిపిస్తున్నది. మానవుడు బలి అయిపోతున్నాడు. ఇవి అన్నీ ఎలా జరుగుతున్నదీ, ఎలా తలఎత్తుతున్నదీ, ఎలా పని చేస్తున్నదీ బయటపెట్టి వేస్తే అప్పుడు మానవునికి ఈ వృధా ధర్మా ధర్మాల నుంచి విముక్తి పొందే మార్గం గోచరమవుతుంది.

హెగెల్ ప్రభావం, ఫ్యూయర్‌బాక్ ప్రభావం, యువ హెగేలియన్ల ప్రభావం Economic Philosophical Manscripts[15] లో ప్రతియొక్క పేజీలోనూ స్ఫుటంగా కనిపిస్తున్నది. ఫ్యూయర్‌బాక్ చెప్పినట్టే, యువహెగేలియనులు చెప్పినట్టే సిద్ధాంతాన్నే ముందుకు తీసుకుపోతున్నట్టు అందులోనే చెప్పబడి వుంది. అయితే, ఇచ్చట అది పొలిటికల్ ఎకానమీకి అనువర్తింపజేయబడింది. ఈ పనిని అంతకుముందు కూడా కొందరు చేశారు. వీట్లింగ్, హెస్, ఏంగిల్స్ అట్టివారు. సర్వమైన ఆర్థిక ధర్మాలలోను మానవుని ఆత్మధర్మం ప్రత్యాఖ్యాత మవుతున్నది. దానిని విజిజ్ఞాసించడమే పొలిటికల్ ఎకానమీ అంటే ఈ మీమాంసలో "పని" (labour) ప్రధానమైంది; "పనివాడు" (labourer) ప్రధానుడయినాడు. ఆత్మధర్మ ప్రత్యాఖ్యానానికి ఆ "పని" ఈ "పనివాడు" అభివ్యక్తులు. తరువాత తరువాత ఈ ఆత్మధర్మ ప్రత్యాఖ్యానపు వేరువేరు రకాలను చెప్పడంలో మార్క్స్ చాల గందరగోళపడినాడు. ఒక విషయం చెప్పడానికి, మరొక విషయం చెప్పడానికి వేరువేరు పరిభాషలను కాక ఒకే రకమైన పరిభాషను వుపయోగించాడు. మనుష్యు డున్నాడు. అతనికి అనుకూలమయిన పరిస్థితులు వుండవు. సంక్షేమానికి సంబంధించిన శాసనాలు లేకుండా ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికు లున్నారంటే, వారిచేత ఎక్కువగా పని చేయించుకోడం మొదలయిన పనులు జరుగుతూ వుంటాయి. ఇది ఒక పరిస్థితి. ఇది జరుగుతూ వుంటుంది. పెద్ద విశేషమయిందేమీ కాదు. ఇటువంటి విషయాన్ని తీసుకుని మార్క్స్ మనుష్యుడు మనుష్యుణ్ణి ఏ పని కోసం కూడా వుపయోగించడమంటూ లేని ఒకానొక స్థితి దాకా తీసుకుపోయి మీమాంస చేస్తూ వచ్చాడు. ఇలా చేయడం వల్ల ధనిక వ్యవస్థలో పనితనం అన్నది ఎట్లా మనుష్యుని నుంచి ప్రత్యాఖ్యాపితం అవుతున్నదో చెప్పవలసిన చోట తదితరాలైన విషయాలను, భావాలను తెచ్చి పెట్టడం చేత ఆ భావాలలో, ఆ విషయాలలో ఈ భావం తప్పిపోతుంది.

15. Marx-Engels Gesamtausgabe (Berlin: Marx-Engels Verlag, 1932, Erste Abteilung, Bd 3), pp 33–172.

ఈ Manuscripts లో మార్క్స్ చెప్పదలచు కున్నది ఏమిటి?— ఒక్క ప్రశ్న వేసుకుంటే, ఆయన చెప్పగలచు కున్న విషయం ఏమిటో కొంతకుకొంత అవగతం అవుతుంది. ఆత్మధర్మ ప్రత్యాఖ్యానం కాని మనిషి ఎవడు? ఎవరిని ఏ పరిస్థితులలో అట్టి మనిషిగా భావించవలసి వుంటుంది? మార్క్స్ ఎట్టి మనిషిని అట్టివాడుగా భావించాడు? ఈ ప్రశ్నకు కుదిరే సమాధానం ఈ విధంగా వుంటుంది. మనిషి వున్నాడు. అతడు నిర్బాధితము, సృజనాత్మకము అయిన కృషిలో ఏ మనిషి వైయక్తికమైన సంపూర్ణ సౌర్స్ఫూర్తిని పొందగలుగుతాడో ఆ మనిషి మాత్రమే ఆత్మధర్మ ప్రత్యాఖ్యానుడు కానివాడు. అంటే బహిరావరణ నిర్బంధించేది కాక, అంతరంగ ప్రచోదనంచే విశిష్టమైన పనిని, లేక కార్యమును చేయగలుగుతున్నాడు. అంటే ప్రజ్ఞగలవాడు, శిల్పి, లేక సరాయణబుద్ధికలిగిన వ్యక్తి జీవి. ఇట్టివాడు ఒక దృష్టి ని లేక ఒకకార్యం కేంద్రంగా పెట్టుకుని తన కృషిని కొనసాగిస్తూ వుంటాడు. ఆకేంద్రం చుట్టూ తన అనుభవాలను వ్యవస్థీకరించుకుంటాడు. ఆ కేంద్రమే యుక్తి సహము, సంతృప్తికరము అయిన అర్థాన్ని లేక పరమార్థాన్ని అతని జీవితానికి సమకూర్చి పెడుతుంది. ఇదొక ఆదర్శం. ఈ ఆదర్శం ప్రాణంగా సామాజిక వ్యవస్థలను, మర్శనం చేయవచ్చు; మార్చవచ్చు. మానవ జీవుం యొక్క జీవితంలో ఒక అర్థాన్ని సంపాదన చేయగల విధంగా ఈ మర్శనం, ఈ మార్పు జరగడానికి ఆ ఆదర్శం పనికి వస్తుంది. ఇది గొప్ప ఆదర్శం. దీన్ని గురించి పెద్దగా చెప్పవచ్చు. అయితే, ఒక సంఘం సమస్తమునందలి కార్మిక బలానికి ఈ రకమైన శీలం సం కమిస్తుంది అంటే, అది శశవిషాణంవంటిదేనని మార్క్స్‌కు, ఏంగిల్స్‌కు ముందు వున్న ఉటోపియనులు చెప్పిన ఆదర్శములు ఎటువంటివో, ఇది కూడ అట్టిదేనని చెప్పవలసి వుంటుంది. సైన్సు వచ్చి సర్వమైన ఐహికపు కొరతలను తీర్చడానికి సమర్థమైనదయినప్పటికిన్నీ ఇది యింతే.

మార్క్స్ ఈ విషయాన్ని గురించి ఇదే విధంగా భావించా డనడానికి కార్మిక ఆత్మధర్మ ప్రత్యాఖ్యానాన్ని గురించి ఆయన చెప్పి వున్న మాటలను బట్టి తెలుసుకోవచ్చు. ఫ్యాక్టరీ పద్ధతి కింద కార్మికుని విషయం గురించి మార్క్స్ వివరించి వున్నాడు:

"పని పనివానికి బాహ్య విషయం. అనగా, అది అతని నిసర్గ ధర్మంలో భాగం కాదు. కాబట్టి అతడు ఆ పనిలో తనకు తాను సంపూర్ణుడు కాలేకపోతున్నాడు. అతని పని స్వచ్ఛందము కాదు; బలవంతము, బలవంతపు పని."

ఇది ఆత్మధర్మ ప్రత్యాఖ్యానం. ఇందువలన ద్వైతభావం ఏర్పడుతున్నది. అది సుపరిచితం. ఈ ద్వైత మెచ్చటననగా, జీవితం కొరకు ఆర్జన, జీవితమును జీవించుటల మధ్య. ఇ నూ మార్క్స్ ఇతర విధాలైన ఆత్మధర్మ ప్రత్యాఖ్యానాలను కూడా చెప్పి వున్నాడు. కార్మికుడు వున్నాడు. అతడు చేసే వస్తువులూ అతనివి కావు. వానిని ఎలా ఉపయోగించాలి, ఎలా వినిమయం చేయాలి, ఎలా అనుభవించాలి అన్న విషయాలలో అతని ఇష్టానికి వెళ్లడానికి లేదు. ఆ వస్తువులను కాని జీవితం వారికున్నది. ఆ జీవితం పనివాని కంటే స్వతంత్రమైనది. పనివానికి విరోధి పక్షంగా నిలిచింది. అది అతనికి పరాయిదయిన, విరుద్ధమైనా అయిన శక్తి. ఇప్పుడు మన ఉపమానం ప్రశ్నకు వస్తుంది. ఏ సమాజంలో నైనా స్వతంత్రులైన ఉత్పత్తిదారులే తాను సృష్టించిన వస్తువులను ఉపయోగించడం, వినిమయం చేయడం, సాధ్యమైనా అన్నది ఇప్పుడు ప్రశ్న. ఉదాహరణకు ఒక సమాజం వున్నది. ఆ సమాజంలో మానవుడు **వంతెనలను** నిర్మిస్తున్నాడు, రోడ్లు వేస్తున్నాడు, సొరంగాలు తొవ్వు తున్నాడు. ఇదంతా ఆటవిడుపు సంపాదించడంకోసమే చేస్తున్నా డని అనుకుందాము. అయినా, అతడు, ఆ మానవుడు అవి తన కన్నా స్వతంత్రములైన శక్తులని తన పైన విరోధం చేసి ప్రమాదం తెచ్చి పెట్టగలవని అనుకోడు.

మూడవ పద్ధతి ఆత్మధర్మ ప్రత్యాఖ్యానం కూడా ఒకటి వుంది. ఇది ఇంకా విచిత్రమైంది. దీనిని "Objectification" పద్ధతిలో మార్క్స్ వ్యక్తం చేసివున్నాడు. వస్తు ప్రకృతి మీద అధికారమునూ, వస్తూత్పత్తిలో తన వస్తు వాంఛలను తీర్చుకుంటూ, మనుష్యుడు తన్ను తాను ప్రాకృతిక వస్తు స్థాయికి తెచ్చుకుంటున్నాడు. ఇప్పుడు అతని సర్వక్రియా కలాపమున్ను పాశవిక క్రియాకలాప స్థాయికి వస్తున్నది. "మనుష్యుని జీవితక్రియకు పశువుయొక్క జీవితక్రియకు ఒక్క తేడా వుంది. అది ఎరుక." మనుష్యుడు ప్రకృతిలో ఒక అంశం. కాని, విశిష్టమైన అంశం. అతనికి ఆకలి వుంది. ఆకలి తీర్చు కోడంకోసం పని చేస్తాడు. సౌందర్యం మొదలయిన విషయా లున్నాయి. సత్యం వుంది. సామాజికమైన ప్రయోజనమూ వుంది. వీనిని వేనినీ గణించక అతడు ఆ పనిని చేసినట్లయితే, అప్పుడతడు తనలో వున్న మానవునకు ద్రోహం చేస్తున్నాడు. తన యొక్క మానవీయమైన క్రియాకలాపంగా అభివ్యక్తిని పొందవలసింది ఏది వుందో దానిని తన యొక్క దైహికమైన ఉనికిని మాత్రం సంతృప్తిపరచుకోడానికి సాధనంగా మాత్రం పర్యవసింపజేసిన వాడవుతున్నాడు. ఇచ్చట దూరాన్వయ దోషం కనిపిస్తుంది. మనుష్యునిలో మనిషి కూడా మనిషే. ఆ మనిషి ఎప్పుడూ తన పరమార్థస్వరూపం శిరస్సుపై తాండవం చేస్తూ వుండలేడు. దైహిక అవసరాలను తీర్చుకొనడమనే నిర్బంధం కింద ఎటువంటి వస్తూత్పత్తి కొనసాగినప్పటికినీ అదంతా తుచ్ఛమని మార్క్స్ భావం అయినట్లు తోస్తుంది. మనుష్యుడు గనుక తన్ను తన వానిని ప్రాకృతిక శక్తుల నుంచి సంరక్షించుకొనడానికి ఒకానొక నీడను కల్పించుకున్నాడే అనుకుందాం. ఆ కల్పించు కొన్నంతనే ఆ మనుష్యుడు ఆత్మధర్మ ప్రత్యాఖ్యానపు అరణ్య వాసంలో పడిపోతున్నట్లు ఈ పద్ధతిని బట్టి మనం అర్థం చేసుకోవలసి వుంటుంది.

మార్క్స్, ఇంకో రకమైన ఆత్మధర్మ ప్రత్యాఖ్యానం గురించి గూడా చెప్పాడు. ఇది నాల్గో రకం. మనుష్యుడు ఉన్నాడు; మనుష్యులు వున్నారు. ఇతర మనుష్యుల నుండి మనుష్యుడు వేర్పడుతున్నాడు. అనగా ప్రత్యాఖ్యాపితుడవుతున్నాడు. ఇది రెండు విధాలుగా జరుగుతున్నది. మనుష్యుడు తన యందలి మానుషానికి తన యొక్క దైహికమూ, ఐహికమూ అయిన వాంఛలు తీర్చుకోడం కోసం ద్రోహం చేసుకుంటున్నాడు. పశువులాగా ఇతరులయిన మనుష్యులయెడల వ్యవహారం చేస్తున్నాడు. తత్ఫలితంగా ఆత్మధర్మం ప్రత్యాఖ్యాపిత మవుతున్నది. ఇదొకటి. రెండవ పద్ధతి—మనుష్యునికి ఇతర మనుష్యులతో సంబంధం ఏర్పడుతున్నది. వస్తూత్పత్తి క్రమవిశేషంచేత ఈ సంబంధం సంక్రాంత మవుతున్నది. ఈ సంబంధ విశేషంలో మనుష్యుడు తనకన్నా ఇతరులైన మనుష్యులను సోదరుల వలె చూడడం లేదు. భావించడం లేదు. తనకు పోటీదారులనుగా, తన్ను వుపయోగించుకుని లాభం పొందుతున్నవారినిగా భావిస్తున్నాడు. కార్మికుడు వుత్పత్తి చేసినది కార్మికునిది కావడం లేదు. తదితరుడైన మనుషిది అవుతున్నది. ఈ సంపర్కాన్ని బట్టి ఆ ఇతరుడు "కార్మికుడయిన వాడు ఏది తనకు నరకమైన యాతనగా అనుభవిస్తున్నాడో, దానిని తనకు సుఖాన్ని, భోగాన్ని ఇచ్చే క్రియాకలాపంగా" అనుభవాన్ని పొందుతున్నాడు.

ఇచ్చట ఆత్మధర్మ ప్రత్యాఖ్యానపు దొంతరలు సిద్ధమవుతున్నాయి. ప్రైవేటు ఆస్తి వున్నదంటే, అది ప్రత్యాఖ్యాపిత "కృషికి" కారణం కాదు. కాని, దానియొక్క విధాయకమైన ఫలము. అందువల్ల ఈ ప్రైవేటు ఆస్తి అన్నది మనుష్యుడు తన్ను మానవుడుగా దిద్దుకోడానికి సాధనంగా వుపయోగపడడానికి బదులు మనుష్యుడు మనుష్యుని పట్ల, ఆదిమమైన నేరాన్ని ఆచరించడానికి ఉపకరణ మవుతున్నది. ఆత్మధర్మ ప్రత్యాఖ్యానానికి వేతనపు పద్ధతి యొక్క వునికి ఇంకో గుర్తు. ఇది చెరపరానిది. మనుష్యులు వేతనం కోసం పని చేస్తున్నంత కాలం వారు మానవ ధర్మాన్ని గాని, పరమార్థాన్ని కాని, పరిపూర్ణముగా సాధించలేకపోతున్నారు. పని చేసేవారికి మంచి జీతాలు లభిస్తున్నాయి అనుకుందాము. అది పెద్ద విషయం కాదు; బానిసలకు మంచి ప్రతిఫలం యివ్వడం వంటిది. ప్రతి ఒక్కరికీ ఏకరూపమైన ప్రతిఫలం ముడుతున్నది అనుకుందాం. అప్పుడు కార్మికుల విషయంలో ప్రత్యేకమైన పనికి సంబంధించినంతవరకు ఏది యథార్థమో అదే ఆ సమాజంలోని ప్రతి ఒక్కరి విషయంలోనూ యదార్థం అవుతున్నది. వారు చేసే పని ఏమైనా కావచ్చు. విషయం అంతే. "అప్పుడు సమాజాన్ని అమూర్త, ధనికవర్గ పద్ధతిలో భావనం చేయవలసి వుంటుంది" ప్రతిఒక్కరూ ఇచ్చట సమాను లవుతున్నారు. నిజమే. కాని, ఇది బానిసల సమానత్వం వంటిది.

ఈ జాబితా నిజానికి పూర్తికాలేదు. అయితే, దీనిని ఇచ్చట ముగించడం మంచిది. కార్మికుని ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం మూలంగా, ప్రైవేటు ఆస్తి ఏర్పడుతున్నది. అది మొదలు కర్మ విభజనం జరిగి, మరి ఒక రకమైన ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం సంభవమవుతున్నది. ఇది మనుష్యుణ్ని చీల్చివేస్తున్నది; ముక్కలు చేస్తున్నది. డబ్బు వాడకంలో ఇంకొకరకమైన ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం ఇమిడివుంది. ముఖ్యంగా బంగారం వినిమయద్రవ్యంగా వినియోగించడంలో ఇది కాష్ఠను పొందింది. రాజకీయమైన రాజ్య వ్యవస్థ పైకిరావడంతో సమాజానికీ మనిషికీ మధ్య అడ్డు తెరలు లేచాయి. ఇది ఇంకొక రకమైన ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం. మనుష్యుని పేరాస మూలాన మరొక రకమైన ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం ఏర్పడుతున్నది. మనుష్యుడు మానవీయమైన సభ్యతకు, మానవీయ సమాజానికీ దూరమైపోతున్నాడు. ఈ రకమైన వివరణం అంతటిలోను, కొంత సూక్ష్మ పరిశీలన, కొంత కట్టుకథ, మరికొంత అయోమయం ఇమిడివున్నాయని తెలుసుకొనడం పెద్ద కష్టమేమీ కాదు. ఇప్పుడు, పారిస్‌లోను, న్యూయార్క్‌లోను సాహిత్య నాగరకులలో తలఎత్తుతున్న ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతాలు గూడా ఇట్లాగే వుంటున్నాయి.

ఈ మార్క్స్ తన మొదటిManuscriptsలో ఈసిద్ధాంతాన్ని కొంత చెప్పాడు. అందులో ప్రైవేటు ఆస్తికి ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానమే కారణమని అన్నాడు. ప్రైవేటు ఆస్తి ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానానికి కారణంకాదని తేల్చాడు. ఇట్లా చెప్పడంచేత మార్క్స్‌ను మనం స్వభావవాది అనలేము. పూర్తి పదార్థవాది అని అనడంకూడా కష్టం. మనుష్యుడు మానవీయతా సంపన్నుడు ఎట్లా అవుతున్నాడు అంటే, అతనియొక్క తాత్త్విక స్వభావమే (spiritual nature) ఇందుకు కారణమని మార్క్స్ అన్నాడు. మనస్సుయొక్క లక్షణాలు చైతన్యం మొదలయినవి పశు ప్రపంచంనుంచి, వృక్షప్రపంచం నుంచి మానవుణ్ని వేరుచేసి విశిష్టున్ని చేస్తున్నాయి. ఐహిక పరిస్థితులనుబట్టి, అవసరాలనుబట్టి, శరీర ధర్మాన్నిబట్టి మనుష్యుణ్ని నిర్ణయించినంతవరకు మనిషి నిజంగా పూర్ణమానవు డనడానికి లేదు. పూర్ణమానవు డనిపించుకోడానికి అతడు తన జీవితాన్ని మనస్సునకు వలెనే సర్వ స్వతంత్రాలైన అభినివేశాలలోను ప్రవృత్తులలోను తన్ను తాను అభివ్యక్తుణ్ని చేసుకోవలసివుంటుంది. అప్పుడు మానవుడు దేవతవలె వ్యవహరించడం జరుగుతుంది. అచ్చట పదార్థ జగత్తుయొక్క బలవంతాలుగాని, ప్రాకృతిక విధాయకాలయొక్క ఒరిపిడులుగాని వుండవు. వాటినుండి నిర్ముక్తుడై మనుష్యుడు తన్ను అభివ్యక్తం చేసుకుంటాడు. మార్క్స్ పరిణత మనస్కుడు, సిద్ధాంతిఅయిన తర్వాత వ్రాసిన గ్రంథాలలో మనుష్యుని మానవతాచ్యుతినిగురించి వ్రాసివున్నాడు. అయితే,ఇచ్చట చారిత్రక పరిస్థితులయొక్కయు సమాజపరిస్థితులయొక్కయు ప్రసక్తివుంది. ఈప్రత్యేకపరిస్థితులనుబట్టి మనుష్యుడు అట్లా అయిపోతున్నాడు. దీనిని మార్క్స్ "ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం" కింద ఇప్పుడు పేర్కొంటూ వచ్చాడు. ఇది, మానవుని సహజ స్వభావానికి, యథార్థ స్వభావానికి సజాతీయమైన విషయం కాదు; విజాతీయమైంది; మరిన్నీ బాహ్యంనుంచి విధించబడినట్టిది. ఇచ్చట గూడా అభ్యం

తరం చెప్పదగు విషయాలు వున్నాయి. అవి ప్రైవేటు ఆస్తి నియతమైన చారిత్రక సమాజంలో వ్యవహృతిని చెందేరూపాలను గురించి మార్క్సిస్ చేసిన పిడివాదాలకు సంబంధించినవి.

ప్రైవేటు ఆస్తియొక్క ఉనికికి, స్థితికి ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానమే కారణమని యువ మార్క్సిస్ వాదిస్తూ వున్నప్పుడు, అతడు బైబిలులోని Genesis నందు కథంతో వున్న అర్థాన్నే అభివ్యక్తం చేస్తున్నాడు. ఇది తెలిసిచేస్తున్న పని కాదు. ఆయనకు తెలియకుండానే అచ్చట ఆ పని జరిగి పోతున్నది. మనుష్యుడు భగవంతునియందు అవిధేయతను చేశాడు. భగవంతుడు మనుష్యుడిని శిక్షించాడు. బానిస చాకిరీ శిక్ష వేశాడు. దానితో అతని పురుష ప్రజ్ఞ మనుష్యుని యందు, స్త్రీ ప్రజ్ఞ Eve అందు రూపాంతరం చెందాయి. భగవంతునిలో అయితే మార్క్సిస్‌కు నమ్మకం లేకుండాపోయింది కాని "పతనం"లో నమ్మకం మాత్రం పోలేదు. "దూరమై పోవడం"లో, ప్రత్యాఖ్యానం చెందింపబడడంలో మార్క్సిస్‌కు నమ్మకం సడలిపోలేదు. మతంలో నమ్మిక గలవాడయితే, ఈ ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానాన్ని చెప్పడంలో సంవాదం కుదురు తుంది. మార్క్సిస్‌కు కుదరదు. అతనికి అది లేదు. "ప్రత్యాఖ్యానం", "వేరు కావడం" మొదలయిన పరిభాషకు పదార్థ వాదంలో చోటు లేదు. అవి అచ్చట పూర్తిగా విజాతీయమైన విషయాలు. పదార్థ వాదంలో మనుష్యునికీ,ప్రకృతికీ అభేదమేకాని పరాయితనం వుండదు. తక్కిన జంతుజాలంవలెనే ప్రకృతికీ మానవునికీ పదార్థ వాదంలో సంవాదం ఏర్పడివుంది. స్వర్గం నుంచి పతితుడైన ఒకానొక దేవత పదార్థ జంబాలంనుంచి తన్ను తాను విముక్తుణ్ణి చేసుకోడానికి పడే ఆరాటం, సాగించే పోరాటం పద్ధతిలో మార్క్సిస్ తన తొలి గ్రంథాలలో మనుష్యునియొక్క ఆకారప్రజ్ఞలను కవిత్వపుభాషలో కట్టి మనకు చూపించాడు. అంతేకాని, జీవనంకోసం ఉపకరణాలు చేసుకునే మానవుడు, సంకేతాలను ఉపయోగం చేసే మానవుడు మనకు యువ మార్క్సిస్‌లో కనిపించడు. మనుష్యుని స్వార్థానికి పేరునకు అంతులేని కారణంచేత, ప్రైవేటు ఆస్తి ఏర్పడు తుందనే విధంగా ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతాన్ని వ్యాఖ్యానం చేయాలి అంటే, అది సెయింట్ ఆగస్టైనుకు, కాల్విన్‌కు ఉపయోగపడినట్లు, వారు దానిని ఉపయోగించగలట్లు మార్క్సిస్టులు ఉపయోగించుకొనడం అంతగా కుదరదు. మార్క్సిస్ పుస్తకం ప్రకటించబడినఅనంతరం ఈ మార్క్సిస్టులు ప్రైవేటు ఆస్తి స్థితిగతులను ప్రకరణంచేసి స్వార్థాన్ని, పేరాసను వివరించడం జరుగుతున్నది. కాని, ఈ సిద్ధాంతం ఇచ్చట వీరికన్నా అచ్చట ఆగస్టైన్‌కు, కాల్విన్‌కు ఉపయోగపడగలట్టిది.

మార్క్సిస్ వివిధ రకాల ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానాలను గురించి చెప్పివున్నాడు. ఇవన్నీ ఎల్లప్పుడూ ప్రతివిధంగానూ, నైతికంగా నిరసించడానికి యోగ్యమైనవి అన్న ప్రశ్న కూడా ఇచ్చట వుంది. ధనిక సమాజంలో కృషి విభాగంవల్ల మానవుడు మానవునికి దూరమైపోయాడన్న సిద్ధాంతం వుంది. ఇది నిజంగా నిరసించదగిందా అనిపిస్తుంది. చారిత్రకంగా చూస్తే లేక ఇప్పటి పరిస్థితులతో చూచినా ప్రత్యేక వృత్తులలో లక్షలాదిమందివారు తమ శక్తిచేత మానవుని వ్యక్తిత్వానికి, మానవుని సహజానికి కూడా విముక్తి, ఇష్టసిద్ధి చేయాల్సిన దరం చూపుతున్నారే వున్నారు. ప్రత్యేక వృత్తులయందు ప్రజ్ఞాను సంపాదించడం సంపూర్ణవ్యక్తి లక్షణాలేమీ లేదు. కొంత స్థితి అట్లా వున్నా అంతా అట్లా కాదు. కొన్ని సందర్భాలలో ప్రత్యేకతా సంపాదన మనుష్యులకు సంబంధించిన బాహ్య వ్యాపారాలపై అధికారం సమకూర్చే కారణంగా వుంటుంది. ఈ ప్రత్యేకతను పనుల సంపాదించాలి అన్నది లేక ప్రత్యేక కృషులు అయినా వుండవచ్చును అన్నది అసలు మనుష్యులు అన్ని పనులూ చేయలేక పోవటమన్నస్థితి పుట్టి కించబట్టి ఏర్పడినదిగా వుంది. అందరూ అన్నీ చేయగలిగినా, అందరూ అన్నీ చక్కగా చేయలేరు, కొందరే చేయగలరు. ఇందువలన మనుష్యుడు పనిరకాలను కూర్చేడు వాడుగా లేక కూర్చిపెట్టేడు వాడుగా పనిచేయు వలసిన అవసరం లేదు. ఎప్పుడు ఉత్పత్తి వృత్తికోసమూ, లాభార్జన కోసమూ ఇది—ప్రత్యేకత సంపాదించటం—జరుగు తున్నదో అప్పుడు మాత్రమే అది నీచంలో పడుతున్నది. సమాజంకోసం కాక స్వంతంకోసం వస్తువులు తయారు చేసే పద్ధతిలో వుత్పత్తి వ్యవస్థవున్న సందర్భాలలోకూడా కృషి విభాగం ఆత్మసంయోజనానికి దారితీసేవిధానంగా వుపయోగపడుతు స్థితి వున్నది. కాని, ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానానికి కారణం కావలసిన పద్ధతి గోచరించదు. మార్క్సిస్ తన తొలిరచనలో కృషి విభాగాన్ని విధాయకమైన ఆత్మ ధర్మప్రత్యాఖ్యాన రూపవిశేషంగా వర్ణించి వున్నప్పుడు అచ్చట మార్క్సిస్ విచారధారకు మతంలోనే మూల కారణం వుందని విశదంగా తెలుస్తూనే వుంది. మనుష్యుడు సర్వ ప్రజ్ఞుడూ కాకపోవచ్చు. సర్వోపజ్ఞుడూ కాకపోవచ్చు.కాని, భగవంతుడు చేసే, అన్ని పనులనూ మనుష్యుడు కూడ చేయ వచ్చు. చాలావరకు చేయగలడు. ఇది మానవుణ్ణి గూర్చి మతంలోవున్న భావన. మనుష్యుడు తన్ను తాను సృష్టించు కొన్నవాడుకాకపోయినప్పటికినీ, తనకు కావలసిన వస్తువులన్న సృష్టించుకో గలడు. ఇప్పుడు ప్రత్యేక ప్రజ్ఞలయందు అభినివిష్టమైన బుద్ధి గలవాడయితే, అతడు అనగా ఆమాన వుడు పరిమితుడై పోతున్నాడు. బాహ్య నిర్బంధాలకు లోనై పోతున్నాడు. తన నైజస్వభావానికి, లేక ఆత్మకు దూరుడై స్వభావ ధర్మ ప్రత్యాఖ్యాపితుడు అవుతున్నాడు. సంతానప్రజనన కర్మ కృషి విభాగంలో ఆదిమస్థితి అని మార్క్సిస్ నమ్మకం. ఇందులో, ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానాన్ని చూడడంఅంటే,సంపూర్ణుడైన మానవుడు పరమార్థస్థితిలో స్వయంరమణం చేసు కొనే ఒకానొక జీవి విశేషంగా వుండి వుంటాడని అనుకున్నప్పుడే అది సాధ్యమవుతుంది. పూర్వకాలంలో దేవతలలో స్వయం రమణపరాయణులు ఉండే వార్తని ప్రతీతి.

మార్క్స్ వ్రాసిన Economic Philosophical Manuscripts ను ఎంతటి సానుభూతితో చూద్దామనుకున్నా, పైన చెప్పిన యిబ్బందులు చాలా ఎదురవుతుంటాయి. మార్క్స్ పెద్దవాడయి తన పరిణత దశలో చారిత్రక దృక్పథాన్ని ప్రస్తరించడం ప్రారంభం చేసిన అనంతరం నుంచీ ఈ ఇబ్బందులు మరీ తీవ్రమయి గోచరిస్తాయి. మనుష్యుడు దూరమయినాడు. ప్రత్యాఖ్యాతుడయినాడు. దేనినుంచి? స్వభావ సిద్ధమైన ఆత్మ (self) నుంచా? లేక ప్రత్యయాకృతమైన ఆత్మ (self) నుంచా? సమాజ మనస్తత్వ వ్యవహారంలో మార్క్స్ చేపట్టిన మార్గాన్ని అనుసరించి చూస్తే, అందులో ఎక్కడా స్వభావ సిద్ధమైన ఆత్మగాని, పారమార్థికమైన ఆత్మగాని ప్రసక్తమవడానికి, వుండి జగత్తుకు సమాజానికి ప్రతిగా వుండి స్థితిని పొంది, దానినుంచి వేరవుతున్నదని చెప్పడానికి వీలుగాని లేదు. ఈ Manuscripts లో మార్క్స్ హెగెల్ ను అనుసరించి సమాజానికి, వ్యక్తికి విరోధం వున్న దనే భావనను తిరస్కరించి వున్నాడు. వ్యక్తి అనేవాడు "సమాజజీవి". ప్రకృతితో సమాజంలో వ్యాపారం సాగిస్తూ మానవుడు తన మానసిక ప్రకృతిని నిరంతరమూ మార్చుకుంటూవున్నాడు. మానవుడికి పరమార్థ మయిన ప్రకృతి అంటూ ఏదీ లేదు. అందువలన ఇచ్చట తన యథార్థ ప్రకృతికి ద్రోహం చేసుకోడమని గాని, లేక దానిని తల్లకిందులు చేయడమని గాని, లేక దానినుంచి దూరం కావడమన్నదికాని, వుండడానికి వీలులేదు. కాలంలో ఒక ప్రత్యేక దశయందు ఆమానవుని స్వభావం ఏమై వుందో దానిని అంతకుముందున్న పరిస్థితుల సంయోజన సంబంధాలవలన మాత్రమే తెలుసుకోవలసి వుంటుంది. మానవ జీవితం జరుగుబాటుక్కు ఒకానొక సందర్భంలో, ఒకానొక దశలో ప్రైవేటు ఆస్తి ఆవశ్యక మయ్యే వున్నదని మార్క్స్ అంగీకరించినాడు. అందువలన ఈ ప్రత్యాఖ్యాన మన్నది సహజమున్నూ, విధాయకమున్నూ అవుతున్నది. ఇప్పుడు మానవ జీవితంయొక్క జరుగుబాటుకు ప్రైవేటు ఆస్తి, వస్తువుల వుత్పత్తి పద్ధతి, ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యాన విధానం—ఈ సర్వమున్నూ తొలగబెట్టవలసి వున్న దంటే, అది మార్క్స్ మనిషి ఏవిధంగా వుండాలని అనుకుంటున్నాడో అందుకోసమే జరుగవలసి వుంటుంది కాని, మానవుడు యథార్థంగా, స్వభావ సిద్ధంగా ఎట్లా వున్నాడో, ఎట్లా వుండాలో అందుకోసం మాత్రం కాదు. మనుష్యుడు ఒక విచిత్రమైన జంతువు లేక జీవి. వాడు తన చరిత్రను తాను సృష్టించుకుంటాడు. అనగా, పరమార్థంలో అతని స్వభావం కూడా, అతనివల్లనే సృష్టింపబడినదవుతున్నది. ఈ పరిస్థితిలో ఒకరు మానవునియందు ఆత్మధర్మ ప్రత్యాఖ్యానం జరుగుతున్నదని అనుకుంటూ దానిని ఖండిస్తూ వున్న సందర్భం అన్నది వుంటే, అందుకు కారణం ఒక్కటే వుంది. మనుష్యుణ్ణి పరమార్థజీవిగా కల్పన చేసుకుంటూ వున్నందువలన మనుష్యుడు ఎట్లా వుంటే బాగుంటుందో అని ఆలోచించి అట్లా వుండడం తగునని అనుకుంటూ వున్నందువలన ఈ పరిస్థితి ఏర్పడుతున్నది. మార్క్స్ ఊహించిన మానవునిపై గ్రీకు తత్త్వవేత్తల ప్రభావం, గెటే ప్రభావం వున్నాయి. గ్రీకులు ఉదారుడయిన స్వతంత్ర మానవుణ్ణి గురించి వూహించారు. గెటే వూహించిన ఆదర్శ మానవుడు క్రియా శీలి, ప్రతిభకు మూర్తి. ఈ రెండు ఆలోచనల ప్రభావం మార్క్స్ ఆలోచనలమీద వుంది. అయినా, ఈ ప్రభావాలు మార్క్స్ ఆలోచనా ధారతో ఏకటించేవి మాత్రం కాదు.

ఈ విషయాన్ని మార్క్స్ జీవితాన్ని ఉదాహరణగా తీసుకొనే చూపించవచ్చు. ఇది ఒకరకమైన ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం వంటిదే. అయితే మార్క్స్ దానిని ప్రత్యేకంగా పేర్కొని వుండలేదు. మార్క్స్ ఆయన సమాజం నుంచి దూరమైన మనిషి. "నీవు ఆత్మధర్మంనుంచి ప్రత్యాఖ్యాపితుడయినావు" అంటే మార్క్స్ చీదరించుకొని వుండేవాడు. ఇతరులు మార్క్స్ ఒకవిధమైన మనిషిగా వుంటే బాగుంటుం దనుకున్నారు. ఆయన అట్టి మనిషి కాలేదు. తాను అనుకున్నంత మనిషిగా తానయినాడు. తాను నివసిస్తున్న సమాజం గనుక పనికిమాలినది యితే ఆ సమాజంనుంచి దూరుడు కావడమూ, దూరం కావడమూ మంచి విషయమే. ఇది ఆంతరంగిక ప్రత్యాఖ్యానం; చెడ్డదైన సమాజంనుంచి దూరం కావడం. ఇది ఆత్మోద్ధరణం మాత్రం కాదు. స్వర్గం వదలి పెట్టి మరి యే ఇతర సమాజం చూచినప్పటికీ, అచ్చట రెండు విధాలైన ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానాలు జరుగగల సావకాశం కనిపిస్తుంది. స్వర్గంలో కూడా "లూసిఫర్" వున్నాడు. అక్కడ గూడ ఇంతే నేమో! ఇక్కడమాత్రం ఒకరకమైన ఆత్మధర్మ ప్రత్యాఖ్యానం ఇట్లా వుండవచ్చు. సమాజం వ్యక్తిని తిరస్కరిస్తున్నది. వెంటనేసినట్లు చేస్తున్నది. అపుడు ఆ మానవుడు తన దృష్టిలో తానే హీనుడైనట్లు అనుభవం పొందుతాడు. రెండవ పద్ధతి ప్రత్యాఖ్యానం ఇట్లావుండవచ్చు. ఇచ్చట వ్యక్తే సమాజాన్ని రస్కరిస్తాడు. అచ్చట ఎవరు అధికారులో, ఎవరుఅధికార స్థానంలో వున్నారో వారిని తిరస్కరిస్తాడు. ఇది తన్ను తాను స్థాపించుకొనడానికి జరిగే పని. సాహసంతో ఆత్మగౌరవంతో జీవించేందుకు చేసే చేత. ఈరకమైన రెండు విధాల అవకాశాలు మనుష్యు లందరికీ వున్నాయి. బలవంతం చేత, చిత్రహింసలు పెట్టి క్షామానికి గురి చేయబడి, ఇట్టి దానిని విధించడం వుంటుంది. అప్పుడు మనుష్యుని యిచ్ఛకు అవకాశం లేదు. ఆ స్థితి వేరు.

# మార్క్‌ట్వైన్ - భారతదేశం

(అమెరికన్ మహా రచయితల్లో మార్క్‌ట్వైన్ ఒకరు. ఆయన ఇప్పటికి 70, 71 సంవత్సరాల క్రితం భారతదేశం వచ్చి, కొన్నికొన్ని ప్రధాన పట్టణాలలో ప్రసంగములు—అవీ— చేసి వున్నారు. వారి భారతదేశ యాత్రను గురించి శ్రీ కార్మన్ కాగల్ "స్వాన్" పత్రికలో వ్రాసిన వ్యాసాన్ని ఇప్పుడు ఆంధ్ర సహృదయలోకం కోసం పొందుపరుస్తున్నాము.)



1896. జనవరి నెల. ఒకరోజు సాయంత్రం బొంబాయిలో నావెల్టి థియేటరు రంగస్థలం మీదకు మార్క్‌ట్వైన్ నడిచి వచ్చాడు. ఉపక్రమణికలు అవీ ఏమీలేవు. మంద్రస్వరంలో, ఎవరితోనో మాటాడుతున్న ధోరణిలో ప్రసంగం ప్రారంభించాడు. "నేను పుట్టడమే సామాన్యుణ్ణిగా పుట్టాను. అది అయిపోయింది. నీకు మెప్పుదలం రావాలనివుంటుంది. అందుకు మార్గం ఏదీలేదు అంటావు. అప్పుడు ఏమి చెయ్యాలి? నిన్ను నువ్వే మెచ్చుకోవాలి. నేను తరచు అదే చేస్తాను. ఇక్కడ కూడా ఆ పని చేయగలను. ఇప్పుడు ఈ క్షణంలో విశిష్టులని చెప్పదగిన మనుష్యులు ఇద్దరే వున్నారు. ఒకడు, కిప్లింగు. ఇక రెండవవాడు ఎవడు అంటారు. నేనే. మా యిద్దరి నడుమ సర్వమైన జ్ఞానమున్నూ నిబిడమై వుంది. ఎంత తెలియవచ్చో, అది అంతా అతనికి తెలుసు. ఆ మిగిలింది నాకు తెలుసు."

ఆ తర్వాత మార్క్‌ట్వైన్ ఆ థియేటరులో రెండు గంటలు సేపు మాట్లాడాడు. సభాసదులను ఆ రెండుగంటలు కాలము పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వించాడు. ఇది పెద్ద కార్యం. ఈ కార్యాన్ని ఆ తరువాత రెండున్నర నెలలపాటు మార్క్‌ట్వైన్ కొనసాగించాడు. ఆ రెండున్నర నెలలు ఆయన భారతదేశపు వివిధ నగరాలలో మాట్లాడాడు. ఆ వివిధ నగరాలు ఏమేమిటో ఊహించుకోండి. ఆ వయసు చాల్లా ఎంటే. ఒకసారి ఆయన తన యాత్రా ప్రసంగ ధోరణిని గురించి ఇట్లా చెప్పుకున్నాడు. "నాకు ఒకప్పుడు ఉద్యోగం ఉంటూ లేకుండాపోయింది. ఏడు ఏళ్ళు ఉద్యోగం పుచ్చుకున్నాను. ఉపన్యాసం ఇచ్చాను. ఆ రోజు నుంచి ఈ రోజు వరకు పనిలేని రోజు ఒక్కటీ లేదంటే నమ్మండి."

మార్క్‌ట్వైన్ అసలు పేరు మార్క్‌ట్వైన్ కాదు. ఇది పెట్టుకున్న పేరు. అసలు పేరు కొంచెం దీర్ఘంగావుంటుంది. శామ్యూల్ లాంగ్‌హార్న్ క్లెమెన్స్—అని. ప్రపంచంలో ఈయన అందరికి మార్క్‌ట్వైన్‌గానే తెలుసు. ఆయన తొమ్మిది పుస్తకాలు వ్రాశాడు. గొప్పవి. The adventures of Tom Sawyer, Huckleberry Finn లు మరీ గొప్పవి. ఈ రెండుపుస్తకాలు లక్షం కొద్దీ అమ్ముడు అయినాయి. మార్క్‌ట్వైన్‌ను ఎక్కడకు వెళ్లినాగుర్తుపట్టడానికివక్కాచే గుర్తు. ఆ జుట్టు తెల్లగా వుండేది. జూలులాగా వుండేది. కనుబొమలు పచ్చగావుబ్బుకట్టినట్లువుండేవి.మీసాలువిస్తరించిజారిపోతున్నట్లు వుండేవి. ఆయన్ను హాస్యగాడు అనేవాళ్లు. "నన్ను ఒకసారి ఒక సభలో హాస్యగాడు అని పరిచయం చేశారు. అనూచే నవ్వుగా వుంటుంది" అని ఒకసారి మార్క్‌ట్వైన్ అన్నారు. పత్రికంలో ఆయన ఆడిన సూక్తులు పడుతూ వుండేవి. వానిలో కొన్ని ఆయన ఆడనివి కూడా. ఆయన ఆడినట్లు పడేవి. చొక్కాను గురించి మార్క్‌ట్వైన్ ఒకమాట చెప్పినట్లు ఒక పత్రికలో పడింది. ఆ మాట ఆయన అన్నట్లు రికార్డేమీ లేదు. కాని ఆయన అన్నట్లు పడిన మాటలుమిగిలాయి. అవి ఇ : చొక్కా అంటే ఏమిటి? అది ఒక సరుకు. ఎటువంటి సరుకు? చాకలివాండ్లు బండలను పగులగొట్టేందుకుగాను చేయబడినటువంటిసరుకు." భారతదేశంలో మనుష్యులు మార్క్‌ట్వైన్ ఆమాటలు అన్నాడు అంటారు. అసలు ఆ మాటల సంగతి ఎట్లా వున్నా, ఈ అంట గట్టటము మరీ నవ్వుగా వుంది.

మార్క్‌ట్వైన్‌కు వ్రాసినపుస్తకాల మీద డబ్బు బాగా వచ్చేది. పుస్తకాల మీద బాగా సంపాయించాడు కూడాను. కాని భారతదేశంలో అడుగుపెట్టిన నాడు ఆయన వట్టి నిర్ధనుడు. ఏమీలేని వాడు. దాదాపు దివాలా మనిషి. అప్పులలో తల మునిగి వుంది. టైపు యంత్రాలలో తాను సంపాయించిన డబ్బంతా

పెట్టాడు. ఆ యంత్రం పని చేయలేదు. దానిని కనిపెట్టిన మనిషి మాట ఆ యంత్రం వినలేదు. మార్క్‌ట్వైన్ బికారి అయిపోయాడు. అట్లా కావడానికి ఇంకో కారణం గూడా వచ్చి పడింది. మార్క్‌ట్వైన్ బంధువు ఒకాయన వున్నాడు. ఆబంధువు పుస్తక ప్రచురణ సంస్థ చూస్తూ వుండేవాడు. తప్పుడు పనులు చేసి నాశనం చేశాడు. మార్క్‌ట్వైన్ దివాలా తీసాడు. ఆ అప్పులు నావికావు అని, ఆ అప్పులతో నాకు సంబంధంలేదు అని మార్క్‌ట్వైన్ అనవచ్చు. అనలేదు. లక్ష డాలర్ల అప్పును నెత్తి మీద వేసుకున్నాడు. ప్రతి ఒక సెంటును తీర్చాలి అనుకున్నాడు.

అప్పటికి మార్క్‌ట్వైన్ వయస్సు ఎంతని? ఆయనకు అరవై ఏళ్లు నిండాయి. ఆ వయస్సులో నెత్తిన వేసుకున్న అప్పులు తీర్చడానికి బయలుదేరాడు. ప్రపంచయాత్ర ప్రారంభం చేశాడు. భార్య, ఒక కూతురు. వారు కూడా ఆయన వెంట వున్నారు. ఈ యాత్రను గురించి తరువాత తరువాత మార్క్‌ట్వైన్ ఇట్లా చెప్పుకున్నాడు. "మేము ప్రసంగించాము. సంగ్రహించాము. పొదుపు చేశాము. పదమూడు నెలలు ఇది సాగింది. డబ్బు పుట్టించాము ఆర్జించాము, ఆ మొత్తాన్ని రోగర్స్‌కు పంపాము. అతను దాచాడు. బాంకు చేశాడు. ఎవరి కోసం! అప్పులవాళ్ల కోసం." 1898 వచ్చే వేళకు మార్క్‌ట్వైన్ అప్పులన్నీ తీరాయి. పుస్తకాల మీద డబ్బు, ఈ ఉపన్యాసముల "పోపీ"—అప్పు రహితం అయిపోయింది.

భారతదేశంలో తన యాత్రను మార్క్‌ట్వైన్ Fallowing the Equator అనే గ్రంథంలో వర్ణించాడు. అది ఆయన ప్రపంచ యాత్రా గ్రంథం. అందులో ఇది వుంది. మరికొన్ని విశేషాలు Note Book లో కూడా వున్నాయి. ఇది ఇంకో గ్రంథం. మార్క్‌ట్వైన్ చనిపోయిన తర్వాతగాని యీ Note Book ప్రచురణ కాలేదు. ఇవిగాక ఆ కాలపు పత్రికలు వున్నాయి. వానిలో గూడా మార్క్‌ట్వైన్ భారత యాత్రా విశేషాలు వున్నాయి.

భారతదేశంలో మార్క్‌ట్వైన్ యాత్రా విశేషాన్ని గురించి చెప్పడం అద్భుతంగా వుంటుంది. అదో పెద్ద వ్యాయమం. ఆ రోజుల్లో యాత్రా సౌకర్యాలు ఇప్పుడు వున్నన్నిలేవు. ఇప్పుడు అప్పటి అవస్థ చూస్తే ఏడుపు వస్తుంది. మార్క్‌ట్వైన్ బొంబాయిలో 1896 జనవరి 18 న దిగాడు. అవాళ్ల శనివారం. P and O లైనరు S S. Rosetta లో వచ్చాడు. బొంబాయిలో 10 రోజులు గడిపి పూనాకు వెళ్లాడు. పూనాకు వెళ్లినరోజు జనవరి 29. మళ్లీ బొంబాయికి తిరిగివచ్చారు. జనవరి 31 న బరోడాలో గైక్వాడ్ భవనంలో మాట్లాడాడు. "తిరిగి బొంబాయికి చేరే దారి పొడుగునా నిద్దురే." ఆ తరువాత రైలులో అల్హాబాద్‌కు బయలుదేరి వెళ్లాడు.

ట్వైన్ జబ్బు మనిషి. ఇది పెద్ద చిక్కువిషయం అయిపోయిందతనికి. తరచు ఇన్‌ఫ్లూయింజా వస్తూవుండేది. పెట్టుకున్నపని పెట్టుకున్నట్లు జరిగేదికాదు. ఒకరోజు మార్క్‌ట్వైన్ బొంబాయిలో ఒక విలేఖరితో ఇట్లా అన్నాడు: బొంబాయిలో నేను ఏమీ చూడలేదు. అన్నీ చెట్లు. దుమ్ముపట్టివున్నాయి. వాటిని దు పాలి.' మార్చి 26 న మార్క్‌ట్వైన్ కలకత్తాలో బ్రిటిష్ ఇండియా కంపెనీవారినౌక S.S. Wardha ఎక్కి భారతదేశం నుంచి బయలుదేరాడు. ఈ నడిమికాలంలో ఆయన బొంబాయి చూచాడు. పూనా వెళ్లాడు. బరోడాలో మాట్లాడాడు. అల్హాబాదు దర్శించాడు. కాశీ చూచాడు. కలకత్తాలో ప్రసంగించాడు. డ్జారిలింగ్ వెళ్లాడు. ముజఫర్‌పూర్‌లో ముచ్చటించాడు. లక్నోను లక్షించాడు. కాన్‌పూర్‌ను నవ్వించాడు. ఆగ్రాను హర్షించాడు. ఢిల్లీ వెళ్లాడు. జయపూర్‌ను జయించాడు. లాహోరును లాలించాడు. రావల్పిండిని రంజింప చేశాడు. Equator యాత్రలో తనకు నచ్చింది భారతదేశపు యాత్రే నని మార్క్‌ట్వైన్ తరచు అంటూ వుండేవాడు. ఆయన అందులోనేమి, ఇతరత్రానేమి వ్రాసిన దాన్నిబట్టి చూస్తే భారత దేశము, భారతదేశములోని వైవిధ్యము మార్క్‌ట్వైన్‌కు ఎంత గానో నచ్చినట్లు అర్థం చేసుకోవలసి వుంటుంది. ఉదాహరణకు following the Equator లో ఆయన ఇట్లా వ్రాశాడు: "ఇది భారతదేశం కలలు కన్న దేశం. ప్రేమకు స్థానమైన దేశం. అచ్చట అనంతమైన సంపద వుంది, దుర్భరమైన దారిద్ర్యం వుంది. వైభోగం వుంది, వైరాగ్యం వుంది. మేడలు వున్నాయి, గుడిసెలు వున్నాయి. పులులు వున్నాయి, ఏనుగులు వున్నాయి. వంద జాతులకు ఆస్థానం ఆ దేశం. వంద భాషలకు తావు. మానవ జాతి అచ్చట ముందు ఉయ్యాల కట్టింది. మానవుని వాక్కు మొదట అచ్చట పలికింది. చరిత్రకు భారతదేశం తల్లి. కథలకు ముత్తవ. సంప్రదాయానికి అవ్వ. అది ఒక్కటే, అంతా చూడా లనుకునే భూమి. చూడాలనుకుని చూచే నేల. చూచిన తర్వాత, సర్వప్రపంచంలో అన్నివిభవాలను చూచినా, చప్పరింపు కల్గించే అద్భుతమాగాణం, భారతదేశం." ఈవచనధోరణిమార్క్‌ట్వైన్ అసలు ధోరణికాదు. ఇక్కడ కొంత ఆవేశం వుంది. ఈ మాటలు చూడాలి. "ఇప్పటికి నేను భారతదేశం చూచి వచ్చి ఒక్క ఏడాది అయింది. అయినా బొంబాయిలో నేను గడిపిన రోజులు—అవి ఏమి రోజులు—ఇంకా నన్ను వదిలిపెట్టలేదు. వదిలిపెడతా యనుకోను." ఇది ఆయన అసలు ఆత్మ.

బొంబాయిని మార్క్‌ట్వైన్ "ప్రలోభనీయ స్థానం" అన్నాడు. 'అరేబియా రాత్రులు' బ్రతికి వచ్చినట్లు వుంది. అది కదులుతున్నపెద్ద ఖేల.అక్కడి పెద్ద బజారులో మార్క్‌ట్వైన్‌కు తలపాగాలు, బట్టలు సముద్రాన్ని పోలి కన్పించాయి. రైలుస్టేషన్ వద్ద భారతీయులు నగలు ధరించి, కదులుతూ గోలచేస్తూ, అల్లరి పుట్టిస్తూ, ఆహార్యవైభవంఅంతా హుషారుగా పచారులు చేస్తున్నట్లు తోచింది. ఎచ్చట చూచినా వర్ణసౌందర్యం, హృదయాన్ని అట్లా పట్టుకునే వర్ణసౌందర్యం, అదే మార్క్‌ట్వైన్‌కు పట్టింది.

భారతము అటువంటి భూమిని
చూచినానా ఎప్పుడైనా!
చూచితిని, చూచితిని ఎప్పుడో
ప్రాయశః ననుకొందునదియే

# మార్క్ ట్వైన్ - భారతదేశం

ఏసు పుట్టిన భువిబోలునని—అని
భారతము ఎటువంటి దందువు
జీవితము జీవితము అంతా
నిండి నిబిడముగాగనైనది
భారతము ఎటువంటి దందువు
ప్రకృతి రెక్కలు విప్పినట్టిది
నిండి ప్రాణము లేచినట్లుగ
అచట ప్రతిదియు నున్నయట్టిది

భారతదేశంలో నిత్యస్పందమైన వైభవమే మార్క్ ట్వైన్‌కు గోచరించింది. అది ఆయన్ను ఆకర్షించింది. ముగ్ధుణ్ణి చేసింది. భారతదేశంలో ఆయన అనుభవం అట్టిది. వైవిధ్యం అందులో వుంది. ఒక్క ఉదాహరణ. బొంబాయిలో ఆయన ప్రభుత్వ భవనాలు చూచాడు. గురుద్వారాలు దర్శించాడు. పాటియాలా మహారాజా సమత్‌సింగ్. వారి ప్రాసాదాలు దర్శించాడు. ఆ ప్రాసాదంలో ఒకగంట గడిపాడు. ఆ మహారాజా వారి భవనాలను చూచి మార్క్ ట్వైన్ ఇట్లా అన్నాడు: ఒక మహారాజు భోజనం చెయ్యాలి అంటే, ముందు ఒకడు దాన్ని రుచి చూడాలి. ఇది నమ్మకం. వాడు జీతగాడు. ఇట్లా ఒక జీతగాడు రుచిగాడుగా వుండటం ఎప్పటి నుంచో వుంది. అది న్యాయమైన పద్ధతి కూడాను. తూర్పు దేశాలలో ఈ ఆచారం వుంది. ఇందువల్ల ఏమి జరిగిందంటారు! రుచిగాండ్రు తక్కువ అయిపోయారంటారు. అవును మరి. అన్నంలో విషం అంటూ పెడితే, ఆ పెట్టేదివాడుకాదు, వంటవాడు. నేనే గనుక భారతదేశంలో ఒక మహారాజునైతే, ఈ రుచిగాళ్ల ఖర్చు దాకా వెళ్లను. వంటవాణ్ణి ముందు తినమని, తరువాత నేను తింటాను.''

మార్క్ ట్వైన్ భారతదేశంలోవుండగా ఏనుగుల కొట్లాటయములను కూడా చూచాడు. ''నేను ఏనుగు ఎక్కాను. అంబారి వేస్తాము అన్నారు. సరేనన్నాను. నేను అడగలేదు. నాకు ఆ కోరిక లేదు. అయినా అంబారి వేశారు. ఎక్కాను. ఏమి చేస్తాను. లేకపోతే నేను పిరికివాణ్ణి అనుకుంటారు. అంటారు. అదీ నా భయం. భయం నాకు లేదనికాదు. ఉంది. మావంతుడు వున్నాడంటే, వాడు ఏనుగుతోనా మాట్లాడుతాడు. నెమ్మదిగా దాని చెవిలో ఊదుతున్నట్లు మాట్లాడుతాడు. వాడు మాట్లాడింది దానికి అర్థం అవుతుంది. సంతోషిస్తుంది. వాడు ఆజ్ఞ చేస్తాడు. అది వింటుంది. అక్కడ ఎదురు తిరగడం అన్న ప్రశ్న లేదు. చెప్పింది వినడమే వుంది.''

కాశీలో మార్క్ ట్వైన్ ఒక స్వామివారిని కలుసుకున్నాడు. ఆయన అంటే ఆయనకు భక్తి కుదిరింది. ట్వైన్ ఇట్లా వ్రాశాడు: ఆ స్వామి అంటే నాకు భక్తి కుదిరింది. ఆ భక్తిని పూరికే చూపించలేదు. ఆ భక్తిలో అకించనత్వంలేదు. హుందాగా భక్తి చేశాను. అపూర్వంగా చేశాను. గొప్పగా చేశాను. ''అప్పుడు ఆయన భావస్థితి అది. ఈ విషయాన్నిగురించి ఒకరు కలకత్తాలో ట్వైన్‌ను ప్రశ్నించారు. ఆ ప్రశ్నించిన వాడు 'ఇంగ్లీష్‌మన్' పత్రికకు సంబంధించిన వాడు. అతని ప్రశ్నకు ట్వైన్ సమాధానం ఇది: ''ఆయన, ఆ స్వామి, చాలా పవిత్రుడు.ఆయనకోపేరు వుంది. దాన్ని నువ్వు వ్రాయాలి. అందుకు ఏమి చేయాలో తెలుసా! ముందు ఆ పేరును మాట ఎనిమిదిసార్లు అనుకొని, ఆ తరువాత రాయాలి. ఇది పెద్ద విషయం అనిపించింది. భగవంతుడికైనా అంతే. మేము ఆటోగ్రాఫులు మార్చుకున్నాము. ఆయన అన్నాడుగదా, నిన్ను గురించి విన్నాను—అని. నేను అన్నాను, మిమ్మల్ని గురించి విన్నాను—అని. భగవంతుడు గూడా ఒక్కోసారి అబద్ధం ఆడకతప్పదు. ఇది నా అభిప్రాయం సుమా!''

కలకత్తాలో బొమ్మల—బండీ ఎక్కి, ట్వైన్, డార్జిలింగ్‌కు వెళ్లాడు. వెళ్లేదారిలో కారుకూడా ఎక్కాడు. దానికి టాపు కట్టారు. దానితో ఆయన ప్రయాణం చేసింది—ముప్ఫయిఐదు మైళ్ళు. ఈ ప్రయాణంలో తన అనుభవాన్ని ట్వైన్ వర్ణించివున్నాడు. ''ఈప్రాంతాల్లో ఒక కథ ప్రచారంలో వుంది. బెంగాలు లెఫ్టినెంట్ గవర్నరు ఒకడు కొండల మీదుగా ప్రయాణం చేస్తున్నాట్ట. అది కారు ప్రయాణం. ఆ కారు బోల్తాకొట్టింది. అగాధంలో పడింది. అంతా ఆ అగాధంలో పడ్డారు. నిజానికి ఇది కథ. నిజంకాదు. అయినా ఈ కథ నాకు పట్టింది. నాకు ఆ ప్రయాణం అంతా మహాభయంతో సాగింది. ఆ లెఫ్టినెంట్ గవర్నరు తప్పించుకున్నాడు. ఆ అదృష్టం నాకు పట్టాలని ఎక్కడ వుంది ''

మార్క్ ట్వైన్, తాజ్‌మహాల్ చూచాడు. ''అప్పుడు రాత్రి. పదకొండున్నర అయింది. చంద్రుడు నిండుగా వున్నాడు బ్రహ్మాండంగా వున్నాడు. మా ఆశ్చర్యం ఏమని చెప్పేది. అప్పుడే గ్రహణం పట్టింది. ఒకగంట.అది పూర్ణగ్రహణం.తాజ్‌మహాల్‌ను కట్టింది ఎప్పుడో; అప్పటి నుంచి ఇట్లా ఇంకో దేశస్థుడు ఎవ్వడూ అట్లాఅక్కడ గ్రహణం పట్టిందిచూడలేదు.1876లో బ్రిటిష్ యువరాజు భారతదేశం వచ్చాడు. అప్పుడు ఇట్లానే గ్రహణం పట్టిన రోజున తాజ్‌ను ఆయనకు చూపిద్దామనుకున్నారు. ఇంకో ఇరవైమంది బ్రిటిష్ రాకుమారులకు గూడా అట్లా గ్రహణం పట్టిన రోజున తాజ్‌ను వారికి చూపించాలని యత్నాలు జరిగాయి. కాని ఒక్కటీ కలిసిరాలేదు. కల్నల్‌లాక్ ఇటువంటి విషయంలో కొంచెం అదృష్టవంతుడు. ఆయన క కొంతపలుకుబడి వుంది—ఆయనకు పూర్వంపనిచేసిన వారికంటె.'',

భారతదేశంలో సంచారం చేసిన రోజులలో ఒకరచయిత దృష్టితో ట్వైన్ ప్రతిఒక్క దాన్ని పరిశీలన చేశాడు. ఆయన్ను వట్టి హాస్యగాడు అనుకోవలసిన రోజులు ఎప్పుడో గడిచిపోయినాయి.విమర్శకులైన వారు సాహిత్యానికి ట్వైన్ చేసిన బహుముఖ సేవను గుర్తిస్తూ వస్తున్నారు. బయటికి చెబుతూ వస్తున్నారు. ఉదాహరణకు అమెరికన్ వ్యావహారికపు పలుకుబడులు వున్నాయి. వానిని ట్వైన్ తన రచనలలోనికి పట్టాడు. విమర్శకులు దాన్ని ప్రదర్శిస్తూవచ్చారు. హెమ్మింగ్వే ఒకమాట అన్నాడు. ''హకిల్ బరీ ఫిన్ లోంచే నవ్యసాహిత్యం అంతా పుట్టింది 'అని. ఇది చాలా పెద్దమాట. అతిశయోక్తి కావచ్చు. కాని ఆయన వ్రాసిన వచనం

కొన్ని కొన్నిసందర్భాలలో ప్రతిభావంతంగానూ వుంది. భావస్ఫోరకంగానూ వుంది. ఒక్క ఉదాహరణ:

"భారతదేశంలో పల్లెపట్టులు అందంగా వుంటాయి. అచ్చట తెల్లవారుతుంది. నీకు పెద్ద బయలు కన్పిస్తుంది. అంతా చదునుగా వుంటుంది. ధూసరవర్ణ కిమ్మీరితమై, అనంతంగా అన్ని ప్రక్కలకు పరచుకొని మసక మసకగా వున్న కాంతులతో నిండి, తరచు నడిచిన నడకల చేత పడిన కాలిబాటలతో చారలు గీచినట్లు ఎత్తైనడం విస్తరించి, దూరదూరముగ చెట్ల గుబురులతో విడినట్లుగా వుండి, గ్రామములు ఉండిన తావులను తెలుపుతూ వుంటుంది. దారుల పొడుగునా లేతపడుచులు, నల్లని వర్ణముగల పురుషులు, పనులకు పోతూ కన్పిస్తారు. స్త్రీల నెత్తిన బిందెలు, మగవారి భుజముల యందు నాగళ్లు."

భారతదేశం ప్రజలయందు ట్వైన్ ఎక్కువ మక్కువ చూపించాడు. వారి ఆకార విశేషముల యందు మన్నన అధికంగా చేశాడు. వారి శరీరవర్ణం ఆయన్ను ఆకర్షించింది. "నల్లనిశరీరాలు, గౌరవర్ణ శరీరాలు అందంగా వుంటాయి. తెల్లని శరీరం అందంగా వుండటం అరుదు. ఎచ్చట నల్లనితనము గుమిగూడినట్లు వుంటుందో, అచ్చట తెల్లనితనము తెల్లబోతుంది. పేలవమై పాలిపోతుంది. చూడ్డానికి అందంగా వుండదు. ఆరోగ్యంగా కన్పించదు. కొన్ని సందర్భాలలో డోకు పుట్టిస్తుంది. ఇక భారతీయమైన గోధుమ వర్ణం వున్నది అంటే, అది విరుపు లేనిది, మచ్చలేనిది. ఆహ్లాదకరమైంది. కన్నులకు తర్పణంగా వుంటుంది. ఏ వర్ణం అన్నా ఆ వర్ణానికి భయంలేదు. అన్నివర్ణాలలోను కలుస్తుంది. అన్నిరంగులతో సంవాదాన్ని భజిస్తుంది. అన్ని వర్ణాలకు కొత్త అందాన్ని తెచ్చి పెడుతుంది. తెల్లనివర్ణం అక్కడ నిల్వలేదు. దానికి అక్కడ విలువలేదు."

భారతీయులు కరుణార్ద్రమైన హృదయం కలవారన్నది మార్క్‌ట్వైన్ తీర్పు. 'మనస్సులో ఏడుపుగాని, హృదయంలో కాలుష్యంగాని భారతదేశంలో నాకు కన్పించలేదు' అన్నాడు ట్వైన్. మరి మనుష్యుణ్ణి గురించి ట్వైన్‌కు వున్న భావం విశేషమైంది కాదు. "మనిషి గూడా పశువే. ఈ పశువు సిగ్గుపడుతూ వుంటుంది. అంతే." అని ఒకసారి అన్నాడు. ఇది చూచి, భారతీయులను గురించి ఆయన చెప్పింది చూస్తే ఆశ్చర్యం వేస్తుంది.

భారతదేశంలో ప్రకృతిసౌందర్యం మార్క్‌ట్వైన్‌ను బ్రహ్మాండంగా ఆకర్షించింది. అతణ్ణి సమ్మోహితుణ్ణి చేసింది. పశుపక్ష్యాదులన్నా అంతే. భారతదేశపు కాకి వుంది. దాన్ని గురించి ట్వైన్ గొప్పగా వ్రాశాడు. "ఇటువంటి పక్షిని నేను ఎక్కడా చూడలేదు. అది అభిప్రాయాలు వెల్లడిస్తూ వుంటుంది. ఆ పక్షికి అందనిది, ఆ పక్షి చూడనిది అంటూ ఏమీ వుండదు. లేదు. ప్రతిదాన్ని అది చూస్తుంది. చూచిన ప్రతిదాన్నిగురించి చెబుతుంది. ముఖ్యంగా, తనకు సంబంధించని వాటిని గురించి. అక్కరలేని వాటిని గురించి. ఆ చెప్పడం మెత్తగా, నెమ్మదిగా వుండదు. పరుషంగా, వికటంగా వుంటుంది. 'ఆడవాళ్ళు వున్నా... కూడా దానికి పట్టదు."

ట్వైన్ కోతులను వర్ణించాడు. ఆ కోతులు చా... అజగర జంతువులు. ఉత్సాహ శక్తిగల జంతువులు. వాటి... భయం ఏ కోశానాలేదు. ట్వైన్ ఒక సంఘటన చెప్పాడు "ఈజంతువులు ఒక రెండు ఒకరోజున ప్రొద్దున్నే నాగదిలో వచ్చి కూర్చున్నాయి. నేను ఇంకా నిద్ర లేవలేదు. నిద్ర లేచి చూద్దును గదా, ఒక కోతి అద్దం ముందుకూర్చుని తల చక్కదిద్దుకుంటున్నది. ఇంకోటి నా "నోటు పుస్తకం" చదువుతోంది. అందులో హాస్యపు మాటలు వున్నాయి. అవి నవ్వడానికి బదులు ఏడుస్తూ వుంది. తల దువ్వుకుంటూ వున్న కోతి సరే, దాన్ని గురించి నాక... ఏది ఇదిలేదు. ఈ రెండో కోతి లక్షణం వున్నదే, అది నాకు ఎం... మాత్రం నచ్చలేదు. బాధ పెట్టింది. ఇప్పటికీ బాధగానే వుంది."

ఇంకో చోట మార్క్‌ట్వైన్ ఆకులు రాలిన వృక్షాన్ని గురించి చేసిన ప్రస్తావన వుంది. ఆ చెట్టు నిండా కొమ్మలే, కొమ్మల నిండా సీతాకోక చిలుకలే. ఎర్రని మేఘంవాలి కొమ్మ... మీద నిలిచినట్లు వుంది.

వెదురుజొంపాన్ని వర్ణిస్తూ, ఆకుపచ్చనిసౌందర్యంశబలమై చిమ్మనగ్రోవి కొట్టినట్లు వున్నదని అంటాడు ట్వైన్.

భారతదేశంలోఈ ప్రకృతిసౌందర్యాన్ని మాత్రంచూస్తూ అప్రతిభుడైపోయి మార్క్‌ట్వైన్ ఇంకా ఏమీ చూడలే... పోయినాడని అంటామా! అది సరికాదు. భారతదేశంలో తాన... చూచిన కొన్ని కొన్ని విషయాలు ట్వైన్‌ను బాధ పెట్టాయి ఇట్లాఅని చెప్పడానికి తగిన ఆధారాలు వున్నాయి. సమాజ సంబంధమైన ఆలోచనలలో తన కాలం వారిలో ట్వైన్ కొంతముంద... చూపు గలవాడన్నది నిర్వివాదమైన విషయం. హకిల్‌బరీ ఫిన్‌లో 'జిమ్' అన్న బానిస వుంటాడు. ఆ పాత్ర చిత్రణంలో ట్వైన్... భావాలు చక్కగా అభివ్యక్తం చేయబడి వున్నాయి. నీగ్రో... పట్ల ఆయన వైఖరి ఏమో అచ్చట ప్రదర్శించబడి వుంది ఆ విషయం గంభీరమైంది. అట్టి దాన్ని గూడా ట్వైన్ నవ్వు తాళ్లకు పట్టించగలడు. "అభిప్రాయాలు అంటూ చెప్పవలసి వచ్చిన చోట, మన ప్రతిస్పర్థులంతా ఉన్మాదులు." అంతట... నవ్వుతాలు మాటలతోను ధర్మం అంటే తన అనురక్తిని ట్వైన్ ప్రదర్శిస్తాడు. ఏది మంచి, ఏది చెడ్డ అన్న విషయం దగ్గర ట్వైన్‌కు తోక ముడిచే లక్షణంలేదు. అన్యాయాన్ని ట్వైన్ ద్వేషిస్తాడు.

కులతత్వాన్ని గురించి కలకత్తాలో ఒకరితో ట్వైన్ మాట్లాడాడు. "ఇది ఏదో పరమ విచిత్రంగా వుంది. దీని అర్థం ఏమిటో నాకు తెలియకుండా వుంది." అన్నాడు. మద్రాసు స్టాండర్డ్ పత్రికవాళ్లమనిషితో మాట్లాడుతూ, "భారతదేశంలో నాకు కొట్టవచ్చినట్లు కళ్లకు కట్టిన విషయం ఒక్కటే. అది దేశం యొక్క బీదతనం. ఇది ఇట్లా వుంటుంది అని పూర్వం విన్నాను. అంతే. ఇప్పుడు చూచాను'—అన్నాడు.

నిజం చెప్పాలంటే భారతదేశానికి బయలుదేరక ముందే ట్వైన్‌కు ఈదేశాన్నిగురించి కొంతతెలుసు. కొంత తెలుసులంటే

కాస్త తెలుసునని కాదు. కొంత బాగానే తెలుసునని. కలకత్తాలో స్టేట్స్‌మన్‌పత్రికమనిషి ట్వైన్‌ను—మీరుఎప్పుడైనా బెంగాలీ వారిని కలుసుకున్నారా?—అని ప్రశ్నించాడు. "స్వయంగా కలుసుకో లేదు. పుస్తకాల్లో చదివాను." అన్నాడు ట్వైన్. ఆ మాట అన్నప్పుడు ట్వైన్‌దగ్గర "ఒకుకూల్ చందర్ ముఖర్జీ" జీవిత చరిత్ర వుంది. దాన్ని ఆ స్టేట్స్‌మన్ మనిషికి చూపించాడు. మద్రాసులో మాటల్లో—మద్రాసుకు గవర్నర్లుగా పనిచేసి వున్న వాళ్ల పేరులతో పరిచయాన్ని, భారత జాతీయ కాంగ్రెస్ మహా సభను గురించి తనకు తెలుసునన్న విషయాన్ని ప్రదర్శించాడు.

భారతదేశంలో తన్ను ఆకృషించి, ముగ్ధుణ్ణి చేసిన సర్వమైన సౌందర్యాన్ని అధిగమించి, మార్క్ట్వైన్ ఆ సౌందర్యం వెనుక దాగి వున్న దేశ దారిద్ర్యాన్ని దర్శించగల్గినాడంటే, అకించనుల అవస్థను గమనించగల్గినాడంటే, ఆ దారిద్ర్య స్థితిని గూడా దాటి భారతదేశం ఆత్మనే చూడగల్గినాడని చెప్పవలసి వుంటుంది. భారతదేశాన్ని ట్వైన్ దర్శించిన పద్ధతిలో ఒక విధమైన తాత్విక వార్మికత పొనువడి వున్నట్లు తోస్తుంది. భారతదేశం వంటి నానాజాతిసంకులమైన, విశాలమైన, ఒక ఉపఖండముఅంత వున్నదేశాన్ని చూడటము, అర్థం చేసుకొనడమూ అదేవిధంగా జరగివు డ.(సి వుంటుందేమో కూడా.

Fallowing the Equator లో వ్రాసిన ఈ మాటల్లో ట్వైన్ ఏవంవిధమైన భావాభినివేశాన్నే వ్యక్తం చేసి వున్నాడు. "మీకు వెంటనే అనిపిస్తుంది; భారతదేశం అంద మైంది కాదు—అని. కాని ఆదేశాన్ని బట్టి ఏదో ఆకర్షణ, ఏదో ప్రలోభనము వున్నాయి అని అర్థంకావు. కిట స్తాయి. లోభ పెడతా ు. అంతే. అది నీరసంగా వున్నట్లు తోచదు. శుష్కం అనిపించదు. ఆ ఆకర్షణకు, ఆ సమ్మోహంకల్గడానికి కారణం ఏమిటి అంటావు; చెప్పడం కష ం. చెప్పలేను. అది అనుభవైకవే గాని, చెప్పడానికి మాటలకు రాదు. నా అనుభవం ఇది అని చెప్ప గలవు, చెబుతావు. ఇందుకు చరిత్ర ఒక కారణంఅని అస్ప ంగా అనిపిస్తుంది. ఆ దేశం లో కోట్లకొలది మానవుల జీవితాలు పుష్పించాయి. పండి ఎండి రాలిపోయాయి. నశించాయి. ఇది పౌనః పున్యంగా జరుగుతూ వచ్చింది. ఇన్ని సంవత్సరాలుఇట్లానే జరి గింది. శతాబ్దాలు గడిచాయి. యుగాలు గతించాయి. దీనికి అర్థం వున్నదనిపించదు. ఎండిన ఎడారి లాగా తోస్తుంది. అది వంధ్యము; శుష్కము. అట్లా నువ్వు అను. కాని భారతదేశం శక్తి అందులోనే వుంది. అందుకే ఆ దేశం ఆత్మతో, సర్వకారణమైన శక్తి ఎదురు పడి, ముఖాముఖిగా నుంచుని, ఋద్దున మ్యాట్లాడగల్గుతూ వున్నని."

భారతదేశాన్ని గురించి ట్వైన్ చెప్పిన విషయాలు వ్యామోహం కల్గించేవిగా వుంటాయి. విభ్రాంతిని కల్గిస్తాయి. ఏవో అందమైన ప్రదేశాలను చూచి రావడం కోసం ట్వైన్ భారత యాత్ర పెట్టుకోలేదు. అప్పుల నుంచి నిర్ముక్తుడు కావాలని, అందుకోసం కావలసిన డబ్బును సంపాదన చేసుకొనడం కోసం వచ్చాడు. ఆ సంపాదన కోసం ఆయన ఉపన్యాసాలిచ్చాడు.

భారతదేశంలో మార్క్ట్వైన్ ఎక్కడ మాట్లాడినా, సభాస్థాలకు కొదువలేదు. ఒక్క ఇంగ్లీషువారే కాదు, తది తరులు గూడా ఆయన ప్రసంగ శ్రోతలుగా రావడానికి ఎగ బడ్డారు. ఇంగ్లీషువారు అధికంగా వచ్చి వుండవచ్చు. కాని ఆ కాలంలోని 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రికనేని, ఇంకా ఇతరములైన పత్రికలనేమి చూస్తే, అప్పుడు ఏమి జరిగిందీ తెలుస్తుంది. మార్క్ట్వైన్ ప్రసంగ సభల్లో ఒక్క ఇంగ్లీషు వారేకాదు, పార్శీలు, మహమ్మదీయులు, హిందువులు కూడా ఎగబడ్డారు. అన్నివర్గాలకు చెందిన పురుషులేకాదు, స్త్రీలు కూడా ఆ ప్రసంగాలు వినడానికి వచ్చారు. మార్క్ట్వైన్ హాస్యోక్తు లను విని ఇంగ్లీషువారు ఎంత ఆనందించారో, ఈ అందరు అంతకన్నా ఎక్కువగాదిని ఎక్కువగా ఆనందించారు."

తన ప్రసంగాలకు కావలసిన విషయాలను సేకరించడంలో మార్క్ట్వైన్‌కు, చార్లెస్ డికెన్స్‌కు పోలిక వుంది. ఇద్దరు ఆ విషయ సేకరణ కోసం అధికంగా పుస్తకాల మీద ఆధార పడ్డారు. "నేను ఒక దొంగని. నా వంటి దొంగలు చాలామంది వున్నారు. పుస్తకాలు రాయడం కోసం, పుస్తకాలలోని విషయా లను తెగ కొల్లగొట్టా ను." డికెన్స్‌కు, ట్వైన్‌కు ఒక్క తేడా వుంది. ప్రసంగం చేసేటప్పుడు డికెన్స్, తన పుస్తకాలలోంచి, కొన్నిభాగాలను విడదీసి చదువుతూ వుండేవాడు. ట్వైన్ అటు వంటి పని ఎప్పుడూ చేయలేదు. తన గ్రంథంలో బ్రహ్మాండంగా వున్న భాగాలను, కథలను 'ఏరి' వాటిని విరళంగా అతికించి, తన ధోరణిలో వానినే కొత్తవైనట్లు, కొత్తవిగా కన్పించేట్లు, కొత్త విగా వుండేట్లు చెప్పేవాడు.అది అనుకరణ దుస్సాధ్యమైన పద్ధతి. ఇది ట్వైన్ పద్ధతి.

మార్క్ట్వైన్ పుస్తకాలు వ్రాస్తే, వానిని తన జీవితం లోంచి తెచ్చి పటంఅల్లినట్లు అల్లేవాడు. ఆయన చెప్పే పద్ధతి ఇట్లా వుండేది. "నేను మిస్సోరీ రాష్ట్రంలో పుట్టాను. గ్రామం ఫ్లోరిడా. ఆ గ్రామం దేవతావస్త్రం లాంటిది. కంటికి కన్పించదు. ఆ గ్రామంలో ఆరోజుల్లో వందమంది జనం వుండే వాళ్లు. నూటికి ఒకరు చొప్పున పెరుగుతూ వుండేవాళ్లు. ప్రపంచంలో ఏ పెద్దమనిషి, ఏ గొప్పవాడు ఏ పట్టణానికిగాని ఇంత చేశారని చెప్పడానికి లేదు. మా గ్రామంలోని వాళ్లషేక్స్పి యరు కంటే గొప్పవాళ్లు."

మార్క్ట్వైన్‌కు ముప్ఫయిఐదేళ్లు వచ్చేవేళకు ఆయన "జర్నీమన్ ప్రింటరు"గా అమెరికాలో అనేక నగరాలలో పనిచేస్తూ వచ్చాడు. మిసిసిపి నదిలో "స్టీమ్‌బోటు" నడిపే వాడుగా సిద్ధహస్తుడనిపించుకున్నాడు, అది చాలా కష్టమైన పని. అదికూడా ట్వైన్‌కు వశంగతమైంది.నవాదాలో వెండిగనులు వున్నాయి, ఆ గనులలో పని చేశాడు. అమెరికా పశ్చిమ రాష్ట్రాలలో బహు పత్రికలు వున్నాయి, వానిలో విలేఖరిగా కుదిరి ముదిరాడు. ఇది ట్వైన్‌జీవితంలో పెద్ద మలుపు. ఈ రోజుల్లోనే ఆయన

తన రచనకు అంకురార్పణంచేశాడు. పుస్తకాలు వ్రాయడం మొదలు పెట్టాడు. అంతవరకు శ్యామ్యూల్ లాంగ్‌హారన్ క్లెమెన్స్ అన్న పేరితో పరగినవాడు ఇప్పుడు మార్క్‌ట్వైన్ అయినాడు. (ఇది ఒక విచిత్రమైన మాట. స్టీమ్‌బోటులకు సంబంధించిన పరిభాష. రెండు "ఫాదమ్‌ల"లోతు అని ఆ మాటకు అర్థం)

ట్వైన్ వ్రాసిన కథంలో ఒకటి ఆయన నెవాడాగనులలో పనిచేసిన రోజుల నాటిది. "కార్సన్ సిటీలో నేనో తప్పు చేశాను. మెక్సికన్ 'ప్లగ్'ను ఒకదానిని కొన్నాను. ఆ 'ప్లగ్గు' మంచిది. ఒక మనిషి నాకు చెప్పాడు. ఆ ప్లగ్గు కొంటే బాగుంటుంది—అని. కొన్నాను, ఆ తర్వాత తెలిసింది. అతను ఒక వేలాము వాని సోదరుడు. ఆ 'ప్లగ్గు' ఒక గుర్రం. దాన్ని ఎక్కుతానో లేదో ఏమి చెప్పను. అది నాల్గు కాళ్ల మూట కట్టుకున్నట్లు వానిని దగ్గరకు తెచ్చుకుంటుంది. కాళ్లను పొట్లం కట్టినట్లు కడుతుంది. నడుం వంచుతుంది. ఆకాశంలోకి ఎగురుతుంది. ఆ ఎగరడం కాస్తాకూస్తా కాదు. ఐదారడుగులు ఎగురుతుంది. నేను దాన్ని వంచుతాను. జీనులో నిలుస్తాను. అది మళ్లీ ఎగురుతుంది. మళ్లీ ఆకాశంలోనికి వస్తుంది. తిరిగి కిందికి వంగుతుంది. జీను ప్రాణాంతకంగా వుంటుంది. జీనుయొక్క ముందుభాగం, పొడుచుకొనివచ్చినట్లు వున్నభాగం, నాకు గ్రుచ్చుకుంటుంది. ఇంతటి గుర్రపు కవాతును భరించడం కష్టం. నాకు సాధ్యం కాలేదు. నేను దిగేద్దామనుకున్నాను. దిగనా ఏమిటి? గాలిలో వాడిని గాలిలోనే వున్నాను. కాళ్లు నేల మీద ఆనలేదు. నేల మీద ఆనడం, అది ఏమి ఆనడం! నాకు తిరిగి మతి మతిలో పడే వేళకు ఆ గుర్రం లేదు. చక్కాపోయింది. నేను నేలకు అతుక్కుపోయిన వాడిని కాస్తా ఎట్లాగో లేచాను. త్రవ్వి ఎవరో పైకి తీసినట్లు వుంది ఆ నా లేవడం. అప్పుడు అనుకున్నాను. ఆ వేలాము వాని తమ్ముడు గనుక, నేను కార్సన్‌సిటీలో వుండగా చచ్చి, వాడికి అపరకర్మలు అంటూ జరిగితే, ఆ అపరకర్మలకి తప్పకుండాహాజరు అయితీరుతాను—అని."

తన జీవితం పశ్చిమదిశాభాగంలో ట్వైన్ ఇట్లా అనుకున్నాడు: డబ్బయిఏళ్లు సాధించాను. ఎట్లాంటి సాధన ఇది. పట్టి మామూలు సాధనా! ఈ డబ్బయిఏళ్లు ఒక పథకం వేసుకొని, ఆ పథకం ప్రకారం అటు ఇటు కూడా జరక్కుండా జీవితాన్ని నడిపించాను. ఇంకొకడు గనుక ఇట్లా నడవవలసివచ్చిందే అనుకోండి, వాడువిధిగా చచ్చేవాడు." మార్క్‌ట్వైన్ 1910 ఏప్రిల్ 21 వ దివంగతుడైనాడు. అంత కాలం ఉన్నతంగానే జీవించాడు. (చిత్తవృత్తి నిరోధం అంటే నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు—అయితే అది ఎవ్వరికీ ఆపద తెచ్చిపెట్టనంతవరకే.) పొగాకును గురించి; (నేను దాన్ని ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు మాని వేయగలను. ఒక లక్షసార్లు అట్లా మానివేశాను.) సారాయాన్ని గురించి. (మనస్సును కట్టడానికి మాత్రమే సేవిస్తాను. మరి ఆ అవసరమే నాకు ఎప్పుడూ పట్టలేదు.)

ప్రసంగ పదేస్పులలో మార్క్‌ట్వైన్ ఎన్నో విషయాలను గురించి మాటాడాడు. ఆ మాట్లాడిన ప్రతివేళా సభాస్తారులు నవ్వును పట్టలేక పొట్టలు పగిలారు. కలకత్తాలో మొదటిసారి మాట్లాడినప్పుడు అచ్చట రాయల్ థియేటర్‌లో ఆయన మూడు ఉపన్యాసాలు ఇచ్చాడు. ట్వైన్ తన ప్రసంగాన్ని ఇట్లా ఉపక్రమించాడు: "నేను చిన్నప్పుడు చదువుకున్నాను గదా? ఆ రోజుల్లో ఒక వర్షపు రోజు ఎదురు తగిలింది. ప్రతి బడికి వెళ్లే పిల్లవాడికి అటువంటి వానరోజులు దుర్దినాలు. ఆరోజుల్లో బడి ఎందుకనుకుంటాడు. నాకు ఇటువంటి దుర్దినాలు తరచు తగులుతూ వుండేవి. అటువంటి ఆ రోజులలో చేపలు పట్టడానికి పోతే ఎంత బాగుండును అనిపిస్తుంది. అందుకు తగినట్లుగా ఆ రోజులు వుండేవి." ఈ యాత్ర ముగించుకొని వచ్చి (అనగా బడికి పోకుండా చేపలు పట్టి వచ్చి) ట్వైన్ ఒక చిన్న గదిని చేరుకున్నాడు. అది ఆఫీసుగది ఆ ఆఫీసు తానుతెలిసిందికాదు. తనకు క్రొత్త. ఆరోజున ఆ పట్టణంలో హత్య ఒకటి జరిగింది. శవాన్ని తెచ్చి పంచాయతీకిఅక్కడపెట్టివుంచార. ట్వైన్‌దాన్నిచూచాడు. అప్పుడు తను వున్న సంగతి సందర్భాలు ఎటువంటివో ట్వైన్‌కు నెమ్మదినెమ్మదిగా అర్థంకావడం మొదలుపెట్టాయి. అది అ తా ఈ కలకత్తా ప్రసంగంలో ట్వైన్ వివరించాడు. ఆ గదిని తాను ఏ విధంగా వదిలిపెట్టి పోయింది చెప్పాడు. "నేను అక్కడినుంచి వెళ్లిపోయాను. అనవసరమైన తొందర ఏమీ పడలేదు. నేను వెళ్లాను. అంతే. గదికి కిటికీ వుంది. ఆ కిటికీలోంచి వెళ్లిపోయాను. ఊచలవంటి చట్రం వుంది. దాన్నిఆపళాన పుచ్చుకున్నాను. వదిలి పెట్టలేదు. నిజంగా నాకు అది అనవసరం. అయినా దాన్ని పుచ్చుకుపోయాను."

ఆయన ఆ ఉపన్యాసాలు ఇచ్చిన రోజుల నాటి పత్రికల కత్తిరింపులు గనుక ముందు పెట్టుకొని చూస్తే ఈ ప్రసంగాలలో ట్వైన్ ఏమి మాట్లాడింది కొంతకు కొంతగా తెలుస్తుంది. ఉదాహరణకు ఒక బొంబాయి పత్రికలో ఇది వుంది. "మానవజాతి పునరుద్ధరణకు మార్క్‌ట్వైన్ ఒక పథకం వేసుకు కూర్చున్నాడు. అది పట్టి తేలిక పథకం. మనుష్యుడు తన్ను తాను రక్షించుకోవాలి. వేని నుండి? తాను చేసే నేరాల నుండి. తాను చేసే ప్రతి తప్పును గురించి మనుష్యుడు ఆలోచించుకుంటే సరిపోతుంది. అయితే ఆ ఆలోచన నీతిప్రాప్తమైన మార్గంలో సాగాలి. ఎన్ని ఎక్కువ నేరాలు చేస్తే అంత ఎక్కువ ఆలోచన, అన్ని ఎక్కువ పాఠాలు. ఇట్లా ఎన్ని నేరాలు చేయవచ్చో అన్ని నేరాలున్నూ చేసే వేళకు—అటువంటి చేసే నేరాలు 362 కంటేఎక్కువ లేవు—ఆ మనిషి పూర్తిగా పరిపూర్ణుడై పోతాడు. మార్క్‌ట్వైన్ పరమ హాస్యగాడు. మొదటి యుద్ధంలోనే అది పతాకకు వచ్చింది. యుద్ధం అంటే ఒక 'ఎడిటరు'తో తగాదా. ఆ 'ఎడిటరు' ఇంకో పత్రికవాడు. "నేను అతన్ని ఒకమాట అన్నాను—హంతకుడవనో మరేమో అనో. ఆ మాట అతనికి రుచించలేదు. సవాలు చేశాడు. ఆ మనిషి లాంతరు స్తంభంలాగా పొడుగ్గా వున్న మనిషి. మంచి వేటుకాడు. నేను మొదట చేయవలసిన పనులు కొన్ని వున్నాయి. కొంత డబ్బు ఎవరినన్నా అడిగి పుచ్చుకోవాలి. 'విల్లు' రాయాలి. ఇటువంటివి. "మరి తగాదా

ఎట్లా జరిగింది. ఎట్లా పరిణమించింది, ఎట్లా ఆగిపోయింది. ఈ విషయాలన్నీ ఎంతో గొప్పగా చెప్పాడు ట్వైన్. అందరికీ పొట్టలు చెక్కలైపోయినాయి.''

కలకత్తాలో ట్వైన్ ఒక ప్రసంగం అనంతరం 'స్టేట్స్ మన్' పత్రిక ఈ మాటలు వ్రాసింది: ''ఒకడు వున్నాడు. వాడికి ఒక తాత వున్నాడు. ఆ తాత ఒక వెండికాసు పోగొట్టుకున్నాడు. ఆ సంగతి ఎట్లా చెప్పాలో ఆ 'ఒకడికి' తెలియలేదు. ఇందులో హాస్యం పుట్టించే సంగతి ఏమి వుంది? అటువంటి మనిషిని మనం చూస్తూనే వుంటాము. కాని వాడి సాగలాగుడు, మాటలు చెప్పేప్పుడు మరుపు రావడం, మనకు వాణ్ణి ఒదారుద్దామని పిస్తుంది. కాని మార్క్ ట్వైన్ వున్నాడే, ఆయన, అటువంటి మనిషిని గూడా, తనకు తెలియకుండా నవ్వు పుట్టించేవాణ్ణిగా చేసేస్తాడు.

''మార్క్ ట్వైన్ ఒక పొడుగాటికథను చెప్పడం మొదలు పెట్టాడు అంటే, అది ఎన్ని తగూలతో కూడింది అయినా, సహజంగా వున్నట్లు కన్పిస్తుంది. ఒక పెద్దమనిషిని ఒక గొర్రె పొటేలు ''ఆయన పొడు అంటే'' పొడిచి పడవేసిన సాహసక్రియ లాగా పర్యవసిస్తుంది. మిస్ విక్టేకర్ గాజుకన్ను సంగతి వుంది. ఆవిడ ఆ గాజు కన్నును అప్పుడప్పుడు ఒక ఆవిడకు అప్పు ఇస్తూ వుండేదట, ఆవిడకు కూడా చూపు ఆనదు. ఎవరినన్నా కలుసు కోవాలన్నప్పుడల్లా, ఈ గాజుకన్నును ఎరువు తీసుకుంటూ వుంటుంది. ''అంకుల్ లావ్'' కథ, అదో విచిత్రమైంది. ఐరిష్ వాడైన ఒక పనివాడు సున్నపు తట్ట మోసుకుపోతూ పోతూ 'అంకుల్' మీద పడ్డాడు. ఆ పడటంవల్ల 'అంకుల్ లావ్' మర ణించాడు. శ్రీ వీలర్ ఉదంతం వుంది. ఆయన స్థితి దయనీయ మైంది. తివాసీల కర్మాగారంలోయంత్రాలలోఇరుక్కుపోయాడు. ఆ యంత్రాలు పద్నాలుగు గజాలు తివాసీ మూడు చుట్టలు చుట్టుకుపోయే వరకు ఆగలేదు.ఆ పద్నాల్గుగజాల్లోను శ్రీ వీలర్ అల్లుకుపోయాడు. ఆయన భార్య అపర కర్మలు బ్రహ్మాండంగా చేద్దామనుకున్నది. అనుకొని ఏమి చేసింది? ఆ పద్నాలుగు గజాల తివాసీని కొన్నది. ఒక పెట్టెలో పెట్టి, దాని మీద శాసనం వేయించింది. ''ఇన్నీ చెప్పినా, వెండికాసు కథ సంగతి తేలలేదు. ఆ సంగతి ఎవరికి పట్టలేదు.''

ఇటువంటి కథలు కొల్లలుగా వున్నాయి. ఇటువంటి వాటిల్లో ట్వైన్ గొప్పతనానికి కారణం వుంది. అది ఆ చెప్పే కథ ఇతివృత్తాన్ని పేనడంలోనేగాక, దాన్ని చెప్పే తీరులో గూడా సొగసులు వుండటమే. ఈ విషయాన్ని గూర్చి భారతదేశంలో ప్రతి ఒక్క పత్రికా వ్రాసివుంది. ఒక పత్రిక మదింపు ఏమిటో చూద్దాము: ''ఆయన చెప్పే కథ ఏమంత గొప్పదనడానికిలేదు. ఆ చెప్పే తీరులోనే అంతా వుంది. ఆ చెబుతున్న దానిలో ఒకరు ఆసక్తులైనారన్నా, అందులోని హాస్యాన్ని అనుభవించారన్నా, అంతా ఆ చెప్పే పద్ధతిలోనే వుంది. చమత్కార వచనం వున్న దంటే, దాని రహస్యం అంతా ఆశ్చర్యాన్ని పుట్టించడంలోవున్న దన్నది. ట్వైన్‌కు తెలిసిన విషయం. చమత్కారానికి ఆశ్చర్యం సత్తా. స్థాయి. ఎవరు అనుకోని అప్పుడు ఒక్కక్షణోక్తిని విసరడం ఆ వెంటనే ఇంకో దారి త్రొక్కడం, ఆ త్రొక్కేవేళకు మొదట విసిరిన హాస్యపు మాటయొక్క ప్రసరణం వలన కల్గిన హఠా దుద్హాసము నశించిపోకుండా చూసుకోవడం, ఇది ట్వైన్ మాట్లాడ్డంలో చేసే నగిషీ పని''. అంతా ఇట్లా ట్వైన్‌ను మెచ్చుకున్నారు. 'మద్రాసు మెయిల్' మాత్రం— ''ఉపన్యాస కుడుగా మార్క్ ట్వైన్‌లో చెప్పుకోతగిన గొప్పతనం ఏమీ లేదు. మాట్లాడుతూవుంటే సాగదీస్తూ ముక్కుతో మాట్లాడు తున్నట్లు వుంది ఆయన వాచకం. వింటున్న కొద్దీ విసుగ్గా వుంటుంది''

భారతదేశంలో యీ యాత్రను పెట్టుకొనడానికి పూర్వం నుంచీ కూడా మార్క్ ట్వైన్ ఉపన్యాసాలు ఇస్తూనేవున్నాడు. ముప్పయి సంవత్సరాలు ఇచ్చాడు. అందువల్ల ఉపన్యాసకుడుగా ఆయనకున్న పేరు హఠాత్తుగా వచ్చి మీదపడింది కాదు. 'బొంబాయి గెజెట్'పత్రికమనిషి ట్వైన్‌ను ప్రశ్నించాడు. ''మీరు యీ ఉపన్యాసాలను జాగ్రత్తగా తయారు చేస్తారన్న మాట?— అని. అందుకు ట్వైన్ సమాధానం ఇది: ''మరి ఏమి చేస్తాననుకున్నావు! ఆపని చేయనని నటించడం నాచేత కాదు. డబ్బు పెట్టి ప్రసంగాలు వినడానికి వచ్చేజనం ముందుకు వచ్చేప్పుడు, ఏ ప్రాసంగికుడుగాని, ఏమి మాట్లాడాలో తయార్చు చేసుకోకుండా ఎట్లా వస్తాడు! అట్లా వస్తాడని నేను నమ్మను, మాట్లాడదలచుకున్న ప్రతిమాటను ఆలోచించి, ఆలోచించి, అది ఇక జారిపోయేందుకు వీలులేనంతగా మనస్సుకు పట్టించుకు మరీ రావలసి వుంటుందని నా నమ్మకం.''

వేదిక మీద ఎట్లా మాట్లాడాలో, ఎట్లా మాట్లాడితే రక్తి కడుతుందో, మార్క్ ట్వైన్ బాగా పరిశోధించాడు. హాల్ హాల్‌బ్రూక్ అనే హాస్యనటుడు ట్వైన్ వ్రాసిపెట్టుకు వున్న ''నోట్సు'' బయటి లాగి ఆ ధోరణిని అలవాటు చేసు కున్నాడు. బ్రహ్మాండంగా జయించాడు. మాట్లాడుతూవున్న సందర్భంలో మాటల మధ్య ఎంతసేపు ఆగాలి, హాస్యపుమాటను ఎప్పుడు టపాకాయను కాల్చినట్లు జనం మీదకు విసరాలి, ఎన్ని దశల్లో విసరాలి, ఆ విసిరేప్పుడు, ఏమీ పట్టనితనాన్ని ఎట్లా ప్రదర్శించాలి, ఆ మాట అంటున్నట్లు అనక, ఏమీ అనడు అన్న స్థితిలో పెట్టి ఎట్లా దాన్ని విసరాలి, ఇవి అన్నీ— ట్వైన్ చేసిన సొగసులు.

హొనోలూలూ లో జరిగినట్లు చెప్పబడిన కథ ఒకటి వుంది. ఆ కథ చెప్పే పద్ధతిలో ఇటువంటి నగిషీ పనిలో వున్న 'షోకు' అంతా కన్పిస్తుంది. అచ్చట ఆయన ఒక చోటుమ చూపిపద్దామనుకున్నాడు. అక్కడికి గుర్రంమీదపోతే బాగుం టుందని ఎవరో ఆయనకు సలహా ఇచ్చారు. కథ ఇక్కడినుంచి రక్తిలోకి వస్తుంది. ట్వైన్ చెబుతున్నాడు.: ''నాకు భద్రమైన గుర్రం కావాలి అన్నాను. తొందరగా పోయేది నాకు అక్కర

లేదు. ఆ మాటచెప్పాను. ఆ గుర్రం పట్టి సాధువు అయి వుండాలి. దానికి ఏవిధమైన "స్పిరిట్"గాని పనికిరాదు. (నవ్వు). కుంటిదైతే మరీ మంచిది. (నవ్వు). అక్కడివాళ్లు నాకో గుర్రాన్ని చూపించారు. అది అక్కడ ఎనుకునేందుకు ఏమన్నావుంటే బాగుండును అనుకుంటున్నట్టుగా వుంది. ఆ గుర్రాన్ని సరేనన్నాను. దాని నడక నెమ్మదిగానేవుంది. కాని తెగ ఆలోచనలో పడిపోతోంది. దాని నడుస్తునా దానికి ఒకే విచారం; ఒకటే లోచన. దాని ఆ ఆలోచన ఏమో నాకు భయమై పోయింది. నేను ఇట్లా స్వగతం చెప్పుకున్నాను— 'ఈ గుర్రం నన్ను ఏమో చేద్దామని ఆలోచిస్తున్నది. ఏ జంతువైనా, ఏమీ ఆలోచన లేకుండా ఇట్లా ఏకధాటీగా ఒకే ఆలోచనలో ఎందుకు పడిపోతుంది! పడిపోదు.' ఈ రకమైన ఆలోచన నా మనస్సును మహా వేధించింది. నేను పూరికే ఇబ్బైపోయినాను. పట్టలేకపోయాను. చివరకు గుర్రం దిగి, దాని కళ్లల్లో ఏమి వుందో చూద్దామని నిశ్చయించుకున్నాను. దిగాను. ఇప్పుడు ఈ మాట వూరటతో చెప్తాను. ఆ గుర్రానికి ఎటువంటి ఆలోచనా లేదు. అది నిద్రపోయింది" (నవ్వు. హర్షధ్వనులు.)

మార్క్‌ట్వైన్ గొప్పతనం ఒక్క హాస్య ధోరణిలోనే, వున్నదా? 'బొంబాయి గెజెట్' ఇట్లా వ్రాసింది. "జనాన్ని నవ్వించేశక్తి ట్వైన్‌కు ఎంతవుందో, వారిలో కరుణ పుట్టించి, కన్నులలో నీళ్లు ఉబికేటట్లు చేయగల శక్తి కూడా అంతవుంది. మాటలో కథలో చెబుతూ, జనాన్ని నవ్విస్తూ, మధ్యలో కరుణకు ఆస్పదంకాగల ఒకటి రెండు ఉదంతాలు చెప్పి, అంతటి నవ్వులోను అట్లా కరుణపుట్టి కన్నుల వెంట విషాదాశ్రువులు రాలేట్లు ట్వైన్ చేసేవాడు. ఈ కరుణ ఆయన చెప్పే ఉదంతం వల్లనేగాక, చెబుతున్న పద్ధతి వలన కూడా ఉత్పన్నం అవుతున్నది. హాస్యమూ, కరుణా ఒకదానితో ఒకటి కలిసి ప్రతీతిని పొందుతూ జనాన్ని ఆకర్షిస్తాయి."

మార్క్‌ట్వైన్ గొప్పతనము, ఆ గొప్పతనము యొక్క రహస్యము ఇదే.

—శ్రీ కార్మన్ కాగల్.



# 'దేశభక్తుని' జీవితదృశ్య సంపుటి - 2

(డిసెంబరునెల సంచిక తరువాయి)

శ్రీ కె. వి రమణారెడ్డి

గృహపీడ, చిత్తక్షోభ ,ధనవ్యయం అనారోగ్యం--కొండ వెంకటప్పయ్యగారి స్వవిషయం సంతృప్తికరంగా లేక పోయింది. పెద్దకుమార్తెకు సపత్నీప్రాప్తి తరువాత దుర్భరమైన వైధవ్యం కుంపటిని రగిలించింది. చిన్న కుమార్తెకు చిన్నతనంలోనే క్షయ వ్యాధి వారిని దేశాలు పట్టించి నడిపించింది. కష్టానికి కష్టం తోడై కష్టాలన్నీ కలిసి ఒక గుట్ట పడ్డాయి. అయినా అది గుట్టమాత్రమే. వెంకటప్పయ్యగారు కొండ వారాయిరి. కాబట్టి గుండెను కొండ రాయి చేసుకొన్నారు, అప్పుడప్పుడు కన్నీళ్లను విడిచే కొండ రాయి. లేకుంటే వారు 'స్వ'నుండి 'పర'కు పయనించగలిగివుండే వారేనా? కుటుంబ భక్తుడుగా గాక దేశభక్తుడుగా రాణకెక్కి ఉండేవారేనా?

గాంధీశకం ప్రారంభమైన కొన్నాళ్లకే వెంకటప్పయ్య గాంధేయుడయ్యాడు. అఖిల భారత ఖ్యాతి నార్జించిన ఆంధ్రులలో వెంకటప్పయ్య కంటే న్యాపతి సుబ్బారావుగారే ముందు నడిచారుగాని ఆ ఆంధ్ర గాంగేయుణ్ణి ('ఆంధ్రభీష్మ'అని కదా న్యాపతివారి బిరుదు!) ఈ శుద్ధ గాంధేయుడు తోసిరాజన్నాడు. ప్రకాశం, పట్టాభి ఇంకా నడిమింటికి ఎగబాకని రోజులవి. ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య పలుకుబడి నిరాటంగా సాగిపోతూ ఉంది. బులుసు సాంబమూర్తి కూడా ఇంకా కాషాయాన్ని ధరించలేదు. వృత్తిని విసర్జించలేదు. ఆ రోజులలో కొండ వారిదే రాజ్యం; ఎందరో సామంతులుగాని సామ్రాట్టు ఒక్కడే అన్నట్టుగా ఉండేది. అఖిలభారత కాంగ్రెసు సాంవత్సరిక సమావేశాలకు వరుసగా వెళ్లివచ్చే వెంకటప్పయ్య గురించి దేశంలోని ఇతర ప్రముఖులకు సదభిప్రాయం ఏర్పడింది. ముఖ్యంగా వారిచిత్తశుద్ధి పేరెన్నిక గన్నది. కాబట్టే అఖిల భారత కాంగ్రెసు సంస్థకు అధ్యక్షులు కాగలిగారు. దుగ్గిరాల వారు కార్యదర్శి.

అధ్యక్ష కార్యదర్శులిద్దరూ అతిరథులేగాని ఏటికొకటి కోటికొకటి లాగిన ఎద్దులవలె భిన్నవైఖరులను ప్రదర్శించక తప్పలేదు. మాంటేంగూ షెమ్స్‌ఫర్డ్ సంస్కరణల ఫలితంగా ఏర్పడనున్న రాష్ట్ర శాసన సభలలో కాంగ్రెసువాదులుపాల్గొనడమా మానడమా అనేది వివాదాంశమై, 'నోఛేంజర్స్' 'ప్రోఛేంజర్సు'గా కాంగ్రెసు సంస్థను చీలగొట్టింది. పండిట్‌మోతీలాల్ నెహ్రూ చిత్తరంజన దాస్ వగైరాలు శాసనసభాప్రవేశానుకూలురు. వల్లభాయి పటేల్, సరోజినీనాయుడు వగైరాలు ప్రతికూలురు. ఈ తిరుగుబాట్ల నడుమ చిక్కుబడి అధ్యక్షులవారు నుగ్గు నూచమై పోయారు. తాము ప్రతికూలురే గాని అధ్యక్షస్థానాన్ని అధిష్ఠించినంతవరకూ ఇరుపక్షాల పాక్షిక వైఖరులకు అతీతులుగా ఉండగోరినందువల్లనే, వంత వచ్చింది. ఆంధ్రనాయకులలో ఎక్కువ పాళ్లు ప్రోఛేంజర్సు . కడుకటికి గోపాల కృష్ణయ్యగారు కార్యదర్శులయి ఉండికూడా గుట్టు చప్పుడు గాకుండా కలకత్తాకు వెళ్లి చిత్తరంజన దాసుగారి చెవికొరికి వచ్చారని 'స్వీయచరిత్ర'లో వెంకటప్పయ్య వాపోతారు. పటేల్ ప్రభృతులకు అధ్యక్షులవారు అసమర్థులనిపించారు. తమకు తాము ప్రతి ఒక్కరూ నిష్పక్షికులే, సత్యవాదులే, ఋజువర్తనులే.

కాంగ్రెసు కార్యవర్గంలో సభ్యత్వానికి ఇతర ఆంధ్ర నాయకులింకా అర్రులుచాపలేదు. తమకూ దేశానికీ నడుమ కొండవలె వెంకటప్పయ్య అడ్డుగా నిలుస్తున్నాడని డాక్టర్ పట్టాభిగాని బులుసు సాంబమూర్తిగాని మరొకరు ఇంకొకరు గాని ఇంకా తలపోసుకుంటున్నట్టు లేదు. సామ్రాజ్య సింహపీఠి ఇంకా కదలబారిన సూచనలు కనుదగలలేదు. ఈ మహర్దశలో వెంకటప్పయ్య గారు ఒక్కసారిగా దేశమంతటా వెలిగి పోయారు. పత్రికలన్నిటా నిండిపోయారు. ఇంతకీర్తిని వారికి , వారితోబాటు ఆంధ్రదేశానికి సమకూర్చి పెట్టిన ఘనమైన ఘటనలో వారికి నేరుగా ప్రమేయంలేదు!

దానిపేరు పెదనందిపాడు పన్నుల నిరాకరణ పోరాటం! బార్డోలీలో గాంధీజీ చరిత్రను సృష్టించబూనితే, పెదనందిపాడులో ఆ చరిత్రను సామాన్యులు అసామాన్యంగా సృష్టించి వేశారు. ప్రభుత్వం అక్కడ అదృశ్యమై పోయింది. కలెక్టరు పీక సాగలేదు. పోలీసు జులుం చెల్లుబాటు కాలేదు. కొండంతటి నాయకులు వస్తూ పోతూ ఉన్నారుగాని కొండలను మించిన పర్వతమొకటి అక్కడే ఉంది. గనుక ఈఉద్యమం నూటికి నూరు పాళ్లు జయప్రదం కాగలిగింది. ఆపర్వతం పర్వతనేని వీరయ్య చౌదరి . ఈఘటనకు ముందునా వెనకనా ఆపేరుఎందరి చెవులలోనో పడిన పేరుకాదు. గొల్లపూడి సీతారామశాస్త్రి, అయ్యదేవర కాళేశ్వర రావు ప్రభృతులు బయటినుంచివచ్చి ఉపదేశించి పోవచ్చుగాక, రంగంలో ఉండి పోరాటాన్ని నడిపింది

వీరయ్యగారేనని కొండ వెంకటప్పయ్య గారి 'స్వీయచరిత్ర' లోనూ అయ్యదేవర వారి ఆత్మ చరిత్రాగ్రంథంలోనూ మనకు సాక్ష్యం లభిస్తుంది.

ఉత్తాలమైన సాగర తరంగంవలె పొంగి చెలియలికట్ట వైపు దూకి పడసాగిన ఈఉద్యమాన్ని ఆపివేయ వలసిందిగా ఒక శుభ ప్రభాతాన మబ్బులేని పిడుగుచందంగా కొండవారికి ఒక కబురు వచ్చింది. గాంధీజీ స్వదస్తూరితో రాసిన చీటీ చదువుకొని వెంకటప్పయ్య ప్రాన్పడి పోయాడు. ఇక పెద నందిపాడు రైతుల మనస్థితిగురించి చెప్పేదేమిటి? ఈచీటీ ఎలా వచ్చింది, ఎవరు తెచ్చారు; ఎవరు తెప్పించారు; ఏమి చెప్పి తెప్పించారు, అనే సందేహశల్యాలతో వెంకటప్పయ్యగుండె తూట్లుపడింది. గాంధీగారి కాకి కబురుకు జవాబుగా వెంకటప్పయ్య తంతి కబురు పంపాడుగాని గాంధీజీ ససేమిరాఅన్నారు. ఉద్యమ తరంగం నడమంతరాన విరిగి పోయింది. డాక్టర్ పట్టాభి, ముట్నూరి కృష్ణారావుగారి ద్వారా ఈ ఉద్యమ శాంత స్వభావం గురించి ప్రతికూల సమాచారం తెప్పించుకొని, దానిని గాంధీజీకి చేర వేసి ఉంటారని ధ్వని.

అలాంటిదే మరొక గొప్పఘటన పల్నాటి అడవి భూముల సత్యాగ్రహం. దీనిలో గూడ నేరుగా వెంకటప్పయ్య పాల్గొన లేదు. ఉన్నవ లక్ష్మీ నారాయణ, మాడభూషివారు ఈఉద్యమ సారథులు. సర్కారు వారి దండోరా వేసేందుకు తప్పెట తీసుకొని ఒక్క మాదిగైనా ముందుకు రాలేదు గాని ఉన్నవవారిని వూరేగించేందుకు తప్పెట్లకు తాళాలు తోడయాయి. కోడిపుర్మ్న గుంటూరినుంచి పల్నాటిలో 'కేంపు' చేసిన కలెక్టరు దొర సన్నిధికి గుడగుడ ప్రయాణం చెయ్య వలసివచ్చింది. కన్నెగంటి హనుమంతు పర్వతనేని వీరయ్య కు ప్రతికల్పుడయ్యాడు.

వెంటప్పయ్య వేరుగా ముందంజవేసి సముక్షంలోఉండి నడిపిన పెద్ద ఉద్యమం 'లవణోద్యమం'. దండీ సత్యాగ్రహానికి ఎందునా తీసిపోని విధంగా గుంటూరులో , గుంటూరులోనని మాత్రమే ఏమి వూరూరా, జరిగింది. "వీరగంధము తెచ్చి నారము వీరుడెవ్వడో తెల్పుడీ" అని త్రిపురనేని రామస్వామి చౌదరి రాసిన గేయ చరణాన్ని ఉన్నవ లక్ష్మీబాయమ్మ పాడుతూ ఉండగా , ఒక్కొక్కరుగా లవణోద్యమ వీరులు ముందుకు వచ్చి పాల్గొన్న ఆ పోరాటం నిజానికి ఉత్సవం వలె జరిగింది.

ఈమధ్యకాలంలో ఎన్నో ఇతర ఘటనలు కిక్కిరిశాయి, ఆంధ్రుల భారత జాతీయోద్యమ చరిత్రలోనూ కొండ వెంకటప్పయ్య స్వీయ చరిత్రలోనున్నూ. నిజానికి అవి రెండూ ముడిబడి విడదీయ వీలులేకుండాపోయింది. కాకినాడలో అఖిల భారత కాంగ్రెసు కూడింది. వెంకటప్పయ్య ఆహ్వానసంఘాధ్యక్షుడుగా హిందీలో ఉపన్యసించాడు. అది అపూర్వం. తర్వాత గాంధీజీ ఆంధ్రదేశానికి విజయంచేసి వగలూ నాణేలూ నోట్లూ మంచితనంమీద కొల్లగొట్టుకొని పోయారు. 'తిలక్ స్వరాజ్యనిధి' సమకూర్చడంతో ఆంధ్రులు గాంధీజీ హృదయాన్ని కొల్లగొట్టారు. అక్షరాలా అవి త్యాగానికి మంచి రోజులు. సొంత పద్దునుండి వెంకటప్పయ్యగారు ఎంత ముడుపు చెల్లించారో తెలియదుగాని లోకుల వద్దనుండి మాత్రం చాలా రాబట్టారు. ఆంధ్రదేశం ఈ కొసనుండి ఆ కొసకు గాంధీజీ వెంటఉండి తోడునీడగా తలలోని నాలుకగా వ్యవహరించి వారి చేతులతోబాటు మనస్సునుగూడా నింపి వేశారు. పలనాటి గజదొంగ ఒకడు, తోడుదొంగలను మందలించి, దొంగసొమ్మును వెంకటప్పయ్యగారికిచ్చి పంపుతూ బుద్ధిజెప్పుకొని లోకానికి బుద్ధిజెప్పిన కథ వాడుకలో ఉంది. ఆనాడు దొంగలకు కూడా దేశభక్తి ఉండేది. ఇప్పుడు అది తారుమారైంది. ఇదీ ఆ కథ చెప్పే నీతి.

ఎవడుగాని ఎల్లకాలమూ 'ఏకచ్ఛత్రంగా' ఏల్బడి సాగించలేడనేందుకు అఖిలభారత స్థాయిలో వెంకటప్పయ్యగారి హోదాకు క్రమంగా పట్టసాగిన గ్రహణమే తార్కాణ. ఎదిగి వస్తున్న తమ్ములు (కుమాళ్లు గాకున్నా) పెత్తనం చేస్తున్న వానికి ఎంత కాలమని అణగిమణగి ఉంటారు?

ఆంధ్ర చర్ఖాసంఘ వ్యవహారాలు సజావుగా జరుగుతున్నట్లు లేదు అని బందరులో రేగిన గుసగుసలు సబర్మతీ ఆశ్రమ వాసి చెవులవరకూ పోయాయి. గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామీ సీతారాం) నిర్వాకం గురించి వెంకటప్పయ్యగారికి నిఘా ఉండవచ్చుగాని, డాక్టర్ పట్టాభికీ సుబ్రహ్మణ్యం గారికీ లేదు. వెంకటప్పయ్యగారికి సీతారామశాస్త్రి పుత్రప్రాయుడైతే కావచ్చు, వాత్సల్యం మితిమీర గూడదు. కాబట్టి గుంటూరిలోని కార్యస్థానం బందరుకు తరలిపోయింది. జోడెద్దులలో ఒకటి పనికి రాక పోయాక రెండవదికూడా పని కట్టివేసింది. గుంటూరు మండల చర్ఖా సంఘానికి మంచి కితాబు రాలేదని వెంకటప్పయ్యగారి ప్రాణం విలవిలలాడిపోయిందిగాని, ఏంఫాయిదా? నిజానికి గాంధీగారి సన్నిధిలో పట్టాభి గారి మాటకు విలువ హెచ్చింది.

హెచ్చరిక ఏం చేయగలదు? వెంకటప్పయ్య నూటికి నూరుపాళ్లు గాంధేయుడు కాలేక పోయాడు. ఆచార పరత్వం అడ్డువచ్చింది. గాంధీజీ స్వయంగా అస్పృశ్యతా విషయమై తమ వైఖరి ఏమిటని అడిగినప్పుడు, వెంకటప్పయ్య ఖండితంగా తన బ్రాహ్మణ్యాన్ని శుచినీ మడినీ సమర్థించుకొన్నాడు. గాంధీజీని సంతోషింప జేసేందుకని దొంగవేషాలు వేసే అభినయ కౌశలం తనకు లేదు, తనకు అక్కరలేదు. సంప్రదాయ బలాన్ని తాను తోసివేయలేదు. చివరకు, అకాలవైధవ్యం ప్రాప్తించిన తన ముద్దుల కుమార్తె పార్వతికి ఇంగ్లీషు చదువులు చెప్పిద్దామని పెద్దకుమార్తె సూచిస్తే, వెంకటప్పయ్య గొంతుకలో వెలక్కాయ విలచింది. ఆడవాళ్లు "మన శాస్త్రాలు" చదవాలిగాని ఈ ఇంగ్లీషు చదువు లెందుకన్నాడు. వెంకటప్పయ్య సత్యకాలపు మనిషి.

కాబట్టి గాంధీగారికి నెమ్మదిగా దూరమయ్యాడు ఇన్నాళ్లుగా మీరు కాంగ్రెసు కార్యవర్గంలో ఉన్నారుకదా, ఇప్పుడు మరొకరికి చోటివ్వగూడదా అని ఆ రాజకీయ

చతురుడు యుక్తి యుక్తంగా అంటే, ఈ రాజకీయ శిశుప్రాయుడు అట్లే కానిమ్మన్నాడు. బులుసు సాంబమూర్తి వంటి ఆనాటి యువకులు తావే అన్ని అగ్రస్థానాలలోనూ ఉండటం విషయమై లోపల్లోపల మథనపడసాగానని 'స్వీయ చరిత్ర'లో రాసుకొన్నాడు. తనకు ఎంత అప్రియమైనా, అది నిజమనిపిస్తే, దానిని నిస్సంకోచంగా వెంకటప్పయ్య ఒప్పేసుకున్నాడు. అందుచేతనే ఆయన చిత్తశుద్ధి అనేకులలో కానరాదు. దంభాచారం, భేషజం, బడాయి—జోడు కాగడాలుపెట్టి వెదికినా ఎక్స్‌రే తీసినా, ఆయన మనస్సును సమకూర్చిన ద్రవ్యాలలో కానబడవు. 'గివ్ ది డెవిల్ ఇట్స్ డ్యూ' అనే వాక్యాన్ని ఆయన సర్వే సర్వత్రా పాటించాడు. తనలోపాలను దాచివేసుకొనే నైజం కాదు ఆయనది. ఉదాహరణకు, తన వక్తృత్వ పటుత్వం గురించి ఆయన కెన్నడూ ఆత్మవిశ్వాసంలేదు. గడగడ మాటాడలేడు. కాబట్టి తాపీగా మెల్లగా మాటాడ్డం అలవడింది. దానినే ఇతరులు గాంభీర్యమనీ, తూచి మాటాడ్డమనీ భ్రమించేవారట, ఆయనే రాసుకొన్నాడు. సత్యకాలపు మనిషిమాత్రమే కాదు, వెంకటప్పయ్య సత్యవ్రతుడనిపిస్తాడు.

ఇంటి చీకుచింతలు ఒంటికి పట్టించుకోకుండా, పుట్టెడు జ్వరంలోకూడా వందలాది మైళ్ల రైలు ప్రయాణానికి తట్టుకో గల చేవ తనది. కాయపారు శరీరమేమో మరి, సుఖాలనూ రోగాలనూ కోరుకోలేదు, జైళ్లను తట్టుకొంది, డెబ్బయ్యేళ్లకు పైగా ధర్మ సాధనమై ఉపకరించింది. శాసనసభా సభ్యుడు కాగలిగినా, మరొక పదవి నలంకరించ గలిగినా, 1935 నాటికి వెంకటప్పయ్య సామ్రాజ్యం అంతరించినట్టే లెక్క. మరొక దేశంలోనైతే 'ఎల్డర్ స్టేట్స్‌మన్' గా గుర్తింపు పొందేవాడేమోగాని అనేకత్వానికి ఉదాహరణ ప్రాయమైన ఆంధ్రదేశంలో, ఆపాటికే ఉన్న గుర్తింపుకు కూడా ఎసరు పెట్టారు. భౌతికంగా ప్రాణం పోలేదనేగాని చాలా ఏళ్లు వెంకటప్పయ్య కీర్తిశేషుడుగానే జీవించవలసివచ్చింది.

అయితేనేమి? ఆయన ధన్యుడు. తలపెట్టిన ప్రతిదీ కలిసి వచ్చింది. ప్రతి పూనికా ఫలించింది. శారదానికేతనం ఉన్నవ లక్ష్మీనారాయణగారి పరమై పోవచ్చు, కృష్ణాపత్రిక ముట్నూరి కృష్ణారావుగారి హస్తగతమై ఉండవచ్చు, కాంగ్రెసు ఉద్యమం మూలాన మూలబడిన ఆంధ్ర రాష్ట్రోద్యమానికి టంగుటూరి ప్రకాశంగారు సారథి అయివుండవచ్చు. తానధ్యక్షుడుగా ఉండిన కాంగ్రెసు సంస్థకు ఆంధ్ర దేశంలో డాక్టర్ పట్టాభి మూలస్తంభమై ఉండవచ్చు, ఇవన్నీ వెంకటప్పయ్యగారు దేశానికి పెట్టిన భిక్షలే.

స్వాతంత్ర్యం వచ్చింది. కాని, తా నాశించినట్లుగా కాకుండా, రాజకీయాధికారం కాంగ్రెసుకు ఆగ్నేయం చేసింది. లార్డ్ యాక్టన్ అన్నట్లు, "అధికారమే భ్రష్టు పట్టిస్తుంది; అపరిమితాధికారం అపరిమితంగా భ్రష్టు పట్టిస్తుంది." వెంకటప్పయ్య సత్యవాదిత్వం మళ్ళీ ఒక సవాలు నెదుర్కొంది. తానై పెంచి పోషించిన సంస్థను తానే విమర్శించవలసి వచ్చింది. గాంధీజీకి వెంకటప్పయ్యగారు రాసి పంపిన దీర్ఘమైన లేఖ చరిత్ర గ్రంథం కెక్కదగినంత గొప్పది. ఆయనకు లాభించిందంతా విద్వేషమూ వేదన మాత్రమే.

నేరుగా ప్రధాని నెహ్రూను దర్శించి సంగతి సందర్భాలన్నీ సముఖంలో మాట్లాడి రావలెననుకొని ఒక ముది వగ్గు మదరాసుకు ప్రయాణమై పోయాడు. మదరాసు గవర్నర్ శ్రీ శ్రీప్రకాశ నివసించే రాజభవనానికి చేరుకొన్నాడు. పై అంతస్తులో నెహ్రూ ఉన్నాడు. ఆయనతో గుండె విప్పి ఘోషలు వినిపించాడు. అమ్మయ్య! కొండంత బరువు గుండె నుంచి దిగిపోయింది. మళ్లీ గుంటూరు పోవచ్చు. మొదట ఈపై అంతస్తునుండి కిందికి దిగాలి. తన కాళ్లపట్టు తప్పుతుందేమో?

ఒకవైపు నెహ్రూ—భారత ప్రధాని, మరొకవైపు శ్రీ ప్రకాశ—మద్రాసు రాజ్యపాలకుడు, సోఫావంటి దానిలో వెంకటప్పయ్యను కూర్చోబెట్టి, దానిని చెరొక వైపున ఎత్తిపట్టి కిందికి తీసుకువచ్చారు.

కొండవెంకటప్పయ్య అంతటివాడే—నిజానికి, ఆంధ్రకి భారత మంతా బ్రహ్మరథం పట్టవలసినంత యోగ్యుడు.

---



కిలగూరగంప:

# కాటమరాజు : పుల్లరి యుద్ధకాలము : పోతన కాలనిర్ణయ సమస్య

1966 జూన్ భారతిలో "కాటమరాజు: పుల్లరి యుద్ధ కాలము" విషయమున నేను వ్యక్తపరచిన అభిప్రాయములు శాసనాధారము వలన నిలువవని శ్రీ కృష్ణారెడ్డిగారు జూలై భారతిలో నిర్ధారణ జేసిరి. వారు చెప్పినదాని సారాంశము.

(1) శ. స. 1204 (క్రీ. శ. 1282) ప్రాంతము కాటమరాజు పుల్లరి యుద్ధకాలమనిన్నీ

(2) శ. స. 1360 (క్రీ. శ. 1438) కాళయుక్తి శాసన ద్విపదకాలమే కాటమరాజు ద్విపద కాల మేలకారాదు? అని చెప్పుచూ అందువల్ల శాసనములో పొందుపరచిన భాగవత (పోతన రచియించిన) పద్యములనుబట్టి పోతనగారి కాలము నిర్ధారణమైనట్లేనని పునరుద్ఘాటించిరి. వారు చెప్పిన దానిలో యిమిడివున్న విషయములు —

(1) పుల్లరి యుద్ధకాలము.

(2) ఆ పుల్లరి యుద్ధకాలము కొండయ్య కొడుకు రామయ్య శాసనములో ఉటంకించిన భాగవత పద్య భాగములు, ద్విపద భాగవతములోని ద్విపద పంక్తుల నాధారముగా, శాసనమును చెక్కించిన కాలము.

(3) కాటమరాజు కథను పినయల్లన ద్విపదగా రచియించిన కాలము. మనకు రెండు, మూడు విషయములు ప్రస్తుత సమస్య.

ఆ శాసనములో పోతన భాగవతములోని భాగములేకాక ద్విపద భాగవతములోని శ్రీ కృష్ణుని బాల క్రీడలను తెలుపు సందర్భములోని కొన్ని పంక్తులను గూడ కొండయ్య కొడుకు రామయ్య ఉపయోగించుకొనెను. ఆ పంక్తులు —

"బృందావనమ్మున పృధివి పెంపొంద
నందవ్రజమున నవి నొప్పుచుండు
ఆవుల మేపున నలరి గోపకులు
రైవతాచలమున రంజిల్లుచున్న"

ఆంధ్ర వాఙ్మయములో భాగవతమును ద్విపదగా వ్రాసిన కవులు మనకు ఇద్దరు కనపడుతున్నారు.

మొదటివాడు మడికి సింగన. ఇతను దశమ స్కందమును "ద్విపద"గా రచియించెను. అతని కాలము శ. స. 1342 (క్రీ. శ. 1420) ప్రాంతము. కాని ఆ గ్రంథములోని కొంత భాగము దురదృష్ట వశాత్తు ఖిలమై మనకు దక్కలేదు. దొరికి అచ్చుపడిన దానిలో శ్రీ కృష్ణుని బాల్యమును తెల్పు భాగము (మధురకాండము) లేదు. కాబట్టి పై ద్విపద పంక్తులు మడికి సింగన దశమస్కందము లోని భాగములు కావనవలెను.

రెండవవాడు "దోనూరికోనేరు" కవి. ఇతను బాల భాగవతమను పేరుతో భాగవతమును ద్విపదగా రచియించెను. పైన చూపిన పంక్తులు అందులోనివని వూహించుట సమంజసము. ఆ గ్రంథము అచ్చు పడలేదు. చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో వ్రాత ప్రతులున్నవి. ద్విపద బాల భాగవతములో చతుర్థ స్కందములో కొంత వరకు మాత్రమే ముద్రితమైనది. కోనేరునాథుని కాలము శ. స. 1468 (క్రీ. శ. 1547) ప్రాంతము. అయిన కొండయ్య కొడుకు రామయ్య యుద్ధరించిన శాసనము క్రీ. శ. 1547 తర్వాతనే చెక్కబడినదని నిరాక్షేపముగా చెప్పవచ్చును. అట్లయిన అది పోతన కాలక్రమ సమ్మతము. అప్పటికి పోతన

గారి భాగవతము ప్రజామోదమును బొందెననుటలో విప్రపత్తి వుండదు.

ఇక మిగిలిన మూడవ విషయము: పిన యల్లన కాటమరాజు పుల్లరి యుద్ధకథ ఎప్పుడు రచియించి వుండును? కృష్ణారెడ్డిగారు శాసన ద్విపదకాలమే కాటమరాజు ద్విపదకాలమేల కారాదని ప్రశ్నించిరి. అంటే నేను పైన చూపిన ద్విపద పంక్తులు పినయల్లన రచియించిన ద్విపద కావ్యము లోనివని వారు భావించిరని నా తలంపు. అట్లయిన ఆ పంక్తులు ఆ ద్విపదలోనివి కావని నా మనవి. కాన వారు తలంచినట్లు పినయల్లన రచియించిన కాటమరాజు ద్విపద కావ్య రచనాకాలము, శాసనమును కొండయ్యకొడుకు రామయ్య చెక్కించిన కాలమును నిర్ధారణ చేయుటకు తోడ్పడదు. రామయ్య చెక్కించిన కాలమునకు పినయల్లన రచియించిన ద్విపద కాలమునకు ఎట్టి సంబంధము లేదు.

అయినను ద్విపదగా కాటమరాజు కథ పిన యల్లన రచియించిన కాలమును తెలిసి కొనుటకు ఆ ద్విపదలో ఏమైన నాధారము దొరుకునేమో విచారించవలయును.

ద్విపద రచయిత గంగుల పినయెల్లన అతనిని గురించి ఏమి చెప్పుకొనలేదు. అయితే తాను శ్రీనాధుని వచన పద్ధతిని చెప్పెనని వ్రాసు కొనెను. కాని ఆ శ్రీనాధుని గురించి అయినను వివరములు తెల్పలేదు. కవి సార్వభౌముడైన శ్రీనాధుడు పల్నాటి వీర చరిత్రతో బాటు కాటమ రాజుకథ గూడా ద్విపదలో రచియించినట్లు వాఙ్మయములో ఎక్కడగూడా ఉదాహృతముకాలేదు.

పోను కాటమరాజు కథలో సిద్ధిరాజునకును, యాదవులకును జరిగిన పోరును వర్ణించుచూ ద్విపద గ్రంథకర్త "చెన్నపట్టణమేలు చంద్ర శేఖరు"ని పేరు ప్రస్తుతించెను (ఓరియంటల్ వ్రాత ప్రతుల పుస్తక భాండాగారము వారు ప్రచు రించిన కాటమరాజు కథలో 111 లో పుట చూడుడు). చెన్నపట్టణమేలిన చంద్రశేఖరుడు చారి త్రక వ్యక్తి కాకపోయినను, చెన్నపట్టణ మెప్పుడు వెలసినదో తెలిసికొనుటకు చరిత్రాధారములు కలవు— కాళహస్తి ప్రభువంశములోని దామెర్ల అంకభూపాలుడు రచియించిన "ఉషాపరిణయము"లో చెన్నపట్టణ ప్రశంస కలదు.

"ప్రళయ కావేరి మైలాపురంబు గల్మి
దీరమున బోర నది పట్టు పెట్ట దండ్రి
పేర దన్మధ్య భూమిని పృథు విభూతి
నలవరచె జన్నపట్టణమయ్యనృపతి"

"అంక భూపాలుని సోదరుడు అయ్యపరాజు. వీరు చెన్న భూపాలుని కుమారులు. దామెరల చెన్న భూపతి క్రీ. శ. 1586 మొదలు క్రీ. శ. 1614 వరకూ పరిపాలించిన విజయనగర పాలకుడైన అరవీటి రెండవ వెంకటపతి దేవరాయలకు సామంతుడు. అంక భూపాలుని కాలములో ప్రళయ కావేరి (పులికాటు) డచ్చివారికిని, మైలాపురము (మైలపూర్) పోర్చుగీసువారికిని ప్రధాన నగరములుగా వర్తక వ్యాపార విషయమున నీ యుభయులకు ఎడతెగని పోరాటము జరుగుచుండెను. ఆ పోరాట మును నివర్తిజేయుటకు అయ్యపేంద్రుడు ఈ రెండు స్థలములకు మధ్య తన తండ్రి చెన్న భూపాలుని పేర చెన్న పట్టణమును గట్టించెను." (చూడుడు—కాటమరాజుకథకు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాసిన పీఠిక). కాబట్టి యీ కాటమరాజుకథ క్రీ. శ. 1632—1642 తర్వాతనే రచియింపబడి యుండవలెను. కృష్ణారెడ్డి గా రభిప్రాయ పడినట్లు కాటమరాజుకథ ద్విపద రచనాకాలము, రామయ్య వుద్ధరించిన శాసన కాలము ఒకటే కాలమైన, కొండయ్య కొడుకు రామయ్య యీ శాసనమును క్రీ. శ. 17 వ శతాబ్దపు మధ్య కాలములో చెక్కించినట్లు సుస్పష్టము. అంటే కాటమరాజుకు సిద్ధిరాజుకు యుద్ధము జరిగిన 350 సంవత్సరముల తర్వాత యీ శాస నము చెక్కబడుటవలన అప్పటికి బాగా ప్రచార ములో నున్న పోతనగారి భాగవతములోని పద్యము లను, దోనేరుకోనేరు బాలభాగవతములోని ద్విపద పంక్తులను తనకు కావలసినంతవరకు వాడుకొని కొండయ్య కొడుకు రామయ్య వీరుల మహాత్మ్య కథనము శిలాక్షరములుగ వెలయింప జేసెనని నిరాక్షేపణముగ చెప్పవచ్చును. పై చర్చ సారాంశము—

(1) శ్రీ కృష్ణారెడ్డిగారు భావించినట్లు యీ శాసనములో ఉటంకించిన భాగవత భాగములు పోతనగారి కాలము నిర్ణయించుట కెంతమాత్రము తోడ్పడవు.

(2) యుద్ధకాలమునకు 350 సంవత్సరముల తర్వాత యీ శాసనము చెక్కించినందువల్ల యుద్ధకాలమును చెప్పిన శక సంవత్సరములు, 1170 కి సరియైన బార్హస్పత్యమానాబ్దము కాళ యుక్తి కాకపోవుట, కాటమరాజు కథలో ఈ యుద్ధము జరిగినది చెప్పిన మాఘ బహుళ అమావాస్య మంగళవారము కీలక సంవత్సరములో రాక పోవుట మొదలైన పొరపాట్లు జరిగి విషయము తారుమారై కాటమరాజు 'యుద్ధకాలమును అయోమయమై దాని నాధారముగా పోతన కాలము నిర్ణయించు ప్రయత్నము సఫలీకృతము కాకపోవు...

ఇక యుద్ధము ఎప్పుడు జరిగినది, ఎవరెవరికి జరిగినది, అసలు జరిగినదా లేదా—అను విషయము వేరుమాట.

కాల దోషమున్న శాసనములన్నియు పనికి మాలిన రాళ్లు కాగూడదు. కావు. అట్లు భావించిన ఆంధ్రులకు చరిత్రయే కొరవడును. కాల దోషములున్నవి, లేనివి గూడా సమన్వయపరచుకొన గలిగినప్పుడే పూర్వకాలపు ఆంధ్రుల చరిత్ర, మహోజ్వల సంస్కృతి వెలుగులోనికి రాగలదని నా మనవి.

—అప్పారావు.

## ఆవుల పబ్బము

క్రీ. శ. 13 శతాబ్దములో 'బస్వపురాణము బాగుగావున్నట్టి' కాలములో ఆంధ్రదేశమున 'ఆవుల పబ్బము' కలదని 'కాటమరాజు' కథ చెప్పుచున్నది. కాని, నే డీ పండుగ ఎక్కడనైన, ఏ రూపములోనైనా జరుగుచున్నదా? అన్నది జిజ్ఞాస.

'చిత్రభాను సంవత్సరము
చెలగి కార్తీక
చెతుర్దశి దినమున
శనివారమునాడు
ఆరాత్రి వేగిన
ఆవుల పబ్బము
ఆ రాత్రి వైభోగము అలర గావించే'

—(ఆవుల మేపు: తాటియాకు, 32 లోనిది.)

పై ద్విపద కాలమునుబట్టి ప్రతి సంవత్సరం కార్తీక శుద్ధపౌర్ణమినాడు రాత్రి ఆవులపబ్బము జరుగుచున్నట్లు స్పష్టమగుచున్నది. కాని, ఇప్పుడిది ప్రచారములో ఉన్నట్లు తోచలేదు.

ఇటీవల పత్రికలలో పేర్కొన్నట్లు గోపాష్టమిగా కార్తీక శుద్ధములో ఇది చెలామణి అగుచున్నదా? లేక, పుష్యమాసములో కనుమ పండుగనాడు జరుగు పశువుల పొంగలిగా మారిపోయినదా? ఇదే మరల పచ్చ పొంగలిగా మారినదా? ఆవులపబ్బము, పైరులపబ్బము ఒక్కటైపోయినవేమో తెలియదు?

కార్తీక శుద్ధ పూర్ణిమనాడు జ్వాలా తోరణాది వ్రతములు జరుగుచున్నవి. అదే పశుపతి పూజగా భావించి, ఆవులపబ్బము విడిచిపెట్టబడినదేమో కూడ తెలియదు.

'ఘంటలు పేరులు
ఘనత ధరించిరి
గంట్ల ప్రాధాన చేశిరి త
గ బస్వదేవునికి
వనపరిధూపములు
వనర దీపములు
వితతముగ నైవేద్య
విడియంబు లిచ్చి
భూతబలి నరబలి
భూమిశక్తులకు
..........................
..........................
తృషి గావించెను
శిష్టిలోపలను.'

—(ఆవులమేపు; తాటియాకు 33, 34 లోనిది.)

పై ద్విపద పూజనుబట్టి చూచినచో వీరశైవ మతములో బసవారాధన కార్తీకశుద్ధ పూర్ణిమనాడు కావించినట్లు తోచుచున్నది.

మొదటి ద్విపదలో 'కార్తీక చెతుర్దశిదినము' చెప్పుటవల ఆవుల పబ్బము శుద్ధములో జరిగినదో, బహుళములో జరిగినదో కూడ స్పష్టముగ తెలియదు. కాని, కార్తీక శుద్ధ గోపాష్టమినిబట్టి చూచినచో ఆవులపబ్బము కార్తీక శుద్ధ పూర్ణిమనాడు జరుగుచున్నట్లు భావింప వీలున్నది.

విజ్ఞులు ఇందలి సాధక బాధకములు చర్చించి, 'ఆవుల పబ్బ'* మెప్పుడు జరిగెడిదో సిద్ధాంతము చేయుట కర్తవ్యమని వేడుకోలు.

—దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

* తాటియాకులలోని ద్విపదలు అన్నియు ప్రాత దోషములనుబట్టి ఛందోబద్ధములుగా లేవనుట నిర్వివాదము.

# లేఖలు

## "ప్రథమ పద్యాంధ్ర వ్యాకరణము"

ఆర్యా,

1966 అక్టోబరు మాస 'భారతి' పత్రిక యందు ప్రకటించిన 'ప్రథమ పద్యాంధ్ర వ్యాకరణము'—(పుట 23 నుండి 33 వరకు) అను డా. బొడ్డుపల్లి పురుషోత్తంగారి వ్యాసము నామూలాగ్రము పఠించితిని. అందు నాకు కలిగిన సందేహము లిట పేర్కొను చున్నాను.

డాక్టరుగారు విరచించినది శాస్త్ర గ్రంథమునకు సంబంధించిన వ్యాసము. అందు నది ముఖ్యమైన వ్యాకరణ శాస్త్ర సంబంధము. ఇందు సందేహములకు తావుండకూడదు. అట్లున్న జిజ్ఞాసువులగు విద్యార్థుల కత్యంతోపకారిక మగును.

డా. పురుషోత్తంగారు మండలి లక్ష్మీనరసింహకవి ప్రణీతంబైన 'ఆంధ్రకౌముది'ని పేర్కొనుచు 'ఇందలి సూత్రములు దేవనాగరలిపిలోను, ఉదాహరణములు తెలుగు లిపిలోను ఉన్నవ'ని యుదహరించిరి. కాని అది పద్య వ్యాకరణమా? గద్య వ్యాకరణమా? యను విషయమును తెలియపఱచలేదు. ఇచట యింకొక సందేహముద్భవించుచున్నది. 'ఉదాహరణములు తెలుగు లిపి లోను ఉన్నవన్నారు' కదా! తెలుగు లిపిలో యున్న సంస్కృతమా? లేక తెలుగు భాషలోనా? యని నా సందేహము.

తదుపరి చిన్నయసూరి 'సూత్రాంధ్ర వ్యాకరణము' లోప భూయిష్ఠ మయినదని యుట్టంకించిరి. డాక్టరుగారు లోపములను పఠితలకు తెలియజేయకనే "లోప భూయిష్ఠమైన"దని వ్రాయు టెందులకో........? బాల వ్యాకరణ సమీక్షకు లైన శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు తమ 'రమణీయము' నందు చిన్నయసూరి 'సూత్రాంధ్ర వ్యాకరణము' లోపభూయిష్ఠమైనదని యెచటను పేర్కొన లేదు. పైగా "బాల వ్యాకరణము సుబంత శబ్దముల ప్రక్రియ చూపకున్నను తన ప్రాథమిక రచనములైన 'శబ్ద లక్షణ సూత్రాంధ్ర' వ్యాకరణములందే వీని నన్నింటిని సాధించియే యున్నాడు. ఎన్నియో విశేష శబ్దములకు ప్రౌఢ వ్యాకరణమున లేని వానికి గూడ సూరి రచించిన సూత్రములు 'శబ్దలక్షణ, సూత్రాంధ్ర' వ్యాకరణములందు జాల గలవు." (రమ—పుట. 24)—అని శాస్త్రిగారు వచించిరి. దీనినిబట్టి ప్రస్తుత వ్యాసకర్తలు పై బాల వ్యాకరణ సమీక్షయైన "రమణీయము"ను' చూడనే లేదని స్పష్టమగు చున్నది.

డాక్టరుగారు ప్రథమ పద్యాంధ్ర వ్యాకరణమైన "ఆంధ్రభాషా భూషణమును" సమీక్షించుచు నందు "ఆంధ్ర శబ్ద చింతామణి అర్వాచీనమైన వ్యాకృతి యని, బహుశః ఎలకూచి బాల సరస్వతియే వ్రాసియుండునని భావించు ఆధునికులు చాలమంది ఈ వ్యాకృతియే తెలుగుభాషకు తొలిదని భావింతురు' అనిరికదా! 'ఆధునికుల' మాటయుంచి ప్రాచీనులలో అప్పకవియును, అనగా క్రీ. శ 1656 కు పూర్వము లక్షణ గ్రంథకర్తలుగాని, కవులుగాని దానిని పేర్కొనిరా? ప్రామాణికులైన మహాకవి లెవరైనను నన్నయయే 'ఆంధ్రశబ్దచింతామణి' రచించెనని చెప్పిరా? శాబ్దికులనైనను పట్టించుకొనక ఆధునికు లిట్లు భావించిరని వ్రాయుట సమంజసమా? 'ఆంధ్రశబ్ద చింతామణి' కర్తృత్వము నందు భిన్నాభిప్రాయములు కలవని డాక్టరు గారంగీకరించినట్లు పై వాక్యములవలననే బోధ పడుచున్నది. అట్టి సందర్భమున నీవిషయము చర్చింపకయే విడిచిపెట్టుట శాస్త్రీయమైన పద్ధతి కాదని నా భావన.

ఈ సందర్భముననే "ఒక సమగ్ర వ్యాకరణము ఆంధ్ర భాషకు రచించ వలయునను ఉపాదాశయమాతని కున్నట్లు కానరాదు. ఆంధ్ర భాషా ప్రవేశమున మార్గదర్శికావలయు ననియే అతని ఉద్దేశ్యము"ని యుగ్గడించిరి. కేతన వ్యాకరణము రచించునాటికి యాంధ్ర వాఙ్మయ విస్తృతి యెంత వరకున్నదని డాక్టరుగారు ప్రశ్నించుకొనిన 'ఆంధ్ర భాషా భూషణ, మసమగ్ర'మనరు. కేతన కాలమునాటికది సమగ్రమే. తానే ప్రథమాంధ్రకర్త యని చెప్పుకొన్నప్పుడు సమగ్ర వ్యాకరణ మట్లు వ్రాయగలడని వ్యాస రచయిత లూహించిరో దురూహ్యముగా నున్నది.

పిమ్మట "కేతన విషయములో వచ్చిన చిక్కు అతడు తన్ను పాణిన్యాదులతో పోల్చుకొనుట. నక్కెక్కడ? నాగలోక మెక్కడ? కేతన పరిధి తెలియనంత యవివేకికాడు. బహుశః యిది ప్రక్షిప్తమేమో! లేదా తాను తొలి వ్యాకృతిని తెలుగునకు కూర్చినానను మోజుతో చెప్పుకొని యుండును. ఆధునికులకు నిట్టి సర్దాలు లేకపోవ"ను యభిప్రాయమును వ్యక్తీకరించిరీ వ్యాసకర్తలు. ఆధునికుల మాటయుంచి ప్రాచీనుడైన నన్నయ భట్టు 'నిత్య సత్య వచను మత్యమరాధిపాచార్యు.........' (ఆదిపర్వము 1—9) నని పేర్కొనలేదా ? దీనిని ప్రథమ పురుషతో చెప్పుకొన్నప్పటికి వ్రాసినది నన్నయయేకదా! బృహస్పతి ఎక్కడ? నన్నయ ఎక్కడ? నన్నయ భట్టుదీ తొలికావ్యమే కదా! పోని పరిధి తెలియనంత యవివేకా? ప్రక్షిప్తమా! తొలికావ్యమని మోజుతో చెప్పుకొనెనా?

తరువాత శ్రీ పురుషోత్తంగారు 'కేతన సంస్కృతసమములట్లు ప్రాకృత సమములుగాని, సంస్కృత భవములట్లు ప్రాకృత భవములుగాని గుర్తించలే'దని యుద్ఘాటించిరి. 'ప్రాకృత సమమ'ను పద మేప్రాచీనాంధ్ర వ్యాకరణమునందున్నది? "కళ, ద్రుత ప్రకృతికము, ఔపవిభక్తికము, మహద్వాచ

కము, అమహద్వాచకము, తద్ధర్మార్థకము, నిషేధకము వంటి పారిభాషిక పదము లాంధ్ర భాషా భూషణమందు లేవ'నిరి. కళ, ద్రుతప్రకృతికము మొదలగునవి 'అప్పకవి'కి ముందే యాంధ్ర వ్యాకరణము నందును లేవు. తెలుగు వ్యాకరణములో లేనిట్టి పారిభాషిక పదములు 'చింతామణి' కెట్లు వచ్చినవో యగమ్యగోచరము. "క్త్వార్థమను దానిని వీరు ఇత్వాంతంబనుట మిక్కిలి సముచితము" అని వచించిరిగదా! సముచితమైనచో 'హరి, కరి మొదలగు నిత్వాంతము లన్నియు క్త్వార్థములగునా? కావున 'ఇత్వాంత' మేమాత్రము సముచితముకాదు. 'ఇత్వాంతక్రియ' యన్న మిక్కిలి సముచితముగా నుండును.

'సంధి'ని గురించి నుడువుచు 'ఆంధ్రశబ్ద చింతామణి'ని వదలి 'వికృతి వివేకము' గ్రహించు టెందులకో? 'ఆంధ్ర శబ్ద చింతామణి' సాంప్రదాయికమే కదా! అందు సంధి విషయము లేదా? డాక్టరు గారు దాని నెందులకు విస్మరించిరి? 'చింతామణి' యందు సంధిని గూర్చి యెట్లున్నదీ పాఠకులకు తెలుపకయే తరువాత వాడగు 'అధర్వణాచార్యుల' నెట్లు పేర్కొనిరి?

'సమాసము' ను గూర్చి వివరించుచు 'తెనుగున పూర్వ పదార్థప్రధానము సమాసముండదని కానోపు చిన్నయసూరి యట్టి దానిని నిరూపించలేదని' నుడివిరి. చిన్నయసూరి ఇటువంటి సందేహము కలుగుననియే 'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగా సంస్కృతోక్తంబగు'నని సూత్రీకరించెను. (సమాస—3 బాల. వ్యా). డాక్టర్‌గారి అభిప్రాయమే సరయినచో యీ సూత్రము 'తత్పురుషాదులకు లక్షణంబు సంస్కృతోక్తంబయగు' అని యుండవలయును. సంస్కృత లక్షణమునకు లక్ష్యములు గాని సమాసములు తెలుగున బోలంగుట సూచింప సూరి సూత్రంబునందు 'ప్రాయశ్శబ్దము'ను ప్రయోగించెను. బహుశః డాక్టరుగారి సూత్ర మందలి దళ సార్థక్యమును పరిశీలించి యుండక పోవచ్చునేమో?

"సమాసస్థమగు పదద్వయమునందు ఏది ప్రప్రథమమున క్రియతో నన్వ యించునో యది ప్రధానమని" 'తత్వము చంద్రిక'—313 వ పుటయందు చక్కగా నిర్వహింపబడె ననిరి. 313 వ పుట యందు 'స్త్రీ ప్రత్యయ ప్రకరణము' నకు సంబంధించిన సూత్రములు కలవు. కాని డాక్టరుగా రుదహరించిన పై సమాస సంబంధిక నిర్వచనము మాత్రము లేదు. ఈ నిర్వచనము 335 వ పుట 520 వ సూత్రము నందలి 'గ' నందు కలదు. అట్లే 'పారే సముద్రము'— 'అవ్యయీ భావ సమాసము'ను వివరించునది తం. చ. 314 పుటయందు కలదనిరి. కాని యది త. చం. 335,336 పుటలందలి 520 వ సూత్రము 'ఘ'నందలిది. ఇట్టి విషయములందు వ్యాసకర్తలు చాల జాగ్రత్త వహించ వలసి యున్నది. పఠితలు వ్యాసోక్త ప్రకారము త. చం. 313,314 పుటలను చూచి నిరాశ చెందెదరు. ఆ విషయము సమాస ప్రకరణమునకు సంబంధించిన విషయమని గ్రహించిన వారు మాత్రము డాక్టరుగారు బహుశః పొరపడి యుందురని తలంచి 'సమాస' ప్రకరణమున చూచుకొనెదరు.

డాక్టరుగారివ్యాసమునందు ప్రాచీన గ్రంథాలయాధికారుల, ఆంధ్రేతర చరిత్ర కారుల, పండితుల, తత్త్వభాషా వేత్తల యభిప్రాయముల క్రోడీకరించుట ముదావహము. కాని వానిని ఆంగ్ల భాషలో నుదహరించిరి. ఆంగ్లభాష చదువని పఠితలెందరో 'భారతి' పత్రిక నత్యంతాసక్తితో పఠించెదరనుట జగద్విదితము. అట్టి విషయమును గుర్తించి వ్యాసకర్తలు పైన పేర్కొన్న పండితుల యభిప్రాయముల నాంధ్రీకరించిన బాగుండెడిది. లేదా వాని క్రింద భావమైనను వ్రాసిన పఠితలానందించెడివారు. వ్యాసమునందు ఆంగ్ల విషయము వచ్చుసరికి యది బోధపడక విషయమే గందరగోళమైనట్లనిపించుచుండెను.

నా యీ యభిప్రాయములందేమైనా దోషము లున్నచో విద్వల్లోకము తెలియజేసిన యత్యంతానందముతో సవరించుకొనియెదను.

## ఒక జిజ్ఞాస

ఆర్యా,

శ్రీమదాంధ్ర మహాభారతమున నారణ్యపర్వ, పంచమాశ్వాసమునందు "అరణ్య వాసము నందున్న ధర్మజునకు మార్కండేయుండు పతివ్రతా మహిమ"ను గూర్చి చెప్పు సందర్భములో "ఒక విప్రుఁడలిగి పయోనిధి జలములపేయములు గాఁగ శపించె"నని కలదు.

పై పాదము నందలి 'పయోనిధి జలము లపేయమగు" నట్లు శపించిన బ్రాహ్మణుని పూర్వగాథను 'భారతి' పత్రికా ముఖమున విద్వాంసు లెవరైనను దెలియఁజేయ ప్రార్థితులు.

—ఎం. భాస్కరరావు.

## ఉత్కళిక - ముత్యాలసరాలు

ఆర్యా,

జనవరి నెల భారతిలో వై. ఆదిశేషారెడ్డిగారు ప్రకటించిన 'ముత్యాల సరాలు—ఉత్కళికావృత్త అనుకరణం' అన్న లేఖలోని సారాంశం, నూటికి నూరు పాళ్ళు సత్యముకాదు 'ఉదాహరణ' మనునది యొక "కావ్యపద్ధతే"గాని ఉత్కళిక కానేరదు. వృత్తమనునది అక్షర నియమిత గణములతో కూడినదని లక్షణ శాస్త్రకారులు ముక్తకంఠముతో చెప్పియున్నప్పటికి, ఆ విధమైన అక్షర గణ స్వభావము లేని, ఉత్కళికను వృత్తమని చెప్పుటలో గూడా యేమాత్రము ఛందోదోషము లేదు.

"వృత్తం గేయమ్ పద్య మిత్యపి కథ్యతే" అని దండనాథ నిఘంటువులో చెప్పబడి యున్నది. దీని ప్రకారము, సాధారణముగా గద్యము వినా మిగతా గేయములన్నియు వృత్తములే యనుటకు యెట్టి సందేహము లేదు. శాస్త్రములలో యేది ప్రామాణికము, యేది ప్రామాణికము గాదన్న విషయంలో ఇంతవరకు ఒక నిశ్చితాభిప్రాయం సిద్ధాంతముగా లేదు. దేనికదే ప్రామాణికము! కనుక దండనాథ నిఘంటువు ననుసరించి, ఉత్కళిక వృత్తమే యగును.

గురజాడ, ఖండకావ్య వృత్తములకు ఉత్కళికయే మూలమని చాలాకాలం క్రితం పండిత ఉమాకాన్త విద్యాశేఖరులు తమ ఆంధ్ర వాఙ్మయభాష్యములో వ్రాసియున్నారు. సందేహము కలవారు ఆ గ్రంథము చదివినట్లయితే సత్యము తేట తెల్లము కాగలదు.

శ్రీ ఆదిశేషారెడ్డిగారు శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులను తమ రేఖలో పేర్కొనలేదు. ముత్యాలసరములకు మూలం ఉత్కళికయే అను భావమును మొదట వ్యక్తము జేసినది గ్రంథస్థము చేసినదికూడా ఉమాకాన్త విద్యాశేఖరులే!

మన సాహిత్యములో ఉత్కళికనుపోలిన వృత్తములు అనేకమున్నవి. రావిపాటి త్రిపురాంతకునినుండే ఉత్కళికను గ్రహించవలసిన అవసరములేదు! ఉత్కళికావృత్తము సాహిత్యములో ఉన్నది గనుక, దానినే గురజాడ స్వీకరించి ముత్యాల సరాల రచనకు మూలముగాజేసికొని ఉండవచ్చును. ఇది నిశ్చయము. ఉత్కళికావృత్తమే ముత్యాలసరాలకు మూలం! ఫార్మ్ నవల్ మాత్రంగానన్న శ్రీ రెడ్డిగారి రేఖను అభినందిస్తూ, యీ వాదానికి మూలపురుషుడైన ఉమాకాన్త విద్యాశేఖరులను ప్రస్తావించనందుకు, శ్రీ రెడ్డిగారు తమ పొరబాటును వ్యక్తంచేస్తారని ఆశిస్తాను.

—స్వామినాథశాస్త్రి.

---



# గ్రంథ విమర్శలు

## గదాయుద్ధము

[కన్నడ మూలము: రన్నకవి. ఆంధ్రీకరణము: కలుగోడు అశ్వత్థరావు. మూల్యము: మూడు రూపాయలు. ప్రతులకు: ఉపాధ్యాయనిలయముపేర రాయదుర్గమునకు వ్రాయవలయును.]

కన్నడ భాషయందు పది పదకొండు శతాబ్దములలో రన్నుడను కవి రచించిన 'గదాయుద్ధ' మను కావ్యమును నేడు శ్రీ కలుగోడు అశ్వత్థరావుగారు "సంగ్రహించి యనువదించిరి." ఈ సంగ్రహ స్వరూప మెట్టిదనగా నిట్టిది. శ్రీ అశ్వత్థరావుగారు గదాయుద్ధము సంపూర్ణ ముద్రిత ప్రతి నొకదాని, 'గదాయుద్ధ సంగ్రహము' నొకదానిని సంపాదించి "ఆ రెంటి పాఠభేదములను బరికించుచు వలయు పద్యముల గ్రహించి సంపూర్ణ ప్రతికంటె చిన్నదిగను సంగ్రహ ప్రతి కంటె కొంచెము పెద్దదిగను గూర్చి తెలిగించితి"రి. మూలముతో సరిచూచి 'పీఠిక' రచించిన శ్రీ నారాయణరావుగారి మాటలనుబట్టి ఈ యనువాదము "అనవసరమని తాము (కవిగారు) భావించిన గద్య పద్యములను వదలి, కథాకథనమున కవసరమగు వానిని మాత్రమె గ్రహించి సంగ్రహించి" చేసి నట్లున్నది. కాని శ్రీ అశ్వత్థరావుగారు అనవసరమని భావించి వదలిన రచన యే పద్ధతిలోనిదో పీఠికవల్లను, కవిగారివల్లను గూడ తెలియుట లేదు. అది తెలియదగినది. ఒక భాషనుండి మరొక భాషలోనికి అనువాదమని చేయుచున్నప్పుడు మూలమును సంగ్రహపరచుటను అనువాదకుడు పెట్టుకొనకుండుటయే మంచిది. మరియును కన్నడము వంటి దగ్గరి పొరుగు భాషలో గల భారతమువంటి ప్రధాన గ్రంథము విషయమున సంగ్రహించుటను పెట్టుకొనక సంపూర్ణముగా ననువదించుట వలన ఆంధ్ర భారతముతో పోల్చుకొనుచు కన్నడ భారతమును భావించుట కధికమైన అవకాశమును అనువాదకుడు కల్పించి యుండగలిగెడివాడు. అది యట్లుండె.

కన్నడ భాషయందు మహాభారత రచనకు ఉపక్రమించిన వారిలో రన్నుడు రెండవవాడు. మొదటివాడు పంపడు. వీ రిరువురును పది పదకొండు శతాబ్దములలో నున్నవారు. పదునైదవ శతాబ్దములోని కుమారవ్యాసుడు మూడవవాడు. ఆయన కర్ణాట భారత (పది పర్వములు) మును వ్రాసెను. కుమారవ్యాసుడు బ్రాహ్మణుడు. అనగా వైదికధర్మమువాడు. పంపడును, రన్నుడును జైనులు. కన్నడ కవులు, జైనులు, వీరశైవులు, బ్రాహ్మణులు అని మూడు రకములు. మొదట మొదట కన్నడ సాహిత్యక్షేత్రమున కృషిని మొదలు పెట్టిన వారు జైనులు. పంపడు విక్రమార్జున విజయము అను పేర భారతమును రచింపగా రన్నకవి సాహసభీమ విజయము అనుపేర భారతమును రచించెను. ఈ సాహస భీమ విజయము నకే గదాయుద్ధ మన్నది మరొకపేరు. ఈ రన్నకవి అజిత పురాణము అను మరొక కృతిని గూడ రచించినాడు.

ఈ జైన కన్నడ కవులను గూర్చి ఒక విషయము చెప్ప బడుచున్నది. తమను పోషించిన రాజులను తమ కృతులలోని నాయక పురుషులతో నభేదముచేసి వర్ణించుకొని పోవుచుందురని. పంపకవి తనను పోషించిన చాళుక్యరాజు అరికేసరిని అర్జునునితో అభేదముచేసి అతడు నాయకపురుషుడుగా భారత కథను రచించి దానికి విక్రమార్జున విజయము అని పేరు పెట్టినాడు అనియు చెప్పుదురు. రన్నకవి కూడ తన కాశ్రయ మిచ్చిన, తనకు కవిచక్రవర్తియను బిరుదము నిచ్చిన పశ్చిమ చాళుక్యనృపుడు తైలపునియొక్క కుమారుని సత్యాశ్రయుని "కథా నాయకుడుగ మఱి యతనికి భీముని బోల్చి గదాయుద్ధము"ను రచించెను. ఈ విషయ మాతడు గ్రంథారంభంబున చెప్పుకొనెను కూడ. అయినచో గ్రంథ గతమైన ఇతివృత్తము యొక్క యర్థము "ధ్వనిగా" గాని "స్పష్టము"గా గాని సత్యాశ్రయుని చరిత్రమును గూడ వర్ణించునదిగా నుండవలయును. కాని వాస్తవముగా నట్లులేదు. భీముడు— దుర్యోధనుడు— మహాభారతకథ— ఇంతమాత్రమే ఇతివృత్తమువలన పాఠకుల బుద్ధి కందును. సత్యాశ్రయుడు కంచిని కాల్చి చోళరాజగు అపరాదితుని జయించి విజయలక్ష్మీసమేతుడై వచ్చుటను పురస్కరించుకొని అతని శౌర్య సాహసములను వర్ణించు తలంపున రన్నుడు దీనిని రచించినట్లు ఇతివృత్తము స్ఫురింపజేయుట లేదు. అట్టిచో జైన కన్నడ కవుల సాహిత్యములో గల విచిత్రమైన సంప్రదాయమది యని సాహిత్యవేత్త లెట్లనుచున్నారో విచారింపవలసి యున్నది.

అవతారికతోడను, ముగింపుతోను కలుపుకొని మొత్తము అయిదువందల ఎనుబది యెనిమిది గద్య పద్యము లిందున్నవి. శ్రీ అశ్వత్థరావుగారు మూల కావ్యాశ్వాస సంఖ్యను పాటించిరి కాని ఆశ్వాస విభజనము నందించుక స్వతంత్రించిరని పీఠికా కర్తలనిరి. ఆ స్వతంత్రించి చేసినది ఫలానా అని చెప్పలేదు. ఈ గ్రంథమున ఆశ్వాస పదప్రయోగము లేదు. 1. అవతారిక. 2. భీమసేనుని ప్రతిజ్ఞ. 3. సంజయుని హితము. 4. ధృతరాష్ట్రుని దుఃఖము 5. దుర్యోధనుని విలాపము. 6. భీష్ముని యుపదేశము. 7. భీమసేనునాటోపము. 8. గదాయుద్ధము. 9. దుర్యోధనావసానము. 10. భీమసేన పట్టాభిషేకము.

11. ముగింపు. అను శీర్షికలతో గ్రంథము విభజింపబడి యున్నది.

అవతరణిక 12 పద్యములు. శ్రీ కృష్ణుని, శారదను స్తుతించిన తరువాత రన్నకవి తన గొప్పదనమును గురించియే చెప్పుకొనెను. ఇతనికి కవిరత్న బిరుదమును కలదు. ''కవులం బురాణపుంగవులె గణ్యు లటం చనబోకు''డని కాళిదాసుని భావమును గూడ నందు సంగ్రహించినాడు.

శల్యుడు కూడ మరణించిన తరువాతనైన యుద్ధము నుండి తప్పుకొని గుఱ్ఱము దిగి గదాకలితభుజుడై యుత్తర ఖ ముట్టిన తూర్పునగల మడువునకుపోయి అందు డాగికొని ఆ పిమ్మట వెలికివచ్చి భీమునితో చేసిన గదాయుద్ధమును కేంద్ర మొనర్చుకొని రన్నకవి మహాభారతకథను మొత్తము సింహావలోకన మొనర్చుచు భీమ నాయకముగా నితివృత్తమును మలచుకొనుచు ఈ కృతిని రచించెను. సంస్కృత భారతము ఫక్కికిని దీనికిని పొత్తు పొసగలేదు. అందువలననే ''జననుత కృష్ణ ద్వైపాయనమునివృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడ తెనుగున రచియింపు''మని నన్నయభట్టారకుని రాజరాజనరేంద్రుడు కోరియుండునా యనిపించుచున్నది. పంపకవి అర్జునుడు మహాభారత వీరుడును నాయకుడును అగునన్నట్లు వ్రాయగా, రన్నకవి భీమునకాపట్టము గట్టినాడు. మూలభారతము తాత్పర్యముతో నీ కన్నడ జైన కవులకు ప్రమేయము లేనట్లున్నది. రన్నకవి తన కృతియందు ఇతివృత్తమును గ్రథించిన తీరు చూచినచో ఆ విషయము తెలియగలదు.

కురుక్షేత్రమున దుర్యోధనునొక్కనిని సంహరించు సన్నాహముతో నున్న భీమునివద్దకు ద్రౌపది వచ్చినది. కౌరవ సంహారమునకు భీమసేను పురికొల్పి మాటాడినది. భీముడు ధర్మజునిపై కినిసి, పార్థునిపై నాగ్రహించి, తనను తాను నిందించుకొని, ద్రౌపదినూరార్చుచు దుర్యోధను పడగొట్టి మకుటము తన్ని దుశ్శాసనకరాకృష్టమైన వేణిని కూర్చెదనని ప్రతిజ్ఞ చేసినాడు. అచట భీమసేనుని నర్మసఖుడు విదూషకుడు కూడ ఒకడు కలడు. అతడు భీముని కీర్తించి పాంచాలికి ధైర్యము చెప్పినాడు. అందులో కొంత హాస్యము. ఇది మొదటి శీర్షికలోని విషయము. యుద్ధరంగమున భీముని వద్దకు ద్రౌపది పోవుట, భీమున కొక విదూషకుడు కూడ నుండుట రన్నకవి కల్పించినవి. ఈ కల్పన మూల తాత్పర్యమున కనుకూలముగా లేకపోవుటయేగాక ఉచితముగా గూడ కన్పించుట లేదు. రెండవ శీర్షిక. శల్యుడు మరణించిన తరువాత చింతాక్రాంతుడై దుర్యోధనుడు ద్రోణుని అశ్వత్థామను నిరసించి నిందించి పలుకుచుండగా సంజయుడది చూచి దుర్యోధనుని సమీపించి భీమార్జునులను గెలువ శక్యము కాదని బోధించుటకు మొదలు పెట్టెను. ఈ దృశమైన సన్నివేశకల్పనముకూడ రన్నకవిదే. పాండవుల మంచితనమును సంజయుడు పేర్కొనగా వారి దుర్మార్గమును దుర్యోధనుడెదురెత్తి చూపినాడు. ఈ సంవాదము కొంతసేపు సాగినది. చివరకు సంజయుడు బలదేవుడు, అశ్వత్థామ, కృతవర్మ, కృపుడు ఈ నలుగురితో రాజుని కి సైన్యాధిపత్యమిచ్చి యుద్ధమును కొనసాగింపవలయు దుర్యోధుని బుద్ధి కనుకూలముగా పలికినాడు. యుద్ధము సాగించుట దుర్యోధనున కిష్టమే కాని అశ్వత్థామునకు సైన్యాధిపత్యమిచ్చుట కిష్టములేదు. వారి మీద విశ్వాసము లేదు. దుర్యోధను డిట్లున్నాడని విని ధృతరాష్ట్రుడు గాంధారీ సహితుడు కురుక్షేత్రమునకు వచ్చెను. వారి ముఖములు చూచుటకు సుయోధనుడు సిగ్గుపడినాడు. దీని తరువాతి శీర్షిక గాంధారీ ధృతరాష్ట్రుల దుఃఖాభివ్యక్తి. వృద్ధరాజు కుమారుని పాదముల మీదపడి పాండవులతో సంధి చేసికొనుమని హితము ఉపదేశించినాడు. ధర్మరాజు సంధి కంగీకరించుననియు, భీముని జయించుట అసాధ్యమనియు మొదలైన మాటలు ధృతరాష్ట్రుడాడగా సంజయు డందుకు తన మహామోహము తెలిపి దుర్యోధనుని ప్రోత్సహింపజూచెను. అత డెదురుతిరిగి వారి మాటలను త్రోసిపుచ్చెను. ధృతరాష్ట్రుడు భీష్ముని సంప్రదించి ఆయన చెప్పినట్లయినను చేయుమని బతిమిలాడినాడు. దుర్యోధను డందుల కంగీకరించి తల్లిదండ్రులను నగరమునకు పంపి తాను సంజయునితో కలసి ముందుకు సాగిపోయెను. దీని తరువాతి శీర్షిక దుర్యోధనుని విలాపము. భీష్ముని వద్దకు పోవుచు త్రోవపొడుగునను కనిపించు యుద్ధమున మరణించిన తనవా. శవములను చూచి వాపోవుటయే అందు వర్ణింపబడినది. ఈ రచన స్త్రీపర్వమును స్మృతికి తెచ్చుచున్నది. మ ్య మధ్య భూతములు కూడ దుర్యోధనుని నిలువరించినవి. కాని అతడు వానిని లెక్కచేయక సాగిపోయెను. అభిమన్యుని శవము కనిపింపగా సుయోధనుడు వాని విక్రమమును స్మరించినాడు. ఆపై కర్ణాదులను చూచి రాజరాజు దుఃఖించినాడు. సంజయుడు వాని నోదార్చుచు వాని ప్రక్కనే యున్నాడు. అతడే నెమ్మదిగా భీష్మునివద్దకు వానిని తీసికొనిపోయినాడు. భీష్ముడు గూడ పాండవులతో సంధియే యుచితమనియు, దుర్యోధను డనుమతించిన తాను పాండవులకు చెప్పి వారి నంగీకరింప చేయుదు ననియు చెప్పెను. దుర్యోధను డంగీకరింపలేదు. వెంటనే భీష్ముడు ధృతరాష్ట్రున కొక చీటీ వ్రాసి సంజయుని చేతి కిచ్చి పంపెను. అందాతడు వ్రాసినది సుయోధనుడు నా మాట వినుటలేదు— నీవు, గాంధారి చెప్పి ఎట్లయినను పాండవులతో సంధిచేసి ఉభయులను కలుపవలసినది అని. ఆ పిమ్మట భీష్ముడే జలమంత్రము నుపదేశము గావించి, బలరాముడు తీర్థయాత్రల నుండి వచ్చువరకు నీ యునికి పాండవులకు తెలియనీయక దాగి యుండుమని చెప్పి పంపెను. దుర్యోధను డట్లేపోయి మడుగులో దాగుకొనెను.

దుర్యోధనుని కొరకు పాండవులు వెదకినారు. అతడు కనిపింపలేదు. భీముడు మరల ఆటోపములు పలికినాడు. దుర్యోధనుని కొరకు అన్వేషణ సాగించినాడు. ఆ తిరుగుటలో హస్తినాపురము కూడ పోయినాడు. గాంధారీ ధృతరాష్ట్రు లతనిని చూచి

భయపడినారు. అంతలోనొక కిరాతదూత వచ్చి దుర్యోధనుని జాడ తెలియుటలేదనియు, కాని ద్వైపాయన హ్రదము కడకు నీరు త్రాగుటకు పోయినట్లు తమవారు కొందరు చూచి నారట అనియు విన్నవించినాడు. అపుడు భీముడు తిరిగి ధర్మరాజు వద్దకు వచ్చి ఆ విషయము చెప్పగా శ్రీకృష్ణుడది ని దుర్యోధనుడా మడుగున దాగియుండెననియు, ఒంటరిగా నున్న ఈ సమయముననే వాని వధింపవలయుననియు సలహా ఇచ్చెను. అందరును హ్రదమును చేరిరి. భీముడే దుర్యోధనునిని నిందించి వెలికి రాదీసెను. బలరాముడు వచ్చెను. భీమ దుర్యోధనుల యుద్ధము మొదలయ్యెను. గదాయుద్ధ వర్ణన. శ్రీకృష్ణుని సూచనను బట్టి భీముడు సుయోధనుని తొడల మీద గొట్టెను. శ్రీకృష్ణునకు వెరచి బలరాము డేమియు ననలేదు. ఆయన అక్కడినుండి వెడలిపోయినాడు. భీముడు పాంచాలిని పిలిపించి ఆ దృశ్యమును చూపించి ఆమెను లాలించెను. ఆమె వేణిని ముడిచెను. దుర్యోధనుని వద్దకు అశ్వత్థామ వచ్చెను. వచ్చుచు మార్గమధ్యమున దుర్యోధనుని వదలిపోవుచున్న లక్ష్మిని చూచి ఆమెను తిరస్కరించి పలికి వచ్చెను. రాజరాజును చూచి దుఃఖించి అశ్వత్థామ తానేమి చేయవలయునన్నట్లుండగా దుర్యోధనుడు తాను బ్రతికియుండగా పాండవుల తలలు కోసి తెచ్చి చూప వలసినదిగా కోరెను. అశ్వత్థామ భూదేవిని, రమాదేవిని ప్రత్యక్షము చేసికొని రాజరాజును జూపి అతనికి ఛత్రచామరములు పట్టుడని నియోగించి, సూర్యాస్తమయమైన తరువాత హస్తినాపతి (పాండవుల శిబిరము) ని తాను ప్రవేశించి అక్కడ నిద్రించుచున్న వారి తలలు ఖండించెను. అందు పాండవులని వారల కొడుకుల తలలు ఖండించి రాజరాజుముందు పెట్టెను. దుర్యోధనుడందు భీముని పోలికగల శిరమును చూచి అది భీముని కొడుకు శిరమని గుర్తించెను. తన చివరికోరిక అశ్వత్థామ వలన కూడ తీరలేదు. దుర్యోధనుడు శ్రీకృష్ణ స్మరణము చేయుచు ప్రాణములను త్యజించెను. భీముడు నెరపిన సాహస కార్యమును ప్రశంసించి శ్రీకృష్ణుడు మాటాడుచుండగా గాంధారీ ధృతరాష్ట్రులు కురుక్షేత్రమునకు వచ్చిరి. వారి కోడండ్రును వచ్చిరి. వారి రోదనము విని ధర్మరాజు గాంధారీ ధృతరాష్ట్రులకు నమస్కరించి మరణించినవారికి సంస్కార కర్మలు చేసెను. ఆ పిమ్మట ధర్మరాజు తనకు రాజ్యమక్కర లేదనియు, భీముడే యుద్ధమును జయించినవాడనియు వానికే హస్తినాపుర సింహాసన మధిష్ఠించు యోగ్యత కలదనియు, అట్లొనరించుటయే తనకు సమ్మతమనియు శ్రీకృష్ణునకు చెప్పెను. హస్తినాపురము ప్రవేశించిన పిమ్మట భీమునకు పట్టాభిషేకము జరిగినది.— ఇది ఇతివృత్తము. ఇదంతయు చూచిన వ్యాస భారత తాత్పర్యమునందు దృష్టిలేని రచన ఈ కన్నడ భారత మనిపించును. ఏమైనను కన్నడ కవులు సర్వతంత్ర స్వతంత్రులుగా మహాభారతేతివృత్తము నా భాషయందు వెలయించిరి.

శ్రీ అశ్వత్థరావుగారు తెనుగు కవితా రచన చేసిచేసి సిద్ధహస్తులయినవారు. ఆంధ్రప్రదేశపు కన్నడ సరిహద్దుల నంది పుచ్చుకొనుచోట నుండుటయేగాక కన్నడము మాతృభాషగా సాహిత్య వ్యవసాయమును సాగించుచున్నవారు. కన్నడ భాషా సాహిత్యపు సౌరు లాంధ్రమున వ్యాపింపజేయ సంకల్పించి చేయుచున్న కృషి అభినందింపదగినది. మఱియు స్వాగతము పలుకదగినది. ఈ గదాయుద్ధమును చదివిన ఆంధ్ర భాషాభిమానులకు సాహిత్య భూముల యందలి యొక క్రొత్త వాతావరణము వలని విచిత్రానుభూతి మనఃప్రపంచమును లోగొనును.

## మనువు పుట్టువు

(కృతికర్త—సత్కవి నారు నాగనార్య. ప్రతులకు : రచయిత, నాగవరము. వెల: రు. 2—50)

ఈ కృతి అచ్చతెనుగు మనుచరిత్ర. ఒకవిధముగా నిది తెనుగునుండి తెనుగులోని కనువాదము. ఈ పద్ధతి కిదియే మొదలుగా కనిపించుచున్నది. అచ్చ తెనుగు కృతులు వెలయించిన ప్రాచీనులందరును వారి గ్రంథముల నన్నివిధముల వారే సంతరించుకొనిరి. శ్రీ నారు నాగనార్య గారా శాఖను కృతిరచించుటలో నూత్నవైఖరిని ప్రవేశపెట్టినారు. ఈ అచ్చ తెనుగు కవితాశాఖ ఎందువల్లనోగాని కలిసివచ్చెడి జాతకము కలదికాకుండ పోయినది. అయినను చిత్రమేమనగా అది ఎంత ఆదరణమునకు పాత్రముకాకపోయినను అప్పుడప్పుడు తద్రచనా ప్రయత్నము మాత్రము దేశమున అభినివేశమున జరుగుట. శ్రీ నాగనార్యుని ప్రయత్నమన్ని విధముల నభినందింపదగినదిగా నున్నది.

మను చరిత్రమునకువలెనే ఇదియు ఆరు(పాళ్లు) ఆశ్వాసములు కలది. ఏడువందల యిరువది పద్యములు. వచనములులేవు. అనగా మనుచరిత్రమునందలి గద్య పద్యములకంటె ఇందలిపద్యముల సంఖ్యయే అధికముగా నున్నది. పద్యమునకు పద్యముగా నచ్చ తెనుగున కనువదింపబడినట్లు చేయబడిన రచన గాదిది. కొన్ని పద్యము లావిధముగా చేయబడినవి లేకపోలేదు. వర్ణనముల చేయుచో స్వతంత్రించి శ్రీ నాగనార్యులు అధికముగా చేసిరి. మిగిలిన సందర్భముల నచ్చటచ్చట కొద్ది కొద్దిగా కుదించిరి. కథా విషయము త్యజింపబడినదున్నట్లు లేదు.

అరుణాస్పద పురవర్ణనము పెద్దన్నగారొక పద్యముతో సరిపెట్టగా శ్రీ నాగనార్యులు ఇరువదినాలుగు పద్యముల మేర పెంచి చేసినారు. ఇట్లే ప్రవరుని వర్ణనయు కొంత పెంచి చేయబడినది. ప్రవరుడు హిమాలయమునకు బయలుదేరుటతో ప్రథమాశ్వాసమంతమై ద్వితీయమున నాతడు హిమాలయముల దర్శించిన సంగతుల వివరము మనుచరిత్రమున నుండగా నిందు ప్రవరుడు హిమాలయములకేగి కొంతకాలము సంచారము చేసిన పిదప "తొలిపాలు" మొదటి ఆశ్వాసము ముగిసి మరల అదే విషయ వర్ణనముతో రెండవ (పాలు) ఆశ్వాసము మొదలైనది. ఇట్టి ఆశ్వాస విభజనము నేవి. ప్రయోజన మాశించి శ్రీ నాగనార్యులు చేసిరో మరి! మను చరిత్రములో రెండవ యాశ్వాస మెచ్చట ముగిసినదో ఇందును అచ్చటనే ముగిసినది. స్వరోచియొక్క పుట్టుక కూడ ఇంద

మూడవ (పాలు) ఆశ్వాసముననే చెప్పబడినది. అయిదారు ఆశ్వాసముల ఇతివృత్త మట్లే యిందును కొనసాగింపబడినది.

శ్రీ నాగనార్యులిప్పటికే బహుకృతులు రచించి పద్యవిద్యా రహస్యముల ననుభవమునకుతెచ్చుకొన్న మహనీయులు. అచ్చతెనుగు కృతులలో గూడ ఇది వారి రెండవ ప్రయత్నమని తెలియుచున్నది. ఈ కృతికి విపరీతమైన ధారాశుద్ధియున్నది. అదియును సాలంకారమై యున్నది. మరియునిందలి ప్రధానమైన గుణము కృతకముగాని యచ్చ తెనుగుదనము. దీనిని చదువుచో ముప్పాతిక భాగమునకుపైగా మామూలు తెలుగు కావ్యమును చదువుకొనుచున్నట్లేయుండును. గుటకలుమ్రింగు, అడవ దడవ దిమ్మదిరుగు, అట్టెడ, కడుపు చెరువగు, దబ్బున, ఆకు చాటుపిందె, వాజమ్మ, కచ్చితము, నట్టేట పుట్టిముంచు, రామందాడి, కుడిచికూర్చుండు, ఆదర బాదర, బత్తెగొడ్డు బాదిన యట్లు, బల్లుమని తెల్లవారు, పడి పడిచూచు, చెక్కు చెమర్చు, వూసగ్రుచ్చు ఈ మొదలైన తెలుగు పలుకుబడుల ఆధిక్యముచేత గ్రంథము మొత్తము భాషా విషయికముగ నిట్టికృతులలో కనిపించు ఎబ్బెట్టుతనమునుండి దూరమై పరమానందానుసంధాయకముగా నున్నది. మరియు నీ గ్రంథమున శ్రీ నాగనార్యుల స్వకపోల కల్పితములయిన ఉపమాలంకారములు వారి లోకజ్ఞతను, పరిశీలనా పాటవమును మహోన్నతముగా ప్రదర్శించుచున్నవి. ముక్కుడాడు దెగిన కత్తికోడె, వడియము, కలువు దీసిన పొలము, కడిగి గాలించు, ఊబను కట్టెకదల్చుట, చెలమను ద్రవ్విన నీరు, విరిపొట్లము విచ్చుట, పైరుకు నానుడువాన నయించుట, రొంపమానిసికి మర్వంబించునే? వెన్నముద్దపయి జల్లు చక్కెరపొడి—ఈ మొదలైన యుపమాద్రవ్యము నలవోకగా నా యా సందర్భముల వినియోగించి ఉపమేయమ్ము నుద్దీపింపజేసి కృతి కొక నవ్యతను శ్రీ నాగనార్యులు సాధించిరి.

> "అచ్చెరు వెచ్చ విచ్చవిరియన్ గనుదమ్ములఁ జూపుకోపు పై
> పెచ్చుగఁ గల్వ పూల్గురియ విచ్చిన వెచ్చని చన్నుదోయి పెం
> పచ్చువడన్ గగుర్పొడువఁ బ్రపుఁ గోరిక లూరిపేరి న
> ట్లచ్చర మిన్న కన్గొనియె నా "నలకూబరు" తీరు పొఱునిన్"

మను చరిత్రము ద్వితీయాశ్వాసములోని ఇరువది యెనిమిదవ పద్యముతో పోల్చుకొని ఈ పద్యమును చూచుకొన్నచో ఈగ్రంథమును గురించి చెప్పబడిన బహ్వంశములు దృష్టాంతమునకు వచ్చును.

శ్రీ నాగనార్యులు చేసిన ఈ విచిత్రతరప్రయోగము సఫలమైనదనియే చెప్పవలయును. భాషాభిమానులు చదివి చూడ లసిన గ్రంథ మిది.

—క్షేమేంద్ర.

## ఎ స్టడీ ఆఫ్ తెలుగు సెమన్‌టిక్స్

(ఎ స్టడీ ఆఫ్ తెలుగు సెమన్‌టిక్స్: (ఇంగ్లీషు) రచయిత—శ్రీ జి. ఎన్. రెడ్డి. ప్రచురణ: శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ, తిరుపతి. వెల..)

ఇది శ్రీ జి. యన్. రెడ్డిగారి పరిశోధన వ్యాసము. (Thesis) ఇందు మూడు భాగములు గలవు. మొదటి భాగము Introduction. రెండవ భాగము Descriptive Semantics. మూడవ భాగము Historical Semantics. ఈ విషయమున తెలుగులో ఇంతకు పూర్వము జరిగిన కృషి అత్యల్పము. అస్మద్గురువర్యులు శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి వ్యాస మొకటి, శ్రీ జి. జె. సోమయాజులుగారి భాషా వికాసములోని అధ్యాయ మొకటి పేర్కొనవలసి యున్నవి. చరిత్ర నిరూపణాత్మకమగు నిఘంటువు లేకపోవుటచే ఈ పరిశోధనము కష్టసాధ్యమనియే చెప్పవచ్చును. ఉన్నంత అవకాశమును చక్కగా వినియోగించుకొని శ్రీ రెడ్డిగారు కృతకృత్యులగుట ప్రశంసనీయము. చేర్పులు మార్పులు అవసరమని తోచిన కొన్ని స్థలముల నిట సంక్షేపముగా వ్రాయుచున్నాను.

(1) ound symbolism (41 పు). దీనిలో ఏరాళము - హేరాళము—అను రూపములు చూపబడినవి. హేరాళ శబ్దమును శ్రీనాథాదులు సంస్కృత సమాసగతముగ ప్రయోగించియున్నారు. కనుక దీనిని సంస్కృతమనుటయే ప్రామాణికము. కావున ఈ ఉదాహరణము త్యాజ్యమననగును. 43 పు—ఇట పెద్ది=పెద్దతల్లి అను ఉదాహరణమును చేర్పనగును. (2) Grammatical Motivation—45 పు. ఇట కోరు—కోరిక అను రూపములు చూపబడెను. 'కోరికి' అను ప్రాచీన రూపమునుగూడ చూపవలెను. రాయు—రాపిడి; కాయు—కాపురము అని చూపుట పొరపాటు. రాపు—రాపిడి; కాచు—కాపరము అని చూపవలెను. చౌరు—చౌరవ అని చూపుటకంటె చొచ్చు—చొరవ అని చూపుట లెస్స. 'చొర్' ప్రాచీన ధాతువగుటచే దానినుండి చొరవరూప మేర్పడి యుండునను ఆశయముతో ఇట్లు చూపియుందురు. మాట మారి (46 పు.) అను రూపము మృగ్యము. మాటలమారి—అని శ. ర. మంటమారి—అను రూపము బాల వ్యాకరణమున చూపబడినది. చెంచిత— అను రూపముతోపాటు 'చెంచెత' అను రూపమును చూపవలెను. వాలు—వాలిండి—అను రూపమునుగూడ ఈయవచ్చును. మేక—మేకపోతు—అను ఉదాహరణముతోపాటు దున్న—దున్నపోతు, ఆలపోతు, ఆఁబోతు అను రూపములను గూర్చి వివరింపనగును. (47 పు) ముండా కోర్—అను రూపము మృగ్యము. ముండాకోర్—అని వ్యవహారము. ఇదే గ్రామ్యమున చూపబడియున్నది. 48 పు—బనాయించు, ఉడాయించు, పిరాయించు అనువానినిట చూపనగును. 49 పు వోటువేయు—అను రూపముకంటె వోటు చేయు—అను

రూపములను ఇచ్చుట లెస్స. 53 పు. బంతిపూవు—బంతి—Ball కాదు. బంతి—ఒక చెట్టుపేరు. 54 పు—దీపకంబాలు—వైరి పదమున నక్కరలేదు. పుడమీశ—వైరి పదము కానేరదు. 'పుడమి' శబ్దము కేవలం సంస్కృత శబ్దము కాదుగదా! దొంగ మార్కెట్టు— అనుచోట చీకటి మార్కెట్టు, చీకటి బజారు అను వాని నీయవచ్చును. 57 పు—చిన్నారి పొన్నారి— small and pretty అను అర్థము విచార్యము. చిన్నారి పొన్నారి= pretty lovely, charming అని బ్రౌణ్యము. నలి పుట్టలు, కనుపుక్కటలు, చెదురుమదురు, పేదసాద, దొంగ దొసుగు, నలిపుట్టలు—మున్నగునవి చేర్పనగును. 59 పు. గాడిద గుడ్డు—దీనిని God the good అను దాని వికారమని కొందరు చెప్పుదురు. కంకర పీసు—అను వాడుకయు కలదు. దీనిని conquer peace—అనుదాని వికారమందురు. 62 పు—దాహము—water అను అర్థము సరికాదు. దాహము—thirst బ్రౌణ్యము. 64 పు—నామము పెట్టు—(బ్రౌణ్యము) ఏగనామము పెట్టు, పంగనామము పెట్టు—అను వాడుకలును గలవు. 66 పు—తలవరి—శబ్దములోని 'తల' శిరస్సంబంధికాదు. ఇది స్థలవారశబ్దభవము. 67 పు—కూట సాక్ష్యములోని కూట శబ్దము సంస్కృతము. కూడు ధాతు సంబంధికాదు. 70 పు—ఇట ఈ రూపములను చేర్పవచ్చును. గంగిగోవు (గోవు—చూప బడినది) మేక—భయస్థుడు. గ్రామ సింహము, దున్నపోతు, బంటోతు (బంటోతవ్వాసరి—ఆముక్త.), తాటిచెట్టు (తాళ వృక్షి ప్రాంశు— భీమ. తాళప్రాంశు—ఆది.) విశ్వామిత్రుడు కపటక దమనకులు, కర్కోటకుడు (హ. వ.) చుప్పనాతి—బ్రౌణ్యమున—సుప్పనాతి A fiendish woman, as cold or Jade. సుప్పనాతి తనము=Crossness, selfishness—అని చూపబడెను. (విశ్వనాథ—సుందర) మన్మథుడు, గాంధారి=స్థూలకాయ, బైరాగిచిటికీ, కుంభకోణము, చిదంబర రహస్యము, కంచి గరుడసేవ, పిప్పళ్ళబస్తా. (2) synonyms—81 పు—ప్రొద్దున, గుడి, ఊరు—వాన అనునవి శిష్టులు వాడునవే. భిక్షపెట్టుట అన్న వ్యవహారము బిచ్చగాని విషయములోను కలదు. (హంస) దయ్యము— భారతాదులలో దైవమును అర్థమునసే కలదు. ఆసరా— help అని మాత్రమే కాదు. ఆశ్రయమను నర్థమును గలదు. ఆసరా shelter, protection, patronage, support—బ్రౌణ్యము. అద్భుతము, అబ్బురము అను వానికి భేదము కన్పట్టదు. కాష్ఠము=Funeral pyre—అన్నది అర్థ విపరిణామము. 82 పు—శిశుభాషితములలో వీనిని గూడ చేర్పనగును. దా=రా, (సారంగ) తువ్వ=ఎద్దు. బొజ్జ, లేవ=నిలుచండుట, బబ్బొను=పండుకొనుట (బబ్బో—బజ్జో—వ్యవ), పాయి=పాలు (హరిశ్చ) చోచి=నీళ్లు, చోచి పోసుకొను=స్నానముచేయు, పప్పలు=తినుబండములు, పుచ్చి=ఒకటికీ, బుల్లిపోయు=ఒకటికి వెళ్ళు, యాక్కు, చియ్యి=stools. మియ్యాం—(మ్యాం)—పిల్లి. చీలి=పిల్లి. ఆపు=పాము మొ॥ బూచి=దయ్యము, ఆయి=(ఆవి) జ్వరము, జేజి=దైవనమస్కారము (3) Historical semantics—91 పు. కంపు=దుర్గంధము, అను అర్థము 16 వ శతాబ్దమునుండి వచ్చెననుట సరికాదు. పాల్కురికి సోమనాథుడే పండితారాధ్య చరిత్రలో దుర్గంధార్థమునందును దానిని వాడియున్నాడు. 100 పు. సభిక శబ్దమునకు సభ్యులను అర్థము 13 వ శతాబ్దికే లిలిగినది. సభికులు=Gamblers అనుట పొరపాటు. సభికులు ద్యూతకారకులుగాని ద్యూతకృత్తులుకారు. 102 పు—ఇట తుఖారము, కంఖనము, ఆరట్టము, లింగణా—అను అశ్వవాచక శబ్దములను చేర్పనగును. ఈ పేరులు దేశనామములనుండి వచ్చినవి. జేజే= salutation అనియే కాదు. దేవత—అన్న అర్థమును గలదు. 104 కాలమగు—మృగ్యము. కాలముచేయు=వ్యవహారము (వరాహ) 106 పు. Expressions denoting menstruation—దీనిలో బహిష్ఠు అవడం, ఇంటికి రాకపోవడం—అను వాడుకలు చేర్పనగును. 106 పు—Copulation—దీనిలో నల్లమేక తప్పు (ప్రబోధ) అను దానిని చేర్పవచ్చును. Pregnancy—దీనిలో చిరభిక్షు (భాగ, హంస) వట్టి మనిషి కాకపోవు—అనునవి చేర్పనగును. 107 పు—ఘనమయింది=దీపం ఘనమైంది—వ్యవ. ఆరిపోయినదని అర్థము. దీని నిట చూపవచ్చును. ఎఱుగు—ఎరగు—అని రెండు రూపములు చూపనక్కరలేదు. (112 పు.) ఎఱుగు—అను శకట రేఫ ఘటిత శబ్దమే ఒప్పు. 115 పు—కుండ తద్భవమనుట ప్రామాణికము. చప్పిడి—అన్నది చప్ప + ఇడి—అనురీతి నేర్పడినది. చప్పి—Flat—అన్నదాని సంబంధము దీనికి లేదనుట యుక్తము. 117 పు—బోడి Toothless Woman అనుట మృగ్యము. బోసి=Toothless అని కలదు. (శ. ర.) 125 పు — చులుక = Quickly — కాదు. లాఘవము, సులభము (శ. ర.) 126 పు—పాతు=Depth—కాదు. భూమిలోనగువాని లోపల దిగినట్టి పర్వతములోనగు వాని యధోభాగము—శ. ర. పాతు= The Foundation, Meaning that Portion of a Post etc Which is under ground—Brown 126 పు. బ్రాహ్మణుడు—అన్నదానికంటె బ్రాహ్మడు—అను రూపము బాగుగా వ్యవహారమున కలదు. దీనిని పాల్కురికి సోమనాథాదులు వాడియున్నారు. బ్రాహ్మణ శబ్దభవము బ్రాహ్మడు. బ్రామ్మడు అనియు వ్యవహారము. శిష్టేతరులు బామ్మడు—అందురు. అఘోర శబ్దమునకు 'అంతకంటే ఘోరములేనిది' అను అర్థమును గలదు—శ. ర. 138 పు—గగనము=A Difficult task అనబడినది. గగనము=దుర్లభము—శ. ర. Vulgarly a great puzzle. అదేమి గగనము What great marvel is this—బ్రౌణ్యము.

పాఠకుల వినోదార్థ మీ రూపములు చూపబడినవి. ఇటువంటి ఉద్గ్రంథము తెలుగు భాషలో ప్రకటింపబడకపోవుట శోచనీయము. ఆంధ్రభాషలో చేయు పరిశోధన వ్యాసములు

ఆంగ్ల భాషలో వెలువడుట భాషాభిమానులు తీవ్రముగ నిరసింపవలసిన విషయము. ఆంధ్రభాషలో ప్రకటింప వీలు లేనప్పుడసలు ప్రకటింపకుండుటయే శ్రేయము. ఈ విషయము యూనివర్సిటీ అధికారులు, యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్ అధికారులు, ఎంత త్వరగా గుర్తించిన అంత త్వరగా భాషాభివృద్ధికి కారకులు కాగలరు.

సరియైన ఆధారములు లేకపోయినను ఇంత సమర్థవంతముగా పరిశోధనమును సాగించి చరితార్థులైన శ్రీ రెడ్డిగారి కృషిని హృదయపూర్వకముగ అభినందించుచున్నాను.

—వంతరాం రామకృష్ణారావు.

# స్వామి వివేకానంద

[కర్త: రోమారోలా; తెలుగు అనువాదము: రాయప్రోలు సుబ్బారావు; వెల: 5—50; సోల్ డిస్ట్రిబ్యూటర్స్:— వేంకట్రామ అండ్ కంపెనీ, విజయవాడ.]

పందొమ్మిదవ శతాబ్దమునందు భారతదేశములో ఎందఱో మహాత్ములు పుట్టి, నిద్రాణమయిన మాతృభూమికి చైతన్యమును పోసిరి. అట్టివారిలో రామకృష్ణ వివేకానందులు ముఖ్యులు. ఆనాటికి సనాతనధర్మము జడావస్థకు చేరినది. శుష్కాచారములు దానిని పట్టి పల్లార్చుచున్నవి. ధర్మవంచనము సదాచారమయినది. అనర్థకములగు సిద్ధాంతములు చెలరేగినవి. సిద్ధపురుషుడగు రామకృష్ణుడు పరమహంసయై అధర్మక్షాళన మొనర్చెను. ధర్మాచరణమును విశాలపఱచెను. స్వచ్ఛసమయమును చాటెను. సగుణోపాసనతో మొదలయిన రామకృష్ణుల తాత్త్వికచింతనము నిర్గుణోపాసనముతో కడముట్టినది. ఆ పరమహంస జ్ఞానయోగమును ప్రధానముగా నెంచెను. తత్త్వమునుబట్టి ఆ యోగము పలువుర యనుభవమున కందనిది.

ఇట్టి రామకృష్ణుల బహిఃప్రాణము వివేకానందుడు. హేతువాదియగు నరేంద్రుడు రామకృష్ణుని అద్వైతతేజోమండలమున మునిగి మునిగి తుదకు వివేకానందుడాయెను. అద్వైతసిద్ధికి అఱ్ఱులు చాచెను. కాని రామకృష్ణులు సమ్మతింపలేదు. లోకసంగ్రహార్థము పాటుపడుమని యాజ్ఞాపించెను. వివేకానందునిది ద్వంద్వప్రకృతి. ఒకవంక అద్వైతసిద్ధిపట్లతఱుగనివ్యామోహము. వేఱొకవంక దీనజనజాతవిమోచనాసక్తి. ఒకటి కేవలము ఆత్మముక్తి ప్రసాదించునది. రెండవది మానవముక్తిని సాధించునది. పలుసారులు వివేకానందుడీ ద్వైధీభావస్థితినడుమ నలిగిపోయెను. కాని గుర్వాజ్ఞ దాటరానిది. తుదకు రెండవబాట పట్టెను. నవసామయిక సనాతన ధర్మగ్లానిని జూచి, అనాథస్థితిగతుల వీక్షించి, వివేకానందుని హృదయమెట్టు లాక్రోశించినదో, ఆయనచేసిన ప్రసంగములే ప్రబల సాక్ష్యము లిచ్చుచున్నవి. భిన్నభిన్న వేదాంతపక్షముల సామ్యముల గుర్తించి, గుదిగ్రుచ్చి, పాశ్చాత్య ధర్మములతో సమన్వయింపవలయునని వివేకానందుని ప్రయత్నము. ధర్మసమన్వయము, దీనజనసేవ—యీ రెండు లక్షణముల సమ్మేళనమే వివేకానందుని జీవితము. ఆయనకు ప్రపంచమంతయు ఈశ్వరమయము. ఇందు జాతిమతలింగభేదములు లేవు. ఆత్మవిముక్తినిగాక అనాథసేవనే పరమార్థముగా పరిగణింపుడని పరివ్రాజకులకు ప్రబోధ చేసెను. తన సన్యాసమును చేయుటకు ఆయన పొందిన కడగండ్లకు లెక్కలేదు. అయినను ఆత్మప్రత్యయమునందధికవిశ్వాసము కలవాడగుటచే మరణముహూర్తము వరకు పోరాడిపోరాడి జయముగాంచిన కర్మసాధువు వివేకానందుడు. ఇందుచేతనే ఆయన రామకృష్ణుని కంటె భిన్నుడగుచున్నాడు.

ఇట్టి వివేకానందుల పునీతచరిత్ర చదివి మోహపరవశులు కానివారెవరు? వారిలో రోమారోలా యొకరు. ఆయన సుప్రసిద్ధ నామధేయుడగు ఫ్రెంచి విద్వాంసుడు. రోమారోలా రామకృష్ణుల వివేకానందుల జీవితచరిత్రలు వ్రాసెను. ఆ రెండు పొత్తములను కలిపి, శోధించి, న్యూఢిల్లీలో సాహిత్యఅకాదెమీ వారో, మఱి యింకెవ్వరో రూపాంతరమునకు తెచ్చిరి. ఈ రూపాంతర గ్రంథము వివేకానంద శతవార్షికోత్సవముల సమయమున, సాహిత్య అకాదెమీ పక్షమున దేశభాషలకు దిగినది. అభినవాంధ్ర కవితాచార్యులు రాయప్రోలు సుబ్బారావుగారు ఆంధ్రానువాదము గావించినారు.

భారతదేశములో మహాత్ముల శతవార్షికోత్సవములు జరుగుట యొక జాతరగా నగుచున్నది. ఈ శతవార్షికోత్సవ సమయములలో కేంద్ర రాష్ట్రప్రభుత్వములు, కేంద్రసాహిత్యఅకాదెమీ, తదనుబంధ శాఖలు ఒక్కసారిగా మేల్కొనును. మేల్కొని, ఆ మహాత్ముల జీవితసారమును అక్షరబద్ధము చేయు వ్యక్తులను వెదకుటకు మొదలిడును. వానికి సాహిత్యలోకమున విశ్రాంతి వేతనమో, ఉపకార వేతనమో పుచ్చుకొనుచున్నవారు ఒకరో, యిద్దరో కంటబడుదురు. వారు గ్రంథములు వ్రాయుదురు. ఆ గ్రంథములలో చిత్తశుద్ధి యుండదు. ఆత్మీయతా ముద్రయుండదు. మొత్తము మీద ఏదోయొకరీతిగా పని జరుగును. మొదలిడినవారు మహాతృప్తితో చేతులు దులుపుకొందురు. ఏదోవిధముగా వారి మ్రొక్కుబడి చెల్లెననుకొందురు. ఫలము శూన్యము. డబ్బు దండుగ. సమీక్షకు వచ్చిన యీ పుస్తకము పై పోకడలో పుట్టినట్టిదే.

రోమారోలా గొప్పవాడు. ఆయన గొప్పదనము ఈ పుస్తకములో కనుపట్టదు. రామకృష్ణ మఠమువారు రామకృష్ణ వివేకానందులను గూర్చి యెన్నో గ్రంథరాజములను ఆయాదేశభాషలలో ప్రకటించిరి. పెక్కుతడవలా గ్రంథములు అచ్చయినవి. ఇది ఆ గ్రంథములకంటె భిన్నమైన, నూతనమైన గ్రంథమా! కాదు. రోమారోలా వివేకానందుని జీవనమునకు సముచిత నవ్య వ్యాఖ్యానము చేసెనా? చేయలేదు. మఱి యే ప్రయోజనము కొఱకు ఈ గ్రంథము వెలువడినది? పాశ్చాత్యులు భారతదేశమును గూర్చి, భారతీయులనుగూర్చి పొగడుచు గ్రంథములు వ్రాసినచో చంకలుగొట్టుకొనువారీదేశమున నెందఱో కలరు. ఈ గ్రంథమట్టివారికి మహానందము కల్గించునేమో! గుంపులో గోవిందా! యనునట్లు సాహిత్య అకాదెమీ కూడ తన జాగ్రదవస్థను చాటు

కొన నిశ్చయించినది. నిశ్చయించి యీ గ్రంథముద్రణము సాగించి నట్లున్నది. చిరంతనానందస్వాములు రచించిన వివేకానందజీవిత చరిత్రయున్నది. ఈ గ్రంథమున్నది. రెంటిని జదువుడు. ఈ గ్రంథము విలువ తెలియును. ఆపుస్తకముసైతము రెండేండ్ల నాడు "భారతి"లో సమీక్షింపబడినది. శతవార్షికోత్సవ సమయమున రామకృష్ణమఠమువారు వివేకానంద గ్రంథముల నన్నిటిని తెలుగున ప్రకటించిరన్న మాట మనము విస్మరింపరాదు.

మరి రాయప్రోలువారి యనువాద మెట్లున్నది? ఈ యనువాదగ్రంథమునందు అచ్చుతప్పులు కొల్లలు. "కలకత్తా నగరములో 1803 సం. 12 జనవరి ఆయన జననము"(పుట: 47.) అని యీ గ్రంథములో నున్నది. వివేకానందులు 1863 సం. జనవరి 12 వ తేదీనాడు జన్మించిరి. అచ్చులో జరిగిన వర్ణలోపములకు, వర్ణాగమములకు వర్ణాదేశములకు లెక్కలేదు. అనువాదము తొందరగా జరిగినట్లున్నది. వాక్యములు తెనుగు నుడికారము ననుసరించి సంస్కృతములు కాలేదు. భాష విద్వాంసులకు ఎడనెడ సుందరముగా నుండును. విద్యావంతులకు సరళముగా గోచరింపదు. అర్థమగాదు. శిష్టవ్యావహారిక భాషయైనను సంస్కృత పదక్లిష్టత తప్పలేదు. ఇట్టి యనువాదము లీ నడుమ తెలుగున వెలువడుచున్నవి. మూలము ఆంగ్లమున నుండుటచే కాబోలు, అనువాదమునను ఆ నుడికారము వెలసినది. ఈ వాక్యములు చూడుడు.

"అనగా ఏదో భావంయమైన అశారీరకముగా అని అర్థముకాదు." "ఆ మహా ప్రవాహము దాటుటకు అందలి ఉత్తుంగములను ఎట్లు ఉపయోగించుకొనవలెనో కూడ వారు తెలియజెప్పిరి." "వివేకానందుని కూడా అట్టి సాహసమునకు దిగవద్దని సమాధిస్థితి గొప్ప ఆనందమేకాని లోకోత్సవము కొరకు తమ సర్వస్వము ధారపోయవలసినవారు ఈ ఆనందమును విసర్జించుటకు ఒప్పుకొనవలెను. వయస్సులోనున్న నరేంద్రుడు (వివేకానంద) తనకు నిర్వికల్ప సమాధి ముందున్న భయంకర ద్వారము తెరచిపెట్టమని అడిగినప్పుడు రామకృష్ణుడు నిరాకరించెను." "అవి ఏనుగు పామును గురించి రామకృష్ణుడు చెప్పిన కట్టుకథలు. వానిలో మొదటిదానిని కాకు స్వరములో ఉన్నది." "అధిష్ఠాన దేవత త్రిలోకాధిపత్యం కట్టిపెట్టడానికి వచ్చినా వ్యర్థమయ్యేదే. కాని ఆత్మ సామ్రాజ్యమయితే తన కవచానికైనా చిల్లిపొడిచిపెట్టమనేవాడు.". "శరీరమునూ తత్పీడలునూ వాటి కవి సదమదము కానిమ్ము. నీవునూ, నా చిత్తమునూ ఆనందమందే నిలిచిపోదము." "వారినందరినీ క్రీస్తుతుల్యులగుటకు ప్రయత్నింపుమనెను." "సముద్ర తరంగాలవలె జనసంక్షులు త్రోపులాడుచూవచ్చి ఆయన పాదములమీద పడిరి." "మీరు అన్యోన్యము విశ్వసించవలెను. అవిశ్వాసము మీద నిలువబడవలెను."

ఈ పదకొండు—అధ్యాయముల గ్రంథమువలన తెలుగు వారికి అంతగా మేలు కలుగదు. సాహిత్య అకాడెమీలక్ష్యము నెఱవేఱదు. రాయప్రోలువారి కీర్తి పెరుగదు. ఇప్పుడు వ్యాపార ప్రపంచమున పొడుకొన్న పరిస్థితులలో పుస్తకము అమ్ముడుపోవచ్చు. ఈ గ్రంథమునకు 5—50 రూపాయల వెలపెట్టుట అధర్మము.

—"శాక్యసింహ."

## అకాండతాండవం

(అకాండతాండవం. కవి శ్రీ బోయి భీమన్న. ప్రతులకు: 1. సుఖేలా నికేతనం 92/2 ఆర్. టి. విజయనగర్ కాలనీ, హైద్రాబాదు. 2. పోతుకూచి ఏజన్సీస్ 208, న్యూబోయిగూడ, సికింద్రాబాదు—సుఖేలా ప్రచురణ: 95 పేజీలు. వెల: 5 రూపాయలు.)

శ్రీ బోయి భీమన్న కవిమాత్రులేగారు. తత్త్వవేత్తలు గూడ. శైవమతంలోని శివుడుగాక వీరి హృదయ పద్మస్థమైన మూర్తియొక్క 'అకాండ తాండవం' ప్రదర్శించి తెలుగులో రాగతాళమయమైన, నృత్యానుకూలమైన సాహితీసృష్టితో కొత్త సంప్రదాయాన్ని నెలకొల్పడానికి ప్రయత్నించారు. ఆశయం గొప్పది. అయినా రచనలో వీరాశించిన భావాలు రాలేదు. వారి హృదయ పద్మస్థమైన మూర్తిని దర్శించాలంటే ఆనంద కళాసాధకులందరూ వారి భావలయను అనుసరించవలసి ఉంటుందంటున్నారు. ఆ భావ లయ నూతగాగొని కావ్యాన్ని పఠించటం ప్రారంభిస్తే "శివుడు, ఉమ, రమ—ఈ ముగ్గురూ

చైతన్యం, చేతనం, వికాసం,
నాదం, బిందువు, కళ.
ఆకాశం, మేఘం, వర్షం.

బీజం, ఫలం, రసం—ఈ త్రిపుటీ భంగ సముద్భూత రస భాండం—ఈ అకాండ సుందర లీలాతాండవం" దర్శించగలమని కవి పూర్వరంగంలో తెలియజేశారు. అకాండ తాండవాన్ని దర్శించగలంకాని అది సుందరంకాదు, శ్రవణపేయం కాదు. హృదయం రసపూరితం కానేరదు. "భాష విషయంలో సర్వ స్వతంత్రంగా వ్యవహరించే స్వభావం నాది" అని వారు చెప్పుకొన్నారు. "ఇందులోమాత్రం అలాంటి స్వతంత్రప్రయోగాలు చాల తక్కువ" అని కూడ అంటున్నారు. కాని తక్కువేం కాదు. వారే ఉదహరించిన "తాఙ్మహాలుడు" "ప్రాణించు" ప్రకృతి కళా విన్యాసమును 'రమ' అనటమూ వీరి స్వాతంత్ర్యానికి నిదర్శనాలు. లక్ష్మీదేవి నామమైన 'రమ'ను ఆమె కుండలిని గనుక శివశక్తిగా పేర్కొంటానటం, వీరి భావ స్వాతంత్ర్యాన్నిగాక, అయోమయపు వేదాంత ధోరణిని, అనిశ్చితమూ, సమాధిరహితమూ అయిన కవితావేశాన్ని వెల్లడిస్తాయే గాని గంభీరమైన తత్త్వాన్నిగాని, రసానందాన్నిగాని అందించవు. అంతటితో ఆగకుండ సరస్వతిని గూడ 'ఉమ'కు పర్యాయ పదంగా వాడటం దారుణం. "కించిత్తు అర్థ భేదంతో వాడాను" అని చెప్పటం విచిత్రం. సరస్వతిని ఉమకు పర్యాయపదంగా వాడటంలోని "స్వారస్యాన్ని" వారు వివరించలేదెందుకో! కవి ఉద్దేశిస్తున్న భావాలను కావ్యమంతా చదివినా, 'పూర్వ

# గ్రంథ విమర్శలు

రంగం'లో వెదికినా తెలియకపోతే ఆనందం కలుగకపోతే అది పాఠకులే ఎవరికి వారు నిర్ణయించుకోవాలి. భీమన్నగారి ఉద్దేశంలో ఉమ, రమ, సరస్వతులను పర్యాయపదాలుగా వాడటం అలవాటు చేసుకోవాలి. "ప్రాణించు", "తాజ్మహాలుడు"ల వంటి ప్రయోగాలను జీర్ణించుకోవాలి. "పయనము" అనే శబ్దాన్ని 'పైనమై' అని వ్రాస్తే "వ్యావహారిక భాషాసంప్రదాయంలో హ్రస్వ దీర్ఘ శబ్దాలమధ్య సర్దుబాట్లు కూడ" చేసుకోవాలి. అప్పుడు కలుగుతుంది భీమన్నగారికి కలిగిన శివాద్వైత పరమానంద పారమ్యమనే శ్రీకైవల్యసిద్ధి.

ఆధునిక శాస్త్ర విజ్ఞానం అఖండంగా పురోగమిస్తున్నది. కాని మానవుడు తన మానవత్వపు విలువలను కోల్పోతున్నాడు. ఈ భావాన్ని చెప్పటానికి వారు పలికించిన 'గజ్జె'

"ఒకరి తలలోనుండి పేను మ
　　రొకరి తలలో కెక్కదా?
అంతకంటె ను నీ గ్రహాంతర
　　యాత్ర కధికత ఉన్నదా?
జనము నెత్తురు పిండి తెచ్చిన
ధనమునేల వృధా యొనర్తువు?
　　చద్ది యన్నపు ముద్దరా!
　　చంద్రుడధికము కాదురా!"

అనే విధంగా ఉన్నది. ఉదాత్తంగా చెప్పవలసిన భావాన్ని చంద్రగ్రహం చేరుకోవటం ఘన విజయం కాదని చెప్పదలచినా "చద్ది యన్నపు ముద్ద"యని చెప్పటం బాగుగాలేదు. సమాజంలోని చెడునుగర్హిస్తూ వారు పలికించిన 'గజ్జె'లలో లంచగొండితనాన్ని వర్ణించిన తీరు బాగున్నది.

"లంచగొండీ! ఏమిటోయ్ తెగ
వంచుకొందువు గొంతులోకి?
లంచమా అది? తోడి మనుజుని
పంచప్రాణ కషాయమౌరా!
తోడి మనుజుని కాయకష్టపు
వేడి చెమ్మట విషకషాయము!
క్రోలబోకుము మూఢుడా! బలి
గోరురా అది నిన్ను నిన్నే!"

ఈ విధమైన రమణీయమైన 'గజ్జెలు' ఎన్నో ఉన్నా వాటిలో పెక్కింటిలో వారు చెప్పిన తాత్త్విక దృక్పథం మృగ్యమౌతున్నది. తాత్త్విక సమస్యలను చెప్పిన వానిలో సమాజ జీవనమూ, సమాజ జీవనపు తీరును వర్ణించిన వానిలో తాత్త్విక దృక్పథమూ కన్పించదు. ఈవిధంగా కన్పించకపోవటం దోషమేమీకాదుగాని కావ్య వస్తువులో ఏకసూత్రత కనుపించదు. కవికి కవితా సమాధి భగ్నమౌతున్నట్లే పాఠకునికీ, విషయాంతరణ ఆసక్తి కలిగి అనుభూతి మారుతూంటుంది. కావ్యాన్ని సానుభూతితో పఠించి, కవి ఊహించిన భావంతో తాదాత్మ్యం పొందటానికి యత్నించిన తరువాత 'సమాధి' లోపం కొట్టొచ్చినట్లు కన్పించితీరుతుంది. శ్రీ భీమన్నగారు బాధతో అందుకు కారణము సమాజంలో వారి కులమూ, దాని దిక్కులేనితనమూ జ్ఞాపకం రావటమంటున్నారు. ఈ కావ్యాన్ని సహృదయ పాఠకునిగా పఠించి త్రికరణశుద్ధితో నేను చెప్పేమాట ఒకటుంది. అది, భీమన్నగారి కులమేమిటో నాకు తెలియనే తెలియదు. తెలుసుకోవలసిన అవసరమూలేదు. విశ్వజనీనమైన కవి హృదయానికి ఎల్లలు నిర్ణయించటం దుస్సాహసం. కులాన్ని ప్రశ్నించటం అపచారం. కాని పాఠకుల కానందం కలుగకపోతే, విమర్శిస్తే అది వారి కులాన్ని గురించి యని భావించి కవిగా వారిని వారే కించపరచుకొనవలదని మనవి. కులద్వేషం కూడనట్లే సమకాలికమైన కవితా ప్రక్రియలపట్ల గూడ సానుభూతి ఉండాలి. మరి ఆ సానుభూతి శ్రీ భీమన్నగారికి ఉన్నదా? ఒక్కసారి ఆత్మ విమర్శచేసికోవలసిందిగా అర్థిస్తున్నాను.

"అమలిన శృంగారభావం శారీరక బలహీనతలుగల కేవల భావకవులది. తా చెడ్డ కోతులు వాళ్లు" అని శ్రీ భీమన్నగారు భావకవులను నిందించారు. గతానుగతికాలుగావస్తూన్న క్షుద్ర కావ్యాలపై ధ్వజమెత్తి సాహిత్యలోకంలో క్రొత్త వెలుగున్ని ప్రసరింపజేసిన భావకవులను కోతులని హేళనచెయ్యటం తగునా? కవితాకన్యకు నూతనాలంకారాలు కైసేసిన కృష్ణశాస్త్రి, తల్లావజ్ఝల, రాయప్రోలు, నండూరి, బసవరాజు అధికార్ల మొదలుగాగల కవులందరూ "శారీరక బలహీనతలుగల భావకవులేనా?" "కోతులేనా?"

భావకవిత్వోద్యమంతో సానుభూతి లేదంటే, వీరికి అభ్యుదయ కవిత్వోద్యమంపట్ల గూడ విరాదరమే ఉన్నది. సనాతన సంప్రదాయవాదు లనుకుందామంటే ఆర్షవాఙ్మయాన్ని "అసంబద్ధమైన మారిన్యవాదం; అప్రాచ్యం" అని సెలవిస్తున్నారు. పోనీ వీటిలో వేనికీ చెందని తాత్త్విక దృక్పథమేమో వీరిది? "దేవేంద్రయ్య ఆడవాళ్ళ వెంటపడతాడు. చిక్కితే తొక్కి వదిలేస్తాడు. తప్పితే తన్నులు తిని వచ్చేస్తాడు" అని క్షుద్రమైన కవులవలె బూతు పుస్తకాలు వ్రాసే మాదిరిగానే వ్రాసి, వారి భావ లయ ననుసరించనిదే వారి హృదయపద్మస్థుడైన మూర్తిని దర్శించటం పడదంటున్నారు. ఇదేం న్యాయం?

శ్రీ భీమన్నగారు భావుకతలో ఉత్తమశ్రేణికి చెందినవారే. "నీ జటలో ముద్దబంతిలా పూర్ణ చంద్రుడు" అని అందంగా, మధురనిష్యందంగా, భావకవితలో మేలుబంతిని సంతరించారు.

"తరువు బడుచుండిన కురంగము!
మరచి గరికను మేయుచుంటివా?
　　స్వారి కదిలిన సుల్తానా! నీ
　　దారి నరకము కేసి కాదో?
మూర్ఖుడా! నీ పురోగతిలో
ముందు జూచుక పర్వులెత్తుము!
　　కళ్ళు మూసుకపోవుచో, అది
　　కాశికైనా కాటికేసే!"

అనే గేయంలో గంభీరమైన చింతనతో మూర్ఖునికి పురో గతిని చూపించారు. కోటికి పడగలెత్తిన ధనాఢ్యులను ఎంగెత్తి చెప్పినప్పు, పేదలను పీడపురుగులుగా చూడవద్దని

"ధనము వర్ధిల్లినవాడు ధరణికి
ఘనుడైనట్టి సుందవరేరా!"

అని మహోన్నత ధర్మ సందేశాన్ని ప్రపంచానికి కవితతో రంగ రించి చెప్పారు.

"అమ్మ ఇచ్చిన బొమ్మలను గొని
ఆట మున్గిన చంటివాడు
ఆదుకొనుమన్నంత సేపు
అమ్మ మాటే మంచిపోదా?
ఆటతమిలో అమ్మ జోక్యము
నైనగాని సహించగలడా?
అంతమాత్రముచేత బొమ్మే
అమ్మ కంటెను గొప్పదౌనా?"

కావ్యానికి ప్రాణభూతమైన ధ్వనిని, వేదాంతభావంతో జోడించి చక్కని లయజ్ఞానంతో 'గజ్జె'ను ప్రయోగించిన శ్రీ భీమన్నగారు సంస్తవనీయులు.

"తనను తానెరిగినది రక్తి
తనను తామరచినది ముక్తి"

అని అల్పాక్షరాలతో అందంగా చెప్పారు. ఇది వాస్తవం. మరి "తనను తా మరచిన ముక్తి" లో కవి అనిర్వచనీయ ఆనందాన్ని పొందుతూ, తన అనుభూతి విశేషాన్ని పాఠకుల కందించటానికి ప్రయత్నిస్తాడు. అప్పుడు కవి సమస్తమూ విస్మరించినట్లే తన కులాన్నీ విస్మరిస్తాడు. పాఠకుడూ సర్వమూ మరచి, రసజగత్తులో నిలిచి, కవిని కవివంశవృక్షాన్నీ, అన్నింటినీ మరచి పోతాడు. క్షుద్ర విమర్శకులు కులాన్ని ఆధారంగానే గైకొని విమర్శిస్తారంటే అది వేరేమాట. ఉజ్జ్వల భావుకతఉన్న భీమన్నగారు వాటిని సరకు సేయనక్కరలేదు. అప్పుడు

"కళయె సుమి ఏ జాతికైనను
కాంతి నొసగే దివ్య శారద!"

అని కమ్మగా ఆలపించి అందరినీ ఆనందపరచగలరు.

"నాట్యరంగమునుండి గిట్టి
నాట్యరంగముమీద పుట్టే
వేషధారుల కందరకు నొక
వేషముల గదిలేదె వెనుక?"

ప్రపంచ మొక నాటక రంగస్థలియనిన షేక్స్పియర్ మహాకవి సూక్తిని అందంగా పొందుపరచారు. సుందరమూ, రసబంధురమూ అయిన తన కవితతో 'నటుడైన' సహృదయుని నాట్యమే చేయించారు. నేపథ్యంలో ఉండి 'గజ్జె'లతో వాద్య ధ్వని పూర్వకమైన సంగీతాన్ని వినిపించారు.

"ఈ గజ్జెలన్నీ ఒకే ఛందస్సులో వ్రాయబడినవి. ఆటకూ పాటకూ కూడా అందంగా ఒదుగుతవి. ఒకొక చరణంలో 3+3+3+4=14 మాత్రలు ఉంటవి. అది చరణ గరిష్ఠ పరిమాణం" అని తమ ఛందస్సును వివరించారు. మాత్రా ఛందస్సులో ముచ్చట గొలిపే కావ్యాలను రచించిన శ్రీయుతులు దాశరథి, నారాయణరెడ్డి, పుట్టపర్తి, విద్వాన్ విశ్వం, ఉత్పల సత్యనారాయణాచార్య మొదలైనవారివలె మాత్రా ఛందస్సుకు సంబంధించిన మంచి కావ్యాల వరుసలో 'అకాండతాండవం' చోటు సంపాదించుకుంటుంది.

పుస్తకాన్ని అందమైన కాగితంమీద సుందరంగా ముద్రించారు. ఐతే ఇంత చిన్న పుస్తకానికి వెల 5 రూ. చాల ఎక్కువనిపిస్తుంది. అంకిత మివ్వటంలోనూ శ్రీ భీమన్న గడుసుతనం చూపెట్టారు. ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రులందరికీ ఒక్కొక్క కావ్యం అంకితమిచ్చారు. "ఈనాడు ప్రజలే ప్రభువులు. వారి ప్రతినిధులే రాజులు" కాబట్టి ప్రజా ప్రతినిధీ, ముఖ్యమంత్రి అయిన శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారికి శివాద్వైత పరమైన, వారి హృదయ పద్మాసనస్థుడైన మూర్తిని వర్ణించే యీ కావ్యాన్ని అంకితమిచ్చారు. "కాసు అర్థము, బ్రహ్మ మోక్షము" అని స్వారస్యం చెప్పటం భేషుగ్గా ఉన్నది. కాని 'కామ మది ఆనందం' అని చెప్పటం అన్యాయం. ఆనంద శబ్దాన్ని 'కామం'తో కూడిన తృప్తికి సరిపోల్చటం దుస్సహం. 'రెడ్డి' శబ్దం 'రాష్ట్రకూట' పదం పొందిన మార్పులవలన వచ్చినదిగా తెలుస్తున్నది. రాష్ట్రకూటులు ఒక పరిపాలనవంశం. అయితే ధర్మానికి పర్యాయపదంగా రాష్ట్రకూట శబ్దమెక్కడా ప్రయుక్తంకాలేదు. శ్రీ బ్రహ్మానందరెడ్డిగారి పేరులోని 'రెడ్డి' శబ్దం ధర్మానికి పర్యాయపదంగా చెప్పటం విశేషం. అంకిత మిస్తూ వ్రాసిన 'గజ్జె'లలో గడుసుదనం తొంగిచూస్తున్నది.

## స ప్త స్వ రా లు

(సప్తస్వరాలు : కథానికల సంపుటి : ప్రకాశకులు శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణాజిల్లా, 186 పేజీలు వెల 3 రూ.)

చిన్నకథ చిద్విలాసాలు అన్నీ ఇన్నీ కావు. కథానిక యీ దశాబ్దంలో కొత్తపుంతలు త్రొక్కుతోంది. చిత్రవిచిత్ర గతులను ప్రదర్శిస్తున్నది. కథానికకు బాల్యం గడచింది. "అనగా అనగా" అని మొదలై "కథకంచికి మనమింటికి" అని ముగియు వీనాటి కథలు. కథానికకు యౌవనం ప్రవేశించింది. లావణ్యం పొంగిపోతున్నది. కాలంలో మార్పు వస్తున్నట్లే 'కథానిక' తన సహజమైన సిగ్గరితనాన్ని క్రమంగా దూరంచేసుకుంటూ 'ట్విస్ట్' లతో పాశ్చాత్య నృత్యాలు చేస్తున్నది. ఐతేనేం జీవితానికి మరింత చేరువౌతున్నది. ఇది హర్షదాయకం.

ఈ పుస్తకానికి దుర్గానంద్ 'కథముందు కథ' సమకూర్చారు. శ్రీ 'విహారి శాలివాహన'లు కథానికల సేకరణలో తోడ్పడినారట. ఉత్తమ కథానికల సంపుటాలను సమకూర్చటానికి కృషి చేస్తున్న గోదా గ్రంథమాలవారు తమ ప్రయత్నంలో యీ పుస్తకాన్ని ప్రచురించి కృతకృత్యులయ్యారు.

# గ్రంథ విమర్శలు

శ్రీ బలివాడ కాంతారావు గారి 'అభ్యుదయం' శ్రీమతి బీనాదేవి గారి 'విద్యుల్లత విరిసింది' అనే కథలీ సంపుటంలో ఉత్తమ కథానికలు. రెండు కథలూ వేర్వేరు దారుల్లో పయనించినా, రెండూ అభ్యుదయాని వాంఛించేవే. 'అభ్యుదయం' కథలో, ఎల్లెడలా అవహేళనకు గురియవుతున్న పంచాయతీరాజ్ వ్యవస్థలో అవినీతి మారుపేర్లుగా బి. డి. ఓ. లను గూర్చి ఆడిపోసుకుంటున్న తరుణంలో ఆదర్శవంతంగా బి. డి. ఓ. రామారావుపాత్రను చిత్రించి కథానికా రచయితలకు ఆదర్శ వంతంగా నిలచారు రచయిత. అభ్యుదయమంటే కుళ్ళును కెలకటమే కాదు, అవినీతి గాయాలకు శస్త్రచికిత్సలు చెయ్యటమే కాదు. హృదయానికి వూరట కలిగించే విధంగా పాత్రలచే ఆత్మ విమర్శ చేయించి తద్వారా పాఠకులు కూడా అంతర్ముఖులయ్యే విధంగా వ్రాయటం సమర్థుడైన రచయిత చెయ్యవలసిన పని. ఆ పనిని చాకచక్యంతో నిర్వహించి 'అభ్యుదయ' మనే మాటకు భాష్యరూపంగా అందాలొలికించే విధంగా కథను అల్లేరు శ్రీ కాంతారావు. రామారావు వంటి బి. డి. ఓ. ఉండటం అసాధ్యమని పెదవి విరిచే వారికి, రామారావువంటి బి. డి. ఓ. "ఉండాలని తెలియజెప్పటమే," అభ్యుదయం జవాబు. ఒక ఉన్నతాదర్శం కోసం వ్రాసిన ఈ కథలో శిల్పానికేమీ లోటు రాలేదు. ఎక్కడా వ్యాసరూపం సిద్ధించకుండా కథకు కావలసిన జిగీ బిగిని కూర్చి మంచికథను అందించారు శ్రీ కాంతారావు.

ఇదేవిధమైన మరొక ఉత్తమ ఆదర్శం ధ్యేయంగా వ్రాసిన కథే శ్రీ భమిడిపాటి రామగోపాలంగారి కథ 'ఒరవడి.' సంస్కారం తగినంతగా తన భార్యలో లేదని బాధపడే సుబ్రహ్మణ్యానికి తన మిత్రుడూ, పెద్ద ఆఫీసరు అయిన శాస్త్రి ఆదర్శ ప్రాయుడౌతాడు. శాస్త్రి భార్య సుశీలా దేవికీ మొదట్లో చదువూ, సంస్కారమూ తగినంతలేవుగానీ శాస్త్రి ప్రోద్బలంతో పోరుతో సుశీల చక్కని చదువూ, సంస్కారమూ పెంపొందించుకుంటుంది. "ముదితల్ నేర్వగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్" అనే భావంతో శ్రమించి తన భార్యను శ్రమపడి విద్యావంతురాలినిగా చేస్తాడు. "స్త్రీలని కరెక్టుగా ఎడ్యుకేట్ చేస్తే, పాప్యులేషన్ ప్రాబ్లెమ్ వాళ్లే సాల్వు చేసుకుంటారు. ఎడ్యుకేషనంటే ఇక్కడ అక్షరాస్యతకాదు. జ్ఞానం" అని శాస్త్రి హితవు చెప్పి సుబ్రహ్మణ్యానికి 'ఒరవడిపెడ్తాడు' కథలో వస్తువుకున్నంత ప్రాధాన్యం శిల్పానికి లేకపోవటం వలన శిల్ప పరిణతి కొరవడింది.

ఈ నాటి కథానికలలో ఉత్తమ తరగతికి చెందిన కథ 'విద్యుల్లత విరిసింది'. భాషా, భావాలూ రెండూ పదునైనవి. శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు కథ వ్రాయటానికి తగిన విషయాలు సూచిస్తూ "ఓరోజు ఆస్పత్రిలో ఒకేఒక అతి మంచి సూది మందు ఉంది. బజార్లో అది స్టాకులో లేదు. అదివ్వకపోతే ఓగొప్ప పేషెంటు చస్తాడు. అదివ్వకపోతే ఓపేద పేషెంటూ చస్తాడు. ఆ యిద్దర్లోనూ ఆ మందు ఎవరికివ్వాలి? అందువల్ల ఫలితాలేమిటి? కథ రాయొచ్చు"నన్నారు. మరపురాని మంచికథను వ్రాసి చూపించారు శ్రీమతి బీనాదేవి. ఈ కథలో డాక్టరు సుబ్రహ్మణ్యం ముందుగా గొప్ప పేషెంటునే ఆపరేషన్ చేస్తాడు. అయితే చెయ్యబోయే ముందు తార్కికంగా ఆలోచిస్తాడు. విధి వశాత్తూ చివరికి గొప్ప పేషెంటూ ఎటూ చావు కోరుకుంటున్నవాడూ, పేద పేషెంటు తానే ఆధారంగా బ్రతుకుతున్న ముసలి తల్లిని శ్రావణ ఎనిలాగ సాకుతున్నవాడు. పాపం ఆ ముసలితల్లి నిరాధారయై దిక్కులేని పక్షి అవుతుంది. అయితేనేం ఆ కారు చీకటిలో దయగల బీదయువకుడొకడు ఆమెకు సాయంగా వస్తాడు. ఆ చీకటిలో విద్యుల్లత విరిసి పాఠకులకు విభ్రమం గొల్పుతుంది "మానవతాదృష్టిలో డాక్టరు తీసుకున్న నిర్ణయం తప్పుడిది. అతని తర్కంలో తర్కంతప్పు ఏమీలేదు. అలాంటప్పుడు డాక్టర్ని అంత నిర్భాగ్యమాట పరుషంగా నిష్పక్షపాతిగా సృష్టించటంలో అర్థం........?" అని శ్రీ దుర్గానంద్ ప్రశ్నిస్తున్నారు. శ్రీ దుర్గానంద్ సంఘటన ఉద్రిక్తతను విస్మరిస్తున్నారు. ప్రమాదం జరిగిన తరువాత, అర్ధరాత్రి దాటేంతరువాత, ఏఒక్కరికో, ఒక్కరికి మాత్రమే ఆపరేషన్ చెయ్యటానికి వీలుంది. ఆ సమయంలో డాక్టరు 'హామ్లెట్' కాడు. ఆలోచించేటందుకు వ్యవధి గూడా లేదు. తార్కికంగా ఆలోచించి త్వరలో నిర్ణయానికి రావాలి. వచ్చేశాడు. షేక్స్పియర్ మహాకవి చెప్పినట్లు "There is a Providence, which shapes all our ends', మరి ఆ సమయంలో డాక్టర్ని విధి వెక్కిరించింది. ఓటమిని ధీరోదాత్తంగా స్వీకరించాడు. మానవత మేల్కొన్నది గనుకనే బీద ముదుసలి వ్యథకు క్రుంగిపోయాడు "భాష చురుక్కుమంటుంది, పోలికలు వేడి వేడిగా ఉన్నాయి. రచన చాలా ఘాటు" అంటున్నారు. మరి దృశ్యానికి సంబంధించినట్లు వాస్తవికత ఉండవద్దా! "ఒక ఉద్రిక్త పరిస్థితినిగాని విశేష పరిస్థితినిగాని విశేష దశలో చెప్పడం వాస్తవికత" అని శ్రీ దుర్గానంద్ చెప్పారు. ఈ కథలో వాస్తవికత ఉన్నది. హృదయానికితట్టే తోటి మానవ హృదయ స్పందనవున్నది. భాష చురుక్కుమన్నా సంఘటనకూ కథకూ తగినదేగాని వూహామాత్రం కాదు.

హాస్య వాఙ్మయ బ్రహ్మ కీ. శే. భమిడిపాటి కామేశ్వర రావుగారి హాస్యరసాన్ని పుణికి పుచ్చుకొని శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారు 'నిత్యానందంగారి వివాహం' కథలో రమ్యంగా హాస్యరసాన్ని పోషించారు. నిత్యానందానికి పెళ్ళి జరిగినా పెళ్ళిగురించి 'మమ' అని కూడ తాను అనుకోలేదంటున్నారు. మంగళసూత్రం కట్టనని చెబుదామనుకుంటూంటే మాటవినిపించకుండ ఢమఢమ డోలు వాయించేశారు. పాపం ఏంచేస్తారు! పిరికితనం. పాఠకులు నవ్వకోకుండ ఉండలేరు. పిరికితనాన్ని ఏవగించుకోరు. ఈ హాస్యం బాగా నవ్వు తెప్పించేదేగాని హృదయాన్ని కదిలించేదికాదు.

దాశరధి వ్రాసినకథ 'స్వాతి చినుకులు' కలుకు ములుకు హృదయాలు స్వాతిచినుకులవంటి కన్నీళ్ళతో కరగించి ఆ హృదయాన్ని మంచి ముత్యంగా మారుస్తుంది ఎయిర్ హోస్టెస్ నీల. దాశరథికి వర్ణనలలోనూ, పోలికలు తేవడంలోనూ కవికుండే ఒడుపుంది. అయితే కథకి ఉండే సంక్షిప్తతపట్లఆసక్తి శిల్పాన్ని బాగా దెబ్బతీసింది. కథలో రెండవ భాగం సినిమా దృశ్యమైంది. విలన్ మనస్సు మార్చుకు గిరుక్కున తిరిగిపోయి ఓటమిని అంగీకరిస్తాడు. అయితే పైలెట్‌మూంజీ క్రౌర్యం కేవలం నాటక ఫక్కీలో ఉన్నది.

కథలనే పేరుతో వస్తున్న రంగువూసలలో ఒకటిగా, కథానికా సరానికి తోడ్పడే కథలు శ్రీమతి దర్భా భాస్కరమ్మగారి "ఇద్దరు అబలలు", శ్రీ విహారి శ్రీ శాలివాహనల "పండు టాకులు". 'ఇద్దరు అబలలు' కథలో శిల్పం కొరవడింది. కష్టాలు మంచు తెరలుగా విడిపోతాయి. గాయపడిన హృదయాలు కలిసి జంటగా ప్రయాణం సాగించ నిశ్చయించుకుంటాయి. 'పండుటాకులు' కథలో సంఘటనల పొందిక లేదు. వరసాగ్గా కథ చెప్పుకు పోవటం తప్ప కథకు నిండుదనం లేదు.

ఈ కథలన్నిటికీ 'కథముందు కథ'ను సమకూర్చిన 'దుర్గానంద్'గారి విమర్శ ఆలోచనాత్మకంగా ఉన్నది. "కథ జీవితంలోకిరావాలి. జీవితంఆడే ఆటలన్నీ కథ ఆడాలి." ఆనాటి కథలలో నాయకుడు పరిస్థితులకు లొంగనివాడు. నేటి కథలలో నాయకుడు నాయిక పరిస్థితుల ప్రాబల్యానికి లోనై మంచి చెడ్డలకు కారకులౌతున్నారు. నేడు మనం కథ నడిపించే తీరు అచ్చంగా మనదే కాకుండాపోయింది. నేడు ఒక రచయితలో పది దేశాల రచయితలు కూర్చున్నారు. మనం చిన్న పలక తెచ్చుకుని పెద్దగీతలు గీయాలను కుంటున్నాము— ఈవిషయాలన్నీ శ్రీ దుర్గానంద్ విపులంగా చెప్పారు. వీరి విమర్శ కథలకు తగినంత ఉదాత్తంగా ఉన్నది.

మంచి కథానికల నేర్చి కూర్చి తెలుగు పాఠకుల కందిస్తున్న శ్రీ గోదాగ్రంథమాలవారు పాఠకహృదయాలన్న దోచుకోగలరు. పుస్తకం మరింత ఆకర్షణీయంగా ఉంచటంలో ప్రచురణకర్తలు జాగరూకత వహించాలి.

—రామమోహనరాయ్.

## గ మ ని క

1967 జనవరినెల భారతిలో 32 వ పేజీలో మొదటి కాలము 26 వ పంక్తిలో నిఖిలేశ్వర్ (కె. మాధవరెడ్డి) అని అచ్చుపడినది. అది సరికాదు. అచ్చట నిఖిలేశ్వర్ (కె. యాదవరెడ్డి)అని యుండుట సరి. పాఠకులు గమనించగలరు.

---

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna
The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad

# విషయానుక్రమణిక

## జూలై 1967

# భా ర తి

అనంతంగా సాగే జీవనతత్వంలో
పుట్టే పసిపాపలు ప్రవహించే జలాలు
పచ్చని పొలాలు ఒక క్రమాన్ని సూచిస్తాయి.
రాలిపోయే మనుషులు మురుగుపట్టిన జలాలు
తెగులుపట్టిన పొలాలు మరో క్రమాన్ని సూచిస్తాయి.
జననమరణాలు ధృవాలుగా
తిరుగుతున్న గోళం కాలం '
ధృవాలు దృఢమైనవి
కాలం తిరుగుతూనే వుంటుంది.

నీకోసం నాకోసం ఆగేది కాదు జీవనస్రవంతి
మాలిన్యాన్ని మరుగుజ్జు మనుష్యుల్ని
మంచితనాన్ని మల్లెపూవుల్లాంటి వాళ్ళని
పరస్పర విరుద్ధమైన తత్వాల్ని పట్టుకు నడిచేవాళ్లనీ
సామ్యవాద పద్ధతిలో తనతో లాక్కెళుతుంది !
నియమ నిబంధనల గట్లు
కోసుకుంటూ ముందుకుపోతుంది.
అరాజకాల సుళ్ళు రేపి
మనిషికి పరీక్ష పెడుతుంది!

గతాన్ని తల్చుకుని ఛాతీ విరిచే మనిషి
మతాన్ని కరచుకొని మానవత్వం మరిచే మనిషి
కాలానుగుణంగా నడచుకోలేక
కర్తవ్యాన్ని సరిగా తెలుసుకోలేక
సంకుచితమైన సూత్రాల్లో బందీ అయిపోతాడు.
సంకులసమరంగా జీవితాన్ని మార్చుకుంటాడు.

పదార్థంలో ఒయిమిడిన అణువుకు
పదార్థ పరిణామం బోధపడదు.
కాలంలో ఇమిడిన మేధస్సు
కాల స్వభావాన్ని అంచనా వేయజాలదు.
మనిషి మేధస్సు
కాలాని కతీతమయింది కాదు !
కాలానికి గమ్యం
శబ్దంలోంచి నిశ్శబ్దంలోకి పయనం
బ్రహ్మాండంనుంచి బిందువులోకి పరిణామం

## గ డి య లు

ప్రకృతి పరిణామ శీలమయింది
రూపాంతరం చెందడం పదార్థ తత్వం,
కట్టె కాలి బూడిద మిగులుతుంది
శరీరం బూడిదైనా ఆత్మ మిగులుతుంది
ఏది ఏ రూపంలోకి మారినా
ఏదో ఒకటి మిగిలిపోతూనే వుంటుంది.
ఏమీలేకుండా ఎప్పుడూ వుండదీ సృష్టి!

క్రమబద్ధంకాని తిరుగుబాటు
మార్పుకు హేతువైనా
అందులోనూ ఒక క్రమం అవసరం.
అసంతృప్తి మార్పుకు మూలం
అన్వేషణ ప్రగతికి పునాది
పరిణామం కాలం మారే పద్ధతి
పరిణతి కాలమిచ్చే బహుమతి
కాలాన్ని గడియారపు ముళ్ళతో కొలిచేవాళ్ళు
పరిణామాన్నెలా గ్రహించగలరు?
పిరికితనాన్ని కీర్తిప్రతిష్ఠలెప్పుడూ వరించవు.
పిచ్చిచేష్టలు పరిణామ స్వభావాన్ని గ్రహించవు

ఆవేశాలు ఆగ్రహాలు
తమ ప్రవృత్తి తమకే తెలియని
నీటి బుడగల్లాంటివి.
ఆలోచనలు ఆశలు అభిప్రాయాలు
ఆగామికి మనిషి వేసుకునే నిచ్చెనలు!
మనిషిని వంచించేవి
కళ్ళమీద కాలం పేర్చే పొరలు
కుసంస్కారాన్ని పెంచేవి
కృత్రిమమైన తెరలు!
ఈ పొరల్ని తెరల్ని చీల్చి
చూడగలిగినప్పుడే మనిషికి ముక్తి.

---

# ఇతివృత్త నిర్వహణము - ఆంధ్రకవుల అలసత్వము

శ్రీ పంతరాం రామకృష్ణారావు

"ఇతివృత్తం తు కావ్యస్య శరీరం పరికీర్తితమ్" అని భరతముని వచనము. శరీర సౌందర్య మంగప్రత్యంగముల సన్నివేశ చారుత్వముపై నాధారపడియుండును. అట్లే కావ్యశరీర సౌందర్యము తత్కావ్యాంగముల సముచిత సన్నివేశ చారుత్వముపై ఆధారపడియుండును. ఆ కావ్యశిల్పమూర్తిలో ఏ యంగమెంతయుండవలెనో అంతే యుండునట్లుండవలెను. ప్రతికథాంశము నితర కథాంశముల దృష్టిలో సమర్థనీయము కావలెను. ప్రతి చిన్నవిషయమునకు ప్రయోజనముండవలెను. దానిని తొలగించినచో లోప మనివార్యముగ భాసిల్లునట్లు ప్రత్యంగము నుండవలెను. ఇంతేకాదు. ఇతివృత్తమును రసాభివ్యంజకముగ నిర్వహించుట అత్యావశ్యకము. వట్టి కథ నాయనమ్మలును అమ్మమ్మలును చెప్పగలరు. వట్టి కథ చెప్పుటకు కవియే కావలసిన పని లేదు. 'నహి కవే రితివృత్త మాత్ర నిర్వహణేన కించిత్ ప్రయోజనమ్' అని ధ్వనికారుడు స్పష్టముగా చెప్పియున్నాడు. ఇతివృత్తమును సర్వాంగ సుందరముగను రసాభివ్యంజకముగను తీర్చిదిద్దుటయే కవి సాధింపవలసినది. ఈ సందర్భమున ఆనందవర్ధనుడిట్లు వక్కాణించియున్నాడు :

"విభావ భావానుభావ సంచార్యౌచిత్య చారుణః
విధిః కథా శరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్య వా
ఇతివృత్తవశాయాతాం త్యక్త్వా ననుగుణాం స్థితిమ్
ఉత్ప్రేక్ష్యోప్యంతరాభీష్ట రసోచితకథోన్నయః
సంధి సంధ్యంగఘటనం రసాభివ్యక్త్యపేక్షయా
నతు కేవలయా శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా
ఉద్దీపన ప్రశమనే యథావసరమంతరా
రసస్యారబ్ధవిశ్రాంతే రనుసంధాన మంగినః
అలంకృతీనాం శక్తావ ప్యానురూప్యేణయోజ..
ప్రబంధస్య రసాదీనాం వ్యంజకత్వే నిబంధనమ్."

పై ధ్వనికారుని నిర్ణయమునుబట్టి కావ్యము రసాభివ్యంజకముగ నుండుటకు క్రింది విషయములు గమనింపవలెనని తేలుచున్నది.

(1) విభావాద్యౌచిత్య చారువగు ఇతివృత్తమును మొదట నెన్నుకొనవలెను. ఆ యితివృత్తము ప్రఖ్యాతముగాని యుత్పాద్యముగాని మిశ్రముగాని కావచ్చును.

(2) ఇతివృత్త గతములగు అనౌచిత్యములను విడిచిపెట్టి రసోచితముగ సంవిధానపఱుపవలెను.

(3) సంధి సంధ్యంగములు రసాభివ్యంజకములుగ నుండవలెను.

(4) శాస్త్రములో కలదుగదాయని రసాభివ్యంజకములు కానివానిని తెచ్చిపెట్టరాదు.

(5) రసోద్దీపనమును రసప్రశమనమును యథావసరముగ నొనర్పవలెను.

(6) ఆరంభించి యాగిపోయిన అంగిరసమును మరల అనుసంధింపవలెను.

(7) సమర్థతకలదుగదా యని యలంకారములను కూర్పక అనురూపముగ మాత్రమే యలంకారములను కూర్పవలెను.

ఆంధ్రకావ్యములు పదునారవ శతాబ్దివరకు ప్రాయికముగ ఆంధ్రీకరణములు. పురాణాంధ్రీకరణము స్వతంత్రపద్ధతిని కావ్యాంధ్రీకరణము స్వతం

ప్రాస్వతంత్ర పద్ధతిని సాగినదని విమర్శకుల సిద్ధాంతము. ఈ యాంధ్రీకృతగ్రంథములు స్వతంత్ర కావ్యములవలె రూపొందినవి. మొత్తముమీద ఆ మహాకవులు మూలములయందలి కవితాకళను తమ కావ్యములలో సర్వథా దీపింపజేసి కృతకృత్యులైరని చెప్పవచ్చును. ఇట్టివాన భారతభాగవతములు నైషధాదులు ముఖ్యముగ గణనీయములు.

ఒక చిన్నయితివృత్తమును గైకొని స్వతంత్ర కావ్యముగ నిర్మించు పద్ధతి రాయలయుగమున వచ్చినదని చెప్పనగును. ఈ రాయలయుగమునందలి కావ్యములను, ప్రబంధములనుపేర నేడు వ్యవహరించుచున్నాము. మహాకావ్య లక్షణములే యించుమించుగా ఈ ప్రబంధములకు సరిపడును. రసాభివ్యంజకముగా కథ తీర్చుటయన్నది యీ స్వతంత్ర కావ్యములకు ముఖ్యముగ సమన్వితము కావలసిన విషయము. ఈ రాయలనాటి ప్రబంధములలో మనుచరిత్రాదులు శాంత రసప్రధానములు. వసుచరిత్రాదులు శృంగార రస ప్రధానములు. ఈ ప్రబంధములయందలి యితివృత్తములు రసాభివ్యంజకములుగను సర్వాంగసుందరములుగను తీర్చి దిద్దబడినట్లు చెప్పుట కవకాశము కనబడదు.

మనుచరిత్ర మున్నది. దీని పూర్తిపేరు స్వారోచిష మనుసంభవము. ఇది యేకనాయకాశ్రయము కాదు. తాను రచించు కావ్యమేమి? ఏ రసప్రధానము? ఇందు ఏ కథకెంత ప్రాధాన్యముండవలెను? ఇతివృత్తమును రసాభివ్యంజకముగా దిద్దుటెట్లు? అని పెద్దన యాలోచించినట్లు కానరాదు. మార్కండేయ పురాణోక్త ప్రకారము చెప్పవలెనను కృతిపతి ఆనతిని పాలించుటకు కాబోలు కథను రసాభివ్యంజకముగ తీర్చుటకు యత్నింపలేదు. ఒకొక్క సన్నివేశములో పద్యసంఖ్యమాత్రము పెంచబడినది. పెద్దన ప్రశస్తికి మూలము ప్రవరవరూధినీ ఘట్టము ఈ ఘట్టమును రచించుటలోను పెద్దన కొంతమట్టుగ మాత్రమే కృతకృత్యుడైనాడని చెప్పవలసియున్నది. వరూధిని చేతలు మాటలు వెగటు కలిగించునవిగానే యున్నవి. ''దీపించుపెందత్తరంబునఁ బేటెత్తిన లజ్జ నంక్షి కటకంబుల్ మ్రోయ నడ్డంబునిల్చిన యయ్యచ్చరఁ జూచి'' అన్నాడు. ఇదియేమి విలాస చేష్టయో! 'నిక్కము దాపనేల ధరణీసురనందన యింక నీపయిన్, జిక్కె మనంబు నాకు' ఇట్టి వాక్యములు పురాణములలోనుండుట సహింపవచ్చునుగాని కావ్యములలో సహ్యములు కావు. ఇవి గ్రామ్యోక్తులు. 'పెన్నిధానంబులం గలుగు నికుంభాసన సామర్థ్యమ్మహా, ఖిన్నత వాడె పత్తలయి కేలఁగోలములయ్యెడి' ఇత్యాది పద్యములును సందర్భశుద్ధి బొత్తిగా లేదు. ఈ పద్యములో చెప్పబడిన యువతిలో వరూధిని లేనేలేదు. తనకు తాను వలచివచ్చిన అప్సరఃకాంతను కౌగిటచేర్చు భాగ్యము సామాన్యమా! అను కీలి వాక్యము వరూధిని పట్ల సరిపడును. అక్కరమాలిన విరహిణీ ప్రసంగముతో పనిలేదు. నామీద వచ్చినదనుటకెప్పు వరూధిని ప్రకటించిన హావభావవిలాస విభ్రమములు లేవు. ఆమె చేష్టలు కొన్ని వచనములో చేర్చివేయబడినవి. ఆమె రూపమును, హావభావవిలాసములను జనోత్సాహముగ పెద్దన చిత్రింపలేకపోయెను. ఆమెను కాదనుటకు ప్రవరునివంటి జితేంద్రియుడే కావవసరములేదన్నట్లున్నది. ఐనను ప్రవరవరూధినీ ఘట్టము మనల నాకర్షించుటకు కారణమున్నది. రసాభాసఘట్టములలో సామాన్యముగ పాఠకుల కేదో యొక పాత్ర మీదనే సానుభూతి యుండును. ద్రౌపదీ కీచక సంవాదాదు లట్టివి. కాని యీ ఘట్టమున రెండు పాత్రలమీదను సానుభూతి యేర్పడుట కవకాశమున్నది. కావుననే పెద్దన యీ ఘట్టములో కొంత వరకు మాత్రమే కృతకృత్యుడైనను పాఠకులకు లోపము ప్రస్ఫుటముగ భాసిల్లదు. వసుచరిత్రమందున్నది చిన్నసన్నివేశము వంటిదేగాని యితివృత్తము కాదు. 'గ్రామో నాస్తి కుత స్సీమా' అన్నట్లు, దాని నిర్వహణ మెట్లున్నదన్న ప్రశ్నయే లేదు! ఈ ప్రబంధములలో వర్ణనలు తీర్థమునకు తీర్థము, ప్రసాదమునకు ప్రసాదముగనున్నవి. మొత్తముపై మన ప్రబంధములు శైలీమాధుర్యముచేతను భాషాప్రౌఢిచేతను ఏపద్యమునకాపద్యముగా చూచినప్పుడు రమ్యముగా నుండుటచేతను గొప్పకావ్యములుగా పేరుగాంచినవనవచ్చును. ఇతివృత్త నిర్వహణ దృష్టితో చూచినప్పుడు మన ప్రబంధములు ముక్కాలుమువ్వీసము వీగిపోవును.

ఇక ఆధునికయుగము. ఈ యుగమున ఖండ కావ్యములును బృహత్కావ్యములును వెలువడినవి. కొన్ని ఖండకావ్యములు తృప్తికరముగ నున్నవి. కాని బృహత్కావ్యములు చాలవరకు నిస్సారములై యున్నవి. ఈ

బృహత్కావ్యములలో ఆంగ్లీకరణములు స్వతంత్రములు కలవు. ఆంగ్లీకృత కావ్యములలో కవితాకళ లుప్తమైనది. ఛందోబద్ధతయే వీనిలోని గుణము. స్వతంత్ర కావ్యములలో దేశచరిత్రములు జీవిత చరిత్రలు వంటివి కావ్యవస్తువులైనవి. ఏవయినను కవితా వస్తువులు కావచ్చును. అభ్యంతరము లేదు. తుదకు 'సబ్బుబిళ్ల అగ్గిపుల్ల కుక్కపిల్ల' కవితా వస్తువులు కావరెనన్నను మనము కాదనవలసినపని లేదు. ఏ వస్తువు నైనను రసాభివ్యంజకముగ కవి నిర్వహింపగలిగినచో అతడు చరితార్థుడగును. మాటకు కవికులగురుని మేఘసందేశ రఘువంశములు కలవు. వానిలో మేఘసందేశమున భూగోళము కావలసినంత కలదు. కాని అది ప్రధానముకాదు. విప్రలంభ శృంగార మంగిరసముగా తీర్పబడిన యొక రమణీయ కావ్యమది. నేటివారు భూగోళమును కావ్యముగ రచించినచో అవలంబింపవలసిన మార్గమిది. అంతేకాని భూగోళమునెల్ల అట్లే పద్యస్థముచేసినచో అది కవిత్వము కానేరదు. రఘువంశమంతయు రాజుల . చరిత్రమే. కాని యొక్కొక్క రాజుచరిత్రలోని ముఖ్యలక్షణమును గ్రహించి రసదృష్టితో నిర్వహించుటలోనే కవికుల గురుని విశిష్టతయున్నది. అట్లుకాక దేశచరిత్రలోని అంశముల నన్నింటిని అట్లే పద్యములలో వ్రాసినచో అట్టి కావ్యములు 'గణబద్ధమగు చెత్తగంపెడెత్తె' అనుటకు నిదర్శనములగును. రసాభివ్యంజకముగ ఇతివృత్తమును నిర్వహించుదృష్టితో పరికించునప్పుడు నేటి బృహత్కావ్యములు నిలుచునవిగా లేవు. ఇందుకు హేతువులివి. 1. విభావాద్యౌచిత్యచారువగు ఇతివృత్తము నెన్నుకొనక పోవుట. 2. ఎన్నుకొన్న యితివృత్తమును రసాభివ్యంజకముగ నిర్వహింపలేకపోవుట 3. బృహత్కావ్యనిర్మాణ కుతూహలముతో నీరసవస్తువును పద్యస్థము చేయుట 4. ప్రతిభామాత్రముతో కొందరును వ్యుత్పత్త్యభ్యాసములతో కొందరును బృహత్కావ్య నిర్మితికి పూనుకొనుట.

చారిత్రకేతి వృత్తముగల కావ్యములను ద్విధా విభజింపవచ్చును. 1. ఏకనాయకాశ్రయములు. 2. బహునాయకాశ్రయములు. ఏకనాయకాశ్రయములలో కొంతవరకు విభవాద్యౌచిత్యచారుత్వముండుట కవకాశము కలదు. ఒక ఘనకార్యమును సాధించిన వ్యక్తి నెన్నుకొనుటయుండును గనుక ఏ ధర్మవీరమో అంగిరసముగా కావ్యనిర్మాణము జరుగుటకు వీలుండును. ఈ యేకనాయకాశ్రయములగు కావ్యములలో కొన్ని కొన్ని భాగములు రసవంతముగ నున్నవి. కాని చరిత్రాంశములు విస్తరించుటచే కొన్నిభాగములు నీరసములైనవి. ఇక బహునాయకాశ్రయములన్నో వటి చరిత్రాంశముల పుట్టలు. విభావాద్యౌచిత్యచారుత్వము తక్కువ. ఔచిత్యదృష్టితో చేర్పులు మార్పులు చేసినదిలేదు. ఇట్టి నీరస రచనలను గూర్చి ధ్వనికారుడిట్లు తెలిపినాడు: 'నీరసస్తు ప్రబంధః కవే రపశబ్దోమహాన్ స తేన అకవి రేవ స్యాత్.' ఇందు రసవద్విషయములు సైతము సన్నివేశ కల్పనాదులు సరిగాలేక అనౌచిత్యపూరితములైనవి. 'ఉత్ప్రేక్షితే విశేషతః ప్రయత్నవతా భవితవ్యం తత్ర హి అనవధానాత్ స్ఖలతః కవే రవ్యుత్పత్తిసంభావనా మహతీ భవతి' అను ధ్వనికారుని వచన మెట్లన్వర్థమైనదో యిందు చూడవచ్చును. శబ్దార్థజ్ఞాన మాత్రమగు వ్యుత్పత్తియు అభ్యాసమును కావ్యహేతువగుటచే మమ్మటుడు తెలిపినట్లు ఛందోవ్యాకరణ పూర్తియే యిందలి గుణము.

ఆధునికకవు లిటుపైనైనను ఇతివృత్తము నెన్నుకొనుటలోను ఎన్నుకొన్నదానిని రసాభివ్యంజకముగ నిర్వహించుటలోను శ్రద్ధవహింపవలసియున్నదని చెప్పక తీరదు.

---

# ముడుంబ లక్ష్మణాచార్యులు : 'నందనందన విలాసము'

శ్రీ శ్రీరంగాచార్య

లక్షణా కల్యాణ మను నామాంతరముగల 'నంద నందన విలాస'మను ప్రబంధమును వ్రాసిన కవి ముడుంబ లక్ష్మణాచార్యులు. నల్లగొండజిల్లా సూర్యాపేట తాలూకాయందలి '<u>బేతవోలు</u>' అను గ్రామ మీతని నివాస స్థలము. సుమారు 120 సం. పూర్వుడని తెలియుచున్నది.

'ఆంధ్రవాఙ్మయ సూచిక' (1929), 'గోల కొండ కవుల సంచిక' (1943), తరువాత వచ్చిన 'ఆంధ్రకవి సప్తశతి' (1956), వీరు విస్మరించిన కవులలో నీతడొకడు.

ఈ ప్రబంధమును 'బేతవోలు' నందలి శ్రీరామచంద్రున కంకిత మొసంగినాడు. తన పూర్వులను గూర్చియు—తనను గూర్చియు కవి యిందేమి హెచ్చుగా తెల్పుకొనలేదు. వీని వలన నీతని కాలమిదమిత్థమని చెప్పవీలుగాదు. ఆ గ్రామపు పెద్దలు—పరిసరపు వారుచెప్పిన యాధారముల ననుసరించి ఈ కవి సుమారు 120 సం. పూర్వుడని వ్యక్తమగుచున్నది.

ప్రస్తుత ప్రబంధాదియందు 'గురుస్తుతి'యు తన పూర్వుల గూర్చియు అతిస్వల్పముగ తెలిపినాడు. ఆ పద్యముల నిట నుదాహరించుచున్నాను—

''అవని శ్రీవాత్స్య వంశమందవతరించి
యతులిత ద్రావిడాంధ్ర సంస్కృతములందు
పెంపువహియించి <u>భారత చంపువాంధ్ర</u>
<u>ముగ రచించిన నారసింహ గురు</u> గొల్తు''

(1—18)

ఈ నారసింహ గురు వెప్పటివాఁడో తెలియదు. ఈ గ్రంథము (భారత చంపువు) నాకు నింతవరకు లభ్యము గాలేదు.

కవి ప్రథమాశ్వాసమున చెప్పకొనిన పద్యములు — తన పూర్వుల—తనను గూర్చి—

''నను కృష్ణాతటసీతటోపరింస
న్మౌనీంద్రసేవ్యా గమా
వని భృచ్ఛ్రీ నరసింహదేవ కరుణా
పాంగామృత సారసం
జనితానర్ప చతుర్విధాంధ్ర కవితా
సామ్రాజ్యధౌరేయు నిన్
గని గంభీరమ్మృదూక్తి నిట్లనుచు
వక్కాణించి రా సద్బుధుల్.

గీ॥ మొదటనుండియు తావకపూర్వులెల్ల
భగవదాచార్య వరకృపాభవ్యులనుచు
బుధులు జెప్పంగవిందు మద్భుత సుచర్య
నవ్యకవిధుర్య శ్రీ లక్ష్మణ కవివర్య.

కం॥ ఓ వత్స వినుము వసుమతి
శ్రీవత్సాంకాంఘ్రి సక్తశేముషి గురు వి
ద్యా వత్సజ్ఞనపూజ్యుఁడు
శ్రీవత్సాభిఖ్య వహౌని శేఖరుఁడలరెన్.

అట్టి మునీంద్ర వంశకలశాబ్ధి జనించెను
చెన్నయార్యుఁ డా
దిట్ట యధీతవేదుఁడు సుధీవరుఁ
డా సుగుణాంబు రాశికిన్
బుట్టెను కేశవార్యుఁ డను పుత్రుఁడు
మిత్రుఁడు బంధుకోటికిన్

భట్టుగురూత్తమాధిక కృపారసపాత్రుఁడు
చారుగాత్రుఁడై

ఆ విద్వన్మణి కెంబయార్యుఁడు సుతుండై
లోకవిఖ్యాతి నా
నావిద్యా పరిపూర్ణతన్ నెగడె నా
జ్ఞానాబ్ధి గర్భంబు నం
దావిర్భూతిగనెన్ బరాంకుశ గురుం
డాదేశికుం డెప్పుడున్
శ్రీ రామాధిపపాదపద్మయుగళీ
సేవారతిన్ భాసిలెన్.

గీ॥ వినుత ఘోరార్తి దిక్తట వితతకీర్తి
సరసవిజ్ఞానపూర్తి యాచారవర్తి
సద్గుణస్ఫూర్తి సమధిక శాంతమూర్తి
యైన రామానుజార్యుఁ డాయనకు నొదవె

గీ॥ ఆ మహాత్ముఁడు రంగమయందు గాంచె
శ్రీ నృహర్యక్ష గురు కృపామృతరసాత్త
హృద్య విద్యా ప్రభూత సముద్యదబ్జ
కాంతిసితకీర్తి పూరితాశాంతు నన్ను."

(1 ఆశ్వా—33—39)

అని స్వప్నమున వచ్చిన వనౌనులు పలికినటుల తెలిపి కొనినాడు. వీని ప్రకారముగ చూచినచో కవి వంశ వృక్షము ఈ క్రింది విధముగ నున్నది—

1 శ్రీవత్సముని
|
2 చెన్నయార్యుఁడు
|
3 కేశవార్యుఁడు
|
4 ఎంబయార్యుఁడు
|
5 పరాంకుశుఁడు
|
6 రామానుజార్యుఁడు—భార్య—రంగమ
|
7 లక్ష్మణార్యుఁడు (కృతికర్త)

ఇతని తరువాతి వారిని గూర్చిన విషయము తెలియ రాలేదు.

నందనందన విలాసమను నీ ప్రబంధము పంచాశ్వాస పరిమితమైనది. ఇందలి గద్య పద్య వివరములు:—

| | |
|---|---|
| ప్రథమాశ్వాసము | 151 |
| ద్వితీయాశ్వాసము | 145 |
| తృతీయాశ్వాసము | 192 |
| చతుర్థాశ్వాసము | 140 |
| పంచమాశ్వాసము | 144 |
| మొత్తము గద్యపద్య సంఖ్య— | 772 |

ఇందలి కథ:— పూర్వము 'బృహత్సేనుఁ' డను రాజు 'ప్రకటజనపద మౌక్తిక నికర సహిత రాజధానీ మణినిగూడి రమ్యమగుచు పుడమి ముద్దియ దాల్చిన తొడవునాఁగ దేజమలరంగ గన మద్రదేశము'—ను పరిపాలించుచుండెను. ఈతని భార్య 'విభావతి'. సంతాన రహితుఁడై నందులకీ రాజు మిక్కిలి బాధపడుచుండును. ఒకదినము దేవర్షియైన నారదుఁడు వచ్చి రాజు చెప్పిన విషయముల నన్నియు విని యాతని పుత్రరహిత బాధను తెలిసికొనినవాడై 'వాణి' యను నొక చిలుక నొసంగి దీని నల్లారుముద్దుగ బెంచిన నీకు సంతానము కలుగునని చెప్పి ఆ శుకముయొక్క విద్యావైదుష్యములు—గొప్పతనమును వివరించి వెడలిపోయెను. కొంత కాలము తరువాత వీరి కొక స్త్రీ శిశు వుదయించును. ఆమె సకలసద్గుణలక్షణ గావున 'లక్షణ' యను పేరిడిరి. ఆమె పెద్దయైన తదుపరి బృహత్సేనుఁడు ఒక మత్స్యయంత్రమును నిర్మించి దానిని పడగొట్టిన వానికి తన కూతు నొసంగి పరిణయము చేసెదనని చాటించెను.

ఇంతకుపూర్వమే యా 'వాణి' యను శుకము విహారార్థమై యనేక పట్టణముల సంచరించుచు ద్వారకయందు శ్రీకృష్ణుని దర్శించెను. తిరిగి తన రాజధానీ నగరమునకు వచ్చి లక్షణకు కృష్ణునిగూర్చి చెప్పును. ఆమెయు ఆతని రూపరేఖా విలాసాదుల కచ్చెరువడి ఎట్టులైన నాతనినే వివాహ మాడవలయునను దృఢాభిప్రాయముగలదై యుండి—ఆ చిలుకతో ఎట్టులైన శ్రీకృష్ణుఁడు తనను వరించునట్లు చేయుమనును. శుకము లక్షణాకృష్ణుల మధ్య రాయబారిగా నుండి వివాహమున కొడబరచి కృష్ణుని మత్స్యయంత్రము పడవేసి లక్షణను పరిణయ మాడునటుల ఒప్పించును. బృహత్సేను నమమతి ననుసరించి నంద

నందనుండా మత్స్యయంత్రమును పడవేసి లక్షణను పరిణయమాడును. దీనిని చూచి ఇతరిత రాజన్యు లీర్ష్యాళులై కృష్ణునితో యుద్ధము చేయుట, కృష్ణుండే గెలుచుట మొదలగు (ప్రధాన) విషయ మంతో గూడినది.

సంస్కృతాంధ్ర హరివంశములయందీ కథ ప్రత్యేకముగలేదు. తాళ్ళపాకవారి అష్టమహిషీ కల్యాణమున నీ కథ గలదు అది ద్విపద ప్రబంధము—(శ్రీకృష్ణుని యష్టమ మహిషి యగు 'లక్షణ'). అందు ననేగాక 1550 కి పూర్వుడైన రెడ్డిపల్లె ముద్దురాజు అను నాతఁడొక యష్టమహిషీకల్యాణమును వ్రాసినట్లుల తెలియుచున్నది.[1] ఐనచో తాళ్ళపాకవారిది రెండవ ప్రబంధమగును.[2] ఇవియేగాక చెంగల్వకాళకవి రాజగోపాలవిలాస మొకటి గలదు. ఇందు కవి కృష్ణుని యష్టపట్టమహిషులను అష్టవిధశృంగార నాయికలుగ చిత్రించినాడు. ఇవియేగాక నింకను కొన్ని 'లక్షణాపరిణయము'నుపేర నున్నటులు తెలియుచున్నది.[3] వీనిలో నెందును 'శుక రాయబారము' 'శుక వృత్తాంత ము'న్నటులలేదు. నందనందన విలాసమునందుమాత్రము కవి కల్పితమనియే చెప్పనచ్చును. ఇందుకు శ్రీనాథుని 'హంస', పింగళి సూరన 'శుచిముఖి'—కారణములు గావచ్చును. ప్రబంధములయందలి కొన్ని అనూచానము లైన స్వప్నాద్యాచారములవలె ఈ పక్షుల రాయబార మొకటి వ్యాప్తి గాంచినది.

ఈ కవి చిలుకను ప్రబంధమున ప్రవేశపెట్టి లక్షణకు విలక్షణముగా సులక్షణుండైన వరునితో కల్యాణము చేయించి తన ప్రబంధమున కొక ప్రత్యేకత నాపాదించుకొనినాఁడు.

నందనందన విలాసమను నీ ప్రబంధమునే లక్షణా కల్యాణమందురు. ఆశ్వాసాంత్యగద్య ఈ విధముగ గలదు.

గద్యము :—"ఇది శ్రీ సమంచిత నిగమగిరి పంచ జన పంచానన చంచత్పదకమల సంచలచ్చంచరీక శ్రీమన్నృసింహ గురుకృపాసంచిత విద్యాసంచయకంచుకిత చతుర్విధ కవితావిరించన శ్రీ వత్సాయిత శ్రీవత్సకుల శుక్తిముక్తాఫలముక్తాఖిల దుర్విషయ నికురుంబ కుకవిజనతాచలశంబ ముడుంబి రామానుజార్య కుమార వర్య సంతతార్య సేవాకారి లక్ష్మణసూరి విరచిత 'లక్షణా కల్యాణం'బను నామాంతరమ్ముగల నందనందన విలాసం బను సుప్రసిద్ధ[illegible]...ఆశ్వాసము. దీనినిబట్టి కవి యొక్క [illegible] లక్షణా పరిణయమనియు, నందనందన విలాసమనియు రెండు పేర్లున్నట్లు తెల్లమగుచున్నది. ([illegible] [illegible] రెండు [illegible] [illegible].[4] ఇందొక పుస్తకము మాత్రము [illegible] పరిశోధన మందిరము [illegible] చేయుచున్నది. ఇట్టి గ్రంథములకు [illegible]!)

ప్రబంధ ప్రాశస్త్యము: ఇతర ప్రబంధములయందు [illegible]—ఒక [illegible] వృత్తాంతమును దీనికొని [illegible] దీనిని ప్రశస్త ప్రబంధముగ నొనరించి తన కవితా ప్రౌఢ్య

---

1. అష్టమహిషీ కల్యాణము: రెడ్డిపల్లె ముద్దు రాజు (1550 కి పూర్వుడు). ఇందలివి రెండు పద్యము (గద్యపద్య ప్రబంధము)లు మాత్రమే లభ్య మైనవి. 'ప్రబంధ రత్నావళి' (ముద్రణ 1918 పుట 107). సంపాదకులు — పండిత ప్రభాకరులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

2. అష్టమహిషీ కల్యాణము—(ద్విపద) తాళ్ల పాక తిరువేంగళనాథుఁడు. 'అష్టమపట్టమహిషి— లక్షణాదేవి వివాహ వర్ణన' (పు. 267—284) తిరుపతి దేవస్థానంవారి ప్రచురణ—1936).

3. లక్షణా పరిణయము :—1. గుడిపూడి ఇందుమతీదేవి
,, 2. తిరుపతివేంకటకవులు
,, 3. శృంగారకవి సర్వా రాయుఁడు.

చూ. ఆంధ్ర వాఙ్మయ సూచిక-(1929) పుట—177. సంపాదకులు —దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు. (పద్యప్రయోగ సూచికలే గాక ఈ కాలమున వాఙ్మయ సూచిక లెంతేని యవ సరమని తెల్పుటకు—పై సూచికయే పరమప్రమాణము)

4. A. నంద నందన విలాసము— మణింగంటి సింగరాచార్యులు (అలభ్యము). B. శార్మరీ నంద నంద నందన విలాసము—వాత్స్య శ్రీ రంగాచార్యులు (200 ఏండ్ల క్రిందటివాఁడు.) గోలకొండ కవుల సంచిక— (పు 414 క. సం. 162)

మును వ్యక్తపఱచినాఁడు. ఇంతియేగాక వర్ణనలును చాంచర్యముగ—వినూత్న పద్ధతిలోచేసి ప్రత్యేకత చాటి నాఁడని చెప్పవచ్చును. **వర్ణనలు:** పురపరిఖాదులు, పుష్పవాటికలు, ఘటులు, మొదలగునవియేగాక ప్రత్యేకముగ 'హేమంతరుతు వర్ణన' (2 ఆ—47 పద్యము నుండి—86 వరకు) 'వసంతరుతు' (3—48—50. పెద్దవచనము—శ్లేషతో వనవిహారము) 'దశదోహద ములు' 'పుష్పాపచయము' (రగడ) 'జలక్రీడ' 'సాయంకాలవర్ణన' వీనినన్నింటిని కడుంగడు హృద్యముగ—వివిధ వృత్తములలో వర్ణించెను.

**ఛందోవిశేషము :** ఇందు చంపకోత్పలములు హెచ్చుగ గలవు.సుప్రసిద్ధమైనవియు — బహుళ ప్రచారమునందున్ననియేగాక మారుమూల వృత్తములను సైతము హెచ్చుగ వాడినాడు—'మణినికర వృత్తము,' 'నరకప్పిణీ వృత్తము' 'మదనదర్పణ వృత్తము' 'ఫలసదన వృత్తము' ఇత్యాదులిందు కుదాహృతములు.

కవి యాశ్వాసాంత్య గద్యయందు 'చతుర్విధ కవితావిరించి'నఁడని చెప్పుకొనుటంబట్టి చూడగా నీతనికి తత్కవిత్వరీతులయం దభిమానమేగాక ప్రావీణ్యము సైతమున్నటుల ప్రస్తుత 'నంద నందన విలాసము' వలన సువ్యక్తమగుచున్నది.

ఈ చతుర్విధ కవిత్వముల గూర్చిన ప్రస్తావన ప్రథమముగ నన్నయ భారత భాగాదివలన తెలియుచున్నది. తరువాత శ్రీనాథాది కవులు దీనినుట్టంకించిరి. చతుర్విధ కవితలనగా 'ఆశు, మధుర, చిత్ర, విస్తరము' లని యభిప్రాయము. "నన్నయ భారతావతారికయందు 'మృదుమధుర చిత్ర విస్తర నవరస భావభాసుర కవితా రచనా విశారదులైన మహాకవులు'న్నట్లు ఆదిపర్వము (1 –8) లో చెప్పియున్నాఁడు. దీనినే శ్రీనాథమహాకవి నైషధములో (1 –11) 'మృదుమధుర చిత్రవిస్తర కవితావిలాస వాగీశ్వరులగు కవీశ్వరులును' అని యనువదించినాఁడు. నన్నయ శ్రీనాథులిరువురును నాశువునకును 'మృదువు' అను పేరును వాడియున్నారు. తక్కినవారు పై రీతినే ఆశుమధుర చిత్ర విస్తరములని పేర్కొనిరి. అప్పకవి (1656) నాటినుండి యీ సంప్రదాయము మరుగుపడి 'ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వ'మను మతభేద మేర్పడినది. అయినను చాలమంది కవులును లాక్షణికులును ప్రాచీన సంప్రదాయమునే పాటించిరి[6]—". 'తెనుఁగు లాక్షణికులలో' వార్తా కవి రాఘవయ్య తన లక్షణ దీపిక యను గ్రంథములో నీకవితాస్వరూపములు చక్కగా వివరించినాఁడు. ఈతఁడు 1600 ప్రాంతమువాఁడు—[7]' ఈవిధమైన చతుర్విధ కవితలను హెచ్చుగ చెప్పినవాఁడు ఏకాశ్వాస ప్రబంధమైన 'ప్రబంధ రాజవేంకటేశ్వర విజయవిలాస' కర్తయగు గణపవరపు వేంకటకవి. ఈతని తరువాత కొన్ని గ్రంథములు బయల్వెలినవి.[8], అధునాతనకాలమున అభినవాంధ్ర కవితాపితామహులైన మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి 'ప్రబంధసంబంధ నిబంధన గ్రంథము', కొక్కొండవారి 'బిల్వేశ్వరీయము'లును పేర్కొనదగినవి— వీనివలన పూర్వమేగాక అధునిక కవిత్వచ్ఛాయలావరించి వ్యాప్తిగాంచిన యీ కాలమున సైతము ఇట్టి కవిత్వము గలదని వ్యక్తమగుచున్నది.

ప్రస్తుత ప్రబంధకర్తయగు లక్ష్మణాచార్యుఁడు బహువిధ బంధములవాఁడి—చిత్రకవిత్వ విస్తారమును తెల్పినాడు — ఉ॥ 'వాణీపద్మాంబారతిదరధ్వనితాళ' మధురగతి గర్భోత్పల మాలావృత్తము''—(5—139) దాని నిట నుదాహరించుచున్నాను—

> 'శ్రీ నిధి సింధుభంగ స్థిరశీతల
> భాషణ చిత్రవిక్రమా
> జ్ఞానిపకందదేహ ఖరఘాత
> విభీషణ గాత్రజాంగజా

---

5. ఈ చతుర్విధ కవితలగూర్చి కొద్ది భేదములు గలవు. చూ. 'తెనుఁగు ఛందోవికాసము'— శ్రీ సంపత్కుమారాచార్య M. A., B. Ed.

6. 'ఉదాహరణ వాఙ్మయ చరిత్ర'—శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు (పు-9) ముద్రణ 1950.

7. వీనిని గూర్చిన విశేషములు—యథామాత్యకముగ తమ 'యుదాహరణ వాఙ్మయ చరిత్రము'న శ్రీ నిడుదవోలు వెంకటరావుగా లొసంగినారు. జిజ్ఞాసువులందు చూడవచ్చును. (పు-10-12). ఇందునుండియే 'ఛందోవికాసము'నందు శ్రీ సంపత్కుమారాచార్యులవారు యథాప్రకారముగ నుట్టంకించిరి.

8. గుడారు వెంకటదాసకవి— 'ప్రబంధ రాజశిరోభూషణ ప్రకృష్ట బలరామచరిత్ర' అందు ముఖ్యమైనది. గణపవరపు వేంకటకవి గ్రంథమునజూచి యంతకన్న నుత్కృష్టముగ వ్రాయవలెనని వ్రాసినదీ గ్రంథము.

వానర వందితాంఘ్రి వరవాతజ
పోషణ పత్రికేతనా
జ్ఞానద చందనాంగ శరజాత
విభూషణ ఛత్రధారణా.'

(విస్తరభీతిచే నిందలి వృత్తముల నుదాహరింపలేదు.)

ఈ కవి చతుర్థాశ్వాసమునందు 'నిరోష్ఠ్య గణ సమదండకము'ను వ్రాసినాడు. నాకు తెలిసినంత వరకు 'నిరోష్ఠ్య దండకము'ను వ్రాసినవారిలో ప్రథముడు 'సింహాసనద్వాత్రింశి'కా కర్తయగు కొఱవి గోపరాజు. దండక రచనము ఆంధ్ర మహాభారతము నందలి అరణ్యపర్వరచనతో నారంభమైనది. ఇటీవల నీ దండకములగూర్చి ప్రత్యేక పరిశ్రమ చేసినవారరుదు. రావూరి దొరస్వామిశర్మగారు తమ 'తెలుగు భాషలో ఛందోరీతులు' అను గ్రంథమున కొంతవరకు తెలిపిరి.[9] దండక మండలిని నేటి కాలమున ప్రత్యేక పరిశ్రమ యెంతేని యవసరము.

నందనందనవిలాసము నందలి శైలి తెలియుటకై ప్రతియాశ్వాసమున నొక పద్యము చొప్పున నుదాహరించి—ఈ వ్యాసము నింతటితో విరమింతును.

రాజిలుచుందు రప్పురిని రాజులు
వైభవనిత్యభోగతా
రాజులు సద్గుణాది గుణరాజులు
వక్త్రవిలాస పూర్ణిమా
రాజులు భాగ్యయక్షకులరాజులు
సూక్ష్మకుశాగ్రబుద్ధిగో
రాజులు దుష్టకుండలి విరాజులు
ధూత పరాజు లెప్పుడున్. (1—78)

రాడ్ధరివంశ దుగ్ధ జలరాశిని
శాపనిశాపదబ్జ భూ
రుడ్ధరిణేక్షణాకుచమరుత్కుధరా
గ్రభరాభ్రగాళి దృ
క్ప్విడ్ధరి నీలమందిర దతిచ్ఛ
వి దేహ విదేహ రాణ్ముఖే
లేడ్ధితదాయకత్వవిబుధేశ
పలాశి పలాశి నాశనా. (2—130)

సీ॥ రవిగభస్తివికసద్భువనజవ్రజలస
న్మధుర సంభ్రమిత సద్భ్రమరకంబు
చటులంచక్రవాంకకుక్కుటకపోతకాదు
ద్బకముఖద్విజరవ ప్రాభాతంబు
సహకారతరుషు రచ్చవజాలగహ సము
త్ప్రాయుణయుద్బుదజాగుచ్ఛదిలంబు
సతత నిర్భరతర స్ఫుటన పుష్పకణ ప
క్షిత కపిద్ధ పకుళక్షితిరుహంబు
నాశబాలోత్రిద్దోలాస్త సుజకుసుం
గంధ సంఘుష్ణ స్వాంతబంభరాంగ
జాలపీడాప్రవాసపాక్షస్వగేహ
యాతపాఘంబుఘనకమలాకరంబు॥ (3—90)

గుణితక్రమము:

నవపీతాంబర నారదస్తుత
నితాంత క్రీడనీలాంబుద
చ్ఛవినుత్యస్తన మాతనామృతవచ
శ్చాతుర్య నేత్రక్షరా
ద్భవ నైపుణ్య నిదాన నో క్రతదురాపా
నౌకభూతాంఘ్రిదు
ర్భవ వారాన్నిధితారనందసుత
నర ప్రధ్వస్త సచ్చంపకా॥ (4-96)

అతివ తనుకుచనాభిరోమావళులను
నాలుగైదారువేయియాననము లున్న
యల కనకగర్భ గిరిశ గుహాహిపులకు
నైన గణుతింపగను శక్యమౌనె జూడ॥ (5—37)

పూర్వకవుల నీతఁడు చాల స్థలములయం దనుకరించెను. ఇవియేగాక—ఉద్యానవన, అటవీ వర్ణనల కడుంగడు రమ్యముగ నొనరించినాడు. వీనిని వ్యాసవిస్తరభీతిని నుట్టంకింప జాలనైతిని. కాని — 'కవితనేరుపు యతికూర్పుకైపు దెలుపు' అనునట్లు ఈతఁడు సుప్రశస్త వృత్తములతో ప్రబంధమును సుప్రశస్తముగ నొనరించెను.

9. దండక వాఙ్మయము — విశేషములు — శ్రీ రావూరి దొరసామిశర్మగారు—M.A, B.O.L. 'ఆంధ్రపత్రిక—సంవత్సరాది సంచిక.'

దండక వాఙ్మయము — శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు. ('పరిశోధన' 1955, ఏప్రిల్-మే.)

# రేపటి మనిషి

శ్రీ ఆదివిష్ణు

నాకు భగవంతం చిన్నప్పట్నుంచీ తెలుసు. అతన్నాతోపాటు కొన్నేళ్లు చదివాడు. మా యింటి దగ్గరే అతనిల్లు. అతనుంటున్న యిల్లు చాలా పాతదవడం మూలంగా శిథిలావస్థలో వున్నట్టవుపిస్తుంది. అయితే ఆ యిల్లు గట్టిదిగనక యింకా అలా నిలబడి వున్నది. భగవంతానికి ఆ యిల్లంటే చిరాకు. అందుచేత అతను ఎక్కువ కాలాన్ని రోడ్డుమీద స్నేహితులతోనే గడుపుతూండేవాడు. భగవంతానికున్న కొన్ని కోరికల్లో మొదటిది అందమైన యిల్లు!

భగవంతంవాళ్ళనాన్న పెద్ద ఉద్యోగి కాడు. మా వూళ్ళోనే వున్న లాయరు వెంకటరత్నం చౌదరిగారి కాయన గుమాస్తా. వెంకటరత్నంచౌదరిగారికి మా వూళ్ళో పెద్ద పలుకుబడి వున్నది. గొప్ప ఆస్తిపరుడు.

వెంకటరత్నం చౌదరిగారంటే భగవంతానికి మంట.

అతన్నాతో అనేవాడు—

'మా నాన్నకి నేను కొడుగ్గా పుట్టవలసినవాడిని కానేకాను. నా దురదృష్టంకొద్దీ నే నిక్కడీయింట్లో పురుగునై పుట్టాను. అవునా సుబ్బారావూ—నేనేగనక వెంకటరత్నంగార్లాంటి జాతి మనుషులకి పుట్టినట్టయితే సాక్షాత్తు స్వర్గంలోని దేవతలు నాకు దాసోహమనేవారు. ఖర్మ కాపోతే ఏమిటిది? దేవుడు నన్ను దీనాతిదీనుడివి కమ్మని దీవించాడు. చూడబ్బాయ్—ఇంత వయసొచ్చినా అనుభవించే రాత నోచుకోలేకపోయాను. నే నిప్పట్నుంచే కొన్ని ప్రయోగాలు ప్రారంభించాను. నా చుట్టూతా తిరిగే గొప్ప మిత్రులంతా వొట్టి దద్దమ్మలు. ఆ ఫూల్స్ ద్వారానైనా నేను వెలుగులోకి రావాలేగాని, అప్పుడు నా నిజస్వరూప మేమిటో నువ్వు ఖచ్చితంగా చూడగలవు.'

భగవంతానికి గొప్పవాళ్ళమీద భయభక్తుల్లేక పోగా విపరీతమైన 'కసి' వున్నది. నేను గొప్పవాడిని కాదు గనక అతన్నాకీ విషయాలన్నీ నిర్భయంగా చెబుతూండేవాడు. అతనలా చెబుతున్నప్పుడు నాకు భయంగానూ వుండేది.

భగవంతానికున్న చొరవగానీ, ధైర్యంగానీ నాకు లేవు. నేనుత్త గంగిరెద్దు మనిషినని మా వాళ్లతోపాటు పరాయివాళ్ళుగూడా వొప్పేసుకున్నారు. అందుచేత నేను ప్రమాదమైన జంతువునికాదు. చాలా మామూలు మనిషిని!

ఇక్కడే నేనో ఉదంతం చెప్పదలిచాను.

నా కిది బాగా గుర్తు. ఆ ఏడాది మేమంతా డిగ్రీక్లాసులో ఆఖరి సంవత్సరం చదువుకుంటున్నాము. పరీక్షలు దగ్గరపడటం మూలంగా చాలా కష్టపడి చదువుకుంటున్నాము. ఆ రోజుల్లో ఓనాటి రాత్రి పదకొండుగంటల క్కాబోలు భగవంతం తమ్ముడు చిన్నా నా దగ్గరకొచ్చి అన్నాడు.

'మీరు తొందరగా మా యింటికి రావాలి సుబ్బారావుగారూ!'

కారణం అడక్కుండానే అతనే చెప్పుకొచ్చాడు.

'అన్నయ్య ఏడుస్తున్నాడు. నాన్న కారణం అడుగుతే చెప్పడంలేదు. మా యింట్లో ఎవరడిగినా ఏమీ చెప్పకుండా ఏడుస్తున్నాడు. మిమ్మల్ని వెంటబెట్టుకు రమ్మని నాన్న నన్ను పంపాడు. రండి తొందరగా.'

నేను ఆశ్చర్యపోయాను. సాధారణంగా భగవంతం ఏడవడు. చిన్న చిన్న విషయాల నతను పట్టించుకోడసలు. ఏదో పెద్ద ఉపద్రవం కలిగిందేమోనని నేను భయపడ్డాను.

భగవంతం వాళ్ల నాన్న నన్ను చూస్తూనే కళ్లు తుడుచుకుని అన్నాడు—

'రా, బాబూ! రా, నీ కోసమే చూస్తున్నాను. అదుగో, ఆ దక్షిణం గదిలో వాడున్నాడు. వెధవ, పసి పిల్లాడిలా ఏడ్చేడ్చి యిప్పుడే కొంచెం కుదుటపడ్డాడు. వెళ్ళు బాబూ, వెళ్ళు. వెళ్ళి వాడి నోదార్చి కారణం కనుక్కో. ఫర్వాలేదు. వాడికేం కావలసినా నేనున్నాను. కొండమీది కోతినైనా సరే తీసుకొస్తాను. వాడికేం కావాలో కనుక్కో. వాడేం కోరినా ఫర్వాలేదు. నేనున్నాను. అంతేగాని, నేను బ్రతికుండగా వాడు ఏడ్చేందుకు వీల్లేదని చెప్పు. నేనది సహించలేను. వాడు ఏడవ కూడదు సుబ్బారావ్, వాడు ఏడవకూడదు. వాడికోసం నేనేమైనా చేస్తాను. అలా అని వాడికి గ్యారంటీ యివ్వు. తొందరగా వెళ్ళు నాయనా.........'

ఆయనీరకంగా చాలాసేపు మాటాడినప్పుడు నా మనసు చివుక్కుమన్నది. ఆయనకి భగవంతం మీద గల వాత్సల్యాన్ని నే నెంతో శ్లాఘించాను. కానీ, ఆ వాత్సల్యానికి గూడా ఒక హద్దుండాలి. ఒక రాజ కుమారుడు బంగారు ఏనుగ కావాలని గారాం చేసి నప్పుడు, రాజమాత ఎంతో ముచ్చటపడి, ఆ ఏనుగుని రప్పించినంత 'స్థితి' లో ఆయనకున్న ఆవేశాన్ని ప్రదర్శించారే తప్ప—భగవంతాన్ని మెప్పించేందుకు ఆయన 'హోదా' చాలదని నే నప్పుడేకాదు ఎప్పుడూ అనుకుంటూ వుంటాను.

'అయ్యా ప్లీడరు గుమాస్తాగారూ! ఏమిటి సార్ మీరు మాట్లాడేది. భగవంతం మీకు కొడుకైతే కావచ్చు గానీండి, అతని హోదాగలకోరికలు మీరు విన్లేదు. అతన్ని భరించడం మీలాటి అర్భకులకి చాతొచ్చేది కాదులేండి. భగవంతానికి తృప్తి విలువ తెలీదు సార్! అందుచేత భగవంతం ఈ జన్మకి సుఖ పడడని చెప్పి నేను రాసిస్తాను. హైకోర్టులోనే కాదు, సుప్రీం కోర్టుకు వెళ్ళినా దానికి తిరుగు లేదంతే! మీరేం బుర్ర పాడుచేసుకోవద్దుగానీ, వొదిలేయండి. ఎవడికెంత రాసిపెట్టివుందో అంతే జరుగుతుంది!'

నేను భగవంతం గదిలోకి వెళ్ళాను. భగవంతం ఓ కిటికీ దగ్గిర కూర్చుని మొహాన్ని కిందికి వొంచి నేలని చూస్తున్నాడప్పుడు. మనుష్యుల్ని కృంగదీసే చింతనంతా అతనొక్కడే కలిగినట్టున్నాడు. శోకమయ మైన నగరాన్ని కళ్ళారా చూచి వొచ్చి మనసుని పాడుచేసుకున్న సిద్ధార్థుడు వెంటనే గుర్తుకొచ్చాడు నాకు. అవులే, ఒక్క మాట మాత్రం నిజం. ఆరు నూరయ్యేదీ, నూరు ఆరయ్యేదీ భగవంతం సన్యసించడు. అందుచేత నేనింకా ధైర్యంగా వున్నాను.

అతను తలెత్తి చూశాడు. మళ్ళా వెంటనే తల దించేశాడు. తలుపు దగ్గిరిగావేసి అతని దగ్గిరికి వెళ్ళి కూర్చున్నాను. నేనతన్ని ఓదార్చలేదు. నాకో అనుమానం కలిగింది. అందుచేత అడిగాను.

'బాగా చదివావా భగవంతం ?'

అతను తలవూపాడు.

'మరెందుకీ దిగులు?'

అప్పుడు భగవంతం నావేపు సూటిగా చూసి అన్నాడు.

'నేను పరీక్షలు గురించి దిగులుపెట్టుకున్నానని నువ్వెందుకనుకున్నావసలు ?'

'నా మనసు కదొక్కటే తోచిందిప్పుడు.'

'అందుక్కాదు సుబ్బారావ్! పరీక్షలు గురించి నేనెప్పుడూ దిగులుపెట్టుకోను. నా జీవితం గురించి నాకు దిగులెక్కువ. నిజం చెప్పరా, నేను భవిష్య త్తులో బాగుపడి వెలిగిపోగలనా? నాకంత అదృష్టం వుందా? చెప్పు సుబ్బారావ్!'

నాకప్పుడు కోపమొచ్చింది. అందుచేత నేను కటువుగా అన్నాను.

'అందుకే నీతో స్నేహం చేయడమంటే నాకు చెడ్డచిరాకు. ఎదుగూబొదుగూలేని మూడ్రూపాయల గుమాస్తాలాగా ఇప్పట్నుంచే నీకెందుకంత దిగులు? ప్రస్తుతం మనం చదువుకుంటున్నాం. మనముందు నిచ్చెనలూ, పాముణోళ్ళూవున్నాయి. ఈ వైకుంఠపాళీలో మనం నిచ్చెనే ఎక్కుతామో, పాముణోటనే బడతామో యిప్పుడే ఆలోచించకూడదు. ఇప్పుడు మనం చేయవల సింది ఒక్కటే—పుస్తకపారాయణం. ఈ కర్తవ్యం ముందు కానివ్వు. తర్వాతదానిగురించి తర్వాత ఆలో చిద్దాం. ఇటు చూడు భగవంతం! నీకంటే నాదేం పొడిచేసే జాతకం కాదుగదా! నన్ను చూడు. నిమ్మకి నీరెత్తినట్టు నేనెంత ప్రశాంతంగా బతుకుతున్నానో. నాలాగా నువ్వెందుకుండలేవూ?—'

భగవంతం నా మాటకి అడ్డుతగిలాడు.

'నువ్వు, నీలాటివాళ్ళంతా ఫూల్స్‌రా, ఫూల్స్. నేను ఫూల్‌ని కాదు. నేను 'రేపటి మనిషి'ని. కొన్ని పదుంపంవత్సరాల ముందర మనిషిని! నా కోసం, ఆ కాలాన్ని బంగారం చేసుకునేందుకు నేనిప్పట్నుంచే ప్రయత్నించాలి. అవునా, అలాటి దిప్పడేమయిందో తెలుసా సుబ్బారావ్...'

అతనిగొంతు పూడుకుపోతుందని తెలిసి నేను వారించాను కోపంగా—

'ఆడపిల్లలా ఏడవకు. ఏడవకుండా చెప్పదలుచుకున్నది ఖచ్చితంగా చెప్పేయ్.'

'వెంకటరత్నం చౌదరిగారమ్మాయిని నేను ప్రేమించాను!'

ఆమాట వినడంతోటే ఉలిక్కిపడ్డాను. భగవంతం 'ఆశ'ని తెలుసుకుని నేను ఆశ్చర్యపోయాను. ఎంతైనా, మరీయింత పిడ్డారమా? ఈరోజు లెలాటివి? ఎక్కడో కథల్లోతప్ప—ఈ భూమ్మీద వర్గపోరాటం ప్రతిమూల సాగుతూనే వుందిగదా. ఒకరిదగ్గిర కొలువుచేస్తున్న మనిషి కొడుకు ప్రేమించడమా? అందునా ఆ ఖామందు కూతురినా? ఇంత తెగింపా? రాజకుమారి, తోటమాలి కొడుకును ప్రేమించడం కథ; రాజకుమారివి తోటమాలి కొడుకు కలలోనైనా కన్నెత్తి చూడకపోవడం జీవితం. ఈ వ్యత్యాసాన్ని భగవంతం ఎందుకు తెలుసుకోలేదు!

నేనే అడిగాను—

'మరి ఈ ప్రేమసంగతి మీ నాన్నకి తెలుసా?'

'నా ప్రేమ సంగతి మా నాన్నకెందుకు తెలియాలి? పైగా నేను చౌదరిగారమ్మాయిని ప్రేమిస్తున్నానని తెలుస్తే మా నాన్న గుండె ఆగిపోతుంది. మా నాన్న చౌదరి దగ్గిర నేల కంటుకుపోయి బతుకుతాడు. ఇప్పడే ఆ మనిషి ముందు మా నాన్న తలెత్తి తిరగడు గదా! కనక, నిజమేమిటో తెలుసా సుబ్బారావ్, మా నాన్న వాళ్ళింట్లో గుమాస్తాగాడు కాపోతే లలిత నాకు దక్కేది. నా ప్రేమ చచ్చిపోవడానికి ముఖ్య కారణం మా నాన్న. కేవలం ఈ ప్లీడరు గుమాస్తా! షేమ్.'

'అందుకా ఏడుస్తున్నావ్?'

'మరెందుకనుకున్నావ్. ఈ బోడిపరీక్షలు నాకో లెఖ్ఖగాదు. నాక్కావలసిన జీవితం నాకు దొరుకుతే ఈ చదువుల్నీ, ఈ పరీక్షల్నీ అవతలికి తోసిపారేస్తాను.... ప్రేమిస్తున్నట్టు నటించి, నాకు పిచ్చెత్తించి, మరో గొప్పవెధవని పెళ్ళిచేసుకుంటోంది లలిత! ఈ భగవంతం ప్రేమ నెంబర్ వన్. రేపు నెంబరు టూ గూడా నన్ని రకంగానే 'దగా'చేస్తే, నేనేనాటికి బాగుపడేది సుబ్బారావ్! చెప్పు.'

'ప్రేమ లేకపోతే బతకలేవా?'

'బుద్ధిలేని ప్రశ్న. చెబితినిగదా నేను మీలాటి చవటని కాదు కాదనీ. డబ్బులున్న బంగారుపక్షినే ప్రేమిస్తాను. నా గీత బాగుండాలేగాని, దానివల్ల నేనేం సాధిస్తానో నువ్వు కళ్ళారాచూచి అదిరి ఛస్తావ్.'

నేను లేచి నించున్నాను.

'వెళ్ళిపోతున్నావా!'

'నువ్వెందు కేడుస్తున్నానో తెలీక ఓదార్చి కారణం కనుక్కోమని నన్ను మీ నాన్న పంపాడు. నువ్వు మహా గొప్ప మేధావివని తెలిసింది. అందుచేత మరి నోరెత్తకుండా వెళ్ళిపోతున్నాను.'

'నన్ను క్షమించానని మనస్ఫూర్తిగా చెప్పి వెళ్ళరా బాబూ!'

నాకు నవ్వొచ్చింది. హేళనగానే అన్నాను—

'నేను నిన్ను క్షమించడమా?'

'అవును. నువ్వే నన్ను క్షమించాలి. నా వాగుడు నీ మనసుకి కష్టం కలిగిస్తే క్షమించి మరీ వెళ్ళు. అంతేగాని సలహాలివ్వకొరేయ్! నీమీద నాకు అపరిమితమైన గౌరవం సుబ్బారావ్! నువ్వు తలుచుకుంటే నన్ను క్షణంలో మార్చిపారేయగలవు. ఆ పని మాత్రం చేయొద్దని ప్రాధేయపడుతున్నాను. అంతే.'

ఏం చెప్పాలో తోచక తలొంచుకుని వొచ్చేశాను.

—ఆ తర్వాత భగవంతం బి.ఎ. పరీక్ష పాసైనప్పుడుగానీ, అతను ఎమ్మేకి విశాఖపట్టణం వెళ్ళినప్పుడుగానీ నేను సంతోషించలేకపోయాను. నాకు వీలుకాని పై చదువులకి అతను నోచుకున్నాడనే ఈర్ష్య కాదిది.

భగవంతంకొరకు, కేవలం ఆడంబరాలనిమిత్తం ఆ ప్లీడరుగుమాస్తా వినియోగిస్తున్న డబ్బునీ, త్యాగాన్నీ చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతుండేది. కొడుకు ఉజ్జ్వల భవిష్యత్తు నిమిత్తం తండ్రి ఎన్నెన్ని త్యాగాలు చేసినా, ఎంత నెత్తురు ఖర్చుపెట్టినా విచిత్ర మనిపించదు. కాని, తండ్రి వాత్సల్యాన్నీ, ప్రేమనీ ఆధారం చేసుకొని అర్థంలేని విలాసాల్లో మునిగే కొడుకు ప్రవర్తన నాక గిట్టదు. భగవంతం విశాఖపట్టణంలో వెలిగిస్తూన్న జీవితం నాకెప్పటికప్పుడు మిత్రులద్వారా తెలుస్తూనే వుండేది. ఇక్కడ వాళ్ల నాన్న వేంకివేలు అప్పులు చేస్తుండడం గూడా గమనించిన మనిషిని గనక—బొమ్మా బొరుసూ రెండూ చూస్తూన్నాన్నేను.

అరవై అయిదు చివర్రోజుల్లో భగవంతమే నాకో ఆశ్చర్యకరమైన వార్త పంపాడు. మనిషి ప్రేమించాల్సిందే. అదేం బూతు కాదు. అయితే ఆ ప్రేమ వెనక యితరమైన ఉద్దేశం కూడదంటాను.

భగవంతం పెళ్లి చేసుకోబోతున్నాడు. వధువు పేరు పద్మ. పద్మ భగవంతానికి క్లాసుమేటు. ఇంత వరకూ బాగానే వుంది. పద్మ విధవని చదివిప్పుడు భగవంతానికున్న చొరవ ప్రమాదమనిపించింది నాకు.

ఆ ఉత్తరం పుచ్చుకుని భగవంతం వాళ్లింటికి వెళ్లాను. అంతక్రితమే, భగవంతం చేయనున్న ఘన కార్యం తెలిసి ఆతని తల్లి శోక దేవతే అయ్యింది.

'విన్నావా నాయనా సుబ్బారావూ, మా వాడు మమ్మల్నెలా ఉద్ధరిస్తున్నాడో. వంశంలో లేనిపని వాడు చేసేస్తున్నాడు. ఇన్నేళ్ళూ పెంచి పెద్దజేసినందుకు వాడు మాకు చెల్లించే ప్రతిఫలం చూస్తివిగా. వాడి కోసం ఈ మారాజెంత కష్టపడ్డారో నువ్వూ ఎరుగుదువుగా. వాడిని పువ్వులా పెంచేరు నాయనా! కళ్లల్లో పెట్టుకు పెంచేరు. ఆరుగురు పిల్లలున్నారింక. వాళ్లందరి నోళ్లూ కట్టిపారేసి వాడినింత చేసేరు.'

ప్లీడరు గుమాస్తా ఆ శోకదేవతని ఓదార్చ ప్రయత్నించారు.

'ఏడవకే బాబూ, ఏడవకు. నీదంతా పిచ్చి గోల. మనరోజులిలా తగలడ్డాయని నోరు మూసుక్కూచో. వాడినైనా సుఖపడనివ్వు. ఎందుకీరాద్ధాంతం. కాలముంది చూశావు, అదే వాడికి జవాబు చెబుతుంది! ఇవాళ వాడు విధవన్ని పెళ్లాడాడు. రేపేమో... నాయనా భగవంతం! విజ్ఞుడివై పోయావుటరా! పోనీలే నాన్నా. నువ్వయినా సుఖపడు. మా చేయిదాటి వెళ్లావు. నూరేళ్లూ సుఖంగా వర్ధిల్లు చిట్టీ!'

* * *

నాతోపాటు చదువుకుని, ఉద్యోగానికీ—హోదాకీ సంబంధించినంతవరకూ నన్ను మించిన నా స్నేహితు లనేకమంది వున్నారు. వాళ్లని చూచినప్పుడు నేను అసూయ చెందనుగానీ, వాళ్లు నన్ను 'తక్కువ'చేస్తే మాత్రం నేను బాధపడతాను.

రవీంద్రభారతిలో నేనొక నాటకప్రదర్శనకి వెళ్లాను. నాటకం ప్రారంభించేముందు అక్కడ హాజరైన పెద్దలు కొందరు వేదికనెక్కి తెలుగు నాటకాల గురించి మాటాడారు. ఆ వక్తల్లో భగవంతం గూడా వుండటంవల్ల నేనమితంగా సంతోషించాను.

భగవంతం ఆంధ్ర రాజధానిలో కీర్తిప్రతిష్ఠ లందుకున్నాడంటే ఆనందించాను. అతనేక పాంఫిక కార్యకలాపాల్లో చేయి కలుపుతుంటాడని నే నిక్కడి కొచ్చిన తొలి దినాల్లోనే విని వున్నాను.

ఈ సమాజంలో 'అరుదైన' ఒక ఘనకార్యం తెగింపుతో చేసిన ప్రతి తెలివిగల మనిషీ ప్రముఖుడేనని నా ఉద్దేశం. విధవా వివాహం మాటలో సుళువేమో గానీ, అనుభవానికది పరీక్షని నా అభిప్రాయం. అంతటి విలువైన మార్గాన్ని భగవంతం అనుసరించి, తద్వారా అతను వెలిగిపోతున్నాడు.

కొన్నేళ్లక్రితం అతని ఆవేశాన్ని నే నెప్పటికీ మరిచిపోలేను. అతని కలలన్నీ నాకు గుర్తున్నాయి. అతను నమ్మిన సిద్ధాంతాన్ని అతను అనుసరించి లాభం పొందుతున్నాడు. భగవంతం ఎంతకైనా తగును!

ఆ నాటకం పూర్తయింతర్వాత నే నతన్ని కలుసుకునేందుకు బయటకి వెళ్లాను. అతనో నల్లటి కారు పక్కని నించుని సిగరెట్టు కాలుస్తున్నాడు. అతని చుట్టూతా కొందరు మనుషులు నించున్నారు. వాళ్లందరికీ అతను ఏదో విషయాన్ని విపులీకరించి చెబుతున్నాడు. వాళ్లతి శ్రద్ధగా వింటున్నారు.

నేను వాళ్లందరికీ కొంచెందూరంలో నిలబడి

వున్నాను. ఉన్నపళంగా భగవంతాన్ని చేయెత్తి పిలిచేంత చొరవ నా కిప్పుడు లేదు. ఇప్పుడతను ఖరీదుగా ఎదిగి వున్నాడు. అతని మొహంలోనూ, అతను కట్టుకున్న దుస్తుల్లోనూ ఒక వింత వెలుగు, ఒక హోదా స్పష్టంగా కనిపించింది. ఆక్కడికీ అతను నావేపు చూచిన ప్రతిసారీ, నేను అతనితో మాటాడాలనే ఉత్సుకతని సాధ్యమైనంత స్పష్టంగా తెలిజేసు కున్నాను.

కానీ, అతను నన్ను పట్టించుకునే స్థితిలో లేడు. నోటితో పిలవలేకపోయినా, అతని హోదాకి తగ్గ విధంగా కళ్లతోనైనా పలుకరించవచ్చునుగా. అదీ జరగలేదు

అభిమానం చంపుకునేందుకు మనసొప్పక నేనక్కడ్నుంచి కదిలొచ్చేశాను. భగవంత మనబడే ఓ ప్లీడరు గుమాస్తా కొడుకు—జాతకం తిరిగి ప్రముఖుడైనంతమాత్రాన యింత తలబిరుసా? మనిషి బుద్ధే యింతా? లేక అది కొందరికే వర్తిస్తుందా?

అతను బంగారాన్నే తింటూండవచ్చు; అతను అమృతాన్నే ఆరగా ఆరగా తాగుతూండొచ్చు; అతను ఇంద్రభవనంలోనే కాపురం వుండొచ్చు—అతని అదృష్టానికి నేను ఈసు చెందను. కానీ, చిన్ననాటి మిత్రుడిన్నేను. ఇది అతనెందుకు మరిచిపోయేడు?

నే నిన్ని అనుకున్నతర్వాత గొప్పవాళ్లందరిమీదా నాకు కోపం వొచ్చేసింది. నా ముందునుంచి పోతూన్న ప్రతి కారునీ, ప్రతి ఖరీదైన మనిషినీ కసిగా చూశాను. చాలాదూరం నడిచి వొచ్చేసింతర్వాత నా వొక్క కోపానికీ, అల్పత్వానికీ సిగ్గుపడ్డాను.

చిక్కడపల్లి దగ్గర పడుతూండగా, నా వెనగ్గా కారు హారను వినిపించింది. ఉలిక్కిపడి రోడ్డుకి పక్కగా తొలిగాను. పేవ్‌మెంట్‌మీద నిలబడి పోయాను. ఆ కారు సరిగ్గా నాముందుకొచ్చి ఆగింది.

ఆ కారులో భగవంతాన్ని చూశాను. నా మనసులో గూడు కట్టుకున్న శంకలన్నీ మటుమాయమై పోయాయి. చాలా ఆనందంగా నవ్వగలిగాను.

డ్రైవరు వెనక తలుపు తెరిచి నించున్నాడు.

'రా, వొచ్చి నా పక్కన కూచో!' అన్నాడు భగవంతం.

ఒక్క గెంతులో కారులోకొచ్చి కూర్చున్నాను. నేను కూచున్న తర్వాత కారు కదిలింది.

'దేవుడిలా కనిపించి, మళ్లా అంతలోనే మాయమైపోయావు. నువ్వు హైదరాబాద్ వొచ్చినట్టు తెలిసింది కానీ, కలుసుకోడం పడలేదు. ఎక్కడుంటున్నావ్ ?'

'చిక్కడపల్లిలో.'

'భార్యా పిల్లలూ...'

'వాళ్లంతా బందరులోనే వున్నారు. రేపాదివారం వెళ్లి తీసుకొస్తాను.'

'అంతా క్షేమమా ?'

నేను తలూపాను. ఆతనో సిగరెట్టు నాకిచ్చాడు. అతనూ ఒకటి ముట్టించి పొగని నింపాదిగా వొదిలి అన్నాడు.

'మావగారి బిజినెస్‌లో చేరాను. లక్షల మీద సాగుతోంది. మొన్నీమధ్యనే నాకోసం ఒక ఇల్లు కట్టించారాయన. కొడుకైనా, అల్లుడైనా—నేనొక్కడ్నే. ఎలా వుంది నా కథ ?'

'బాగుంది.'

'ఇంతందమైన కథలో చోటుచేసుకునేందుకు నేనెంత ప్రయత్నించానో తెలుసా?'

'తెలీదు. కానీ, వూహించాను.'

'ఈజిట్ ? అయితే ఆ తమాషా ఏమిటో చెప్పు వింటాను.'

'ఇప్పుడుగాదు, మరోనాడు చెబుతాను.'

'వాయిదా ఎందుకుట ?'

'నేనూహించింది నిజమని ముందుతెలియాలి.'

'ఆల్ రైట్. అలాగే దాచుకో' అన్నాడతను.

మా కారు ఓ అందమైన 'భవంతి' ముందు ఆగింది. ఇద్దరం దిగేము. గేటుదగ్గరున్న మనిషి భగవంతానికి తలొంచాడు.

ఎంతో ముచ్చటైన గదిలో నేనొక్కడ్నీ వున్నాను, పండువెన్నెల్లాంటి లైటు వెల్తురు, సన్నగా చక్కటి

రేడియో సంగీతం; పంకా సున్నితమైన శబ్దం; అదంతా మనసుని అలరించే వాతావరణం. ఇక్కడిలాగే యుగాలు గడిచిపోతే బాగుండుననిపించింది.

భగవంతం బట్టలు మార్చుకు వొచ్చాడు. ఇప్పుడతను దొరబాబులా వున్నాడు. వొస్తూనే అన్నాడు:

'ఒక గంటలో భోజనం రెడీ అవుతుంది. ఆకలిగా వున్నాసరే, నోరుమూసుక్కూచోవాలి, వీలవుతుందా?'

'నిజం చెప్పాలంటే నాకిప్పు డాకల్లేదు.'

'అది ఆరోగ్యానికి మంచిది కాదోయ్ సుబ్బారావ్! పద్మ ఫ్రండ్స్‌తో సినిమాకి వెళ్లిందిట. పరిచయం చేద్దామనుకున్నాను.'

'నిన్ను చూశానుగా — వేరే విగా అవిడ్ని చూడక్కర్లేదు.'

'అదేమిటి?'

'అదంతే. ఒక లెఖ. నువ్వింత ఆనందంగా వున్న మనిషివి. ఒకటీ ఒకటీ రెండు. అవగా...'

'ఆపు. లెఖ్ఖల మాస్టారూ! నీ లెఖ్ఖ తప్పింది. ఒకటీ, ఒకటీ —ఒకటే.'

నాకర్థం కాలేదు. అదోలా అతనివేపు చూశాను. అతనక్కడ్నుంచి లేచి ఓ బీరువా దగ్గిర ఆగాడు. దాన్లోంచి ఓ సీసా తీశాడు. సీసాతో రెండు గ్లాసులూ పట్టుకొచ్చి నా ముందున్న బల్లమీదుంచాడు.

'ఇది మందు. మనిషికి మంచి టానిక్కు. మనిషి ఏడ్చినప్పుడూ, నవ్వినప్పుడూ బాగా పనిచేస్తుంది. దీని ఖరీదు ఎనభై రూపాయిల చిల్లర. వాడబడే మనిషి సత్తాని బట్టి ఈ ఒక్క సీసా ఒకేసారి పుచ్చుకోనూ వొచ్చు, లేదా—అరగా అరగా వారం రోజులూ వాడుకోవచ్చు. సాధారణంగా నేనీ పాళ్లని దృష్టిలో పెట్టుకోను. ఎంత దొరికితే అంతా పుచ్చుకుంటాను. నువ్వు నాకు మిత్రుడివి, అతిథివి. నీకేం అభ్యంతరం లేకపోతే, నీ ముందుంచిన గ్లాసులోకి నీ యిష్టమొచ్చినంత వొంచుకో,' అన్నాడతను.

'నా క్కావలసినంత అభ్యంతరం వుంది. నాకొద్దు.'

'వెల్ సెడ్! చాలమంది చాలావాటికి భయపడి ఛస్తారు. నే తాగితే నీకేమైనా అభ్యంతరమా?'

'వుండదు.'

'దేవుడు నిన్ను కాపాడాలి! చూడు నాయనా సుబ్బారావూ నా విశ్వరూపం! నేను రాసుకున్న నా కథంతా చెబుతాను. నువ్వు నోరు మూసుకుని అదంతా విను. కథ పూర్తయిన తర్వాతనే నీ సందేహాలు వింటాను. తెలిసిందా? భగవంతం కథ ఈ చుక్కతో ప్రారంభం! వినింక.

'ఆఫ్టరాల్ ఓ ప్లీడరు గుమాస్తా కొడుకున్నేను. నా పేరు భగవంతం. ఈ భగవంతానికి ఒక విశాలమైన హృదయముంది. ఆ హృదయంలో బంగారుకల లనేకం. ఈ భగవంతానికి బోల్డు ప్రపంచం వుంది. తమ్ముళ్లూ చెల్లాయిలూ వెరశి ఆరుగురున్నారు. వాళ్లందరి మధ్యా ఆ యింట్లో భగవంతానికి సుఖంలేదు. తండ్రని చెప్పబడే ఆ పూర్ ప్లీడర్ గుమాస్తా జీవితంపరుగుపందెంలో ఆరు దశాబ్దాలు వెనక పడిపోయి ఆయాసంతో అడుగు వేయలేకపోతున్నాడు. ఇది భగవంతానికి ఒక గొప్ప డిస్ క్వాలిఫికేషన్! వింటున్నావా సుబ్బారావ్! ఈ స్వీయ కథ మరో మనిషికి నేను ఛస్తే చెప్పను. నువ్వు నా చెలికాడివి, నా ప్రాణానివి. అందుచేత ఈ ఛాన్స్ నీకు దక్కింది.

'పథకం వేసేను. లలితను ప్రేమించేను. మనకి మనిషి చెప్పుకునే కులాల పట్టింపులేదు. మన క్కావలిసిన కులమొక్కటే, డబ్బు కులం! లలితని పెళ్లాడి వెంకటరత్నంచౌదరీని తిందామనుకున్నాను. లలిత గొప్పనటీమణి గనుక వాచేతుల్లోంచి పారిపోయింది. అక్కడితో ఒక వెలుగు దూరమైంది.

'బి. ఎ. పాసయ్యాను. ఎమ్మేకి వెళ్లాను. బక్క నాన్నని నడుం విరిగేలా తన్ని డబ్బులు మింగాను. ఆ బక్కమనిషి నా గురించి మొదట్నుంచీ తలొంచేశాడు. నాన్నా డియర్ నీ ప్రాణం యివ్వు, దాంతో నాకు పనుందని అడిగితే, అంతకంటేనా చిట్టిపుచ్చుకో బాబూ అనేయగల అతిమంచి దుర్మార్గుడాయన. అందికే పేదవాడు అప్పుల్లో మునిగి యస్ ఓ యస్ అంటున్నాడిప్పుడు. వాటే ఫాల్ మైడియర్ ఫాదర్! నే గాడ్ పనిష్ యూ!

'యూనివర్సిటీలో పద్మ కనిపించింది. దాని మొగుడుపోయి ఆరేడుసంవత్సరకాలాన్ని తెలివిగా వాడుకోవా లనుకున్నాను. పద్మ వివరాలు కనుక్కుని తృప్తి చెందాను. వేట ప్రారంభమయ్యింది. ఏడవకేడవకు పద్మా, నువ్వేడవకు, నువ్వేడిస్తే నేనేమైపోవాలి? పోయిన వాళ్లగురించి మనంయెంతేడుస్తేఏం ప్రయోజనంచెప్పు? లే. నేనున్నాను. ఈ హృదయంలో నీకోసం యింత జాలి, యింత ప్రేమనీ అభిమానాన్నీ దాచాను. అదంతా నీది నీదే పద్మా అని కవిత్వం చెప్పాను. ఎంతకీ నావేపు నుంచే కథ నడిచిందిగాని, అటునుంచి ఒక్కవాక్యం గూడా నడవలేదు. పద్మగాని, మావగాని సామాన్యులు కారు, కారంతే. మగవాడి ఆసరాతో అవసరమున్న పంది పిల్ల పద్మ. బురదనుంచిపుట్టిన పువ్వని భ్రమపడ్డానే గాని, ఆ పువ్వునిండా బురదున్నదని గ్రహించలేక పోయాను. పద్మని పంకజమనీ నీ బొందనీ నేనవేమీ పట్టించుకోను. నువ్వాశ్చర్యపోవద్దురా అబ్బీ!

'ఆల్ రైట్, నేను విధవా వివాహం చేసుకుని సమాజంలో ఒక గొప్పస్థానాన్నీ సంపాయించేసి, మావ గాడి ఆస్తికి వేట కుక్కనైపోయాను. బిజినెస్—ఇక్కడ న్యాయం, అన్యాయం, ధర్మం, అధర్మం ఈ పద్దులేమీ వుండవు. ఉన్నదల్లా డబ్బు. ఆ డబ్బు నెన్నిరకాలుగా, ఎంతెంత గడ్డితిని సంపాయించాలనే తాపత్రయం, అదే వున్నదిక్కడ. పెళ్లాంతో సంబంధంలేదు. పేదనాన్నని తలుచుకునేందుకు టైంలేదు.

'మావ జీనియస్, దొంగని వెతికిపట్టుకుని వాడి చేతిలో తాళం చేతులుంచి, వాడి చుట్టూతా కొందరు భటుల్నుంచాడు. దొంగ వెధవ, ప్రతి మూమెంటునీ మైక్రో ఫిల్మ ద్వారా లాగేసి ప్రాణాలు తినేస్తున్నాడు.

'నా పెళ్లయ్యే ముందు కొన్ని ఆంక్షలు. ముఖ్య మైనది—నాకు తల్లీ తండ్రి గానీ, అక్క తమ్ముళ్ళు గానీ, చెల్లీ అన్నలుగానీ వుండకూడదు. నే నప్పుడు నవ్వేసి 'యస్' అన్నాను. అనక నా పెళ్లి. అనగా ఉరి. ఒరే సుబ్బారావ్! నువ్వూ, నీ లాటి అమాయకు లంతా మంచివాళ్లురా బాబూ! మీకు సుఖాలు తప్ప నీడలు తెలీవు. నేను నీడల్లో వుండి సుఖపడి పోతున్నా నన్రోయ్ అనే భ్రమని మీకు కలిగించేస్తున్నాను.

'నాన్న ఉత్తరం రాశాడు. ఆర్థికంగా చితికి పోయాట్ట. మరేమవుతాడేం? ఎప్పటికయినా ఎగిరి పారిపోయే ఈ పక్షిని నమ్ముకున్న ఆ మని షేమవుతాడేం? మూలధనానికి నష్టం రాదని నా మీద అయన శరీరంలోవున్న ప్రతి నెత్తుటి బొట్టునీ వెచ్చించినందుకు ఏమవుతాడేం? పిల్లవాడిని వ్యాపార లక్షణంగా పెంచాడు. ఆ వ్యాపారం యిప్పుడు దివాలా తీసింది. ఐ. పి. పెట్టేశాడక్కడ. చెల్లి పెళ్లిటరా సుబ్బారావ్! పెళ్లి. తమ్ముడికి క్షయట. అమ్మకేదో తెలీని మాయరోగంట! భయంకరంరా బాబూ!

'నేను ఈ దుఃఖాలు వినకూడదు. ఈ కష్టాలు తెలుసుకో గూడదు. ఇవన్నీ తెలుసుకుంటే మావగాడి వేటకుక్క ఏమైపోగలదో వూహించావా? అందుచేత యివేమీ నాకు తెలీకూడదు. గనక నాకొచ్చే ఉత్తరాలూ, ఖబుర్లూ అన్నీ యిక్కడ సెన్సార్ జరుగుతాయి. ఏవో కొన్ని దారుణాలు మాత్రం అప్పుడప్పుడూ తెలుస్తుంటాయి.

'ఏప్రిల్ పండులా గున్నానని అనుకుంటారు గదరా మీరు? ఓరి వెధవలూ! నా నరనరంలోను స్థానం చేసుకున్న విషప్పురుగుల సంగతి మీకేం తెలుసురా? నేను దయ్యాన్ని, పెద్ద భూతాన్ని. ఈ ప్రపంచంలో జరిగే అవినీతికీ, దుర్మార్గానికీ ప్రతి బింబాన్నేను. మందెక్కువయిన మాటలు కావురా యివి. ఇవాళ నిన్ను చూచిం తర్వాత నా గుండె తలుపులు తెరుచుకున్నాయి. ఓపిగ్గా వినంతే. ఇదెందుకిలా జరిగింది? చెబ్తాను విను.

'నాకు కొన్ని శాపాలున్నాయి. నడుం విరిగిన నాన్న శాపం, కుమిలి కుమిలేడుస్తున్న అమ్మ శాపం; నన్ను నమ్ముకున్న నా చిట్టి చెల్లాయీ, తమ్ముళ్లశాపం. తెలిసిందిరా అబ్బీ! ఇన్ని శాపాలతోపాటు నా దుర్మార్గం. ఇంకెక్కడరా నేను సుఖించేది? ఓరి పిచ్చి! నేను నిత్య దుఃఖితుడినిరా, నాకు సుఖంలేదు. నాకెప్పుడో జ్ఞానో దయం కలిగింది. అప్పట్నుంచీ నేను లోలోన ఏడు స్తూనే వున్నాను. ఎంతో ఖరీదయిన నా కన్నీరు వృధా అవుతూనే వుంది.'

ఇంతకథాచెప్పి సీసావేపు చూచి నవ్వేశాడు.

'అయ్యబాబోయ్! చాలా తాగేశాను' అన్నాడు.

ఆతర్వాత అతను తలని బల్లమీదుంచి వలవలా ఏడవడం ప్రారంభించాడు. నాకు జాలి కలిగింది. అతని భుజమ్మీద చేయివేశాను. నా చేతినతనలాగే పట్టేశాడు. నా చేతితోనే అతని కన్నీరుని తుడుచుకున్నాడు.

'ఎంత చల్లని చేయిరా నీది దుర్మార్గుడా? మా అమ్మ మాటలాగా, మా నాన్న మనసులాగా నీ చేయి ఎంత చల్లనిదిరా సుబ్బారావ్! అదృష్టవంతుడివి. అందికే, నీలో నేను నా వాళ్ళనందర్నీ చూచుకున్నాను. థేంక్స్. వెరిమెనీ థేంక్స్. అప్పుడే నువ్వెళ్ళకు. ఇవాళ మనిద్దరం కలిసి భోజనం చేద్దాం. భోజనం పూర్తవ్వగానే నీకోసం నా కారు రెడీగా వుంటుంది. దాన్లో నువ్వెళ్ళిపో. మళ్ళా నాకు కనిపించకు. నువ్వు కనిపిస్తే—నేనిలా గుండె బద్దలయేలా ఏడుస్తారా! అబ్బీ! అందుచేత నువ్వింక నాక్కనిపించకు. అరే—ఆదేమిట్రా పిచ్చి మాలోకమా? నువ్వేడుస్తావెందుకురా? ఏడవకొరేయ్—నా క్కోపం వొచ్చేస్తుంది. ఏడువకంతే.' అన్నాడతను.

చిత్రం—ఈ మనిషిని నేనెందుకు క్షమించాను?

---



# నారదుని సంగీత మకరందము

శ్రీ ఎల్లాప్రగడ వేంకటనారాయణశర్మ

ఇప్పటివరకున్నా ముద్రింపబడి ప్రచురింపఁబడి యుండినట్టి గ్రంథములలో నారదకృతమైనట్టి యీ "సంగీత మకరందము" అనెడి సంస్కృత గ్రంథము అతి ప్రాముఖ్యమైనట్టిదియగు పురాతన గ్రంథము.

భారతీయ సంగీత, నృత్య, చరిత్రకు అవసరములగునట్టి కొన్ని ముఖ్యవిషయములు:—ఈ గ్రంథపాఠకులు భారతీయ సంగీతనృత్యకళలను గురించి వ్రాయఁబడియుండినట్టి సంస్కృత గ్రంథముల పట్టికను జాగ్రత్తగా పరిశీలించినట్లయితే ఈ సంగీత నృత్యకళా విషయికమగునట్టి వైజ్ఞానికకృషి ఎంతగా పరిశోధన జరిగియుండినదో బోధపడగలదు. గ్రంథములయొక్క జాబితాలో నింకను కొన్ని పూర్వకాలపు ముద్రిత గ్రంథములు: వేణ; మతంగ; కోహళ; తుంబురు, యాష్టిక, విశ్వావసు, హనుమాన్ (ఆంజనేయ), దంతిల (దత్తిల), కంబళ, అశ్వతర, రుద్రట, కాశ్యప, ఉమాపతి[1] గోపాలనాయకాదులగునట్టి వారు వ్రాసియుండినట్టి అముద్రితపు (వ్రాతప్రతుల) గ్రంథములు ఏవియును అందు కనుపడవు. కాని పైన చెప్పబడినట్టి ఆయా గ్రంథములనుండి కొన్నికొన్ని అధికార వివరణములు క్రీ॥ శ॥ 1400—1500 మధ్యస్థకాలమునందుండినట్టి చతుర కల్లినాథుడను నతడు శార్ఙ్గదేవునియొక్క సంగీతరత్నాకరమునకు వ్రాసియుండినట్టి 'కళానిధి' అనెడి వ్యాఖ్యానమునందు ప్రమాణములు (Authorities) గా ఉటంకించి చూపియుండెను. కాని, దురదృష్టవశమున ఆయాలక్షణకారులు రచించియుండినట్టి ఆయా గ్రంథనామములను ప్రత్యేకముగా నాతడు విశదీకరించియుండలేదు. ఆతడు వ్రాసియుండినట్టి సంగీత రత్నాకర గ్రంథ వ్యాఖ్యానము (కళానిధి)లో కోహళుడు[2] రచించియుండినట్టిదగు 'సంగీతమేరు' వనెడి గ్రంథము నుండి ప్రత్యేకముగా నొక అధ్యాయము నంతటినిన్ని ఉదాహరించి చూపియుండెను. ఈ యధ్యాయమునందున కోహళుడు ప్రత్యేకముగ సంగీత (నృత్య) కళాభిజ్ఞులనుగా భట్టతండు, శంభు, సుమంతు, పురారి, క్షేత్రరాజ, లోహిత—భట్ట మొదలగునట్టివారిని పేర్కొనియుండెను. మరియును ఆతడు నారద కృతమగునట్టి నృత్యకళా విషయికమైనట్టిదగు – దేశనృత్తసముద్రము – అను దానిని పేర్కొనియుండెను. మరియు శార్ఙ్గదేవుడు 'బృహద్దేశి' యనెడి యొక గ్రంథమును 'యాష్టిక'కృతమైనట్టిదిగా పేర్కొనియుండెను.[3] ఇంకను మరి కొంతమందిని వారివారి యొక్క గ్రంథ నామములను చెప్పకుండా వారియొక్క పేర్లు మాత్రమే ఉదాహరించి చెప్పియుండెను. ఈ గ్రంథమును గురించి ముందు పరిశోధకులు అనేక విషయములు పరిశీలించి కనుగొని బహిర్గత మొనరింపవచ్చునని యాశింపదగును.

---

1. బరోడా సెంట్రల్ లైబ్రరీవారు మద్రాసు గవర్నమెంటు లైబ్రరీనుండి యొక వ్రాతప్రతినిబట్టి ఉమాపతి కృతమగునట్టిదియగు 'ఔమాపత్యము' అనెడి నాట్యకళావిషయికగ్రంథముయొక్క ఒక ప్రతిని సంపాదించియుండిరి.

2. సంగీత రత్నాకరము. వాల్యూం II లో 670 వ పేజీలో చూడదగినది.

3. సంగీత—రత్నాకరము. వాల్యూం I పుట 154 లో చూడదగును.

యథార్థముగా నీపైనను పేర్కొనబడియుండినట్టి యావత్తు గ్రంథస్థ విషయములను ఆయా వ్రాతప్రతుల నన్నింటినిన్నీ ముద్రించి ప్రచురించి యుండినట్లయినచో సంగీత, నృత్యకళా విషయికముగా మనకు ఎంతయో సారస్వతము యేర్పడియుండెడిదని చెప్పవచ్చును. అందుమూలముగా మన భారతదేశములో సంగీత నృత్యకళా విశేషములయొక్క పుట్టుపూర్వోత్తరములు, వాటియొక్క క్రమాభివృద్ధి, భారతీయ కళావిజ్ఞానములో చరిత్రను వ్రాయుటకు కళావిజ్ఞానులగునట్టి పండితులకు ఎంతయో నుపయోగకరములుగా నుండెడివి. పైన చెప్పబడినట్టి యీ గ్రంథ సారస్వతము మాత్రమేగాకుండా ఇంకను పూర్వములైనట్టివగు వేదములూ, బ్రాహ్మణములూ, ఆరణ్యకములూ, వివిధములైనట్టి సూత్రములూ, స్మృతులూ పురాణములూ, కావ్యములూ మొదలైనట్టి వాని నన్నింటినిన్నీ జాగ్రత్తతో చదివి పరిశీలించినట్లయితే మనకు ఎంతయో వినోదకరమునూ విజ్ఞానదాయకమును అయినట్టి చరిత్రను సృష్టించుటకు చక్కని అవకాశము గలదు. ఇందుకు ఉదాహరణముగా నీ క్రిందను ఆత్రేయక—అరణ్యకమునుండి అప్పటి ఆ కాలమునందుండినట్టి వీణావాద్య విశేషముయొక్క వివరణమునుగురించి అందు చక్కగా చెప్పబడియుండినది.

ఎట్లంటే:—'అథ ఖల్వియం దైవీ వీణా భవతి. తదనుకృతి రసౌ మానుషీ వీణా భవతి. యథాస్యాః శిరఏవ మముష్యా శిరః.యథాస్యా ఉదర మేవ మముష్యా అంభణమ్. యథాస్యై జిహ్వా ఏవమముష్యై వాదనం. యథా అస్యా స్తంత్రయః ఏవ మముష్యా అంగులయః. యథాస్యా స్వరా ఏవ మముష్యాః స్వరాః. యథాస్యాః స్పర్శాః ఏవ మముష్యాః స్పర్శాః. యథా హ్యేవేయం శబ్దవతీ, తర్దృవతీ, ఏవమసౌ శబ్దవతీ, తర్దృవతీ; యథాస్యా నేయం లోమశేన చర్మణా పిహితా భవతి. ఏవమసౌ లోమశేన చర్మణా వా పిహితా లోమశేన హస్మవై చర్మణా పురా వీణా అపిదధతి. సయో హైతాం దైవీం వీణాం వేద విశ్రుత వదనో భవతి. భూమిప్రాఽస్య కీర్తిర్భతి. యత్ర క్వచాద్యా వాచో భాషన్తే విదు రేనం తత్ర ఇతి'' (ఐతరేయారణ్యక-ఆ 3 అం 2 ఖం 5. ఆనందాశ్రమ పుస్తక—పుట 222.)

కనుకను ఈ పైనను వివరింపబడి యుండినట్టి వాక్యార్థ విశేష వివరణమునుబట్టి, అప్పటి ఆకాలమునందున ప్రచారములో నుండియున్నట్టి వీణను గురించినట్టి వివరణాదిక విశేషములు మనకు తెలియుచున్నవి. అందుచెప్పబడి యుండినట్టి అంభణ, వాదన, తంత్ర్యాహి, స్వరాః, స్పర్శాః, శబ్దవతీ, తర్దృవతీ, యనెడి మాటలు వీణాపరముగా నుపయోగింపబడి యుండుటనుబట్టి ఆయా సాంకేతిక పదములు ఈనాటి యొక్క వీణావాద్యము పూర్వపు వీణలో సాదృశ్య సంబంధములుకలిగియే యుండినట్లుగా తెలియుచున్నది. అందు ప్రత్యేకముగా చెప్పబడియుండినట్టి విషయము—అప్పటి ఆకాలమునాటికి అనగా ఆత్రేయ బ్రాహ్మణము వ్రాయబడినప్పటికి పూర్వమునందున వీణయొక్క (కొంత) ఒకానొక ప్రత్యేకభాగము చర్మములో మూయ (కప్పం)బడి యుండినట్లున్నూ, ఆవిధానము ఆ యారణ్యకములో వ్రాయబడినట్టి ఆకాలమునాటికి మరుగు (వెనుకం)బడి యుండినట్లున్నూ దానినిబట్టి మనకు తెలియుచున్నది.

**ఆర్యుల సంగీత విధానముయొక్క ప్రారంభ దశ :** సంగీత కళావిషయిక మగునట్టి వివరణ విశేషములనుబట్టి అందలి విషయములను పూర్వకాలమునందలి పూజాసమయములయందు గాన మొనర్పబడుతూ ఉండెడి 'సామములు' అనబడునట్టి పాటలను అనుకరించి యుండినట్టివియేనని మనకు తెలియగలదు. అట్టి యీసామములను గాన మొనర్చునట్టి విధానము అంతయును మనయొక్క పూర్వ సంస్కృత గ్రంథములయందున నిరూపింపబడియుండి యున్నది. ప్రస్తుతకాలమునందలి గాన విధానమునకు మూలపురుషుడును లక్షణకర్తయును అని చెప్పబడెడి భరతుని కాలమునాటికి పూర్వముండినట్టి ఆ'సామముల'యొక్క గానవిధానము ఏయేవిధానములుగా సంస్కరింపబడి అప్పటికి ప్రచారములోనికి వచ్చి యుండెనో వివరముగా తెలియుటకు అవకాశములేదు. కాని, తరువాత కాలమునందలి ఆయాలక్షణకారులగు నట్టి పండితాగ్రేసరులు అనేకమంది ఆయావిధానము లనుగురించినట్టి మూలవిధానములను గురించి పరిశోధించి, అనేకవిధములుగా మనయొక్క సంగీతపు విధానములను రూపొందించి యుండిరి.

**భరతుని నాట్యశాస్త్రము :** సంగీత కళా విషయకమైనట్టి ముఖ్యలక్షణ గ్రంథము మొట్ట మొదటిగా చెప్పదగినట్టిది భరతునియొక్క నాట్య

శాస్త్రమే యగును. కొందరు ఈ నాట్యశాస్త్రము క్రీస్తునకు అనంతరము నందున ఒకటవ శతాబ్దము నందలి గ్రంథముగా చెప్పుదురు. కాని మరికొందరు నాల్గవశతాబ్దమునందలిదిగా చెప్పుచున్నారు. క్రీ॥ పూ॥ 1 వ శతాబ్దమునుండి క్రీ॥ శ॥ మూడవశతాబ్దము మధ్యకాలమందని కొందరి యభిప్రాయము. పైనను చెప్పబడియుండిన శ్రీభరతునికి అనంతరము నందున చాలమంది సంగీత లక్షణకారులు ఉండియున్నట్లుగా తెలియుచున్నది. అట్టివారి అందరియొక్క కృషిగాని, వారియొక్క గ్రంథములుగానీ, వారి వారి యొక్క జీవిత చరిత్రలుగానీ, మనకు సరిగాతెలియ రావు.

శార్ఙ్గదేవునియొక్క సంగీత రత్నాకర గ్రంథము: అటుతరువాతను ముఖ్యముగా చెప్పదగినట్టి గ్రంథము. కర్త శార్ఙ్గదేవుడు. ఈతని గ్రంథము 'సంగీత రత్నాకరము' ముద్రింపబడి ప్రచురింపబడి యుండినది. ఇయ్యది ప్రస్తుతమునందు మనకు లభ్యముగానే ఉండియున్నది. ఈ గ్రంథమును శార్ఙ్గదేవుడు క్రీ॥ శ॥ 1210 – 1247 మధ్యస్థకాలము నందున ప్రస్తుతము దౌలతాబాద్ అని పిలువబడెడి దేవగిరిని పరిపాలించినట్టి సింహణ నృపతికాలమున నుండినట్లుగా తెలియగలదు. సంగీత విషయకములైనట్టి గ్రంథ రచయితలలో సదాశివుడు మొదలుగాగల దేవతానామములుగాకను, శార్ఙ్గదేవుడు తన గ్రంథమునందున ఈ క్రిందచెప్పబడిన వారిని పేర్కొనియుండెను. భరత, కశ్యప, మతంగ, యాష్టిక, కోహళ, వైశాఖిల, దంతిల (దత్తిల), కంబళ, అశ్వతర, వాయు, విశ్వావసు, అర్జున, నారద, తుంబురు, ఆంజనేయ, మాతృగుప్త, స్వాతి, గుణ, బిందురాజ, క్షేత్రరాజ, రాహుల, రుద్రట, నాన్యభూపాల, భోజరాజ, పరమర్ది సోమేశ మహీపతి అనువారలను పేర్కొనియుండెను. భరతునియొక్క నాట్యశాస్త్రమునకు (వ్యాఖ్యానము) వార్తికములు వ్రాసియుండినట్టి వారిలో లోల్లట, ఉద్భట, శంకుల (క), అభినవగుప్త, కీర్తిధరాదులను పేర్కొనియుండెను.

ఇంకను మరికొన్ని ఇతర గ్రంథములు: సంగీత పారిజాతము, రాగవిబోధము, సంగీత దర్పణము, హృదయకౌతుకము, హృదయప్రకాశము, అనునవి ఉండియున్ననూ, అవి తరువాతను వ్రాయబడినట్టివగుటచేతను అవి లెక్కలోనికి పరిగణింపబడవు. వానికి ప్రథమస్థానము ఇవ్వబడుటలేదు. ప్రస్తుతమున మన సంగీతమకరందము అనెడి యీ గ్రంథముయొక్క కర్త నారదుడు అని గ్రంథముయొక్క వ్రాతప్రతిని బట్టి తెలియుచున్నది. ఈ నారదునియొక్క కాలమునుగాని, జీవితమునుగాని, ఇదమిత్థమని నిర్ణయించుటకు అవకాశము లేదు. ఈ గ్రంథస్థ విషయములనుబట్టి ఆయా విషయములను పరిశీలించి నిర్ణయించుట కొఱకై పాఠకులకే వదలి వారియెదుట బెట్టుచున్నాము.

ఇట్లు ఈ నారదుని గురించినట్టి విషయమును ఆలోచించుటకు ముందుగా నీక్రింది విషయములను గమనింపవలసియున్నది. నారద కృతములు అని చెప్పబడుచున్నట్టి గ్రంథములు మూడు ప్రస్తుతమున కనుపడుచున్నవి. అవి 1. నారదీయ శిక్ష 2. రాగ నిరూపణము. 3. సారసంహిత యనునవి. ఈ మూడింటిలోనున్నూ మొదటిదిగా చెప్పబడినట్టిదగు నారదీయశిక్ష యనెడి గ్రంథము ముద్రింపబడి ప్రచురింపబడి ప్రస్తుతమున లభ్యముగానే ఉండియున్నది. ఆ నారద శిక్షయనెడి గ్రంథముతో నారద కృతమగునట్టి యీ ప్రస్తుత సంగీతమకరందము అనెడి గ్రంథమును పోల్చిచూచి గమనించినట్లయితే ఈ ఇద్దరునూ ఒక్కరేనని చెప్పుటకు వీలులేదు. ఎందువల్లనంటే నారదశిక్ష యనునది సంగీతమకరందమునకంటెను పూర్వపు గ్రంథముగా తెలియుచున్నది. మరియును అందలి భాష వేరుగా నున్నది. ఆ గ్రంథము విశేషముగా సామగానము (వేదగానము)ను గురించి చెప్పుచున్నది. మరి ఇతరములగునట్టి రెండు గ్రంథములను గురించిన్ని నిర్ధారించి చెప్పుటకు వాని యొక్క మూల గ్రంథపు వ్రాతప్రతులు ప్రస్తుతమున లభ్యముగా లేవు. మరిన్ని సంగీత నాట్యకళా విషయకముగా చెప్పబడియుండునట్టి గ్రంథ సూచికలలో (పట్టికలలో) వేరొక గ్రంథము 'సంగీత మకరందము' అనెడి పేరుతోనే కనుపడుచున్నది. ఆ గ్రంథమును 'వేద' (సూరి) యనునతడు రచించియుండినట్లుగా తెలియుచున్నది. ఏమైననూ ఆ గ్రంథకర్తయొక్క నామము 'వేద' అని అందు చెప్పబడియుండుటనుబట్టిన్నీ

'నారద' అని అందుదాహరింపబడక పోవుటవల్లనున్నూ ఈ రెండునూ వేరువేరు గ్రంథములని నిర్ధారణయగు చున్నది. ఈ 'వేద' యను నతడు శివాజీకి తండ్రియగు శహాజీయొక్క కొలువులో ప్రముఖ నాట్యాచార్యుడుగా నుండి యున్నట్లుగా తెలియుచున్నది. ఈతని గ్రంథము షుమారు క్రీ. శ. 1640 ప్రాంతమున రచింపబడి నట్లుగా తెలియుచున్నది. చతురదామోదర కృతమగు నట్టి సంగీత దర్పణము అనెడి గ్రంథమునందలి యుపోద్ఘాతభాగమునందున ఈ విషయమును గురించి చూడ దగును.

**ప్రస్తుత కాలమునందున భారతదేశములో ప్రచారమునందునగల ద్వివిధ సంగీత విధానములు:**—ఈ గ్రంథమును గురించి మనము విచారించుటలో ముందుగా గమనింప వలసినట్టి విషయము ఏమనగా, భారతదేశములో ద్వివిధములగునట్టి సంగీత విధానములు ఉండియున్నవి. ఆ రెండున్నూ: 1. హిందూస్థానీ, లేక ఔత్తరాహిక సంగీతము అనియూ (ఇది ఉత్తర భారత దేశంతో బంగాళా, సింధు, మహారాష్ట్ర దేశములతో ప్రచారముతోనుండి యున్నది.); రెండవ విధానము దక్షిణ భారతదేశమునందువ (కర్నాటకదేశమునందున) అనగా, మద్రాసురాష్ట్రము ఆంధ్రప్రదేశము, తెలంగాణము, కర్ణాటకము, మలబారు (కేరళ) దేశములయందున బహుళముగా ప్రచారములోనుండి యున్నది. మన భారతీయగాన విధానమునందునవైనను చెప్పబడినట్టి రెండువిధానములున్నూ ఎప్పుడు ఎవరి వల్లను విభాగింపబడి అభివృద్ధిని చెందియుండినవో నిర్ణయించుటకు ప్రస్తుతమున అంతగా తగినంతటి ఆధారములు లేవు. ఈ విభాగ విధానము క్రీ. శ. (1210—1247) కాలమునందుండినట్టి సంగీత రత్నాకర గ్రంథకర్తయగు శార్ఙ్గదేవునికంటెను పూర్వముననే జరిగినట్లుగా తెలియుచున్నది.

**ఔత్తరాహిక, దాక్షిణాత్య సంగీత విధానములయందలి భేదములకుగల ముఖ్యకారణములు:**—ఈ ద్వివిధ విధానములయందున్నూ అనేక భేదములు ఉండియున్నవి. ఎట్లంటే రాగనామములు, వాటియొక్కలక్షణాదికములు,(స్వరపాందికలు),గమకవిధానములు, ఉభయ విధానములయందలి రచనా భేద విధానములూ మొదలైనట్టి వెన్నియో గలవు. ముఖ్యముగా నుండియున్నట్టిదగు భేద విధాన మేమంటే: ఔత్తరాహిక సంగీతవేత్తలు రాగములను ప్రాథమికములైనవాటిని ఆరింటిని మాత్రమే చెప్పియున్నారు. ఆ యారింటికిన్నీ ప్రతిఒక్క రాగానికిన్నీ (కొందరు) కొన్ని స్త్రీ రాగములు (భార్యలుగా చెప్పబడియుండినవి. ఇట్టి యీ విధానము సంగీత దర్పణము (చతుర దామోదరకృతము), సంగీత దర్పణము (సోమ భూపాలకృతము) మొదలగునట్టి గ్రంథములయందున అనుసరింపబడియున్నది. కాని, దాక్షిణాత్య (కర్నాటక) సంగీత విధానము ఈ పద్ధతిని అనుసరించియుండ లేదు. ఆ విధానమునందున ప్రత్యేకముగా (మేళములు) రాగములు అనునవి వాటివాటియందలి గ్రహింపబడు నట్టి స్వరభేద విధానముల ననుసరించి విభాగ మొనర్పబడియుండినవి. ఇట్టి యీ విధానమును ముఖ్యముగా సంగీత రత్నాకరమూ, సంగీత పారిజాతమూ రాగవిబోధమూ అనెడి గ్రంథములు పైవిధానమును అనుసరించి వ్రాయబడియుండినవి. అయితే ఈ యొక్క సంగీత మకరందమనెడి ప్రస్తుత గ్రంథమునందున ముఖ్యముగా రెండువిధములుగా రాగవిభాగ మొనర్పబడియుండినది. అందు ముఖ్యముగా ఆరు ప్రముఖ (పురుష) రాగములుగానున్నూ తక్కిన కొన్నిరాగములు వాటియొక్క భార్యలు (రాగిణులు)గానున్నూ చెప్పబడియున్నవి. ఇట్టి యీ రాగవిభాగవిధానమునుబట్టి గనుక మనము చూచినట్లయితే ఈ మకరందము అనెడి గ్రంథము ఔత్తరాహిక పద్ధతికి చెందినట్టిదని తెలుస్తూవున్నది. కాని, ప్రస్తుతము నందలి రాగవిభాగవిధానము ఔత్తరాహిక, దాక్షిణాత్య భేదములు ముఖ్యముగా సంగీత రత్నాకరమూ, సంగీతపారిజాతమూ, రాగవిబోధము మొదలగునట్టి గ్రంథములనుబట్టి చూచినట్లయితే వాటివాటి యందలి లక్షణాదిక భేదములవల్లను ఏర్పడియుండినట్లుగా తెలియుచున్నది.

**ప్రస్తుతమునందలి ఈ మకరంద గ్రంథములో గమనింపబడినట్టి కొన్ని ముఖ్యవిషయములు:** ఈ సంగీత మకరంద గ్రంథమునందలి పాఠ్యభాగములో కొన్నికొన్ని చోట్లను అసంపూర్తిగా నుండియున్నది. ఈ గ్రంథ ముద్రణమునకు ఆధారముగా బరోడా అధికారులవల్లను ఒకేఒక వ్రాతప్రతి, ఈ గ్రంథ సంపాదకులకు అందజేయబడినది. ఆ వ్రాత ప్రతిగ్రంథముకూడను చాలాదోషములతో (అవి వ్రాయ

డములోని దోషములతో (Copyists Errors) నుండి యున్నది. సంగీతరత్నాకర గ్రంథాన్ని అనుసరించి సంపాదకులిచ్చిన ఆయావిషయములన్నియును కొంతవరకు సరిచేయబడియుండినవి. అయినప్పటికిన్నీ ఇంకనూ కొన్ని లోపములు అచ్చుతప్పులు ఉండియే యున్నవి. వానిని అన్నింటినిన్నీ సరిచూడవలయునంటే ఆ గ్రంథము (మకరందము)యొక్క మరియొక వ్రాతప్రతి కూడా ఉంటేనేకాని అది ఆధారముగా చూచి సరిజేయుటకు అవకాశము లేదు. ఈ గ్రంథకర్తయగు నారదుడను నతడు పౌరాణికుడైన యగు నారదుడుగాకను వేరొకరని తెలియుచున్నది. ఎట్లంటే: ఆతడు అనేక చోట్లను పౌరాణి యగునట్టి నారదునిగూర్చి గ్రంథమునందున ఆయాచోట్లను పేర్కొని ప్రశంసించి యున్నాడు. ఇందుకు నిదర్శనముగా ప్రథమమునందు నసే మంగళశ్లోకమున (రెండవ శ్లోకము)

బ్రహ్మా తాళధరో హరిశ్చ పటహో వీణాకరా భారతీ
వంశజ్ఞౌ శశిభాస్కరౌ శ్రుతిధరాః సిద్ధాప్సరః కిన్నరాః
నందీభృంగిరిటాదిమర్దళధరాః సంగీతకో నారదః
శంభోర్నృత్తకరస్య మంగళతనోర్నాట్యం సదాపాతునః.

అనుటను చూడదగును. ఈ గ్రంథకర్తయగు నారదుడు సంగీత ధ్వనులను అయిదు విధములుగా విభాగించి వాటిని పేర్కొనియుండెను. అవి :

1. నఖజ—వీణాతంత్రులను చేతివ్రేలియందలి గోళ్లతో మీటితంత్రిని ధ్వనింపజేయుట.

2. వాయుజ: వాయుపూరక వాద్యములద్వారా ధ్వనిని ఉద్భవింపజేయుట.

3. చర్మజ: అనగా చర్మపుమూతలుగల వాద్య విశేషములనైనను ఆయావాద్యములను వాటి చర్మపుమూతలపైనను కొట్టి వాద్యమును కలుగజేయుట.

4. లోహజ: తాళములవల్లను ప్రయోగించి ధ్వనింప జేయుట.

5. శారీరజ: మానవ శారీరము: (గాత్రము) వల్లను ధ్వని కలుగజేయుట.

అనునట్టి ఈ అయిదు విధములుగా ధ్వని విభజనను అతడు చేసియుండెను. (శ్లో॥ 68 నుండి 78 వరకు (పుటలు 18—20 లలో చూడదగును.)

ఇట్టి యీ రకమైనట్టి ధ్వని విభాగము ఏ గ్రంథ విధానములయందుననుగానీ కనుపడుటలేదు. ఇది ఈతని ప్రత్యేకతయే యగును.

ఈ గ్రంథమునందున సప్త స్వరములకున్నూ వాటియొక్క కుటుంబములు, మతములు, రంగులు, ద్వీపములు (అవి పుట్టినట్టి స్థలములు), వాటియొక్క ఋషులు, దేవతలున్నూ, అధిదేవతలున్నూ, ఛందములు, గోత్రములు, రాసులు, గ్రహములు, రసములు—ఈ మొదలైనట్టివన్నియును ఇందు చెప్పబడియుండినవి. భరతుని నాట్యశాస్త్రములో ఈ విషయములన్నియును, చెప్పబడి యుండలేదు. కాని శార్ఙ్గదేవుడుమాత్రము కొన్ని కొన్నింటిని చెప్పియున్నాడు. అతడు కొన్నింటిని చెప్పక విడిచియుండెను. గోత్రములు, రాసులు, గ్రహములు, మొదలైనట్టివి చెప్పలేదు. మరియును ఇంకొక విశేషమేమంటే ఈ గ్రంథమునందున (22) ద్వావింశతిశ్రుతులకును ఇతర గ్రంథములయందున చెప్పబడియుండునట్టి నామాంతరములున్నూ భేదించుచున్నవి. ఈతడు చెప్పియుండినట్టి నామావళి యొక ప్రత్యేకమైనట్టిదియగును. ఈతడు పేర్కొని యుండినట్టి ద్వావింశతిశ్రుతుల యొక్క నామములు ఈ క్రింద నుదాహరింపబడగలవు.

షడ్జమమునకు: 1. సిద్ధా 2. ప్రభావతి 3. కాన్తా 4. సుప్రభా;

రిషభమునకు: 5. శిఖా. 6. దీప్తిమతి, 7. ఉగ్రా;

గాంధారమునకు; 8. హ్లాది, 9. నిర్వ్రీరీ;

మధ్యమమునకు; 10. దిరా 11. సర్పసహా 12. క్షాన్తి 13. విభూతి;

పంచమమునకు: 14. మాలినీ 15. చపలా 16. బాలా 17. సర్వరత్నా;

ధైవతమునకు: 18 శాన్తా 19. వికలినీ; 20. హృదయోన్మాలినీ;

నిషాదమునకు: 21. విసారిణీ 22. ప్రసూనా; అనునవి ఇరువదిరెండు నామనిర్వచనమును ఈతడు చేసియుండెను. కాని, భరతుని నాట్యశాస్త్రమునందు గానీ,

మరి యింకనూ ఇతరములగునట్టి గ్రంథములయందు ననుగొని చెప్పబడియుండియున్నట్టి నామనిర్వచనము ఈ క్రిందివిధముగా నుండియున్నది.

షడ్జమమునకు; 1. తీవ్రా 2. కుముద్వతీ 3. మందా 4. ఛందోవతి.

రిషభమునకు: 5. దయావతి 6. రంజనీ 7. రీతికా;

గాంధారమునకు: 8. రౌద్రీ 9. క్రోధా.

మధ్యమమునకు: 10. వ్రజిక 11. ప్రసారిణీ 12. ప్రీతీ 13. మార్జనీ;

పంచమమునకు: 14. క్షితీ, 15. రక్తా 16. సందీపినీ 17. ఆలాపినీ;

ధైవతమునకు; 18. మదన్తి 19. రోహిణీ 20. రమ్యా;

నిషాదమునకు: 21. ఉగ్రా 22. క్షోభిణీ— అనునవి ఇరువదిరెండు పేర్లు చెప్పబడియున్నవి.

ఈ రెండు నామ నిర్వచన విధానములయందు నను ఒకే ఒక 'ఉగ్రా'యను నది రెండింటియందును ఉండి యున్ననూ, మకరంద గ్రంథకర్త 'ఉగ్రా'యను నామమును 7 వ స్వరస్థానముగా పేర్కొనియుండెను. కాని ఇతరులు దానిని 21 వ స్వరస్థానముగా చెప్పి యుండిరి. కనుక పైదానినిబట్టి చూచినట్లయితే ఈ మకరందగ్రంథకర్త ఈనామ నిర్వచన విధానమును అంతకుపూర్వము ఉండియున్నట్టి మరియొకపూర్వపు గ్రంథమునుండి దేనినుండియో గ్రహించియుండి నట్లుగా తెలియుచున్నది. కాని, ఆ గ్రంథము ఇప్పుడు ఎచ్చటనుగానీ లభ్యముకాదు. గ్రంథనామమైనను తెలియ రాదు. (అతడు చెప్పియుండనూలేదు.)

నారదుడు 18 జాతుల పేర్లుమాత్రమే చెప్పి యుండెను కాని, వాటియొక్క వివరణమునుగాని, ఉదాహరణములుగానీ, భరత, శార్ఙ్గదేవులవలె వారి యొక్క నాట్యశాస్త్ర, రత్నాకరగ్రంథములయందు వలె విశదీకరించి యుండలేదు. నారదుడు అలంకారము లను గురించి (19) పంతొమ్మిదిటిని మాత్రమే పేర్కొనియుండెను. శార్ఙ్గదేవుడు తన రత్నాకర గ్రంథములో నీ యలంకారములను (63) అరువదిమూ డింటిని చెప్పియుండెను. సంగీతపారిజాతగ్రంథము నందున (అహోబలుడు) అలంకారములను 68) అరువదియెనిమిదిగా చెప్పియుండెను. నారదుడు అన్ని విధములైనట్టి రాగములనున్నూ మొత్తము 93) తొంబదిమూడింటినిమాత్రమే చెప్పియుండెను. సంగీత రత్నాకర గ్రంథమునందున (264) రెండువందల అరువదినాలుగు రాగములు చెప్పబడియుండినవి. సంగీత పారిజాత గ్రంథమునందున 122 నూటఇరువదిరెండు రాగములు చెప్పబడియున్నవి రాగ విబోధమునందున (50) ఏబది రాగములు మాత్రమే చెప్పబడి యున్నవి.

నారదుడు మూడువిధములైనట్టి రాగములను పేర్కొని యుండెను. అవి : పురుషరాగములు 2. స్త్రీ రాగములు, (3) నపుంసక రాగములు అనునవి. మరియును అతడు మరల రాగములను మూడు విధ ములుగా విభాగించి యుండెను. 1. ముక్తాంగ కంపిత రాగములు 2. అర్ధ కంపిత రాగములు 3. కంప విహీన రాగములు, అనునవి. ఈయొక్క విభాగమును సంగీత రత్నాకరమునందు గానీ, మరి తరువాత ఇతర గ్రంథ ముల యందునగాని చెప్పబడి యుండలేదు. అట్టిది అనుసరింపబడియును ఉండలేదు.

వీణావాద్య విశేషమును గురించి చెప్పుటలో నారదుడు తనయొక్క మకరంద గ్రంథములో 18 రకములైనట్టి వీణలను పేర్కొనియుండెను. వానిని వరుస క్రమమును లెక్కించినట్లయితే 19 పేర్లు కనుపడుతూ వున్నవి. అవి వరుసగా 1. కచ్ఛపీ 2. కుబ్జికా 3. చిత్రా 4. వహన్తి 5. పరివాదినీ 6. జయా 7. ఘోషవతీ 8. జ్యేష్ఠా 9. నకులీ 10. మహతీ 11. వైష్ణవీ 12. బ్రాహ్మీ 13. రౌద్రీ 14. కూర్మీ 15. రావణీ 16. సారస్వతీ 17. కిన్నరీ 18. సైరంధ్రీ 19. పోషికా అనునవి. మనము పరివాదిని అనుపేరుగల దానిని ఇతర విధములైన వాని కంటెను అన్నిటిలోనికిన్నీ ప్రమాణముగా తీసుకొన్న ట్లయితే అప్పుడు గ్రంథకర్త చెప్పియుండినట్టి సంఖ్య 18 సరిపడియుండగలదు. ఇవి యన్నియును గూడ వానియందునగల తంత్రులయొక్క సంఖ్యా భేదముల అనుసరించి ఆ యా నామములచే పిలువబడుతూ వున్నవని అతడు చెప్పియుండెను కాని, శార్ఙ్గదేవుడు ఈ దిగువను చెప్పియుండినట్టివి, 11 (రకములగు నట్టి వీణలను పేర్కొనియుండెను. అవి వరుసగా

ఈ విషయములో మనకు సరియైనట్టికాలము తెలియునంతవరకున్నూ ఈ సంగీత మకరంద గ్రంథ కర్తయగు నారదుడను నతఁడు మాతృగుప్తునికి (క్రీ॥ శ॥ 550) స్నీ, శార్ఙ్గదేవునకున్నూ (క్రీ. శ॥ 1210—1247) మధ్యస్థకాలమునందున నుండి యున్నట్లుగా నిర్ధారించవచ్చును. అనగా 7 వ శతాబ్దమునుండి 11 వ శతాబ్దముల మధ్యకాలమునందున వారు నుండియుండవచ్చును.

ఈ గ్రంథముయొక్క వ్రాత ప్రతులు :

ముద్రితమైనట్టి ఈ గ్రంథము ఒకేఒక్క వ్రాత ప్రతిపైనను ఆధారపడి ముద్రింపబడి యున్నది. ఆ వ్రాతప్రతిని బరోడా సెంట్రల్ లైబ్రరీవారు సంపాదకునకు నొసంగియుండిరి. ఈ వ్రాతప్రతిని సంపాదించి యుండినట్టి వారు శ్రీ కె. అనంతకృష్ణ శాస్త్రిగారి భార్య అయియున్నది. ఈ అనంతకృష్ణ శాస్త్రిగారు బరోడా సెంట్రల్‌లైబ్రరీలో సంస్కృత గ్రంథపరిశీలకులుగా ఏర్పరచబడినట్టి యుద్యోగి. వీరు వారియొక్క ఉద్యోగధర్మమును అనుసరించి, యొక ప్పుడు 1919 సంవత్సరంలో మహబూబ్‌నగర్ జిల్లా 'గద్వాలు' నకు వారి భార్యాసహితముగా మకాం వెళ్ళి, యచ్చట గ్రంథములను పరిశీలించు చుండగా ఆయనభార్య ఈ మకరంద గ్రంథముయొక్క వ్రాతప్రతిని కనుగొనియుండిరి. అచ్చటి యధి కారుల అనుమతితో ఈ వ్రాతప్రతిని సేక రించి యుండిరి. ఈ వ్రాత ప్రతి గ్రంథము దేవనాగరలిపిలో వ్రాయబడి యుండినది. పూర్వకాలపు అహమ్మదాబాద్ పేపరు పసుపు రంగుగల కాగితముల పైన వ్రాయబడి యుండినది. ఇట్టివి మొత్తము ముప్పదిరెండు కాగితములు ఉండియున్నవి. వాటి యొక్క సైజు కొలతలు ; షుమారు $10\frac{1}{2} \times 5\frac{1}{2}$ అంగుళములుండును. కాగితమునకు రెండువైపులను ఒక్కొక్కపేజీకి 9 పంక్తులు చొప్పున వ్రాయబడి యున్నది. అందలి వ్రాత చాల బాగుగాను, అందము గాను ఉండియున్నది. అందలి విషయములను గురించి నట్టి శీర్షికలు ఎర్రసిరాతో వ్రాయబడియున్నవి. సిరాఏమియును ఇంకిగానీ, వెలిసిపోయిగాని ఉండలేదు. ఆయొక్క వ్రాతప్రతి శాలివాహనశకము 1599 (క్రీ.॥ శ॥ 1677) లో వ్రాయబడియుండినది. చిట్టచివరను మూడు పేజీలలో ఆ గ్రంథమునకు ప్రతి వ్రాసినట్టివారు చిత్రమైనట్టి చిత్రణములను నలుపు, పసుపు, ఎఱుపు రంగులలో చిత్రించియుండిరి. ఆయొక్క వ్రాతప్రతి ఈ క్రింది విధముగా ప్రారంభింపబడియుండినది :

"శ్రీ మహాగణపతయే నమః
శ్రీ సాంబశివాయ నమః
శ్రీనాద బ్రహ్మణే నమః"

అంత్యమునందు గద్యము ఈ క్రింది విధముగా వ్రాయబడియున్నది :

"ఇతి సంగీత మకరందః—సమాప్తః — శుభ మస్తు—శకే 1599 శాలివాహే—పింగళనామసంవత్సరే— అశ్వినమాసే - శుక్లపక్షే,— విజయదశమ్యాం— విద్యాపుర మహానగరే శ్రీ మన్మహాగణపతిదాస కృష్ణాజీ దత్తేనేదం సంగీత మకరందాఖ్య పుస్తకం లిఖితమ్. మహాగణపతి ర్జయతి"

ఈ అంత్య గద్యమునుబట్టి ఈ వ్రాతప్రతి గ్రంథము శాలివాహనశకము 1599 కి (సరియైనట్టి క్రీ॥శ॥ 1677) సంవత్సరములో మహాగణపతి సేవకు డగు కృష్ణాజీదత్తు అనువారిచే విద్యాపురమునందు వ్రాయబడి యుండినట్లుగా నిదర్శనముగా తెలియు చున్నది. ఈ విద్యాపురము అనునది పూర్వము విజయనగర మహాపట్టణమే అయియున్నది. ప్రస్తుత కాలమున ఆ నగరము శిథిలమైపోయినది. ఈ వ్రాత ప్రతి గ్రంథము గద్వాలులో కనుగొనబడియున్నది. ఈ గద్వాలు పూర్వము నైజామునకు సంబంధించినట్టి దియే యగును. విద్యానగరము శిథిలమైపోయి యుండిన కారణమువల్లను అవి యన్నియును గద్వాలునకు తేబడి యుండినవి. అచ్చట భద్రపరచబడి యుండినవి. అందు ఈ వ్రాత ప్రతి దొరికిఉండినది. ఈ పైవిష యము అంతయును బరోడా సెంట్రల్ లైబ్రరీ నుండి శ్రీ జె. యస్. కథోల్కర్ అనువారు దయతో సంపాదకునకు అందజేసియుండిరి. అందుకు వారికి ధన్యవాదములు.

ఈ సంగీత మకరందమునందలి విషయ సూచిక : సంగీతాధ్యాయము-ప్రథమపాదము: మంగళా

చరణము, గీతాదిభేదసంగీతవిధానము, నాదోత్పత్తి, అనాహతనాదనిరూపణము, నఖవాయుజాది ధ్వని విధానము భేదములు; షడ్జాది సప్తస్వరోత్పత్తి; స్థాన నిర్దేశ్యము. షడ్జాదిస్వరములయొక్క ధ్వనిసాదృశ్య వివరణము; రూపాలప్తి-రాగాలప్తి-శిశుపశుపక్ష్యాదులకు గల సంగీత ప్రియత్వము; స్థాయిభేదములు; వాది సంవాది అనువాది వివాది స్వర వివరణము; స్వరజాతి కళా నిరూపణము; స్వరాణాం వర్ణకథనమ్; స్వరములకు ధ్రువములు; స్వరదేవతా వివరణము; ఛందస్సులు, గోత్రములు; నక్షత్రములు; రాసులు; రాస్యధిదేవతలు, యోనికథనము, రసములు, గ్రామనిరూపణ, షడ్జ గ్రామ స్వరములు; మధ్యమగ్రామస్వరములు, గాంధార గ్రామస్వరములు, గ్రామప్రాధాన్య లక్షణమూర్ఛనా లక్షణభేదనిరూపణము; శ్రుతులసంఖ్యావివరణము, శ్రుతుల నామాదికములు, మూర్ఛనా విభాగవిచారము; స్వరప్రకృతి వికృతి వివరణము; తంత్రీప్రకృతి వికృతుల వివరణము.

**సంగీతాధ్యాయము ; ద్వితీయపాదము :** మంగళము, గీతస్వరూపవర్ణనము, వీణాదేహాది నిరూపణము; సంగీతశాస్త్ర ప్రణేతలు, దేవతలపేర్లు, గీత మాహాత్మ్య వివరణము.

**తృతీయ పాదము :** స్వరలక్షణము, స్వర గ్రామమూర్ఛనారాగాది నిర్దేశ్యము, ప్రాతఃకాలరాగములు, సూర్యాంశ, చంద్రాంశ రాగములు, ప్రథమ ద్వితీయ ప్రహరలయందు పాడదగినట్టి రాగములు; రాగవేళ అతిక్రమణ ఫలాదిక విశదీకరణము; రాగనామములు; సంపూర్ణ రాగములలో నిగ్రహస్వరములు, షాడవ ఔరవరాగములలో నిగ్రహస్వరములు; పుంలింగ స్త్రీలింగ నపుంసక రాగములు; రాగములయొక్క రస ప్రయోగ వివేకము; రాగాంగనిరూపణము; ఆరు పురుషరాగములు వాటి వాటియొక్క స్త్రీరాగములు; రాగ విచారము, కంపితగమకవిశేషములనుబట్టి రాగ విభాగము; శాస్త్ర విరోధము; అనురోధముల ఫలశ్రుతి వివరణము.

**చతుర్థపాదము :** మృదంగలక్షణము; వీణాభేదములు; ఆనద్ధవాద్యములు నాదోత్పత్తి నాదభేదములు, వాగ్గేయకారలక్షణమ్; గాయకభేదములు; లక్షణములు; గీతగుణములు; గీతప్రయోజనములో స్వరములనామములు; ఆలాప విభాగము, శుద్ధ సంకీర్ణ రాగభేదములు; రాగసంఖ్యా నిర్దేశము:

**నృత్తాధ్యాయము ; ప్రథమపాదము :** నాట్యశాలయొక్క లక్షణము; సభాలక్షణము, విద్వత్కవి, భట, గాయక, పరిహాసక, ఇతిహాసక, జ్యోతిష, వైద్య, పౌరాణిక, సభాపతి లక్షణములు; నటవిశేషము, ఘర్ఘరికము; పాత్రలక్షణము, పుష్పాంజలి, పంచవాద్యోత్పత్తి నిరూపణము.

**ద్వితీయపాదము :** తాళకర్త నామములు, ఏకోత్తర శతతాళ నామములు, తాళలక్షణము.

**తృతీయపాదము :** చతురశ్రాదితాళవిభాగము, దశవిధ తాళప్రబంధములు; అంగతాళ లక్షణాదికములు; తాళశబ్దనిష్పత్తి, దశతాళప్రాణనిర్దేశ్యము, కాలమార్గ మాత్రా లక్షణము, క్రియాదక్షిణమార్గ మాత్రానామాదికము; అంగములు గ్రహములు జాతి నిరూపణము; లయకాల నిరూపణము, ప్రస్తార నిరూపణము; ద్రుతాదితాళాంగనామములు; ప్రతినామములు :

**నృత్యాధ్యాయము : చతుర్థపాదము :** మృదంగోత్పత్తి; వాదన ప్రకార వివరణము; నటీభావ నిరూపణము; ఈ మొదలగునట్టి విషయములతో నీ భాగము ముగియుచున్నది.

---

# రాలిపోయిన కిరణం

## శ్రీ వేగుంట మోహనప్రసాద్

మెరిసే చాపల్లా
ఎండలో సెక్స్‌లెస్ బిళ్లగోచీ పిల్లలు
నీలం నీళ్లల్లో మునుగీత లీదుతూ
బల్లకట్టు అడుగుకింద పరుంటారు.
పైన పచ్చగడ్డి మోపులు నాల్కల్తో
చూస్తూంటా యీ వింత కొడవలి ప్రశ్నార్థకంలో.
నువ్వు బస్సుదిగో రైలుదిగో గుర్రబ్బండీ బోల్తాకొట్టో
ఎండంతా జుట్టుమీద పెట్టుకొని వస్తావు.
గుక్కెడు నీళ్లన్నా తాగవు.
నీ భుజాన నీళ్లజాడీ వ్రేలాడుతూంటుంది.
వింతగా ఒక్కొక్క బొట్టూ కాల్వలోకి విడుస్తూంటుంది.
ఇంకా పైనించీ చూస్తూంటా రీ వింతను ఎవరో.
మేఘమొకటి శీర్షాసనం వేస్తూ చూస్తుంది
దాని కడుపులో ఏదో వ్యథ కదుల్తుంది.
ఎటొచ్చీ యీ నేలమీద ఉన్నవాళ్లే గమనించ రిదేమీ.
బళ్లల్లో పాఠాలు చెప్పుకుంటూ పిల్లల్ని శిక్షిస్తూ
గోడలమీద ఎన్నికల వాగ్దానాలు రాసుకుంటూంటారు.
వాళ్ల కీ దుఃఖాలు తెలీవు.
ఎక్కడి దీ ఆత్మ ?
ఎక్కడి దీ ఆత్మ అనావృతమై కాలవలో మునుగీతవేస్తూ
ఒకే వరసలో యీదుతోన్న గేదెల్తోపాటూ
మెరిసే కళ్ల పిల్లల్లో దాగిందా రవంత ఎరుపెక్కిన
పెద్దపెద్ద కళ్లల్లోంచి కాలవలోకి జారుతుందా ?
బయటెక్కడో సుదూరాన కాస్తూన్న ఎండలో
ఒట్టినేలమీద కాల్తూ నడుస్తూ

దుఃఖానికి ఆమడదూరంలో ఉన్నవాళ్లు కొంచెమైనా ఎరుకేనా?
రాత్రే నయం.
ఒక్క మనసుకే తడుతుంది
ఆత్మకే తెలుస్తుంది దూరాభారపు సంగతి.
ఈ ఎండ కాచే పట్టపగలు పట్టు మధ్యాహ్నం
చూచిన దూరపు అదృశ్య హస్తాన్ని చూపి
కన్నీళ్లని తుడుస్తుంది ఆ కల్వలా కమలాల్తో.
ఏ నల్లకళ్లజోడో పెట్టుకుంటాను నేను
మరీ మెత్తని హృదయాన్ని కన్నీళ్లని దాచేందుకనే ప్రయత్నం.
ఈ సెక్స్‌లెస్ బిళ్లగోచీ పిల్లల్ని చూస్తూ
కాలవొడ్డునే కూచుని నా మధ్యాహ్న భోజనం చేస్తాను.
ఎవరేనా ముసలయ్య ఓ చుట్ట యిస్తే కాల్చుకుంటాను.
రాత్రే నయం.
ఇక చుట్టూ చీకటయినప్పుడు బాధను భరించేందుకు.
ఇక చుట్టూ చీకటి
ఒక్క నీ చెవిపోగే మెరుస్తుంది నిశ్శబ్దంగా,
ఎక్కడా పిడుగు పడదు.
కాల్వలోకి దిగని నీ చెవిపోగు నీరుదిగని రాయి ఏ ఒక్కటో
వెలుగుతూ ప్రాకుతుంది నీ నీలికేశాలలోకి.
ప్రాకి ఒక నక్షత్రమై చిక్కుపడుతుంది.
అక్కడున్న ఒక్క మల్లెపువ్వుని త్రుంచుతుంది.
ఇక మర్రోజు మధ్యాహ్నం సెక్స్‌లెస్ బిళ్లగోచీ పిల్లలు
దాన్ని వెలికి తీస్తారు.
మధ్యాహ్న భోజనానంతరం నేనా నక్షత్రాన్ని చూస్తూ
వెక్కివెక్కి ఏడుస్తాను.
నన్నూ కాల్వలోకి దిగమంటారు
ఓదార్చుతూ పిల్లలు
మొలత్రాడు పట్టుకుని ఈత నేర్పుతారు
సూర్యుడు కొంచెం ప్రక్కకు ఒరుగుతాడు.
మరీ పడిపోకుండా నేలమీద, మేఘాలు నిలబెట్టుతయ్.
అప్పుడే యిళ్లకు తోలికెడుతుంటారు ఆవుల్ని.

ఆవి లేపిన దుమ్ము చెట్ల చిగురుని కప్పుతుంది.
కొమ్ముల్లో గాలిని గుచ్చుతయ్ ఆవులు.
గాలిని విదుల్చుకుని ధూళిని అలలవిూదికి నెట్టుతాయి చెట్ల ఆకులు.
నీళ్ల పొరల్లోకి ప్రాకిన శూన్యతరంగాల సూర్యరశ్మి
పైకి తేలి చీకట్లోనే రాత్రిలోకీ అక్కడ్నుంచి
అక్కడ్నుంచి నా ఆత్మలోకీ ప్రసరిస్తుంది.
ఈ జన్మకికలేని ఎండ.
కిరణం కిర్మీరం.

---



# సాహిత్య జగత్తు-1

శ్రీ కాళూరి హనుమంతరావు

“కవిత్వమంటే ఏమిటి ?” అన్న దొక చిక్కు ప్రశ్న. భారతీయ సాహిత్య శాస్త్రవేత్తలూ, పాశ్చాత్య సాహిత్య విమర్శకులూ ఈ చిక్కును విడదీయడానికి చేసిన ప్రయత్నం అనల్పం. ఈ ప్రశ్నను ప్రత్యుత్తరించడానికి భారతీయ శాస్త్రజ్ఞులు శాస్త్రమార్గంలో హేతువాదయుక్తంగా ప్రయత్నించారు. పాశ్చాత్య విమర్శకులు కవిత్వాన్ని చదివి అనుభవించి, ఆయా అనుభూతులనే కవిత్వ నిర్వచనాలుగా చెప్పారు. కనుక వీరి కవితా నిర్వచనాలు కూడా కవితామయంగా ఉంటాయి.

“Poetry is the art of uniting pleasure with truth, by calling imagination to the help of reason” అని Milton; “Poetry is the breath and finest spirit of all knowledge... It is the spontaneous overflow of powerful feelings... (and) emotions recollected in tranquillity” అని Wordsworth; “Poetry is the best words in best order” అని Coleridge; “Poetry is the expression of the imagination...... Poetry is ever accompanied with pleasure” అని Shelly; “Music, when combined with a pleasurable idea, is poetry” అని Edgar Allan Poe; “Poetry is simply the most delightful and perfect form of utterance that human words can reach”, “Poetry is criticism of life under the conditions fixed for such criticism by the laws of poetic truth and poetic beauty” అని Mathew Arnold; “Poetry is the language of the imagination and the passions” అని Leigh Hunt — ఇవి కవిత్వాన్నిగురించిన కొన్ని పాశ్చాత్య నిర్వచనాలు. కాని ఈ నిర్వచనాలన్నీ మళ్ళీ కవిత్వమంత గంభీరంగానూ ఉన్నాయి. ఈ నిర్వచనాలలో కవిత్వ లక్షణాలు కొన్ని తెలుస్తున్నాయి; కాని అసలు “కవిత్వమంటే ఏమిటి ?” అన్న ప్రశ్న అలాగే మిగిలి పోతున్నది.

భారతీయ సాహిత్య వేత్తలు భామహ ప్రభృతులు కావ్యాత్మ అలంకారము అని, రీతి అని, గుణము అని క్రమంగా బహిరంగంనుంచి అంతరంగంలో ప్రవేశించి చివరకు ఆనందవర్ధనుడు “ధ్వన్యాలోకం”లో కావ్యాత్మ ధ్వని అని నిరూపించాడు. భారతీయ సాహిత్యవేత్తల అభిప్రాయం కావ్యాత్మధ్వని అని, కావ్యం పఠితలో కలిగించే అనుభూతి రసమని. మమ్మట విశ్వనాథ జగన్నాథు శ్రీ రస-ధ్వని సిద్ధాంతాన్ని శిరసావహించి తమ సాహిత్య శాస్త్ర గ్రంథాలలో వివరించారు.

యత్రార్థః శబ్దోవా తమర్థ
ముపసర్జనీ కృతస్వార్థౌ
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వని రితి
సూరిభిః కథితః

అని ధ్వన్యాలోకకారుడు ధ్వనిని నిర్వచించాడు. (ఏ కావ్య విశేషమునందు వాచ్యమైన అర్థం కాని, వాచకమైన శబ్దంకాని తాము అప్రధానములై ఆ (రసాది రూపమైన) అర్థమును వ్యంజింపచేయునో ఆ కావ్య విశేషము ధ్వని). కవిత్వం చదువుతున్నప్పుడు అందులో ఒక్కొక్కచోట మనకేదో స్ఫురిస్తూ ఉంటుంది. అదే ధ్వని లేక వ్యంగ్యం; అదే కావ్యాత్మ అని ఆనందవర్ధనుడి ఆశయం. ఉదాహరణకు—

‘ఏవం వాదిని దేవర్షౌ
పార్శ్వేపితు రథోముఖీ]

లీలాకమలపత్రాణి
గణయామాస పార్వతీ.'

(నారదుడీ విధముగా తన వివాహప్రసక్తినితేగా పితృపార్శ్వమున అధోముఖియై పార్వతి లీలాకమం పత్రములను లెఖ్ఖించెను). ఇక్కడ 'పార్వతి సిగ్గుపడి నది' లని మనకు స్ఫురిస్తున్నది. 'లీలా కమలములను లెఖ్ఖించెను' అని వాచ్యార్థం. ఇది అప్రధానమై 'పార్వతి సిగ్గుపడెను' అన్న వ్యంగ్యార్థము ప్రధాన మవుతున్నది. ఇదే ధ్వని. ఇట్టి ధ్వనిప్రధాన కావ్యాలే ఉత్తమ కావ్యాలు. ఒక్కొక్కచోట ధ్వని వాచ్యార్థాన్ని అతిక్రమించలేకపోతుంది. వాచ్యార్థమే ప్రధానమై ధ్వని దానికి అలంకారప్రాయమవుతుంది. ఇది అప్రధాన ధ్వని లేక గుణీభూతవ్యంగ్యం. ఉదాహరణం—

'పత్యుః శిరశ్చంద్ర కలా మనేన
స్పృశేతి సఖ్యా పరిహాస పూర్వమ్
సా రంజయిత్వా చరణౌ కృతాశీ
ర్మాల్యేన తాం నిర్వచనం జఘాన.'

(చెలికత్తె పార్వతీ చరణములను రంజన మొనర్చి పతిశిరశ్చంద్రికలను దీనితో స్పృశింపుము అని పరిహసించగా మాల్యముతో దానిని మారుమాటాడకుండ మొత్తెను.) పతిశిరస్సును పాదముతో స్పృశింపుము అనడంలో లజ్జాసహిత హర్షేర్ష్యా సాధ్వస సౌభాగ్యాభిమాన ప్రభృతి ధ్వనితమవుతున్నా అది త్వరగా ధ్వనించక 'నిర్వచనం జఘాన' అన్న వాచ్యార్థోపస్కారకం మాత్రమే అవుతున్నది. కనుక ఇది గుణీభూత వ్యంగ్యం. ధ్వనిస్పర్శలేని కావ్యం, చిత్రకావ్యం. అధమకావ్యం. చిత్రం మనిషిని పోలిఉన్నా అందులో ప్రాణం లేనట్లు ఇది కావ్యంవలె కనిపించినా కావ్యంకాదు.

ధ్వని కావ్యాత్మ. కనుక ధ్వనిప్రధానకావ్యం ఉత్తమకావ్యం, ధ్వని అప్రధానమైన గుణీభూత వ్యంగ్య కావ్యం మధ్యమ కావ్యం, ధ్వనిస్పర్శలేని కావ్యం చిత్రకావ్యం అధమకావ్యం అని ఆలంకారికులు నిర్ణయించారు. కాని ధ్వన్యాలోకకారుని అభిప్రాయం ఇందుకు ఈషద్భిన్నమైనది. ధ్వని కాని, గుణీభూత వ్యంగ్యంకాని, ధ్వని స్పర్శ ఉంటే చాలును, తర్వాతి రస పరిణామాన్నిబట్టి ఏదైనా ఉత్తమ కావ్యం కాగల దని అతడి ఆశయం. కాని వాచ్యంకన్నా ధ్వని ఎల్లప్పుడూ ఉత్తమమనీ సహృదయ హృదయావర్జకమనీ అతడి నిశ్చితాభిప్రాయం. గుణీభూతవ్యంగ్యంలో వాచ్యం ప్రధానమై వ్యంగ్యం గౌణం కావడం భృత్యుడికి వివాహం జరుగుతున్నప్పుడు రాజుగా రతడిని అనుసరించడం వంటిదని ధ్వనికారుడన్నాడు.

ఇక్కడ సంశయాలు ఉదయిస్తాయి. ధ్వని కావ్యాత్మ అయినప్పుడు ధ్వని ప్రధానకావ్యాలే ఎల్లప్పుడూ ఉత్తమకావ్యాలు కావలసి ఉంది. గుణీభూత వ్యంగ్యంలో వ్యంగ్యం వాచ్యానికి అలంకారమాత్ర మయితే, వ్యంగ్యంకన్నా వాచ్యం ఒక్కొక్కప్పుడు ప్రధానంగా ఉంటుందని, వాచ్యంకూడా ఒక్కొక్కప్పుడు రసజ్ఞ హృదయాహ్లాదకర మవుతుందని తెలుతున్నది. ఏది ధ్వని, ఏది గుణీభూతవ్యంగ్యమని నిర్ణయించడం కష్టం. ఒక్కొక్కప్పు డీ రెండూ సమప్రధానంగా ఉంటాయి. వాచ్యార్థ వ్యంగ్యార్థములలో దేనికి ప్రాధాన్యం అనే సందేహం కలిగినప్పుడు అది సందిగ్ధప్రాధాన్య మవుతుందని మమ్మటాచార్యులు కావ్యప్రకాశంలో ఈ శ్లోకాన్ని ఉదాహరించారు.

"హరస్తు కించి త్పరివృత్త ధైర్య
శ్చంద్రోదయారంభ ఇవాంబు రాశిః
ఉమాముఖేబింబఫలాధరోష్ఠే
వ్యాపారయామాస విలోచనాని."

(చంద్రోదయ కాలమున సముద్రమువలె హరుడు కొంచము ధైర్యముకలచబడి బింబఫలమువంటి కెమ్మోవి గల పార్వతీదేవి ముఖమున చూపులు పరచెను.)

ఇక్కడ "కెమ్మోవి ముద్దాడ నభిలషించెను" అన్న వ్యంగ్యం, "చూపులు పరచెను" అన్న వాచ్యం కూడా ప్రాధాన్యం కలిగి ఉన్నాయి. వాచ్యంకూడా అలౌకికత్వంచేత చమత్కార కారక మవుతున్నదని వామనాచార్య ఝళకీకరులిక్కడ వ్యాఖ్యానించారు. హర్షవర్ధనకృత రత్నావళినాటికలోని ఈ పద్యం చూడండి —

'పరిమ్లానం పీనస్తనజఘన సంగా దుభయతః
తనో ర్మధ్యస్యాం తః పరిమిలన మప్రాప్యహరితమ్
ఇదం వ్యస్తన్యాసం శ్లథభుజలతాక్షేపవలనైః
కృశాంగ్యాః సంతాపం వదతి బిసినీపత్ర శయనమ్.'

(ఇరువైపుల పీనస్తనజఘనములు రాపుడుచే మ్లానమై, శరీర మధ్యభాగము తాకమిచేత నడుమ పచ్చనై, విశ్లథ భుజలతాక్షేపవలనములచే చెదరి, ఈ తామరాకులశయ్య ఆ విరహిణి సంతాపమును చెప్పుచున్నది). ఇక్కడ నాయికా శరీరసౌష్ఠవం వ్యంగ్యం. కాని అది ప్రధానం కాదు. నాయికా విరహవర్ణనమే ప్రధానం. అది వాచ్యం గానే ఉన్నది. కనుక ఇది గుణీభూతవ్యంగ్యం. కాని ఇది ఉత్తమకవిత్వం కాదని మధ్యమకావ్యమని ఎవరన గలరు ?

కాగా ధ్వని స్పర్శలేని కావ్యం చిత్రకావ్యం, లేక అధమకావ్యం అని ధ్వనికారుల ఆశయం. ఈ పద్యం చూడండి—

"ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండు
చూడ చూడ రుచుల జాడవేరు
పురుషు లందు పుణ్యపురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ."

ఈ పద్యంలో వ్యంగ్యం లేనేలేదు. "పురుషు లందు పుణ్యపురుషులు వేరయా" అని అంతా వాచ్యమైపోయింది. కనుక ధ్వని సిద్ధాంత దృష్టిలో ఇది అధమ కావ్యం కావాలి. వేమన పద్యా లన్నిటికీ, సుమతి శతకంలో పద్యాలకీ కూడా సుమా రిదేగతి పడుతుంది. కాని ఇవి అధమ కావ్యాలని ఎట్లా అంగీకరించడం ?

ఇప్పుడు ధ్వని ఉన్న ఈ పద్యం చూడండి—
"కస్యవా న భవతి రోషో దృష్ట్వా ప్రియాయాః సవ్రణ మధరమ్
సభ్రమరపద్మాఘ్రాణశీలే !
వారితవామే! సహస్వేదానీమ్."

(సవ్రణమైన ప్రియురాలి అధరమును చూడగా ఎవరికి రోషం రాదు ? తుమ్మెదతో కూడిన పద్మమును ఆఘ్రాణించి మేలును వినవైతివి. ఇంక ఇప్పుడు సహించు.) ఉపపతి చండరతి ననుభవించి వచ్చిన జారురాలినిగూర్చి ఆమె భర్త, తదితరులు వాస్తవం గ్రహించకుండా కాపాడుతూ చెలికత్తె అన్న మాటలివి; "ఇంకెప్పుడూ ఇలాగు చెయ్యకు" అన్న వ్యంగ్యం పుష్కలంగా ఉంది. కాని ఈ పద్యాన్ని రస జ్ఞులు మెచ్చుకొంటారని, వేమన పద్యాలని ఆదరించ రని అనడం సాహసం. ధ్వని ఉన్న ఇంకొక పద్యం చూడండి—

"శిఖిపింఛ కర్ణపూరా
జాయా వ్యాధస్య గర్విణీ భ్రమతి
ముక్తాఫల రచిత
ప్రసాధనానాం మధ్యే సపత్నీనామ్."

(ముత్యములచే రచింపబడిన అలంకారములు గల సవతుల మధ్య నెమిలి పింఛములు కర్ణాభరణ ములుగాగల వ్యాధ వధువు గర్వముచే సంచరించు చున్నది.) ఈ పద్యాభిప్రాయం ఇది— ఒక వ్యాధునికి కొందరు భార్యలుండిరి. అప్పు డతడు కరివరవధ వ్యాపార సమర్థుడై యుండెను. ఏనుగు కుంభస్థలము లందలి ముత్యములచే వారు భూషణములు గ్రథించుకొనుచుండిరి. తదుపరి ఆతడొక నవవధువును పరిణయమై, నిరంతర మామెతో సమ్మిళితుడై ఉండు టచే కరివరవధవ్యాపారాసమర్థుడయ్యెను. అందుచే నామెకు బర్హిబర్హ కర్ణాభరణములను మాత్రమియ్య జాలెను. అది ఆమె సౌభాగ్యమును ద్యోతిత మొన ర్చెను. ఈ వ్యంగ్యం ఒక ప్రహేళికవలె మనకి తోస్తుంది.

ధ్వన్యాలోకకారుడు ప్రథమోద్యోతమంతా వ్యంగ్యం అన్న ఒకానొక పదార్థం ఉన్నది అని నిరూపించ డానికి వినియోగించాడు. ఈ పనిని చెయ్యడానికాయన ధ్వన్యభావవాదులతో ఆ నాడు సంకుల సమరం చెయ్య వలసి వచ్చింది. కాని ఈ నాడు మనకీ మహాప్రయత్న మంతా పర్వతఖననాఖుగ్రహణంవలె తోస్తుంది. నిత్య జీవిత సంభాషణంలో వ్యంగ్యం కనిపిస్తూనే ఉంటుంది. ఇదంతా కవిత్వ మవుతుందా ?

ధ్వన్యాలోకకారుడీ అతివ్యాప్తి దోషాన్ని ఆశం కించకపోలేదు. "పీనోఽయం దేవదత్తో దివా న భుంక్తే"—దేవదత్తుడు బలిసి ఉన్నాడు, పగలు భోజనం చెయ్యడంలేదు—అనగా దేవత్తుడు రాత్రి భోజనం చేస్తున్నాడని వ్యంగ్య మవుతున్నది. దీనికి కావ్యత్వాపత్తిరాగా, అలంకార గుణాదులతో కూడు కొన్నది కాదు కనుక ఇది కావ్యాత్మయైన ధ్వనికాదు అంటాడు. కనుక ఇప్పుడు కవిత్వానికి గుణాలంకా

రాము అవశ్యకముని తెలుపుతున్నది. గ్రంథారంభంలో కావ్యానికి అలంకారము లలంకారములే గుణములు గుణములే, ధ్వనియే కావ్యాత్మ అన్నదానికిది విరుద్ధంగా ఉంది. గ్రంథాదిని గుణాలంకారాలను సింహద్వారం వెంట గెంటివేసి ఇక్కడ తిరిగి వెనుకదారివెంట ప్రవేశపెడుతున్నాడని తోస్తుంది. పరమాత్మ సర్వాంతర్యామి అయినా కుండ మొదలైన వస్తువులకు కాక మనుష్యాది సచేతనములకు మాత్రమే జీవాత్మ అన్న వ్యవహారం కలిగినట్లే గుణాలం-కార సమన్విత వ్యంగ్యానికే ధ్వని వ్యవహారం ఉంటుందన్న ధ్వన్యాలోకకారుని వాదం మనమనస్సుకి సమాధానం కలిగించదు.

కనుక పదానికి అర్థాన్ని బోధించే శక్తులు అభిధ, లక్షణ అని, తృతీయ కక్ష్యలోని వ్యంజన కావ్యాత్మ అని అన్న ధ్వనిసిద్ధాంతం యుక్తియుక్తమని తోచదు. వాస్తవానికి పదానికి అర్థాన్నిబోధించే శక్తులు అభిధ, లక్షణ, వ్యంజన— మూడూను. శబ్దానికి గల సంకేతితమైన అర్థాన్నిబోధించే శక్తి అభిధ. ఈ శబ్దం వలన అర్థం బోధపడవలెనన్న ఈశ్వరేచ్ఛ లేదా లోకేచ్ఛయే సంకేతం. ఆవు, కుండ, శుక్లము, రాముడు, వండుచున్నది— మొదలైనవి అభిధ. ముఖ్యార్థానికి బాధకలుగగా రూఢినిబట్టిగాని, ప్రయోజనాన్నిబట్టిగావి ముఖ్యార్థంతో సంబంధంకల వేరొక అర్థాన్ని స్ఫురింపజేసే శక్తి లక్షణ. వాడు భీముడు, ఆమె రంభ— మొదలైనవి. వాడు భీముడు కాడు, ఆమె రంభకాదు. ముఖ్యార్థాలకిచట బాధకలుగగా, వాడు భీముడివలె బలవంతుడు, ఆమె రంభవలె చక్కనిది అన్న అర్థాలు స్ఫురిస్తున్నాయి. ఇది లక్షణ. వ్యంగ్యంలో వాచ్యార్థబాధ ఉండదు: పైకి ఒక అర్థం కనిపిస్తూ ఉండగా లోపల ఇంకొక అర్థం స్ఫురిస్తుంది. ఒక చిన్న ఉదాహరణం ఇస్తాను. గురువుగారు విద్యార్థివైపు బెత్తం సారించి ' ఈ బెత్తం చివర ఒక మూర్ఖుడున్నాడు'' అన్నారు; అప్పుడు విద్యార్థి ''ఏ చివరనండి?'' అన్నాడు. దీనిచేత గురువుగారు మూర్ఖుడని వ్యంగ్యమవుతున్నది. సాధారణంగా వ్యంగ్యం చమత్కారంగా ఉంటుంది. కాని ఎప్పుడూ చమత్కారంగానే ఉండక ఒకప్పుడు ఏవగింపు కలిగించవచ్చును. అనాగరికుల నానందపరచే వ్యంగ్యం సంస్కారం కలవాళ్లకి జుగుప్స కలిగించవచ్చును. ధ్వన్యాలోకకారుడీ విషయాన్ని గమనించక పోలేదు. అసుందరమైన అర్థాన్ని గూఢంగా చెప్పినా ప్రకటంగా చెప్పినా విశేషంలేదని, సౌందర్య సంయుతమైన వ్యంగ్యమే ధ్వని అని అతడంటాడు. అంటే కవిత్వంలో వ్యంగ్యానికి అతీతమైన ఒక సౌందర్యం ఉంటుందని తెలుస్తున్నది. ఆ సౌందర్యం ఏది? అన్న ప్రశ్న జనిస్తున్నది. ఆ సౌందర్యం కవిత్వం తప్ప ఇంకొకటికాదుకదా! కనుక ధ్వనియే కావ్యాత్మ అని నిశ్చయించివేసేకన్నా కవిత్వం అభిధా లక్షణా వ్యంజనలు మూడిటిలోనూ ఉంటుందనడమే లెస్స.

పరితలో కల్గే కావ్యానుభూతి రసమని భారతీయ సాహిత్య శాస్త్రకారుల ఏకైకాభిప్రాయం. 'రస ఆస్వాదనే' అను ధాతువునుండి 'రస్యతే ఆస్వాద్యతే ఇతిరసః' అని రసశబ్దవ్యుత్పత్తి. కావ్యార్థ పరిజ్ఞానం చేత పైకి పొంగునట్టి ఆత్మానందమే రసమని ఫలితార్థం. కావ్యంలోని విభావానుభావ వ్యభిచారి సంయోగంచేత సామాజికులలో రసం నిష్పన్నమవుతుందని రససిద్ధాంతం. దీనినిబట్టి ఈ రసనిష్పత్తికి కావ్యములలో కల అవకాశం ఖండకావ్యాలలో లేదనీ ముక్తకాలలో ఈ అవకాశం అత్యల్పమనీ తేలుతున్నది. కాని కొన్ని ఖండ కావ్యాలనూ, ముక్తకాలనూ మంచి కవిత్వమని తలంచడం మనఅనుభవం. Shakespeare's Sonnets ఒక్కొక్కటే ఉజ్జ్వల కవితామయంగా ఉంటాయి. రసం నిష్పన్నమైన తారాశశాంకాది కావ్యాలు Shakespeare రచించిన ఒక్క Sonnet తో సరి తూగగలవా? ఇంకొక దృష్టాంతం—

'అల్పుడెపుడు బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ వినురవేమ.'

ఇందులో పరిపుష్టమైన రసం ఏదీ లేదు. కాని ఈ ఒక్క పద్యాన్ని చదివి మనం మంచి కవిత్వాన్ని చదివిన అనుభూతిని పొందుతున్నాముకదా! మయూర కృత సూర్యశతకంలోని పద్యాలుకూడా చాలావరకూ ఇదమిత్థమని నిర్ణయించదగిన ఏ రసం లేకుండానే ఉంటాయి. కాని సూర్యశతకం ప్రపంచంలోని అత్యుత్తమ కావ్యాలలో ఒకటని చెప్పడానికి ఎవరు సందేహిస్తారు?

రస సిద్ధాంతం ఆలంకారికులకు కొన్నిచిక్కు లను తెచ్చిపెట్టింది. రసం నిష్పన్నం కావాలి అంటే పుష్టం కావాలి. విభావానుభావ వ్యభిచారులా నిష్పత్తికి, పుష్టికి హేతువులు. కనుక ఒకేచోట రెండు రస ములు నిష్పన్నం కాజాలవు. అవి పరస్పర విరుద్ధములు కాకపోతే ఫరవాలేదు. కాని ఒకేచోట రెండు విరుద్ధ రసాలనుకల్గింపదలచడం దోషమవుతుంది.ఉదాహరణానికి శృంగార భీభత్సరసములుపరస్పరవిరుద్ధములు.రతినికల్గిం చేదే జుగుప్సనికూడా కల్గించదుకదా! కాని కవులు ఆలం కారిక నియమాలకి క్రీతదాసులై కవిత్వం వ్రాయరు. విరుద్ధరస సమావేశాన్ని ఎందరో కవులు ఎన్నోచోట్లలో చేశారు. వీటిని రక్షించడానికి విరుద్ధరస సమా వేశం దోషమన్న నియమానికెన్నో అతిపాతాలను వారు సూచించారు. అయినా కొన్ని కవిప్రయోగాలు వీటికి అందకుండా మిగిలిపోతూనే ఉన్నాయి. శృంగార బీభత్స రసాల నిర్వ్యవధాన సమావేశం కల రఘువంశంలోని ఈ పద్యాన్ని కావ్యప్రకాశకారుడు దుష్టమన్నాడు—

''రామ మన్మథ శరేణ తాడితా
దుస్సహేన హృదయే నిశాచరీ
గంధవ ద్రుధిర చందనోక్షితా
జీవితేశ వసతిం జగామ సా.'' .

(రాముడనే మన్మథుని దుస్సహశరంచే హృదయమందు కొట్టబడి ఆ నిశాచరి రుధిరమను సుగంధ చందనముచే తడుపబడి జీవితేశుని (ప్రియుని, యముని) ఇంటికి పోయెను). ఈపద్యం దుష్టమాకాదా అన్న విషయంపై ఆలంకారికులలో మతభేదం ఉంది. ఆ మతవిభేదాన్ని అటుంచి, రక్తాన్ని శృంగారాంగంగానూ, మరణాన్ని శృంగారంగానూ మార్చగలిగిన కవిప్రతిభను మనం ప్రశంసించకుండా ఉండలేము. భాసకృత ఊరు భంగ నాటకంలోనిది ఇటువంటిదే ఇంకొక పద్యం—

''మాల్యైరూర్ధ్వ జాగ్ర గలితైః కృత ముండ మాలం
లగ్నైకసాయక వరం రథినం విపన్నం
జామాతరం ప్రవహణాదివ బంధునార్యో
హృష్టాః శివా రథముఖాదవతారయంతి.''

(శిరస్సున పుష్పములు దాల్చి కటియందు ఖడ్గము ధరించిన జామాతను ప్రవహణమునుండి బంధు స్త్రీలు క్రిందికి తోడ్కొని తెచ్చినట్లు, ధ్వజాగ్ర నిపతిత మాల్యములు శిరోమాలికలుకాగా దేహమందొక బాణము గుచ్చుకొని నిపన్నుడైన రథికుని నక్కలు హృష్టములై రథమునుండి క్రింది కీడ్చుచున్నవి).

అచేతనముల వర్ణన కావ్యమెట్లాకాగం దన్నది రససిద్ధాంతం జనింపజేసే ఇంకొక ప్రశ్న. అచేతన వస్తువులలో చేతనత్వారోపణ ఉంటేతప్ప రసోత్పత్తి కలుగదని నదీ వర్ణనలో నాయికారోపణకం ఒక పద్యం ధ్వన్యాలోకంలో ఉదాహృతమయింది. కాని అన్ని అచేతనవర్ణనలూ ఇట్లాగే ఉండవు. చేతనత్వారోపణాని స్పర్శగాని లేని సముద్ర పర్వతాదుల వర్ణనలు లేకపోలేదు. శృంగార నైషధంలో తటాకవర్ణనం ఇట్లా ఉంది—

''శేషపుచ్ఛచ్ఛాయ జెలువారు బిసములు
తన్మస్త సురదంతి దంతములుగ
నిండార విరిసిన పుండరీక శ్రేణి
యామిసీ రమణ రేఖాళిగాగ
ప్రతిబింబితోపాంత బహుళపాదపములు
గర్భస్థ శైల పంఘములుగాగ
నేకదేశంబున నిందీవరంబులు
కాలకూట మయూఖ ఖండములుగ
బాలశైవాల వల్లరీ జాలకంబు
బాడబానల భవధూమ పంక్తిగాగ
వారిరాశియుబోలె గంభీరమైన
ఘనతటాకంబుగాంచె నజ్జనవిభుండు.''

దీనిలో చేతనత్వారోపణలేదు. వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి ''ఆషాఢ మేఘము'' అన్న ఖండకావ్యంలోని ఈ పద్యం చూడండి—

''లే దలనాటి యుజ్జయిని,
లేదలకానగరీ ప్రయాణ స
మ్మోదము, లేదు ప్రేమభర
ముగ్ధుడు నాటి గిరిప్రవాసి, భా
నూదయ చిత్రితేంద్రధను
రుజ్జ్వల మూర్తివి నీవు నాటి మ
ర్యాద ప్రవాసి బాంధవుడవై
కనుపించెదవోయి నేటికిన్.''

ఇందులో ప్రవాసి బాంధవత్వం మేఘంలో ఆరోపితమై ఉంది. ''భానూదయ చిత్రితేంద్రధనురుజ్జ్వల

మూర్తిని'' అన్నచోటమాత్రం చేతనత్వారోపణ లేక మేఘనిసర్గసౌందర్యం వర్ణితమైంది. కనుక అచేతన వర్ణనలో చేతనత్వారోపణ ఉండితీరాలన్న నియమం యుక్తంగాలేదు. కవి ప్రతిభనుబట్టి ఎలాగైనా ఉండవచ్చును. రసస్పర్శలేని అచేతన వర్ణనలు కూడా హృద్యంగా ఉండవచ్చును.

రస సిద్ధాంతం మనభారతీయ సాహిత్యంలో కలిగించిన ఫలితాన్ని పరిశీలిద్దాం. శకుంతలాది విభావాంవల్ల, కటాక్షాద్యనుభావాలవల్ల, లజ్జాది వ్యభిచారులవల్ల రతి స్థాయియై, అప్పుడు శకుంతల సామాన్యకాంతగాతోచి, రసజ్ఞ నిష్ఠములైన రత్యాది చిత్తవృత్తుల నుద్బోధింపజేసి, విభావాదు లాస్వాద్యములై, అలౌకిక వ్యాపారము నుదయింపజేసి రసానందము కలుగజేస్తుందని రససిద్ధాంతం. కావ్యంలో శకుంతలా పాత్రను కల్పించి వర్ణించగా వర్ణించగా ఆమె లోని శకుంతలాత్వం నశించి సాధారణకాంతగా తోస్తే ఇంకేమి వర్ణింపబడినట్లు? కవి ఆశయం వ్యర్థమైందన్నమాట. శాకుంతలం చదవగా మనలో చెరగని ముద్రవేసేది శకుంతలా వ్యక్తిత్వమే. అట్లాగే సీత, సావిత్రి, దమయంతి, ద్రౌపది, దేవయాని, ఒఫీలియా, క్లియోపాత్రా, నటాషా మొదలైన స్త్రీల భిన్న భిన్న వ్యక్తిత్వాలా యా కథలలో చిత్రితములయినాయి. రస సిద్ధాంతం పాతుకుపోయిన తర్వాత మనదేశంలో పుట్టిన సాహిత్యంలోని పాత్రలలో ముఖ్యంగా స్త్రీపాత్రలలో పాత్రచిత్రణం మృగ్యమయింది. స్త్రీలకు వ్యక్తిత్వం లేక వయస్సు, అవయవ పరిమాణం, సురతచాతుర్యం మొదలైనవాటినిబట్టి ముగ్ధ, ప్రౌఢ, లోల—ఈ విధంగా విభజింపబడినారు.

రసములెన్ని? అన్నదానిపై పెద్దకోలాహలం ఉంది. భరతుడు శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానక బీభత్సాద్భుతముల నష్టరసములనే నాట్యశాస్త్రంలో పేర్కొన్నాడు. నాట్యాననుకూలమని కాబోలు శాంతమును పేర్కొనలేదు. తర్వాతివారు శాంతరసాన్ని చేర్చారు. రుద్రటుడు ప్రేయోరసము అని పదియవరసాన్ని నిరూపించాడు. తర్వాత వత్సల రసము, భక్తిరసము, మాయారసము కొందరిచే ప్రతిపాదితము లయినాయి. ఇట్లా రసముల సంఖ్యను కొందరు పెంచగా మరికొందరు ఇన్నిరసములు లేవు, అద్భుతమొక్కటే రసముప్రకృతి, తక్కినవి దాని వికృతులన్నారు. భవభూతి ''ఏకోరసః కరుణఏవ'' అన్నాడు. కాని ప్రాయికంగా ఆలంకారికులు పైన చెప్పిన నవరసాలను అంగీకరిస్తారు.

అయితే Shakespeare రచించిన Macbeth, Othello, Hamlet మొదలైన నాటకాలలో రసములేవి అన్న శంక జనిస్తుంది. వీటికొరకు క్రొత్తరసాలను కల్పించాలి.

మానవ చిత్తవృత్తుల నిట్లా స్థూలంగా తొమ్మిదో పదో విభాగాలు చెయ్యడం అనుచితం. మనిషి స్వభావంలో ఎన్నోఛాయలు ఉంటాయి. ప్రతిభాశాలి ఐన కవి ఆఛాయలను గుర్తుపట్టి వ్యక్తపరచగలుగుతాడు. భారతీయ సాహిత్యవేత్త కీవిషయం తెలియదని కాదు. నవరసములేకాక తత్తద్రసముల కాధారములైన భావాలుకూడా కావ్యత్వం పొందుతాయని వారు చెప్పారు. కాని లెస్సగా పుష్టమైనది రసము. రసములు సహృదయ హృదయావర్జకములైనట్లు వాటికి ఆధారములైన భావాలు కాజాలవనే వారి అభిప్రాయము.

ఈ అభిప్రాయం అయుక్తం. ప్రతిభకల కవి ఏ భావాన్నైనా చేపట్టి ఉత్తమసాహిత్యం సృష్టించగలడు. Hamlet నాటకం ఇందుకు గొప్పనిదర్శనం.

భారతకథను సమర్థుడైన ఒక కవి దుర్యోధన ప్రాధాన్యంతో విషాదాంత కావ్యంగా రచిస్తే అప్పుడు దానిలో అసూయ రసమవుతుంది. రామాయణ కథను రావణ ప్రాధాన్యంతో విషాదాంత కావ్యంగా రచిస్తే దానిలో శృంగారాభాసము ప్రధానమవుతుంది. కనుక కావ్యనిబద్ధములు కాగల మానవ చిత్తవృత్తులకు రసరూపమైన ఖచ్చితమైన విభాగం, నిర్దేశం అనుచితంగాను, అసహజంగానూ కనిపిస్తుంది.

## 2

భారతీయ సాహిత్యవేత్తలూ, పాశ్చాత్య విమర్శకులూ కూడా కవిత్వంవల్ల ఆనందం కలుగుతుందని చెప్పారు. కావ్యం రసానందాన్ని కలిగిస్తుందనీ అది బ్రహ్మానందతుల్యమనీ మన ప్రాచీనాలంకారికుల అభిప్రాయం. 'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్' అని జగన్నాథుడు. మొదట్లో ఉదాహరించిన ఆంగ్ల

విమర్శకుల కవిత్వ నిర్వచనాలనుబట్టి వారుసైతం కవిత్వం ఆనందాన్ని కలిగిస్తుందన్న దృఢాభిప్రాయం కలిగి ఉన్నట్లు స్పష్టమవుతుంది. విషాద సన్నివేశాలు కూడా కావ్యంలో ఆనందాన్ని కలిగిస్తాయని ప్రాచీన పాశ్చాత్య సాహిత్య విమర్శకులందరూ అన్నారు. Aristotle Tragedyని ఈ విధంగా నిర్వచించాడు.

"Tragedy is an imitation of an action that is serious, complete, and of a certain magnitude, in language embellished with each kind of artistic ornament, the several kinds being found in separate parts of the play, in the form of action, not of narrative; through pity and fear effecting the proper Katharsis, or purgation of these emotions ..... Tragedy excites the emotions of pity and fear—kindred emotions that are in the breasts of all men—and by the act of excitation affect a pleasurable relief." ఇందులోని "severel kinds of embellishments" అంటే పాటలు, పద్యాలు మొదలైనవని తర్వాత చెప్పాడు. Katharsis అన్న మాటని నిశ్చయంగా ఏ అభిప్రాయంతో ఉపయోగించాడో తెలుసుకొందుకి ఆధారం అతడు వ్రాసిన "Poetics" లోగాని, ఇతర గ్రంథాలలోగాని కనిపించనందువల్ల పలువురు పలువిధాలుగా దీనికి అర్థం చెప్పడం జరిగిందని ఆంగ్లసాహిత్యవిమర్శకులంటారు. కాని Katharsis, Purgesis అన్నవి వైద్యపరిభాషకుచెందిన పదాలు కనుక క్షాళనం అన్న అర్థంలో ఉపయోగింపబడినవని తలచడంలో పొరపాటు ఉండకూడదు. ఏమైనా విషాదాంత నాటకాలు ఆనందయుతోపశమనాన్ని (Pleasurable relief) కల్గిస్తాయని అతడు చెప్పడం గమనార్హం.

Tragedy అన్న ఆంగ్లపదానికి విషాదాంత నాటకం అనడం సరిఅయినదికాదు. విషాదమయ లేక విషాదభర నాటకం అంటే సరిగా ఉంటుంది. Aristotle, Tragedy అన్న మాటను ఈ అర్థంతోనే ప్రయోగించాడు. విషాదం హెచ్చుగా కల దృశ్యాలు కల నాటకం Tragedy, అది విషాదంతో అవసితం కానక్కర్లేదు. కాని Tragedies తరచు విషాదాంతములవడంచేత మధ్యయుగంలో ఈ అర్థం క్రమంగా మారి, ప్రస్తుతార్థంలోకి పరిణమించింది. నాయకుడు చచ్చిపోయిన నాటకాల్ని Tragedies గాను, అతడు బతికిఉన్నవాన్ని Comedies గాను పరిగణించడం పొరపాటు. ఉదాహరణకు Macbeth నాటకంలో చివరకు Macduff గెలిచి Macbeth చంపబడ్డాడు కనుక Tragedy అయిందని, అదే Macbeth జయించి Macduff చంపబడితే Comedy అయిపోతుందనీ తలంచరాదు. అసలు చివరకు Macbeth జయిస్తే నాటకంలో సాహిత్యం భ్రష్టమవుతుంది. ఇది తర్వాత చర్చిస్తాను.

ప్రస్తుత చర్చనీయాంశం కావ్యం, సుఖమయ సన్నివేశవర్ణన అయినా దుఃఖమయేతివృత్త వర్ణన అయినా పరితలో ఆనందాన్నే కలిగిస్తుందన్నది. 'రస ఆస్వాదనే' అన్న రసశబ్ద వ్యుత్పత్తిలోనే ఈ అభిప్రాయం ఇమిడి ఉంది. కాని ఇది మన అనుభవానికి విరుద్ధం. శోకమయమైన కవితనో, కథనో, నవలనో చదివినప్పుడు మనస్సు సానుభూతి పరిప్లుతమై కన్నీళ్లు రాలడం మన అనుభవం. కాని ఇవి దుఃఖాశ్రువులు కావనీ ఆనందాశ్రువులనీ సాహిత్య శాస్త్రజ్ఞులంటారు. అందుచేతనే క్రౌంచ పక్షి హననం చేత వాల్మీకిలో కలిగిన శోకమే శ్లోకరూపం దాల్చిం దన్న ధ్వనికారవాక్యానికి అభినవగుప్తుడు లోచన వ్యాఖ్యానంలో— "నతు మునేః శోక ఇతి మంతవ్యమ్. ఏవం హి సతి తద్దుఃఖేన సోఽపి దుఃఖిత ఇతి కృత్వా రసస్యాత్మతేతి నిరవకాశం భవేత్. నచ దుఃఖసంతప్తస్యైషాదశేతి. ఏవం చర్వణోచిత శోకస్థాయిభావాత్మక కరుణరస సముచ్ఛలన స్వభావత్వా త్సఏవ కావ్యస్యాత్మా సారభూత స్వభావోఽ పరశాబ్దవైలక్షణ్య కారకః"— (మునికి లౌకికమయిన శోకం కలిగిందని తలచరాదు. అట్లా అయినఎడల ఆ దుఃఖంచేత అతడు కూడా దుఃఖితుడే అవుతాడు. కనుక అప్పుడు రసము కావ్యాత్మ అగుట నిరవకాశమవుతుంది. ఇంతేకాక దుఃఖసంతప్తునకు శ్లోకరచనారూపమైన అవస్థ కలుగదు కదా! కనుక చర్వణోచితమును, శోక స్థాయి భావమాత్మగా కలదియునైన కరుణరస బహిఃప్రసరణ స్వరూపం కలది 'మానిషాద' శ్లోకం. ఆ కరుణరసమే కావ్యమున కాత్మ. సారభూత స్వభావము. కావ్యేతరములైన లౌకికవైదికాది శబ్దములకంటె కావ్యశబ్దములకు

విలక్షణతను గూర్చునదికూడ కావ్యాత్మ అను రసమే) అని. కాని రామాయణంలో

"తస్యైవ్యం బ్రువత శ్చింతా
బభూవ హృది వీక్షతః
శోకార్తే నాస్య శకునేః
కి మిదం వ్యాహృతం మయా"

"పక్షి నిమిత్తం శోకార్తుడనై న నేనేమి పలికితిని?" అని తనే స్వయంగా తాను శోకార్తుడ నయానని చెప్పు కొంటూ ఉండగా, "కాదు కాదు ఆయనకు కలిగినది కరుణ రసాస్వాదన రూపమై న అలౌకికానంద"మని ఆ లోచనవ్యాఖ్యాత దబాయించడం విచిత్రంగా ఉంది. కాగా కావ్యపఠనంవల్ల కలిగిన అనుభూతి అలౌకిక మన డానికి ఆధారం ఏదీలేదు.

ఇట్లా ప్రాచీన పాశ్చాత్య సాహిత్య శాస్త్రజ్ఞు లందరూ కావ్యంవల్ల ఆనందమే కల్గుతుందని ఘోషించగా, ఒక్క నాట్యదర్పణ కర్తమాత్రం వివిధ రసాలవల్ల వివిధానుభూతులు శ్రోతలలో కలుగు తాయని చెప్పాడు. "అతఏవ భయానకాదిభి రుద్విజతే సమాజః. న నామ సుఖాస్వాదా దుద్వేగోఘటతే. యత్పు నరేభిరపి చమత్కారో దృశ్యతే స రసాస్వాద విరామే సతి యథావస్థిత వస్తుప్రదర్శకేన కవి నట శక్తి కౌశ లేన" అని వ్రాశాడు. (కనుక భయానకాదులచే సామాజికు లుద్విగ్నులవుతారు. అదే సుఖమయితే దాని వల్ల ఉద్వేగం ఎట్లా కలుగుతుంది? కాని ఈ రస ములవల్ల చమత్కారం ఎట్లా జనిస్తున్నదంటే అది యథావస్థిత వస్తుప్రదర్శనంలో కవి నటకులు చూపిన శక్తికౌశలం చేత).

కనుక శోక హాస్య భయానకాది కావ్యవర్ణనలు పఠితలలో ఆనందాన్నికాక తత్తద్భావాలను పుట్టిస్తా యనడమే ఒప్పు. శ్రవ్యకావ్యాలకన్నా నాటకాలలోనూ, నాటకాలకన్నా సినిమాలలోనూ ఈ అనుభూతి క్రమంగా ఘనమవుతుంది. శ్రవ్యకావ్యాలలోని వర్ణన లోనూ శైలిలోనూ గల చమత్కృతి శోకభయా దులలోని తీవ్రతని తగ్గించి వేస్తాయి. Shakespeare తన విషాదాంత నాటకాలలో ప్రేక్షకులకు విషాద తీవ్ర తచే మనస్సు వికలం కాకుండా అక్కడక్కడ సందర్భం కలిగించుకొని హాస్యం ప్రవేశపెట్టాడు. సాహిత్యం వల్ల పఠితపొందే అనుభూతి అతడి మనఃపరిపాకాన్ని బట్టికూడా ఉంటుంది. చిన్నవాళ్లు భయానకమైన కథను చదివి నిజంగానే భయపడతారు. విషాద కథను చదివి దుఃఖిస్తారు. పెద్దవాళ్లే మనోవికారాలని నిగ్రహించుకొని సాహిత్యం పఠించగలుగుతారు.

ఇక్కడొక ప్రశ్న వస్తుంది. శోకమయ కావ్యం వల్ల శోకం, భయానకకావ్యంవల్ల భయమూ కలుగుతే, పాఠకు లీ కావ్యాల నెందుకు పఠిస్తున్నారు? దుఃఖాన్నికాని, భయాన్నికాని కోరి ఎవరూ తెచ్చు కొనరు కదా! అని. ఈ ప్రశ్నకు సమాధానం మాన వుడిలోనే ఉంది. మానవహృదయం సంకీర్ణమైనదీ అగాధమైనదీను. శోకాదులను చూసి నవ్వుకొనగలిగే మనోబలం వాడిలో ఉంది. గత కాలంలో అనుభవించిన కష్టాలను స్మరించి నవ్వుకొంటాడు మానవుడు. కష్ట పరిస్థితిలో ఉండికూడా ఒక్కొక్కప్పుడు విషాదాన్ని సూచించే చిరునవ్వు నవ్వుకొంటాడు. అది సంతోషానికి చిహ్నంకాదు, దుఃఖించడానికి మారుగా నవ్వే నవ్వు. గుండె నిబ్బరంలేని వ్యక్తి బోరున ఏడ్చే సన్నివేశంలో చిత్తస్థైర్యం కలవాడు చిరునవ్వు నవ్వి ఊరుకో వచ్చును. ఉరిశిక్షను చిరునవ్వుతో కొందరు ధీరో త్తములైన దేశభక్తులు స్వీకరించారు. అది వారి చిత్తస్థైర్యాన్ని సూచిస్తుందేతప్ప, వారు ఉరిశిక్షా రసాస్వాదనంచేసి ఆనందించారనడం యుక్తమా?

రైలుప్రమాదం జరిగి కొందరు చనిపోయా రనుకొందాం. ప్రమాదానికి లోనవుతున్న ప్రయాణీ కులలోనూ, అది జరిగినవెంటనే రక్తసిక్త శరీర ఖండాలను చూసేవాళ్లలోనూ కలిగే భావం భయం. తర్వాత ఆ దృశ్యాన్ని చూసేవాళ్లలో కలిగేది శోకం. కాని ఆ వార్తని రేడియోలో వినేవాళ్లకీ, వార్తాపత్రి కలలో చదివేవాళ్లకీ కలిగే అనుభూతి ఇంత గాఢ మైనదికాదు. వాళ్లకది ఒక వార్త మాత్రమే కనుక సానుభూతి మాత్రమే కలుగవచ్చును. ఉపాధిభేదాన్ని బట్టి, కాలావకాశదూరాలనిబట్టి ఒకే సంఘటన పలు వురిలో పలుభావాలను కలిగిస్తుంది.

సాహిత్యగతములైన శోకభయానకాది సన్నివే శాలు పరోక్షాలవడంచేత అవి పఠితలో దుఃఖభయా దులను కల్గించక సానుభూతినీ చిత్తోద్వేగాన్నీమాత్రమే కలిగించవచ్చును. లేదా విషాదానికి బదులుగా కలిగే

మందహాసాన్ని కలిగించవచ్చును. అంతమాత్రాన శోకమైనా, బీభత్సమైనా ఏదైనాసరే సాహిత్య నిబద్ధమైన వెంటనే అది పాఠకులలో ఆనందాన్నే కలిగిస్తుందనడం పొరపాటు. ధ్వన్యాలోకకారుడీ విషయాన్ని కొంతమట్టుకు ఆశంకించకపోలేదు. వీరాన్ని వర్ణించే కవిత్వం పఠితలో 'దీప్తి'ని కలిగిస్తుందంటాడు. ఏమిటీ దీప్తి? వీరగాథని చదవగా పుట్టిన ఉత్సాహం కాక? కనుక శృంగారము, దుఃఖము, వీర్యము మొదలైనవి నిరూపితములైన సాహిత్యములు పఠితలలో తత్తాదృశానుభూతులనే కలిగిస్తాయనడం ఒప్పు. రాముడు అడవికిపోతున్న ఘట్టాన్ని చదవగా పాఠకులకు దుఃఖమే కలుగుతుందికాని, ఆనందం కలుగుతుందనడం హాస్యాస్పదం కాదా!

రోడ్డుమీద ప్రమాదం జరిగి ఎవరైనా చనిపోగా అందరూ చుట్టూ చేరతారు. అది భయానకదృశ్యం కనుక చూడరాదని తలచరు. మానవునిలోని ఉత్సుకత అది. ఈ ఉత్సుకతే పఠితలనుశోకమయాది సాహిత్యాన్ని పఠింపజేస్తుంది. జీవితపు లోతులను పరిశీలించి సాహిత్యనిర్మాతలు సాహిత్య రచన చేస్తారు. జీవితపు లోతులను తెలుసుకొందుకే సాహితీప్రియులు సాహిత్యాన్ని చదువుతారు. సాహిత్యపఠనంచేత పఠితలకు మానవ జీవితాలు అర్థమై మనస్సుకి చేవ కలుగుతుంది.

ఇప్పుడు మొట్టమొదటి ప్రశ్నకు తిరిగివద్దాం. కవిత్వమంటే ఏమిటి ? అని. కాని ఈ ప్రశ్నను ఎప్పుడూ కవిత్వాన్ని గురించే ఎందుకు వేసుకోవాలి? కథ అంటే ఏమిటి? నవల అంటే ఏమిటి? నాటకమంటే ఏమిటి? అని ఎందుకు ప్రశ్నించకూడదు ? ఈ ప్రశ్నించకపోవడానికి కారణం కథ, నవల, నాటకం వీటి స్వరూపాలను గూర్చి ఎవరికీ సందేహం లేకపోవడమే. కథ కథే, నవల నవలే, నాటకం నాటకమే. కాని కవిత్వం అలాక్కాదు. అందులో ఎక్కడో కిటుకు ఉంది. అదేదో కనిపెట్టాలి, కాని దొరకడంలేదన్న ఔత్సుక్యం ఈ ప్రశ్నను వేయిస్తున్నది. కాని పై అన్నిటివలె కవిత్వం కవిత్వమే అని చెప్పడంకన్నా కవిత్వానికి సరి అయిన అన్య నిర్వచనం ఎవరూ ఇవ్వలేరు. కవిత్వం కూడా కథ, నవల, నాటకం వలె ఒక సాహిత్య ప్రక్రియ. కనుక సాహిత్యమంటే ఏమిటి? అన్న ఒక విస్తృతమైన ప్రశ్నను వేసుకొని సమాధానాన్ని అన్వేషించడమే సముచితం.

సహితముయొక్క భావము సాహిత్యం. అంటే కూడి ఉండడమన్నమాట. ఏవేవి కూడిఉండడమంటే మళ్ళీ శబ్దార్థము. అలంకారములోనో, గుణాలంకారములోనో, ధ్వనిలోనో, రసములోనో ఇలా ఎవరి మతాన్నిబట్టి వారు చెప్పుకోవచ్చును. ఈ నిర్వచనాలు మనకు సంతృప్తి కల్గించే సమాధానాన్ని ఇవ్వవు.

మానవజీవితాన్ని, దానితో సన్నిహిత సంబంధం కల జంతువులనూ, అచేతనములనూ విశేషంగా వర్ణించడమే సాహిత్యం. విశేషమంటే ఎక్కువగా అని కాదు, వాటిలోని విశేషం వ్యక్తమయేటట్లు వర్ణించడం. దీనిచేత మానవజీవితాలనే వర్ణించేవైనా చరిత్రాదులు సాహిత్యం కావు. ప్రభాకర వర్ధమానుని అనంతరం అతని కొడుకు రాజ్యవర్ధనుడు రాజ్యానికి వచ్చాడు, అతడు చనిపోగా అతని తమ్ముడు హర్షవర్ధనుడు రాజయాడు—అంటే ఇందులో విశేషం లేదు. కనుక సాహిత్యం కాదు. అనగనగా ఒకడు, ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు, పేదవాడు, పెద్దవాడు ఉద్యోగం చేస్తున్నాడు, రెండోవాడు చదువుకొంటున్నాడు, ఒక కూతురు చనిపోయింది అని ఈ విధంగా వ్రాసుకుపోతే ఆ యా సన్నివేశాలలో ఆ యా వ్యక్తుల మనఃపరిశీలనం లేదు కనుక సాహిత్యం కాదు. ఒక బస్సు బోల్తా పడింది, పదముగ్గురికి గాయాలు తగిలాయి, ముగ్గురు మరణించారు అంటే, ఇవి పొడి మాటలు. మానవజీవితాన్ని ప్రతిబింబించిన మాత్రాన సాహిత్యం అవదు. ఆ జీవితానికి సంబంధించిన విశేష చర్చ ఉండాలి.

పర్వతాలు, నదులు, చెట్లు, ఆకాశం, వర్షం మొదలైనవి అచేతనాలైనా మనకు అత్యంత పరిచితములై మనలో విస్మయానందోద్వేగాది భావాలను కల్గిస్తూ ఉంటాయి. కనుక వీటి యథాతథ వర్ణన సాహిత్యమవుతుంది—ఆ వర్ణన మనలో విస్మయానందోద్వేగాది భావాలను జనింపచేయగలుగుతే వీటిలో చేతనత్వారోపణ ఉండవచ్చును, లేకపోవచ్చును.

జంతువుల వర్ణన సాహిత్యంలో ద్వివిధంగా ఉంటుంది. ఆవులు, మేకలు, కుక్కలు మొదలైనవీ, వాటి స్వభావాలూ మనకు సుపరిచితాలు. ఏనుగులు, సింహాలు, పులులు మొదలైనవి కూడా పరిచితాలే.

కనుక వీటి యథాతథ సాధారణ స్వభావ వర్ణన సాహిత్యం మవుతుంది. శాకుంతలంలోని లేడి వర్ణనను దృష్టాంతంగా చూపవచ్చును. కాని వీటి గాఢ మనస్తత్వ పరిశీలనకు సాహిత్యంలో తావులేదు. ఒక ఆవో గాడిదో మనస్సులో ఏమనుకొంటోందో మనకెలా తెలుస్తుంది? మనం కూడా ఆవో గాడిదో అయితే తప్ప. కనుక జంతువులకి సంబంధించిన మనస్తత్వ విచారణ కల్ప సాహిత్యంలో మానవ భావాలనే వాట్లలో ఆరోపించి చెప్పడం జరుగుతుంది. పంచతంత్రంలో జంతువుల కథ లిలాటివే. G. K. Chesterton మానవులలోని కురూపతకు ప్రతీకగా గాడిదను తీసుకొని "Donkey" అన్న మంచి ఖండకావ్యం రచించాడు.

సాహిత్యం అభిప్రాయ ప్రధానమైనది. Aristotle కళని "a faculty of production in accordance with a true idea" అని నిర్వచించాడు. లోకాన్నీ, మానవజీవితాలనూ పరీక్షించి రచయిత కొన్ని అభిప్రాయాలను ఏర్పరచుకొంటాడు. ఆ అభిప్రాయాలను తన సాహిత్యంద్వారా ప్రకటిస్తాడు. ఏ మానవజీవితాలను పరిశీలించగా ఆ అభిప్రాయాలు రచయితలో ఏర్పడినాయో తిరిగి వాటినే తన అభిప్రాయ ప్రకటనకి వాహకంగా గ్రహిస్తాడు. ఐతే ఇందాక ప్రపంచంలో జరిగిన మానవజీవన వాస్తవ సంఘటనలకీ ఇప్పుడు సాహిత్యనిబద్ధములైన వాటికీ అంతరం ఉన్నది. ఇందాకటి సంఘటనలు వ్యస్తములైనవి. అందులోకొన్ని అభిప్రాయ వ్యక్తీకరణకు ఉపయుక్తములు, కొన్ని కావు. వాస్తవ జగత్తులో జరిగిన సంఘటనలద్వారా మానవజీవితం గురించిన అభిప్రాయాలను గ్రహించడానికి రచయిత అంతటి ద్రష్ట అవసరం. అందరూ యథార్థ ప్రపంచంనుండి మానవ జీవితపు లోతుపాతులను గ్రహించలేరు. సాహిత్యస్రష్టలు మాత్రమే గ్రహించగలరు. గ్రహించిన తర్వాత ఆ అభిప్రాయాలను రచయిత రచనానిబద్ధం చేస్తాడు. ఈ రచనయొక్క ఉద్దేశ మేమిటి? తాను గ్రహించిన జీవిత సారాంశాలను రచనద్వారా పఠిత గ్రహించ గలగడం. కనుక ఎట్లా వ్రాస్తే తన అభిప్రాయం ప్రబలంగా, సుస్పష్టంగా ప్రకటిత మవుతుందో ఆ విధంగా ఆయాసంఘటనలనుకూర్చి, అనవసరమైన వాటిని తొలగించి, అవసరమైతే మార్చి, రచన ద్వారా అభిప్రాయ ప్రకటనం చేస్తాడు. Tolstoy కళను ఇట్లా నిర్వచించాడు—"To evoke in oneself a feeling one has once experienced, and having evoked it in one self, then by means of movements, lines, colours, sounds, or forms expressed in words, so to transmit that feeling that others may experience the same feeling—this is the activity of art.

సాహిత్యానికి అభిప్రాయమే ప్రధాన మన్నది ప్రత్యేకించి గమనించాలి. దీనివల్ల మానవలోక సంఘటనలు అప్రధానములని తేలుతుంది. వీటి ప్రయోజనం ఆ అభిప్రాయ వ్యక్తీకరణకు సాధనములు కావడం మాత్రమే. అభిప్రాయం లేని మానవజీవన సంఘటనల వర్ణన సాహిత్యం అనిపించుకొనదు. రచయిత తానూ మానవుడు కనుక, మానవ జీవితాలను గురించి వ్రాస్తేతప్ప మానవులకి అర్థంకాదు కనుక, మానవజీవనపరిశీలనంవల్ల తన అభిప్రాయాలు ఏర్పడినాయికనుక, తన అభిప్రాయ ప్రకటనకి వాహకంగా మానవజీవనసంఘటనలను చేపట్టడం జరుగుతున్నది. సాహిత్యగత మానవజీవన వర్ణన అంతా సాధనమేతప్ప సాధ్యంకాదు. సాధ్యం అభిప్రాయం.

అంటే సాహిత్యంలో అభిప్రాయం ప్రధానమనీ, మానవజీవన సంఘటనలు, అనగా వాస్తవికత అప్రధానమనీ సారాంశం. సాధారణంగా వీటికి వైరుధ్యం ఉండదు. వాస్తవికతలోనుంచి జనించిన అభిప్రాయం ఆ వాస్తవికతకు సాధారణంగా వ్యతిరిక్తం అవదు. కాని సాహిత్యం అభిప్రాయ ప్రధానం కావడం చేత ఒక్కొక్కప్పుడు రచయిత వాస్తవికతకు అతీతంగా ఊహించి ఆ ఊహకే రూపకల్పనం చెయ్యవచ్చును. అప్పుడు రచయిత ఊహ తెస్స కాకపోతే ఆ రచనలో వాస్తవికత దెబ్బతిన్నదనీ, అదొక అభూత కల్పనమనీ పాఠకుడు కొట్టిపారవేస్తూఉంటాడు. ఉదాహరణకు—

'పాతాళమివ నాభి స్తే పర్వతావివ చ స్తనౌ
వేణీదండః పునరయం కాళిందీపాత సన్నిభః'

(నీ నాభి పాతాళంవలె ఉంది. నీ స్తనములు పర్వతములవలె ఉన్నవి. నీ వేణీదండము కాళిందీ ప్రవాహంవలెనే ఉన్నది.) ఇక్కడ ఉపమానాలు తత్తదంగ సౌందర్యాన్ని చూపలేకపోతున్నాయి. కనుక సాదృశ్యం అనుచితంగా కనిపిస్తున్నది.

కాని రచయిత ఊహ లెస్స అయితే పాఠకుడు మెచ్చుకొంటాడు — అది వాస్తవమా కాదా అన్న జిజ్ఞాసే ఉదయించదు. దీనికి రఘువంశ కావ్యంలో నుంచి ఒక ఉదాహృతిని ఇస్తాను. రఘుమహారాజు సైనికులు హిమాలయ ప్రాంతాలలోనుంచి వెళుతున్నారు. అప్పుడు—

"శశంస తుల్య సత్త్వానాం
సైన్య ఘోషేఽప్యసంభ్రమమ్
గుహాశయానాం సింహానాం
పరివృత్యావలోకనమ్."

(గుహలలో పండుకొని ఉన్న సింహములు సైన్య ఘోషను విని సంభ్రమము లేక మెడలు త్రిప్పిచూచుటచే తామూ సైనికులతో తుల్యసత్త్వులమని సూచించినవి). రఘుమహారాజ సైనికులు బలపరాక్రమములలో సింహసమానులని ఈ శ్లోకాభిప్రాయం. ఇది లెస్సగా నిరూపితమైంది. కనుక ఇందలి వాస్తవికతను మనం పట్టించుకొనడం లేదు. జంతు స్వభావాన్ని బట్టి సింహాలు అలాగ నిశ్చలంగా ఉండవు. సింహాలు సైనికులపైకి ఉరికి ఉంటాయి. వాళ్ళు వాటిని ఆయుధాలతో ప్రహరించి ఉంటారు. ఇది వాస్తవికత. కాని ఇట్లా వ్రాస్తే దీనివలన నిశ్చితమైన అభిప్రాయ ప్రకటన జరగదు. ఇక్కడ అసహజత్వమే భావ వ్యక్తీకరణను చేయజాలుతున్నది.

అభిజ్ఞాన శాకుంతల నాటకంలో శకుంతలా ముఖారవిందాన్ని చూసి అదొక పద్మమని భ్రమించి భ్రమరము వ్రాలబోగా అప్పుడు దుష్యంతుడు ప్రవేశ పెట్టబడినాడు. స్త్రీ ముఖాన్ని పద్మంతో పోల్చడం, దానిని చూసి భ్రమరం భ్రాంతి చెందిందనడం కవి సమయాలు. వాస్తవాలు కావు. కాని ఊహాశాలి ఐన కాళిదాస మహాకవి వీటిని అత్యంత సమర్థతతో నాటకీకరించడమేకాక, నాటకంలో ప్రధాన సంఘటనగా కూడా నిరూపించాడు.

ఈ నాటకంలోని కణ్వాశ్రమ వర్ణనం కూడా వాస్తవికతకు దూరమైనదే. రామాయణంలో అడవులలోని మున్యాశ్రమాలు వర్ణింపబడినాయి. ఆ ఆశ్రమ పరిసరాలు ఎంత దుర్గమంగా, త్రాసదములుగా ఉండేవో ఆ వర్ణనలలో తెలుస్తుంది. వాల్మీకి మున్యాశ్రమాలని యథార్థంగా వర్ణించాడు. అరణ్యకాండంలో అత్రి మున్యాశ్రమ వర్ణనను పరిశీలించవచ్చును. కాని శృంగార నాటకేతివృత్తానికి స్థానమైన కణ్వాశ్రమాన్నిఅందుకు అనుకూలంగా కాళిదాసు సుందర సవాటింగా వర్ణించాడు.

"మహాప్రస్థానం" అన్న ఖండకావ్యంలో—

"శివసముద్రమూ
నయాగరావలె
ఉరకండి! ఉరకండి! ముందుకు!
పదండి ముందుకు!
పదండి త్రోసుకు!

అన్న పద్యం ఇంకొక దృష్టాంతం. 'అభ్యుదయ కాములు ఉత్సాహంలో ముందుకి ఉరకండి' అని కవి అభిప్రాయం. దీనికై జలపాతాలు ఉద్రిక్తంగా ఉంటాయి కనుక సుప్రసిద్ధములైన రెండు జలపాతాలను కవి ఉపమించాడు. వీట్లలో నయాగరాని కవిగాని, మనంగాని చూడలేదు. శివసముద్ర జలపాతాన్ని మనలో కొందరు చూసి ఉండవచ్చును. ఈ పద్యంలో స్ఫురించే ఉద్రేకం శివసముద్రంలో వాస్తవంగా లేదు. శివసముద్ర జలపాత మొక సౌందర్య లహరి. ప్రశాంత నిలయం. ఐనా ఈ పద్య భావానికి భంగం లేదు. వాస్తవిక జగత్తులోని శివసముద్రం ప్రశాంతంగానే ఉన్నా, ఈ పద్యంలోని శివసముద్రం మట్టుకు కవి ప్రతిభచేత ఉద్రేకంగా ఉన్నట్లే మనకు తోస్తుంది. శివసముద్రం నిజంగా ఉద్రిక్తంగా ఉంటుందా ఉండదా అన్నది పై పద్య భావగ్రహణానికి ఉపకరించే ప్రశ్న కాదు.

సాహిత్యం అభిప్రాయ ప్రధానమని, వాస్తవికత అప్రధానమని, అవాస్తవములైనా కొన్ని ఎట్లా మంచి సాహిత్యం కాగలిగాయో ఇంతవరకు చర్చించాను. కొన్ని సంఘటనలు వాస్తవములని రచింపబడినందుచేత కొన్ని

కొన్ని చోట్ల రచయిత అభిప్రాయం ఎట్లా వమ్మయి పోతూ ఉంటుందో ఇప్పుడు చర్చిస్తాను.

శాకుంతలం షష్ఠాంకంలో శకుంతలా విరహి అయిన దుష్యంతుడు ఆమె చిత్రాన్ని చిత్రించి దానిని విదూషకుడికి చూపి, ఆ చిత్రం అసంపూర్ణమనీ, ఇంకా చిత్రించవలసింది ఉందనీ ఇట్లా అంటాడు —

'కార్యా సైకతలీన హంసమిథునా
స్రోతోవహా మాలినీ
పాదా స్తామభితో నిషణ్ణహరిణా
గౌరీ గురోః పావనాః,
శాఖాలంబిత వల్కలస్య చ తరో
ర్నిర్మాతు మిచ్ఛా మ్యధః
శృంగే కృష్ణమృగస్య వామనయనం
కండూయమానాం మృగీమ్.'

(సైకతములందు హంస మిథునములు కల మాలినీ నదిని చిత్రించవలసి ఉంది. ఆ నది కిరువైపుల గల హిమవత్పర్వత ప్రాంతాలనూ, అక్కడ నిషణ్ణములై ఉన్న లేళ్లనూ, తరుశాఖలందు వ్రేలాడుచున్న వల్కలములను, కృష్ణమృగ శృంగమున తన వామ నయనమును గోకికొనుచున్న మృగిని చిత్రించవలసి ఉంది.) ఇవన్నీ వాస్తవములూ, చిత్రించకుండా మిగిలిపోయినవీ కావచ్చును. కాని ఈ ఉల్లేఖం దుష్యంత గాఢ విరహ ప్రకటనకి దోహదకారి కాకపోవడమేకాక ప్రతిరోధక మవుతున్నది.

కాబట్టి సాహిత్యానికి అభిప్రాయమే ముఖ్యమని, వాస్తవికత గౌణమని తేలుతున్నది. కనుక ఈనాడు సామాన్యంగా జరుగుతున్న సాహిత్య విమర్శన పద్ధతి — కవి, అతడికాలం, ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు, రచయితపై వాటి ప్రభావం — ఈ విధమైన చర్చ సరి అయినది కాదు. రచయిత అభిప్రాయాన్ని కనిపెట్టి ఆ రచనలో ఆ అభిప్రాయం ఎంతవరకు ఆవిష్కృత మవుతున్నదని చర్చింపబడాలి. సాంఘిక రాజకీయ ప్రభావాలు గౌణమయినవి. కొందరు రచయితలు ప్రభావితులు కావచ్చును, కొందరు కాక పోవచ్చును. కాళిదాస కృతులలో, ఆంధ్రప్రబంధాలలో ఆనాటి సంఘ జీవనం ఎంత ప్రతిబింబిస్తున్నది?

Somerset Maugham ఒకానొక తన కథల సంపుటికి ఉపోద్ఘాతంలో — కథలో చూడవలసినది కథే. కాని సాధారణంగా నేటి సాహిత్యవేత్తలు కథను కథగా కాక ఏదో అభిప్రాయంకోసం చదువుతూ ఉంటారు. అది తప్పు. నా అభిప్రాయంతో ఏకీభవించే సాహిత్య పఠితలు వచ్చేవరకూ నా కథలు మంచి కథలుగా ఆమోదాన్ని పొందడానికి చిత్తస్థైర్యంతో ఎదురు చూస్తాను' అని వ్రాశాడు. కాని ఈ అభిప్రాయం తప్పు. కథ సంఘటన ప్రధానమైనది కాదు; అభిప్రాయ ప్రధానమైనది. సాహిత్యమంతా అంతే. కథ కథకోసమే అయితే ఛెకోవ్ కథలకన్నా మామ్ కథలూ, మామ్ కథలకన్నా డిటెక్టివ్ కథలూ మంచి సాహిత్యమని చెప్పవలసి వస్తుంది. కథకు సస్పెన్సు ఆవశ్యకం కాదు. ఛెకోవ్ కథలలో సస్పెన్సు కాదు కదా కొన్నిటిలో సంఘటనే ఉండదు. కాని మానవ జీవిత గాఢ పరిశీలనం, ప్రతి వస్తువునూ కళాత్మకంగా చూడడం — ఇవి ఛెకోవ్‌ను కథ కస్రేష్ఠుడిగా నిలబెడుతున్నాయి. కథకు సస్పెన్సు, విచిత్ర సంఘటనలు ఆవశ్యకములన్న భ్రమలో మునిగిపోయాడు Somerset Maugham. పాఠకుడు ఊహించని విధంగా కథను ముగించి అందరినీ ఆశ్చర్యచకితులని చెయ్యడంకోసం తన కథా నిర్మాణశక్తి నంతటినీ వినియోగించాడు.

Macbeth నాటకంలో చివరని Macbeth గెలిచి Madduff చంపబడితే Macbeth నాటకం ముగింపు పాఠకుడు ఊహించని రీతిగా ఉండి మామ్ కథలవలె అందరినీ విస్మయ నిమగ్నులని చేస్తుంది. కాని నాటకంమాత్రం భ్రష్టమైపోతుంది.

"Tomorrow, and tomorrow, and tomorrow,
Creeps in this petty pace from day to day
To the last syllable of recorded time,
And all our yesterdays have lighted fools
The way to dusty death."

అన్న అభిప్రాయం చుట్టూ నిర్మితమైన నాటకం యావత్తూ వమ్మయిపోతుంది. Macbeth గెలవడమే అయితే అప్పుడు నాటకం అన్యాభిప్రాయంతో విరచితం కావాలి.

"Imitative art in its highest form, namely poetry, is an expression of the universal element in human life" అని Aristotle అన్నాడు. అంటే మానవజీవితాలలోని సామాన్య విషయాలనే కావ్యవస్తువులుగా తీసుకోవాలన్నీ విలక్షణమైన ప్రత్యేక విషయాలకి కావ్యవస్తువులు కాగల అర్హతలేదనీ మనం అర్థం చేసుకోకూడదు. Shakespeare నాటకాలలోని పాత్రలెన్నో విలక్షణమైన ప్రత్యేకత కలిగినవి. ప్రత్యేకం గురించి వ్రాసిన సాహిత్యం ఆ ప్రత్యేకంలోని సామాన్యాన్ని వ్యక్తం చేసేదిగా ఉండాలి. ఒక పిచ్చివాడి జీవితాన్ని గురించిన రచన వాడిపిచ్చిచేష్టలను వర్ణించినమాత్రాన సాహిత్యం అవదు. ఆ పిచ్చికి సంబంధించిన మన స్తత్వ పరిశీలనతో ఆ పిచ్చితనంలోని మానవత్వ సామాన్యం వ్యక్తమైనప్పుడే సాహిత్యమవుతుంది. ఇట్లాకొందరు వ్యక్తులు, కొన్ని సంఘటనలు అన్న ప్రత్యేకాలనుండి సార్వజనిక జీవిత సత్యములవే సామాన్యం వ్యక్తం కావడమే సాహిత్యం. రస సిద్ధాంతంలో శకుంతల తనదీ ఇతరునదీ కాని సామాన్య కాంతంగా తోస్తుంది అనడంలో లింగా ఈ అభిప్రాయం కనిపిస్తుంది. కాని దానికి రసమని పేరు పెట్టి, అది సామాజికునిచే ఆస్వాదింపబడుతుందని అనడంచేత భారతీయ సాహిత్యవేత్తలీ అభిప్రాయాన్ని తప్పుత్రోవ పట్టించారు. శకుంతల సామాన్యకాంతగా తోచదు, ఆమె వ్యక్తిత్వం పఠితకు పూర్తిగా అర్థమవుతుంది:



# రా !

## శ్రీ చెరబండరాజు

దరిద్రపీడిత భారత ప్రజలకు
నీ దేహంతో ముడిసరుకు లోటును పూరిస్తాను
నూతన ఖనిజంగా నిన్ను మార్చేస్తాను

రా !

కానీ గుత్తాధిపత్యంలో పెరిగిన
బెలూనువంటి వొంటితోగాదు
కసాయి మనస్తత్వంలో కుళ్లిన
కళేబరంతోగాదు
ఈర్ష్యాసూయలతో చిల్లులుపడ్డ
శ్వాసకోశాలతోగాదు
నటనాంకిత సుఖాబ్దిలో
మునిగి తేలిన దేహంతోగాదు
చెదలుపుట్టకాయంతోగాదు

చెట్టులా సచేతనంగా పెరిగిన
కరుణా వర్షంలో తడిసిన
అవయవాలతో రా

ఇక్కడ దృశ్యాదృశ్య ప్రాణికోటికి
ఒకే తీరు జాలి బాట కనిపిస్తోంది
ఒకే తీరు గాలి పాట వినిపిస్తోంది

హృదయాంతర్గత లోకాల్ని ఊహించలేని
బాహ్య ప్రపంచపు మట్టిస్నేను

రా !

దేశాభ్యున్నతికి
దరిద్ర శాప విముక్తికి
మేలైన ముడిసరుకు సృష్టించే బాధ్యత నాది
నీ ముందు తరాలు నిన్నిక్కడే వెతుక్కుంటాయి

ఊపిరి, రక్తం, కోరికల్నేని
మూడడుగుల ప్రశాంత స్థలాన్ని నేను

అద్దెలేదు సొంతిల్లు నీడే యిది
ప్రతి వూరిలో వుంటాన్నేను
ఎప్పుడైనా
ఎక్కడికయినా
రా

---



# శ్రీకృష్ణలీలా తరంగిణి: సంగీత సాహిత్యములు

కుమారి ఎం. ఎస్. రాణీ ప్రమీలాదేవి

## 1

శ్రీ నారాయణ తీర్థులవారు రచించిన శ్రీ కృష్ణ లీలాతరంగిణి సంగీత సాహిత్య నాట్యములు మధు రాద్భుత సమ్మేళన మందిన యక్షగాన ప్రబంధము. ఇది సంస్కృతభాషలో నున్నది. ఇందలి కీర్తనలు వాని మధురసంగీత ప్రతిభచే ఆంధ్ర తమిళ కర్ణాటాది ప్రాంతములందు తరంగములను పేరిట విశేషప్రచార మందుట ఈ గ్రంథ-- ఔన్నత్యమునకు నిదర్శనముగా నున్నది. ఇందులో సంగీత మెంత ప్రధానమైనదో తాళము, నృత్యము నంతకంటె ప్రధానముగా కను పించుచున్నవి. వానితోపాటు అభినయము కూడ సమాన మగు ప్రాధాన్యము వహించుచున్నది.

ఈ కీర్తనలను సంప్రదాయసిద్ధముగా గానము చేయు విద్వాంసులు విస్తారముగా ఆంధ్రదేశములోనే ఉండుట మన అదృష్టము. దక్షిణభారతమందు 'తరంగ' గానములేని దైవసంకీర్తనము లేదనుట అతి శయోక్తి కాదు. కొందరు గానముతోపాటు నృత్యము కూడ చేయుచున్నారు. మరికొందరు వీనిని 'తాం తాహ తధై దతత్తాం'—మొదలగు జతులతో ప్రస్తరించి పాడుటయు కలదు. దీని కుదాహరణముగా జగత్ప్ర సిద్ధి పొందిన 'బాలగోపాల తరంగము'నే పేర్కొన వచ్చును.

ఈ గ్రంథములో కీర్తనలేకాక పద్య గద్యములు కూడ కలవు. పద్యములు మధురోదాత్తమైనవి. గద్యములు విశిష్ట మనోహరత కలవి. గ్రంథకర్త ఈ గ్రంథమును పండ్రెండు భాగములుగా విభజించి ఆ భాగములకే తరంగములని నామకరణ మొనర్చెను. పండ్రెండు తరంగములున్న నదిగా—తరంగిణిగా కవి భావించినాడు. కాని ఇందులోని కీర్తనలే ఎక్కువగా ప్రచారములో ఉన్నందున వానికే తరంగములను పేరు వ్యవహారములోనికి వచ్చినది. కేవల కీర్తనలే గ్రహించు వారు ఈ గ్రంథము అందుకొన్న రససిద్ధిని పరి పూర్ణముగా గ్రహింపజాలరు.

అసలీ ప్రబంధము రంగస్థలముపైని ప్రద ర్శించుటకు ఉద్దేశింపబడిన దృశ్య కావ్యమని స్పష్ట ముగా తెలియుచున్నది. క్రొత్త పాత్ర ప్రవేశపెట్టి నపుడెల్ల 'అథ వసుదేవాగమనమ్—అథ కంసాగమ నమ్' అని మొదలుగా చెప్పబడి వెంటనే రాగ తాళ ములతో కూడిన చిన్నదరువు ఒకటి యుండును. ఇట్టిదానికే 'ప్రావేశిక దరువు' అను సంజ్ఞ కలదు.

ప్రతి తరంగాదియందును రాబోవు తరంగము లోని కథ అనుష్టుప్పులలో సులభభాషలో చెప్పబడి నది. ఆ సంక్షేప కథనములో తరచుగా 'అథాభినీయతే' అను శబ్దములు కవి వాడియుండుట గమనింప దగును. 1, 3, 5, 6, 7, 8, 10, 12 తరంగములలో అనగా పండ్రెండింటిలో ఎనిమిదింటిలో 'ఇక అభినయింప బడుచున్నది.' అని కవి కంఠోక్తిగా చెప్పుట చేతనే ఈ కావ్య స్వరూపము స్పష్టపడు చున్నది.

ఈ కథా సంక్షేపములో కొన్నియెడల 'అథ గీయతే' అనియు 'అథ వర్ణ్యతే' అనికూడకలదు. దీనినిబట్టి ఇందులో గానమును వర్ణనమును గూడ ఉన్నవని తెలుచున్నది. సంగీత సాహిత్య నాట్యముల దివ్య సమ్మేళనమే 'శ్రీకృష్ణలీలా తరంగిణి'గా రూపొందినది.

శ్రీ తీర్థులవారు దీనికి యక్షగానమని పేరు పెట్టకున్నను లక్షణములనుబట్టి దీనిని యక్షగాన మనుటే సమంజసము. వీరు ఆంధ్రములో 'పారిజాతాపహరణము' అను యక్షగానమునుకూడ రచించిరి. అందులో కొన్ని భాగములే లభించుచున్నవి కాని పూర్తిగా లభించుట లేదు. దాని సామ్యమును బట్టికూడ ఈ గ్రంథమును యక్షగానముగా పరిగణించుటయే సమంజసమనిపించుచున్నది. తీర్థులవారు జీవించిన 17, 18 వ శతాబ్దములు దక్షిణ భారతములో యక్షగాన ప్రబంధములు ఎక్కువగా రచింపబడిన కాలమనికూడ గుర్తుంచుకొనవలెను.

ఆంధ్ర ప్రబంధములకు సంస్కృత కావ్యముల కంటె విశిష్ట లక్షణములున్నవని ఆంధ్ర విమర్శకులనుట పరిపాటియైనది. కాని దాని లక్షణ మిద మిత్థమని నిశ్చయించి చెప్పుట సాధ్యముకాదు. మను చరిత్రము ప్రథమ ప్రబంధమని సాధారణముగా విమర్శకు లనుచున్నారు. మరి ఎర్రయ నృసింహావతారమును ప్రబంధ మనుటకు అభ్యంతరమేమి ? విజయవిలాసమును, శ్రీ కాళహస్తీశ్వర మహాత్మ్యమును ప్రబంధము అనుచున్నారు. హరవిలాసమును ప్రబంధమనక పోవుటకు కారణమేమి ? సత్యమాలోచించినచో 'ప్రబంధ రచన' అనబడునది, కాలప్రభావమును బట్టి కవి అభిమానమునుబట్టి నానారూపము లందినది. యక్షగాన ప్రబంధములుకూడ అట్టిమార్పులే పొందుచువచ్చినవి. వానిలో కొన్నిటినే గ్రహించి వాని లక్షణములనే కొలబద్దగా స్వీకరించి స్వరూపనిర్ణయముచేయుట సమంజసముకాదు. ముఖ్యముగా యక్షగానములు 'వీథి భాగవతముల'వలెనే సామాన్యజనమును రంజింప జేయుటకు ఉద్దేశింసబడినవి. అందుచే యక్షగాన కవులు జనరంజనమునకై సజాతీయ రచనల పద్ధతులను, తోడి తమిళ కర్ణాట మహారాష్ట్రాది భాషలలోని పదతులను విరివిగా తమ రచనలలో ప్రవేశపెట్టుకొనిరి.

స్థూలముగా చెప్పినచో, యక్షగానము సంగీత నృత్యములు ప్రధానమై అభినయము వర్ణనముకూడ కలసి రంగస్థలముపైని ప్రదర్శించుటకు యోగ్యమైన నాట్యప్రబంధమని చెప్పుట యుక్తము. పాశ్చాత్య పరిభాషలో, ఒపెరా (Opera) దీనికి కొంత సన్నిహితమైనదేమో !

**2**

దురదృష్టవశాత్తుగా జనరంజనమునకే యక్షగానము ఉద్దేశింపబడుటచేత 'విద్వత్కవులు యక్షగాన రచనకు ఎక్కువగా పూనుకొనలేదు. విద్వాంసులు రచించినను భాషయందు శ్రద్ధ చూపలేదు. వ్యావహారిక భాషయేకాక తరుచుగా గ్రామ్యభాషయే ప్రయోగింపబడుచుండెను. ఒక వంక శృంగారము వైపునకును మరియొక వంక హాస్యము వైపునకును కవుల దృష్టి ప్రసరింపసాగినది. శాహజీ వ్రాసినట్లున్న 22 యక్షగానములనుగూర్చి వ్రాయుచు డాక్టరు యస్వీ జోగారావు, 'అందు కొన్ని యసలు ముద్రణానర్హముల యున్నట్లుండునన్న నిక నాతని సాహిత్యమునందలి యౌచిత్యము నతిసులభముగా నూహింపవచ్చును.' అని వ్రాసిన దానినిబట్టి శృంగారము అసభ్యముగాను, హాస్యము వెగటుగాను ఉండునని ఊహింపవచ్చును. భక్తకవయిత్రియగు వెంకమాంబ రచించిన పారిజాతములోనే వనపాలికయగు వక్రభాషిణికిని సత్యభామకును సంభాషణము ఈ క్రింద ఉదాహరించినంత వెగటుగా ఉన్నదని తెలిసికొన్నచో, తక్కినవాని సంగతి అనుమేయింపవచ్చును.

"అవునే అమ్మయ్యా, ఏమే తిమ్మయ్యా, నీవెవరవే ఓ అక్కయ్యా, నన్ను ఎవరనేటందుకు నీవెవరవే నక్కయ్యా, నీపేరు ఏమని పిలుతురే ఓకొమ్మా ఓకొమ్మా, నన్ను కలహ కంటికి యందురే ఓ తుమ్మా ఓతుమ్మా, నేను ఎంతో ఘనంబుగా నిన్ను కొమ్మా అంటే నీవు తుమ్మాయందు రటవే భామా ఓభామా, నీవు నాతోటంతా తొక్కి వచ్చిమిరపపండ్లు, తెలగడ్లు, యెరగడ్లు, కొయింగూర, గోంగూర, చింతకాయలు, ముల్లంగెడ్లు మొదలయినవికోసి కూరవండుక తిన్నావు గనుక కోపముచాత నేను అట్లాంటూండానే దోమా ఓ దోమా..."

కాని శ్రీకృష్ణలీలా తరంగిణినికి యక్షగాన మన్నప్పుడు పై లక్షణములన్నియు మనము విస్మరింప వలెను. దీనికర్త శ్రీ నారాయణ తీర్థులు షట్శాస్త్ర పారంగతుడైన మహావిద్వాంసుడు. లీలాశుకుడు, జయదేవుడు—ఇట్టివారి కోవకుచెందిన భక్త కవీశ్వరుడు. అన్నిటికితోడు సర్వసంగ పరిత్యాగము చేసిన పరమహంస పరివ్రాజకుడు, తీర్థసాంప్రదాయమునకు చెందిన యతీశ్వరుడు.

లట్టి కవులే కవులు, బుధులు. భాష సంక్ష ణమైన సంస్కృతము. ఇందులోని కీర్తనలు జయ దేవుని అష్టపదులంటివి, శ్లోకములు లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృత శ్లోకములవంటివి, వచనములు వంటివిగాని ఉన్న భావావేశమునందుగాని విస్తృతము లేనివి. ఇందలి గద్యము భోజుని చంపూ రామాయ ణములోని గద్యములను తలపించుచు,

"గద్యానుబంధ రసమిశ్రిత పద్య సూక్తిః
హృద్యాహి వాద్యకలయా కలితేవ గీతిః"

అన్నదానికి ప్రత్యక్షోదాహరణముగా నుండును. కావ్య కథావస్తువు శ్రీమద్భాగవతము దశమ స్కంధములోని రుక్మిణీ కల్యాణాంతమైన కథ. శ్రీకృష్ణుని బాల్య క్రీడలతోపాటు గోపికల మధుర భక్తియు విస్తార ముగా వర్ణింపబడినది.

అల్లైనను ఇందలి శృంగారము ఎక్కడను జయదేవుని గీతగోవిందములోవలె—వారు దివ్యపురుషులే యౌదురుగాక—కామినీ కాముకులు కామ ప్రధాన శృంగా రముగా నుండక అమలినమై గంభీరమై ఉదాత్తమై ఉండును. శ్రీకృష్ణుడిందులో పరబ్రహ్మ. గోపికలు సంసారసాగర ముక్తులు, ఆత్మారాములు, త్యక్త దేహా ద్యహంమానులై, నిర్విశేష సుఖమనుభవించువారు. వారు శ్రుతులు పరబ్రహ్మమును వలెనే చుట్టుముట్టి పరమానందములో ఆత్మానుభూతిని గానము చేయు వారు, బ్రహ్మానందముతో నృత్యము చేయువారు.

ఈ తరంగిణీ సంపూర్ణ స్వరూపమును వర్ణింప వలెనన్నచో, ఇది బ్రహ్మానందమునే బహుభంగుల నాట్య స్వరూపమున గద్యములతో, పద్యములతో, కీర్త నలతో, సంగీతముతో, నృత్యముతో, అభినయముతో పండిత పామరులకు హృదయమునకు హత్తుకొను నట్లు రంగస్థలమున ప్రదర్శించు గ్రంథరాజము అనుట సమంజసము. నాట్యవేదము ఉద్దేశించిన ప్రయోజనము సంపూర్ణముగానేకాక శత గుణముగా ఇందులో సాధింపబడినది. విశ్వసాహిత్యములో ఈ గ్రంథము ఉత్తమకోటికి చెందునదనుట కెట్టి సందే హమును లేదు.

'గద' సంప్రదాయ 'కుల దీపిక'లో మాధవ నాలుడను భక్తుడు వరుసగా బిల్వమంగళుడుగా, బిల్వ ణుడుగా, జయదేవుడుగా, నారాయణతీర్థులుగా జన్మము లెత్తి ముక్తి నొందెనని చెప్పబడినది. ఈ మాటలలో నిజానిజము లెట్లున్నను దాని సారాంశము వారంద రిలో సంపూర్ణపరిణతి పొందినవాడు నారాయణ తీర్థు లని సూచించుచున్నది. అంతవరకు దానిని నిస్సందేహ ముగా సత్యముగానే మనము గ్రహింపవచ్చును.

## 3

శ్రీ తీర్థులవారు సంగీత విద్యా విశారదులు. ఈ కావ్యములలో దరువులతో కలసి మొత్తము 153 కీర్తనలు కలవు. సంగీతములో రాగముల వైవిధ్య మెంతయో కలదు. ఇందు మొత్తము 37 రాగ ములు ఉన్నవి. ఈ రాగములలో నాదనామక్రియా రాగమందు 16 కీర్తనలు, సౌరాష్ట్రరాగమందు 14 కీర్తనలు, మధ్యమావతి రాగమందు 13 కీర్తనలు చెప్పబడినవి. ఈ ప్రయోగమునుబట్టి శ్రీ తీర్థులవారికి ఆ మూడు రాగములును ఎక్కువ అభిమాన పాత్రమైనవని భావింపదగును.

శాస్త్రీయమైన ధ్రువ, మఠ్య, రూపక, త్రిపుట, ఝంపె, అట, ఏకతాళములేకాక దేశీయ ముగా వాడబడు చాపుతాళమునుకూడ ఉపయోగించిరి.

శ్రీ తీర్థులవారు లక్ష్యలక్షణముల ఔచిత్యము సుష్ఠుగా తెలిసిన సంగీత కోవిదులు. ఆయా కీర్త నల భావమున కనుగుణముగానే రాగముల నెన్ను కొనిరి. రుక్మిణీ కల్యాణ ఘట్టములోని కీర్తనను కల్యాణి రాగములో రచించుట ఈ సందర్భములో గమనింప దగినది. అక్రూరుడు శ్రీరామ కృష్ణులను తెల్లవారు వేళ మేలు కొలుపు ఘట్టములో* దేశాక్షి రాగమున చెప్పిన గీతము ఎంత మనోహరమైనది!

ప. హే రామ హే కృష్ణ ఇహ సముత్తిష్ఠ,

అ. హే రామ హే కృష్ణ హే జగత్రయగురో,
హే పుండరీకాక్ష రక్ష నిజపక్షమ్.

1. ప్రాచీ దిగంగనా పరిహసతి హే కృష్ణ
పతి యోగ పరమసౌభాగ్య మహితా
ప్రాచీన వైరస్య మభినయం త్యథ సా
ప్రతీచీ దిశం రామ కామ ముదితా.

---

* దీనిని ఇప్పుడు భూపాల రాగములో గానము చేయుచున్నారు.

2. నలిన ముకులోదర విదలన గలి తాలయేహో
లలితతర రవి నిహ్ను తాంధ తిమిరాః
మిలిత నవనలిన పరిమళ బహుళ మకరంద
కలనయా విచరంతి కామ ముఖరాః.

3. దధి మథన సంజాత మధురతరసంగీత
బుధజనాగమ ఘోష రవ్యాఘోషమ్
మధుమథన సంకలయి మాధవ విధీంద్రనుత
పదకమల పద్మా కృతాభిలాషమ్.

5. భూపాల దేశాక్షి దేవగాంధారి శుభ
బిలహరి వసంత ముఖరాగ బృందమ్
గోపికా గాయంతి గోవింద తవతు శుభ
గుణ రత్న బృంద మానంద కందమ్.

5. కలిత నవ మల్లికా కుసుమాని విహసంతి
కామ మిహ తారకా బృంద మమితమ్,
లలిత వచసాఽక్రూర కలిత మితి గురుభక్త
నారాయణానంద తీర్థరచితమ్.

సర్వ సంగ పరిత్యాగ మొనర్చిన ఈ యతీశ్వరుడు గోకులములో ప్రభాత సమయ రామణీయ కతను ఎంత హృదయంగమముగా వర్ణించినాడు! భావమాధుర్యమునకు అనుగుణ్యముగా శబ్దమాధుర్యమున్నది. ఆంధ్ర భాషకు విశిష్టమైన ద్వితీయాక్షర మైత్రితోపాటు వ్యత్యస్త పాదాంతములలో ఉత్తర ప్రాంతీయులకు అభిమానమైన పాద్యాంత్య ప్రాసము కూడ పాటింపబడినది. తరచుగా ఆంధ్రభాషకు మాత్రమే కల యతి వర్ణమైత్రికూడ అప్రయత్నముగా తోసుకొని వచ్చినది. ఇన్నిటిలో గూడ శ్రీ తీర్థులవారు శ్రీకృష్ణుని సర్వదోష పరిహారకమైన 'పుండరీకాక్ష' నామముతో సంబోధించుటే కాక, శ్రీకృష్ణుని గుణరత్న బృందమును 'ఆనంద కందమ్' అని చెప్పటలో ఉపనిషద్వాచ్యుడైన బ్రహ్మముగానే శ్రీకృష్ణుని భావించుచున్నట్లు ధ్వనింప జేసినారు. ఈ విధముగా నిందులో శబ్దార్థ మాధుర్యముతోపాటు, బ్రహ్మానంద భావము జోడించబడినది. ఉత్తమ కవిగా పూర్ణోపాసకుడుగా ఈ కీర్తనలో వలెనే తక్కిన అన్నిటియందును శ్రీ తీర్థులవారు మనకు ప్రత్యక్ష మవుచున్నారు.

ఈ కీర్తనను ఉదాహరించుటకు మరియొక ముఖ్యకారణముకూడ నున్నది. ఈ కీర్తనలో, గోపికలు గోవిందుని భూపాల, దేశాక్షి, దేవగాంధారి, బిలహరి, వసంత ముఖములైన రాగములలో గానము చేయుచున్నట్లు వర్ణించినారు. ఈ కీర్తన రచింపబడిన దేశాక్షిరాగమేకాక ఉదాహరింపబడిన భూపాలాది రాగములు కూడ ప్రభాతగానమునకు ప్రత్యేకముగా అనుకూలించునవియని గానకళా కోవిదులు సమ్మతించుకొన్నచో సందర్భవశాత్తుగా, అప్రయత్నముగా చెప్పిన దీనిచేత, నారాయణతీర్థుల వారికి లక్ష్యలక్షణ జ్ఞానమెంతగా కలదో గురుతింపవచ్చును.

సంగీతముతోపాటు వీరికి తాళజ్ఞానము, నృత్య విశేషములు, జతులు, అభినయ రహస్యములు—ఇత్యాదుల జ్ఞానము సంపూర్ణముగా కలదనుటకు ఎన్నో నిదర్శనములు ఈ గ్రంథములో కలవు. సప్తమ తరంగముతో రాసలీలను తమ విహారములనుండి దర్శించుచున్న సురవనితలచేష్టలిట్లు వర్ణించినారు.

"ధ్రువ మఠ ముఖ ముఖ్యైస్తాళ భేదైరటంత్యో
వన భువి వరనార్యో రాసగోష్ఠీ గరిష్ఠాః,
అలఘు లఘు పదాది న్యాస భేదైశ్చ నాట్యైః
సరస మభినయంత్యో నందసూనుం భజంతే."

గోపికలతోపాటు సురవనితలుగూడ నాట్యమొనర్చుటను వర్ణించుటలో 'ద్రుతమధ్యమ మందర గతిమ్' అనియు

'త్రిపతాక పతాక సుకరైః కటకాముఖ శిలీముఖైః
పరభావ రసోత్కట పరైరపి వీక్షణ సుశిక్షితైః
తనుమధ్యనియోజిత కరైరపి నాట్యరసోత్కటాః
నారాయణతీర్థ కృతం హరిరితి యతిజనతోషమ్.

ఇట్లు చెప్పి ఆనందావేశముతో 'తాం తకకిణ తధిమి తకిట —' ఇత్యాదిగా జతులు చేర్చినారు. నాట రాగములో ధ్రువతాళములో ప్రారంభించిన ఆ కీర్తన సప్తరాగతాళమాలికతో సాగుటచే ఈ కావ్యమందలి సంగీతము అత్యున్నతస్థాయి నందుకొన్నది. శ్రీ రాళ్లపల్లి అంతకృష్ణశర్మగారు తమ 'క్షేత్రయ్య—పద కవిత్వము' అను సాహిత్యోపన్యాసములో సప్తరాగ తాళమాలికా కీర్తనలు కన్నడములో ఇప్పటికిని కనిపించుచున్నవనియు తెలుగులో అన్నమాచార్యుల రచన ఒక్కటి మాత్రము లభ్యపడినదని తెలిపియున్నారు.

ఆ ప్రఖ్యాతులైన శ్రీ తీర్థులవారు సంస్కృత భాషలో చేసిన, ఈ కీర్తనలను నాట, మధ్యమావతి, పంతువరాళి, శ్రీరాగ, ఆనంద భైరవి, సౌరాష్ట్ర, తోడి అను సప్త రాగములందేను, ధ్రువ, మఠ్య, రూపక ఝంపె, త్రిపుట, అటంట, ఏకతాళము—అను సప్త తాళములందేను రచించి కీర్తనా రచనలో ఆంధ్రుల సంగీత విజ్ఞతను పరలోక మెచ్చు పైకెక్కునట్లు చేసిరి.

శ్రీ కృష్ణ లీలా తరంగిణిలోని 'తరంగములు'' బహు ప్రయోజనములకు అనుకూలముగునట్లు రచింప బడుట మరియొక విశేషము. సంగీత విద్వత్తు కల వారు దాని నెంత లెస్సైనను ప్రస్తరించి పాడుట కను కూలమై యున్నవి. అట్లే విశేష సంగీత పాండిత్యము లేనివారు వానిలోని సాహిత్యమును, అందలి భావమును ప్రధానముగా చేసికొని సులభముగా గానము చేసి శ్రోతలను పరవశింపచేయుటకు కూడ అనుకూలమై యున్నవి. ఈ కావ్యములో 2 పాదములుగల దరువులు మొదలు 22 చరణముల విస్తృతి కల కీర్తనల వరకు కలవు. ఇవి గానకచేరీలయందేకాక భజన కాలక్షేపముల యందు బృందగానముచే 'శృంగార రస భర సంగీత సాహిత్యముల'చేత భక్తులు భగవంతుని భజించుటకు అనుకూలమై యున్నవి. నృత్యము చేయగలవారికిని, అభినయింపగలవారికిని ఇవి ఎంతయో ఉపయోగించును. ఈ విధముగా శ్రీనారాయణ తీర్థులవారు సర్వతోముఖ ప్రయోజనము కలుగునట్లు అపూర్వ మార్గములలో కీర్తనలు రచించిరి. ఇందుల కుదాహరణముగా మోహన రాగములో ఉన్న 'బాల గోపాల తరంగము'నే చూప వచ్చును. అది భజనలు చేయునపుడు బృందగానము నకును, భావయుక్తమగు సంకీర్తనమునకును, ప్రస్తరించి గానము చేయుగల గాయకులు కొన్ని గంటల కాలము ఏకధాటిగా సంగీతము ప్రదర్శించుటకును, నృత్యము చేయగలవారు జతులతో ఆనంద నాట్యము చేసి ప్రేక్షకుల సమ్మోహ పరచుటకును, అభినయము చేయుగలవారు 'అంగ ప్రత్యంగ గౌణ స్ఫుట సమ విషమ వ్యంజక వ్యక్తి సిద్ధైః శృంగారాద్యై రనింద్యైః రధిక మభినయమ్' వ్యంజింపజేయుటకును అనుకూల ముగా నున్నవి. 'బాల గోపాల తరంగము' వలెనే మరి కొన్ని కీర్తనలుకూడ సంగీత విద్వాంసులు ప్రస్తరించుట సాధ్యమే.

ఇందలి సంస్కృతభాషను గూర్చి ముఖ్యముగా ఒక మాట చెప్పవలసి యున్నది. భాష సంస్కృతమే ఐనను ఆంధ్ర భాషా పరిచయమున్న వారందరు కీర్తనల తాత్పర్యము అవగాహన మొనర్చుకొనుటకు సాధ్యమైన సులభ సంస్కృతములో ఉన్నది. ఒక్క ఆంధ్రులే కాదు. భరత భూమిలో ఏ ప్రాంతమువారు విన్నను కీర్తనం తాత్పర్యము మొత్తము మీద అవగతము చేసికొనగలరు.

శ్రీ నారాయణ తీర్థులవారు ముఖ్యముగా శ్రీమద్భాగవతము, శ్రీకృష్ణ కర్ణామృతము, గీతగోవింద ములవలన ప్రభావితులైరనుటకు సందేహము లేదు. గీతగోవిందమునందు వారికి గల అభిమానమును ప్రద ర్శించుటకో అనునట్లు భాగవతములో లేని రాధను అష్టమ తరంగములో 9 వ కీర్తనలో రాధామాధవ సంవాదమును చేర్చినారు.

శ్రీ తీర్థులవారి గ్రంథ ప్రభావము తర్వాతి వాగ్గేయకారు లందరిమీదను పడినది. అందరిలో ఉత్తమోత్తముడగు త్యాగరాజస్వామి మీద వారి ప్రభావము సూచించినచో, తక్కినవారి పై ప్రభావ మును వివరించు అవసరముండదు.

శ్రీ తీర్థులవారు తమ తరంగిణిలో ప్రథమ కీర్తనయగు ''జయజయ స్వామిన్'' అనెడి పల్లవికల కీర్తనతో సౌరాష్ట్ర రాగములో గణపతిని గానముచేసి, ఆ రాగమునకే ఒక విశిష్టస్థాన మాపాదించిరి. శ్రీ త్యాగరాజస్వామి వారును తమ ప్రహ్లాద చరిత్ర మను సంగీతనాటకమును తీర్థులవారి అడుగుజాడల లోనే నడచి ''శ్రీ గణపతిని సేవింప రారే'' అని సౌరాష్ట్ర రాగముతోనే ప్రారంభించిరి.

శ్రీ తీర్థులవారు ప్రథమతరంగ మందలి 5 వ శ్లోకము ''ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక......పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి'' అని భక్తస్మరణ కావించిరి. ఇట్లే శ్రీ త్యాగబ్రహ్మకూడ ''సీతమ్మ మాయమ్మ'' అను 'లలిత'రాగ కీర్తనలో, ''పరమేశ వసిష్ఠ పరాశర నారద శౌనక శుక.........ధర నిజ భాగవతాగ్రేసరు లెవ్వరో వారెల్లరు వరత్యాగరాజునకు పరమబాంధవులు మనసా'' అని భక్తుల నుతించిరి.

అట్లే 'యాగ యోగ త్యాగభోగ ఫలమొసంగే రాగసుధా రస' అను ఆందోళికారాగ కృతి పల్లవి భాగమునకు తరంగిణిలోని తరంగము 1 కీర్తన 12 లోని 8 వ చరణము "యాగ యోగ రాగ భోగ త్యాగ సంబంధం వినా......" భాగము ఆధార మనదగును. శ్రీ త్యాగరాజస్వామి వారి 'నిఖిలలోక నిదాన', 'గిరిరాజ సుతా తనయా' మొదలగు సమాసముల కూర్పులు కూడ శ్రీ నారాయణ తీర్థుల కూర్పులనే తలపించును.

## 4

శ్రీ నారాయణ తీర్థులవారు ఆంధ్రులు. గుంటూరు మండలములో మంగళగిరి సమీపములో ఉన్న కాజగ్రామము వారి ప్రథమ నివాసము. ఇంటి పేరు తల్లావఝ్ఝలవారు. పూర్వాశ్రమ నామము గోవింద శాస్త్రి. తండ్రి నీలకంఠశాస్త్రి. వీరి జ్యేష్ఠ సోదరులైన నరసింహశాస్త్రి వంశమువారు ఇప్పటికిని కాజలోను, ఇతర ప్రాంతములందును విస్తరించియున్నారు. వారిలో పలువురు సన్యాసాశ్రమము స్వీకరించినవారే. శ్రీ తీర్థులవారి ఆశ్రమ నామము శ్రీ నారాయణానంద తీర్థులని తోచును. కొన్ని కీర్తనలలో శివనారాయణ తీర్థులనికూడ ఉండుటచే శివనారాయణ తీర్థులనికూడ కొందరు వ్రాయుచున్నారు. కాని ఆ కీర్తనల 'ముద్ర'లోని శివశబ్దము వారి గురువులైన శివరామానంద తీర్థుల నామము చేర్చుటకును, వారి గురువులయెడ ఉన్న గౌరవమును సూచించుటకును, శివకేశవ భేదములేదని స్ఫురింపజేయుటకును మాత్రమే కలిపినట్లు కనబడుచున్నది.

వీరు బహుకాలము కాశిలో నివశించి బ్రహ్మవిద్యను ప్రచారము చేసిరి. వీరి సన్యాసాశ్రమ శిష్యులలో కాశ్మీర సదానంద తీర్థులను కాశ్మీర విద్వాంసుడు ప్రసిద్ధుడు. శ్రీ తీర్థులవారు శాండిల్యభక్తి సూత్రవ్యాఖ్య మొదలగు నెన్నో గ్రంథములును, 'భాట్ట భాషా ప్రకాశ'మను పూర్వమీమాంసాగ్రంథము కూడ రచించిరి. శ్రీ రాఘవన్‌గారు నారాయణతీర్థులు పలువురున్నారు కనుక తక్కిన గ్రంథములు వారు రచించిరనుమాటను సందేహించినారు. కాని భాట్ట భాషా ప్రకాశము చివరలో నిట్లున్నది :

"భగవ చ్ఛివరామతీర్థ శిష్యో ముని నారాయణ
తీర్థ నామధేయః
వ్యతనో దధికాశి భాట్టభాషా గ్రథనం భాట్ట
నయ ప్రకాశ హేతోః"

దీనినిబట్టి శివరామ తీర్థుల శిష్యులైన నారాయణ తీర్థులే ఆ గ్రంథము రచించినట్లగుచుటచే మన నారాయణ తీర్థులే దానిని రచించినారని నిస్సందేహముగ చెప్పవచ్చును.

శ్రీ తీర్థుల వారికి వార్ధకములో శూలవ్యాధి వచ్చినది. కావేరీ తీరస్థమైన వరహూరు వెళ్ళగా వారికా వ్యాధి ఉపశమించినది. వారి అంత్యకాలములో రెండు మూడు సంవత్సరములు వరహూరులోనే గడిపి, దానికి సమీపముననేఉన్న పురుందుత్తి గ్రామములో ఆమ్రవృక్షముక్రింద క్రీ. శ. 1745 లో సిద్ధి పొందిరి. అక్కడ వారి సమాధి ఉన్నది. ప్రతి సంవత్సరము వారు సిద్ధిపొందిన ఫాల్గుణ శుద్ధ అష్టమి నాడు వారి తమిళభక్తు లిప్పటికిని ఆరాధనోత్సవము, వారి కీర్తనల కాలక్షేపములో జరుపుచున్నారు. వీరి ఆరాధనల ఖర్చులకై అక్కడి ప్రభువు 19 ఎకరముల భూమి దానము చేసెను. వరహూరులో శ్రీ బాలకృష్ణాలయములో వారి మూర్తిని చిత్రించిన చిత్రపటమున్నది. దానిని పూర్వము భారతి సంపు 2 సం. 6 లో 16 వ పుట కెదురుగా ప్రచురించియున్నారు.

శ్రీ నారాయణ తీర్థులు దక్షిణదేశములో స్థిర నివాసము చేసికొనిన ఆంధ్ర వంశములో నక్కడనే జన్మించిరనియు, వరహూరులోనే శ్రీ కృష్ణ లీలా తరంగిణి రచించిరనియు, తమిళ పండితులు చెప్పుచు, గ్రంథాది యందు వరాహపురి వేంకటేశ్వరుల కీర్తన మున్నదని ఆధారముగా చూపుచున్నారు. ఆ కీర్తన వరహూరు స్వామికే అంకితమైనదని చెప్పజాలము. తిరుపతి వేంకటేశ్వర క్షేత్రము ఆది వరాహ క్షేత్రమే! అక్కడ తీర్థ విధి సంకల్పములో 'ఆది వరాహ క్షేత్రే' అనియే స్మరింతురు. ఒకవేళ వరహూరు స్వామినే ఉద్దేశించినను, అది వరహూరు చేరిన తరువాత చేర్చినదై యుండును. ఆ కీర్తనకు ముందే 'నీలాచల వర నిలయు'డైన పురి జగన్నాథస్వామిని స్తోత్రము చేసిన కీర్తన యున్నది. మధ్య సందర్భము కల్పించి,

కృష్ణా జిల్లాలో ఉన్న శోభనాచల నృసింహ స్వామిని త.6;కీ.14; వేదాద్రి నృసింహస్వామిని త.11.కీ.17లో స్తోత్రము చేయుచు కీర్తనలు రచించిరి.

కాజలోని తల్లావజ్ఝల వారి వంశములలో శ్రీ తీర్థులవారి కీర్తనలను అష్టమ పక్షమున మూడైనను నేర్చుకొనవలెనను నియమము కలదు. ఒంగోలు తాలూకా లద్దంకి ప్రాంతములో 60 గ్రామములలోని వారికి తీర్థులవారు స్వయముగా ఇందలి కీర్తనలు నేర్పిరని ప్రసిద్ధి కలదు. ఇప్పటికి ఆ ప్రాంతములో ఆ కీర్తనలకెంతో ప్రచారమున్నది. శ్రీ వారణాసి రామమూర్తి 'రేణు'గారు తమ తండ్రిగారు వారి చిన్నతనములో శ్రీకృష్ణలీలా తరంగిణి సంపూర్ణముగా యక్షగానముగ ప్రదర్శింపబడు చుండెనని తెలిపినట్లు చెప్పుచున్నారు. వారు పురుందుర్తి ఆరాధనోత్సవములు దర్శించివచ్చి, శ్రీ తీర్థులవారి కీర్తనలు అక్కడికంటె ఆంధ్రదేశములోనే చక్కగా గానము చేయుచున్నారని అభిప్రాయపడిరి. శ్రీకాకుళమునుండి నెల్లూరివరకు ఆంధ్రదేశమంతట ఆబాలగోపాలములో వారి కీర్తనల కున్న ప్రచారము మరి ఎక్కడను లేదు.

శ్రీ నారాయణ తీర్థులు జన్మించినది విద్యాగ్రహణము చేసినది ఆంధ్రదేశములో కృష్ణాతీరమున; ఆశ్రమస్వీకారము చేసినది పాలారు నదీతీరమగు కంచిలో; బ్రహ్మ విద్యోపదేశము చేసినది గంగాతీరమగు కాశీపట్టణమందు; కావేరీ తీరమగు పురుందుర్తిలో సిద్ధిపొందిరి. వారి పాద విన్యాసముచే పవిత్రమొనర్చి శ్రీ కృష్ణపరబ్రహ్మను నృత్యగానములతో నర్చించినది ఆసేతు హిమాచల మధ్యస్థ పుణ్యభూమిలో; వారు విశేషాభిమానముతో కీర్తించినది 'నీలాచల నిలయుడు, నీరధివట తరునికటుడు, సుభద్రా బలభద్ర సుదర్శన సహిత నిఖిల జగన్నాథుడు ఒకడే!' అందుచే శ్రీ తీర్థుం వారు సకల భారతభూమికి చెందినవారు, నిఖిల జగన్మండలము ఆదర్శముగా కలిగిన వారు.

తీర్థులవారి జీవితములో పెనవేసికొని ఎన్నో అద్భుతకథ లున్నవి. వరహూరు కృష్ణాలయము బయట వారు కీర్తనలు నృత్యము చేయుచుండగా, బాలకృష్ణాలయములో బాలకృష్ణుడు స్వయముగా నృత్యము చేయుట ప్రత్యక్షమయ్యెడిదట. ఆయన ఆశ్రమ స్వీకారమును గూర్చియు, శూలవ్యాధిని గూర్చియు అద్భుతమైన ఐతిహ్యము లెన్నో ఉన్నవి. అవి నిజము కావచ్చును, కాకపోవచ్చును.

వారి జీవితములో అద్భుతములలోనెల్ల అద్భుతమైనది వారు రచించిన శ్రీ కృష్ణలీలా తరంగిణి. అది మాత్రము సర్వులకు నేటికిని ప్రత్యక్షముగా నున్న మహాద్భుతము!



# కలలోపలి "శాంతి" సీమ

## శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ

ఎందుకమ్మా ఎందుకమ్మా
ఎవరవమ్మా, ఏది. ఇటు రా
నిదుర నీడల చాటునేలా
నిలచి చూస్తావు?—

అరే! ఎందుకు నవ్విపోతూ
ఆగకండా నడచిపోతూ
ఎడద తలుపులు మీటిపోతూ
ఎదో అని పోతావ్!—

ఎందుకమ్మా కలల వాకిలి
నెందుకమ్మా తెరచి వస్తూ
తలుపు చాటున కనులు జేరిచి
తల్లడిలి పోతావ్!—

చెప్పవా ఎందుకో తల్లీ
తప్పు లేదులె నిన్ను యెవ్వరు
చెప్పినందుకు కోపగించరు
సిగ్గుపడకమ్మా!—

ఎందుకమ్మా ఏడుపెందుకు
ఎవరు ఏమన్నారు నిన్ను!
ఇరుకుదారుల నడచివస్తూ
మురికిగా ఉన్నావ్!—

ఆకలేసీ అన్న మడిగితె
అమ్మ వేళకు పెట్టలేదా
ఆటలాడే తోటిపిల్లలు
మాట మానేరా!—

అన్న పువ్వులు తెచ్చియివ్వక
ఆకతాయిగ కసిరినాడా?
అరచి పాటలు పాడినందుకు
అవ్వ తిట్టిందా?—

ఎందుకమ్మా పూలరెమ్మా
ఏమి చెప్పవు పెదవి విప్పవు
నన్ను చంపక చెప్పు తల్లీ
నాన్న కొట్టాడా?—

ఒద్దులే నీ పేరు అడగను
ఒక్కపరి నీ తోచి నప్పుడు
సద్దుచేయక వచ్చిపోతూ
ముద్దు మాటాడు !

*　　　　　*　　　　　*

నాటినుండీ అప్పుడప్పుడు
నర్తనం జరిపేది కలలో
వేదనాలయ గోపురముపై
విరులు కురిసేవి !—

నడచివచ్చే మల్లెదండై
ఎడద వాకిలిలోన నవ్విన,
నీరసంగా పండువెన్నెల
నిండిపోయేది !—

ఒక్కపరి కన్నీటి కడలై
ఒక్కపరి మిన్నేటి తరగై
కలగిపోతూ, కరగిపోతూ
కదలిపోయేది'!—

*　　　　　*

నాడు చూచా, నేడు చూచా,
నాడు నేడుల నడుమ గడచిన
ఏళ్లు చూచా, ఊళ్లు చూచ,
ఎదగవేం తల్లీ !—

ఎన్నినాళ్లకు ఎదగనేరవి
నిన్ను చూస్తే నవ్వు వస్తూ
ఏది ఆలోచించనమ్మా
ఏమాది ఏ లోకం?

నవ్వులాటలు కాదు నాతో
నువ్వు ఎవరవు చెప్పు ముందుగ

## కలలోపలి "శాంతి"సీమ

మురికిగా కనిపించి, పిమ్మట
మురిసిపోతావు !

నువ్వు నవ్వే నవ్వు చూస్తే
రివ్వురివ్వున పావురాలే
ఎగిరి సొగసులు పోయినట్లే
ఏల తోస్తుంది ?—

ఏమి అందం ! ఏమి అందం !
ఎఱ్ఱరోజాపూవు చందం !
అందముగ నీ కురులలోనే
అమరిపోయింది !—

వెళ్ళిపో నవ్విపో అవతల
త్రుళ్ళిపో ఆడిపో ఆటగా
ఎందుకట్లా ఊరికేనే
ఎగిరిపోతావు !—

*　　　　*

పెఠిలు మన్నవి మరఫిరంగులు
పీడకలగా బ్రతుకు మారెను ;
ఘాతముల నృత్యంపు కురులై
పొగలు రేగాయి !

రొదలు రోదన లెన్నొ రగిలాయ్
రూఢిగా ఒక ఇనుపపాదం
మానవుడి సుఖజీవనాన్నే
మట్టుపెడుతోంది !—

*　　　　*

ఇళ్ళు మంటల కూలిపోతే
"ఏరి అమ్మా నాన్న?" అంటూ
ఇరుల వెతికే వెఱ్ఱిపిల్లవు
ఏమొ, అనుకొన్నా !

నేను పొరబడ్డాను తల్లీ
నిన్ను గుర్తించాను ఇప్పుడు
కలతగా నా కలల నెందుకు
కరగిపోతావు !—

కలత పడుతూ, పరుగు పెడుతూ
అలసిపోతూ, బాధ ఎందుకు
నువ్వు ఎరుగవు ఈ ప్రపంచము
నవ్విపోతుంది!—

కొంతకాలం కుమిలిపోయావ్
వింతగా మరికొంతకాలం
ఎన్నొ సౌఖ్యా లనుభవించావ్
ఇప్పుడేమమ్మా !

కంటినీటికికూడ కరవై
కాలమే ఒక గుండె బరువై
కలచివేసే దారి వెంటను
అలసి వచ్చావా?—

కంటినీటిని దేవుఁ డెరుగును
ఇంటిలోనే నీళ్ళు లేవే,
ఇంత నెత్తురు ఉంది నాలో
ఇయ్యమంటావా?—

నెత్తురంటే ఎందుకమ్మా
నిలువునిలువున ఒణికిపోతావ్
మనిషి తనువు తటాకముగ ఈ
మహిని తోస్తోంది !—

కురులలో రోజాలు లేవిక !
గొంతులో మాధుర్య మేదిక !
చేతిలోపల రిక్తపాత్రిక !
చితికిపోయావా?—

ఒద్దు తల్లీ కుమిలి యేడ్వకు
ఊహ కాదిది నిజం తల్లీ
ఒక్కలాగే రోజులన్నీ
ఉండిపోవమ్మా !—

మరల ఏదీ, నవ్వు తల్లీ
'మనికి' మాధుర్యాలు మళ్ళీ
నువ్వు నవ్విన రోజునుంచే
నోచుకుంటుంది !—

## కలలోపలి "శాంతి" సీమ

మనిషినవమ్మా నేను మనిషిని
మార్పుకోరే యువ మనీషిని
మహిని వదలిన 'గులాబీ'కై
మరల రా తల్లీ !—

కోటి రోజాపూలు విరిసిన
కోటి కిన్నెర లేవో పలికిన
వీటినా నీ ఇల్లు తల్లీ
వెళ్ళి వస్తావా ?—

నువ్వు చెప్పని పేరు నీవని
పువ్వురోజా నాకు చెప్పెను
కాంతినిండిన కనుల మెదలే
శాంతి వా తల్లీ !—

స్వప్నసోపానాల వెంబడి
స్వాగతం వినిపింతునవమ్మా
గువ్వరెక్కల తేరుపైనే
కోరి రావమ్మా !—

---



# మడికి సింగన కాలము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

తెలుగు కవులలో మడికి సింగన కాలము మనకు చాలా ముఖ్యమైనది. సింగన, తెలుగు భాషలో, "సంకలన గ్రంథ రచన" అను సాహిత్య ప్రక్రియకు ఆద్యుడు. అతని "సకలనీతి సమ్మతము" తెలుగున మొదటి సంకలన గ్రంథము. ఆ గ్రంథములో సింగన తనకు పూర్వమందు వెలసిన కవుల కావ్యాలనుండి అనేక పద్యా లుదహరించాడు. వానివల్ల, మనకీ నాడజ్ఞాతములైనవే కాక, అలభ్యములైన గ్రంథాల ఆకరము తెలిసికోవడానికి, అవకాశం కలిగినది. ఇంతే కాదు—ఆ యా కవుల కాలనిర్ణయములు చేయడానికి వీలు కలిగినది. ఉపలబ్ధములైన గ్రంథాలలో పాఠ భేదాలు చూడడానికి, ఎంతో ఉపకరించింది.1

మడికి సింగన తన కాలాన్ని తాను రచించిన పద్మ పురాణోత్తర ఖండములో ఇట్లు తెలిపినాడు—

"ఆకర యుగానల మృగాంక
శకవత్సరములై పరగు శార్వరిని పుణ్య
ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్చు
నుడుపాలసుతవాసరమునందున్
శ్రీకరముగా మడికి సింగన
తెనుంగున రచించెఁదగఁ బద్మసుపురాణం
బా కమలమిత్రశశిరాంశువుగఁ
గందసచివాగ్రణికి మంగళమహాశ్రీ."

ఈ పద్యమున నిచ్చిన శకవత్సరము—కర-2, యుగ-4, అనల-3, మృగాంక-1 — "అంకానాం వామతో గతిః" అను సూత్రము ననుసరించి 1342-ఇది శకముగాన దీనికి 78 కలిపిన యెడల క్రైస్తవ శకాబ్దము వచ్చును - 1342 + 78= 1420-కాబట్టి క్రీ. శ. 1420 ప్రాంతము మడికి సింగన కాలమని నిర్ణీతమైనది.

క్రీ. శ. 1917 లో వీరేశలింగము పంతులు గారు మొదలుకొని వాఙ్మయ చరిత్రకారులు, సాహితీ విమర్శకు లందఱును పైకాలము నామోదించి ప్రమాణీకరించిరి. కాని క్రీ. శ. 1948 లో కీర్తిశేషులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, సింగన కాలమును గూర్చి తమ 'రెడ్డిరాజ్యముల చరిత్ర'లో విమర్శించుచు నీ క్రింది రీతిని వ్రాసియున్నారు.

అందు 'ఆకరయుగానలశశాంకశశి' అన్న పూర్వోక్త పద్యము వెనువెంటనేగల యాంగ్లేయ వాక్యము లిట్లున్నవి.

According to this, the date is Saka 1342, Corresponding to the Cyclic year Sarvari, Wednesday, the 5th Tithi of the month of Margasira. The fortnight, whether it was the bright half or the dark half, is not stated. The date is irregular as the fifth Tithi in the said month does not fall on Wednesday in any one of the two fortnights. This verse, found only in a very few manusripts, seems to be an interpolation; for, the age of Madiki Singana at the time of the composition of the Padma Puranamu would be seventy three, even if he is taken to have been born to Ayyalamantri in saka 1269, the date of Toyyeti Anavota's Daksharam record. If this date in the Padma Puranam is accepted, a

---

1. ఇట్టి సకలనీతిసమ్మతాన్ని లోకంలో తొలి సారిగా ప్రకాశింపజేసిన కీర్తి 'ఆంధ్ర గ్రంథమాల' వారిది. ఇప్పటికి నలభైనాల్గేండ్ల క్రిందట అనగా క్రీ. శ. 1923 లో అది ప్రకటితము. మతిలోకోత్తరులైన మానవల్లివారి పీఠికతో నున్నది. ఈనాడు అవశ్యకముగా పునర్ముద్రణము కాదగిన ప్రశస్త గ్రంథము.

still later date to his Vasistha Ramayanam has to be postulated. This does not seem to be the case. If he were such a late poet, he would have certainly mentioned Erra Pregada in his Kavistuti. The date given in the Padma Puranam does not seem to be correct.

(The History of the Reddi Kingdoms. Page 514-Foot Note.)

చదువరులకు సుకరముగా నుండుటకై పై భాగమున సారాంశముల నిచ్చుచున్నాను.

1. తిథి వారములు కుదరకపోవుటచేత ఉదాహృత కాలము సరికాదు.

2. కొద్ది ప్రతులలో నుండుటచే తరువాతివారెవరో దీనిని చేర్చిరి.

3. సింగన పేర్కొనిన అనపోత నాయకుని శాసనము క్రీ. శ. 1347 లో నుండుటచే సింగనకాలము 1420 కాదు.

4. ఇతడు ఎఱ్ఱాప్రెగడను పేర్కొనలేదు.

పైని వివరించిన శర్మగారి యభిప్రాయములే 'నన్నెచోడుని కవిత్వము' అను గ్రంథమున ననువదింపబడినవి2. మడికి సింగన క్రీ. శ. 1347 ప్రాంతము వాడని అందు నిరూపితమైనది.

ఈ గ్రంథాన్ని అనుసరించే, 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం'లో మడికి సింగన కాలనిర్ణయం చేయబడినది3. అందు సింగనకాలం క్రీ. శ. 1347 అని నిర్ణీతమవడమేకాక, మఱికొంతమంది కవుల కాలాలు దాని ననుసరించి మార్చబడినవి—

పై గ్రంథముల కర్త లిర్వురును, శర్మగారి అభిప్రాయాలను పరిశీలించకుండా, యథాతథంగా గ్రహించి నందువల్ల, సింగనకాలంగూర్చి అవ్యవస్థ యేర్పడినది.

వాస్తవంగా సింగనకాల నిర్ణయమునుగూర్చి భేదాభిప్రాయాలుండవలసిన అగత్యములేదు. ఈ వ్యాసంలో పై యభిప్రాయాలను పరామర్శిస్తూ, సింగనకాల నిర్ణయానికి ఆధారమైన ఒక నూతనాంశమును, ప్రకటిస్తున్నాను.

మొదట 'రెడ్డిరాజ్యముల చరిత్ర' గ్రంథములో వెలువరించిన యాక్షేపములకు సమాధానము.

1. ఈ పద్యమున తిథి వారములు సరిగానే యున్నవి. అచ్చులోనున్న 'ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్పు నుడుపాలసుతవాసరము నందున్' అను పాదమున పాఠము సరికాదు. అది ప్రాకటిత మాఘ సిత పంచమిని బొల్పు నుడుపాలసుతవాసరమునందున్' అని యుండవలెను. 'మాఘ సిత పంచమికి' అని వ్రాయుటకు బదులు లేఖకుడు 'మార్గశిర పంచమి' అని వ్రాసియుండవచ్చును. ప్రాతవ్రాతలలో నిట్టి లేఖన ప్రమాదములు సహజములు—పరిశోధకుల కివి పరిచితములే!

పై పద్యమున 'మాఘ సిత పంచమి'అనుపాఠముతో గ్రంథరచనాకాలము సరియగుచున్నది. దీని ననుసరించి—శార్వరి సంవత్సర మాఘ శుక్ల పంచమీ బుధవారము—పద్మ పురాణ రచనాకాల మగుచున్నది. దీనికి సరియైన ఇంగ్లీషు తేదీ—8–1—1421.

2. ఈ పద్యము పద్మపురాణ తాళపత్ర ప్రతులెన్నింటి యందున్నదో తెలియరాలేదు కాని, ప్రౌఢదొరవారి కాలమున, 5 ప్రతులతో సంప్రతింపబడిన — పరిష్కృత ప్రతియందున్నది.4 ఈ కారణముచేత నిది యితరులెంతమాత్రము చేర్చినదికాదు. ఇట్లని చెప్పుటకు వేఱొక యాధారమున్నది.

గ్రంథాంతమున కొంతమంది లేఖకులు పద్యములు వ్రాయు నాచారము లేకపోలేదు. అయినను నా చూచినంతలో 'మంగళమహాశ్రీ'వృత్తము

---

2. గ్రంథకర్త శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రి. పుట—82. ముద్రణము 1959.

3. గ్రంథకర్త శ్రీ ఆరుద్ర. నాలుగవ సంపుటం—రెడ్డిరాజుల యుగం. పుటలు—76—78. (జూలై 65)

4. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము. వివరణాత్మక సంపుటి 1. సంఖ్య 18. పుట 36. (1915.)

నెవ్వరును వ్రాయలేదు. మంగళమహాశ్రీవృత్తము గ్రంథాంతమున నున్నచో నది కవి వ్రాసినదే యని మనము గ్రహింపవలెను — ఏలననగా, కావ్యము 'శ్రీ'తో ప్రారంభించి మంగళమహాశ్రీ వృత్తముతో సమాప్తిచేయుట నన్నెచోడుని కుమారసంభవముతో ప్రారంభమైనది. తరువాతి కవులు క్వాచిత్కముగా దానిని పాటించినారు. అట్టివారిలో మడికి సింగన యొకడు[5]. కాబట్టి సింగనయే యీ పద్యరచయిత.

3. సింగన పేర్కొన్న తొయ్యేటి అనపోతనాయకుడు క్రీ. శ. 1347 లో నున్న అనపోతానాయకుడనుట కేయాధారములేదు. సింగన తన తండ్రియైన అయ్యలు మంత్రి—తొయ్యేటి అనపోత భూపాలునకు మంత్రియని చెప్పియున్నాడు. ఈ అనపోతనాయకుని శాసనములు రెండింటిలోను, అయ్యలుమంత్రి ప్రస్తావనయేలేదు. కాబట్టి శాసనోదాహృతుడగు అనపోతనాయకుడు సింగన పేర్కొన్న అనపోతనాయకుడు కాడని నిర్ణయింపవచ్చును.

4. మడికి సింగన ఎఱ్ఱాప్రెగడను పేర్కొనకపోవుటకు కారణ మతని స్వాతిశయభావమేయని ఇప్పటికేబదేండ్లకు పూర్వమే వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్ర కవుల చరిత్ర ప్రథమభాగములో సింగన జీవితమున వ్రాసియున్నారు—

ఇక మడికి సింగన క్రీ. శ. 1420 ప్రాంతము వాడే యగుట నిరూపింతును—

I

సింగన తన 6 జ్ఞానవాసిష్ఠరామాయణమున, తన తాత అల్లాడ మంత్రిని గూర్చి యిట్లు వ్రాసియున్నాడు—

సీ. అతడు తిక్కనసోమయాజుల 7 పౌత్రుఁడై
కొమరారు గుంటూరి కొమ్మ విభుని
పుత్రి చిట్టాంబిక బుధలోక కల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసారమగు కోటభూమి కృష్ణానది
దక్షిణ తటమున ధన్యలీల
నలరు రావెల యను నగ్రహారము తన
కేకభోగ్యంబుగా నేలుచుండి
గీ. యందు గోవెల గట్టి గోవిందు నెన్న
గోపికానాథుని ప్రతిష్ఠ గోరి చేసి
యఖిల విభవంబులందున నతిశయిల్లె
మనుజమందారుఁడల్లాడమంత్రి విభుఁడు-(1 29)

పై పద్యము ననుసరించి, తిక్కననుండి అల్లాడ మంత్రికి మూడు తరములు గడచినవి.

తిక్కన
|
1 వ తరము పుత్రుడు
|
2 వ తరము పౌత్రుడు_కొమ్మన
|
3 వ తరము—చిట్టాంబిక — భర్త
అల్లాడమంత్రి.

అల్లాడ మంత్రి కొమారుడు అయ్యలు మంత్రి కొడుకు మన సింగన—అప్పుడా వంశక్రమ మిట్లేర్పడును.

అల్లాడమంత్రి
|
4 వ తరము అయ్యలుమంత్రి-
|
5 వ తరము సింగన-

పై క్రమమునుబట్టి సింగన తిక్కనకు 5 వ తరము వాడగుచున్నాడు. తిక్కన క్రీ. శ. 1260-70 ప్రాంతమువాడు గావున, తరమున కిరువదియైదేండ్లు లెక్కించినచో — 1260+125=1385 — 1395 ప్రాంతము సింగనకాలమగును.

---

5. నన్నెచోడని కవితాప్రభావము మడికి సింగనపై చాలగలదు. దానిని మఱియొకప్పుడు తెలుపుదును.

6. జ్ఞానవాసిష్ఠరామాయణము. వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్ వారిచే ముద్రితమైనది. రెండవ కూర్పు 1935.

7. ఇందే 'పుత్త్రుడై' అను పాఠము 6 వ పుట యడుగున చూపబడినది. కాని యిది సరికాదు.

ఉపలబ్ధములైన జ్ఞాన వాసిష్ఠ రామాయణ ప్రతులలో పౌత్రుడని యున్నను—అచ్చట సరియగు పాఠము ప్రపౌత్రుడని యుండనగును. అచటి పాఠము

"అతడు తిక్కన సోమయాజి ప్రపౌత్రుండౌ
కొమరారు గుంటూరి కొమ్మవిభుని" అనునది.

ఈపాఠమిట్లే యుండదగుననుటకు ప్రమాణమున్నది. తిక్కన సోమయాజి వంశవృక్షమిప్పటికి డెబ్బదియేండ్ల క్రిందట ప్రకటితమైనది[8]. అందిట్లుగలదు.

తిక్కన-
|
కొమ్మన-
|
హరిహరామాత్యుడు
|
కొమ్మన-

ఈ కొమ్మన తిక్కన ప్రపౌత్రుడైనప్పుడు మడికి సింగన సరిగా క్రీ. శ. 1420 ప్రాంతము వాడగును—

## II

ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున తాళపత్ర ప్రతులలో జ్ఞానవాసిష్ఠ రామాయణ ప్రతి గలదు. దాని సంఖ్య 1157/16. ఆ ప్రతిలో 190 తాటాకు చివర నీ క్రింది పద్యము గలదు.

'శ్రీకర శకాంకములు
సింధు రవ రామయుత
శీతకరమైన పరిధావిన్
ప్రాకట వసంతయుత
ఫాల్గునమునందు
సితపంచదశి కావ్యతిథి కావ్య
శ్రీకి నిధియౌ
మడికి సింగన తెనుంగున
వసిష్ఠ రామాకృతి
యొనర్చెన్—
చేకొని యహోబలము
శ్రీనరమృగేంద్రుడనకు
సేమముగ మంగళమహశ్రీ.'

ఇది మంగళమహశ్రీవృత్తము. సింగనపేరు—కృతిపేరు కూడ నుండుటచేత నిది సింగనకృతమే యనుట నిర్వివాదము. ఇదియు పద్మపురాణము నందలి మంగళమహశ్రీ వృత్తము సింగనకృతమే యని నిర్ధారించుచున్నది.

ఇందు జ్ఞానవాసిష్ఠ కృతి రచనాకాలము కలదు. శకాబ్దములు సింధు—4. రవ—5. (పంచమహాపాతకధ్వనులు) రామ—3. (పరశురామ, శ్రీరామ, బలరాములు —) శీతకర—1. మొదటి సూత్రము ననుసరించి—ఈ కాలము శకము—1354. దీనికి క్రైస్తవ శకాబ్దములు 78 కలిపిన - 1354 + 78 = 1432 అగును. కావున జ్ఞానవాసిష్ఠకృతి రచనాకాలము క్రీ. శ. 1432. శకాబ్దములేకాక, తక్కిన వివరములు పద్యమున గలవు. పరీధావి సంవత్సర ఫాల్గున పౌర్ణమి శుక్రవారమున నీ కృతి ముగిసినది—అది క్రైస్తవ శకము. 1—3—1433 తో సరిపోవుచున్నది.

పై జ్ఞానవాసిష్ఠ రచనాకాలముబట్టి సింగన పద్మపురాణ రచనాకాలము క్రీ. శ. 1420 అగుట సమంజసమే యగుచున్నది. అయితే వీని రెంటి నడుమ పండ్రెండేండ్లువ్యవధి యున్నది ఈపండ్రెండేండ్లలోను, సింగన భాగవత దశమస్కంధ ద్విపదను రచించినట్లు మాత్రమే జ్ఞానవాసిష్ఠము నుండి తెలియుచున్నది.

---

8. అముద్రిత గ్రంథచింతామణి సం. 9.సంచిక 11; నవంబరు 1896. ఇం దావంశ వృక్షమును గూర్చిన సంపూర్ణ వివరములు గలవు. నా 'తెలుగు కవుల చరిత్ర' తిక్కన యుగమున తిక్కనకు పూర్వము గల ఏడుతరములలో నీ వంశవృక్షము జతపఱచి విపులముగా వ్రాసితిని. అది అముద్రితము.తెలుగు కవులలో నాటినుండి నేటివఱకు నవిచ్ఛిన్నముగానున్న కవి కుటుంబములలో తిక్కన దొక్కటియే యని చెప్పవచ్చును.

జ్ఞానవాసిష్ఠము వెనుక మడికి సింగన సకలనీతి సమ్మతమును రచించెను. ఇది సమగ్రముగా దొరకక పోవుటచేత గ్రంథాంతమున నెట్లున్నది తెలియుట లేదు. ఎట్లున్నను, నీ పంద్రెండేండ్లలోను సింగన సకలనీతి సమ్మతము రచించుటకు గ్రంథసేకరణము చేసి రచన ప్రారంభించి యుండునని తలంచుట సమంజసము.

సకలనీతి సమ్మత పీఠికలో నా గ్రంథ రచన క్రీ. శ. 1430 ప్రాంతము కావచ్చునని కలదు. కాని పై జ్ఞానవాసిష్ఠ రచనా కాలమువలన, సకలనీతి సమ్మతము, క్రీ.శ. 1440 లోపుగా రచితమైనదని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఈ నూతనాధారమునుబట్టి, సింగన పేర్కొనిన తొయ్యేటి అనపోత భూపాలుడు క్రీ. శ. 1347 ప్రాంతముననున్న అనపోతనాయకుడు కాడనియు, నాతని కుమారుడో మనుమడో యనియు నిశ్చయింప వచ్చును.

సింగన క్రీ. శ. 1400—1440 ప్రాంతమున వెలసి శ్రీనాథ మహాకవి సమకాలీనులలో నొకడై యుండెననుట స్పష్టమగుచున్నది.

---

జ్ఞాపిక:-తెలుగు భాషలో వేదాంత వాఙ్మయ శాఖకు సంబంధించినది సింగన వాసిష్ఠ రామాయణము. ఈ శాఖలో శైవ వేదాంత గ్రంథములే ప్రాథమికములు. అయినను-అద్వైత వేదాంత గ్రంథములలో వాసిష్ఠ రామాయణమే మొదటిది. కాబట్టి అది విపులపీఠికతో సుసంస్కృతముగా వెలయదగినది. ముద్రిత గ్రంథాది నున్న 'శ్రీమద్దివ్య మునీంద్ర చిత్త నిలయం' అహోబల గిరీశాయ' అను శ్లోకములు వ్రాత ప్రతులలో లేవు—

---



# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 175/– | రు. 150/– |
| 2 లేక 3 వ కవరు పేజి ... | | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 150/– | రు. 125/– |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | రు. 125/– | రు. 100/– |
| అర పేజి | ... | రు. 65/– | రు. 55/– |
| పావు పేజి | ... | రు. 40/– | రు. 35/– |

ప్రత్యేక స్థానములకు 25 అదనం.

సం॥ వకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాకు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12–0–0 |
| 6 మాసముల చందా | ... | రు. 6–0–0 |
| విడి ప్రతి | ... | రు. 1–0–0 |

మేనేజరు, భారతి.

మద్రాసు—1.

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఆగస్టు 1967



సంపుటము : 44 ; : సంచిక 8 ;

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1967

# మేఘదూత

## శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

ఆషాఢప్రథమవాహ మియ్యది మహాత్మా! నీ సుఖస్వప్న సం
జూషా ప్రోద్భవ దింద్రజాలమయ తేజోలోకదీప్తుల్ సుడుల్
భాషాకావ్య పురాణపుణ్యఫల రూపమ్మందె నేడే— కళా
యోషాభూషణ మేఘదూత మయి, పీయూషతృప్యాస్యమ్మనై

అంచ, మొఱుంగుఱెక్కల నొయారముగా విదళించి మానసా
భ్యంచిత తీరభూముల విహారములం బొనరించుకీర్తి కు
ప్పించిన ఊహ నీ యమృతసృష్టిఁ జరింపగ ఱెక్కసాచి ఆ
శించె రసాధిరాజ్యమధుసీమలఁ బ్రొద్దులుపుచ్చ నిచ్చలున్

అంబరచుంబి నీహృదయ మందదు; సుందరతాధివాస భా
వాంబరవీధులందు పదివందల స్వర్గములన్ సృజింతు, గం
గాంబుతరంగ సుస్నపిత "కాంచనగంగ" శిఖాగ్రరేఖికా
డంబర చారుకీర్తి వినట త్కవితా! కయివోడ్పు లందవే!

రాజ్యము లేలి కత్తులకు రక్తపు విందులుచేసి భూమిలో
భోజ్యము లన్నిటిం గుడిచి పోయిరి పాపము రాజరాజులున్—
త్యాజ్యము వారి సంస్కృతి జయంతులు మా రసరాజ్యపీఠ సం
పూజ్యులకే, తదుక్తి మణిభూషిత మూర్తులకే, యెసంగెడిన్.

*　　　　*　　　　,

రామగిరీంద్రసానువుల రమ్యతలమ్ముల జన్మమంది మా
ధ్వీమధురోహశీలి సుకవీంద్రుని వాక్కుల నారితేరి శో
భామహి మధ్యభారతపువైభవముల్ చవిచూచి చూచి తా
శ్రీ మిహికాద్రిపైని విహరించిన ధన్యునకున్ సుమాంజలుల్.

కవిరాణ్మానసపుత్ర, లోకహిత, మేఘస్వామి! ఏనాటి కీ
చవులూరించెడి నీదు దర్శనము; ఉత్సాహమ్ము దీపింపఁ గ్రాం

బువులన్ దోసిటఁబట్టి స్వాగతపుటింపుల్ సేయ వేడ్కయ్యె నో
నవవర్షాగత తప్తమానవ శరణ్యా, స్వాగత మ్మందుకో!!

అన్నా, నిన్నగ నెన్నియెన్ని రుచిరోహల్ చిత్తమం దూరెడిన్
ఛన్నానేక నమేరువుల్, జనకజా స్నాన ప్రపూతాంబు, లా
సన్న శ్రీరఘునాథ పాదయుగళాంచ ద్భద్ర ముద్రాంక సం
పన్నంబుల్ తటు, లా ప్రవాసి సిత బాష్పస్విన్న గండస్థలుల్.

వీక్షించినాడవే విదిశాపురోపాంత
కేతకీవృతుల జంబూ తరువుల
తేరిచూచితె అవంతీ రాజధానిలో
చంచలా చకిత లోచనల సొగసు
పరికించితే వేత్రవతి తరగ విరుపులో
కనుబొమ్మవంపు శృంగారచేష్ట
దరిసించితే శితగిరి నితంబమ్ములో
శంకరపార్వతీ చరణముద్ర

అరసితివె ఉత్తరమ్ముగా నరిగియరిగి
అచ్చరల నిల్వుటద్ద మైనట్టి నగము
కాంచితివె రజతభూధరకాంతు నొడిని
కులుకు ముద్దుల జవరాలి 'నలక' పురిని ?

ఏదీ చెప్పు—పయోదమిత్ర, అట నన్వేషించి నీతమ్ము ప్రా
సాదాంకమ్మగు చిత్రతోరణము, హస్తప్రాప్య మందారమున్
సౌధోత్సంగ విషణ్ణతల్పమున నిశ్శ్వాసించు తత్ప్రేయసీ
ఖేదాకారముఁ గాంచితే మెఱపుచూడ్కిన్ దేఱు కన్నీటితో

అలకలు మోముపై చెదర నయ్యలకాపురి మేడలోన ని
ద్రలను మునుంగు వీణియను దార్చిన మూర్ఛన విస్మరించి య
శ్రుల తడితీగలన్ దడవు శోకభరాకృతిఁ జూచి మాలతీ
కలికలవంటి మెత్తనగు కమ్మని పల్కుల నూరడించితే!

చల్లనిగుండెవాడవఁట సల్పిన నీదు పరోపకార సం
పల్లలితానుభావమున పాపము శాపము తీరి వారికిన్
ఫుల్ల శరన్నిశా కుసుమ భూషిత తల్పము దక్కియుండు, మా
కుల్లమునిండ క్రొత్తరుచు లూరెడు కావ్యము దక్కె నీదయన్.

---

# పూజావనము

## [దివ్యమానుష దృశ్యకము]

### శ్రీ నోరి నరసింహ శాస్త్రి

ప్రదేశము : పూజావనము

కాలము : సూర్యోదయానికి కొంచెము ముందు నుండి ప్రారంభము

పాత్రలు : భార్యా భర్తలు, తెరలో పిల్లవాడు, పిల్ల, రకరకాల పూలు, దళాలు.

[భార్యా భర్తలు పూలు కోయుటకు పూల బుట్టలతో ప్రవేశింతురు.]

భర్త : శ్రుతీనాం మూర్ధానో దధతి
తవ యౌ శేఖరతయా
మమాప్యేతౌ మాతః శిరసి
దయయా ధేహి చరణౌ
యయోః పాద్యం పాథః
పశుపతి జటాజూట జననీ
యయోర్లాక్షా లక్ష్మీ
రరుణహరిచూడామణి రుచిః.

భార్య : నమోవాకం బ్రూమో
నయన రమణీయాయపదయోః
తవాస్మై ద్వంద్వాయ
స్ఫుటరుచిరసాలక్తకవతే
అసూయ త్యత్యంతం
యదభిహననాయ స్పృహయతే
పశూనా మీశానః
ప్రమదవన కంకేళితరవే.

[ఆశ్చర్యంతో కన్నులు పెద్దవిచేస్తూ]

ఏమండీ, — విన్నారా ?

భర్త : ఏమిటే ?

భార్య : ఎవరివో గుసగుసలు వినిపిస్తున్నవి, ఏమండీ !

భర్త : ఎక్కడ ?— ఈ ఉషఃకాలపు చిరుగాలి పొదలలో ప్రవేశించి మసలుతూ గుసగుసలవలె వినిపిస్తున్నది. అంతేలే !

భార్య : కాదండీ ! జాగ్రత్తగా ఆలకించండి. అదుగో, మన ఇద్దరినీ ఎవరో మెల్లగా చల్లగా పిలుస్తున్నారు. వినబడడం లేదా ?

భర్త : ఇవ్వాళ నీకేమైనా కవిత్వము పుట్టుకు వస్తున్నదేమో ? ఈ చల్లని పిల్లగాలిలో ఇన్ని పూలవాసనలు కమ్మగా సువాసిస్తూ ఉన్న ఈ పొదల మధ్యన ఉంటే, ఎటువంటివారికైనా కవిత్వము పుట్టుకు వస్తుంది. పువ్వువంటి మెత్తని మనస్సుకల నీకు రావడమాశ్చర్యమా ? ధర్మదీక్షతో కరకువారుతున్న నా మనస్సే ఏదోగా ఉన్నది — ఇక మరి పరదేవతార్చనకు పూలు కోదామా ?

భార్య : కోదాము. తొందరలేదు గాని ముందాపిలుపులు ఆలకించండి. కాస్తసే పీతులసికోట అరుగు మీద కూర్చుని, ఆ పిలుపులూ గుసగుసలూ ఏమిటో తెలుసుకొందాము — కడుపులో కదిలే పిల్లల చక్కిలిగింతవలె, ఆ పిలుపులు మనస్సులో గిలిగింతలు పెడుతున్నవి. మీరుకూడా శ్రద్ధగా ఆలకించండి! — అదిగో, వినబడడం లా?

(ఇద్దరూ తులసికోట అరుగుమీద కూచుంటారు.)

[తెరలో]

(తోట నలువైపులనుండి ధ్వనులు)

అమ్మా!—ఏమండీ!—మామాటలు వినిపించడం లేదా? — తల్లీ, ఇక్కడ ఉన్నానే — ఇక్కడే నేను—నావంక చూడవమ్మా!—ఇదిగో, ఇక్కడ ఇదిగోనే! — ఇక్కడే! — అయ్యో! — నావైపు చూడవూ?—నన్ను తాకుదూ తల్లీ!—నీపవిత్ర మైన చేతులు నా మీద వేయవమ్మా.—నన్ను చిచ్చికొట్టవమ్మా! – బాబూ! — అమ్మా!— లల్లీ!-నాన్నా!-తండ్రీ! —రారా!-- ఇక్కడరా!—

భార్య: ఇప్పుడన్నా వినబడ్డవా?

భర్త: భ్రాంతి ఏమోకాని, నీమాటలు వింటూన్న కొద్దీ, నాకుగూడా పాదలమీదినుంచి ఏవేవో గుసగుసలూ, పూలమీదినుంచి పిలుపులూవలె వినవస్తున్నట్లే ఉన్నదిసుమా! ఏమబ్బా ఈ విచిత్రము!

భార్య: ఏమున్నదండీ? మనము రోజూ పూజకుకోసే పూలున్నవే, వాటికిమాత్రము ప్రాణము లేదు టండీ? వాటి కథలు మనతో చెప్పుకుంటు న్నవి. మూగపడ్డ వాటినోళ్లను ఈ చిరుగాలి తనకెరటాలమంత్రపుకుంచెస్పర్శతో 'అరవిప్పి నట్లున్నాడు.

భర్త: నిజమే. వాటిమాటలూ వాటి గుసగుసలూ మామూలు మాటలవలె లేవు. అని మామూలు మాటలువినే ఈ చెవులకు వినిపిస్తున్నట్లూ లేదు. అవి ఎక్కడెక్కడో లోపల లోపల కనబడ కుండా ఉన్న ఇంకో చెవికి వినబడుతున్నట్లుగా తోస్తున్నది. ఈ పూల మూగదనమే పోయిం దంటావా? లేక మన చెవిటిదనమే కాస్త తగ్గినదంటావా?

భార్య: ఏమైనాకావచ్చు — రెండూ నిజమే కావచ్చు. మీరన్నది నిజమే. ఈ మాయంతా ఈ ఉదయ వేళ గాలిలోనే ఉన్నది.

భర్త: ఐతే సరేకాని ఈ పూలన్నీ మనలను ఇప్పు డిట్లా ఎందుకు పిలుస్తున్నట్లు?

భార్య: వేరే ఏముంటుంది! 'శ్రీదేవిని పూజించే పుణ్యాత్ములు గదా, భాగ్యశాలురు గదా మీరు! నన్ను కోసి ఆమె పాదాలముందు అర్పించండి, నా జన్మ ధన్యమవుతుంది' నన్నంటే నన్ను గ్రహించండి అంటూ ఇవన్నీ వంతులుపోతున్నవి.

భర్త: అట్లాగే ఉన్నది. మన మీ పూవులు పరమేశ్వరి నామాలు నమోంతంగా చెబుతూ ఆమె పాదాలు అలంకరిస్తూ మనము కృతార్థులమైనాము అనుకుంటున్నాము గదా!—అట్లాగే, పాపము, ఈ పూలుకూడా మనము పూజలో ఉపయోగిస్తే తమ జన్మలు సార్థకమవుతవి అని అనుకుం న్నవి కాబోలు!

భార్య: ఎంత కమ్మని రంగులు! ఏమి పరిమళము! ఆహా! నాకు మైమరపుకూడా కలుగుతున్నది.

భర్త: వాటి రంగూ వాటి సుగంధమే వాటి నోరన్న మాట! విజ్ఞానశాస్త్రజ్ఞులు, తేనెటీగంనూ సీతాకోకచిలుకలనూ ఆకర్షించడానికే, పూలకు రంగులూ సువాసనలూ ఉన్నవంటారు. అంటే వాటి పిలుపులూ భాష తేనెటీగలకూ సీతాకోక చిలుకలకూ ఇతర కీటకాలకూ పక్షులకూ కూడా తెలుసునన్నమాట. ఇంత జ్ఞానమున్న దనుకొనే మన మానవులకే ఎరుకలేదన్నమాట. రెండు చెవులున్న మనుష్యులకే వాటిగొడవ ఏమీ వినిపించదు.

భార్య: ఒక చిత్రము గమనించారా? ఇన్నిపూలు ఇంత గొడవచేస్తూ ఉంటే, మనము కూచున్న ఈ తులసి కోటలోనుంచి పిలుపన్నమాట లేదు.

భర్త: మన కుడిపక్కగాఉన్న ఆ మారేడు చెట్టులో నుంచి కూడా చడీ చప్పుడూ లేదు. పోనీ, గాలి తగలడము లేదా అంటే, వాటిమీదకూడా తగులుతూ ఆడుతూనే ఉన్నవి. కారణమేమై ఉంటుంది చెప్మా!

భార్య: ఏ మున్నది! ఈ తులసీదళాలు ఆ మారేడు దళాలూ స్వయంగా పరదేవతా స్వరూపాలు గదా! అని పిలిచి చెప్పుకోకపోయినా మనకు వాటిని కోసి తీసుకోకతప్పదని వాటి ధీమా!

భర్త: అట్లాగే ఉన్నది. ఈ తులసీ ఆ మారేడూ గాలికి తలలాడిస్తూ రమ్మని కాస్త సంజ్ఞ లైనా చేస్తున్నట్లున్నవి. కాని ఆ నీటి ఒడ్డున ఆ కుశలు చూడు. అవి వద్దు వద్దు అంటు న్నట్లుగా గాలికి తల లాడిస్తున్నవి. ఎంత వద్దంటున్నా వాటిని ముందు గ్రహించక తప్పదుగదా!

(లేచి నమస్కరించి కుశలు కోస్తాడు.)

భార్య: అంతకంటే చిత్రము, కదలకుండా మెదల కుండా నేలమీద పాకిపోయే ఆ దూర్వలు చూడండి!

భర్త: బాగా జ్ఞాపకం చేశావు సుమా!

"సహస్రపరమా దేవీ
శతమూలా శతాంకురా
సర్వగ్ం హరతు మే పాపం
దూర్వా దుస్స్వప్న నాశినీ"

[అంటూ దూర్వలు కోసిబుట్టలో వేస్తాడు.]

'కాండాత్కాండాత్ ప్రరోహంతీ
పరుషః పరుషః పరి
ఏవానో దూర్వే
ప్రతను సహస్రేణ శతేనచ
యా శతేన ప్రతనోషి
సహస్రేణ విరోహసి
తస్యాస్తే దేవీష్టకే విధేమ
హవిషా వయమ్'

[అంటూ కోసినచోట దూర్వలను దువ్వుతాడు.]

భార్య: ఇక ఇప్పుడు తులసికీ మారేడుకూ ఎవరి దళము ముందు కోసినా రెండవ వారికి కోపము రాదుగదా! ఏమి చేసేట్లు?

భర్త: రెండు రూపాలతోఉన్న పరదేవతకు, ఏరూపము గ్రహించినా తానే గనుక, కోపము రా గూడదు. అయినా అన్నావు గనుక చిక్కులేకుండా, నీవు తులసీదళాలు కోయి, నేను మారేడుదళాలు కోస్తాను.

(ఇద్దరూ తులసినీ బిల్వాన్నీ ప్రార్థిస్తూ దళాలు గ్రహించి కళ్లకద్దుకొంటూ బుట్టలో ఉంచుతారు)

భార్య: (తులసీ ప్రార్థన)

తులస్యమృతజన్మాసి
సదా త్వం కేశవప్రియే
శ్రీ పూజార్థం చినోమి త్వాం
వరదా భవ శోభనే,
ప్రసీద మమ దేవేశి
ప్రసీద హరివల్లభే
క్షీరోదమథనోద్భూతే
తులసి త్వం ప్రసీద మే

భర్త: (బిల్వప్రార్థన)

దర్శనం బిల్వవృక్షస్య
స్పర్శనం పాపనాశనమ్।
అఘోరపాపసంహార
మేకబిల్వం శివార్పణమ్।
త్రిదళం త్రిగుణాకారం
త్రినేత్రం చ త్రియాయుధమ్
త్రిజన్మ పాపసంహార
మేకబిల్వం శివార్పణమ్।

భార్య: ఏమండీ, ఈ తులసీదళము రేకులు ఇట్లా కదలి పోతున్న వి?

భర్త: నీ కేదో ఇవ్వాళ వెర్రి ఎత్తినట్లున్నది.

భార్య: కాదు, సరిగ్గా చూడండి. ఈ తులసీదళము ఆడుతున్నది. దానితో—

భర్త: నిజమే సుమా! ఏదో శ్లోకముకూడా పాడు తున్నట్లున్నదే. విను—విను—మాట్లాడక!

తులసిపాట (తెరలో)

నానాపురాణనిగమాగమసమ్మతం యత్
రామాయణే నిగదితం క్వచి దన్యతోఽపి
స్వాంత స్సుఖాయ తులసీ రఘునాథగాథా
భాషా నిబన్ధ మతిమఞ్జుల మాతనోతి॥

భర్త: ఆహా, రామాయణగాథ భాషాకావ్యంగా ఈ తులసిగానము చేస్తున్నది. ఎంత ధన్యులము!

భార్య: ఆదేమిటి? మీవద్ద ఆ మారేడు దళాలు కూడా ఆడిపోతున్నవి. అవికూడా ఏ మన్నా పాడుతున్నవా?

భర్త: ఆహా విను విను! —

(బిల్వదళాల పద్యాలు పాటలు తెరలో)

చేతు లారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నొడువడేని!

* * *

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ—

భర్త: అది భక్తపోతన కంఠము, నమస్కరిద్దాము!

(ఇద్దరూ చేతులు జోడిస్తారు.)

భార్య: అదేమిటండి? తెలుగల్లోనే ఉంది కాని నాకా భాష సరిగ్గా తెలియడం లేదు.

భర్త: అది కుమారవ్యాసులవారి కన్నడ కంఠము! నారణప్ప కర్ణాటభాషలో మహాభారతగానము చేస్తున్నాడు. ఆయన గదగిన నారాయణస్వామి భక్తుడు! పోతనా నారణప్పా రెండు సోదర భూములలో ఏకకాలములో జన్మించి, రెండు సోదరభాషలలో భగవత్సంకీర్తనము చేసిన భక్త కవీశ్వరులు సుమా!

(ఇద్దరూ మారేడుదళాలకు నమస్కరిస్తారు.)

భర్త: అదుగో ఆ పాట విను. అది నీవద్ద తులసీ దళములోనుంచి వినబడుతున్నది.

తులసీదళము పాట (తెరలో)

పల్లవి:

శివదరుశన నమగాయితు కేళె
శివరాత్రియ జాగరణె||

చరణములు:

పాతాళగంగెయ స్నానవమాడలు
పాతకవెల్ల పరిహారవు
జ్యోతిర్లింగన ధ్యానమాడలు
దుష్కృత గళిల్ల అనుదినవు 1

బేడిద వరగళ కొడువను తాయి
బ్రహ్మన రాణియ నోడువను
ఆడుత పాడుత ఏరుత బసవన
ఆనంద దిన నలిదాడువను 2

శిఖరవ కండెను పురందర విఠలన
హరి నారాయణ ధ్యాన దలి 3

భార్య: మరి పురందరదాసులు విష్ణుభక్తులు కాదూ!

భర్త: అందుకనే ఆయన తులసీదళాలలో చేరినాడు. శివదర్శనానందము గానము చేస్తున్నారనేనా నీ సందేహము? — మహాభక్తులకు శివకేశవ భేదము ఉంటుందా? — పాటలు వినబడు తున్నవే.

భార్య: ఇదేమండీ? ఈ తులసీదళాలూ ఆ మారేడు దళాలూ అన్నీ గంతులువేస్తున్నవి లయాను కూలంగా!

భర్త: పాటలుకూడ పాడుతున్నవి. విను, విను!

తులసీదళాల పాటలు (తెరలో)

పంఢరీ చే వారకరీ।
తే అధికారీ మోక్షాచే||
పుండలికా దిలావర।
కరుణాకరే విట్ఠలే||
మూఢ పాపీ జైసే తైసే।
ఉతరీ కాసే లావ్పాని||
తుకా మ్హణే ఖరే ఝాలే।
ఏకా బోలే సంతాంచ్యా||

* * *

యోగ యాగ్ క్రియా ధర్మాధర్మ మాయా।
గేలే తే విలయా హరి పాఠేం||
జ్ఞానదేవీం యజ్ఞయాగ క్రియాధర్మ।
హరీ విణ నేమ నాహీం దుజా||

* * *

ఉఠోనియా ప్రాతఃకాళీ।
వదనీ వదా చంద్రవౌళీ।
శ్రీ బిందు మాధవా జవళీ।

స్నానకరా గంగేచే।
స్నానకరా గోదేవేం॥

*　　*　　*

భాగిరథీచే స్నాన కరా।
హృదయే స్మరోని గంగాధరా॥
చుకేల చౌత్యాంశించా ఫేరా।
ఐసే మాహాత్మ్య గంగేచే॥

*　　*　　*

కృష్ణవేణ్యా తుంగభద్రా।
శరయూ కాలిందీ నర్మదా।
భీమాభావమా ముఖ్య గోదా।
కరాస్నాన గంగేచే।

వ్యాస వాల్మీకి నారదమునీ
అత్రి వసిష్ఠ ఆణి జైమినో।
గురుదత్త యేతి మాధ్యాహ్నేం।
ఐసే మాహాత్మ్య గంగేచే॥

ఆలీ ఆషాఢీ ఏకాదశీ।
చలా జాఊం పంఢరసీ।
పాండురంగ చరణాంపాశీ।
దావీ మాహాత్మ్య గం చే॥

భార్య: మీకేమైనా తెలుస్తున్నదా?

భర్త: కొంత కొంత. మహారాష్ట్ర భక్తులు నామదేవ తుకారామాదులు పండరి భజన చేస్తున్నారు.

భార్య: ఈ తులసీదళమునుండి మధురమైన యువతి కంఠము వినవస్తున్నది. వినండి.

తులసీదళము పాట (తెరలో)

రామనామ రస పీజై, మనువాః
రామనామరస పీజై।
మీరాకే ప్రభు గిరిధర నాగర,
తాహికే రంగమేం భీజై॥

భర్త: అవును భక్తమీరాపాట—సూరదాస మధుపము పాటకూడా వినవస్తున్నది.

తులసీదళము పాట (తెరలో)

హూ కచీల మతిహీన సకల విధి
తుమ కృపాలు జగజాన।
సూరమధుప [illegible] దరశ [illegible] కో
జనకరో కృపా[illegible]

భార్య: భక్త కబీరు పాట పాడారే

తులసీదళము పాట (తెరలో)

కబీర [illegible] నా[illegible] [illegible]।
గుణకీ [illegible]।
ఘట ఘట మహారే మధుప
జ్యాం పర అత్మా లే [illegible]
జసుధా జస జిసు భాండ్యా
ఖాల్యో కల్యో లాఖ
మిష్ట సువాస చమీల గహా
విషను కప్తా కీసాధ

భార్య: అదేమరో మరి, భాషకూడా కొత్తగా ఉన్నది!

బిల్వదళము పాట (తెరలో)

సబ్బు ఊనారి విలక్ష్య!
సబ్బుఊ సుస్థిర లోక।
సిరి ఇమరహిమ పాహ[illegible]నో
నహి చింతా నహి శోక।

భర్త: (ఆలోచించి) అది మైథిలీ భాష, విద్యాపతి 'కీర్తిలత' లోనిది. విద్యాపతిని వంగీయులు తమ కవిగాను, హిందీవారు తమ కవిగాను ప్రశంసిస్తారు.

భార్య: ఆ మారేడుదళము తమిళములో పాడుతున్నట్లున్నదే!

బిల్వదలము పాట (తెరలో)

పొల్లాం పురుళమే
తూత్తిరియుం నెయ్యుమా
నల్లిడింజిల్ ఎన్నుడయ
నావాగ చ్చొల్లరియ
వెణ్బా విళక్కావియన్
కైలైమే లిరున్ద
పెణ్బాగ క్కేట్టినేన్ పెట్ట్రు
పెట్ట్రపయన్ ఇదువే
అణ్ణే పిరందు యాన్
క్క్రట వర్గళీ ఎత్తుం

శీర్ కాళత్తి క్కొట్రట్టనర్కు
తోణాగత్తాడరవం
సూణిణిన్ద అమ్మానుక్కు
అశాగ ప్రెట్ట్రేపి అడ్డైందు॥

భర్త: ఆహా, అది నక్కీర కవీశ్వరుడు చెప్పిన అంతాది లోనిది. నిర్భయంగా సుందరేశ్వరస్వామి పద్యంలో తప్పు పట్టిన సంగం కవీశ్వరునిది. శివభక్తుడై కైలైపాది కాళత్తిపాది జములుగా కలిపి అంతాది కావ్యంచెప్పి కైవల్యము పొందినాడు.

భార్య: భరతభూమి అణువణువునా భక్తకవీశ్వరులు వెలసినారు.

బిల్వదళాలలో పద్యము (తెరలో).

ద్వైత భ్రాంతి వికల్పితం బఖిలమున్
స్వప్నేంద్రజాలోపమం
బైతూలన్ పృథురజ్జుసర్పసదృశ
వ్యామోహ విచ్ఛేదనంబై
తత్త్వజ్ఞత యావహిల్లి
యపరోక్షాభేదవిత్సౌఖ్యవిఖ్యాతుం
గొంతురు నిన్ను నౌపనిషదుల్
కల్యాణ నారాయణా

భార్య: శంభుదాసు పద్యమువలె ఉన్నదే!

భర్త: సందేహ మెందుకు, ఇంకొకరైతే అట్లా అన గలరా, భారతిని పరమహంస సన్యాసిరూపముతో భావించగలిగిన ఒక్క ఎర్రనుకవి కాకుంటే!

భార్య: ఏమి టండీ, మనకీ అద్భుతానుభవము!

భర్త: ఏమున్నది? పవిత్రమైన మన భరతభూమిని పవిత్రతరము చేసిన భక్తాగ్రేసరులూ, గంగాది పుణ్యనదులూ ఇంటింటా తులసీదళాలుగానూ బిల్వదళాలుగానూ అవతరించి నిత్యమూ ఇట్లా భగవద్గానముచేస్తూ, ఉద్బోధిస్తున్నారన్నమాట, మనబోటి అజ్ఞానులనూ, అంధులనూ, బధిరులనూ! —

(భార్యా భర్తలు ఆనందబాష్పాలూ కారుస్తూ కొంతసేపు మౌనముగా భక్తి పరవశులై ముకుళిత కరకమలులై ఉంటారు — తులసీదళాలూ బిల్వదళాలూ నృత్యగీతాలూ విరమిస్తవి - ఇద్దరూ పూజా పుష్పాలు కోయడానికి లేస్తారు.)

భార్య: వింటున్నారా, వింటున్నారా, ఆ గొడవ?

భర్త: ఏమిటి? దళాలు మౌనము వహించినవి.

భార్య: అయ్యో కర్మము, మీకేమీ వినబడడమే లేదా తోటంతా ఒకటే రణగుణ ధ్వనిగా లట్లా ఉంటే!

భర్త: ఏది? ఎక్కడ? నాకేమీ వినబడడం లేదే.

భార్య: (చిరునవ్వుతో) అయ్యో! ఇందాక ఏదో లోపం లోపలి చెవి విచ్చుకున్న దంటిరే, మళ్లీమూత పడ్డదే? ఐతే పోనీ ఈ తులసికోట అరుగు మీద మళ్లీ కూచుందాము రండి— అదుగో వినండి! కొన్నివేల మంది— లక్షంమందా?— ఏదో దివ్యబృందగానము చేస్తున్నట్లున్నది— ఎన్ని రకాల గొంతులు! ఎన్నెన్నిరకాల రాగాలు! అన్నీ ఏదో మహాగానంగా మేళవిస్తున్నట్లున్నవి.

భర్త: పాశ్చాత్యదేశాలలో కవులూ తత్త్వవేత్తలూ గోళకోటుల గానము జ్ఞానులైనవారికి మధ్య మధ్య వినవస్తుందంటారు. అది నీకేమైనా వినిపిస్తున్నదేమో!

భార్య: ఎక్కడోకాదు. ఈ తోటలోనే వినవస్తున్నది. ఇక్కడ నిలుచోక ఆ తులసి అరుగుమీద కాస్త శాంతంగా కూచుందాం రండి!

భర్త: అట్లాగే ఏదో పుణ్యవిశేషము పరిపక్వమై మన కీ నాటికి ఈ తోటభాష కాస్త కాస్త తెలియవస్తున్నట్లున్నది. తెలుసుకుందాము.

(ఇద్దరూ అరుగుమీద కూచుంటారు. భర్త నిమీలిత నేత్రాలతో వ్యగ్రుడై ఆలకిస్తాడు.)

భార్య: ఇప్పుడైనా వినబడుతున్నదా?— ఆహా, ఎంత శ్రావ్యముగా ఉన్నది!

భర్త: ఎక్కడో ఏదో ఎన్నికోట్ల యోజనాల దూరాన నో ఎవరో గానము చేస్తున్నట్లు లీలగా విన వస్తున్నది—మరి ఇది భ్రాంతీ కావచ్చును.

భార్య: ఎక్కడో కాదు. ఇక్కడే, మన ఈ తోటలో నుంచే, వినిపిస్తున్నది. ఏ మాత్రమూ భ్రాంతి కాదు!

భర్త: అట్లాగే? వేదపురుషుడు పుణ్యము సుగంధము వలె దూరాననుంచి వాసిస్తుంది అన్నాడు. ఈ పూల సుగంధమే అవి చేసిన పుణ్య విశేష మన్నమాట. ఆ సుగంధముతో పుణ్యపురుషుల కథాగానము వినిపిస్తున్నదేమో!

భార్య: ఐతే?

భర్త: కేవల పుణ్యము అనుభవానికి వచ్చేది ఒక్క స్వర్గంలోనే అంటుంది కాదూ, శాస్త్రము!

భార్య: అంటే?

భర్త: స్వర్గమనేది ఎక్కడో దూరాన ప్రత్యేకించి ఉన్న లోకముకాదు. అది విశ్వమంతటా వ్యాపించి ఉన్నా, తెలుసుకోలేని వారికి దూరమే అన్న మాట! ఈ రహస్యము నా కిప్పుడే కొంచెము కొంచెము స్ఫురణగా భాసిస్తున్నట్లున్నది.

భార్య: మీ రేదో శాస్త్రవాక్యాలు ఆధారము చేసుకొని పుణ్యవాసన వాసిస్తుంది అంటున్నారు. నాకు ఆ సువాసన అనేది హృదయంగమమైన దివ్య సంగీతశ్రుతివలె స్వచ్ఛంగా వినిపిస్తున్నది.

భర్త: ఏ మంటున్నా వేమంటున్నావు! నీ భాష ఇవ్వాళ కొత్త కొత్త అర్థస్ఫూర్తితో నిండి అమృతకలశమువలె ఉంటున్నది. నీకు సువాసన వినిపిస్తున్నదా? ఏమిటి! ఈ దివ్య సౌరభములతో నిండి దిట్టమైన ఈ చల్లగాలి మనకేదో కైపు ఎక్కిస్తున్నదా!

భార్య: అట్లాగే ఉన్నది. సోమపానము చేసిన ఋషీశ్వరులకు ఇటువంటికైపే కలుగుతుందేమో! అదుగో ఎవరో ధన్యాత్ములు సామగానము చేస్తున్నారు. 'హా 3 వు హా 3 వు హా 3 వు' అని.

భర్త: నిజంగానా? ఇవ్వాళ నీ మాటలు అంతకంతకు నన్నెక్కడెక్కడికో దివ్యవీథులలోనికి ఎగర గొట్టుతున్నవి.

భార్య: అదుగో, ఆ ఆనందగానాన్ని చీల్చుకొని ఏదో ఏడుపు వినిపిస్తున్నది. [illegible] [illegible] ఏడుస్తున్నాయి. ([illegible]) [illegible] [illegible] [illegible]?

భర్త: నీ [illegible] [illegible] [illegible] ఏడుపులే వినిపిస్తున్నవి. ఆ [illegible] [illegible] కాదా?

భార్య: అవును. పాప మా మొగలిపూలే [illegible] విలాప గీతము పాడుతున్నవి. వినండి!

మొగలి పూలపాట (తెరలో)

వృథా వృథా! మా ఈ జన్మములే వృథా!
వృథా వృథా! మా కోమలత్వమే వృథా!
వృథా వృథా! మా సుందర రూపము వృథా!
వృథా వృథా! మా దివ్యవాసనలు వృథా!
వృథా వృథా! మా ధవళిమ్ములే వృథా!

భర్త: లోకంలో ఏడ్చే వాళ్లంతా ఇంతే! ఉన్నదానిలో తృప్తి పడక, లేనిదానికోసము ఏడుస్తూ ఉంటారు.

భార్య: ఏమంటున్నారు?

భర్త: ఈ మొగలిచెండు చూడు! దీనికి చిరకాలము నిలిచే సువాసన ఉన్నది. కింజల్కాలున్నవి. చక్కని తెల్లని వెండి రంగూ, పచ్చని బంగారు రంగూ ఉన్నవి. మెరుగూ మార్దవమూ ఉన్నవి. ఇన్నిటిలోపాటు నలిగిపోక మన్నికనిచ్చే కరకు దనమున్నది. నిగనిగలాడే నునుపుదన మున్నది. ఇన్ని గుణగణాలు మరెన్ని పూల కున్నవి? ఇక ఇప్పుడు దీనికీ ఏడుపెందుకో నీవే చెప్పు!

భార్య: అయ్యో! ఏమి ఉండి ఏమి ప్రయోజనము! మరము చిన్నపూలు పెద్దపూలు ఇన్నిన్ని రకాలవి పరమేశ్వరి పూజకు కోస్తున్నాముగదా. ఈ మొగలిచెండు గ్రహిస్తామా? ఇన్నిపూలు పరమేశ్వరి పాదాలమీదపడి తమ జన్మలు సార్థకం చేసుకుంటూ ఉంటే, ఆ భాగ్యములేని దీనికి ఏడుపురాదా మరి?

భర్త: కావచ్చు గాని ఎవరుచేసిన కర్మఫలము వాళ్ళు అనుభవించక తప్పుతుందా? శివద్రోహముచేసిన

ఫల మనుభవిస్తూ, పైగా ఏడుపుకూడా దేనికీ దీనికి ?

భార్య: అహా, అట్లా కనికరంలేకుండా మాట్లాడకండి! చేసిన దోషానికి పశ్చాత్తాపంతో ఏడుస్తున్నదిది!

భర్త: నిజమా ?

భార్య: నిజమే. వినండి! దాని ఏడుపు వింటూంటే నా కడుపు తరుక్కుపోతున్నది. పాపము! అయ్యో!

మొగలిపాట (తెరలో)

వృథా! వృథా! ఈ నా భవమే వృథా! వృథా!

భర్త: (ఆలకించి యోచించి) పశ్చాత్తప్తులమీద జాలి చూపవలసినదే— అయితే ఒక ఉపాయం చేసేదా?

భార్య: దాని జన్మ వృథాకాకుండా, మీరేమి చేసినా నాకు సమ్మతమే.

భర్త: ఐతే ఉండు. ఆ మొగలి చెండుకోసి దానిని నీ కేశపాశములో తురుముతాను.

భార్య: పరమేశ్వరి పూజకని పూలుకోస్తూకూడా ఇట్లా సరసాలాడుతారా?—ఏమి మగవారండీ!

భర్త: సరసాలాడవన ఐనంతవరకు దానికి వేళావేళలు లేవు. ఐనా, నే నిప్పుడన్నది సరసపసల్లాపము కాదు.

భార్య: మరి?

భర్త: నీ శిరస్సుమీద శ్రీదేవి పాదాలు స్థిరంగా లేవా?

భార్య: ఉంటే?

భర్త: ఈ మొగలి చెండు నీ శిరస్సులో అలంకరిస్తే శ్రీదేవి పాదాలు అలంకరించినట్లు కాదా?

భార్య: ఆహా! ఏమి మంచి ఉపాయము చెప్పినారండీ! ఇకముందు మొగలిచెండు ఎప్పుడు తలలో తురుముకొన్నా శ్రీదేవి పాదాలు అలంకరిస్తున్నట్లే భావిస్తాను. ఉపాయము చెప్పినందుకు ఇవ్వాళ మీరే ఆ పని చేయండి!

(భర్త మొగలిచెండుకోసి భార్య కొప్పులో అలంకరిస్తాడు.)

భర్త: చూచావా, స్వభావసిద్ధమైన దీని కొంటెతనము వదలలేక పోయినది, ఈ మొగలి!

భార్య: ఏమి చేసింది?—ఏమయినది?

భర్త: దాని పత్రాల అంచులతో నీచెవుంకూ మెడకూ గాట్లుపెట్టింది.

భార్య: ఇంతేనా? (నవ్వుతూ) మీ చేతులుకూడా గిల్లుకు పోయినవే—పోనీలెండి! మన పిల్లల వంటివే ఇవీ అనుకుందాము.

ఒక పొదలోనుంచి నవ్వు (తెరలో)

భర్త: (ఉలిక్కిపడి) ఆఁ!

భార్య: ఎవరో పకపక నవ్వుతున్నట్లున్నది. ఈలోకము ఎంత చిత్రమైనది! ఒకచెంప కొందరు ఏడుస్తూ ఉంటే, ఇంకొచెంప కొందరు నవ్వుతూ ఉంటారు.

భర్త: (చిరాకుతో) అది సంతోషించేవాళ్ల నవ్వుగా లేదే!

భార్య: మరి ?

భర్త: ఎవరినో పరిహసిస్తున్నారు. ఈ ఎక్కిరించేవాళ్లనుచూస్తే బహుచిరాకు నాకు.

భార్య: మీరూ తరుచుగా ఆ పనే చేస్తూ ఉంటారు గనుకనా ?

భర్త: అది వేరేవిషయము —

(భార్య పకపక నవ్వుతుంది)

ఏమిటా పరియాచకము అసహ్యముగా!

భార్య: (మరింత నవ్వుతూ) ఈ పొదలోనుంచి నవ్వేది ఎవరినోచూసి కాదండోయ్!

భర్త: మరి ?

భార్య: మనలనే. మనఇద్దరినే. మిమ్మునూ నన్నే!

భర్త: మనలను వెక్కిరిస్తున్నారా? మన ఇద్దరినీ వెక్కిరిస్తూ ఉంటే, మధ్య నీకే నవ్వెందుకు వస్తున్నట్లు ?

భార్య: మనలను హేళనచేసే వాళ్లమాటలకు ఉంక్షిక కొద్దీ మరింత హేళనచేసి ఆటపట్టిస్తారు. వినండి, వాళ్ల పకపకలమధ్య వాళ్లగుస గుసలు!—అదిగో, మీకు కోపము వచ్చిందంటే మళ్లా లోపల చెవి వినిపించదు. శాంతం వహించి వినండి!

భర్త: నాకు సరిగ్గా వినిపించటం లేదు. ఏమంటు న్నవి?

భార్య: "హ్హాహ్హాహ్హా!—ఈ పిచ్చివాళ్లు! హ్హహ్హా!—వీళ్లను మ్యూజియములో ఉంచవచ్చు!—ఈ పిచ్చివాళ్లు! హ్హాహ్హాహ్హా! హ్హాహ్హాహ్హా! హ హ్హాహ్హా!

భర్త: మధ్య నీకేమీ పిచ్చి ఎక్కలేదు గదా!

భార్య: లేదు. లేదు. మీకు వాళ్ల గుసగుసలు విన బడడం లేదన్నారని అనువాదము చేస్తు న్నాను. మనము రోజా పూజకు పూలుకోసే వెర్రివాళ్లమని ఈ పొదలో పూలు పకపకలూ వికవికల మధ్య గుసగుసలాడుతున్నవి. వినండి శాంతం వహించి!

భర్త: ఆఁ!—ఎవరది!

భార్య: కోపము కాస్త తమాయించుకొంటే మీకే విని పిస్తుంది—మీ యిష్టమే!

భర్త: ఏమిటేమిటి! మన మెంతో ఆపేక్షతో పూజకు కోసే గులాబిపూల పొదలోనుంచే ఆ గుసగుసలూ ఆ వికవికలూ వినవస్తున్న ట్లున్నవే!

భార్య: అట్లా దారికి రండి! బాగా ఆలకించండి.

భర్త: సాటిలేని వాటి సువాసనా వాటి రంగూ చూచి మనము ముగ్ధులమై ఎంతో వేడు కతో రోజా పూజకు కోస్తున్నాము, ఆ గులాబీలేనా నవ్వుతున్నది?

భార్య: నన్ను కలపకండి. నా కెందుకో ఎప్పుడూ వాటిమీద వ్యామోహములేదు. మీరే, అన్ని పూలపైనా వాటిని పేర్చి చూచుకొని మురిసిపోతుంటారు.

భర్త: ఇప్పుడు [illegible]

భార్య: [illegible]

భర్త: వాటిలో [illegible] ఉంటాయేమో!

భార్య: [illegible] ఉంటుంది!

భర్త: నిప్పే! [illegible] ఉండేదెట్లా?

భార్య: ఓహో, వాటి గుసగుసలు వినిపిస్తున్నాయా? ఎవరికోసము కోస్తారేం అనుకొంటున్నాయి— అసలు [illegible] ఎందుకు వచ్చినవో ఆలోచించారా?

భర్త: నీ ఉద్దేశమేమిటి?

భార్య: లోకంలో కొందరు పేరుకోసమని కొంచెము మంచిపనులు చేస్తారు, ఎరుగుదురు గదా!

భర్త: అవును. యశస్సుకోసముచేస్తే తప్పేమిటి? మంచిపేరు ఈ లోకంలో ఉన్నంతకాలమూ వాళ్లకు స్వర్గసౌఖ్యము అనుభవంలో ఉంటుం దనిగదా శాస్త్రము చెప్పేమాట! మంచిపేరు కోసము యత్నించడము తప్పుకాదు.

భార్య: దశలక్షాధికారి ఒకడున్నాడనుకోండి. వాడు పావలా ఖర్చుపెట్టి, ఏ పెంటదగ్గర గుడికో ఎక్కేమెట్లుకు కాస్త సిమెంటువేయించి, దాని మీద రూపాయిచ్చి తన పేరు చెక్కించుకుం టాడే, అట్లా!

భర్త: నా కర్థం కావడము లేదు.

భార్య : ఇంటికి వచ్చిన పాత్రుడైన అర్థిని కసరి పంపివేసి, పదిమందీ పోగైన సభలో, వితంతు శరణాలయానికో, వికలాంగుల భోజనశాలకో పైసాయిచ్చి, దానిమీద పెద్దక్షరాలతో తమ పేరు వేయించుకుంటారే —

భర్త : అటువంటి పుణ్యాత్ములంటావా, ఈ గులాబి పూలు ?

భార్య : నాకు మీ చదువులు రావుగా. గులాబిని గీర్వాణిలో ఏమంటారో ?

భర్త : ఆఁ! ఆఁ! పేరు రావడం లేదు. ఇది విదేశీ పుష్పము !

భార్య : వీటికి కేసరాలు ఉన్నవా ?

భర్త : లేవు. నిజమే. ఇవి పూజకు నిషిద్ధము !

భార్య : నాకు మీ శాస్త్రాలు రావుగా ! పరమేశ్వరి పూజకు వీటి నికముందు కోయడము నా కేమాత్రమూ సమ్మతము కాదు.

భర్త : బాగా అన్నావు. ఎంతవాళ్లకూ భ్రాంతి తప్పదు. ఐతే మనం వీటిని పూజకు గ్రహించవద్దు. జ్ఞాపకముంచుకో, ఏం ?

భార్య : అట్లాగే !—వినండి, వినండి !

భర్త : ఏదో పాటకూడా పాడుతున్నట్లున్నవే, ఇవి !

భార్య : అయ్యో, వినండి ! అతినవ్యమైన పాట !

**గులాబీల పాట (తెరలో)**

ఇరవయ్యో శతాబ్దం—ఇది —
ఇరవయ్యో శతాబ్దం !
పూజలింకా చేసే —
పూజకు పూలనుకోసే
చాదస్తులు ఉన్నారా—అయ్యయ్యో—
ఇరవయ్యో శతాబ్దం !
వీళ్లు మమ్ము కోయరట !
కోయకపోతే మించిపోయె !
ఈ మా ఎరుపంతా మరి,
ఇట్టి మూర్ఖుల పాడిచిన రక్తం !
ఇరవయ్యో శతాబ్దం—ఇది—
ఇరవయ్యో శతాబ్దం !
మాకోసము కలవరించే
మనుషులు కోకొల్లలు !
చక్కని చుక్కలు —నడుము—
చిక్కని యువతులు
ముద్దుల గుమ్మలు—
మురిపెపు బొమ్మలు
మమ్మెల్లెడ వెదకి వెదకి—
మాకోసం పలవరించి
మమ్మెంతో గారవించి
మమ్మెంతో ఆదరించి
చిగురుకేల సేకరించి
సిగల సింగారిస్తారు !
దివ్యభవ్య భవనాలలో
దీవ్యత్ మేజాలపైన
అందందపు వాజొస్‌లో
అలంకరిస్తారు మమ్ము
ఇరవయ్యో శతాబ్దం !
ఇంకా పూజలు చేసే
చాదస్తులు ఉన్నారా !—
ఛా ! ఇరవయ్యో శతాబ్దం'
ఇది ఇరవయ్యో శతాబ్దం !—
ఇరవయ్యో శతాబ్దం !

భర్త : శివశివా ! (చెవులు మూసుకుంటాడు.)—అబ్బా, చెవులు మూసుకున్నా ఈ పాపిష్ఠి పాట వినబడుతూనే ఉన్నదే !

భార్య : మరీ ఇది కాకండి ! బయటి చెవులు మూసుకొన్నకొద్దీ, లోపలిచెవి బాగా వినిపిస్తుంది !

భర్త : ఈ పాడు పాటను ముంచివేస్తూ ఏవో మంజుల నాదము వినవస్తున్నదే, ఆహా !

భార్య : ఏదో కింకిణీ స్వనంవలె వినిపిస్తున్నది. ఈ దివ్యవాసన గులాబి వాసనను మింగివేస్తున్నది.

భర్త : ఆహా, ఎంత ఆప్యాయంగా ఉన్నది ! అంగము లన్నిటినీ ముంచెత్తుతున్నది.

భార్య: ఆ వచ్చేది మన మల్లెపందిరిలోనుంచే. ఏదో పాట వినిపిస్తున్నది. ఆలకించండి.

మల్లెపూల పాట (తెరలో)

ఓ పుణ్యదంపతులార—
ఒకమారు మావైపు తిరగండి!
ఓ పుణ్యదంపతులార—
ఒక్కింత మము కటాక్షించండి!
కోటి జన్మము లెత్తి కోటి పుణ్యము కూర్చి
సుకృతంపు వాసనల సుడులలో చిక్కుకొని
సుకృతంపు తేజస్సు సుడులలో తిరుగుచును
వెదకికొని వెదకికొని వెదకికొని భువనములు
ఏరుకొని కోరుకొని ఇట్లిచట వెలసితిమి
మీ పుణ్యహస్తముల మెలిచి మముత్రుంచండి
మీ శ్రీకరాంజలుల మేరలో చేర్చండి
శ్రీ పాద పీఠాన చేర్చుడీ భక్తి
ధన్యతం గూర్పరే ధన్యతం గనరే!
ఓ పుణ్య పురుషుడా ఓ పుణ్యసాధ్వి
మా మాట విని రండి మము గ్రహింపండి!

భర్త: ఆహా. ఆహా! సాక్షాత్తుగా శ్రీనగరమే ఇక్కడ అవతరించి నట్లున్నదే. ఈ మల్లె పూలది కేవల సుకృతవాసనేకాదు. పుణ్యావామముకల ఆ శ్రీదేవి మందహాసకళే ఇది!

భార్య: ఎన్నాళ్లకు శ్రీదేవి మనలను అనుగ్రహించినది! శ్రీదేవి ఈ ఆకారంగా మన తోటలో అవతార మెత్తినదని ఎంతకాలానికి తెలుసుకోగలిగినాము!

భర్త: ఇదుగోనమ్మా, నమస్కారము!

భార్య: తల్లీ, ఇదుగో, వందనము!

(ఇద్దరూ ఆనందము విరిసిన ముఖాలతో ప్రతి మల్లెపువ్వునూ కళ్ల కద్దుకుంటూ బుట్టలలో వేస్తారు.)

భర్త: (తలెత్తి) ఎవరది?

(తెరలో) శబ్దము

శివా! శివ శివా!-- శివా! శివశివా!— శివా!—

భార్య: మనతోట అంచునుంచి [illegible] వస్తున్నది. ఎవరున్నా ఆ [illegible] వారు!

భర్త: ఎవరో [illegible] పుణ్య దంపతులు కనపడి కనపడని సూక్ష్మశరీరాలతో ధ్యానము చేస్తున్నారు. ఎంత ధన్యులము!

భార్య: ఆ మహానుభావుల [illegible] ఎంత సూక్ష్మమయినవి! మనతోట అంచులలో వేంచేసి నట్టున్నారు.

భర్త: వెళదాము పద, అక్కడికి!

(ఇద్దరూ తోట అంచుకు వెళ్లుదురు.)

భార్య: చూచారా, ఎంత నిరాడంబరంగా ఉన్నారో ఈ మహానుభావులు!

భర్త: మనము వేయకుండా మొలిచిన ఈ తుమ్మి మొక్కలు పూచి, అనుక్షణమూ శివధ్యానము చేస్తున్నవి. ఈ తుమ్మి పూలను మనము శివారాధనకు తోడుకొని పోదాము.

(ఇద్దరూ భక్తితో తుమ్మిపూలు బుట్టలో వేస్తారు.)

భార్య: ఆహా, ఈ పుణ్యపురుషుల దేహాలు కూడా తాకితే ఎంత మృదువుగా ఉన్నవి! శివభక్తుల హృదయాలవంటివే ఇవిన్నీ!

భర్త: చూడు, చూడు, ఈ తోటఅంతా మనోహర మైన లేతఎరుపుకాంతితో నిండిపోయినది.

భార్య: అరుణకిరణజాలై రంచితాశావకాశా, అన్న ట్లుగా మన పూజావనము శోభిస్తున్నది.

భర్త: సూర్యభగవానుడు ఉదయించబోతున్నట్టున్నాడు.

భార్య: ఏమి ఈ దివ్యాద్భుత పరిమళము! ఒక్క సారిగా ఇక్కడ స్వర్గసౌరభముకంటె దివ్య తరమైన పరిమళము ఆవహించినది.

భర్త: అవును. ఈ పరిమళము, సాక్షాత్తుగా బ్రహ్మ లోకవాసుల హృదయపద్మాలు బ్రహ్మకల్పాంత

మందు బ్రహ్మజ్ఞానముతో విరిసే వేళలో వచ్చే అనిర్వాచ్యవాసనవలె, పరమాద్భుతంగా ఉన్నది. ఎంత చల్లగా, ఎంత మృదువుగా, ఎంత ఆనందజనకముగా, ఎంత శాంతముగా ఈ వాసన ఆత్మనే ఆవరించినది !

భార్య : అదిగో ! వికసిస్తున్న పద్మంతో మోక్షలక్ష్మి వలెనే మన పద్మాకరము భాసిస్తున్నది.

భర్త : మనము ధన్యులము. ఈ శతపత్రములూ, ఈ సహస్రపత్రకమలాలూ విప్పుకుంటూ బ్రహ్మరంధ్రంలో సహస్రారకమలములో మోక్ష ద్వారము విప్పుకొన్నట్లే ఉన్నవి. కమలాలు ఎంత పవిత్రమనోజ్ఞమైనవి !

(నీటిలో దిగి భర్త కమలాలు కోసి అందిస్తూ ఉంటే భార్య వాటిని వెడల్పాటి బుట్టలో పేరుస్తుంది.)

భార్య : ఏమిది !

భర్త : (ఒడ్డుకు వచ్చి) ఎవరిది? ఎవరో గుంపులు గుంపులుగా వచ్చి మన పాదాలమీద పడుతున్నారు.

భార్య : ఎవరో పుణ్యాత్ములు తోసుకు తోసుకుని వస్తున్నారు. [ సశేషం ]

---



# సాహిత్య జగత్తు-2

శ్రీ వాకాటి పాండురంగరావు

"సాహిత్యమంటే ఏమిటన్న పై చర్చ ముగిసిన అనంతరం ఇప్పుడు సాహిత్య విభేదాలను పరిశీలించుదాం. కవిత్వం, కథ, నాటకం—ఇవి ముఖ్య విభాగాలు. కవిత్వంలో మహాకావ్యాలూ, ఖండ కావ్యాలూ; కథలలో కథానికలు, పెద్దకథలు, నవలలు; నాటకాలలో ఏకాంకికలు, నాటకాలు మొదలైనవి అవాంతర విభేదాలు. ఇదంతా బహిరంగమైన స్థూలవిభజనే తప్ప దీనిలో పరమార్థం లేదు. ఛందోబద్ధమైనంత మాత్రాన కవిత్వంకాదు, గద్యంలో ఉన్నంత మాత్రాన కవిత్వంకాకపోదు. కొన్ని కథలూ, నాటకాలూ పద్యాలలో ఉన్నాయి, కొంత కవిత్వం వచనంలో ఉంది. షేక్స్పియర్, కాళిదాసుల నాటకాలలో నాటకీయత, కవిత్వం మిశ్రితమై వున్నాయి. కనుక ఈ బహిస్స్వరూపాలనిబట్టి కాక అంతరంగ తత్వాన్నిబట్టి వీటిని విభజించాలి.

ఏ సాహిత్య ప్రక్రియకైనా మానవజీవితం, దానితో సన్నిహిత సంబంధంకల ఇతరవిషయాలే ఆధారాలు. కవిత్వంలో భావప్రకటన ఉద్విగ్నంగా ఉంటుంది. కవి తన మనస్సులో ఉదయించిన ఉద్విగ్నతను శబ్దార్థముల నాశ్రయించి వెలువరిస్తాడు. ఆ శబ్దార్థయుగళంద్వారా ఆ భావం పాఠకులో ప్రవేశిస్తుంది. కనుక కవిత్వం ఉద్వేగ ప్రధానమైనది. కథ ఇట్టిది కాదు. దీనిలో ఉద్విగ్నతకన్నా వితర్కం హెచ్చుగా ఉంటుంది. పాత్రల మనస్థితులను ప్రతిఫలిస్తూ జీవిత పరిశీలనాత్మకంగా కథ నడుస్తుంది. పాత్రల పరస్పర ప్రవృత్తి సంఘర్షణలచేత కథలో సన్నివేశం ఏర్పడుతుంది. అందుచేత స్థూలదృష్టికి కథలు సంఘటన ప్రధానమైనవని తోస్తుంది. కథను చదివిన పాఠకుడు కథలో ఆ పాత్ర అట్లా ఎందుకు ప్రవర్తించినట్లు? ముగింపు అలా ఎందుకుంది? ఫలాని పాత్ర ప్రయోజనం ఏమిటి? ఈ [illegible] ప్రశ్నలు వేసుకొంటూనే ఉం[illegible]. [illegible] అలా ఒకానొక దృక్పథం [illegible] రుండని తెలుస్తున్నది. లేకుంటే [illegible] అర్థంలేదు. కథకి [illegible] ఏ పరిణామ తలంపదు.

కొన్ని కథలలో నిర్వ్యాప్తి [illegible] ఉద్విగ్నత ఉంటుంది. అప్పుడవి కవిత్వానికి దగ్గరలో ఉంటాయి. అంటే వాటిలో కవిత్వంలాంటి [illegible] పుట్టిస్తాయన్న మాట. చెకోవ్ కథలు ఇలాంటివి. పాలగుమ్మి పద్మరాజుగారి 'పడవ ప్రయాణం,' 'వాన వచ్చిన రాత్రి' ఇలాంటివే.

వ్యాఖ్యానయుతమైన జీవిత ప్రదర్శనం నాటకమనే సాహిత్యప్రక్రియ. పాత్రల సంభాషణ నారి అంతర్బహిః ప్రవృత్తులను వ్యక్తంచేసేదిగా ఉంటుంది. అప్పుడే ఆ సంభాషణలలో నాటకీయత ఉంటుంది. కనుకనే నాటకాలలో స్వగతం అందరికీ వినిపించవలసి ఉండడం. లేకుంటే ఒకపాత్ర ఇంకొకపాత్ర గురించి గాని, తనను గురించిగాని ఏమనుకొంటున్నాడో తెలియకపోతుంది. 'కన్యాశుల్కం'లోని ఈ క్రింది సన్నివేశంలో నాటకీయత గమనార్హం.

'గిరీ— ......యువతీమాటలు పేల్తున్నాడో వాడిపేరు తక్షణం చెబుతానా చెప్పవా ?

మధు:— రామ

రామ (తనలో) :— సచ్చాన్రా, పేరు చెప్పేసింది !

మధు:— రామ ! రామ ! ఒహరు చెప్పేదేటి లోకవంతాకోడై కూస్తూంటేను?'

ఇక్కడి రాగద్వేషాలు స్వాలం అతడి స్వభావాన్ని వ్యక్తం చేస్తున్నది. అదికాక వ్యాప్తంగా ఒక్క క్షణంలో జరిగిపోయినది విశ్లేషించి కొంతసేపు చూపబడింది.

వాస్తవిక జీవితంలో కొన్ని సంవత్సరాలలో జరిగిన ఇతివృత్తం నాటకంలో కొన్నిగంటలలోల జరుగుతుంది. కనుక జీవితంలోని ముఖ్యసంఘటనలను మాత్రమే ఏరుకొనడం, వాటినికూడా కుదించడం నాటకంలో తప్పనిసరి అవుతుంది. అందుచేత నాటక సన్నివేశాలు వాస్తవిక జగత్తులోని సన్నివేశాలను అధిగమించి ఉంటాయి. జీవిత సారాంశం నాటకమన్నమాట.

Shakespeare వ్రాసిన King Richard III నాటకంలో Lady Anne ని Richard మాయమాటలతో పెళ్లిచేసుకొందుకి ఒప్పించిన దృశ్యంలో ఈ కుదింపు స్పష్టంగా కనిపిస్తుంది. తన భర్తను హత్యచేసిన Richard తనముందు ప్రేమ ప్రకటన చేయగా Lady Anne అతడిమీద ఉమ్మివేస్తుంది. ఇది జరిగిన మరో ముప్పైఫ నలభై చరణాల సంభాషణ అయేసరికి అతడి ప్రేమని అంగీకరించివేస్తుంది. వాస్తవిక చరిత్రలో ఇది కొన్నిరోజులో నెలలో అయి ఉండవచ్చును. కాని ఇక్కడి అభిప్రాయం, మనస్తత్వ పరిశీలనం ఈ కుదింపుని మనకు స్ఫురింపజెయ్యనీయక దిగ్భ్రాంతితో ముంచివేస్తున్నాయి.

"Was ever woman in this humour woo'd?

Was ever woman in this humour won?" తో ప్రారంభించి

"Shine out, fair sun, till I have bought a glass,

That I may see my shadow as I pass."

అన్న చరణాలలోని భావనాశక్తి ఈ సన్నివేశం సహజమా కృత్రిమమా అన్నప్రశ్నను మనలో రానీయక దీనిని విశిష్ట సాహిత్యం చేస్తున్నది.

ఇంక కవిత్వం గురించి కొన్ని విశేషాలు చర్చించుదాం. శబ్దార్థయుగళముద్వారా భావము ప్రతిఫలించడము కవిత్వమని చెప్పాను. శబ్దార్థ యుగళ మనడం గమనార్హం. ఒక పద్యాన్ని చదవగా కలిగే మనస్సంచలనం తరచుగా ఆ పద్య తాత్పర్యాన్ని చదువుతే కలుగదు. అనగా కవిభావం అర్థంద్వారానేకాక శబ్దంద్వారాకూడా ప్రసరిస్తున్నదన్న మాట. అందుచేతనే కవిత్వాన్ని అనువదించడం కష్టం. ఒక కథనో, నాటకాన్నో, నవలనో అనువదించేవాడికి అనువాదకుడన్న కీర్తితప్ప స్వతంత్ర రచయిత అన్న కీర్తి రాదు. కాని కవిత్వాన్ని అనువదించేవాడు తానూ కవి కాక తప్పదు. భారత భాగవతాది కావ్యాల ననువదించినవారు గొప్పకవులుగా పరిగణింపబడుతున్నారు కదా!

కవిత్వంలో శబ్దార్థాలకిగల సంబంధం మూడు విధాలు. శబ్దం లప్రధానంగానూ అర్థమే ప్రధానంగానూ ఉండే దొకటి. ఈ తరహా కవిత్వంలో పద్యం చదివితే కలిగే అనుభూతి ఆ పద్య తాత్పర్యాన్ని చదివినా కలుగుతుంది. వేమన పద్యాలు ఇలాటివి. రెండవది అర్థం ప్రధానమే అయినా శబ్దం రమణీయంగా ఉండడంచేత తాత్పర్యం చదివినకన్నా పద్యం ఎక్కువ బాగుంటుంది. కాళిదాస కవిత ఈ తరగతికి చెందినది. మూడవ విధమైన కవిత్వంలో శబ్దార్థాలు కలిసిపోయి విడదీయడం అశక్యమవుతుంది. ఆ పద్యాన్ని అలాగ చదువుతేనేతప్ప ఆ అనుభూతి కలగదు. ఆ పద్యానికి తాత్పర్యం వ్రాసుకొని చదువుతే అది కవిత్వ మనిపించదు. శ్రీనాథుడు, పోతన ఇలాటి కవులు. ఉదాహరణకి ఈ పద్యం చూడండి—

'కలడందురు దీనుల యెడ
కలడందురు పరమయోగిగణముల పాలన్
కలడందు రెల్ల యెడలను
కలడు కలండనెడి వాడు కలడో లేడో.'

'కలడు కలండు' అన్నదగ్గర 'కలండు' అన్న శబ్దంలో కవి మానసికోద్విగ్నత ప్రస్ఫుట మవుతున్నది. శ్రీశ్రీగారి 'ఉన్మాది' అన్న ఖండకావ్యంలో

'నీవు చూసే వెకిలిచూపూ
నీవు తీసే కూనిరాగం
మాకు తెలియని నీ ప్రపంచపు
మహారణ్యపు చిక్కుదారులు!'

కూడా ఇట్టిదే. ఈ పద్ధతి కవిత్వం శబ్ద పరివర్తనాన్ని ఏమాత్రమూ సహించదు.

పై మూడూ కవిత్వంలో మూడు రకాలేగాని, వాటిలో ఎట్టి కవిత్వం గొప్పది, ఏది మధ్యమం, ఏది అధమం అన్నవ్యత్యాసానికి చోటులేదు. ఈ విభేదం స్వరూపానికి మాత్రమే సంబంధించినది.

మనోగత భావాన్ని ప్రకటించడానికి కొందరు అర్థాన్నీ, కొందరు అర్థంతోబాటు శబ్దాన్నీ కూడా ఆశ్రయిస్తారు. శబ్దం కవిత్వంలో ఎన్నో తమాషాలు చేస్తుంది. కవి ప్రాయికంగా భావానికి అనువైన శైలిని ఉపయోగిస్తాడు. శబ్దబలంచేత పరస్పర సంబంధంలేని వస్తువులలో కవి సంబంధం కల్పిస్తాడు. ఈ పద్యం చూడండి—

''చదువులందు రాజ్యపదవులందును పాడి
మొదవులందు స్త్రీల పెదవులందు
ఆశ లుడిగినట్టి అయ్యలు ముక్తులు
విశ్వదాభిరామ వినురవేమ.''

శబ్దసాదృశ్యంచేత ఆ వస్తువులన్నీ ఒక్కతీరువే అని స్ఫురిస్తుంది. ఇలాగే వసుచరిత్రలో—

'తరుణార్క కబళనోద్ధతి జూపె నెవ్వాడు
రుచులచే ఫలమోహరుచులచేత
అకలంక రామముద్రిక బూనె నెవ్వాడు
శయముచే హృత్కుశేశయముచేత......'

అనడంలో రుచులు, ఫలమోహరుచులు; శయము, హృత్కుశేశయము విభిన్నములైనా ఒక్కలాంటివే అన్న భావం కల్పించబడుతున్నది.

శబ్దానికి ఇంత శక్తి ఉండడంచేతనే భారతీయ సాహిత్యవేత్తలు కవిత్వంలో శబ్దానికి అత్యంతప్రాధాన్యం ఇచ్చారు. 'రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యమ్' అని జగన్నాథుడు శబ్దమే కవిత్వమని, అర్థము దానికి ఉపస్కారకమాత్రమని నిర్వచించాడు. కాని కవిత్వంలో శబ్దం ఎంత ప్రవృత్తిని కలిగిఉన్నా చివరకు మన దృష్టి భావంమీదనే లగ్నం కావడంచేతనూ, 'కాళిదాసు ఇలా అన్నాడు, 'వాల్మీకి ఇలా అన్నాడు.' ఈ విధంగా తప్ప 'ఎలా అన్నాడు' అని ఎవరూ ప్రశ్నించకపోవడం చేతనూ, కవిత్వానికి అర్థమే ప్రధానము, శబ్దము తదుపస్కారకము అని నిర్ణయించవచ్చును.

లోకంలో విలువగల అన్నివస్తువులకూ నకిలీ సరుకులు తయారయేటట్లు కవిత్వానికికూడా కవిత్వ మన్న భ్రాంతి [illegible] ఉంటాయి. [illegible] '[illegible]' అన్నాడు. [illegible] విశేషప్రకారానికి [illegible] వ్యాఖ్యానక వైపు [illegible] అపేక్ష [illegible] [illegible]. అందు [illegible] స్వర్గరహితమై [illegible] లక్ష్మిచిత్రం— అని [illegible] [illegible].

[illegible] పద్మరాజుగారు '[illegible]— వైచిత్రి' అన్న వ్యాసంలో 'వైచిత్రి' అన్న [illegible] ప్రవేశపెట్టి దానికి [illegible] చర్చించారు. 'ఒక పద్యం [illegible] ఒకచోట మనం చటుక్కున [illegible]. [illegible] ఏదో మనని ఆకర్షిస్తుంది. ఒక కిటికీ తెరుచుకున్నట్టు అందులోనుంచి చూస్తే చాలా దూరం వరకూ ఆవరించుకొన్న ఒక దృశ్యం కంటికి ఆనుతున్న భ్రమ కలుగుతుంది.....ఇంతవరకూ చెప్పని దేదో చటుక్కుని చెప్పేశాడు కవి అనిపిస్తుంది. తరువాత ఇంక మనం ఊహించుకుంటాం...... ఈ గుణాన్నే నేను వైచిత్రి అంటాను' అన్నారు. ఇక్కడ పద్మరాజుగారి వైచిత్రి ఆనందవర్ధనుడి ధ్వనికి సమానార్థకంగా కనిపిస్తుంది. ఆ మాట వారే చెప్పారు. 'రసం', 'అద్వైతం', 'సత్త', 'ధ్వని' ఈ మాటలు నాకు నిడివిపోయిన యుగాల మాటలుగా అనుపిస్తాయి.' కనుక వైచిత్రి అన్న మాట ఉపయోగించానని వ్రాశారు. 'వైచిత్రి పద్యంయొక్క వ్యక్తిత్వానికి బాహ్యంగా ఉండే చిహ్నం. ఎంత నిరాడంబరంగా ఉన్నా, చమత్కారం ఏమీ లేకపోయినా ప్రాణంఉన్న మనిషిలో ఏదో ఒక ఆకర్షణ ఎలా ఉంటుందో పద్యానికి కూడా వైచిత్రి అల్లాగే ఉంటుంది. ఈ పోలిక ఇంకా కొంతదూరం తీసుకుపోవచ్చును. బాహ్యంగా వైచిత్రి ఎక్కువగాఉంటే ఎక్కువ సులువుగా ఆకర్షిస్తుంది పద్యం— చమత్కారమయిన వ్యక్తి లాగే. నిరాడంబరంగా ఉన్న పద్యం సజీవమైనదయినా తొందరగా ప్రజాదృష్టిని ఆకర్షించలేదు. చివరకి శాశ్వతమయిన నిర్ణయం కాలం ఒక్కటే చెయ్యగలుగుతుంది. పద్యంతో చనువు ఏర్పడినకొద్దీ బాహ్యరూపం హరించిపోయి లోపలిజీవంలో సఖ్యం ఏర్పడుతుంది.

కాని పద్యం అసలు బతకాలంటే వైచిత్రి అందులో ఉండితీరాలి.' అని కవిత్వానికీ వైచిత్రికీ అవినాభావ సంబంధం ఉందన్నారు. 'పద్యంలో వైచిత్రి మనమీద పనిచెయ్యడానికి మనం చోటు ఇవ్వాలి' అని వైచిత్రిని కనిపెట్టడంద్వారా పద్యభావగ్రహణం సాధ్యమవుతుందని వ్రాశారు.

కాని పద్మరాజుగారి 'వైచిత్రి' కూడా ఆనందవర్ధనుడి 'ధ్వని'వలె కవిత్వాన్ని పరిచ్ఛిన్నం చెయ్యజాలదు. Shakespeare మోహాన్ని వస్తువుగా తీసుకొని వ్రాసిన—

'The expense of spirit in a waste of shame

Is lust in action;..........

........................

All this the world well knows; yet none knows well

To shun the heaven that leads men to this hell"

అన్న Sonnet లో చివరి రెండుపాదాలలోనూ వైచిత్రి ఉందని వ్రాశారు. కాని వైచిత్రికన్నా, పద్యభావసారం అక్కడ ఉండడంచేతనే ఆ రెండు చరణాలు మనని విశేషంగా ఆకర్షిస్తున్నాయి. శాకుంతలంలోని ఈ పద్యం చూడండి.

"అధరః కిసలయ రాగః
కోమలవిటపానుకారిణౌ బాహూ
కుసుమ మివ లోభనీయం
యౌవన మంగేషు సన్నద్ధమ్."

(ఆమె అధరము కిసలయమువలె రాగము కలిగి ఉన్నది. బాహువులు కోమలశాఖల ననుకరించుచున్నవి. ఆమెసర్వాంగములందునూ కుసుమమువలె లోభనీయమై యౌవనము సన్నద్ధమై ఉన్నది.)

ఇందాకటి sonnet లో మొదటి చరణాలలో పెద్దవిశేషం లేనట్లే ఈ పద్యంలోనూ మొదటి రెండు చరణాలలో విశేషం లేదు. ఏ చిన్న కవి అయినా అలాగ వ్రాయగలడు. కాని sonnet చివరి చరణాల్లో Shakespeare, పద్యం ఆఖరి చరణాల్లో కాళిదాసు రప్పున వెలుగుతున్నారు. కాని "Well knows; yet none knows well"లో కల ఆకర్షణీయమైన మాటల తికమక కాళిదాసు పద్యంలో ఎక్కడా లేదు. ఇందులో వైచిత్రి లేదు. కవిత్వమే ఉంది. కాళహస్తిమాహాత్మ్యంలోని ఈ పద్యాన్నిగమనించండి—

"ప్రాతఃకాల తుషార శీకరచయ
ప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారము లౌచుజెల్వెసగు
దద్బిందుచ్ఛటాజాత వి
ద్యోతచ్ఛాయల గొంతసేపు బహు
రత్నోదీర్ణగేహంబులై
లూతా కల్పిత తంతు సద్మములు
వొల్చుం జాలజిత్రంబులై"

దీనిలో ప్రత్యేకంగా మన దృష్టిని ఆహరించగల వైచిత్రి ఎక్కడా లేదు. అయితే, మనోజ్ఞపదాలకూర్పే దీనిలో వైచిత్రి అనుకుందాం. ఇప్పుడు శైలిలో సౌకుమార్యంలేని 'ఆముక్త మాల్యద'లోని ఈ పద్యాన్ని చూడండి—

"ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై
పాటిల్లె గుంభోంభితో
దద్ఘాతాంబు ధ్వనివాద్యమై మరుదధః
పుంజీభవత్ పాటల
వ్రాతామ్రేడిత సిక్త భూ సురభితా
రామాంబు కుల్యా బహు
స్రోతస్సంధుల సంధుయంత్ర నతిక్రు
త్ప్రోద్గీత గేయౌఘముల్."

ఈ పద్యంలో సౌకుమార్యం, ప్రసాదగుణం లేవు. ఇతరమైన వైచిత్రి ఏదీ కన్పించడం లేదు. కాని ఒక విస్తృత ప్రకృతి దృశ్యాన్ని చిత్రం లిఖించినంత స్పష్టంగా వర్ణించిన ఈ పద్యం కవిత్వంకాదని ఎవరనగలరు?

కనుక కవిత్వానికీ వైచిత్రికీ అవినాభావ సంబంధంలేదు. పద్మరాజుగారు తమ వ్యాసంలో ఇంకొకచోట చెప్పినట్లు 'పద్యాన్ని మనకి పరిచయం చేసేదీ, చనువు చేసేదీ ఈ వైచిత్రి' అన్న వాక్యమే వైచిత్రికి సరైన నిర్వచనం. వైచిత్రి ఉన్న పద్యం మనని తేలికగా ఆకర్షిస్తుంది. వైచిత్రిలేని పద్యాలలోని కవిత్వం మంచిరసజ్ఞుడుతప్ప ఇతరుడు కనిపెట్ట

జాలదు. ఇట్టి కవిత్వాలు బహుళ ప్రచారం పొంద జాలక మరుగునపడిపోయే అవకాశం ఉంది. అదృష్టం చేత అట్లా నశించకుండా నిలిస్తే కాలక్రమాన వాటి విలువ నిర్ణయింపబడుతుంది.

కనుక 'వైచిత్రి'ని ధ్వనికారుడి 'చిత్రం'లో సమానంగా పరిగణించవచ్చును. పద్యంలో వైచిత్రి శబ్దగతం, అర్థగతం, ఉభయగతంగా ఉంటుంది. 'మహాప్రస్థానం'లో 'జగన్నాథుని రథచక్రాలు' అన్న ఖండికలో—

'ఘటక్, ఘటక్...
హింసనచణ
ధ్వంసరచన!
ధ్వంసనచణ
హింసరచన!'

అనడంలో వైచిత్రి శబ్దనిష్ఠమై ఉన్నది. కృష్ణశాస్త్రిగారి ఈ క్రింది పద్యంలో వైచిత్రి అర్థ నిష్ఠంగా ఉంది—

'నునుమబ్బు లేదుస్క కొనలపై సోనలా
నెలవంక చిరునవ్వు చలువపాట,
తొలి ప్రొద్దు పొడుపు రేకుల పైడిదారుల
ఏరులో మంచు కన్నీరుపాట,
పావురా యుయ్యాల పక్షాల యంచుల
జాలులా గాలి నీలాలపాట,
విరజాజికన్నె నిద్దురకన్నులెప్పల
కాల్వలో నెత్తావి కలలపాట,
కలసి, నీ గొంతు త్రోవల సెలలు గట్టి,
అలల నుప్పొంగి, నా హృదయాంచలముల
బారి, దాహాన బీటలు వారి యెండు
ఈ బ్రతుకునిండ నిండిపోయినవి, చెలియ!'

శ్రీశ్రీగారి ఈ క్రింది పద్యంలో వైచిత్రి శబ్దార్థోభయనిష్ఠమై ఉంది—

'కాకి కేమి తెలుసు సైకోఅనాలిసిస్
ఆట వెలది ద్విపద కత్తగారు
5, 3, 2 ఆముక్తమాల్యద
విశ్వదాభిరామ వినురవేమ.'

అర్థాలంకారాలు అర్థవైచిత్రి, శబ్దాలంకారాలు శబ్దవైచిత్రి. [illegible] ఈ వైచిత్రి [illegible] సంబంధమై ఉంటుంది. [illegible] వైచిత్రిగానే [illegible] పోతుంది.

ఏది కవిత్వం? ఏది వైచిత్రి? అని నిర్ణ యించడం సులభ సాధ్యం కాదు. [illegible] వరకు ఈ పని [illegible] ఉదాహరణలుగా కొన్ని [illegible] గొప్పతనంలో కలిగిన [illegible] వాటి విలువ నిర్ణయిస్తున్నాయి. [illegible] వైచిత్రులు కవిత్వంలో కలిసిపోయి [illegible] ఉండి పృథక్కరించడానికి వీలు కాకుండా ఉంటాయి. అప్పుడది కవిత్వమా కాదా అనడానికి వారి అభిరుచే వారికి ప్రమాణం. ఒకరి దృష్టిలో గొప్పకవిత్వం ఇంకొకరి దృష్టిలో సాధారణ కవిత్వం కావడం, ఇంకొకరి దృష్టిలో కవిత్వం కాకపోవడం అభిరుచి లోని అంతరం వల్లనే ఏర్పడుతున్నది. శిశుపాలవధ కావ్యంలోని ఈ పద్యాన్ని పరిశీలించుదాం—

"త్రాసాకులః పరిపతన్ పరితో నికేతాన్
పుంభిర్నకైశ్చిదపి ధన్విభి రన్వబంధి
తస్థౌ తథాపి నమృగః క్వచి దంగనానా
మాకర్ణపూర్ణ నయనేషు హతేక్షణశ్రీః॥

(నివేశనముల చుట్టు త్రాసాకులమై పర్విడు చున్న హరిణము ధనుర్ధరులగు పురుషులెవ్వరిచే తరుమ బడకున్నను, అంగనల ఆకర్ణాంత నయన బాణములచే హతేక్షణశ్రీ అగుటచే నెచ్చటను నిల్వజాలకపోయెను). దీనిని చదివి కొందరు ఇందలి కల్పనను, లాక్షణిక మైన భాషను, అలంకారమును మెచ్చుకొనవచ్చును. వారి దృష్టిలో ఇది గొప్ప కవిత్వం. కొందరి కిది బొత్తిగా కృతకంగా చప్పగా తోచవచ్చును. వారి దృష్టిలో ఇది వైచిత్రి. కవిత్వం కాదు. కవిత్వానికి విలువకట్టడం పఠితల అభిరుచిని, మనఃపరిపాకమును బట్టి ఉంటాయి. ఇట్లా వ్యక్తికీ వ్యక్తికీ సాహిత్యాభి రుచిలో ఇంత తేడా ఉన్నా మొత్తంమీద, బహుకాలం గడవగా అనేకులు ఏకగ్రీవంగా కవిత్వానికి విలువలు కట్టగలుగుతున్నారు. పుష్పం అందరికీ రమ్యమే, రాక్షసిబొగ్గు అసహ్యకరమే. మానవ హృదయాలలో

ఇంత సాదృశ్యం ఉండడంవల్లనే కవిత్వం గురించి కూడా విమర్శకులు ఒక అభిప్రాయానికి రాగలుగుతున్నారు.

వైచిత్రి కవిత్వంగా పరిణతం కావడానికి ఉపయుక్తమైనట్టుగాని ఈ పద్యాన్ని ఉదాహరించవచ్చును.

“పాటలగంధి మాటల ప్రోడ చెలియు
  మోహభయం బెడఁగ దానంతయైన
సత్యంబు మిళిభాష సతికర్ణనుం డయ్యె
  బరుల గేరడమున భంగపరుచు
ప్రియ దా ద్రావుసప్తకి నాథుడయ్యును
  పద్మాక్షిచే ననంజనత మెఱుగు
మహిమ మహిమ దా మధురాస్వదుండయ్యె
  లావణ్యకలన నుల్లాసమొందు......!

‘లహళియుం బెడఁగదు’, ‘పరుల గేరడమున భంగపరుచు’, ‘లావణ్యకలన’, ‘అనంజనత’ అన్నచోట్ల గల వైచిత్రి కవిత్వంలో ఐక్యాప్తి పొందుతున్నది. కంకంటి పాపరాజు రచించిన ఉత్తర రామాయణంలోని ఈ పద్యంలో వైచిత్రి కవిత్వంగా పరిణమించక విఫలం మవుతున్నది—

‘కీలాలంబని సీరుఁగ్రోలు రహి
  గ్రుక్కించెం బలాశంబు లం
చాలోకించుట మానె బర్ణముల
  మధ్వాఖ్యం బ్రవర్తింపగా
జాలించెన్ విరితేనె చాయ దొరయం
  జన్నన్ రవిద్రోహ దు
శ్శీలంబౌనని రాక్షసత్రయి
  విసర్జించెం దరుచ్ఛాయయున్.

‘కీలాలమని సీరు త్రాగకపోవడం, పలాశములని పర్ణములని విడిచిపెట్టడం, మధ్వాఖ్య ఉందని విరితేనె చాలించడం ‘పృష్టతాడనాద్దంతభంగః’ అన్నట్లు ఉంది. ‘చాయ దొరయంజన్నన్ రవిద్రోహ దుశ్శీలంబౌనని రాక్షసత్రయి విసర్జించెం దరుచ్ఛాయయున్’ అనడంమాత్రం సూటిగా చక్కగా ఉంది. మొదటి మూడు పాదాల్లో వైచిత్రి ఉంది, కవిత్వంలేదు; చివరి పాదంలో వెచిత్రిలేదు, కవిత్వం ఉంది.

కథకి సంఘటన ఎలాటిదో కవిత్వానికి వైచిత్రి అలాటిది. కవిత్వమూ వైచిత్రీ అతిసన్నిహితమయినవైనా అవినాభావ సంబంధం లేదు. సంఘటనలు లేని మంచి కథయున్నట్లే వైచిత్రిలేని మంచి కవిత్వం ఉన్నది.

ఇప్పుడు కావ్యదోషాలను చర్చించుదాం. కావ్యాలంకార సంగ్రహంలో అనేక కావ్యదోషములు వివరించబడినాయి. “అప్రయుక్తము” అన్నది అందులో పేర్కొనబడిన ఒక దోషం.

“కవులు ప్రయోగించని పద
మవనిం దగ నప్రయుక్తమగు నెట్లన్నన్
ద్రవి కైలబిలుం డలదు
శ్చ్యవన మహాభోగి ఖేట సంస్తుతు డనగన్.”

ఇందలి బిలబిల, దుశ్చ్యవన, ఖేటశబ్దములు అప్రయుక్తములు. ఇటువంటి పదములు ఝటిత్యర్థబోధమునకు ప్రతిబంధకములు కనుక దోషమునిఅతడి అభిప్రాయం. కాని భాష సముద్రంవంటిది. పూర్వకవు లేకారణంచేతనో కొన్ని పదాలను ప్రయోగించలేదని ఏ కవులూ ఇంక వాటిని ప్రయోగించరాదనడం యుక్తంకాదు. ప్రాయికంగా కవులు ఆయా కాలాల్లో ప్రజలకు సుపరిచితములైన పదాలనే ప్రయోగిస్తారు. కాని భాష కాల్రకమాన మారుతూ ఉంటుంది. ప్రాత మాటలు వ్యవహారచ్యుతములై క్రొత్తమాటలు వస్తూఉంటాయి. తిక్కన, శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు ప్రయోగించిన తెలుగు మాటలెన్నో ఇప్పుడు మనకి అర్థంకావు. వారు వ్రాసిన కాలంలో ఆ పదాలు పాఠకులకు సన్నిహితములయే ఉంటాయి. కాని ఇప్పుడవి వ్యవహారగళితములైపోయి వాటి అర్థం తెలుసుకొందుకి నిఘంటువే శరణ్యమవుతున్నది.

ఈ సందర్భంలో కొందరు ఆధునిక కవులు ప్రకటించే అభిప్రాయ మొకటి విచారించదగినది. మన కవిత్వం ప్రజలకు సుగ్రహంకాని భాషలో ఉండి వారికి అర్థం కావడంలేదని, కనుక ఆ సాహిత్యమంతా నిష్ప్రయోజనమైనదని, తాము సులభశైలిలో నేడు వ్రాస్తున్న సాహిత్యమే ప్రజలకు అర్థమై సాహిత్య ప్రయోజనాన్ని నెరవేరుస్తున్నదనీ వీరి వాదము. వీరి దృష్టిలో ‘తుమ్మెద’, ‘నెత్తురు’, ‘రక్తం’, ‘చెమట’ మొదలైన పదాలు తప్ప ‘మిళిందము’, ‘రుధిరము’, ‘స్వేదము’ మొదలైన పదములు

సాహిత్యంలో ఉండరాదు. రామరాజభూషణుని దృష్టిలో 'దుర్వ్యసన' మొదలైన కొన్ని మాత్రమే నిఘంటువుస్థ కష్టబోధ్య పదములయితే, ఆధునిక కవుల దృష్టిలో మనం నిత్యజీవితంలో వ్యవహరించే ఏ వందో రెండు వందలో మాటలు మినహాయించగా తక్కిన భాష యావత్తూ దుర్గ్రహమైనదే! సుకవిత్వలక్షణం ఇదే అయితే భాష తొందరగా క్షయించిపోతుంది. కనుక 'అప్రయుక్తము' కావ్యదోషం కాదు.

వ్రీడను, జుగుప్సను, అమంగళశంకను కలిగించే పదముల సముదాయం 'అశ్లీలము' లనే దోషంగా ఉదాహృతమైంది.

'వసుదేవయోని గోపీ
విసర మహాపీనకుచ నవీనాశ్లేషా
ల్లసితుండన గాలిందీ
రస విహరణ కరణ నిత్య రసికుండనగన్.

ఇచట 'యోని', 'మహాపీన', 'కాలింది' అను పదములు క్రమంగా వ్రీడా జుగుప్సా అమంగళశంకా కరములు. కాని కవు లెవరూ ఈ దోషాన్ని కఠినంగా పాటించలేదు. ఈ క్రింది కవిప్రయోగములు పరిశీలనార్హములు.

'అంతలు సేసి పో నడచి యక్కట సంజయు చేత......యీ కంత కృపావిహీనమతి (తిక్కన.)

'నా కొడుకు బ్రదికించు పుణ్యప్రచారు....' (తిరుపతి వేంకట కవులు.)

'ఉదయగ్రావము పానవట్టము' (ధూర్జటి)
'ప్రాసాదా స్సావం తులయితుమలం' (కాళిదాసు)

పై అశ్లీలములు శబ్దగతములు. అశ్లీలం అర్థగతం కూడా కావచ్చును. పఠిత అభిరుచినిబట్టి వాటిని పరిహరించడమో స్వీకరించడమో జరుగుతుంది. ఈ క్రింది పద్యాలలో అశ్లీలానికి అత్యంత సమీపంలో రమ్యభావా లెట్లా ప్రకటితమయాయో చూడండి—

'తస్యాః కించిత్ కరధృత
మివ ప్రాప్త వానీర శాఖం
హృత్వానీలం సలిలవసనం
ముక్తరోధో నితంబం
ప్రస్థానం తే కథమపి సఖే!
లంబమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం
కో విహాతుం సమర్థః' (మేఘసందేశం)

(ప్రక్కలు చెయ్యికొమ్మ [illegible] వ్రేలాడుచుండగా ముక్తరోధో నితంబమును [illegible] ఆ నదిచేత బట్టుకొన్నట్లుండును. [illegible] మానుటకు ఏ ప్రయాణ [illegible] కష్టముగా కాగలదు. [illegible] చేయబడిన [illegible]) 'వివృతజఘనాం' అనడం అశ్లీలమే కాని సౌందర్యాత్మకమై పోయింది. శాకుంతలంలో ఈ పద్యం చూడండి—

'స్నిగ్ధం వీక్షిత మన్యతోఽపి నయనే
య ప్రేరయంత్యా తయా
యాతం యచ్చ నితంబయో ర్గురుతయా
మందం విలాసాదివ.....'

(అన్యతః ప్రేరితమైననూ ఆమె చూపులు స్నిగ్ధముగా నున్నవి. నితంబముల గురుత్వముచేత మందమైన ఆమె గమనము విలాసముచేతనె నున్నది.....')

ఇక్కడ 'నితంబయోః' అన్న ద్వివచనప్రయోగం వ్రీడను కలిగిస్తున్నా రమణీయంగా ఉంది.

ఇంద్రియాలను తేటతెల్లం చేస్తూ Shakespeare వ్రాసిన ఈ వాక్యాలు Antony and cleopatra నాటకంలోనివి—

"Royal wench!
She made great Caesar lay his swcrd to bed:
He plough'd her, and she cropp'd."

అంటే అశ్లీలపదాలను సాహిత్యంలో విశృంఖలంగా ఉపయోగించవచ్చునని కాదు. ఉపయోగించే కవికి అందుకు తగిన సామర్థ్యం ఉండాలని చూపడానికే ఇన్ని ఉదాహృతు లియ్యబడినాయి.

శాస్త్రాలలో మాత్రమే ప్రసిద్ధమై లోకవ్యవహారంలో కనిపించని శబ్దప్రయోగం 'అప్రతీతిక'మనే దోషంగా చెప్పబడినది. కాని, వేలూరి శివరామశాస్త్రి గారి 'అగ్ని' అన్న ఖండకావ్యంలోని ఈ పద్యచరణం పరిశీలించండి—

ఈ పద్యంలోని—ష్య, డా, ప్ర, ఘం, ష, ర్దై — మున్నగు అక్షరములు శృంగార రసప్రతికూలములని ఆలంకారిక నియమము.

రసము వాచ్యం చెయ్యడం దోషమని కావ్యా లంకార సంగ్రహకర్త.

'రసములు వాచ్యము లైనను
వెసనదియును దోషమయ్యె, విపులోగ్రరణం
బసదృశ భీభత్స రసో
ల్లసితము, శృంగార సహిత లలన యనంగన్.'

కాని రసములు వాచ్యములైన మహాకవి ప్రయోగాలు ఉన్నవి, ఇందాకటి పద్యాలలో "భీము డతిభయం కరాకారత నతిశయిల్లె", 'క్రోధపరీతచేతః' అనడం రసవాచ్యతే. కాని ధ్వన్యాలోకకారుడు లెస్సగా నియాపితమైన రసము వాచ్యం చెయ్యడం దోషంకాదనే చెప్పాడు. శృంగార కరుణములకు అల్పసమాసరచన, వీరరౌద్రములకు దీర్ఘసమాస రచన తరచుగా ఉంటుం దని, శృంగారములో దీర్ఘసమాసరచన, వీరరౌద్రము లలో అల్పసమాస రచనకల మహాకవి ప్రయోగాలు, శృంగార కరుణములలో అప్రయత్న పూర్వకంగా వచ్చిన యమకా ద్యలంకారాలుకల రచనలూకూడా ఉన్న వని ధ్వన్యాలోకములో చెప్పబడియే ఉన్నది.

కనుక ఇవేవీ కావ్యదోషాలు కావు. కవి చెప్ప బూనిన భావం పాఠకుడి మనస్సుకు లగ్నంకాకుండా ప్రతిరోధం కల్గించేవిమాత్రమే కావ్యదోషాలు.

పద్యంలోని కొన్నిపదాలు అర్థపోషణకు తోడ్ప డక పోవడంవలన భావనిరోధం ఏర్పడుతుంది. 'అలిన్' 'ఒయ్యన్', 'తు' 'చ' మున్నగునవి. ఆలంకారికులు దీనిని నిరర్థకమను దోషంగా చెప్పారు. ఛందస్సు నను రోధించి ఇవి ఉండక తప్పవు. కాని ఒక్కొక్కప్పుడు ఇట్టివ్యర్థపదాలు కూర్పును సడల్చడం మాత్రమేకాక మొత్తం భావాన్ని అయోమయం చేస్తాయి. అప్పుడది ప్రబంధదోషమవుతుంది. వేదుల సత్యనారాయణశాస్త్రి గారి 'కాంక్ష' అన్న ఖండకావ్యంలోనుంచి ఒక పద్యం ఇక్కడ ఉదాహరిస్తాను.

"నాకు దలంపు లేదు
లలనా జనతా కబరీ భరైక
భూషకలనన్,
సతీమృదుభుజాంతరతల్ప
కుచోప గూహబిబ్బోకమునన్
వధూసితకపోలగళచ్ఛ్రవణావతంస
హేవాకమునన్
విలాసినుల పాపట చెందిర కావిపూతలన్."

ఈ పద్యంలోని 'బిబ్బోకము', 'హేవాకము' అనే పదాలేమీ అర్థపుష్టిని కల్గించడం లేదు సరికదా తక్కిన పదాల అర్థాలని కూడా కప్పివేసి పద్యాన్ని పులగం చేస్తున్నాయి.

పద్యంలోని ఒకటిగాని, కొన్నిగాని పదాలు ఆ ప్రకరణంలో ఉచితాలు కాకపోవడం దోషం. పాండు రంగ మాహాత్మ్యంలోని పద్యం చూడండి—

'ప్రారంభించిన వేదపాఠములకుం
బ్రత్యూహమౌనంచునో
యేరా తమ్ముడ! నన్ను జూడ జనుదే
వెన్నాళ్లనో యుండి
చక్షూరాజీవయుగమ్ము వాచె
నిను గన్గోకున్కి.......'

బహుసంతానవతియై వార్ధక్యాన్ని సమీపించిన నిగమశర్మ అక్క స్వంతకళ్లని 'చక్షూరాజీవ యుగమ్మ' అనడంలో ఔచిత్యంలేదు. అయితే ఈ అనౌచిత్యం పద్యభావాన్ని విఫలం చెయ్యకపోవడం కొంత నయం. ఈ పద్యం చూడండి—

'ఆకాశంబుననుండి శంభునిశిరం
బందుండి శీతాద్రి
సుశ్లోకంబైన హిమాద్రినుండి భువి
భూలోకంబునందుండి
యస్తోకాంభోధి
పయోధినుండి పవనాంధోలోకముంజేరె
గంగాకూలంకష
పెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్.'

ఇది భర్తృహరి సుభాషితానికి ఏనుగు లక్ష్మణ కవి అనువాదం. గంగానది ఆకాశంనుండి శివుని శిరస్సు, అందుండి హిమవత్పర్వతం, మంచికీర్తిగల హిమాద్రినుండి భువి, భూమినుండి అస్తోకమైన సముద్రం—ఈ విధంగా అర్థం చెప్పుకొంటూపోగా

గంగానది ఒక ఉత్కృష్ట ప్రదేశంనుడి వేరొక ఉత్కృష్ట ప్రదేశాన్ని చేరుతున్నట్లుగా స్ఫురిస్తున్నదే తప్ప 'వివేక భ్రష్ట సంపాతముల్' స్ఫురించడం లేదు. ఈ పద్యభావం మూలశ్లోకాన్ని చదివితేగాని తెలియదు.

'శిరశ్శార్వం స్వర్గాత్
పశుపతి శిరస్తః క్షితిధరం
మహీధ్రా దుత్తుంగా దవని
మవనే శ్చాపి జలధిమ్
అధో గంగా సేయం
పద ముపగ తాస్తోక మథవా
వివేకభ్రష్టానాం
భవతి వినిపాత శ్శతముఖః'

ఈ పద్యంలో ప్రతిపాదంలో ముందు కొన్ని దీర్ఘాక్షరాలూ వాటి వెంటనే గబగబా కొన్ని హ్రస్వాక్షరాలూ—ఈ కూర్పు శబ్దార్థాలకు తాదాత్మ్య సంబంధాన్ని ఏర్పరుస్తున్నది. మూడో చరణంలో 'అధోగంగా' అన్న ఎత్తుబడి, 'సేయం' అనిసూచిస్తూ 'పద ముపగతాస్తోకమ్' అని గంగ హీనపరిస్థితిని చూపడం—ఇదంతా ప్రతిపదం, ప్రత్యక్షరం భావాన్ని నొక్కి వక్కాణిస్తున్నది. కనుకనే చివరన 'అథవా' అన్నవిరుపుతో మళ్లించి చెప్పిన 'వివేక భ్రష్టానాం భవతి వినిపాతః శతముఖః' అన్నవాక్యం మన మనస్సుకి హత్తుకోగలుగుతున్నది. తెనుగుపద్యంలో 'సుశ్లోక' 'అసోత్తక' అంటూ ప్రాసస్థానాలలో నిల్చిన పదాలు ఔచిత్య రహితములై పద్యమంతటినీ ధ్వంసం చేశాయి.

కవి భావప్రకటనలో ఆలస్యం చెయ్యడం దోషం. దానివలన పాఠకుల భావగ్రహణంలో విలంబం ఏర్పడుతుంది. 'మహాప్రస్థానం'లోని 'భిక్షు వర్షీయసి' అన్న ఖండకావ్యాన్ని పరిశీలించుదాం.

''దారిప్రక్క, చెట్టుక్రింద
ఆరినకుంపటి విధాన
కూర్చున్నది ముసిల్దొకతి
మూలుగుతూ, ముసురుతున్న
ఈగలతో వేగలేక.

ముగ్గుబుట్టవంటి తలా,
ముడుతలు తేరిన దేహం,
కాంతిలేని గాజుకళ్లు,
తనకన్నా శవం నయం.

పడిపోయెను జబ్బుచేసి,
అడుక్కునే శక్తిలేదు,
రానున్నది చలికాలం,
దిక్కులేని దీనురాలు.

ఏళ్లు ముదిరి, కీళ్లు కదిలి,
బతుకంటే కోర్కె సడలి—
పక్కనున్న బండరాతి
పగిదిగనే పడి ఉన్నది.

'ఆ అవ్వే మరణిస్తే
ఆ పాపం ఎవ్వరి'దని
వెర్రిగాలి ప్రశ్నిస్తూ
వెళిపోయింది

ఎముకముక్క కొరుక్కుంటు
ఏమీ అనలేదు కుక్క,
ఒక ఈగను పడవేసుకు
తొందరగా తొంగె తొండ.

క్రమ్మె చిమ్మచీకట్లు,
దుమ్మురేగె నంతలోన,
'ఇది నా పాపం కా'దనె
ఎగిరివచ్చి ఎంగిలాకు.''

దీనిలో ఐదవ పద్యంలోని ప్రశ్నకు ఏడవ పద్యంలో సమాధానం ఉంది. 'వెర్రిగాలి' జనవాక్యానికి, 'ఎంగిలాకు' ధనికస్వాముల అధీనమై ఉన్న జగత్తుకూ చిహ్నములు. కాని నడిమి పద్యంలో కుక్క, తొండా వేటికి చిహ్నాలు? ఎముకముక్క కొరుక్కోనడం, ఈగలను తినడం కుక్కకూ, తొండకూ నైజ గుణాలు. వాటికి మానవ సమాజంలోని పేద, గొప్ప విభేదాలతో నిమిత్తం లేదు. మానవసంఘాన్ని వ్యంగ్యంగా వర్ణించే ఖండకావ్యమధ్యంలో జంతువుల నిసర్గ స్వభావవర్ణనం భావప్రకటనలో విలంబాన్ని కల్గిస్తున్నది. ఆ ముసల్ది ఆ పరిస్థితిలో ఉండగా తక్కిన ప్రపంచంలో జనులందరూ తమ తమ పనులలో మునిగి ఉన్నారు—అని ఇక్కడ కవి చెప్పదలచినది. కాని ఆ భావ వ్యక్తీకరణకు మనుష్యుల స్వార్థపరత్వంతో నిమిత్తంలేని కుక్క, తొండ సరిఅయిన

అన్న పద్యంలో, 'ఎ్రరబావుటా' అన్నమాట చదివేసరికి కొంతమందికి అరికాలిమంట నెత్తికెక్కిపోవచ్చును, కొంతమందికి సంతోషం వెల్లుబక వచ్చును. ఈ ప్రభావానికి అతీతుడై పఠిత కవి భావాన్ని గ్రహించగలిగి ఉండాలి. అట్టి పాఠకుడే రసజ్ఞుడు.

'శశినా సహ యాతి కౌముదీ
సహ మేఘేన తటిత్ ప్రలీయతే
ప్రమదాః పతివర్త్మగా ఇతి
ప్రతిపన్నం హి విచేతనైరపి.'

(శశితోపాటే చంద్రికపోవును. మేఘంతోనే మెరుపు నశిస్తుంది. ప్రమదలు పతిమార్గానుసారిణులని విచేతనులచేగూడ జ్ఞాతమైయున్నది) అన్న పద్య భావ గ్రహణంకి సహగమనం గురించిన సాంఘికాభిప్రాయాలు అడ్డు తగలకూడదు.

సాహిత్యం ఒక విలక్షణసృష్టి. దీనికి జనకుడు ప్రపంచం. జనయిత్రి సాహిత్యస్రష్ట. బిడ్డకు తల్లిదండ్రులు ఇద్దరి పోలికలూ ఉన్నట్లే సాహిత్యం ప్రపంచాన్ని, సాహిత్యకర్తనీ పోలిఉంటుంది. ఆనందవర్ధను డిట్లా వ్రాశాడు –

"అపారే కావ్య సంసారే
కవి రేకః ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం
తథేదం పరివర్తతే.
శృంగారీ చే త్కవిః కావ్యే
జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగ శ్చేత్
నీరసం జాత మేవ తత్.
భావా నచేతనా నపి చేతన వ
చ్చేతనా నచేతనవత్
వ్యవహారయతి యథేష్టం
సుకవిః కావ్యే స్వతంత్రతయా."

(అపారమగు కావ్యప్రపంచమునకు కవియే బ్రహ్మ. అతడు తన ఇచ్ఛానుసారముగా లోకమును మార్చును. అతడు శృంగారి అయినచో లోకమును శృంగార రసమయ మొనర్చును. విరాగి అయినచో నీరస మొనర్చును. అచేతన వస్తువులను చేతనములుగనూ, చేతనముల నచేతనములుగనూ కవి స్వతంత్రతతో కావ్యమందు వ్యవహరింపజేయును.)



# జ్ఞానస్నానము

తెనుఁగులెంక
శ్రీ తుమ్మల సీతారామమూర్తి

ఏఁబదేండ్లనాఁటి దీ కథ; యపుడు నా
పాలి చేఁత, పొలము పనియు; కాని
తీఱినప్పుడెల్లఁ దెనుఁగు కావ్యమ్ములు
చదువుచుంటిఁ బల్కుచదురు వలచి

సత్తెనపలి హనుమదుద్బుధు
పొత్తున దేశాభివృద్ధి పొసఁగుల కనువౌ
పొత్తముల జూచుచు నా
చిత్తమున కొకింత వెలుఁగు చేర్చుచునుంటిన్

వచ్చె నొక పర్వ మపుడు: మావాడవారు
తరలి రెందఱో కడలిని దానమాడ
నటకు నామడదవ్వున నబ్ధి కలదు
పరఁగుఁ దత్తీరమున నిజాంపట్ణంబు

ఆవేళ నిజాంపట్నపు
రేవునఁ బదివేలమంది స్త్రీలుం బురుషుల్
ప్రోవై నవనవకౌతుక
సేవధులై మజ్జనమ్ము చేసిరి వార్ధిన్

వారియం దేను నొకఁడనై మీఱిమీఱి
లోనికేగుచు నలలు రా లోఁకువగుచు
నీశ్వరమహత్త్వ కొకచిహ్న మీవముద్ర
మనుకొనుచు బ్రుంగినాఁడ నీరాకరమున

లేచి యణఁగెడి తరఁగను జూచినపుడు
స్మృతిపథమ్మున మెఱసె సంసృతిసుఖమ్ము
"వనధివంటిది సంసార" మనిన పెద్ద
లెంతనేర్పి రహో! యని వింతపడితి

అలపు వచ్చుదనుక నవగాహ మొనరించి
గట్టు నాశ్రయించి బట్ట మార్చి
యుప్పంగాల్వమీఁది తెప్పపై గూర్చుండి
తిరుగుమొగముపట్టితిని బిడాన

సాగి సాగి తెప్ప యాఁగ నేలకు డిగ్గి
తోడుతోన కదలినాఁడఁ గాని
నడుచుశక్తి కలదె నా కప్డు వఱువట్ల
గొనుచు నుదిలపడుచుఁ గుక్కి యుండ

సంచినున్నరొట్టె చాలునా గొదచిచ్చు
నార్చి మేని కింత యుల వొసంగ
నబ్ధి మున్గి నతని కాఁకలి రేకెత్త
ననుట తెల్లమాయె నపుడు నాకు

చిట్టడవిం జని చని యొక
కొట్టిక[1] గనుఁగొంటి నదియు గోకర్ణమఠం;
బుట్టంకిత మా పీఠం
బిట్టలముగ శైవ మిమ్మహిన్ దనరుతఱిన్

గోకర్ణేశ్వరభవన
ప్రాకారముఁ గడచి మండపముదరి బిల్వా
నోకహమునీడ నిల్చితి
శ్రీకంఠస్మరణసరణిఁ జిక్కినయెడఁదన్

కోవెల్రకేవల వెలసిన
శైవసమాధులను గాంచి సంతతమత సం
సేవాత్యక్తశరీరుల
పావనజీవనము దలఁచి పడసితి నొలపున్

ఎట్టి కీడు[2]కొలమ్మునఁ బుట్టుఁగాక
నరుఁడు శివభక్తి మరగిననాఁడు పూజ్యుఁ;
డతనిదెస జాతికులచర్చ లనుచితమ్ము;
లనిన శైవగురుశ్రేణి ఘనత గంటి

---

1. పల్లె.
2. తక్కువ

## జ్ఞాన స్నాన ము

జాతివినాశమున్మనకున్
హేతువు కుల మన్నసత్య మెఱిఁగినమత ము
ద్ధూతాఘ మమోఘం బవ
ధాతవ్యము భవ్య మనుచుఁ దలఁచితిని మదిన్

పండితమతముమ్మై మల్లికార్జునపండితారాధ్యు
నిండినకొల్వునం దెగడి తుద కమ్మనిషినేత్రములు
రెండు దోడించిన చందవోల్ నృపు రిపుత్ర మూహించి
గుండియ తుకతుక నుడుక మిగుల గగ్గోలుపాలైతి

వాచంయమత్వమునఁ బర
మాచార్యుఁడు మల్లికార్జునార్యుఁడు గోక
ర్ణాచలజామాతకృపన్
లోచనములు పడయు టాత్మలోఁ గమఁగొంటిన్

ఏది యేది కన్న నేమి? యాఁకటిమంట
నణఁచుదారి గాననైతి నపుడు;
ప్రొద్దు నెత్తిమీఁద నుద్దండుఁడై నిల్వ
శాంతి యె ట్లటన్నచింతఁ బడితి

టెంకాయ లభించినచో
సంకట మొకకొంత యైన సమయు నని మదిన్
శంకరుఁ బాయక కోమటి
వంకకు సాగితిని వేగ వాసిన నడకన్

ఎన్నితావుల కేగిన నెంత వడినఁ
గానిపింపద కొబ్బెరకాయ నాఁడు
వేఁడివేఁడి నిట్టూర్పులు వెడలుచుండ
మరలినాఁడఁ బదంపడి మఠము దెసకు

అప్పటికి నన్నుఁ బట్టినయట్టిశని తొ
లంగెఁ గాఁబోలు నొక నవలా యు లేల
వచ్చి తోయయ్య! యే మిట్లు వాడి తనుచు
నెదురుపడి కూర్మి పేర్మియు నెసఁగఁ బల్కె

ఈపె యెవర్తుక? నన్ను కు
ధాపన్నుం బలుకరించు దైవము తోడై

చూపఁబెట్టెనె యీచుట్టం
బీపల్లియ నీ పవాన నీవూర్మ్యాలన్

''పెట్టినదినములలోపల
నట్టడవుల కైన వచ్చు నానార్థము'' ల
న్నట్టికవి యెంతనేర్చిన
దిట్టండో యని యేను మగువదెస క్రబమునన్

కనులు సారించుచుండ మదవస్థను గాంచి యవ్వేలఁది
నను బాబయా! మఱచితివె కావూరె[3] నా పుట్టినిల్లు
మునిగాఁడు పాపనులందు నేఁపొద్దు మునిఁగి వేసరుచు
మనుగడ సాగించువాఁడు నాతండ్రి, మాచి నాతల్లి;

అత్తవారి ల్లిది; యే నిటకు వచ్చి యైదేఁడు లాయె
బొత్తిగా నన్ను గుర్తింపవైతివి; ప్రోగులు చిమ్ము
తత్తఱలో నున్ననిన్ను నల్లతేల్ తఱిమి కుట్టంగ
నత్త లేచెడినేను నీ కౌకపసరునన్ శాంతి నిడితి

ఈకథ గుర్తున్నదె యన
నోకిచ్చి! నీవఁటే! యహో! సుఖముగ నుం
టే? కూడునకున్ గుడ్డకు
నేకొఱఁతయు లేదుగద! సరే! యనినాఁడన్

అపు డాకె నాకథ నెల్ల నడిగి న న్నలయించుబాధ
నపనయింపఁ దలంచి పూఁటకూళ్లమ్మ నర్థింప నాపె
విపరీతముగఁ బల్కె; నంతఁ గిచ్చమ్మ విడువక పట్టు
నుపమరి యై నాక నొకసవర్ణుని యునికిని జూపి!

ఈయింటివారి నొప్పించుదాన; నీ విచట భోజనము
సేయుము నా నింతపన్నుగడ యేల చెల్లెలా! నీవ
నీయింట వండి వడ్డింపుము తినెద నిండువేడుకను
నాయుల్ల మిట్టిభేదములు మన్నించునది కాద యంటి

ఆ మాదిగమగువ దొరా!
యే మిది ధర్మమ్మను జెఱుతువే యని కంపం

---

3. కావూరు (రేపల్లెతాలూకా) నాయూరు.

# జ్ఞానస్నానము

బాముకొనఁ బత్కాః ధర్మపు
నేమఱక పఠింతు నంటి నే నయ్యెడకున్

ఎదురాడలేక కిచ్చను
మది సవరించుకొని శౌచపుంజాల యపుడున్
హృదయేశుఁడు తోడుపడన్
గుదిరినతియ్యమునఁ గూడుగూరలు తిర్చెన్

అది మాఘమాస మగుటన్
గుదిగొని దడిమీఁద గుత్తుగుత్తులుగా నిం
పొదవించెడి పెను మటికలు[4]
బద నెఱఁగి రుచుల్ పొసంగుపగిదిని వండెన్

పెరునేయి ముంతపెరుఁగు చిక్కుడుగాయ:
కూర యెఱ్ఱగడ్డకారః—మింక
నేమి వలయుఁ దిండి? కీసర్యమును మించు
నాదరమ్ముసైత మమరియుండ

అపుడు మాతంగదంపతి కగ్గపడిన
తృప్తి యేమాత్ర ముండెనో యెఱుఁగఁ గాని
యేను గుడిచినతనుపున కెల్ల లేద
మఱవరానిదినం బది మనువునందు:

గాంధి నెఱుఁగను గాని తత్కాలమునకుఁ
గందుకూరి వీరేశలింగమును గందు
సంఘమునఁ గల్లక్రుళ్లను జక్కఁ గడుగ
నితఁడు సైఁచినవెతలు విస్మృతికి రావు

ఇంటికిఁ జని కులభూతము
గెంటితి నని యేను దండ్రికిన్ గథ చెప్పన్
వింటివికదర! శబరి ముని
పంటఁ గొఱికి యిడినపండ్లు ప్రభుఁ డాను టనెన్.

---

4. చిక్కుళ్లు

# ప్రాఁ దెలుఁగు - యతి

శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు "దూత మత్తేభము" లనే పేరుతో మేఘ సందేశాన్ని తెలుగు చేశారు. విశేషమేమంటే అందులో వారుపయోగించిన మత్తేభ విక్రీడితాలలో యతిప్రాసల్ని వదలి వేశారు. అంత చక్కని పద్యాంకు యతిప్రాసలు కూడా ఉంటే సలక్షణంగా వుండేవికదా అని కొందరు వాపోయి వుండవచ్చు. కాని లేకపోవడంవల్లనే అవి నిసర్గ సుందరంగా వున్నాయనే వారు కూడా లేక పోలేదు. ఎవరెలా అన్నా ఇలాటిస్వేచ్ఛ కవుల కెప్పుడూ వుంటుంది. ఈ స్వేచ్ఛ ఒకరిచ్చింది కాదు. ఒకరు లాక్కుంటే పోయేదీకాదు. అందుకే కాబోలు 'యతి ప్రాసలు నిర్ణయించు కొనుటలో కవులకు స్వాతంత్ర్య ముండవలె'నని గిడుగువారన్నారు. ఒక్క యతిప్రాసల విషయమేకాదు. తమ భావాన్ని వ్యక్తీకరించడానికి ఎలాటిపద్ధతి సరియైనదనితోస్తే అలాటిపద్ధతి నవలంబించే స్వేచ్ఛ వారికి సంపూర్ణంగా వుంది. అది ఈనాటిదికాదు. కవిత్వం పుట్టిన నాటిది.

పాత తెలుగు పద్యాలలో యతి నియతి లేదా? అంటూ భారతి (జూన్ 67) లో సులోచనగారు ఒక ఆలోచన పురికొల్పే ప్రశ్న వేశారు. అసలు సిసలైన తెలుగు కవిత్వానికి పద్యత్వం అబ్బిన పరిణామ సంధి కాలాన్ని పరిశీలిస్తే యతి ప్రాసల్ని ఇప్పుడు మన మనుకున్నంత కట్టుదిట్టాలతో వాడలేదని తెలుస్తుంది. యతి అంటే నియమనం అని కదా! దేనికైనా కొంత వ్యవస్థ ఏర్పడిన తర్వాతే ఏనియమమైనా బయల్దేరుతుంది. ఆయితే పాత తెలుగు పద్యాల్లో యతి ప్రాసలు లేవ్వూ, అని అంటే యతి ప్రాసలులేనివి అవి పద్యాలెలా అవుతాయి? అని ప్రశ్నించే వారుండవచ్చు. పద్యాలకూ యతి ప్రాసలకూ అవినాభావం అంతదిలంగా ఏర్పడి ఉంది మరి.

పాత తెలుగు పద్యాంలో యతి ప్రాసంకున్న స్థానాన్ని తెలిసికోవడానికి ఈ క్రింది పరిణామ దశలను పరిశీలించవలసి వుంటుంది.

1. జానపద గేయ వాఙ్మయంలోని మాత్రాచ్ఛందం శాసన, కావ్య సాహిత్యములందు ప్రవేశించుట.

2. దేశిచ్ఛందోభేదములు సంస్కృతములో ప్రవేశించుట.

3. సంస్కృతములోని గణబద్ధ వృత్తములు తెలుగులోనికి వచ్చుట.

4. తెలుగు సంస్కృతముల మధ్య తమిళ కన్నడ చ్ఛందోరీతుల ప్రభావము.

5. దేశిచ్ఛందము నుపయోగించడంలో ప్రాచీనార్వాచీన కవులలో భేదాభిప్రాయాలు.

6. సంస్కృత లక్షణ కర్తలలోను, కవులలోను యతి విషయంలో ఉన్న పరస్పర భేదాభిప్రాయాలు తెలుగు కవుల పై ప్రభావము చూపుట.

7. సంస్కృతంలోని విచ్ఛేద యతి తెలుగులో సరూపాక్షర యతిగా పరిణమించుట.

8. లక్షణ కర్తల నియమాలను కవులు నిరంకుశంగానో తెలియకనో, ఇష్టంలేకనో ఉల్లంఘించుట.

9. యతిస్థానాలు మార్చడంచేత పద్యభేదాలేర్పడుట.

10. అక్షర పునరావృత్తులను ఆలంకారికంగా అవసరం లేని తావులందుకూడా విరివిగా ఉపయోగించుట.

11. కొన్ని దేశీయ పద్యాల్లో ప్రాస అనేది లేకుండుట. యతికి బదులు ప్రాసయతిని ఉపయో గించే అవకాశముండుట.

12. ప్రాథమిక దశలో స్వల్ప సంఖ్యాకము లుగా నున్న యతుల సంఖ్య పెరుగుట.

ఇందులో మొదటి విషయాన్ని గురించి యించుక విపులంగా మిగతా కొన్నింటి గురించి దిఙ్మాత్రంగా, యతిని దృష్టిలో వుంచుకుని పరిశీ లించడమే ప్రస్తుత వ్యాస లక్ష్యం.

పాత పద్యాల్లో యతినిగూర్చి ఆలోచించే ముందు జానపద గేయ చ్ఛందమే శిష్టసాహిత్యంలో ప్రవేశించిందని తెల్సుకోవడం అవసరం.

ఏ కళైనా జానపదుల జీవితాలనుంచే ఆవిర్భ విస్తుందని తద్జ్ఞుల లభిప్రాయం. వారి నడకనుండి నాట్యం, మాటనుండి పాట, పాటనుండి పద్యం పుట్టాయి. F. G. Gummere అనే రచయిత యిలా వ్రాస్తున్నాడు.

"A Russian scholar who had studied the ritualistic songs of race, comes to a theory of poetic origins embraced in the formula of "ceremony to song, song to poetry."

ఆంగ్ల కవిత్వానికి జానపద గేయాల గాథలే మూలమైనట్లు F. G. Child వ్రాశాడు. తెలుగులో 'దేశి' అనే కవిత్వ విభాగాన్ని చిన్న చూపు చూచే సంస్కృతాభిమానులు నాటినుండి నేటివఱకూ ఉన్నారు. దేశిచ్ఛందానికి ప్రత్యేక లక్షణమేదీ లేదనీ, ఉన్నభేదాలన్నీ సంస్కృతములోనివే అనీ శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారు తమ కుమార సమ్భవ తత్త్వ విమర్శలో వ్రాశారు. దేశి అనేదానికి భాషాభేదం తప్ప ఇంకేమీలేదంటారు వారు. దీనికి సమాధాన ప్రాయంగా 26 ఛందములలో పుట్టినవికాక, జాతులనబడేవి కొన్ని ఉన్నాయని, నాగవర్మ తన ఛందోంబుధిలో చెప్పినట్లు, అందు దేశీయజాతులు అక్కరాదులు తెలుగులో ఉన్నాయని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు '...భాషా సారస్వతములు—దేశి' అనే గ్రంథంలో వ్రాశారు. దేశీ స్వభావాన్ని నిరూపిస్తూ ఇలా అన్నారు.

"ఈ పదములు, పాటలు, గీతములు మొదలగు నవే యాంధ్ర కవితావైభవమునకు మూలధనము. ఆంధ్ర వాఙ్మయ మహాసౌధమునకు పునాదులు. ఆంధ్ర భాషా సారస్వతమను మహావృక్షమునకు మహోత్తర మూలములు. తల్లివేళ్ళు." సంస్కృత లాక్షణికుల చేతులలోపడి దేశిచ్ఛందోవస్తువులు సంస్కరింపబడి భ్రష్టమైనవికూడా ఉన్నాయనడంలో సందేహంలేదు. పాత తెలుగు పద్యాల్లో యతి నియమం ఐచ్ఛికంగా వుందనే విషయాన్ని ఋజువు పట్టుకొంటూ జాను పదుంపాటలు పద్యాలుగా ఎలా పరిణమించాయో కొన్ని పద్యాల్ని చూద్దాం.

## కందం

తెలుగు కందమే సంస్కృతంలోని ఆర్యాగీతికి మూలకందమని అర్కుద. "ఇది తెలుగువాళ్ల దగ్గ ర్నుంచే ప్రాకృతంలోకీ, ప్రాకృతంలోనుంచి సంస్కృ తానికీ వెళ్లింది." అని వారు సమగ్రాంధ్ర సాహిత్యం (ప్ర. సం) లో వ్రాశారు. రెండవ యుద్ధమల్లుని కుమారుడగు బాడప మహారాజు వేయించిన ఆరుంబాక శాసనాన్ని 1921 ఆంధ్రపత్రిక (ఉగాది)లో శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు ప్రక టించారట. అందులో యతిప్రాసలులేని కందపద్యమూ, యతిప్రాసలున్న కందపద్యమూ ఉన్నాయి. తెలుగు లక్షణంగల కందాలు సంస్కృతంలో వ్రాశారంటూ శ్రీ సంపత్కుమారగారు తమ 'తెలుగు ఛందో వికా సము'లో పై శాసనంలోని ఈ సంస్కృత కందాన్ని ఉదహరించారు.

ధవళగుణో ధవళయశో
ధవళిత దిఙ్మండలోవ దమితారాతిః
భవభక్తో భవకరుణో
ద్భవ భవభోగాప్త్యోవిభాతి సుకీర్తిః.

అయితే యతిప్రాస లుండడం తెలుగు లక్ష ణమే అయినా అది అర్వాచీన లక్షణం. పై శాసనం లోనే ఉన్న యతిప్రాసలులేని కందం సంస్కృత లక్షణం గలదని భావించే అవసరంలేదు. (ఆ పద్యం

లభించనందుకు విచారిస్తున్నాను.) యతిలేని స్థితి నుండి యతిగల్గు స్థితికీ, దేశీచ్ఛందం సంస్కృతంలో ప్రవేశించే స్థితికీ, మార్పులు చెందుతున్న సంధికాలంలోనిదని పై శాసనాన్నిగూర్చి భావింపవచ్చు.

కందాన్ని ఆర్యాభేదమంటున్నారు. అది అనార్య (ద్రావిడ) ఛ్ఛందమని ఎవరేనా నిజం చెప్పినప్పుడు కాదు ఆర్యాఛ్ఛందమే అని వాదించేవారే దానికి ఆర్య అని నామకరణం చేసివున్నా ఆశ్చర్యంలేదు. ఆర్య అనే పేరుగాని దాని లక్షణంగాని తెలియని పామరుడూ పసివాడూ ఓ పాట పాడుకుంటే ఆ పాటలో వ్యాకరణ దోషాలున్నా దాన్ని ఆర్యాగీతిభేదమే అని అంటే ఏం చేయగలం?

పిల్లలు పాడుకునే ఈ వెన్నెలపాట చూడండి.

"కాకీకాకీ—గంతులకాకీ
కాకిని తీస్కెళ్ళి—గంగలో ముంచితే
గంగా నాకూ—పాలూ ఇచ్చే
పాలూ తీస్కెళ్ళి—అమ్మా కిస్తే
అమ్మా నాకూ—డబ్బా నిచ్చే
డబ్బా తీస్కెళ్ళి—పంతులు కిస్తే
పంతులు నాకూ చదువూ నిచ్చే
చదువూ తీస్కెళ్ళి—మామా కిస్తే..."

ఇది ఏకాలపు పాట? అనే ఆలోచనకంటె ఇలాటి ఛందంగల పాటలు ప్రాచీనకాలంలో జానపదుల నోళ్లలో నలిగిఉంటాయనుకోవడంలో అభ్యంతరంలేదు. ఈ పాట యతిప్రాసలులేని రెండు కంద పద్యాలు అంటే ఎవరైనా నమ్ముతారా? 64 మాత్ర లుండడం స్థూలంగా కందపద్య లక్షణం. ఎన్ని మాత్రలున్నా 64 మాత్రల కాలానికి—లఘు గురు వివేచనతో నిమిత్తంలేకుండా, గణాల సంగతి పట్టించుకోకుండా—సరిపెట్టుకోవడం పాత కందపద్య లక్షణం. అదే పై పాట లక్షణం: చతురశ్రజాతి త్రిపుట తాళానికి ప్రథమ కాలంలో ఒక ఆవృతంలో 8 మాత్ర లుంటాయి. రెండవ కాలంలో అంతకు రెట్టింపు ఉంటాయి. కందపద్యం వ్రేలికి రెండు మాత్రల చొప్పున 4 ఆవృతాలలో 4 చరణాలూ కలిసి 64 మాత్రల కాలంలో సాగుతుంది. వ్రేలికి 4 మాత్ర లైతే 2 ఆవృతాలలోనే పూర్తిపద్యం వస్తుంది. పై పాటను ఇలా కందాలుగా చదువుకోవచ్చు. తాళం సరిగ్గా సరిపోతుంది.

1. కాకీకాకీ గంతుల
   కాకీ కాకిని తీస్కెళ్ళి—గంగలో ముంచితే
   గంగా నాకూ పాలూ
   ఇచ్చే పాలూ తీస్కెళ్ళి—అమ్మా కిస్తే
2. అమ్మా నాకూ డబ్బా
   నిచ్చే డబ్బు తీస్కెళ్ళి—పంతులుకిస్తే
   పంతులు నాకూ చదువూ
   నిచ్చే చదువూ తీస్కెళ్ళి—మామాకిస్తే.

ఇందులో యతిప్రాసలు లేకపోవడం గమనించ తగ్గది. అథవా ఎక్కడో యతి ఉందనుకుంటే అది కేవలం యాదృచ్ఛికమే.

కొంచెం ముందుకువెళ్లితే 8 మాత్రలకొక సరూపాక్షర యతి కనిపిస్తుంది. అయితే ఇప్పుడు మనం కావ్యాల్లోచూచే కందాల యతిస్థానం తాళరీత్యా ఒక క్రమానికి లోబడిఉన్నట్లు కన్పించదు. రెండు చరణాలూ కలిపి 32 మాత్రలైతే 16 మాత్రల తరువాత యతి రావడం సక్రమం. లేదా 8 మాత్రల కొక్క యతి ఉన్నా సరిపోతుంది. పాటల రూపంలో ఉన్న కందాల్లో అలాగేవుంది. కాని శిష్టసాహిత్యంలో వున్న కందానికి 24 మాత్రలు దాటినతరువాత ఉంది. అది క్రమంకాదని ముందు చూద్దాం.

పిల్లలు పాడుకునే ఈ పాట చూడండి.

గుడు గుడు గుంచం—గుండేరాగం
పాముల పట్నా—పడగ రాగం
చినన్న పెండ్లి—చిట్టేరాగం
పెద్దన్న పెండ్లి—పెట్టేరాగం.

దీన్ని కందంగా వ్రాసుకుంటే ఇలా వుంటుంది.

గుడు గుడు గుంచం గుండే
రాగం పాములపట్నా—పడగా రాగం
చినన్న పెండ్లి చిట్టే
రాగం పెద్దన్న పెండ్లి—పెట్టేరాగం.

చరణాలు మార్చి వ్రాయడం తప్ప దీనిలో మన గణాలుకూడా సరిపోతున్నాయి. అయితే పాటగా ఉన్నప్పటి తాళానుకూల యతులు పద్యంగా వ్రాస్తే మాయమైపోతున్నాయి. 'చందమామ రావే' అనే పాట కూడా అచ్చంగా యిలాటిదే. దాన్ని కంద పద్యంగా మార్చి వ్రాస్తే యిలా వుంటుంది.

చందమామరావే జాబిలి
రావే కొండెక్కిరావె—గోగుపూలుతేవే
బండెక్కిరావే బంతిపూలు
తేవే పల్లకీలు తేవె—పారిజాతం తేవే.

మాత్రల్ని అక్షరాలకు కుదించి గణాలుగామార్చి యతిని అస్పష్టస్థానంలోకి త్రోసి ఇలాటి ఆదితాళపు పాటల్ని కందాలుగా మార్చుకున్నారు. జానపదులు స్పష్టమైన తాళపు వరుసలో స్వేచ్ఛగా ఉన్న యతి గణాలతో పాడుకున్న ఇలాటి పాటలు తమ రూపాన్ని కోల్పోయినాయి. రాతరీత్యా స్పష్టత [illegible] ఏర్పడ్డంతో దానికి [illegible] లక్షణ కర్తలు చేసిన మార్పేనా [illegible]. 'చందమామ' అనేది 6 మాత్రల [illegible] 4 మాత్రల మాటగా [illegible] సులువు. సులువేక [illegible] సంగీతరీత్యా ఒక [illegible] సంగీతానికీ ఛందానికీ [illegible] ఛందంగా మారిపోయింది. సంగీతంలో [illegible] మాత్రల మాటనైనా 10 మాత్రలకాలందాకా [illegible] వరసలో లాగవచ్చు. ఈ [illegible] పోయింది. పోకుండావుంటే అది ఛందంగాక సంగీతమే అవుతుందిమరి. మామూలు [illegible] మార్చుకున్నట్టు ఇలాటి పాటల్నే [illegible] కోసమేమో యతిస్థానాన్ని మార్చారు. ఈ మార్పును కొంచెం వివరంగా చూడవచ్చు.

**4 మాత్రల చొప్పున**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శ్రీరా | మునిదయ | చేతను | నారూ | ఢిగ సక * | లజనులు | నౌరా | యనగా |
| ఘాత | చిటికెన వ్రేలు | అనామిక | మధ్యమము | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| 16 మాత్రలు | | | | 16 మాత్రలు | | | |

**2 మాత్రల చొప్పున**

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీ | రా | ముని | దయ | చే | తను | నా | రూ | ఢిగ * | సక | లజ | నులు | నౌ | రా | యన | గా |
| ఘాత | చి. వ్రే | అనామిక | మధ్యమము | ఘాత | ఉసి | ఘాత | ఉసి | ఘాత | చి. వ్రే. | అనామిక | మధ్యమము | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| 16 మాత్రలు | | | | | | | | 16 మాత్రలు | | | | | | | |

పైన * యతిస్థాన సూచకమైన గుర్తు. సరూపాక్షరమో విచ్ఛేదమో లేదా ఏదీలేని మామూలు అక్షరమో ఆ చోట తాళాన్ని విభజించాలి. మామూలు అక్షరమని ఎందుకనవలసి వచ్చిందంటే యతి అంటే నిజానికి విచ్ఛేదమూ కాదు. సరూపాక్షరమూ కాదు. యతి అనేది సంగీత పారిభాషిక పదం. లయ ప్రవృత్తి నియమాన్ని తెలియజేసేదే యతి అని కోహళాచార్యుడు లక్షణం నిర్ణయించాడు. ఈ విషయాన్నిగూర్చి మరి కొంచెం వివరంగా డిసెంబరు 1964 భారతిలో వ్రాశాను.

పైన చూపిన పద్దతిలో ఘాతలు పడినచోట యతులు పడాలి న్యాయంగా. రెండు పాదాల్లో కలిసి 32 మాత్రలుంటే 8 మాత్రంకో 16 మాత్రంకో ఒక యతి వేస్తే సరిగా వుంటుంది. అలాకాక 16+8=24 మాత్రల తర్వాత వేయడంలో అర్థం లేదు. నన్నయగారు 16 మాత్రల యతిని లేక ప్రాస యతి నుపయోగించారో లేదో అనే కుతూహలంకొద్దీ భారతం తెరచిచూస్తే లటాటివి బోలెడన్ని కనిపించాయి

అడవులలో నాతోఁగడు
నిడుమలు వడ నోప వరుగు మిందుముఖీ యి
ప్పడు నీ బంధు జనంబుల
కడ కనవుడు తరుణ శోక గద్గద యగుచున్.

[నలోపాఖ్యానము]

మొదటి చరణంలో ప్రాసయతి, రెండవ చరణంలో యతీ పడ్డాయి. ఇది యాదృచ్ఛికంగానే జరగవచ్చు. కాని ఈ యాదృచ్ఛికత ప్రాచీన గేయాలకు సంబంధించినదనేదిమాత్రం నిజం. ఇందాకా పాటల్ని కందపద్యాలుగా చూచాం. ఇప్పుడు కంద పద్యాల్ని పాటలుగా పాడుకుందాం. అయితే ఒక్క విషయం. యతి అనేది ప్రాథమిక జానపదగీతాల్లో లేదనే విషయం అలా వుంచుదాం. యతి అనేది చరణాద్యక్షరమనికదా మనవారు చెప్పింది? ఆంధ్రశబ్ద చింతామణి మొదలు అప్పకవీయం వఱకూ అన్నిలక్షణ గ్రంథాలలోనూ పాదప్రథమాక్షరమే యతి అని చెప్పబడివుంది. అయితే కందంలో మొదటి చరణం లోని మొదటి అక్షరానికి యతి గౌరవం ఇవ్వ లేదేమిటా? మిగతా అన్నిపద్యాల్లో అలా యిచ్చారుకదా! కందంలో కూడా ప్రథమ చరణాద్యక్షరంతో యతికి సంబంధం ఉండితీరాలి. ఈ క్రింది ఉదాహరణాల్ని చూడండి.

1. ఏయది హృద్యము పూర్వంబేయది
యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణమేయది
యక్కథయ వినగ నిష్టము మాకున్.

2. అనిన విని రోమ హర్షణ తనయుం
డమ్మునుల కతిముదంబున వినయా
వనతుండయి గురులందన హృద్వనజం
బున నిలిపి కొలిచి వాగ్గణపతులన్.

పై వి భారతంలోని ఆదిపర్వ ప్రథమాశ్వాసంలో 30, 76 సంఖ్యగల కందపద్యాలు. తాళంవేసికుని చక్కగా పాడుకోవచ్చు. 16 మాత్రల కొక చరణం చొప్పున వ్రాయగా చరణాద్యక్షరాలలో యతులు లేదా ప్రాసయతులు వచ్చాయి. తెలుగులో ఇంకా యిలాటి కందాలు ఎన్నైనా దొరకవచ్చు. 'సునోసునో ఐ దునియావాలో బాపూకీ యే అమర్ కహానీ' కందంలాటిదే. దీని రాగంలో పై పద్యాల్నే కాదు ఏ కందాన్నైనా హాయిగా పాడుకోవచ్చు. నన్నయగారిలో దేశిచ్ఛందోబద్ధమైన పద్యాల సంఖ్య హెచ్చు. అందులో కందాల సంఖ్య ఎక్కువ కావడం గమనార్హం.

## తే ట గీ తి

'భారతదేశపు పల్లెపదాల్లో ఎక్కువభాగం మద్దెల వాయిస్తూ పాడతారు. అందుచేత వాటి తాళ గతులు ఖచ్చితంగా ఏర్పరచిఉంటాయి...గ్రామీణ ప్రజలలో సంగీతమూ నృత్యమూ విడివిడిగాకాక రెండూ కలిసే వుంటాయి—' అని శ్రీ కపిలావాత్స్యాయన్ శ్రీ సచ్చిదానంద వాత్స్యాయన్ తమ 'భారతీయ జానపద నృత్యాలు' అనే గ్రంథంలో వ్రాశారు. అయితే ఈ స్పష్టమైన తాళగతి కనిపించకుండా యతి మార్చి కుంటినడక నేర్పబడ్డ పద్యాల్లో తేటగీతి ఒకటి. 'గుండె గొంతుకలోన—కొట్లాడు తాదీ' అనే చరణం పాటగా పాడినప్పుడు కలిగే స్పష్టత తేటగీతి చరణంగా 'గుండె గొంతుకలోన

కొ—ట్లాడుతాది' అని చదివితే రాదు. ఈ పాట చూడండి.

ఆడబోయి నాయిన్న—వచ్చేనో లేదా
అందెలాచప్పడాయె— అరుగుల్లమీద
చదువబోయినాయిన్న—వచ్చేనో లేదా
పలకలా చప్పడాయె—పడసాలమీద.

ఇది తేటగీతిగా మారడానికి అనువుగా వున్న పాట. పాటలోని అద్దగీతల్ని ఒక్కఅక్షరం తర్వాతకు జరిపితే తేటగీతిలా చదవవచ్చు ఇలాగ.

ఆడబోయినాయిన్న వ—చ్చేనో లేదా.

ఆద్యక్షర సంబంధంగా రెండవ నాల్గవ చర ణంలో యతి ఉంది. లేట గీతిగాచూస్తే అసలు యతి అనేదేలేదు. అయితే గణాలుకూడా సరిపోవంటారు. ఔను. మాత్రాకాలాన్ని అక్షరబద్ధం చేయడంవల్లనే రాగ తాళ వరుసలు గణాలకూర్పుగా ఏర్పడ్డాయని ఇందాకే చూచాం. తేట గీతిగా పరిణమించడానికి మిక్కిలి అనుకూలంగా వున్న ఈ పాట చూడండి.

స్వాతి వానలు గురిసె—సంద్రంబుకడనూ
చిట్టి ముత్యం బుట్టె—సీతకడుపూనా
అందరీ మామల్లు—చందమామల్లు
నాయిన్న మామల్లు—రామలక్ష్మణులూ
పాలు తాగేనాడు—పారాడునాడు
పాడి యావు నంపించు—నీకు నీహామ.

యతులు (సరూపాక్షరాలు) యథేచ్ఛగా వుండడం తేటగీతిగా యతులు సరిపడకపోవడం, గణాలు సరిగా లేకున్నా మాత్రానుగుణంగా తాళం సరిగా వుండడమూ ఈ పాటలో గమనించ తగ్గవి. ఇలాటి పాటల్ని యతి స్థానాన్ని ఒక్క అక్షరం ముందుకుజరిపి గణాలు బిగించి తేటగీతిగా మార్చుకున్నారు.

అయ్యవారికిచాలు—ఐదువరహాలు
పిల్లవాండ్లకు చాలు—పప్పుబెల్లాలు.

పిల్లలు పాడే దసరా పాట తేటగీతే.

'జో రవికులశుభాంగ జో సన్నుతాంగ'
'లాలి శ్రీ రఘురామ లాలి రిపుభీమ'
'ఫాలలోచన వీరభద్రావతార'
'కాల కాలగిరీశ కంధి తూణీర'
'లాలి గరుడతురంగ లాలి భవభంగ'

ఇలాటి జోలపాటలూ లాలిపాటలూ తేటగీతులే. యతిలేని తేటగీతులు. తేట అనేది తేటతెల్లంగావున్న తెలుగుమాట. గీతము అనే సంస్కృతం మాటకర్థం పాట. కాబట్టే ఇది అచ్చంగా పాటే. 'కిటతకిట' అన్నరాల్లో నడుస్తుంది. "ఈ జానపద గేయములే దేశకవితగా పరిణమించినట్లు మన కఁకాధారము లున్నవి...పదకవితలే దేశకవితలుగా పరిణతి పొందినవి" అని డా. బి. రామరాజుగారు తమ 'తెలుగు జానపద గేయ సాహిత్యము' అనే గ్రంథంలో నొక్కి చెప్పిన మాట అక్షరాలా నిజం.

## ద్విపద - తరువోజ

"ఈ (జానపదుల) పాట లెక్కువగా ద్విపద వలె నుంటవి. ప్రాస ఉంటే ఉండవచ్చు. యతులు పడ్డచోట పడుతవి. గణములలో ఒక్కొక్కమాత్ర తగ్గవచ్చు. హెచ్చవచ్చు." అని 'ప్రజా వాఙ్మయం' అనే తమ పుస్తకంలో వ్రాశారు శ్రీ చింతా దీక్షితులు గారు. ద్విపదనుంచే తరువోజ పుట్టిందని శ్రీ సంపత్కుమారగారు లంటే తరువోజనుంచే ద్విపద పుట్టిందని శ్రీ ఆరుద్ర గారన్నారు. ఎవరెలా అన్నా అవి రెండూ సజాతీయమైనవనడం నిస్సందేహం. సోమనాథుని ధర్మమా అని ద్విపద స్వరూపం క్రొంత వఱకు యథాపూర్వంగా నిలిచి ఉంది. నన్నయగారి కంటే చాలా పూర్వంనుంచీ ఈ ఛందం వాడుకలో ఉన్నట్లు శాసనాలూ జానపదగేయాలూ సాక్ష్యమిస్తాయి. అయితే సోమనాథుడు దీనికి కొంత సంస్కారం కలిగించకపోలేదు. పండితారాధ్య చరిత్రలో 'అనియత గణమై, యతిర్యా, ప్రాసోవా' అని దేశిచ్ఛంద లక్షణం చెప్పాడు సోమనాథుడు. "ఇవి ఛంద స్సూత్రముల గుననని నేను దలంచుచున్నాడను" అని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులవారు వ్రాశారు. కాని ఇవి ఎక్కడి సూత్రాలో వారుగాని సోమనాథుడుగాని చెప్పలేదు.

ద్విపద శిష్టులనబడేవారి నిరసనకు గురి అయింది. అయితేనేం ? ఈ ద్విపదే జాత్యుపజాతులలో లనేక పద్యాలకు మూలమైంది. యతి ప్రాసల్లో ఏదో ఒకటి ఉండాలన్నట్లు పై సూత్రాలనబడేవాని అర్థమగుచుండగా సోమనాథుడు పద్యత్వాన్ని సంపాదించడానికేమో రెంటినీ నియమంగా పాటించాడు.

తెలిసినవాడైతే చాలు యతితప్పకుండా వ్రాయగలడు. కారణ మేమంటే యతి నిర్ణీతాక్షరంపైనే రావాలనే నియమాన్నిబట్టికాక తాళాన్నిబట్టే అనేది స్పష్టం. లక్షణకర్తలు చెప్పిన స్థలాల్లోకాకుండా క్రొత్త స్థలాల్లో తాళఘాతర్నిబట్టి సరూపాక్షరాన్నిగానీ, విరామాన్నిగానీ పాటిస్తే చాలా చిత్రమైన నడకలు వస్తాయి.

కాని మన కవులు లక్షణకర్తలు గీచిన హద్దు దాటలేదు. వారు చెప్పినట్లుగా యతి లేకుంటే—గణాలు సరిపోయినాసరే—దాన్ని సీసం అని పిలువకుండా 'పాట' అని పిలిచారు.

యతిలేని 'సినిమా సీసపు పాటలు' ఇవిగో.

1. కాశికి వెళ్లాను రామాహరీ గంగ
   తీర్థమే తెచ్చాను రామ (అ) హరీ

2. రామన్న రాముడే—కోదండ రాముడే
   శ్రీరామచంద్రుడూ—వచ్చ (అ) డురా.

యతిలేని సీసాలు నాడూ నేడూ పాటల రూపంలో సజీవంగా ఉన్నాయి.

అయితే సీసంక్రింద తేటగీతి లేక ఆటవెలదిని చేర్చడమెందుకు? అని ప్రశ్నిస్తే దాని కొక కారణం కనిపిస్తుంది. సీసపాదపు పూర్వార్థం యొక్క చివరి మూడు మాత్రల కాలాన్ని ఉత్తరార్థంతో కలిపి చదివితే తేటగీతి పాదమౌతుంది. ఈ పాటను చాలామంది కలిసి బృందగానం చేసేవారు. పాట మంచి హుషారులో రక్తితోపడ్డ ఘట్టంలో, పాడే వారు రెండు జట్లుగా చీలిపోయి ఒక జట్టువారు పై సీసపాదంయొక్క మూడు మాత్రల మాటని అంటూవుంటే రెండవ జట్టువారు ఉత్తరార్థాన్ని పౌనఃపున్యంగా పూర్తిచేస్తూవుండేవారు. ఇలా దాదాపు మూడు నాలుగుసార్లుచేసి పాట ఆపివేసేవారేమో! ఆటవెలది లాటి పాట అయితే సీసపాదంతో నిమిత్తం లేకుండా ఆటవెలది చరణాన్నే పూర్వార్థం ఒకరూ ఉత్తరార్థం మరొకరూ అంటూవుండేవారు. ఈ ఉద్రేక ఘట్టంలో ఒక్కొక్కప్పుడు తాళాన్ని మార్చడం కూడా కదు. కాబట్టి తేటగీతిలో లక్షణకర్త లేర్పరచిన యతిస్థానం సరైందికాదు.

## ఇ త ర ము లు

నన్నయగారికి ఎంతో పూర్వకాలంనుంచీ నేటి వఱకు నిలిచిఉన్న పదాలు, పదాల వరుసలూ ఎన్నో వున్నాయి. ఏలలు, జోలలు, అర్ధచంద్రికలు, అక్కరలు, రగడలు, సువ్విపాటలు, జాజరలు, ఉయ్యాల పాటలు, ఐరేని పాటలు, చిందులు, జక్కిణులు, చౌపదాలు, ఆరతులు, దరువులు, జక్కులరేకులు, సుద్దులు, నలుగులు, జంపెలు, కురుజంపెలు, కొట్నములు, అల్లోనేరేళ్లు, చద్దులు, గొడుగీతాలు, ఉరుటణులు, కొరవంజులు, తలుపు పాటలు, అప్పగింతలు, మేలుకొల్పులు, వాదాలు, పడవ పాటలు, వేదాంతం పాటలు, కోలాటాలు, గొబ్బి పాటలు, బువ్వపు పాటలు, ఎగతాళి పాటలు, పెండ్లి పాటలు, నివ్వాళులు, సూళలు, ఇంకా ఎన్నెన్నో లక్షలసంఖ్యలో ఉన్నాయి. దేశిచ్ఛందమంతా సంస్కృతంలోనుంచే దిగుమతి అయిందనే వారూ, వాటిపేర్లన్నీ సంస్కృతంలోనే ఉన్నాయనే వారూ పైన పేర్కొనబడిన ఇంకా పేర్కొనబడని అచ్చమైన తెలుగు పాటల్ని పరిశీలించవలసే వుంటుంది.

వీటన్నింటిలోనూ యతి ప్రాసల పట్టింపులు లేవు. యతి ప్రాసలు ఉండాలి అనే నియమంతో వ్రాస్తే ఉంటాయి. ఉండకూడదు అనే నియమంతో వ్రాస్తే ఉండవు. ఈ రెండు నియమాలకూ లోబని కాబట్టి యాదృచ్ఛికమైన యతులు అక్కడక్కడా దొర్లివుంటాయంతే. ఇలాటి పాటల్లో కొన్నిటికి యతి ప్రాసలు పెట్టుకొని, పేర్లుపెట్టుకొని, లక్షణాలు చెప్పుకొని, కావ్యాల్లో వ్రాసుకున్నారు. 'సువ్వి సువ్వి రామచంద్ర' తురగవల్గనమైంది. 'గుమ్మడేడే గోపిదేవి' అనేది భామినీషట్పదిగా, జంగం కథలు హరిణగతిరగడలుగా, 'హరిహరీ నారాయణా ఆదినారాయణా' ద్విరదగతిరగడగా, ఏలపదాలు భోగషట్పదులుగా పేర్లు పెట్టుకొన్నాయి. ఇలా ఇంకా ఎన్నో? [చూ. తెలుగు జానపదగేయ సాహిత్యము. 776 పు]

పరిశీలించినంతవఱకూ జానపదగేయాల్లో యతి ఈ క్రింది రకాలుగా వుంది. ఇది పరిణామ క్రమం కూడా కావచ్చునేమో!

1. విచ్ఛేదంగాని, సరూపాక్షరంగాని అసలు లేకుండుట.

2. విచ్ఛేదయతి—పాదార్థంలో—అంతంలో.

3. సరూపాక్షర పునరావృత్తి.

4. సరూపాక్షరమే అయినా అచ్చుతో సంబంధంలేని యతి.

5. హల్లులతో సంబంధం లేకుండా కేవలం అచ్చుతోమైత్రి.

6. ప్రాసయతి.

7. తాళపుఘాతలు పడ్డచోట్లలో గణాద్యక్షర సామ్యం.

8. అక్షర సామ్యంకాక కేవలం ధ్వని (ఉచ్చారణా) సామ్యం.

ఇవన్నీకూడా గేయ, స్థల సంబంధమేమీ లేకుండా స్వేచ్ఛగానే వాడబడ్డాయి. "యతి ప్రాస లనునవి యేదో యలంకారముకొరకై మధ్య కవులు తెచ్చిపెట్టుకొన్నవి కాక క్రీస్తుశకమునకు మున్నే తమిళ వాఙ్మయమునఁ బరిపాటిగా నిలిచియున్న ప్రాచీన ద్రావిడ కవితా సంప్రదాయ సిద్ధమైన తొడై అను దాని రెండు రీతులలో సంబంధించినదే" అని కోరాడ వారంటారు. పొరి ప్పు మోనై, ఒరూ మొనై ఇణై యెదుగై మున్నగు తమిళ సాహిత్యమందలి యతి విభేదాల కుదాహరణ ప్రాయములైన పాటలు తెలుగులో ఉన్నా వాటి నతిక్రమించినవికూడా అంతకంటె ఎక్కువ సంఖ్యలో ఉన్నాయి. కాబట్టి తమిళంలో యతి యొక్క ఐచ్ఛికత్వం నన్నయగారికి పూర్వపు దేశికవిత్వంలో చోటుచేసికుని ఉంటే ఉండవచ్చు.

ప్రాసలేని పద్యాలంటే యతి లేని పద్యాలనే అర్థం. నిజానికి యతికూడ ప్రాసలాగా ఉపయోగించడ ముంది. రెండు చరణాలను ఒక చరణంగా వ్రాస్తే ప్రాస అనేది ప్రాస యతిగా మారిపోతుంది. "అసలు ప్రాస యతి రెండు చరణముల నొక పాదముగా మార్చుటయన్న సంప్రదాయము చొప్పున బుట్టినదే" అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు. సీసమూ, తేటగీతి, ఆటవెలదీ మొదలైన వాటికి ప్రాస నియమం లేనందువల్ల ఒకప్పుడు యతి నియమం కూడా లేదనీ తరువాత ఏర్పడిందనీ తెలుస్తున్నది.

తెలుగు పద్యాల సంప్రదాయం విలక్షణమూ, అర్వాచీనమూ. "తెలుగునకంటె కన్నడ కవితయు, దానికంటె అరవ కవితయు, దానికంటె సంస్కృత ప్రాకృత కవితయుఁ బ్రాచీనములనుట సత్యమని అంగీకరింపవలసినదే" అని శ్రీ వేటూరి వారే అన్నారు. అయితే వారనిన కవిత ఆనాటి దేశీయవాఙ్మయానికి సంబంధించినట్లు కన్పించదు. యతి ప్రాసల సంప్రదాయం అధునాతనం. ప్రాస అసలు సంస్కృతంలో లేదు. యతి సంస్కృతంలో నుంచే వచ్చిందీ అంటే అది పదవిరామయతి. అది తెలుగులో ఐచ్ఛికంగా వుంది. తమిళంనుండే యతి ప్రవేశించిందీ అంటే తమిళ పద్ధతిలాగ ఐచ్ఛికం కాదు. పోనీ కన్నడమే మూలమంటే ప్రాస నికరంగా వుండి యతి ఐచ్ఛికంగా వుండడమనేది లేదు. కాబట్టి సంస్కృత వాసన తగలని రోజుల్లో తమిళ కన్నడాలలో యతిప్రాసల గొడవ బయలుదేరినకాలంలో, తెలు భాష కొక చక్కని వ్యవస్థ ఏర్పడని దినములలో తెలుగుదేశంలో తెలుగువారు పాడుకునే పాటల్లో యతిప్రాసలు లేవు.

కాబట్టి యతి ఉన్న పద్యాలు తెలుగు లక్షణం గలవీ, యతి లేనివి కన్నడ సంప్రదాయంలోనివీ అని అనుకోనక్కఱలేదు. ఆ మాటకొస్తే సరూపాక్షరయతి, ప్రాస, ఉన్న పద్యాలు విచ్ఛేదయతి లేని పద్యాలు సంస్కృతంలో వున్నాయి.

1. తదను జ్వలనం మదర్పితం
త్వరయే ద్దక్షిణ వాతవీజనైః.

2. పరలోక విధౌచ మాధవ
స్మర ముద్దిశ్య విలోల పల్లవాః.

[కుమారసమ్భవమ్]

అసలు సంస్కృతంలోనే యతిని [పదవిరామాన్ని] ఇష్టపడని లక్షణ కర్తలూ, పాటించని కవులూ ఉన్నారు.

"వాంఛంతి యతిం పింగళ
వశిష్ఠ కౌండిన్య కపిల కంబల మునయః
నేచ్ఛంతి భరత కోలాహం
మాండవ్యా శ్వతర సైతవ వాద్యాః కేచిత్."

అని జయకీర్తి ఛందోనుశాసనంలో చెప్పబడినట్లుగా శ్రే సంచత్కుసూరగారు వ్రాశారు. అయితే పద విరామాన్ని నిరసించినవారు సరూపాక్షరాన్ని ఆదరించవలసిన పనిలేదుకదా! కాని ఈ ఉదాహరణాలు చూడండి.

1. లభేచ్ఛ సికతాసు తైలమపి
యత్నతః పీడయన్ [పృథ్వీ—భర్తృహరి]

2. భావం శృంగార సారస్వతమయ జయదేవస్య
విష్వగ్వచాంసి— [స్రగ్ధర—జయదేవుడు]

3. యావ్నా దైన్యపరాచ్ఛియస్యకలహో
యంతే మిథస్త్వంవ్రణు.
[శార్దూలం—మురారి]

యతినిచ్ఛయించని వారిని ఉదహరిస్తూ గంగాదాసు తన ఛందోమంజరిలో పై పాదాల్ని ఉదహరించాడట. ఇందులో విరామం రావలసినచోట్లలో అక్షర మైత్రి వచ్చింది.

దేశికవిత్వంలో యతి లేకపోవడం ఎలా నియమం కాదో వీటిల్లో సరూపాక్షర యతి రావడంకూడా అలాగే నియమం కాదు. అంటే ఇలాటిది ఆయా కవుల స్వేచ్ఛకే నిదర్శనం. కాని నియమానికి కాదన్నమాట. కేవలం యాదృచ్ఛికం. లేదా తెలుగు కంటే ముందే వ్యవస్థ సంతరించుకొన్న తమిళంలోని ఐచ్ఛికయతి ప్రభావం అయితే కావచ్చు.

అసలు యతినిగూర్చి ప్రాచీన లక్షణకర్తలు శ్రుతిసుభగత్వాన్నీ, గణాల లెక్కనూ దృష్టిలో పెట్టుకున్నారుతప్ప తాళప్రక్రియపట్ల శ్రద్ధ వహించినట్లు కాసరాదు. యతి అనేది తాళ నియమమని గ్రహిస్తే సరూపాక్షర విచ్ఛేదములు రెండూ ఐచ్ఛికములే అని తేటపడుతుంది. సంగీతాన్ని పాడేవారు తాళముయొక్క ఆవర్తనాన్ని దృష్టిలో ఉంచుకుని ఉసి చోట దెబ్బ, దెబ్బ చోట ఉసి వేయడం, అసలు దెబ్బనే వేయకుండడం, లేదా ఘాతకూఘాతకూ మధ్య మరొక విరుపుపై ఘాతవేయడం మొదలైన చమత్కారాలు చేస్తూవుంటారు. మంచి లయాధికారం గలవారు ఒకే పాటకు నానారకాల తాళగతులను సూచిస్తూ వుండడంకూడా కద్దు. ఈ గతులకు ఫలము శ్రుతిసుభగత్వమూ లేక పాండిత్య ప్రకర్ష. అయినా స్థలనియమంమాత్రం కాదు. లయగాను సారిత్వ వివక్షయే ముఖ్యం. యతి కూడా అంతే.

క్రీ. శ. 1022 ప్రాంతమునాటి కోరిమిల్లి శాసనంలోని రగడలు యతి విషయంలో ఎంత స్వేచ్ఛగా వున్నాయో మచ్చుకు కొన్ని పంక్తులు చూడండి.

1. తస్మై సమస్తజనతా విశేషగుణాయ
రైసుతర్పిత మహీదేవ దేవగణాయ
విప్రాన్వయాబ్ధి శశిభృత్ప్రతిచ్ఛందాయ
విద్వజ్ఞానాధిక విశ్రుతానందాయ

2. జన్మప్రభృతి గీత వేదాంత వేద్యాయ
సన్మనోవసతి వాస్తవ్యాత్మసత్వాయ
లంభిత గురుత్వ పరిలాలిత చరిత్రాయ
సంభిత మతి స్థగిత జీవ భృగు పుత్రాయ

3. సిద్ధనిజనాథకృత సేవితమనీషాయ
శుద్ధమతిదూషిత సమస్తజనదోషాయ
సంతతారాధిత నిజస్వామిపాదాయ
చింతితమనస్థసుఖదాభూతపాదాయ.

దేశిచ్ఛందం. సంస్కృతభాష. 28 పంక్తుల రగడలో 17 సార్లు సారూప్యయతి. కొన్నిచోట్ల విరామయతి. కొన్నిచరణాల్లో ప్రాస. కొన్నింట అంత్యప్రాస. కొన్నిపంక్తుల్లో పాదాద్యక్షర సామ్యం. అంతా నియమరహితంగా వుంది. ఇది దేశిచ్ఛందో రీతులు సంస్కృతభాషలోనికి వెళ్లే పరిణామానికి ఉదాహరణగా భావింపవచ్చు.

సంస్కృతభాషలో సంస్కృత ఛ్ఛందమే కొంత తమిళ కన్నడ తత్వాన్ని పులుముకొని తెలుగులోనికి వస్తున్న గుణగవిజయాదిత్యుని సాతలూరు శాసనంలోని ఈ చంపకమాలను చూడండి.

అరినృపవాజివారణ
పదాతి మహోగ్రభ విరామ మారుతః
వరకరికార సుస్థితసిభా
ప్రవినాశిత భానుసన్నిభః
గురుతర దీన భాగవత
మానస మానిత కల్పపాదపః
వరకరిగల్లభూమిప
భుజా సిరిహాజి భువిప్రభాసతే

ఇందులో పాదాంత విరతి సంస్కృతమర్యాద. ప్రాస కన్నడ సంప్రదాయం. పాదమధ్యమందు సరూపాక్షరయతివ్యవస్థ కలిగిన తెలుగుపద్య లక్షణం. లేదా తమిళంలోని ఐచ్ఛిక యతి ప్రభావం. పాదమధ్యమందు విచ్ఛేదంగాని సరూపాక్షరంగాని లేకపోవడం ప్రాచీన గేయ స్వభావం. జినవల్లభుని శాసనమూ, బాదపమహారాజు శాసనమూ ఈ కోవలోకే వస్తాయి.

జానపదుల పాటల్లో అక్కడక్కడ యాదృచ్ఛికంగా యతి పడినట్లే శాసనాల్లోని కొన్ని పద్యాల్లో క్వాచిత్కంగా యతిస్థలనమైంది. అంటే యతి వాడకపోవడమనే సహజస్థితినుండి వాడడమనే ముదురుస్థితి ఏర్పడిందన్నమాట. ఉదాహరణకోసం కొన్ని బంతులు చూడండి.

1. సోమలదేవి గుణారామ జగదేక
సున్దరి మత్తేభ మందగమన
[భీమేశ్వరాలయ శిలాశాసనం]

2. జితరిపుబేతమణ్డలికసంఘము
జేగిరి పశ్చిమంబునన్. [చేబ్రోలు.]

3. శ్రీ పవణతంబుచుట్టునుం
జేసొప్పం గంబహిడతీన సనుంగితిణ.
[పై శాసనమే]

4. ఇల నమరాద్రి నాథునకు
నల్ల మహీపతి కిద్ధకీర్తికిం... [కొణిదెన]

5. (ని)శ్చిమితవాణిగావున విశుద్ధ
యశోనిధి దనకావునను. [అమరావతి]

6. కొలము ప్రీతితోడ నివేద్యమిన (ని
ఘూ?)ని (చిమా?) నులకత్థణ మిచ్చె.
[పై శాసనమే]

7. విదిత సుభాను సంవత్సరమున. [బాపట్ల]

గేయ స్వాభావికములైన కేవల హల్సంబంధ యతులు శాసనాల్లో కనిపిస్తాయి. పై ఉదాహరణలలో 2, 5, 7 సంఖ్య గలవి అలాటివే. కావ్యాలలో ఇవి అంగీకరించబడలేదు. భారతి (ఫిబ్రవరి 1954) లో శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి గారు క్రీ. శ. 6 వ శతాబ్దినాటి మాలెపాడు వచన శాసనాన్ని గురించి కొన్నివిశేషాలు చెబుతూ వచనంలో

రగడ మిళితమైనట్లూ, అందు తాళానుకూలముగా పంచలఘుగణములు లేనట్లూ, పడిస్థానము 11 నుండి 14 మాత్రకు మారినట్లూ వ్రాస్తూ ఇలా అన్నారు. 'రగడలలో క్రమేణా యతిస్థానము ప్రాసస్థానముల నిర్బంధము లెక్కువైన పెరగక తప్పదు.' ఒక్క రగడలలోనేకాదు. ఈ నిర్బంధం అన్నిటికీ వర్తిస్తుంది. ప్రాక్నన్నయ యుగంలోని పద్యగర్భితంగా ఉన్న గద్యశాసనాల్ని గూర్చి శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు వ్రాశారు. 'అయితే కొన్నింట యతి ఉంటే ప్రాస ఉండదు. ప్రాస ఉంటే యతి ఉండదు' అని వాటిని గూర్చి శ్రీ ఆరుద్రగారన్నారు.

నన్నయగారు శాసనాల్లోని మధ్యాక్కర ననుసరించి యతి పాటిస్తే ఎఱ్ఱయ్యగారు కవిజనాశ్రయాన్ని అనుసరించి పాటించారు. నన్నయగారి మధ్యాక్కరలలోని కొన్నిపాదాలు లాక్షణికుల లక్షణాలకు విరుద్ధంగా ఉన్నవంటూ కొన్ని ఉదహరించి చూపారు శ్రీ గిడుగు సీతాపతిగారు.

కవులు తమ యిష్టాన్నిబట్టి యతిస్థానాన్ని ఒకచోటినుండి ఇంకొకచోటికి మార్చుకున్నారు. అలా మార్చుకోవడంతో ఒకే వృత్తాన్ని వేర్వేరు పేర్లతో పిలువడం మొదలుపెట్టారు. 15 వ ఛందంలో మణిగణనికరం అనే వృత్తానికి ఎనిమిదింట యతి. అదే వృత్తానికి ఆరింట యతి వేస్తే 'స్రజము' అని పేరు మారిపోయింది. ఇంకా ఇలాటివి ఎన్నో వున్నాయి. ఈ స్థితి సంస్కృతంలో కూడా ఉందన్నారు శ్రీ సంపత్కుమార గారు.

మొత్తముమీద యతి అనేది మొదటలేదు. తరువాత క్రమంగా యాదృచ్ఛికమై, వివిధ రూపములుగా మారి, పిమ్మట ఐచ్ఛికమై, ఆవెనుక ఆలంకారికమై, ఆవెనుక నియతమై, అనంతరం అభిప్రాయ భేదాలకు గురియై, తదుపరి మళ్లీ అనియతమై, తదనంతరం అనిబద్ధమై, వచనకవిత్వావిర్భావంతో తిరిగి పూర్వస్థితికి వచ్చింది. ఈ అవస్థా భేదాలన్నింటినీ కాలవివక్షతో చర్చించడం ఆవశ్యకమే.

---



# పగిలిన అద్దం

శ్రీ అగ్నిపర్వత చక్రవర్తి

పరచుకున్న జీవితంమీద
నడుస్తున్న క్షణాలు కదిపే వ్రణాలు
పీలికల పరువుని కౌగిలించుకుని
కరుస్తున్న కురుపులు.

మెదడులో నోట్లో చెవిలో రంధ్రాలలో
హోరెత్తిస్తున్న అరుపులు.

ఇప్పుడిప్పుడు కాలంమీదినుండి
గెంతడం నేర్చుకుంటున్నాను.

పెదవుల బాణాలు విశాలమైన దేహాన్ని
నంజుకుంటూ కోడిపుంజులా కొక్కొక్కో
కోరికల రాకెట్లు దూస్తాను.

రహస్యం తెర దూసుకువచ్చే దోమలతో
దోస్తీ చేస్తాను.

చినిగిపోయిన వల కంతల్లోంచి తల ఎత్తి
చూస్తున్న చేపలు నా కనుపాపలు.

ప్రతి యింటి ఒక్కొక్క గోడకి
వెయ్యి చెవులు వెయ్యి కళ్లు మొలిపిస్తాను.
రహస్యం గుహలో ఆటం పేల్చేస్తాను.

కంచుకాగడా వెలుగులో వెతుకు
పొంచున్న బాకులు కనిపించు.

వెర్రిచెట్లు నాడుల వ్రేళ్లని ప్రాకుతున్నయ్

పగిలిపోయిన అద్దంలో
జీర్ణించిపోయిన అందం చూసుకున్నాను.
ఆశల అవకాశాలు ఘూర్ణిస్తున్నాయి.

వెన్నెల్లో పారేసుకున్న
వెన్నపూసకోసం
వెతుక్కుంటున్నాను.
వెక్కిరించకండెవరూ నన్ను
లేక
ఎక్కిళ్ళతో ఏడ్పులతో
నన్నోదార్చవలిసిన పనిలేదు.

కిటికీరెక్క నా పక్క చూసి
పకపకా నవ్వినట్లుంది.

ఏదో పిచ్చిలో ప్రపంచంలోని ప్రతి
అణువునీ విచ్ఛిత్తి చేస్తాను.

ఈ ప్రపంచం ప్రతి ప్రాణికీ హోస్ట్ కాదా
అందరం కలిసి తనివితీరా బ్రెడ్ టోస్ట్ తిందాం
గొంతు చించుకుని ప్రతి మనిషీ ఒక హోస్ట్ అందాం.

తెల్లని చేతిరుమాలు మీద
చల్లని నెత్తురు సంతకం చేసింది.

నిద్రపోతున్న పంది అప్పుడప్పుడూ
గురకపెట్టడంలేదు.

మల్లెపూల విచ్ఛిత్తిలో ఎగసిన
గుబాళింపు పొగలా
ఆవరించిన ఆలోచన మబ్బులో
కత్తులు నాట్యం చేస్తున్నయ్.

తీగలు తీరికగా సాగును
ఈగలు ఈపురోమని ఈదును.

గాలిలో చీలిపోయిన ఆకారాల నరాల హాహాకారాలు
నీకు వినబడుతున్నయ్యా.....ఓ అయ్యా....
ఇవి గాజుముక్కలు ఏరబోతే గుచ్చుకుంటాయి.

---

# గుడిమెళ్లం సూర్యదేవాలయం

శ్రీ టి. ఏ. జి. శాస్త్రి



హిందూదేశంలో సూర్య దేవాలయములు అరుదు [illegible]. అనే ఒక వాడుక వున్నది. దీనిని పరిశోధన దృష్ట్యా చూస్తే ఒకప్పుడు దేశమంతా సౌరమతం వుండేదా అని అనిపిస్తుంది. అయితే చారిత్రాత్మకంగా చూస్తే సంప్రదాయపరంగా సూర్యుని ఆరాధించిన రాజులు ఎక్కువగా కనుపించరు. కాని పశ్చిమ హిందూ దేశంలో సౌరాష్ట్రం అనబడే భూభాగంలో ఇప్పటికి కూడా ప్రతి కుటుంబంలో సూర్యుని పేరు ఏదో విధంగా కనుపిస్తుంది. బహుశః సూర్యుని రాష్ట్రం సౌరాష్ట్రం కావచ్చు. ఇదీకాక సూర్య దేవాలయాల సంఖ్య యిక్కడ ఎక్కువ.1 దీనికి ఒక కారణం కనుపిస్తుంది. క్రీస్తుకు పూర్వం 5 వ శతాబ్దంలో పశ్చిమదేశమంతా 'డెరియస్' అను 'పర్షియన్' రాజుకు వశమయింది.2 వీని కాలంలో 'మాగస్' అనే తెగ 'మిత్ర' లేక సూర్య ఆరాధన ప్రవేశ పెట్టిందని ప్రతీతి.3 ఇందువల్లనే ఈ భూభాగంలో సూర్య దేవాలయాలు ఎక్కువగా వున్నవని చెప్పుకోడానికి వీలుంది. స్వర్ణయుగారంభకులగు గుప్తరాజుల కాలంలో లాడ్‌దేశం (గుజరాత్‌లోని బ్రోచ్‌ప్రాంతం) నుంచి పట్టుసాలీల సంస్థ ఒకటి రాజస్థాన్‌లోని 'దశపుర'రాష్ట్రం వెళ్లి అక్కడ 'మాండసోర్' ప్రాంతంలో ఒక అద్భుతమైన దేవాలయం 'దీప్తరశ్మి' దేవునకు స్థాపించింది.4

గుజరాత్‌లోని ముఖ్యమైన ఆరు సూర్య దేవాలయములలో 'మొఢేరా' దేవాలయం మొదటిది. ఇది సోలంకిరాజు భీమదేవుడు క్రీ. శ. 1026 లో కట్టించినట్టుగా ఒక రాతి ఫలకంమీద గర్భాలయంలో

---

1. శాస్త్రి టి. వి. జి. "Sun Temples in Western India."

Oriental Art. Vol. VII. 2. 1962.

దీనిలో యించుమించు 40 దేవాలయముల వరకూ గుర్తింపబడ్డాయి.

2. విల్ డ్యూరేంట్. "Our Oriental Heritage" పే 381; 1012.

3. సంకాలియా. హెచ్. డి. "The Archaeology of Gujarat" పే 212.

4. సంకాలియా చూడుడు. పే. 212.

చెక్కబడివుంది. దీని శిఖరం మహమ్మదీయులు దండయాత్ర జరుపగా ఫిరంగిగుండ్లబారుకు పడిపోయినదని 'బర్జస్'దొర వ్రాశాడు.[5]

పశ్చిమ పాకిస్థాన్‌లోని 'మూల్తాన్' సూర్యదేవాలయం ముఖ్యమైనదిగా చైనా యాత్రికుడు 'హ్యుయన్‌త్సాంగ్' వ్రాసినట్లుగా తెలుస్తోంది.[6] కాశ్మీరులో నశిపోయిన 'మార్తాండ' దేవాలయం (క్రీ. శ 9 వ శతాబ్దం)[7]పు చిహ్నములు యిప్పటికీ చూడదగిన దృశ్యాలలో ఒకటి. ఇదికాక ఒరియా దేశంలోని 'కోణార్క' దేవాలయం నృసింహదేవ గంగరాజు (క్రీ. శ. 1026) యొక్క ప్రతిభను ఊహకు అందరాని ఎత్తులలోవున్న సూర్య, రథ, అశ్వాది శిల్పాలలో గోచరిస్తుంది.

ఇంకా ఎన్నెన్నో దేవాలయాలు కాలగర్భంలో పరిశోధనకు అందకుండా జీర్ణించిపోయాయి. ఇవన్నీ సూర్యభగవానుడి ఆరాధనకు వినియోగింపబడ్డాయని తెలుస్తోంది! కాని, మతదృష్ట్యా శివ వైష్ణవాది మతములకున్న ప్రాధాన్యం సౌరమతమునకు లేదని మన కందరకూ తెలిసిన విషయం.

ఇక ఆంధ్రదేశానికి వస్తే 'అరసవిల్లి' సూర్యదేవాలయం ప్రసిద్ధి గాంచినది. శ్రీ రామేశంగారు వ్రాసినట్లు[8] జీర్ణోద్ధరణ అనే పేరులో మూలవిగ్రహములో మార్పులూ, ఇదికాక కొన్ని చిల్లరదేవుళ్లను స్థాపన చేయడంవల్ల మూలవిరాట్ అసలు స్వరూపమునకు మార్పులు గలిగినట్లుగా గోచరిస్తుంది. ఇది అసలు సూర్య దేవాలయమే కావచ్చు.[9] కాని తర్వాత మార్పులలో సూర్య నారాయణగా వ్యవహరించబడ్డట్లు కనుపిస్తుంది.

గుడిమెళ్లంలోని సూర్య దేవాలయం కూడా ఎంతో పురాతనమైనదని పరిశోధనలవలన తెలుస్తోంది. ఇది కాళహస్తికి 13 మైళ్ల వుంటుంది. ఈ గ్రామంలో ముఖ్యమైనది పరశురామేశ్వరుని ఆలయం. ఈ దేవాలయావరణంలో చిన్నచిన్న దేవాలయములు మూడున్నవి. వాటిని సుబ్రహ్మణ్య, ఆనందవల్లి, సూర్య దేవాలయాలంటారు. వీనిలో ఎక్కువగా శిథిలావస్థలో నున్నది సూర్య దేవాలయమే.

ఈ ఆలయంలోని సూర్యవిగ్రహం[10] ఒక రాతి పీటమీద నుంచోబెట్టినట్లుగా కనుపిస్తుంది. శిరస్సు వెనుక గోళాకారంలో ఒక ప్రభామండలం వుంది. ముఖం బుంగగావుండి తపోనిష్ఠలో వున్నట్లుంటుంది. విశాలమైన కళ్లు, దళసరి పెదవులు. భారమైన సర్పకుండలధారణవల్ల చెవులు జారి కంతలు ఏర్పడ్డట్లుంటాయి. మెడచుట్టునూ ఫలకహారం ఒకటి అమర్చబడివుంది. ఉరమున వెడల్పైన యజ్ఞోపవీతం ఎడమనుంచి కుడికిగా వుంది.

శిల్పశాస్త్రరీత్యా సూర్యునకు కనుపించు లక్షణములు రెండు పద్మపుమొగ్గలు. ఇవి రెండునూ ముడిచిన ముంజేతులతో పైకెత్తి చూపిస్తున్నట్లుంటుంది. ఇదికాక స్థపతుల సాంప్రదాయాన్ని సూచించేవి, కటిసూత్రం, అంతరీయం. కటిసూత్రం ఇరు ప్రక్కలా రెండు ముళ్లు వేసినట్లుంటుంది. నాభికి క్రిందుగా ఒక త్రాడు ఒంపుబడ్డట్లుగా చెక్కబడి వుంది. క్రింది వస్త్రం అంటే 'అంతరీయం' మామూలుగా పంచకశ్యం అనే పద్ధతిలోవుండి వూరువులు వస్త్రంలోంచి కనుపించేటట్లుగా సూచించబడుతోంది. వస్త్రం బయటకు ఎక్కువగావుండి శరీరం క్రిందు భాగము కనుపించడంవలన, ఎక్కువ వొదులుగా కట్టుబడినట్లు తెలుస్తుంది. వెడల్పైన కటిసూత్రం మధ్యన బొడ్డువద్ద, లతలూ తీగెలువలె ఒక డిజైన్ చెక్కబడివుంది.

శరీరం పైభాగమున వస్త్రము లేమియూ లేకపోయినప్పటికీ మంచి సంపత్తిగలదేముడనిగాని లేక

---

5. బర్జస్. "Architectural Antiquities of North Gujarat" పే. 72.

6. సచవ్. 'Alberuni's India" Vol I. పే. 116—117.

7. రామేశన్. ఎన్ ."Temples and legends of Andhra Pradesh" పే. 143.

8. రామేశన్ చూడుడు. పే. 147.

9. ఈ గ్రామం అసలు 'అర్కవిల్లి' అయితే అరసవిల్లిగా మారిందేమో.

10. పటము చూడుడు. (డైరెక్టర్ జనరల్, పురావస్తుశాఖ, న్యూఢిల్లీ సౌజన్యంతో.)

ఆనాటి సంపత్తుయొక్క లక్షణమనిగాని తెలియ జేస్తుంది. ఇదిగాక సంపత్సంభరితులగు రాజుల వస్త్రాభరణ అలంకరణ యిలా వుండేదా అని సూచిస్తుంది.

శ్రీ గోపీనాథరావుగారు చెప్పినపద్ధతిని, సూర్య విగ్రహమునకు రెండు చేతులలోనూ పద్మములుండి భుజమునకు మించకుండా వాటిని చెక్కవలెను.[11] ఈ పద్ధతి గుడిమెళ్లం సూర్య విగ్రహంలో కనుపిస్తుంది. ఇదికాక మామూలుగా సూర్య విగ్రహాలలో, ఏకచక్రం మీద కూర్చునిగాని, నుంచునిగానీ ఉన్నట్లుండ వలెను. ఏడు గుఱ్ఱములు సప్తమన అనూరుడు సారథ్యం చేస్తున్నట్లు చిత్రించివుండాలి. దేవున కిరువైపులా 'దండ' 'పింగళ' అను ద్వారపాలకులు, ఉష, ప్రత్యూష అను దేవతాస్త్రీలు విల్లంబులతో చీకటిని పారద్రోలుతున్నట్లుండవలెను. కొన్ని దేవాలయ ములలో సూర్యుడు తన భార్యలు, 'నిక్షుభ', 'ఛాయా', 'రాజ్ఞి', 'సువర్ణా' 'సువర్చస'లతో వుంటాడు. గుడిమెళ్లంలోని సూర్యునకు పద్మం మొగ్గలుతప్ప ఏమియూ కనుపించవు. ఇందుచేతనే ఎంతో పురాతనమైన విగ్రహమని వూహించ డానికి వీలుంది.[12]

పైన ఉదహరించిన లక్షణములన్నీ క్రీ. శ 10—12 వ శతాబ్దములలో నిర్మించబడిన సూర్య దేవాలయములలో ఎక్కువగా కనుపిస్తవి.[13] ఇందు చేత గుడిమళ్లంలోని సూర్యవిగ్రహం క్రీ. శ 10 వ శతాబ్దమునకు ముందటిదని తెలుస్తోంది.

ఇంకా యిది ఏనాటిది అని నిశితంగా ఆలో చించిచూస్తే, గుడిమెళ్లం విగ్రహ లక్షణాలు నాగా ర్జునకొండలోని యిక్ష్వాకులనాటి కార్తికేయస్వామిలో కనిపిస్తవి.[14] ఇవి ఎక్కువగా కటిసూత్రం అంతరీ యంలో కనిపిస్తవి. (క్రీ. శ. 4 వ శతాబ్దం). ఇదే పద్ధతి దుస్తులు బెజవాడలోని మొగల్రాజపురం గుహల్లోనూ, విడిగా కృష్ణానదీతీరమునన్న ద్వార పాలకునిలోనూ కనుపిస్తవి.[15] (క్రీ. శ. 6 వ శతాబ్దం). ఇదికాక మహాబలిపురంలోని మహిషాసురుని అంతరీయం, విడిగా పల్లవులు త్రవ్వించిన గుహ ల్లోని ద్వారపాలకులూ, (క్రీ. శ. 7 వ శతాబ్దం) యిదే పద్ధతిలో వుండటం గోచరిస్తుంది.[16] దీని ప్రకారం చూస్తే క్రీ. శ 4 వ శతాబ్దంనుంచి 7 వ శతాబ్దాంతమువరకూ శిల్పం ఒకే పద్ధతిలో స్థపతులు చెక్కినట్లుగా తెలుస్తుంది.

ఇక సూర్యవిగ్రహమును వదలి దేవాలయం పరిసరములు చూద్దాం. ఇక్కడ దేవాలయ మనుకునేచోట ప్రస్తుతం కనుపించేవి నాలుగు గోడలు గలిగిన గర్భ గృహం ఒక్కటే. దేవాలయ ప్రాంగణం చూస్తే దీనికి ముఖమండపం వంటిది వుండివుండాలి అనిపిస్తుంది. గర్భద్వారం రెండు ఏకాంశిరాళ్లను నుంచిపెట్టి (Door jambs) మీద లలాటఫలకం (Lintel) వుంచబడ్డది. చుట్టూనున్న ఇటుకలతో నిర్మించబడ్డ ఆలయం. మధ్యను యిటుకలతో గాలి లోపలికి రావడానికి కిటికీలాటి (Trellis) ది అమర్చబడివుంది. పైన కప్పు వుండేదిగాని కొంత పడిపోయింది. లలాట ఫలకమునకు దూరముగా యిరుప్రక్కలా 'కపోతములు' విమానం (శిఖరం) వున్నట్లుగా సూచిస్తుంది.

వాస్తుశాస్త్రరీత్యా (Architecture) ముఖ్య మైన పరశురామేశ్వరుని ఆలయమునకూ, మిగతా మూడు ఆలయముల విమానములకూ, ఏవో కొద్ది మార్పు లున్నప్పటికీ, ముఖ్యంగా గవాక్షములుగా కను

11. శ్రీ గోపీనాథరావుగారు, అంశుమ భేదాగమం, సుప్రభేదాగమం, శిల్పరత్న, బృహత్సంహిత, విశ్వకర్మశాస్త్రం, విష్ణుధర్మోత్తరం, పూర్వకారణాగమం, రూపకుండనం, అగ్నిపురాణంలోవున్న సూర్యునియొక్క శిల్పలక్షణాలన్నీ క్రోఢీకరించి వ్రాశారు.

గోపీనాథరావు Vol. I. Pt II. పే. 83—92. చూడుడు.

12. ఎక్కువ పురాతనమైన విగ్రహాలలో తక్కువ లక్షణములు చిత్రింపబడ్డాయి.

13. శాస్త్రి టి. వి. జి. పేజి 3 చూడుడు.

14. Indian Archaeology-a Review—1956—57 P.L VII—C.

15. శివరామమూర్తి. సి. Bulletin of Madras Govt. Musem Vol. VII 2. Pl. III, V.

16. గోపీనాథరావు, చూడుడు ప్లేటు C. V.

పించు 'కూడు' పద్ధతి నాల్గువైపులా అన్నిట్లల్లోనూ కనుపిస్తుంది. ఈ విమానములు ఎక్కువగా చోళ సంప్రదాయాన్ని సూచిస్తవి. పుదుచ్చేరిలోని చోళ శివాలయములు ఇదే పద్ధతిలో వున్నాయి.[17] (క్రీ. శ 9 వ శతాబ్దం. ఆంధ్రదేశంలో చోళ సాంప్రదాయాన్ని సూచించే విమానము ద్రాక్షారామములోని భీమేశ్వరా లయమున కున్నది. దీనినిబట్టి గుడిమెళ్లంలోని సూర్యదేవాలయపు విమానంకూడా చోళ సాంప్రదాయ మేనని చెప్పకోవచ్చు.

గుడిమెళ్లం సూర్యదేవాలయం చర్చవల్ల తేలిన విషయములు (1) సూర్యవిగ్రహం క్రీ. శ 4—7 శతాబ్దములకు మధ్యన ఎప్పుడో స్థాపన చేసియుండ వలెను. (2) దేవాలయ విమానం క్రీ. శ 9 వ శతాబ్దంలో చోళ సంప్రదాయ పద్ధతిని కట్టబడినది. అందుచేత మూలవిగ్రహం స్థాపించినతర్వాత ఆలయం జీర్ణించిపోగా క్రీ. శ. 9 వ శతాబ్దంలో పునరుద్ధ రణం జరిగివుండాలని తేలుతున్నది.

ఆంధ్రదేశంలో క్రీ. శ 4 –7 శతాబ్దములలో ఏ రాజులు సూర్యుణ్ణి ఆరాధించారు అన్న ప్రశ్నకి మనస్సుకు వెంటనే స్ఫురించేది శాలంకాయనులు.[18] వీరు వేంగి మండలాన్ని క్రీ. శ. 4 వ శతాబ్దం ఆఖరున 5 వ శతాబ్దం మొదట్లో పరిపాలించారు. వీరికి "చిత్రరథస్వామి పాదానుధ్యాయితః" అనే బిరుదు వున్నదని శాసనములవలన తెలుస్తోంది. సూర్యునకు 'చిత్రరథు'డను పేరు నిఘంటువులో వున్నది. శాలం కాయనులు ఆంధ్రదేశమున కుత్తరమున ఆరసవిల్లి నుంచి, దక్షిణమున గుడిమెళ్లంవరకూ రాజ్యంచేశారా లనే సందేహం గోచరిస్తూంది.

సూర్యుని ప్రత్యేకత ఏమిటన్న ప్రశ్నకు వేద కాలంనాటినుంచీ మనకు సూర్యుడు ప్రధానమైన దేవత. నిరుక్తంలో సావిత్రిని సంబోధించి చెప్పిన పది 'ఋక్కులూ' సూర్యునకు చెందినవే. రామాయ ణంలో అగస్త్యుడు శ్రీరామునకు సంగ్రామమునకు ముందు 'ఆదిత్య హృదయం' జపించమని బోధించాడు. భవిష్యత్పురాణంలో శ్రీకృష్ణుని కొడుకు సాంబునకు సూర్యారాధనవలన కుష్ఠురోగనివారణమైనట్లుగా చెప్ప యున్నది. సంస్కృత నాటకం మాలతీమాధవంలో సూత్రధారుడు సూర్యుణ్ణి ఆరాధిస్తే పాపరహితమైన కీర్తి నార్జించవచ్చునని చెబుతాడు. ఇదిగాక హిందూదేశంలో హిందువనుకున్న ప్రతి మానవుడూ సూర్యోదయ సమ యములో సూర్యుణ్ణి ఆయురారోగ్య ఐశ్వర్యములకు ధ్యానించక తప్పదు.

"భానోభాస్కర మార్తాండ చండరశ్మే దివాకర
ఆయురారోగ్యమైశ్వర్యం పుత్రమిచ్ఛామిదేహిమే."

---

17. నీలకంఠశాస్త్రి "The Cholas" Pl. II.

18. డా. సుబ్రహ్మణ్యం. ఆర్. Sun worship and Temples of Surya in Andhra. "Aradhana" పే. 35.



# కేయూర బాహు చరిత్ర

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారీనడుమ ప్రాచీనాంధ్ర సాహిత్య గ్రంధాలను చౌకధరలలో నందించు ప్రణాళికలో కొన్ని గ్రంథములు ప్రకటించారు[1]. కేయూరబాహు చరిత్ర వానిలో నొకటి— ప్రతి గ్రంథమునకు మూలముతోపాటు ఒక విపులపీఠిక యున్నది[2]. అయితే ప్రస్తుతము కేయూరబాహు చరిత్రమునకు సంబంధించి లోకమునకు వెల్లడి కాదగిన విశేషములు ఇంకను యుండుటచే, వాని నిందు మూలముగా తెలుపుచున్నాను.

### ముద్రితాముద్రిత ప్రతులు

"పాఠాంతరములు" అను శీర్షిక క్రింద యిట్లున్నది. "కేయూర బాహు చరిత్రమునకు రెండు ముద్రిత ప్రతులును ఒక వ్రాత ప్రతిమాత్రమే యింత వఱకు లభించినవి. ముద్రితములలో నొకటి 1902 వ సం॥ సరస్వతీ పత్రికానుబంధముగ కీ. శే. కొచ్చెర్లకోట వెంకటకృష్ణారావుగారు ప్రకటించిరి. రెండవది 1962 లో శ్రీ తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారు పరిష్కరింపగా సారస్వత కుటీరము వారు ప్రకటించినది. మూడవదగు వ్రాతప్రతి మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందున్నట్టిది—" (పీఠిక—32 పుట)

పీఠికా కర్తలు వ్రాత ప్రతి యొక్కటి యున్న దని వ్రాసిరేకాని దాని వివరము తీయలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారముననున్న వ్రాతప్రతి కాగితపు ప్రతిగాని తాళపత్ర ప్రతికాదు. ఈ విషయము స్పష్టపఱచుటకు భాండాగారమువారి గ్రంథ వివరణాత్మక సూచిక— ప్రథమ సంపుటమునుండి యుదాహరించుచున్నాను[3].

"R. No. 45 Paper 8 × 6¼ inches. Folio 230 lines 20 in a page. Telugu good. Presented by K. R. V. Krishna Rao Bahadur in 1911—12"

ఈ సంపుటమున 62 వ పుటనుండి 142 వ పుటవఱకు కేయూరబాహుచరిత్ర గలదు.

దీనినిబట్టి మదరాసులోనున్న కేయూరబాహు చరిత్ర వ్రాతప్రతి కాగితపు ప్రతియే యనుట నిశ్చితము. ఇదియ్యెనను నీ గ్రంథము మొదట ముద్రించిన శ్రీ కొచ్చర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావు గారిచ్చినదే కావున—వారు ముద్రణకొఱకు వ్రాయించిన వ్రాతప్రతి యగుటయు నిశ్చితమే.

కేయూరబాహుచరిత్రమున కీ వ్రాతప్రతియే గాక తాళపత్రప్రతికూడ గలదు. అది తంజావూరి పుస్తకశాలలో గలదు. అందున్నది ఏకైక ప్రతియే. దాని వివరము లివి.

---

1. ప్రాచీన సాహిత్యమును చౌకధరలలో నందించు ప్రణాళిక కార్యులు ఆంధ్రపత్రికాధ్యక్షులు శ్రీ శంభుప్రసాదుగారే యని చెప్పవలసియున్నది. వారు పదిహేనేండ్లకు పూర్వమే మహాభారతమువందలి ఉద్యోగపర్వమును ప్రత్యేకముగ ముద్రించి రూపాయి వెలపెట్టి యింతకంటె స్వల్పధరకల దానిని విక్రయింప జూచిరి. కాని ఆ ప్రణాళిక జయప్రదముకాలేదు. అది సాగియుండిన మహాభారతమంతయు మనకు పది రూపాయలలో లభించియుండెడిది.

2. పీఠికాకర్త— పరిష్కర్త శ్రీ గడియారము రామకృష్ణశర్మ.

3. A Triennial Catalogue of Telugu MSS.

Vol. I. 1911—13. Page 128. ఇం దీ గ్రంథమును గూర్చిన వివరణ 130—137 పుటలలో నున్నది.

157. కేయూరబాహు చరిత్రము—(మంచన)
M. 231. 17 × 1½ 62-1 40 సమగ్రము[4].

నన్నిచోడని కుమార సంభవము, కేతన దశకుమార చరిత్రము, మంచన కేయూరబాహు చరిత్రము మొదలగు ప్రాచీన కావ్యములను, పరిష్కరించి ప్రకటించినప్పుడు, కాగితపు ప్రతులకు మూలమగు తాళపత్ర ప్రతులను, పరిశీలించుట యత్యంతావశ్యకము. అట్టిపరిశీలనమువలన క్రొత్త విషయములెన్నో తెలియనగును.

(1) తాళపత్ర ప్రతిలో నవతారికలో నీ క్రింది పద్యము గలదు.

"సొమ్ములలో ముప్పొర్పు జ
గమ్మెల్లను సోడుముట్టఁగఁజేయును శ్లా
ఘ్యమ్మగు వస్తువు నగుటను
గమ్మని కనకంబుగాదె కవితదలంపన్.

ఈ పద్యము—ప్రథమ ద్వితీయ ముద్రణములలో లేదు. ప్రస్తుత ముద్రణమున పుట యడుగున (2 వ పుట) నీయబడియున్నది. కాని యట్లు ముద్రించుట సరికాదు. అది—"వననిధి తటాక" అను 9 వ పద్యము తరువాతను—"కావున నాకు వాక్కృతిగైకొన" అను పద్యమునకు ముందునను యుండవలెను. అప్పుడు "వననిధి తటాక" అనునది 9 వ పద్యముగను "సొమ్ములలో ముప్పొర్పు" అనునది 10 వ పద్యముగను "కావున నాకు వాక్కృతి" అనునది 11 వ పద్యముగను నుండును.

ఇంతేకాదు—కథా ప్రారంభమున, పురవర్ణనలో తాళపత్రప్రతిలో నున్న యీ క్రింది పద్యము, ప్రస్తుతము మూడు ముద్రణములలోను లేదు—

"హృదయము ఝల్లసిల్లఁ బురి
నింతలు మేడలనుండి పాడఁగా
నదివిని గ్రోలుచుం బరవ
శాత్మకయై స్వమృగంబు పెద్దయుం
గదలక యున్నఁ గుంటువడి కాదె మృ
గాంకుఁడు రేలు గొన్నిగా
న్నిదిథుల నభ్రవీథి కడ
నిల్చుఁ బ్రభాతము డాసినప్పుడున్—"

ఈ పద్యము— "అనిశము మీఁదట నెమ్మలఁగు" అన్న 54 వ పద్యము తరువాతను - "కలిత కపోల సాంద్రతర గంధ" అన్న 55 పద్యమునకు ముందును నుండవలెను. అప్పుడీ పద్యము 55 వ పద్యముగను, "కలితకపోల" అన్న 55 వ పద్యము 56 వ పద్యముగాను మారును. ఇట్లే ప్రథమాశ్వాసమునందలి పద్య సంఖ్య 79 గాక 81 యగును.

I

| పాఠభేదములు — ముద్రణ | వ్రాత ప్రతి (తాళపత్రప్రతి) |
|---|---|
| 1—24 సీ. పా. బలవేగరేఖ నల్వది వేలతురగంబులు. | బలవేగరేఖలఁ బదివేల తురగంబులు. |
| 26 సీ. పా. గురుదుర్తి పురమునఁ గ్రొత్తచర్ల | గుడధాత్రి పురమునఁ గ్రొత్తచర్ల. |

ఇచట 'గుడధాత్రి పురమున' అను నదియే సరియగు పాఠము. 'గుడధాత్రి పురము' అనగా బెల్లం కొండ'

| | |
|---|---|
| 1—35 వసుమతీదేవి కెన యనవచ్చు. | వసుమతీదేవి కెత్తొర వచ్చు |
| 1—51 అనిశము........చల్లని పట్ల విశ్రమించెనో యన. | చల్లని పట్లఁ గాక యిచ్చెనోయన |

4. A descriptive Catalogue of Telugu Manuscripts, Tanjore, Saraswati Mahal Library, Page 34.

## II

క. పా.

| | | |
|---|---|---|
| 41 | చతురికకథ వినవె యిట్టిచందము తెలియన్. | చతురిక కథ వినిన యిట్టి చందము తెలియున్. |
| | | వ. అక్కథ యెట్లనిన. |

క. పా.

| | | |
|---|---|---|
| 109 | నొలుకు నకారణ విరోధమొందు జనుల చెయ్వుల మొలచును మధుబిందు కలహముల చందమునన్ | నొలుకు నకారణమ మదము నూదు జనుల మొలుచును మధుబిందు కలహమును బోలెడినిన్ |
| | | వ. అక్కథ యెట్లంటేని. |

ఉ. పా.

| | | |
|---|---|---|
| 113 | తేనియకుండ మోచికొని దిక్కులు నాలుగు బిక్కచూడ్కి నే దేనియు | తేనియకుండ మోచికొని దిక్కులు సర్వము బ్రాతిచేసి యే మేనియు. |

## III

గీ. పా.

| | | |
|---|---|---|
| 74 | బోవుటయు జిచ్చువడి ముండపులుగు లకట మోసపుచ్చిర నన్నని డాసి బోయ | బోవుటయు జిచ్చువడియుండ పులుగు లకట మోసపుచ్చినవని బోయ డాసి వచ్చి. |

మ. పా.

| | | |
|---|---|---|
| 129 | కుపితత్వంబున గ్రమింగినన్ జనగ నీకుం గ్రమ్మఱం గల్గునే. | కుపితత్వంబున గ్రమింగనైతి జన నీకుం గమ్మిగావించితిన్— |
| 205 | క. ఇలఁ బురమును దేశంబున్ వెలువడఁ ద్రోపించుటయును వెలఁదుల్ | ఇలఁబురమును దేశంబున్ వెలువడఁ ద్రోపించుటయును నెలఁతుల్— |

ఇచట పుట 67 లో యడుగున నిట్లు కలదు—

నెలఁతుక (క—గ) (యతి భంగము.)

గాత్రప్రతిలో నముద్రితములలో 'నెలఁతుక' యని యుండగా యతి భంగమని పరిష్కర్తలు 'వెలఁదుక' ని మార్చిరి. కాని యిచట యతి భంగము లేదు—

ఇలఁబురమును దేశంబు
న్వెలువడఁ ద్రోపించుటయును నెలఁతుక''

ని ముద్రించిన యతి సరిపోవును—''పూజింప వావి కెల్లన్ రాజుట యొక కవ్వ యిట్టి నగవులుగలవే'' ని యీ యతిని నుంచన వాడినాడు 3—25

| | | |
|---|---|---|
| 311 | అనుజా....... క<br>న్గాని కన్నీరునం బాదముల్ గడిగి<br>న న్మోదంబులతో నెత్తి—<br>ఇచట యతి భంగము— | అనుజాగారము...... క<br>న్గాని కన్నీరునం బాదముల్<br>గడిగి సన్మోదంబుతో<br>నెత్తి. |

## IV

| | | |
|---|---|---|
| 67 | క. చంచులు దెఱచుచు నఱవంగ<br>నించుక కృపలేక పట్టు పేర్పడగని కో<br>పించుచు, రోదించుచుం బల<br>వించుచు నాతనికిఁ జిలుక వెలఁది<br>యిటులనున్. | క. చంచులు దెఱచుచు నఱవంగ<br>నించుక కృపలేక పట్టు పేర్పడగని కో<br>పించుచు నాతనికిందుకు<br>అంచనిడుదునని చిలుక వెలఁది<br>యిట్లనియెన్ |

ఇచట కథా సందర్భమునుబట్టి వ్రాత ప్రతిపాఠమే యుండవలెను. తన పిల్లలను, లంచమిచ్చియైన బోయ వాని బారినుండి తప్పించుట చిలుక యుద్దేశము—

---

ముద్రిత పాఠము

155.

"చుక్కల రాణి వాసములు చుట్టలను
గొల్వఁ గొలంకులెల్లఁ బే
రెక్కిన జోదు పూవిలుతుఁ డిష్టుఁడు
వెన్నెలపుల్గు లాశ్రితుల్
జక్కవదోయి తామరలు శత్రులుగా
విహరించు రాజు మి
న్నెక్కి మనోజతాప భరమెక్కి
వియోగులకెల్ల నత్తఱిన్

వ్రాత ప్రతి పాఠము

చుక్కలు రాణివాసములు; చుట్టలు
గల్వకొలంకు; లెల్లఁబే
రెక్కిన జోదు పూవిలుతుఁ డిష్టుఁడు,
వెన్నెలపుల్గు లాశ్రితుల్
జక్కవదోయి తామరలు శత్రులుగా
విహరించు రాజు మి
న్నెక్కె మనోజ తాపభరమెక్కె
వియోగులకెల్ల నత్తఱిన్.

ఇచట చంద్రవర్ణన—చంద్రుడు రాజేకావున నాతనికి రాజునకు సామాన్య ధర్మములు చెప్పబడినవి.

చుక్కలు—రాణివాస స్త్రీలు : రాజబంధువులు—కల్వ కొలనులు—అంతటా పేరెక్కిన భువనైక ధన్వి పుష్పాయుధుడు ఇష్టుడు. చకోరపకు లాశ్రితులు—చక్రవాకములు తామరలు శత్రువులు—

యతి గణ విషయమైన పాఠభేదములు రెండింటిని చూపుచున్నాను.

"మృగరాజేక్షణ లోచనావరణము
న్వేగంబుతోఁ బుచ్చుచున్" (3—238)

ఇచట వ్రాతప్రతిపాఠము

"మృగరాజేక్షణ లోచనావరణము
న్మోదంబుతోఁ బుచ్చుచున్"

ప్రస్తుత పరిష్కర్తలు - 'మోదంబుతో' అను పాఠము, పుటయడుగున (71 పుట) నిచ్చియు, నిచట యతి సరికాదనుకొని, 'వేగంబుతో' అను ముద్రిత పాఠమునే మూలముగా గ్రహించిరి—

ఈ మార్పు ప్రథమ ముద్రణమునందే జరిగినది. దానినే తక్కిన ముద్రణములు గ్రహించినవి. ఇచ్చట వ్రతువసుడికిని 'మృగ' ...'మోద' అని ఓకారమునకు యతి చెల్లదని అప్పటి పరిష్కర్తలు పాఠమును దిద్దిరి. కాని యిట్టి యతులు ప్రాచీనకవి సమ్మతములే—

'కర్తృత్వమున వెలింగి తోచుచుండు'—అని మడికి సింగన జ్ఞానవాసిష్ఠరామాయమున (3–12) నీ యతిని వాడియున్నాడు. వట్టువసుడికి—ఉ, ఊ, ఒ, ఓలతో యతిని ప్రాచీన కవులందఱును వాడియే యున్నారు. అప్పకవి యీ యతి నీయకపోవుటచే, నిట్టి మార్పుపాఠము లేర్పడినవి. ఈ యతి ప్రాచీన లాక్షణిక సమ్మతమని యీవఱకే నిరూపితమైనది. మంచనయు నీ యతి పాటించినాడు కాబట్టి 'వొదంబుతో'నను పాఠమే యుండవలెను.

'దేవర పొందుగ నిది మదిం బరికించితి రిట్లు'–(3–194 ఇచట గణభంగము—'దేవరపొందుగా'నని యుండవలెను.

కొన్నిచోట్ల పాఠములకు ప్రశ్నార్థక చిహ్నలుంచబడినవి.

ఉదా. 'మెలపున దాటి యాడు
మగవిూల విలాసము ద్రోలి కం
దల వపుచాయ విూఱె?' (4–33)

ఇచట సరియగు పాఠము—'పొం దలకల చాయ విూఱె' అనునది వ్రాతప్రతిలో గలదు. కన్నుల నల్లదనము ముంగురుల నల్లదనము విూఱినదని యర్థము.

స్థాలీపులాకన్యాయముగా నిట్లు కొన్ని మాత్రమే చూపితినికాని గ్రంథమం దన్నిచోట్లను అపపాఠములు గలవు. సాధు పాఠములతో నీ గ్రంథ మామూలాగ్రముగ సంస్కరించి, పునర్ముద్రణము గావించుట యత్యంతావశ్యకము.

ఈ పీఠికలో కేయూరబాహు చరిత్రమున కాంధ్ర సాహిత్యమునగల ప్రత్యేక విశిష్టతలను దెలుపు నంశములు లేనందున వాని నిట వివరించుచున్నాను.

## కథాసాహిత్యము

తెలుగు వాఙ్మయములో కథా సాహిత్య మొక ప్రత్యేక శాఖ. ఇది ప్రాచీనకాలమునుండి పదునెనిమిదవ శతాబ్దివఱకు పద్యమయము—ఆ వెనుక — వచనమయము. తెలుగున మన కుపలబ్ధములైన కథా సాహిత్య గ్రంథములలో కేతన దశకుమార చరిత్ర మొదటిది. కేయూరబాహుచరిత్ర ద్వితీయమైనను నద్వితీయమైనది. ఈ శాఖమగూర్చి ప్రత్యేక పరిశ్రమ జరిగినది.[6]

## నాటకాంధ్రీకరణము

తెలుగు సాహిత్యమున దృశ్యకావ్యమగు నాటకమును శ్రవ్యకావ్యముగా నొనరించిన తొలికవి మంచనయే—సంస్కృతమున రాజశేఖర మహాకవి రచితమైన విద్ధసాలభంజికానాటికను, మంచన నాల్గాశ్వాసముల ప్రబంధముగా రచియించినాడు.[7] ఈ పద్ధతి ననుసరించియే, పిల్లలమఱ్ఱి పినవీరన శృంగార శాకుంతల మనుపేర శాకుంతలనాటకమును, నంది మల్లయ ఘంట సింగయకవులు—ప్రబోధ చంద్రోదయమును, బిజ్జలతిమ్మభూపాలుడు అనర్ఘరాఘవమును, పద్యకావ్యములుగా రచించిరి.

ఈ సందర్భమున కథయందు మంచన చేసిన యొక మార్పును గూర్చి కొంత చెప్పవలసి యున్నది. 'విద్ధసాలభంజిక'లో రాజు విద్యాధర మల్లుడనియు, రాజధాని యుజ్జయిని యనియు నుండగా మంచన రాజు 'కేయూరబాహు'డనియు, రాజధాని 'త్రిపురీ' నగరమని మార్చియున్నాడు. ఈ మార్పు మంచన ఎంతో దూర దృష్టితో చేసినది. రాజశేఖరకవి విద్ధసాలభంజికను, కాలచురి వంశజుడు, యువరాజును—త్రిపురీ నగరము రాజధానిగాగలవాడు నగు కేయూరవర్షుని కోరిక ననుసరించి రచియించెను. మంచన దీనిని గ్రహించి, ఏ రాజు కొఱకు నీనాటిక రచింపబడినదో, ఆ రాజు నామమును

5. చూడుడు—భాషాశాస్త్ర పరిశోధన—యతి ప్రావతత్త్వ నిర్ణయము—అను వ్యాసము, Annals of Oriental Research—Madras University—Vol—XV 1958—59.

6. Katha Sahitya in Telugu Literature-Up to 1800 AD. Thesis in English by Smt C. Vijayalakshmi M. A. M. Litt. Madras University (Unpublished.)

7. నాటికయందు నాలుగంకములే యుండును. దాని ననుసరించియే మంచన ఈ గ్రంథము నాలుగాశ్వాసముల కావ్యముగా రచించినాడు. ఈ రచనా విధానమును గూర్చి చూడుడు. 'విద్ధసాలభంజిక—కేయూరబాహు చరిత్ర' అను వ్యాసము. డాక్టరు దివాకర్ల వెంకటావధాని—భారతి మార్చి...1942. పుటలు 254–262

శాశ్వతము చేయదలచి, యిట్లొనర్చెను. దీనిని విమర్శకులు సూచింపలేదు.

## రా జ నీ తి

కేయూరబాహుచరిత్ర రాజనీతికి సంబంధించినది. ఈ కావ్యమునకు ముందును, వెనుకను, తెనుగున రాజనీతి గ్రంథములు వెలువడినవి. ఉపలబ్ధములుకాని, క్షేమేంద్రుని ముద్రామాత్యము, ఆంధ్ర భోజుని నీతిభూషణము, శివదేవయ్య పురుషార్థసారము, ప్రతాపరుద్రుని నీతిసారము, కర్తృత్వము తెలియని కామందక పంచతంత్రములు - ఉపలబ్ధమైన బద్దెన నీతిసారము, ఇట్టివి. ఈ రాజనీతి గ్రంథశాఖను గూర్చి ప్రత్యేక పరిశ్రమ జరుగలేదు. మడికి సింగన, తన సకలనీతి సమ్మతమున, పై గ్రంథములతోబాటు— కేయూరబాహు చరిత్రనుండి పద్యముల నుదాహరించి యున్నాడు. దీనినిబట్టి యీ కృతి విశిష్టత తెలియ గలదు.

## లో క నీ తి

మంచన యిందు కృతిపతి కోరికపైని యిరవై రెండు నీతికథలను అనుసంధించి యున్నాడు. కేవలము నీతికథల కావ్యముగా గాక, ఒక, ఇతివృత్తము ప్రధానముగాగల ప్రబంధమున, నీతికథలను జొప్పించి, అటు కావ్యరసమునకు భంగముకాకుండ, ఇటు లోకమునకు నీతులుగఱపుచు మంచన ఎంతో సమర్థతతో దీనిని పంతరించియున్నాడు. కేయూరబాహు చరిత్రలో 769 గద్య పద్యములు గలవు. అందు 60 పద్యములు అవతారిక తీసివేసిన 709 గద్య పద్యములు మిగులును. వీనిలో 482 గద్య పద్యములు కథలే. ఈ కథలు వేఱుచేసిన కథాభాగము 227 గద్య పద్యములు గలిగి రసోత్తరమగు చిన్న కావ్యమగును.

## ఆశ్వాసా ద్యంత రచన

తెలుగున, ఆశ్వాసాద్యంతములు సంబోధనలని, విభక్త్యంతములని రెండు విధములు. వానిలో మంచన-విభక్త్యంత రచనా సంప్రదాయము పాటించియున్నాడు. ఇందును నొక విశేషము చూపియున్నాడు. విభక్త్యంతములు వ్రాయువారు, ఎచ్చటను — సంబోధన నుపయోగింపరు. మంచన యట్లుగాక — చతుర్థాశ్వాసము ప్రథమావిభక్తితో ప్రారంభించి, ఆ యాశ్వాసమును సంబోధనముతో ముగించియున్నాడు. ఈ విభక్త్యంత సంప్రదాయము తెలుగున నన్నెచోడునితో ప్రారంభమైనది.

## మతవ్యవస్థ-వైష్ణవము

కేయూరబాహు చరిత్రనుండి తెలుగు దేశమున వైష్ణవ మతవ్యాప్తి క్రీ. శ. 1300 ప్రాంతమున నెట్లున్నది తెలిసికొనవచ్చును. కృతిపతి ముత్తాత కొమ్మనామాత్యుడు క్రీ. శ. 1160 ప్రాంతమున ముప్పదిరెండు విష్ణుప్రతిష్ఠలు చేసియున్నాడు. కృతిపతి ఆంధ్రవల్లభుడైన కాకుళేశ్వరుని తిరునాళ్ల మహావైభవముతో జరిపించేవాడు. అదిగాక అతడు— బాపట్ల భావనారాయణస్వామి భక్తుడు.

## భాషా వి శే ష ము లు

ఇందు ప్రాచీనకాలపు తెలుగు పలుకుబడి విశేషముగాగలదు. జాతీయములు సూక్తులు వివరింపదగినవి చాలగలవు. పాఠభేదములవలన నిఘంటువున కెక్కని పదములుగలవు. పీఠికయందీ విశేషములులేవు. ఇవియేకాక మఱికొన్ని విడిచిన వాని నిందు చూపుచున్నాను.

**పీఠిక**

పుట1. 'ఇది సకలజన విధేయ ప్రణీతంబైన కేయూరబాహు చరిత్రంబునందు' కృతికర్త ఎవరు?

3. 'ధనదుపురమును గూర్చి మతభేదము లున్నవి.' దీనినిగూర్చి చర్చ యనవసరము — ధనదుపురమే చందవోలు—ధనదుపురము — ధనదప్రోలు—చందవోలు — అని రూప నిష్పత్తి క్రమము. ఈ చందవోలు నేడు గుంటూరు

జిల్లా తెనాలి తాలూకాలో సముద్రమునకు తొమ్మిదిమైళ్ల దూరమున నున్నది.[8] ఇది తెలుగు దేశమునగల ప్రాచీన గ్రామములలో నొకటి.[9] మంచన ధనదుపురమని తెలిపినను, నంతకుముందు, 'సనదప్రోలు' అనియే దీనికి వ్యవహార మున్నట్లు పండితారాధ్య చరిత్ర[10] తెలుపుచున్నది.

"సనదుప్రోలను మహాసద్భక్త మహిమ।
దనరార వర్ణింపఁ దత్ప్రస్తవమున."

సనదుప్రోలు అను పద మిచ్చట యతిప్రాస స్థానములలో నిర్ధారకముగా నున్నది. కొలని గోపరాజు ...లమున (క్రీ. శ. 1440) సనదప్రోలనియే యున్నట్లు—'శ్రీ సనదప్రోలి పురవరాధీశ్వర వెలనాటి పృథ్వీశ్వరరాజ్య సముద్ధరణ' అని సింహాసనద్వాత్రింశిక ...శ్వాసాంతగద్య తెలుపుచున్నది. 'చందవోలు' అను రూపము క్రీ. శ. 1750 నుండి వాడుకలో నున్నట్లు బుద్ధిరాజుపేరయామాత్యుని 'సాత్త్విక బ్రహ్మవిద్యా విలాస నిరసనము' అను కృతి తెలుపుచున్నది.

పుటలు 4—9—ఇందు చెప్పబడిన వెలనాటి చోడుల వంశ వృత్తాంతము పౌనఃపున్యమే—వెలనాటి చోడవంశము—కృతిపతి గుండ మంత్రి వంశ చరిత్రము—ఈ రెండింటి సమన్వయము చాల కాలము క్రిందటనే గావింపబడినది.[11]

17-18—ఇందలి నీతికథలను, పిట్టకథ లనుట సరికాదు. దీనివలన 'ప్రధాన కథావేగము దెబ్బ తిన్నదనుట' అంతకంటె సరికాదు. ఇరవై రెండు నీతికథలను, ఇతివృత్తముతో ననుసంధించి కావ్యరసానుభూతి కల్గించుటే, మంచన 'కవితాశిల్పము.'

22. కృత్యాదియందలి రెండవ పద్యమగు 'కరిముఖుఁ డశ్వినుల్' అను దానిలోని విశేషము లీవఱకే పాఠకలోకమునకు పరిచితములైనవి.[12]

28. సకలనీతిసమ్మతమున మడకిసింగన నాల్గు పద్యములను కేయూరబాహు చరిత్రము నుండి గ్రహించెనన్న విషయ మీవఱకే సూచితము[13]. సింగనకాలము క్రీ. శ. 1347 అనుట సరి కాదు. అది క్రీ. శ. 1440 ప్రాంతము.[14]

---

8. కీర్తిశేషులు కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణ రావుగారి శివతత్త్వసార పీఠిక పుట 22—ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రకటితము—(1922.)

9. చూ. చందవోలు కైఫీయతు – స్థానిక చరిత్ర సంపుటము – 39. (Local Records) ఇది మెకంజీ సంపుటములలోను గలదు.

10. వాదప్రకరణము పుట 503, ఇట్లే మహిమ ప్రకరణమున (పుట 2(52) 'ఎక్కడి సనద ప్రోలెక్కడి సభలు' అనియే కలదు.

11. కీర్తిశేషులు మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి వ్యాసము. వెలనాటి చోడవంశావళి; కేయూర బాహు చరిత్రము. భారతి సం. 5. సం. 8. సెప్టెంబరు 1928 పుటలు 115-122.

12. మంచన కవితా శిల్పము — భారతి — మార్చి-1963.

13. భారతి—ఆగస్టు-1965.

14. భారతి జూలై 1967 పుటలు 60-64

# 'ఇది సుదీర్ఘ చరమరాత్రి!'

## శ్రీ సోమసుందర్

వెళ్ళిపోతాను నేస్తం నిశ్శబ్దంగా ఈ రాత్రి
నేనీ లోకానికి అరుదెంచిన తొలివేకువ మక్కువలను
నలుకెలకుల వెదజల్లిన సద్భావపు విత్తనాల
నిశ్శబ్దంగా ఏరుక, ఎరుకలన్ని జారవిడిచి
నీరవంగా హస్తచాలనం చేస్తాను; వెళ్ళిపోతాను.

నే ననుభవించిన మృదుమంజుల జ్యోత్స్నా స్నాయువులకు,
అగణిత రసమయ తరంగాలకు వాయువులకు,
నేనా ఘ్రాణించిన శతసహస్ర ప్రసవాలకు,
అంజలి ఘటియిస్తూ—వీడ్కోలర్పిస్తూ—
వెళ్ళిపోతాను నేస్తం నిశ్శబ్దంగా ఈ రాత్రి.

పంట కాల్వ గట్లపైన తలలూచిన
కాంచన ప్రసూనాల ఆర్ద్ర నయనాలకు,
దివసాంతారుణకిరణస్నాతులైన
సరోజాల దిగజారిన కనురెప్పల దాగిన జలకణములకు,
కోనేటికి నాడులుగా పిలపిల మని శబ్దించే
చిరుకెరటా లలజడులకు, అలలనడుమ భగభగ మని
మండుతూన్న అస్తాద్రి కలల కిరణాలకు,
నా హృద్గగనావధిలో
అమేయ భావాంబరాల తెరలించే
మెరిపించే అనంత సౌందర్యాలకు—
తలవంచుక కేల్దోయి ముడిచి సెలవడుతు
వెళిపోతా నిశ్శబ్దంగా నేస్తం.

మెత్తనిబెందెడిమట్టిని కనులెత్తే వరిమొక్కలు
యేటి నీట కాళ్ళాడిస్తూ చిలిపి నవ్వు లురలించే కొమ్మలు
కోమలగాత్రీగోదావరినిర్మలతరతరంగాలు
—ననుఃబాయని నెచ్చెలులై లాలించెను పాలించెను

'ఇది సుదీర్ఘ చరమరాత్రి

నేను కన్న కలలన్నీ ఫలియించెను.
అనంతానంద విహాయసమును నాకోసం విరియించెను
సెలవు తీసుకొంటానిక నేస్తం!
వలపులూరు లతాంతాలు కురిసిన నీరవవిభావరిని.

గట్టువిూది రావిచెట్టు నీడవోలె నిదురించే తటాకమును,
తూర్పు బుగ్గపై విరిసిన హరివిల్లుకు ముక్కువిరిగి
జారిపడిన పరవశించి పవళించిన పంటచేను,
ఆమని తుది యామినిలో
నింగి గుండె చీల్చిన ఒక పికనాదం,
తొలకరి తొలివేకువలో సురలోకం దిగివచ్చిన
హర్షానిల వీచికగా పులకించిన వార్షుకమేఘం,
సకల మనోహర జగత్తు లీనమాయె ననుభూతిగ...
నే బతికిన కాలమంత నా లోపలి శూన్యంలో
అనవరతం వెలుగు లీను హృది మహేంద్రచాపంగా....
మధురీకృత కవితాలత ప్రస్ఫుభవించె ననాదిగా....

చాలు నింక నేస్తం, ఇది జన్మజన్మలకు సరిపడు
అనుభవ నిస్తుల సారం; హాయిగ చిరునవ్వులతో
నిశ్శబ్దంగా వెళ్లిపోతా నీ రాత్రి !

మలయమారుతాల తేలి కలలు కనని పాషండులు
పచ్చిక మైదానాలకు పరువులిడని నిస్సంగులు
చీకటిరాత్రిగర్భం చీల్చుక వేగుకు సాగే
పడవ యొడినిండా నింగితీవ ముడుచుకొన్న
నునుమెత్తని వెలుగుపూల నింపుకోని జనుషాంధులు
వలపులూరు పొలిమేరల పులకరింత మజిలీలో
కేరింతల సంతసాలు పాడుకోని దాచుకోని భారవహులు
పూలదారి పల్లేరులు జల్లినారు:
పోనీలే క్షమిస్తాను!
విస్మరించి విడుస్తాను!
సెలవిమ్మని వెళిపోతా నిశ్శబ్దంగా నేస్తం.
కలకంఠం ఒకట్రైనా తోడువలదు ఈ రాత్రికి.

నా గొంతుక ఈ క్షణాన పూడ్చుకుంది
నా గళమున నిగళమేదొ గలగలమని ఒఱుసుకుంది.
పాడలేను
పాడలేను
బ్రతుకంతా పాడినాను కలలను కాపాడినాను
మనికిలోని బాధలతో బ్రహ్మచెముడు డొంక బలిసి
పాడు నూయిగా మారిన గొంతుక రాపాడిపోయె;
పాడలేను క్షమించు మిక పాంథశాల తలుపు మూసి
కావలివా డరిగినాడు—తలారివా డలిగినాడు;
వీడ్కోళ్ళ లొసగే మురళీధ్వని మూగవోయి నిద్రించెను
సెలవిస్తే వెళిపోతా నిశ్శబ్దంగా నేస్తం!

కంటకములు కీటకములు
విహంగాలు తరంగాలు
సమస్తమూ నాకోసం మస్తకాలు ముకుళించెను;
ప్రాక్ ప్రతీచీ దిగంతాలు వీచిన
నవోల్లాస సమీరాలు స్తంభించెను;
సర్వకాంతి సాంద్రకిరణ శకలముగా రూపు దాల్చి
నేత్రజ్యోతిగ మారెను; నా హృద్గత నాదమాయె:
విశ్వమహోద్ధృతనాదం; నిశ్శబ్దం తాండవించె
ఇది సుదీర చరమరాత్రి హాయిగ నిదిరిస్తా నిక!
కనుతెరచే మొగ్గలలో చిరునవ్వుల చిలికిస్తా—
సెలవు తీసుకొని హాయిగ వెళిపోతా నిక నేస్తం.

———



# నన్నెచోడుని మిథ్యాగర్భిత అంతరాక్కర స్వరూపము

శ్రీ బండి నాగరాజు

నన్నెచోడుడు, తన కుమార సంభవము (వావిళ్ల ప్రతి—XI, 128) లో 'మురిసెడి రూపులున్..' అను చంపకమాలలో 'అంతరాక్కర' గూడ ఒకటి 'సుబంధము' అగునట్లు నిక్షిప్తముచేసినా డన్నది శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారి పరిశోధనా ఫలము. (చూ. భారతి—జూలై. 1967—'అంతరాక్కర యతి విశిష్టత'.)

శ్రీవారు చూపిన 'దేవతా వస్త్రము' నాకు కనిపించలేదని 'పాపభీతి' లేక—వారన్నట్లు 'వాచ్యము' గానే—చెప్పి వేసితిని. (చూ. భారతి—జూలై, 1965 'నన్నెచోడుని గర్భితాంతరాక్కర'.) శాస్త్ర చర్చలో 'అవాచ్యము' పలుకుటకు తావుండరాదని భావించితిని.

రెడ్డిగారు చూపుచున్న అంతరాక్కర స్వరూపమిది—

> 'మురిసి మ్రొగ్గెడి రూపులు—మ్రొగ్గ జిత్తినం
> దిరిగి త్రెళ్లెడి రూపులు—ద్రెళ్లి నేలపైఁ
> బొరలి పోయెడి రూపులుఁ—బోయి క్రమ్మఱన్
> మరలి మ్రగ్గెడి రూపులు—నయ్యె నయ్యెనిన్.'

ఇది అంతరాక్కర యగుటకు వీలుచాలదని నా యభిప్రాయము. అందుకు కారణము లివి—

(1) నన్నెచోడుడు తన గ్రంథమున ఇతరత్ర ఏ అక్కరయు వాడలేదు. కాబట్టి అతని అక్కరల స్వరూపము ఇట్టిదని నిర్ణయించుట అసాధ్యము.

(2) ప్రశంసలో నున్న పద్యమందు అక్కరలు గర్భితమై ఉన్నవని కవి సూచించియుండలేదు. అట్లు సూచించుట నన్నెచోడుని సంప్రదాయమే.

దీనికిముందు పద్యమునగల '...పదముక్తముక్తానుబంధములు నగుచు—'' అను మాటలోని 'బంధము', ఇట్టి సూచన చేయుచున్నదని రెడ్డిగారు వాదించుచున్నారు. అనగా, ప్రశంసలోనున్న చంపకమాల, 'బంధకవిత్వ'మని రెడ్డిగారి అభిప్రాయమా? ఇది 'గర్భకవిత్వ'మని గదా లాక్షణిక సంప్రదాయము? అసలు చిత్ర గర్భబంధములలో ఏకదేశ ప్రసక్తిచేత మరియొకటి స్ఫురించునా? ఏమి యీ వ్యంగ్య వైభవము?

దీనినే ఒకచోట 'చిత్రకవిత' అని, మరొకచోట 'గర్భ చిత్రకవిత'అనియు పేర్కొనుట రెడ్డిగారి పాండిత్య ప్రాభవములకు నిదర్శనము!

కుమార సంభవము, 'గూఢ వస్తుమయ కావ్యము' అట! అందుకని యిట్టిలేనిపోని గూఢతల నూడబెరికి ఒక 'గంధర్వ గోళము' సృష్టించిరి రెడ్డిగారు! గూఢ వస్తుమయ కావ్యము నన్నెచోడునిదా? ఉద్భటునిదా? నన్నెచోడునిది 'కుమార సంభవంబను కథ... (గద్య).'

ఉద్భటుడు కుమార సంభవము, అలంకారము—రెండు గ్రంథములు వ్రాసివాడు; అందు అలంకారమును గూడ (అవ్యర్థకము) 'వస్తుమయ కావ్యము'గా హరులీల చెప్పినాడు. (చూ. కు. సం. I, 21.)

నన్నెచోడుని కుమారసంభవములో 'వస్తువు నందలి గూఢత'యేమో నే నెరుగను! నన్నెచోడుని మాటలు, 'ప్రతిపద వ్యంగ్య స్ఫోరకము'లై ఇట్టి 'కాకదంత పరీక్ష'లకు అవకాశ మీయవని నేను భావించెదను.

కవి సూచించకపోయినను ఉన్నసత్యమును కాదను టెట్లు?— అని ప్రశ్నించుచున్నారేని, పరిశీలింతము—

(3) అంతరాక్కరకు వరుసగా ఒక సూర్య గణము, రెండింద్రగణములు, ఒక చంద్రగణము ఉండ వలెను. మరి నన్నెచోడుని పద్యములో ఈ గణక్రమము కుదిరినదా? లేదు. చివర ఒక గురువు ఎక్కువగా నిలిచినది. ఆ యక్షరము తొలగించిన, అర్థము చెడును. అంతరాక్కరను గర్భితము చేయదలచుకొన్న కవి, ఆ చివరి గురువును అర్థము చెడకుండు నట్లు ఏల వ్రాసియుండరాదు? నన్నెచోడుడే— రెడ్డిగారివలె -అట్టి 'గర్భభారము' పెట్టుకొని యుండలేదు. అసలు యుద్ధ వర్ణనములో గర్భకవిత్వ మునకు ప్రసక్తియేమి? అది యెట్టి ఔచిత్యము?

ఆ యేదనపు గురువు, అంతరాక్కరను తేట గీతినుండి వేర్పరచుట కేర్పడినదట! అంతరాక్కరకు, తేటగీతికి ఇతర భేదము లేవా? పాదము చివర గణబంధ ములో భేదమున్నది; అది యీ పద్యములో లేకపో వచ్చును. ప్రాసయతి నిషేధము, ప్రాసనియమము అంత రాక్కరకు ప్రత్యేకములు కావా? ఆటవెలదికి ప్రాస ముంచిన 'పవడగీతి' కాలేదా? గణముల గుణము లేమి మారినవి? అంతరాక్కర చివర గురు వేర్పడుట, తేట గీతికంటె భిన్నముగా చూపుటకని రెడ్డిగారనుట అశా స్త్రీయము. విన్నకోట పెద్దన, ప్రాసముగల తేటగీతి చెప్పి, అదే 'అంతరాక్కర' పొమ్మన్నాడు! ఆయన, ఇట్టి ప్రత్యేకత చూపుటకని గణబంధము మార్చలేదే?

(4) కడపటి యింద్రగణమును రెండవ స్థాన మునకు మార్చవచ్చునని ఒక అపూర్వ లక్షణము రెడ్డి గారు వెలయించిరి! ఎక్కడి దీసంప్రదాయము?

మహాక్కరకు మొదటనుండు సూర్యగణము రెండు నాలుగు స్థానములకు ఐచ్ఛికముగా మారవచ్చు నని లాక్షణికులు చెప్పిరి; అది సరే.

అట్లే మధ్యాక్కరలో మూడవచోటనుండు సూర్యగణముగూడ రెండు—నాలుగు స్థానములకు ఐచ్ఛికముగా మారుచున్న దనుట లక్ష్యశుద్ధినిబట్టి మనము నిర్ణయింపవచ్చును. అందుకు నన్నయ పద్య ములు—ఒకటి అరా కాదు—పదిదాక సాక్ష్యమున్నవి.

ఈ పద్ధతి ప్రకారమే అంతరాక్కరయందలి చివరి చంద్రగణము, రెండవచోట నిలుచుటకు ఇతరా ధారము లేమి గలవు? మరియొకటి రెండైనను అంత రాక్కరలు ఇట్టివి ఉదాహరించగలమా? నన్నెచోడుని గర్భితాంతరాక్కరయే పరమ ప్రమాణమందురా? అదెట్లు సాధ్యము? దీనికిగూడ నన్నెచోడుడు చెప్పిన 'సుబంధము' సూచనయని రెడ్డిగారి వాదన. అపురించ కయేగూడ ప్రేవులు లెక్కపెట్టగల సూక్ష్మగ్రాహిత్వము రెడ్డిగారిది! మరి వారికి వ్యంగ్య వైభవమును గూర్చి ఒకరు చెప్పెడి దేమి?

ఇదే చంపకమాలలో గర్భితములై యున్నవని చెప్పబడిన మధ్యాక్కర, అల్పాక్కర—లాక్షణిక పద్ధతికి కచ్చితముగా సరిపోయినవన్నచో, ఇది మాత్రమెట్లు సరిపోకుండును? శాస్త్రీయముగా సరిపడనప్పుడు, సరి పుచ్చవలసిన అగత్యమేమి? దుర్బలమైన యిట్టి ఆధా రముతో శాస్త్రమును సడలించవలసిన అవసరమేమి?

(5) పోనీ, రెడ్డిగారిమాటనే అంగీకరింతము: అప్పుడు యతి సంగతి యెట్లు?

లెక్కప్రకారము, నాల్గు గణములుగల యీ పద్యమునకు మూడవ గణారంభమున యతి ఉండవలసి నది. కాని, 'ఏకోనాక్షర త్రిగణము' దీనికి యతిగా లాక్షణికులందరు (విన్నకోట పెద్దనతప్ప) చెప్పిరి. అనగా మూడవగణము చివరి యక్షరము యతి కావలెను.

"భానుఁ — డిద్ధ ఈా — దిత్య + ప — తులు చంద్రుండు" (అప్ప. IV, 279.)

ఇందు మూడవగణములో చివరి యక్షరము 'ప'. ఆ యక్షరమునకు పూర్వము—ఏకోనాక్షర త్రిగణము— విశ్రాంతి (త్య). దీనిమీద నుండునది మరల 'ప'. ఇదే అసలు యతిస్థానము. మూడవగణము చివరియక్ష రమే యతి స్థానమని సారాంశము. కావ్యాలంకార చూడామణితప్ప, తక్కిన వన్నియు దీనినే బలపరచినవి.

ఈ పాదమును రెడ్డిగారు చెప్పిన విధముగా భాగింతము—

'భానుఁ—డిద్ధ ఈాది- త్యపతులు - చంద్రుండు.'

ఇందు 'లు' యతిస్థానము కావలెను. అట్లు యతి చెల్లదు. విన్నకోట పెద్దన ప్రకారము నాల్గవ గణారంభమునను యతి పడదు. మరి రెడ్డిగారి లెక్క ప్రకారము, ఏకోనాక్షర త్రిగణము అనగా, మూడవ గణములోని రెండవ యక్షరము—'ప'—యతి అనుకో

# కారల్ శాండ్‌బర్గ్

శ్రీ ఎడ్వర్డ్ డెనోక్ (జూ)



అమెరికా చరిత్రలో లింకన్‌నుచెప్పి, మరో మనిషిని చెప్పవలసి వుంటుంది. ఆయన చాలా గొప్పవాడు. ఉదాత్తలక్షణాన్వితుడు. ఆయన గురించి ఎంతోకాలం అయిపోయింది. అయినా ఆయన ఆచరించిన ఉదాత్త క్రియలు అట్లా నిల్చివున్నాయి. ఆయన ప్రసంగాలు, అవి ప్రసంగాలా, అచ్చమైన కవిత్వం జాలు వారడమే. ఆయన రచనలు—అవి రచనలా— అమెరికాలో సాగిన అంతర్యుద్ధకాలం అంతా ఆ రచనలలో అట్లా అంటుకునివుండి, పో[illegible] కలను పట్టువదిలిపెట్టాడు. ఇవి అన్నీ గొప్పవిషయాలే. కాని అమెరికన్‌లకు ఆయన్ను గురించి బాగా జ్ఞాపకం వుండే విషయం— ఆయన మానవీయత. మానవజీవితంలో నవ్వు, దుఃఖం, కష్టము, సుఖము—అన్నీ ఆ మానవీయతలో సంవలితం అయి వుంటాయి. ఆ హాస దుఃఖాలను, ఆ కష్టసుఖాలను ఆయన అమెరికా ప్రజలతో కలిసి అనుభవించాడు. ఒక్క అమెరికా ప్రజలతో అనేేమి, ఆ హాస దుఃఖాలను, ఆ కష్టసుఖాలను ఆయనతోపాటు ప్రపంచం అంతా గూడా పంచుకున్నది.

లోకంలో ఒక్క యదార్థవాక్కు వుంది. వీరులు వున్నారు అనుకోండి, వారు ఆ వీరులు కావడానికి ముందు — మానవులై వుంటారు. పురుష పుంగవులై వుంటారు. ఆ తర్వాతనే వారిని లోకం వీరులను చేస్తుంది. నాయకులనుగా గౌరవిస్తుంది. కాలం గడుస్తూవున్న కొద్దీ ఆ వీరులను గురించి ఎన్నో కథలు వ్యాప్తిలోనికి వస్తాయి. ఆ కాలము, ఆ కథలు, ఆ వీరుల జీవితములందలి మానవీయతా లక్షణాన్ని ఆహరించి వేస్తూవుంటాయి. తుదకు వారు వట్టి శిలావిగ్రహాలను పోలి గోచరిస్తారు. శిలా విగ్రహమాత్రంగా నిలుస్తారు. ఇది చాలామంది వీరులు అనబడిన వారియందు జరిగింది. అందుకు అబ్రహాం

లింకన్ అపవాదు. అమెరికన్‌లు ఇప్పటికీ ఆయన జీవిత చరిత్రనంన ఉత్తేజితులవుతూనే వున్నారు.

ఆ లింకన్‌ను ఈ తరం జనానికి వ్యాఖ్యానించి చెప్పిన భాష్యకారుడు కారల్ శాండ్‌బర్గ్. శాండ్‌బర్గ్ అబ్రహాం లింకన్ జీవితచరిత్రను రచించాడు. ఆయన అసలే కవి. ఈ గ్రంథంలో ఆ కవిత్వం—వచనమే అయినా—సంగీతంలాగా, ప్రవహించింది. వ్రాసింది జీవిత చరిత్ర గనుక—అందులో చరిత్రకు వుండవలసిన హంగులన్నీ వున్నాయి. జరిగింది జరిగినట్లు చెబు తున్న విధంగా ఆ గ్రంథం రచించబడింది. ఆ గ్రంథం చదువుతూవుంటే మనం లింకన్‌గారి ఇంట్లో వున్నట్లు, లింకన్‌గారితో సంచరిస్తున్నట్లు ఒక అనుభూతిని పొందుతాము. లింకన్‌గారికి ఉపన్యాస వశంలో పిట్టకథలు చెప్పడం అలవాటు. ఈ గ్రంథం చదువుతూవుంటే, మనకు లింకన్ కంఠం వింటున్నట్లూ అనిపిస్తుంది. లింకన్ మంచివాక్మి. ఆయన వాచకం లలితమర్యాదమైంది. ఇవి అన్నీ మనకు శాండ్‌బర్గ్ వ్రాసిన గ్రంథంలో గోచరిస్తాయి. మానవలోకం బాధ అంతా ఆయన ముఖంలో గూడుకట్టుకున్నట్లు, ఆ బాధకు ఆ వదనం దర్పణం అయినట్లు గోచరిస్తుంది. లింకన్ విజయాన్ని సాధించారు. ఆ విజయం విషాద మధురమైంది.

అబ్రహాం లింకన్‌ను గురించి కలలుకంటూ ఆయన జీవితాన్ని మననంచేస్తూ, ఉపన్యసిస్తూ, వ్రాస్తూ, అధ్యయనంచేస్తూ తన జీవితంలో చాలాభాగం గడిపాడు శాండ్‌బర్గ్. ఇప్పటికి ముప్పైఏండ్లక్రిందట ఎప్పుడో శాండ్‌బర్గ్ వ్రాసిన లింకన్ జీవితచరిత్ర ప్రథమభాగం వెలువడింది. లింకన్ జీవితాన్ని గురించి గ్రంథాలు వ్రాసిన వారు చాలామంది వున్నారు. వారు గూడా ప్రసిద్ధులే. కాని శాండ్‌బర్గ్‌వంటివారు కారు. ఇప్పుడు ఎవరు లింకన్‌ను గురించి చూడా లన్నా, శాండ్‌బర్గ్ పుస్తకం తిరుగవేస్తారు. ఆయ నకు లింకన్ అంతబాగా అవగతం అయినాడు. ఆయ నకు లింకన్ అర్థం అయినట్లు మరి ఇంకొకరికి కాలేదు. అవును. జీవితంలో అన్నిసంవత్సరాలు ఆయన్ను అధ్యయనం చేయడంకోసం ఈయన గడి పాడు.

శాండ్‌బర్గ్ ఇట్లా ఎందుకు చేశాడు? ఇంత కాలాన్ని, ఇట[illegible] లింకన్ జీవిత [illegible] చదివితే ఏమిటి [illegible]? ఇటువంటి ప్రశ్నలకు శాండ్‌బర్గ్ [illegible] "ఆ [illegible] [illegible] [illegible] [illegible]! [illegible] [illegible] చూచాను. [illegible] [illegible] ఆ విధంగా [illegible] [illegible] విషయం. [illegible] [illegible] [illegible]"

హాసము, కన్నీళ్ళు, ఇవి లింకన్ [illegible] లింకన్ [illegible]. ఈ [illegible], ఈ [illegible] శాండ్‌బర్గ్ పట్టినట్లు మరి ఏ రచయితా పట్టలేదు; ప్రదర్శించలేదు. జీవితంలో ఆ హాసం, ఆ కన్నీరు పెనవడివున్నాయి. ఆ విషయం శాండ్‌బర్గ్‌కు బాగా తెలుసు. అందుచే లింకన్‌కు ఆయన అంతటి భాష్యకారుడు కాల్గాడా అనిపిస్తుంది. శాండ్‌బర్గ్ గూడా లింకన్‌కు మల్లేనే, లోక వ్యవ హారం తెలిసి మెలిగిన మనిషి; శాండ్‌బర్గ్ గూడా లింకన్‌కు మల్లేనే మెత్తని మనస్సు కలవాడు. శాండ్‌బర్గ్‌కూడా లింకన్‌కు మల్లేనే కష్టాలు ఎరి గిన, కష్టాలు అనుభవించిన కుటుంబీకుల బిడ్డ.

శాండ్‌బర్గ్ వయస్సు పందేడాకా చేసించాడు. అబ్రహాం లింకన్ భాష్యకారుడుగా, లింకన్ జీవిత చరిత్రరచయితగా పేరు తెచ్చుకున్నాడు. అంతేనా శాండ్‌బర్గ్ గొప్పతనం? శాండ్‌బర్గ్ మహాకవి; శాండ్‌బర్గ్ అమెరికన్ జానపదగేయ సాహిత్యంలో అధిష్ఠాతుడు; విచిత్రం ఏమంటే, శాండ్‌బర్గ్‌కు ముప్ఫయిఆరుఏళ్లు వచ్చేదాకా, సాహిత్య ప్రపంచం ఆయన పేరు వినలేదు. అజ్ఞాతంగా వుండిపోయినాడు. ఏభైయేళ్ళయేడు నిండేవరకు శాండ్‌బర్గ్ పత్రికల్లో పనిచేస్తూవచ్చాడు. ఆ పనినుంచి ఆయనకు అప్పుడు విముక్తి కల్గింది. అంతవరకు ఆయనకు జీవికకు అది మార్గం అయిపోయింది.

1945 నుంచి శాండబర్గ్ పశ్చిమ ఉత్తర కెరోలైనా రాష్ట్రంలో పర్వత ప్రాంతంలో నివసిస్తూ వచ్చాడు. ఆయన అక్కడ వుంటూవున్న ఇల్లు 1836 లో నిర్మింపబడింది. అది క్రిస్టొఫర్‌గస్టావ్ మెమ్మింగర్ కట్టించింది. అమెరికాలో అంతర్యుద్ధం నడుస్తూవున్న రోజుల్లో ఈయన కొంతకాలం కాన్ఫిడరేటు రాష్ట్రాలకు ఆర్థికమంత్రిగా పనిచేసి వున్నాడు. ఆ యింట్లో వుంటూ శాండ్‌బర్గ్ రాత్రులకు రాత్రులు, పగళ్లకు పగళ్లు తన రచనలు కొనసాగించాడు. అందులో పనిచేసేందుకు వీలుగా ఒక గది వుంది; ఆ గది అంతా బీరువాలు; అరలు. వాని నిండా పుస్తకాలు; కాగితాలు. ఆ పుస్తకాలు, కాగితాలు అన్నీ లింకన్‌ను గురించినవి. ఆ యింటిలో తక్కిన గదులు గూడా అంతే. వాని నిండా శాండ్‌బర్గ్ లింకన్‌కు సంబంధించిన సాహిత్యాన్నే పెట్టాడు. ఇట్లా ఆ ఇల్లు పూర్తిగా లింకన్ సాహిత్యానికి ఒక గనిలాగా తయారు చేయబడింది.

శాండ్‌బర్గ్ పల్చని మనిషి; బలిష్ఠుడు, ప్రతి రోజు ఉదయం శరీర వ్యాయామం చేసేవాడు. ఆయన కళ్లు నీలపురంగు కలవి. తీక్ష్ణమైన దృగ్వైభవం కలవి. ఆ కళ్లలో ఆయన ప్రపంచాన్ని తిలకిస్తూ వుండేవాడు. ఆ కళ్లకు తెల్లని ఆయన శిరోజాలు అడ్డుపడుతూవుండటంకూడా కద్దు. అటువంటి పరిస్థితి వచ్చినప్పుడే వానికి సంస్కారం. శాండ్‌బర్గ్ అందగాడుకాదు. చెవులు చాటల్లాగా వుండేవి. మూతి వెడల్పు. ఎత్తు దవడలు. కాని ఆ ముఖంలో ఒక శక్తి, ఒక శీలము అచ్చుగుద్దినట్లువుండి; గాంభీర్యాన్ని వెలిగక్కుతూ వుండేది. ఆ ముఖంలో ఎరుక తాండవిస్తూ వుండేది.

వయస్సువస్తూవున్న కొద్దీ శాండ్‌బర్గ్‌కు శక్తి తగ్గుతూ వచ్చింది. ఆయన పూర్వంలాగాకూర్చుని పనిచేయలేక పోయేవాడు. కాని పనిచేయకుండా వూరుకోలేదు. చేతినిండా పని వుండేది. ఆయన పూర్వాహ్ణంలో నిద్రపోయేవాడు. ఎందుచేతనంటే, సాయంత్రము, రాత్రి, పనిచేసుకోడానికి వీలుగా వుండేందుకు. తన పనిచేసుకునే గదిలో టైపురైటరు దగ్గర కూరుచునేవాడు. ఆ కూర్చునేచోటుకు 'క్రేజీ కార్నరు' (పిచ్చిమూల) అని పేరు పెట్టుకున్నాడు. కళ్లకు దీపపు కాంతి తగిలి బాధపెట్టకుండా ఆకుపచ్చని సెల్యులాయిడు పరికరాన్ని తగిలించుకునేవాడు. పత్రికలలో పనిచేసేవాళ్లు చాలామంది అట్లాగేచేసేవాళ్లు. శాండ్‌బర్గ్‌కూడా అంతే. శాండ్‌బర్గ్‌కు ఇంకో అలవాటు వుండేది. చుట్టనోట్లో పెట్టుకొని, నోటిలో వుండిన భాగాన్ని అదే పనిగా చప్పరిస్తూ వుండేవాడు. ఆ చుట్ట కాలుతున్నదా, లేదా అన్న ఎరుక ఆయన వుండేదికాదు. తరచు అది ఆరిపోయివుండేది. రచన బాగా వుండాలి అంటే, రోజుకు ఎన్ని గంటలు వ్రాయాలి అన్న విషయం దగ్గర ఆయనకు ఒక లెక్కవుండేది. రోజుకు నాల్గు ఐదుగంటలకంటే ఎక్కువసేపు వ్రాతమీద కూర్చోకూడదు. కూర్చుంటే, ఆ వ్రాత బాగుండదు. ఇది ఆయన అనుకునే మాట. కాని తీరా పనిలో పడిన అనంతరం, రాత్రి ప్రొద్దుపోయేదాకా అట్లాగే కూర్చొనేవాడు. ఒకొక్క రోజున తెల్లవారేది. స్మోక్‌పర్వతశిఖరాగ్రాలమీద ఉషస్సుయొక్క కాంతులు ముందు ఎర్రబారలుసాగి తెల్లనికాంతులుగా విరిగిపడేదాకా అట్లాగే వ్రాస్తూవుండేవాడు. అటువంటి రోజులలో శాండ్‌బర్గ్ భార్య 'బ్రేక్‌ఫాస్ట్'కు గాను ఆ భర్తను కదిపేదికాదు. 'బ్రేక్‌ఫాస్ట్'ను తెచ్చి అట్లా ఆ గది తలుపు దగ్గరపెట్టి వెళ్లేది. ఇంట్లో అంతా ఎవరి పనులమీద వారు వుండేవారు. ఎవ్వరూ ఆయన్ను కదిపేవారు కాదు.

శాండ్‌బర్గ్ కుమార్తె శ్రీమతి హెల్గాటోమాన్. ఆమె ఆయనకు కార్యదర్శి. రాత్రిఅంతా పనిచేసి బల్లమీద తండ్రి వదిలిపెట్టిన టైపు చేయబడిన కాగితాలను తీసుకొని, ఆమె వానిని పూర్తిచేసేది. ఆ తండ్రి ఏవో గుర్తులలో తాను వ్రాసేదానిని టైపుచేసేవాడు. ఆ గుర్తులు ఎరిగి ఆమె వానిని పూర్తిగా వ్రాసేది.

శాండ్‌బర్గ్ ముందు చిత్తువ్రాసి, దానిని చాలాసార్లు దిద్దేవాడు. తాను వ్రాసినదాన్ని వ్రాసినట్లు ప్రచురణ కర్తలకు ఇవ్వాలనే దిలాసా ఆయనకు లేదు. శాండ్‌బర్గ్ ఒక పద్యంవ్రాసి, దాన్ని అట్లా ఇరవై సంవత్సరాలపాటు తన బల్ల సొరుగులో అట్టే పెట్టివుంచాడట. ఆ తర్వాత ఎప్పుడో ప్రచురణకు పంపాడట. ఈ మాట ఆయన భార్య చెప్పిన మాట.

వ్రాతపనిఅంటూ లేనప్పుడు శాండ్‌బర్గ్ ఎవ

రిలోనైనా మాట్లాడేవాడు. వచ్చినవాళ్లను చూచేవాడు. మేకలతో ఆడుకునేవాడు. గిటార్ పట్టుకుని వాకిట్లో కూర్చుండేవాడు. కూర్చుని రాజకీయాలమీదను, జంతువులమీదను, లేక తన మనస్సుకు ఏది తోస్తే దానిమీదను పాటలు అల్లేవాడు.

తరచు ఆయన ఇల్లువదిలి వెళ్లేవాడుకాదు. ఆ వెళ్ళినప్పుడు న్యూయార్కులో స్నేహితులను చూడడానికో, లేక తన గ్రంథాలను ప్రచురిస్తున్న వారిని చూడడానికో పోతూవుండేవాడు. లేదా ఏవన్నా ప్రత్యేక సందర్భాలువస్తే, వానికి వెళ్లేవాడు. అటువంటి సమయాలు తటస్థమైనప్పుడు, రైలులో ప్రయాణం చేసేవాడు, పుస్తకాలు, ఆయనా. మేక పాలు, మేక జున్ను ఆహారం.

ఉత్తరకెరోలైనాలో శాండ్‌బర్గ్ గృహం ఫ్లాట్‌రాక్ అనే గ్రామంలో వుంది. గ్రామవాసులు ఆయన్ను ఆట్టేసార్లు చూచివుండరు. ఒక ఆ గ్రామస్తుడు 'ఆయన ప్రపంచం వేరు, మన ప్రపంచం వేరు'—అన్నాడు. ఊళ్లో ఏదన్నా జరిగి, శాండ్‌బర్గ్‌ను పిలిచారు అనుకోండి, ఆయన ఆ పిలుపు సంగతి మరిచి పోవచ్చు. లేదా పాతబడిన ఎర్ర చొక్కా వేసుకొని రావచ్చు. ఇది ఆ సంగతి ఆయనకు పట్టకపోవడంకాదు; తీరికలేక పోవడం.న్యూయార్కులోగూడా ఒకసారి ఒక సభకు శాండ్‌బర్గ్ సర్జ్‌సూటు, తెల్లచొక్కా వేసుకుని, బూట్లు—నలిగి రంగువూసి, బీటలు వారినట్లు వున్నవి—తొడుక్కొని వచ్చాడని చెబుతారు.

అల్పపు మనుష్యులను, అల్పపు పనులను ఆయన సహించలేక పోయేవాడు; అతిధోరణి మనుష్యులంటే, ఏవగించుకునేవాడు. యువకులైన రచయితలను, జర్నలిస్టులను ప్రోత్సహించేవాడు. వారిని వారి ఇళ్లకు వెళ్లి పల్కరించి వచ్చేవాడు.

శాండ్‌బర్గ్ మంచి వక్త. న్యూయార్కు టైమ్సులో గ్రంథసమీక్షలు చేస్తూవుండే వారిలో ఒకడు - అతని పేరు హార్వే బ్రెయిట్— శాండ్‌బర్గ్ యొక్క మాటకారితనాన్ని గురించి ఇట్లా వ్రాశాడు: 'ఆయన మాటలాడే ధోరణిలో పట్టిఇవ్వడం అనేది లేదు. నిర్నిబంధంగా మాటలు వచ్చేస్తూవుంటాయి. ఆయనలో ఆయనే మాట్లాడుకుంటున్నాడా అనిపిస్తుంది. ఆయనలో చర్చ అన్నదే లేదు. చర్చకు దిగితే, అప్పటి పాత పద్ధతులకు ఒప్పుకున్నట్లే లేదు. ఏపని వాదం జరిపినా, ఆయన సహజమైన వక్రోక్తిలో కూడి, ముక్కుకు సూటిగాలేని మాటలలో నివేదం పండిన పద్ధతిలో వుండేవి.'— 'టస్ హీల్' అనే పత్రికలో ఫ్రెడరిక్ వాన్ డైన్—శాండ్‌బర్గ్ నద్దురించి గురించి చెప్పిన మాటలను చూడా చూడండి. అతను ఇట్లా అన్నాడు: 'ఆయన మాట్లాడుతూవుంటే, ప్రతిశబ్దమైన పవనాలం అన్నీ అదృశ్యంగా దొర్లిపోతూ వుంటుంది. ఆ పవనాలం లేకుండా వుంటుందా అంటే అదీ కన్పించదు. ఎంతో గాంభీర్యం ఉట్టిపడుతూవుంటుంది. చూస్తూవుంటే, 'పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్'లోంచి మాటలను పట్టుకొచ్చి ఇచ్చట ఉపయోగించుకుంటున్నాడా అనిపిస్తుంది. ఆయన ఒక విచిత్రపు పని చేసేవాడు; అంతపెద్ద మాటలలోను, కొంచెం గ్రామ్యాన్ని జోడించి, మాట్లాడే విషయానికి ఒక వింత అందాన్ని తెచ్చిపెట్టేవాడు.'

శాండ్‌బర్గ్ మాట్లాడుతూవుంటే సంగీతం పల్కుతూ వున్నట్లు వుండేది. ఏదో ఉత్తమ ప్రార్థన చేస్తున్న పద్ధతిలో వుండేది. అది కొంతసేపు కఠినమై, విరసమై, చెళ్లున కొడుతున్నట్లు వుండేది. తనకు ఇష్టంలేని విషయాన్ని వర్ణిస్తూ వున్నప్పుడు, అప్పుడు ఉపయోగించే మాటలను, అవి ఏవో అసహ్యంగా వున్నట్లు, వాటిని తాకరాదన్నట్లు, ఉపయోగించేవాడు. ఇంగ్లీషు భాషలో 'Exclusive' అన్నమాట వుంది. ఆ మాట అంటే శాండ్‌బర్గ్‌కు పరమ అసహ్యం. ఆ మాటను ఎప్పుడు అన వలసి వచ్చినా, ఆ మాట అంటే తనకువున్న అసహ్యమంతాపెట్టి అనేవాడు. 'ఇంగ్లీషుభాష మొత్తంమీద ఇంతకన్నా అసహ్యమైన మాట ఇంకోటి లేదు. నీవు 'exclusive' అయినప్పుడు, నీవు కళ్ళు మూసుకొనడమే అవుతున్నది. ఎంతో ప్రపంచం, ఎంతో మానవలోకం నీ మనస్సుకు కన్పించదు. నీ హృదయానికి అందదు. నీకు ఆ ప్రపంచాన్ని, ఆ మానవలోకాన్ని అర్థం చేసుకోగల శక్తి లుప్తమై పోతున్నది' అనేవాడు.

ఆయన ఈ విషయాన్నిగూర్చి మాట్లాడ గలడు, ఈ విషయాన్ని గురించి మాట్లాడలేడు—

అని లేదు. మేక్‌నాల్‌దగ్గరనుంచి లింకన్‌దాకా, మేక పిల్లల్దగ్గరనుంచి, విశేషణాల (adjectives) దాకా ఆయన మాట్లాడేవాడు. ఈ adjective లు అంటే ఆయనకు మహా ఏహ్యమంట. ఏదన్నా హాస్యపుమాట చెప్పి, తనకు తానే గుబ్బున నవ్వేవాడు. వెంటనే గాఢ శీరమై, ఘాటైన విషయాన్ని ఎత్తుకునేవాడు. అప్పుడు ఆయన ముఖం తీక్ష్ణం అయ్యేది. ఆయన కళ్లు కరుకు తేలేవి. తల కొంచెం క్రిందకు దింపే వాడు. మాట్లాడేవాడు.

'నేను చాలా కష్టపడ్డాను. నా జీవితం కష్టాలలో నడిచింది. ఈ జీవితంలో మూడు యుద్ధాలను చూచాను. రెండుసార్లు ఆర్థిక సంక్షోభాలు వచ్చాయి. అయితే ఏమి? నేను ఒక్కసారిగూడా అమెరికా భవిష్యత్తును గూర్చి శంకాసంకలుణ్ణి కాలేదు. అమెరికా భవిష్యత్తులో నా విశ్వాసం సడలేలేదు. నేను ఎన్నిసార్లు ఇంకా నా జీవితంలో ఈ దేశంలో నరనారీ లోకం దిగజారి, భయపడి, ఆందోళన చెందడం చూడలేదు! ఎన్నిసార్లు వారిలో అవ్యవస్థలు వారిలో తుపానులు చెలరేగడం దర్శించలేదు. ఇటువంటి కష్టమైనస్థితి వచ్చినప్పుడల్లా, ఈదేశంపెద్దల ముఖాలలోనే దైన్యం తాండవించడం చూచాను. వారిలో నిస్పృహ నిబిడం కావడం కనుగొన్నాను. కాని వారు ఏవిధమైన భావప్రపంచాన్ని ప్రపంచించారో, అది జయించింది. ఎప్పుడూ జయించింది. నాకు కళ్లముందు ముందుఎంతో మంచిరోజులు కన్పిస్తున్నాయి. ఇచ్ఛాశక్తి, వివేకముఅన్న వస్తువులుకల పురుషులు, స్త్రీలు సాధించలేనిది ఏమి వుంది! అట్టివారికి సాధ్యమై ఉజ్వలోదర్కాలైన దినాలు వస్తాయి. నాకు అందులో ఎటువంటి అనుమానము లేదు.'

ప్రజాస్వామ్యం అన్నా, అమెరికాలో అది ఆచరింపబడుతూవున్న పద్ధతిఅన్నా శాండ్‌బర్గ్‌కు అమితమైన ప్రేమ.

1941 లో శాండ్‌బర్గ్ ఇట్లా వ్రాశాడు. 'ప్రజాస్వామ్య పద్ధతియొక్క లక్షణం ఎటువంటిదంటే, కాలం గడుస్తూవున్న కొద్దీ ఆ పద్ధతిక్రింద ఎక్కువమందిమనుష్యులకు ఎక్కువస్వేచ్ఛ లభిస్తూ వుంటుంది. వాక్స్వాతంత్ర్యానికి వాక్స్వాతంత్ర్యము, ఆలోచనాస్వాతంత్ర్యానికి ఆలోచనాస్వాతంత్ర్యము అధికం అవుతూ వుంటాయి. ఆ ప్రజలకు, వారి జీవితాన్ని వారు దిద్దుకునే స్వేచ్ఛ లభిస్తుంది. వారి జీవితాన్ని వారు రూపుపొందించుకుంటూ, వారి జీవితాన్ని వారు మార్చుకోగల అధికారం వస్తుంది. వారికి ఇష్టం అయితే వారు ఇవి అన్నీ చేసుకోగలరు. మరి ఇంకో పద్ధతిలో ఇటువంటి స్వేచ్ఛ, ఇటువంటి స్వాతంత్ర్యము లేవు. ఈ వైయక్తిక స్వాతంత్ర్యము, వైయక్తిక అభివ్యక్తికి విస్తృతమైన అవకాశం, మానవునియొక్క మానసిక స్వేచ్ఛయందు, మానవునియొక్కవ్యక్తిత్వసమగ్రతయందు అచంచలమైనవిశ్వాసము అవక్రమైనమర్యాదకల పద్ధతి ఇది ఒక్కటే. ప్రజాస్వామ్యపద్ధతి లక్ష్యము, ఆదర్శము ఇవే.'

శాండ్‌బర్గ్ దేశభక్తుడు, లింకన్ భాష్యకారుడు మాత్రమేకాదు; ఆయన మహాకవి. కవిత్వాన్ని గురించి మాట్లాడ్డం ఆయనకు ఇష్టం. ఆయన స్వయంగా ఎబ్బెరికాలులేని కవిత్వం వ్రాశాడు. ముఖ్యంగా ఆ కవిత్వం వ్రాయడం ప్రారంభించిన తొలి రోజుల్లో. ఇప్పుడు యువతరం వారుగూడా ఎబ్బెరికంలేని కవిత్వం వ్రాస్తున్నారు. ఆ కవిత్వాన్ని గురించి శాండ్‌బర్గ్ అభిప్రాయాలు శాండ్‌బర్గ్‌కు వున్నాయి. ఈ కొత్త కవిత్వాన్ని గురించి ఆయన ఇట్లా వ్రాశాడు.

'ఈ రోజుల్లో తలకాయి (Cerebral) కవిత్వం వ్రాస్తున్నారు.' ఈ Cerebral అనేమాట అంటే శాండ్‌బర్గ్‌కు అసహ్యం. (అంత అసహ్యంతోను ఆయన ఆ మాటను ఉచ్చరించేవాడు.) "ఆ కవిత్వం మెదడు ఊడిపడినట్లు వుంటోంది. దాంట్లో నెత్తురు వుండదు. పాలిపోయి వుంటుంది. దయనీయంగా వుంటుంది. ఆ కవిత్వం మనకు అర్థం కావాలి అంటే, అడుగున అధోజ్ఞాపికలు వుండాలి. కొన్ని సందర్భాలలో బొమ్మలుకూడా వేస్తేనేగాని తెలియదు."

భావోద్వేగం వెల్లివిరిసే కవిత్వం అంటే శాండ్‌బర్గ్‌కు ఇష్టం. రాబర్ట్ ఫ్రాస్ట్ కవిత్వం ఆయనకు నచ్చింది. 'అది తేలిక మనుష్యులు చదివే కవిత్వం కాదు, ముఠాల కవిత్వం కాదు. గుండె

నిబ్బరం కలవాళ్ళు చదివి ఆనందించేది'' అని ఆ కవిత్వాన్నిగూడా ఒకసారి శాండ్‌బర్గ్ అన్నాడు.

'కవిత్వానికి పది నిర్వచనాలు'అని శాండ్‌బర్గ్ ఒక వ్యాసం వ్రాశాడు. మచ్చుకు రెండు నిర్వచనాలు. వాని సంగతి చూస్తే కవిత్వం అంటే ఏమిటని ఆయన భావిస్తూ వచ్చాడో అర్థం అవుతుంది.

'కవిత్వం అంటే తలుపులు తెరవడం; తలుపులు మూయడం. ఆ ఉన్న్మీలన నిమీలనాల నడిమి ఎడములో అవలోకనం చేసినవారికి దజ్ఞక్షణంలో ఏమి గోచరిస్తుందో అది కవిత్వం అవుతుంది.'

'కవిత్వం ఒక సమన్వయం--హైయసింత్‌కు, బిస్కట్లకు మధ్య.'

కవి శబ్దవాచ్యుడు ఎవడు? ఒక మనిషి కవి ఎట్లా అవుతున్నాడు? అంటే అందుకు శాండ్‌బర్గ్ సమాధానం ఇది :

'రచయిత అన్నవాడు తనకు తోచింది వ్రాస్తాడు. కవి అయినవాడు, ఏది తాను విధిగా వ్రాయడం అవసరమో అది వ్రాస్తాడు.'

1936 లో శాండ్‌బర్గ్ 'ది పీపుల్—ఎస్' (The People, Yes) అన్న పద్యసంకలన గ్రంథాన్ని ప్రకటించాడు. ఆ గ్రంథం అంటే ఆయనకు చాలా ఇష్టం. అందులో విషయం మానవలోకంయొక్క శక్తి; మానవలోకంయొక్క సభ్యత; ఆ గ్రంథంలో శాండ్‌బర్గ్ యీ మహాలక్షణాలను పునరుద్ఘాటనం చేశాడు. ఆయన చెప్పిన ఆ పద్ధతి ఉత్తుంగంగా వుంటుంది. దాన్నిగురించి ఆయన ఇట్లా వ్రాసుకున్నాడు :

'గెట్టీస్‌బర్గ్ ప్రసంగం చివరి మాటలకు ఇది నా అధోజ్ఞాపిక.'

(This is my footnote to the last words of the Getteysburg address.)

ఒక్కొక్క రోజున శాండ్‌బర్గ్ ఇల్లువదలి, గ్రామం ప్రక్కనవున్న అడవులకు పోతూవుండేవాడు. ప్రొద్దున బయలుదేరిపోతే ఇక రాత్రికే ఇంటికి రావడం. ఆయన అనేవాడు. 'ఒక్కొక్కప్పుడు మనిషి అట్లా దూరం అవుతూ వుండాలి. ఏకాంతాన్ని అనుభవించాలి'. ఈ ఏకాంతం ఒంటరితనం కాదు. (దానిని ఆయన loneliness అన్నాడు.) 'ఏకాంతంలో ఒంటరితనంలో ప్రయాణించినవాడే, తన్ను తాను తెలిసికో గల్గుతాడు. లోపలనుంచి వారికి అర్థం అవుతుంది. నేను ఒకరాయినేమో, ఒక మొక్కనేమో అనిపిస్తుంటాను. నాలో నేను అనుకుంటాను. 'ఓం! శాండ్‌బర్గ్! నువ్వు ఎవరు? నీవు ఎక్కడ వున్నావు? ఎక్కడికి పోతున్నావు?'

శాండ్‌బర్గ్ జీవితంలోని ఒంటరితనం ఇది. ఈ జిజ్ఞాసరోజే ఆయన జీవితం 1878 జనవరి 6 న ప్రారంభం అయింది. గేల్స్‌బర్గ్‌లో ఆయన జన్మించాడు. అది అమెరికాలో 'ఇల్లినాయ్' రాష్ట్రంలో వుంది. గ్రీన్‌ఫీల్డ్సు, గేల్స్‌బర్గ్‌కు మధ్య దూరం నంద మైళ్ళు. గ్రీన్‌ఫీల్డ్ అప్రసిద్ధ ఊరు. శాండ్‌బర్గ్ తండ్రిపేరు ఆగస్టు. తల్లి క్లారా. స్వీడన్‌నుంచి అమెరికాకు వచ్చారు. గేల్స్‌బర్గ్ రైలు మార్గంలకు దూరరి. అక్కడ శాండ్‌బర్గ్ తండ్రి కమ్మరం పనిలో వుండేవాడు. వారానికి ఆరు రోజులు పని. రోజుకు పది గంటలు పనిచెయ్యాలి. అతనికి వ్రాయను రాదు. కొంచెపుమాత్రంగా చదవడం వచ్చు. సాయంత్రంపూట ఆ తండ్రి వంగి కూర్చుండి, బైబిలు చదువుతూవుండటం శాండ్‌బర్గ్‌కు గుర్తు వుంది. కారల్ శాండ్‌బర్గ్ చదవడం నేర్చుకున్నప్పుడు మొట్టమొదట చదివిన గ్రంథం అదే. అతను ఆ గ్రంథాన్ని చేతబట్టి, బిగ్గరగా చదివేవాడట. శాండ్‌బర్గ్ ముందు కొంచెం స్వీడిష్‌భాష నేర్చుకున్నాడు. తర్వాత వానికి ఇంగ్లీషు పర్యాయాలు లభ్యపించాడు.

ఆ యింటిలో చదువు అల్పం; డబ్బులేదు. డొక్కలు నిండాలిఅంటే రెక్కలు ఆడాలి. వారికి ఉన్నది ఒక్కటే. అది ఆత్మవిశ్వాసం. అది మాత్రం పుష్కలంగా వుంది. క్లారా శాండ్‌బర్గ్ విశిష్ట గుణ సంపత్తిగల వ్యక్తి అని తోస్తుంది. 1926 లో ఆమె కుమారుడికి ఒక ఉత్తరం వ్రాసింది. ఆ తర్వాత ఆమె ఆట్టేకాలం బ్రతకలేదు. ఆ వ్రాసిన ఉత్తరంలో ఈ వాక్యాలు వున్నాయి :

'చిన్నప్పుడు రోజులు కలిసిరాకపోతే, ఆ జీవితం దాదాపుగా వృథా అయిపోతుంది. ఆ తొలినాళ్ళలో

ఒక ఇల్లు, ఆ యింటిలో ఒక ఆలోచన, ఒక ప్రేమ ఇవి వుండాలి. ఇవి వున్నప్పుడు ఎటువంటి కష్టం వచ్చినా, అది కష్టంగా వుండదు. దాన్ని తేలిగ్గా భరించవచ్చు!.....జీవితంలో నేను చాలా కష్టాలు పడ్డాను. నలిగిపోయాను. కాని చచ్చిపోలేదు. నేను మౌనంగా వుండటం నేర్చుకున్నాను. ఆ మౌనం నాకు అవగుంఠనం అయిపోయింది. మౌనం ఒక వరం. కాబట్టి మౌనం వహించు......'

కారల్ శాండ్‌బర్గ్ స్థానిక పాఠశాలల్లో విద్యాభ్యాసం చేశాడు. అది సాగలేదు. అతనికి పదమూడవ ఏట ఆ చదువుకు అంతరాయం కల్గింది. కుటుంబాన్ని పోషించవలసిన బాధ్యత కొంత ఆయనమీదపడింది. తండ్రికి చేదోడు వాదోడు కావలసి వచ్చింది. అతను పాలబళ్లు తోలాడు. మంగలిషాపులో పనిచేశాడు. ఊళ్లోవున్న నాటకాల హాలులో తెరలు ఎత్తే దించేవాడుగా కుదిరాడు. ఇటుకలుచేసే వారికి బళ్లుతోలే వాడుగా వున్నాడు. అతను పెద్దవాడవుతున్నాడు. పద్దెనిమిదేళ్లు వచ్చాయి. ఇప్పుడు అమెరికా పశ్చిమ రాష్ట్రాల మైదానాలలో, కొండలలో అతను సంచరించాడు. సరుకుల బళ్లు తోలాడు. ఆ బళ్లు ఎచ్చటోవున్న కొలరెడో రాష్ట్రంలోని కానస్‌నగరందాకా పోతూవుండేవి. కాన్సాస్‌లో గోధుమ చేలలో పనిచేశాడు శాండ్‌బర్గ్. వైయమాంగ్ హోటళ్లలో, నెబ్రాస్కా రెస్టారెంట్లలో గిన్నెలు కడిగాడు శాండ్‌బర్గ్. వ్యవసాయ క్షేత్రాలను, నగరాలను, పశువుల క్షేత్రాలను దర్శించాడు, 'కౌబోయస్'ను చూచాడు, రైతులను తెలుసుకున్నాడు. అతని జీవితంలో ఆయా నడచిన కాలం వట్టి గడ్డు కాలం. ఒక్కొక్కప్పుడు అతను పరమ నిర్వేదం చెందుతూ వుండేవాడు. వట్టి దిగనాసిల్లిపోతూ వుండేవాడు. ఆత్మహత్య చేసుకుందామా అన్న ఆలోచనలు కూడా ఆ కాలంలో అతనికి వచ్చాయి. ఎట్లా ఆత్మహత్య చేసుకొనడమా అనిగూడా అతను ఆలోచనలు చేశాడు. చేసి, చేసి, అట్టి నిష్ఠుర సంకల్పాల నుంచి విముక్తుడు అవుతూ వచ్చాడు. అప్పుడు అతనిలో చిరుసంతోషపురవళులు విన్పిస్తూ వుండేవి.

అమెరికా పశ్చిమ రాష్ట్రాలనుంచి శాండ్‌బర్గ్ తిరిగి గేల్స్‌బర్గ్ చేరుకున్నాడు. చేరుకొని వూరుకోలేదు. ఇళ్లకు రంగులువేసే ఉద్యోగాన్ని చేపట్టాడు. ఇది 1898 నాటి సంగతి. అప్పుడు స్పెయిన్‌కు, అమెరికాకు మధ్య యుద్ధం ఆరంభం అయింది. శాండ్‌బర్గ్ యుద్ధంలో చేరాడు. ఎనిమిది నెలలు సైన్యంతోపాటు పోర్టోరికోలో వున్నాడు. తిరిగి పౌరజీవితంలో ప్రవేశించేనాటికి శాండ్‌బర్గ్ వయస్సు 20 సంవత్సరాలు. అప్పటికి అతను కాగితంమీద కలం పెట్టిందే లేదు. కాని లింకన్‌జీవితచరిత్రను వ్రాయాలన్న కుతూహలం అతనిలో ఉదాత్తమైన బీజాన్ని పోలివుంది. అతను జన్మ ఎత్తింది ఇల్లినాయి రాష్ట్రంలో, లింకన్‌దేశంలో. 1859 లో గేల్స్‌బర్గ్‌లో పెద్దసభ జరిగింది. ఆ సభలో స్టీఫెన్ డగ్లస్‌కు, అబ్రహాం లింకన్‌కు పెద్దచర్చ జరిగింది. అది బానిసత్వ సమస్యను గురించి. ఆ ప్రసంగాన్ని విన్నవాళ్లు, ఆ చర్చను చూచినవాళ్లు శాండ్‌బర్గ్ చిన్ననాటికి గేల్స్‌బర్గ్‌లో కొంతమంది వున్నారు. 1878 లో శాండ్‌బర్గ్ జన్మించాడు. లింకన్ చనిపోయి అప్పటికి పదమూడు సంవత్సరాలైంది. లింకన్ చనిపోయినాడన్నమాటేగాని, ఆయన పలుకుబడి చావలేదు. ఆయన్ను దేశం మరిచిపోలేకపోయింది. ఆయన చనిపోయినాడేగాని, దేశం ఆయన వున్నట్లే ఒక అభిభావాన్ని పొందుతూవచ్చింది. లింకన్ జీవిత చరిత్రలో తొలి సంపుటం పీఠికలో శాండ్‌బర్గ్ ఈ విషయాన్ని ఇట్లా వర్ణించాడు:

'నేను ఇల్లినాయి పచ్చికమైదానాలలో ఒకానొక పట్టణంలో పుట్టి పెరుగుతున్నాను. గ్రాంటు, షెర్మాన్‌ల క్రింద సైనికులుగా పనిచేసి పోరాటాలు సాగించివున్న సైనికులను చూస్తూవున్నాను. అబ్రహాం లింకన్‌ను గురించి గ్రామవృద్ధులు చెప్పేకథలు వింటున్నాను. 1898 లో నేను ఇల్లినాయి వాలంటీర్సు ఆరవదళంలో పనిచేశాను. పోర్టోరికోలో నిలిచిన మా సేనలకు అధిపతి నెల్సన్‌మైల్స్. 1864 లో జరిగిన ఘోరయుద్ధాలలో మైల్స్ బ్రిగేడియ జనరల్‌గా పనిచేసివున్నాడు. మేము వేసుకున్న దుస్తులు పొటమాక్ యుద్ధంలో పాల్గొన్న సైన్యం దుస్తులు వంటివే. నీలం ట్రౌజర్లు, ముదురు నీలపు జాకెట్లు, వాటికి ఇత్తడి గుండీలు.'

శాండ్‌బర్గ్ ఇంకా వ్రాత మొదలు పెట్టలేదు. కాని లింకన్‌నుగూర్చి మననం చేస్తున్నాడు. ఆ ఆలోచనలు ముందు ముందు ఫలవంతాలు కానున్నాయి.

1898 యుద్ధం ముగిసిన అనంతరం శాండ్‌బర్గ్ ఇంకా సైన్యంలోనే వుందామనుకున్నాడు. వెస్ట్‌పాయింట్‌లోవున్న మిలటరీఅకాడమీలో స్థానం కూడా సంపాయించాడు. సైన్యంలో పైకి రావాలంటే పరీక్షలు కావాలి. అందుకోసం శాండ్‌బర్గ్ ప్రయత్నాలు చేశాడు. ఆ చదువు రెండు వారాలే సాగింది. శాండ్‌బర్గ్‌ను బర్తరఫ్ చేశారు. అతను లెక్కల్లో తప్పాడు. 'గ్రామర్'లో దెబ్బతిన్నాడు. అతనితో ఆ రోజుల్లో 'వెస్ట్ పాయింట్'లో చదువుకున్నవారిలో అమెరికా 18 వ అధ్యక్షుడు గ్రాంట్ మనుమడు మూడవ గ్రాంటు, జనరల్ మెకారర్‌లు వున్నారు.

సైన్యంలో అతని పని అయిపోయింది. ఇక మామూలు చదువు మిగిలింది. శాండ్‌బర్గ్ గేల్స్‌బర్గ్‌లో లొంబార్డ్ కాలేజీలో చేరాడు. జీతంలేదు. బాగా చదువుతాడని ఆ సహాయం చేశారు. ఇతరమైన ఖర్చులు వుంటాయికదా! అందుకు బడి వదిలిన అనంతరం శాండ్‌బర్గ్ వేరేపనులు చేసేవాడు. 1902 దాకా ఈ చదువు సాగింది. కాని అతను పట్టభద్రుడు కాలేదు. కాలేజీలో బాస్కెట్‌బాల్ ఆడేవాడు. ఉపన్యాసాలు ఇచ్చేవాడు. ఆ రోజుల్లోనే కవిత్వం వ్రాయడం మొదలుపెట్టాడు శాండ్‌బర్గ్. ప్రొఫెసర్ ఫిలిప్ గ్రీన్ రైట్ అతనిని ప్రోత్సహించాడు. ఆ తర్వాత 1904 లో శాండ్‌బర్గ్ వ్రాసిన 22 పద్యాలు కలిపి ఒక గ్రంథంగా వేసినప్పుడు, ఈయనే అందుకుఅయిన ఖర్చు అంతా పెట్టుకున్నాడు.

శాండ్‌బర్గ్ మళ్లీ దేశంమీద పడ్డాడు. వస్తువుల అమ్మకం ఇప్పుడు అతని ఉద్యోగం. అనేక రకాల వస్తువులు అమ్మకం చేయడానికి 'సేల్సుమాన్'గా కుదిరాడు. ఆ అమ్మిన వానిలో 'స్టీరియోస్కోపిక్ ఫోటోగ్రాఫులు'గూడావున్నాయి. 1908లో శాండ్‌బర్గ్ వివాహం అయింది. లిలియన్ స్టీషెన్ అన్న ఆమెను ఆయన పెండ్లి అయినాడు. ఆమె తెలివి కలది. షికాగో విశ్వవిద్యాలయంలో పట్టభద్రురాలు. అన్నింటికి మించి ఆమె ఎడ్వర్డ్ స్టీషెన్ సోదరి. ఎడ్వర్ స్టీషెన్ ఆ తర్వాత జగత్ప్రసిద్ధివహించి ఛాయా చిత్రగ్రాహకుడైనాడు.

ఈ కాలంలో శాండ్‌బర్గ్ భార్యతోసహా మిల్వాకీలో కాపురం పెట్టాడు. ఈ పట్టణం విస్కాన్సిన్ రాష్ట్రంలో వుంది. అప్పుడు శాండ్‌బర్గ్ ఒక్కసంవత్సరంపాటు సోషలిస్టు డెమోక్రాటిక్ పార్టీ ఆర్గనైజరుగా పనిచేశాడు. 1910 మొదలు 1912 వరకు ఆయన మిల్వాకీ మేయరుకు కార్యదర్శి. అంతలో ఆయనకు ఒక పత్రికలో ఉద్యోగం లభించింది. ఆ పత్రిక పేరు 'System'. అది వ్యాపార విషయాలకు సంబంధించిన పత్రిక. ఆ పత్రికలో శాండ్‌బర్గ్‌ను అసోసియేట్ ఎడిటర్‌గా వేశారు. శాండ్‌బర్గ్ షికాగోకు కాపురం మార్చాడు.

లింకన్ జీవితచరిత్ర రచనకు కావలసిన విషయ సామాగ్రిని ఆయన సేకరించడం మొదలు పెట్టాడు. ముందు ఆయన అనుకున్నది, చిన్నపిల్లలు చదువుకునేందుకు వీలుగా ఒక చిన్నగ్రంథం వ్రాద్దామని. ఆ గ్రంథం ఒక మూడువందల పేజీలువుంటే చాలునని.

ఈ ఆలోచనలు చేస్తూనే ఆయన కవిత్వం వ్రాయడం మొదలుపెట్టాడు. 1914 లో ఆయన కొన్ని పద్యాలను "Poetry" అనే పత్రిక ప్రకటించింది. ఆ పత్రికను హారియట్ మన్రో నడుపుతూ వుండేవాడు. అమెరికన్ కవులలో బహుప్రసిద్ధుల రచనలు మొట్టమొదటిసారిగా ప్రకటించి ప్రోత్సహించిన గౌరవం అప్పటికే ఆ పత్రికకు వుంది. ఆ రోజులలో శాండ్‌బర్గ్ 'షికాగో' అన్న శీర్షికతో వ్రాసిన పద్యాలకు 'లెవిన్‌సన్' బహుమతి లభించింది. అప్పుడు వ్రాసిన పద్య లన్నింటిని కలిపి 'షికాగో పద్యాలు' అన్న నామధేయంతో ఒక గ్రంథం 1915 లో ప్రచురింపబడింది. అప్పటికి శాండ్‌బర్గ్ వయస్సు 37 ఏళ్లు.

1919 లో శాండ్‌బర్గ్ స్టాక్‌హోం వెళ్లాడు. ఒక పత్రికలసంస్థ తరఫున విలేఖరిగా వెళ్లాడు. యుద్ధం ముగిసిన అనంతరం తిరిగి షికాగోకు తిరిగివచ్చి 'షికాగో డెయిలీ న్యూస్' పత్రికలో చేరాడు. కొంతకాలం విలేఖరిగా, కొంతకాలం సంపాదకీయ రచయితగా, కొంతకాలం—ఇది విచిత్రం అనిపిస్తుంది—సినిమా వార్తల ఎడిటరుగా పనిచేశాడు శాండ్‌బర్గ్. 1933 లో పత్రికల పనిలోంచి విముక్తుడైనాడు.

శాండ్‌బర్గ్‌కు తాను మంచి విలేఖరినన్న అభిప్రాయం వుండేది. కార్మిక సమస్యలపై ఒక విధమైన అధికారం కల్గిన నిపుణుణ్ణి అనిగూడా ఆయన అనుకుంటూవుండేవాడు. 'డెయిలీ న్యూస్'లో శాండ్‌బర్గ్‌తోపాటే బెన్‌హెచ్ట్ అనే ఆయన పనిచేశాడు. 'షికాగో రచయితలు'లోగూడా ఇద్దరూ కలిసేపని చేసేవాళ్ళు. ఆయన శాండ్‌బర్గ్‌ని కొంచెం బిడియపు మనిషిఅని, సహవాసోచితుని, మంచి కవిత్వంవ్రాసే వాడని—అన్నాడుగాని, నర్తులను అల్లడంలో నేర్పరి అని మాత్రం అనలేదు. శాండ్‌బర్గ్ విగ్రహాన్నిగూర్చి గూడా బెన్‌హెచ్ట్ చెప్పిన మాటలు వున్నాయి. 'పత్రిక ఆఫీసులో అతనిది నిండైన విగ్రహం; ఆకర్షకంగా వుండేవాడు. పాత టోపీ ధరించేవాడు. జేబుల నిండా 'News paper clippings' వుండేవి.'

1920 లో శాండ్‌బర్గ్ తన మామూలు ఉద్యోగంతోపాటు, ఇంకోరకం ఉద్యోగం గూడా ప్రారంభం చేశాడు. సభలలో అమెరికన్ జానపద గేయాలను చదవడం. కొన్ని సంవత్సరాలుగా ఆయన ఆ పాటలను ప్రోగుచేస్తూ వచ్చాడు. వానిని సభలలో చదువుతూ, తన వ్రాసిన కవిత్వాన్నిగూడా వినిపిస్తూవచ్చాడు.

అంతలో ఆయనకు లింకన్ జీవిత చరిత్ర విషయం జ్ఞాపకానికి వచ్చింది. ఆ గ్రంథాన్ని చిన్నపిల్లలకోసంకదా వ్రాద్దామని ఆయన అప్పటిదాకా అనుకుంటున్నది! ఆ తన అభిప్రాయాలను శాండ్‌బర్గ్ ఇట్లా అభివ్యక్తంచేసి వున్నాడు.

'నేను అనుకున్నాను—చిన్నపిల్లలకోసం యీ పుస్తకం వ్రాద్దామని; పిల్లలకు అర్థంఆయ్యే పద్ధతిలో వుండి, వారికి ఆనందాన్ని చేకూర్చే పద్ధతిలో వుండాలని. ఈ మనిషి చాలా విచిత్రమైనవాడు. ఇల్లినాయిస్ పచ్చికబయళ్ళలో జన్మించాడు. నేను ఆయన్నుగురించి వ్రాయడానికి కావలసిన సంభారాన్ని చేకూర్చుకుంటున్నాను......'

'వారాలు గడిచాయి. నెలలు దొర్లాయి. సంవత్సరాలు గతించాయి. నాకు ఏ రోజున కారోజు ఏదో ఒకటి—అంతవరకు ప్రచురితంకాని ఒక ఉత్తరమో—లేక News Paper clipping ఓ, ఫోటోయో దొరుకుతూనే వున్నాయి. వానిని గురించి పూర్వం ఎవ్వరూ శ్రద్ధవహించిన జాడ కన్పించలేదు. అందుకే అవి నాకు ముఖ్యం అవుతున్నాయి. ఇట్లా ఎనిమిది సంవత్సరాలు కష్టించి ఇప్పుడు ఆ పుస్తకం వ్రాయడానికి కూర్చుంటున్నాను.'

శాండ్‌బర్గ్ ఇట్లా ప్రారంభించిన పుస్తకం చిన్నపిల్లల పుస్తకంగా లేదు. 1926 లో లింకన్ జీవిత చరిత్రకు సంబంధించిన రెండు సంపుటాలను శాండ్‌బర్గ్ ప్రకటించాడు. వానికి 'The Prairie Years' అని పేరుపెట్టాడు. ఆ తర్వాత ఆగ్రంథం మరో నాల్గు సంపుటాలుగా వచ్చింది. ఇది మొదటి సంపుటాలు వెలువడిన పదమూడేళ్ల తర్వాత సంగతి. ఆ నాల్గు సంపుటాలకు శాండ్‌బర్గ్ 'The War Years' అని పేరుపెట్టాడు. లింకన్ జీవిత చరిత్ర వ్రాయడానికి శాండ్‌బర్గ్‌కు మొత్తం ఇరవై సంవత్సరాలు పట్టింది.

లింకన్ ఒక చిన్నపట్టణంలాయరు. అమెరికా పచ్చిక బయళ్లలోని దేశంలో రాజకీయవేత్తగా గూడా చలామణీ అయినాడు. ఇది ఆయన తొలి జీవితం. శాండ్‌బర్గ్ అసలు అనుకున్నది—లింకన్ ఆ జీవితాన్ని గురించి వ్రాద్దామని. కాని తీరా 'The Prairie Years'ను పూర్తిచేసిన వేళకు— 'లింకన్ నన్ను ఆవేశించినట్లైంది. నేను 'The War Years' ప్రారంభించాను' అని శాండ్‌బర్గ్ స్వయంగా చెప్పుకున్నాడు.

"The War Years" వ్రాయడంశాండ్‌బర్గ్‌కు కొంచెం కష్టం అనిపించింది. ఆ యుద్ధకాలానికి సంబంధించిన ఆధారాలు అనంతంగా వున్నాయి. ఆ కాలం అద్భుతమైంది. నాటకీయమైంది. లింకన్ స్వంతవిషయాలు వున్నాయంటే, అవి అన్నీ జటిలమైనటువంటివి. శాండ్‌బర్గ్ ఈ రోజుల్లో ఎక్కువగా సంచారం చేస్తూవచ్చాడు. ఉపన్యాసాలు ఇవ్వడము, తన పద్యాలు చదవడము, జానపదగేయాలు వినిపించడము—ఇది ఆయన పని అయిపోయింది. ఈ పర్యటనలకు శాండ్‌బర్గ్ ఒక పద్ధతి ఏర్పాటు చేసుకున్నాడు. లింకన్‌కు సంబంధించి పూర్వం పరిశోధనకు రాని విషయాలు ఎక్కడ ఎక్కడ లభించే ఎత్తువున్నదో, అక్కడికి అక్కడికి ఇప్పుడు శాండ్‌బర్గ్ వెడుతూ వచ్చాడు. Daily News పత్రికను వదిలిపెట్టివచ్చిన

తర్వాత ఆయన, ఆయన కుటుంబము మిచిగన్ రాష్ట్రంలో హెర్‌బర్ట్‌లో వుంటూవచ్చారు. అక్కడి ఇసుకదిబ్బలు ప్రసిద్ధమైనటువంటివి. అచ్చట ఒక ఇల్లు చూచుకొని శాండ్‌బర్గ్ అక్కడికి కదిలాడు. అది షికాగోకు 60 మైళ్ళ దూరంలో వుంది. శాండ్‌బర్గ్ ఆ యింటినుంచే తన యీ పర్యటనలు కొనసాగించాడు. కొన్నినెలలు పాటలు వినిపించడం, హెర్‌బర్ట్‌కు తిరిగి రావడం—సేకరించిన సమాచారాన్ని అవగతం చేసుకొనడం, వ్రాయడం—ఇది అతని కార్యక్రమం.

'ఓయి! భగవంతుడా! నేను ఎట్లా పని చేశాను. రోజుకు పదహారుగంటల చొప్పున పని చేశాను. ఒక్కోరోజున రోజుకు ఇరవై గంటలు చొప్పున పనిచేసిన సందర్భాలు వున్నాయి. ఒక్క దమ్మున ఇరవై గంటలు! నా బొమికలు నొప్పి పుట్టాయి' అని ఆయనే వ్రాసుకున్నాడు. పాతపడిన టపాకాయపెట్టెలమీద కూర్చుని శాండ్‌బర్గ్ తన యీ గ్రంథాన్ని రచించాడు. 'టపాకాయపెట్టెల దగ్గరవుండి షెర్మాన్, గ్రాంటు—తమ యుద్ధాలను నడిపించినప్పుడు, నేనూ ఆ పనే చేయగలను' అని ఆయన అనుకున్నాడు.

ఈ గ్రంథమేమో, ఉద్గ్రంథం. దాన్ని పూర్తి చేయగలనా, లేనా అన్న భయం, ఒక్కొక్కప్పుడు శాండ్‌బర్గ్‌కు కల్గుతూ వుండేది. పుస్తకం పూర్తి అయేదాకా బ్రతుకుతానా అనిపిస్తూ వుండేది. ఆయన ఇట్లా వ్రాసుకున్నాడు. 'ఆ రోజుల్లో నేను బ్రతికాను అంటే, అందుకు యీ సవాలే కారణం. ఈ గ్రంథానికి అవసరమైన సంభారాలను నేను ప్రోగుచేసుకుంటూ వున్నప్పుడు అనుకున్నాను. 'ఈ లింకన్ అనే మనిషిని అంతా గొప్పవాడు, గొప్పవాడు అంటారు. ఆ లింకన్, అంతా అంటున్నంతటి గొప్పవాడు అవునో కాదో అంతు తేల్చుకోవాలి. ఇదే సవాలు. సరే! తేల్చుకున్నాను. లింకన్ గెలిచాడు. ఆయన ఆ గొప్పతనం అంతుపట్టడానికి, అంతా అంటున్నవిధంగా ఆ మనిషి ప్రతిఅంగుళము గొప్పవాడని తెలియడానికి నాకు ఇరవైనాల్గు సంవత్సరాలు పట్టింది.'

1939లో "The War Years" ప్రకటించబడినాయి. ఆ మరుసంవత్సరం ఆ గ్రంథానికి 'పులిట్జర్ బహుమతి' లభించింది. బహుమతి ప్రదాన సంఘం శాండ్‌బర్గ్ గ్రంథంయొక్క గొప్పతనాన్ని గమనించింది. అయితే ఆ పులిట్జర్ బహుమతుల ప్రదానంలో అక్కడ ఒక చిక్కు వచ్చిపడింది.

జీవిత చరిత్రలకు సంబంధించినయితే వాషింగ్టన్, లింకన్ జీవిత చరిత్రలకు బహుమతులు అక్కరలేదని అప్పుట ఒక షరతు వుంది. ఇప్పుడు ఏమిచెయ్యాలి? ఇది ఒక ప్రహేళికలాగా తయారైంది. కాని పరిష్కరించబడింది. శాండ్‌బర్గ్‌కు 'History' క్రింద ఆ బహుమతిని ఇచ్చారు. 1951 లో ఇంకో సారి ఆయనకు పులిట్జర్ బహుమతి లభించింది. అది ఆయన కవిత్వానికి.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో శాండ్‌బర్గ్ యుద్ధప్రచారంకోసం రేడియో ప్రసంగాలు చేశాడు. డాక్యుమెంటరీ ఫిలిమ్‌లకు కామెంటరీలు వ్రాశాడు. షికాగో టైమ్సు పత్రికలో ఒక 'ఫీచరు'గూడా వ్రాస్తూ వుండేవాడు. 1945 లో ఆయన, ఆయన భార్య ఉత్తర కెరోలైనాకు మారారు. వారు మేకలను పెంచేవాళ్లు. ఆ మేకల మేతకోసమేగాక, వారి ఆరోగ్యంకోసంగూడా యీ మార్పు జరిగింది. 1948 లో శాండ్‌బర్గ్ తన మొదటి నవలను ప్రకటించాడు. అదే ఆయన చివరి నవల గూడా. ఆయన ఒక్కటంటే ఒక్కటే నవల వ్రాశాడు. అది 'Remembrance Rock;' ఇది చాలా పెద్ద నవల. అమెరికాకుచేరుకొన్న తొలి యాత్రికులతో మొదలై, అంతర్యుద్ధం రోజులదాకా ఇందులోని కథ సాగుతుంది. ఈ నడమి చరిత్రలో అమెరికా ఎదుర్కొనివున్న సర్వమైన కష్టకాలాలు ఈ నవలలో ప్రదర్శించబడినాయి. శాండ్‌బర్గ్‌కు దేశం అంటే వున్న ప్రేమ అపారమైంది. ఆ ప్రేమకు ఆయన యీ నవలలో కవిత్వసుందరంగా అభివ్యక్తిని కల్పనచేసి వున్నాడు.

తన డబ్బది అయిదవ పుట్టినదినం రోజున శాండ్‌బర్గ్ ఇంకో పుస్తకాన్ని ప్రకటించాడు—"Always the Young Strangers" అని. ఇది ఒక విధంగా శాండ్‌బర్గ్ జీవిత చరిత్ర. గేల్స్‌బర్గ్‌లో తనువున్న చిన్ననాటివిషయాలను అన్నింటిని ఆయన ఇందులో ప్రవేశపెట్టాడు. తన సంచారా

లను గురించి, పోర్టొరికోరో తన సైనికపు దివాలను గురించి వ్రాశాడు.

1954 లో ఇంకో పుస్తకం వెలువడింది. అది లింకన్ జీవిత సంగ్రహం. ఆ గ్రంథం రచించడానికి మూడు సంవత్సరాలు పట్టింది. లింకన్ జీవితాన్ని కుదించి కుదించి, వ్రాసింది మళ్లీ వ్రాసి వ్రాసి, ఆయన తన యీ సంగ్రహ గ్రంథాన్ని వెలయించాడు.

శాండ్‌బర్గ్ రచనలు మొత్తం ముప్పది సంపుటాలుగా వెలువడినాయి. వీనిలో ఎనిమిది సంపుటాలు కవిత్వసంపుటాలు. నాలుగు సంపుటాలు చిన్నపిల్లలకు పనికివచ్చేవి. ఈ పిల్లలకు పనికివచ్చే సంపుటాలలో ఒకటి అబ్రహాం లింకన్‌కు సంబంధించింది. రెండు సంపుటాలు అమెరికా జానపద గేయాలు; ఒక నవల; ఒకటి ఆయన జీవిత చరిత్ర. ఇంకొకటి ఆయన బావమరది– శ్రీ ఎడ్వర్డ్ స్టీచెన్ జీవితం; ఆరు సంపుటాలు లింకన్ జీవితం; మరికొన్ని ఇతర గ్రంథాలు.

శాండ్‌బర్గ్ ఇంత వ్రాశాడు. ఎందుకట? ఇటువంటి ప్రశ్నకు ఆయన భార్య ఇచ్చిన సమాధానం ఇది:

'ఆయన ఇరవై సంవత్సరాలు రచనావ్యవసాయం చేశారు. రాత్రివేళల్లోగూడా నిద్రపోయేవారుకాదు. అప్పుడూ వ్రాస్తూనే వుండేవారు. ఆ వ్రాసింది అంతా ప్రకటింపబడుతుందన్న నమ్మకం ఏమన్నా వున్నదా? అదే లేదు. అంతా అస్థిమితంగా వుండేది. ఆ రోజుల్లో ఆయన కవిత్వమే వ్రాస్తూ వుండేవారు. వ్రాస్తూ, ఆ వ్రాసింది లోకం ముఖం చూచేట్లు అచ్చువేయించుకోడానికి డబ్బు కూడబెడుతూ వుండేవారు. ఆ పద్యాలను నేను పత్రికలకు పంపుతూ వుండేదాన్ని. అవి అచ్చుపడక తిరిగి వచ్చేస్తూవుండేవి. మళ్లీ పంపుతూ వుండేదాన్ని. మళ్లీ తిరిగి వస్తూ వుండేవి......ఒక్కరోజున దేశం ఆయన్ను కవి అన్నది. కాని ఆయన పనిలో మార్పులేదు. పూర్వం ఎట్లా పనిచేస్తూ వచ్చారో, ఇప్పుడు అంతే. ఏవిధంగా నన్నా ననండి, ఆయన తనకోసం, తన ఆదర్శాలకోసం ఆ పని అంతా చేశారు. ఒక పుస్తకం రాస్తే, అది తనకు గూడా మంచిపుస్తకంగా వుండాలి. అది ఆయన పద్ధతి. లింకన్‌మీద మంచిపుస్తకంవుంటే బాగుండును అనుకున్నారు అందుకోసం ఆ మంచి పుస్తకాన్ని వ్రాశారు. ప్రతివిషయంలో ఆయన ఇంతే. ఆయన ఆదర్శాలు, లక్ష్యాలు ఏవో ఆయనకు వున్నాయి. చదివే మనుష్యులు లేరనుకోండి, అయినా, ఆయన ఆ లక్ష్యాలు, ఆ ఆదర్శాలు గురించి వ్రాస్తారు.'

ఇది శాండ్‌బర్గ్ జీవితం. ఆ జీవితాన్నిగురించి ఆయన ఏమనుకున్నాడు? తన్ను లోకం ఏవిధంగా మన్నిస్తే చాలు ననుకున్నాడు. చూడండి, ఇవిగో ఆయన మాటలు:

'నన్ను ఇట్లా గుర్తుపెట్టుకుంటే చాలు. నాకు కావలసింది ఏమీలేదు. ఒక మనిషి అన్నాట్ట: నాకు జీవితంలో మూడు ముఖ్యంగా—పోనీ—నాలుగనుకోండి—వుంటే చాలు. ఒకటి జైలులో పడకుండా వుండటం; రెండు— వేళపట్టున భోజనం; మూడు— నేను వ్రాసింది అచ్చుకావడం—ఇవి చాలు. ఇక నాల్గది అంటారా, అది ఇది. ఇల్లు గూడా సుఖంగా వుండాలి. కొంచెం ప్రేమ, ఇంటా బయటా లభిస్తూవుండాలి.'

ఇట్లా అని ప్రజను మరిచిపోవాలని కాదు. ఆప్రజను గూర్చి ఆయన మనకు జ్ఞాపకం చేస్తాడు. శాండ్‌బర్గ్ ఒక పద్యం వ్రాశాడు—"The People Will Live On" అని. ఆ పద్యంలో చివరిపంక్తులు ఇవి:

"In the darkness with great bundle of grief the people march."

"In the night and overhead a shovel of stars for keeps, the people march."

Where to? What next?

[కారల్ శాండ్‌బర్గ్ తమ 89 వ యేట 1967 జూలై 22 న మరణించారు.]

# బాలగంధర్వ

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

బళ్ళారి రాఘవాచార్లుగారు ఆంధ్రలో "రామదాసు" నాటకం ఆడుతున్నారు. ఆయన పక్కన పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు కబీరుపాత్ర ధరిస్తున్నారు. సంగీతంలో ఆసక్తిగల మా బంధువొకాయన రామచంద్రారెడ్డిగారిని గురించి చెబుతూ, "ఆయన నటన సంగతి తెలీదుగాని, పాటమాత్రం బాలగంధర్వలాగా పాడతారట" అన్నాడు.

అదే మొదటిసారి నేను బాలగంధర్వ పేరు వినటం--1924 లో.

అప్పటికే బాలగంధర్వ రికార్డులు దేశంలో వున్నాయి. కాని నేను వినలేదు. వాటిని నేను విన్నది 1925 లో.

అప్పుడు నేను గుంటూరు కాలేజీలో ఇంటరు మొదటి సంవత్సరం చదువుతూ, శని ఆదివారాలకు తెనాలి వచ్చేవాణ్ణి. ఒక శుక్రవారం సాయంకాలం తెనాలివచ్చి, తిన్నగా మా పెత్తల్లిగారింటికి వెళ్ళాను. ఇంట్లో ఎవరూలేరు. ఎవరి దగ్గిరో ఆరువు తెచ్చి నట్టున్నారు ఒక పాతకాలపు 'పువ్వు' గ్రామఫోనూ, రికార్డులూ ఉన్నాయి. నా అభిమాన గాయకులైన బిడారం కృష్ణప్ప, రాచప్పల రికార్డులేమైనా ఉన్నాయేమోనని ఒక రికార్డు తీశాను, దానిమీద 'బాల గంధర్వ' అని ఉన్నది. వెంటనే గ్రామఫోనుకు కీ ఇచ్చి ఆ రికార్డు పెట్టాను.

అది మోగిన మూడునిమిషాలలో నాకు కలిగిన భావావేశం వర్ణనాతీతం. నేను అంతవరకూ మంచి సంగీతమనుకుంటూ వచ్చిన దానికీ దీనికీ ఏమీ సంబంధం లేదు. ఇది సంగీతమయితే మిగిలినది సంగీతమే కాదు. మనుష్యమాత్రుడెవడూ ఇట్లా పాడలేడు.

అది ఏ భాషో, ఆ రాగం పేరేమిటో నాకు తెలీదు. (అప్పటికి నాకు తెలిసిన పాతికరాగాలలో దేన్నీ



బాలగంధర్వ - స్త్రీ వేషంలో

[కే, టి. దేశ్‌ముఖ్ రీసెర్చి సెంటర్, ఇలస్ట్రేటెడ్ వీక్లి ఆఫ్ ఇండియా సౌజన్యంతో.]

అది పోలిలేదు) రికార్డు మళ్ళీ పరీక్షించాను. ఇంగ్లీషులో "మల్హాడ్" అని రాసివుంది. అది రాగం పేరని కూడా నేనెరగను. అయినా ఆసమయంలో నాకు రాగంపేరు పట్టలేదు. ఆ రికార్డును పదిపన్నెండు సార్లయినా పెట్టి ఉంటాను.

"అన్పతచి గోపాలా మృత్యు అలా" అనే రికార్డు అది. రాగం "సూరమల్హార్". "స్వయంవర్"

ఆ నాటకంలో ఉత్తర పాత్ర ధరించి బాలగంధర్వ దాన్ని పాడతారు.

ఆంధ్రులను అద్భుతంగా ఆకర్షించిన బాల గంధర్వపాట "మూర్తిమంత భీతి ఉభా" అన్నది. [illegible] 'కర్ణాటకి' నాటకంలో [illegible] పాత్ర ధరించి స్టేజిమీదికి [illegible] ఈ పాటను ఆనాటకం [illegible] వన్స్‌మోర్ [illegible] వేసే పాట.

కాని 'నాథ ప్రణయం'లాగా నా అభిమాన కీర్తన '[illegible] గోపాలా మృత్యు లతా.'

రామారావుగారికన్న ముందుగానే బాలగంధర్వ పాటల ప్రభావం తెలుగు నాటకరంగంమీదికి వచ్చింది. బాలగంధర్వ గానంతో ప్రభావితులైన స్టేజి గాయకులలో చొప్పవిల్లి శేషగిరిరావుగారు-ఆంధ్రగంధర్వ-మొదటివాడని చెప్పవచ్చు. 'మాంజ్', 'మాండ్‌సిక్స్' 'పిలూ', 'జింగ్లా' మొదలైన రాగాలు ఆయన పద్యాలకు జోడించి పాడేటప్పుడు బాలగంధర్వ ప్రభావం కొట్టవచ్చినట్టు కనపడేది.

బాలగంధర్వ ప్రభావానికి గురిఅయిన నటులలో, లేక నటగాయకులలో, సి. యస్. ఆర్. ఆంజనేయులు, తుంగల చలపతిరావు, పారుపల్లి సత్యనారాయణ, పారుపల్లి సుబ్బారావు మొదలైన ప్రముఖులనూ, అనేకమంది ఇతరులనూ చేర్చవచ్చు.

'మూర్తిమంత', 'లసే పతిదేవచి లలనా', 'శశి మూర్యప్రభా', 'కిలి సాంగూతులా', 'స్వకుంతారకసులా' 'మను మనీ కృష్ణసఖా రమలా', 'సత్యసత్యనచపోల', 'మధుకరవనవన' మొదలైన అసంఖ్యాకమైన బాల గంధర్వ పాటలు స్టేజిమీదా, తొలి దశలో సినిమాల లోనూ అనుకరించబడ్డాయి. వాటి పూర్తిజాబితా ఈనాడు లభించటంకూడా కష్టమే.

సినిమా (టాకీ) పరిశ్రమ ఆరంభమైనప్పుడు సంగీత దర్శకులుగావచ్చినవారు స్టేజి హార్మోనిస్టులు, చాలావరకు. వారంతా బాలగంధర్వ పాటలు ఎరిగిన వారే. ఆ ట్యూనులనే వారు ఉపయోగించారు. చాలా అరాజకపరిస్థితులలో మొదటి 'వీరాభిమన్యు' చిత్రం తయారయిన కొత్తలో సంగీత దర్శకుడు లేకుండా కాంచనమాల రెండు పాటలు రికార్డు చేయవలసి వస్తే, నేను రెండు బాలగంధర్వమట్లు—'ప్రణనాథ', 'మాన్యకాంతవరిలా'—ఇవ్వటం జరిగింది. ఆ రోజుల్లో బాలగంధర్వ పాటల మట్లు ఒక బంగారు పాతరే.

చిత్రమేమిటంటే బాలగంధర్వ పాడిన పాటల మట్లన్నీ అంతకు పూర్వం ఉండినవేగాని కొత్తవి కావు. మరాఠీ నాటకకర్తలు పాటలు రాస్తూ అవి పాడవలసిన మట్లుకూడా నిర్దేశించారు. 'వరములొసగి' 'మరుగేలరా' 'శ్రీ రఘుకులమందుబుట్టి' మొదలైన అనేక కర్ణాటక కీర్తనలు మరాఠీ నాటకాల పాటలకు మట్లు ప్రసాదించాయి. వీటిలో కొన్ని మరాఠీనుంచి మనం తెలుగులోకి మళ్లీ తెచ్చుకుని ఉండటం విశేషం.

బాలగంధర్వ మాత్రమేకాదు. ఆయన వెనకగా పేంఢార్కర్, రనడే, మాస్టర్ కృష్ణ మొదలైన మరాఠీ గాయకుల పాటలు కూడా ఆంధ్రదేశంలో బాగా చలామణీ అయాయి. స్టేజి నటుడు కాక పోయినా నారాయణరావు వ్యాస్ పాటలు కూడా ప్రజాదరణ పొంది, స్టేజిమీదికీ, సినిమాలలోకీ ఎక్కాయి. అందరికన్న ఆలస్యంగా బహుశా ఆంధ్రదేశంలో అడుగు పెట్టినవాడు దీనానాథ్ మంగేశ్కర్—ప్రసిద్ధ సినిమా గాయనీమణులైన లతా, ఆశా, ఉషాలతండ్రి.

ఒక్క విషయం చెప్పుకోవాలి. బాలగంధర్వ పాటలు ఆంధ్రదేశాన్ని జయించటానికి పూర్వమే అందుకు కొంత దోహదం జరిగింది. అనేక నాటకాలకు పాటలూ, మాటలూ—అంటే పాటల మాటలు తయారుచేసిన పాపట్ల లక్ష్మీకాంతయ్యగారు మరాఠీ పాటల ధోరణితో రచించిన పాటలను నాటకప్రేక్షక లోకానికి పరిచయం చేశారు. 'బాగేశ్రీ', 'భీంపలాస్', 'బేహాగ్', 'భైరవి', 'మాల్‌కాస్' మొదలైన హిందూస్థానీ రాగాలమీద ఆయన చాలా స్టేజిపాటలు రాశారు. కర్ణాటక సంప్రదాయానికి విలక్షణమైన 'విలంబిత్' పద్ధతిలో లక్ష్మీకాంతయ్యగారు కనీసం ఒకపాట—ద్రౌపదీ వస్త్రాపహరణంలో 'దీనజనపోషణా' అన్న ద్రౌపదిపాట—రాశారు.

* * *

బాలగంధర్వ ఏపాటి గాయకుడు?

ఆయన గొప్పగాయకులలో జమ కాడు. అందరి లాగే ఆయనా ఆరేళ్లు సంగీతం నేర్చుకుని విద్వాన్

వట్టం పుచ్చుకున్నాడు. కాని ఆయన విద్వత్తుతో పైకి రాలేదు. పాడటానికే పుట్టాడు. లేకపోతే పదేళ్లకే బాలగంధర్వ అనే బిరుదు సంపాదిస్తాడా? తన పాడే శక్తిని సామాన్యప్రజలను పారవశ్యంలో ముంచటానికి ఉపయోగించాడు. 'టాంగావాళ్లచేత పాడించాడు! ఎవరు చెయ్యగలిగారాపని?' అని ఆయనను మెచ్చుకున్నవాళ్లున్నారు.

బాలగంధర్వలో ప్రజారంజకంగా పాడే నేర్పుతో బాటు ఇంకా కొన్ని మంచి లక్షణాలున్నాయి. పాటలో మాటలను చాలా భావయుక్తంగా అనేవాడు. మరాఠీ భాషరాని నాబోటివాడికే ఈ సంగతి తెలిస్తే అదే మాతృభాషగాగలవాళ్లు, ఆయన కీర్తన పాడే పద్ధతికి ఎంత ముగ్ధులై ఉండేవారో ఊహించుకోవచ్చు. ఉదాహరణకు, 'నాథ హా మాఝా' అన్న పాటలో 'రుక్మి శిశుసమ' అన్న మాటను ఎంత తేర్చి అనే వాడంటే 'కుంకుమ' అన్నట్టుగా వినిపించేది!

ఇంకొక అద్భుత విషయమేమంటే, బాలగంధర్వ పాడుతుంటే భాష తెలీనివాడికికూడా భావం తెలిసేది. 'రాజస బాళా' అన్నపాట 'ఏకచ్యాలా' నాటకంలోది. ఇది చాలా విషాదఘట్టంలోది. బాలగంధర్వ దాన్ని విషాదం ఉట్టిపడేటట్టు పాడేవాడు. కాని ఎక్కడా ఎక్కిళ్లూ, ఎగబీల్పులూ, గొంతు దగ్గడంచెయ్యటాలూ ఉండేవికావు. ఆ విషాదం పాడే తీరులోనే — రాగభావంగా మాత్రమే — ఉండేది. ఒక కర్ణాటక విద్వాంసుడు బాలగంధర్వ పాటల రికార్డు లనేకం విని, ఈ 'రాజసబాళా' రికార్డు పెట్టేసరికి తన్మయుడై పోయి, 'బాలగంధర్వ ఎంత గొప్ప పాటగాడో ఈ పాటలో తెలుస్తోంది,' అన్నాడు.

తెలుగువాళ్లు దాదాపు ఒక కాలు శతాబ్దం పాటు బాలగంధర్వను నెత్తిన పెట్టుకుని ఊరేగించి కూడా, గాయకుడుగా ఆయనలోగల ఈ రెండు గుణా లనూ అలవరుచుకోలేదు. ఈనాటి మన సినిమా పాట లలో దుఃఖం ప్రదర్శించవలిసివస్తే ముక్కు చీదు కోవటం మినహాగా అంతా చేసేస్తున్నారు.

ఒక్కొక్కరాగంవెంట ఒక్కొక్కభావం ఉంటుం దనే నమ్మకానికి బాలగంధర్వ కట్టుబడినట్టు కన పడలేదు.

ఒకే రాగంమీద ఆయన వేరు వేరుపాటలు



**20 సంవత్సరాల వయసప్పుడు**

[జే బి. దేశ్‌ముఖ్ రీసెర్చి సెంటర్, ఇలస్ట్రేటెడ్ వీక్లి ఆఫ్ ఇండియా, సౌజన్యంతో.]

పాడి వేరువేరు భావాలు ప్రదర్శించాడు. 'జాన్‌పురి మీద ఆయన పాడిన 'బాళా జాంవా వరతోనీ' అనే పాట వింటుంటే మనకు జాలితోకూడిన ఆవేదన పుట్టుకొస్తుంది. అదే రాగంమీద పాడిన 'అజిపురవాహే' అనేపాట వింటుంటే మనసు నృత్యం చేస్తుంది. సాధారణంగా దుఃఖాన్ని సూచించే 'పూర్యధనాశ్రీ' రాగంమీద 'సాహసకర్మ నకాకరు ఆతా' అనేపాట దాదాపు రౌద్రం స్ఫురించేలాగా పాడాడు.

బాలగంధర్వ తన పాటలలో సమస్త రసాలనూ వ్యక్తం చెయ్యటమేగాక వాటి మిశ్రణాలనూ, ఛాయా భేదాలనూ కూడా వ్యక్తం చేశాడు. ఇలాంటి అవకాశం స్టేజి గాయకుడికి ఉన్నంతగా శాస్త్ర సంగీతంపాడే వాడికి ఉండదు. అందుచేత బాలగంధర్వ స్టేజిగాయ కుడుగా నిలిచిపోయినందుకు ఎవరూ తప్పుపట్టలేరు.

ఏ కళనుగాని ప్రేమించనివాడు ఆ కళ ప్రద

క్కించి ఇవతలు ... ప్రేమించేయట్టు చేయలేదు. అది సిద్ధాంతం. బాలగంధర్వుడు సంగీతమంటే చాలా ప్రేమ. తాను స్వయంగా ఉత్తమ మరాఠీ పాత్రధారి పాడుతుంటే తానుగా ఆ పాట పాడాన్నంతగా ... ప్రదర్శనలో నేను అనేక పర్యాయాలు విన్నాను. గానంలో తన్మయుడు కాలేని గానం వినే ఆయన గానంలో అనేకమందిని తన్మయులను చేయగలిగాడు.

శాస్త్రీయ సంగీతాన్ని అనుసరించక పోయినా బాలగంధర్వకు ఆ సంగీతమంటే భక్తి ఉండేది. ఆయన ట్రూపు నాటకాలాడుతూ మారు మూల గ్రామాలకు వెళ్ళినప్పుడు స్థానిక విద్వాంసు లొకడువచ్చి, 'మహాపాపేశాళ్ళు వచ్చారు! వాతో సమంగా పాడండి' అని సవాలు చేసేవాడట. 'అప్పుడు నా బోటివాళ్ళవల్ల ఏమవుతుంది? మా కృష్ణారావును ముందుకు నెట్టేవాళ్ళం' అని బాలగంధర్వ మాతమ్ముడితో అన్నాడట. కృష్ణారావంటే మాస్టర్ కృష్ణా. పెద్దవిద్వాంసుడికింద లెక్క. బాలగంధర్వ నాటకాలలో మగపాత్రలు ధరించేవాడు. కంపెనీకి మ్యూజిక్ డైరెక్టరుకూడా.

కనక, బాలగంధర్వ శాస్త్ర సంగీతాన్ని చిన్న చూపు చూడలేదు. కావాలంటే ఆయన శాస్త్రసంగీతంలో కచేరీలు చేయగలిగేవాడో లేదో తెలీదు. కొన్ని కొన్ని రాగాలలో అపస్వరాలు - మాల్‌కౌన్‌లో రిషభం- బుద్ధిపూర్వకంగా వేసేవాడు. అవి ఎంతో రమ్యంగా ఉండేవి. గానదేవతను ఆయన శాస్త్రీయమైన పద్ధతిలో ఆరాధించలేకపోయాగాని, మరొక పద్ధతిలో ఎంతో భక్తితోనే ఆరాధించాడు.

బాలగంధర్వ స్టేజిమీద స్త్రీపాత్రలే ధరించాడు. ఆయన మరాఠీ ఆడవాళ్లకు వాలుగోచీతో చీరె కట్టటం నేర్పినమాట కూడా నిజమే. బిళ్ల గోచీతో చీరె కట్టటం మరాఠీ సంప్రదాయం. నేను బొంబాయికి వెళ్లటం జరిగేసరికి బాలగంధర్వ నేర్పిన చీరె కట్టులో వందకాది మరాఠీ అమ్మాయిలు కనిపించారు.

బాలగంధర్వ పాడటానికి పుట్టినట్టే ఆడ వేషం వెయ్యటానికి పుట్టినట్టు కనపడేవాడు. నేను ఆయనను స్టేజిమీద ఒక నాటకంలోనే చూశాను. అది 'సంశయ కల్లోల్' అనే హాస్యనాటకం. అందులో బాలగంధర్వ రేవతి అనే వేశ్యవేషం వేస్తాడు. ఆయన స్టేజిమీదికి రాగానే నిర్ఘాంతపోయాను. మామూలుగా తెల్లగా మంచిరంగులో ఉంటాడు. స్టేజిమీద ఆయనే అందరికన్నా తక్కువ చాయతో కనబడ్డాడు. 'పాకెట్'చోళీ ధరించాడు. చాలా పలచని చీరె కట్టాడు. అందులోనుంచి కాళ్ళు తొడలదాకా కన బడుతున్నాయి. మన నటులు కూడా స్త్రీ వేషాలు వెయ్యటం నేనెరుగుదును. రెండు డజన్ల పిన్నులైనా ఉంటేగాని మనవాళ్ల స్త్రీ పాత్రధారణ పూర్తికాదు. బాలగంధర్వ 'సాహసం' చూసి నాకు ఆశ్చర్యం కలిగింది. మొహానికి ఆయన 'కోటా' వేసుకోకపోవటా నికి కారణం చెప్పారు - పేంట్ పూస్తే ఆయన చర్మం పెట్లుతుందిట.

పాట వచ్చినప్పుడల్లా స్టేజి ముందుకువచ్చి, ప్రేక్షకులకోసం పాడి, ఎన్నిసార్లు ప్రేక్షకులు కోరితే అన్నిసార్లూ పాడేవాణ్ణి గొప్ప నటుడని అనటానికి మనకు మనసొప్పదు. కాని ఈ ఆనవాయితీ ఒకటి లేకపోతే బాలగంధర్వ మంచినటు డనిపించుకోవటానికి తగిన హంగులన్నీ ఉన్నవాడే. అందమైన ముఖంలో అన్నిభావాలూ సులువుగా పలుకుతాయి. సంభాషణలు చాలా చక్కగా అనగలడు.

బాలగంధర్వ చాలా నాటకాలలో పాత్రలు ధరించాడు. 'ఏకచ్ ప్యాలా'లో సింధుపాత్ర ట్రాజిక్ హీరోయిన్. 'సంశయకల్లోల్'లో రేవతి హాస్య ప్రధాన పాత్ర. రుక్మిణీ, సుభద్రా, మీరా, 'మానాపమాన్'లోనాయిక (పేరు గుర్తులేదు) మొదలైన అనేక పాత్రలు ఆయన ధరించాడు. అన్నిపాత్రలలోనూ ఆయన రాణించినట్టే కనబడుతుంది. పాటనటుడైన దీనానాథ్ మంగేశ్కర్ బాలగంధర్వను గురించి చెబుతూ 'ఏకచ్ ప్యాలా మొదటి సగంలో సింధుపాత్రను నేను బాగా పోషిస్తాను. రెండవ సగంలో బాలగంధర్వ నాకన్న బాగా చేస్తాడు' అన్నాడు. సింధుపాత్రలో నిజంగా చెయ్యవలసిన నటనంతా ఉత్తరార్థంలోనే ఉన్నది గనక, బాలగంధర్వ మంచి నటుడనటానికి ఈ కితాబుచాలు.

బాలగంధర్వ ఒకే ఒక మగపాత్ర ధరించాడు. అది 'ధర్మాత్మా' చిత్రంలో. ఈ చిత్రంలో నటిం

దాకా ఆయనకు హిందీకూడా రాదు. ఇంగ్లీషు ఎప్పుడూ రాదు. 'ధర్మాత్మా' చిత్రంలో ఆయన ఏకనాథ్ పాత్రను చక్కగా నిర్వహించాడు.

ఆయన మనస్సు అతికోమలమైనదిగా కనబడుతుంది. 1920 ప్రాంతంలో తన నాటక కంపెనీ దెబ్బతిన్నప్పుడాయనకు మనోవ్యాధి వచ్చిందట. మిత్రులందరూచేరి ఆయనకు ధైర్యం ఇచ్చి తిరిగి కంపెనీ పెట్టించారట.

నాటకాలనుంచి విరమించుకొనేకాలంలో ఆయన ఎక్కువగా భక్తిప్రధానమైన నాటకాలు ఆడాడు. భక్తిపాటలు స్టేజిమీదపాడాడు. నాటకాలు మానేశాకకూడా ఆయన భజనలు జాస్తిగా పాడాడని విన్నాను. మన దక్షిణాది వాగ్గేయకారులు భక్తినుంచి సంగీతం సృష్టిస్తే బాలగంధర్వ సంగీతంనుంచి భక్తిలోకి వెళ్ళిపోయాడు. ఇప్పుడీ లోకంనుంచే వెళ్ళిపోయాడు. కాని ఆయనకన్నముందుగానే ఆయనశకం వెళ్ళిపోయింది.

ఆయన ఇంటిపేరు రాజ్‌హంస్ అన్నప్పుడు నేను నమ్మలేకయాను. అంత చక్కని పేరు కూడా కుదురుతుందా ? కుదిరింది ! ఆయన సొంతపేరు నారాయణరావ్. నిజంగా ఆయన సంగీతంలో రాజహంసే. ఆయన సంగీతాన్ని ఎవరూ శాసించలేదు. దాని కవసరమైన శాసనాలన్నీ ఆయనే చేసుకుని, రాజహంసలాగా సంగీత సముద్రంలో విహరించి తరించాడు.

మరొక బాలగంధర్వ అవతరిస్తే ఈసారి సినిమా సంగీత సాగరంలోనే అవతరించాలి. ఇప్పటికింకా అలాంటి సూచనలేమీ లేవు.

* * *

[పురుషులు స్త్రీపాత్ర ధరించే కాలంలో తమ స్త్రీపాత్రలతో ఐదు దశాబ్దాలపాటు లక్షలాది ప్రేక్షకులను ఉర్రూతలూపినవారు శ్రీ బాలగంధర్వ. ఆయన 1888 జూన్ 28 వ తేదీన పూనాలో జన్మించారు. ఆయన అసలు పేరు నారాయణరావ్ రాజ్‌హన్స్. ఆయన తండ్రి సామాన్య స్థితిమంతుడు.

బాలగంధర్వ బాల్యంలో అంత తెలివితేటలుకలవారేమీకాదు. ఎలాగో రెండవఫారం నెట్టగలిగారు. అతనికి ఇక చదువు అబ్బదని తండ్రి అతనిని సంగీతం నేర్చుకోడానికి కొల్హాపురం పంపాడు. ఒకమారు లోకమాన్య బాలగంగాధర తిలక్ ఆ కుర్రవాణ్ని చూడడ తటస్థించింది. ఆ సుందరాకారుడయిన బాలకుని శ్రావ్యమయిన కంఠానికి లోకమాన్యులు ముగ్ధులయ్యారు. వెంటనే 'బాలగంధర్వ' అని సంబోధించారు. అప్పటినుండి అతనికి 'బాలగంధర్వ' అనే బిరుదమే. వ్యవహార నామం కూడా అయింది.

శ్రీ బాలగంధర్వ 1905 లో తన 17 వ ఏట కిర్లోస్కర్ నాటకమండలి అనే నాటకాల కంపెనీలో నాయికాపాత్రధారిగా చేరారు. కిర్లోస్కర్ నాటకమండలి, మరాఠీ రంగస్థల సముద్ధరణకు ఉద్యమించిన మొట్టమొదటి నాటక సంఘం. శ్రీ బాలగంధర్వ మొట్టమొదటి నాయికపాత్ర శకుంతల. ఈ నాటకమండలి సంస్కృత నాటకాలను మరాఠీలో అనువదించి ప్రదర్శించేది. ఈ మండలి మీరజ్‌లో శాకుంతలం ప్రదర్శించినప్పుడు శ్రీ బాలగంధర్వ తొలిసారిగా శకుంతలపాత్ర ధరించి రంగస్థలంలో అడుగుపెట్టగానే ప్రేక్షకులు ఆశ్చర్యపడ్డారు; తమకు తెలియకుండానే హర్షనినాదాలు చేశారు.

శ్రీ బాలగంధర్వ మీరజ్‌లోను, తర్వాత పూనా, బొంబాయి నగరాలలోను నాయికాపాత్రలు ధరించి లక్షోపలక్ష ప్రేక్షకులను పరవశులను చేశారు. మీరజ్‌లో ఆరంభమయిన ఆయన కీర్తికి పురోగతేగాని ఎప్పుడూ జీవితంలో పశ్చాద్గతి కలుగలేదు.

శ్రీ బాలగంధర్వ 1913 లో కిర్లోస్కర్ నాటకమండలిని వదలిపెట్టి, మరాఠీ నాటకకర్త శ్రీ కె. పి. ఖాడిల్‌కర్ ప్రోత్సాహంతో 'గంధర్వనాటక మండలి' అనే నాటక సంఘం స్థాపించారు. దీనితో మరాఠీ రంగస్థలంలో నూతన శకం ప్రారంభమయింది.

బాలగంధర్వ నాటక మండలి అప్పటి గొప్ప సంగీత విద్వాంసులకు, జంత్రవిద్యానిపుణులకు ఉనికిపట్టు అయింది. ఆయన శ్రావ్యకంఠాన్ని అప్పటి శ్రీ అల్లాదియాఖాన్‌వంటి మహాసంగీత విద్వాంసులు కూడా వినడానికి చెవి కోసుకునేవారు.

శ్రీ బాలగంధర్వ పెక్కు పౌరాణిక, సాంఘి, నాటకాలలో నాయికా పాత్రలు ధరించేవారు, శకుంతల, వసంతసేన, శారద, సుభద్ర మొదలయినవి. కాని వాటిలో నేటికీ చాలమందికి జ్ఞాపకమున్నవి శ్రీ ఖాల్‌డికర్ 'స్వయంవర్' అనే నాటకంలో రుక్మిణిపాత్ర, శ్రీ ఆర్. జి. గడ్‌కరి 'ఏక్‌చా ప్యాలా' అనే నాటకంలో 'సింధు'పాత్ర. సుభద్ర, మానావమాన్, సంశయకల్లోల్, వీరతానాజీ, విద్యాహరణ్ మొదలయిన నాటకాలలో ఆయన ధరించిన నాయికాపాత్రలు గూడ నేటికీ పలువురికి జ్ఞాపకం వుంటాయి.

శ్రీ బాలగంధర్వ ఎంతో దయామయులు. తమ నాటకమండలిలోనివారు పొరపాట్లు చేసినా మన్నించే మెత్తని మనస్సు కలవారు. అయినా న్యాయమైన విషయాలలో గట్టిగాను, దృఢసంకల్పంతోను వుండేవారు.

ఆయనకు రాష్ట్రపతి 1955 లో ఉత్తమ నటుల కిచ్చే పతకం, అవార్డు బహూకరించారు. '64 లో 'పద్మభూషణ్' బిరుదం ఇచ్చారు.

శ్రీ బాలగంధర్వ ఈ సంవత్సరం జూలై నెల 15 వ తేదీ అపరాహ్ణంలో పూనాలో మరణించారు. ఆయన వయస్సు 79 సంవత్సరాలు. ముఠానదీ తీరంలోని ఓంకారేశ్వర్ పితృభూమిలో అంత్యక్రియలు జరిగాయి.

ఆయనకు ఇద్దరు కుమార్తెలున్నారు.]

---



# గ్రంథ విమర్శలు

## శంకర గ్రంథ రత్నావళి

### తృతీయ సంపుటము

[అనువాదకులు : శ్రీ హరి సాంబశివశాస్త్రి, M. A.
ప్రకాశకులు : సాధన గ్రంథమండలి, తెనాలి.
క్రౌను 1/8 సైజు 308 పుటలు. హాఫ్ కాలికో బైండింగు వెల : రు 4—00 లు.]

ఈ సంపుటములో శ్రీ విద్యాశంకర భగవత్పాదుల రచనలని ప్రసిద్ధిగల వానిలో 1. అపరోక్షానుభూతిః (144 శ్లో.) 2. ప్రబోధ సుధాకరః (257 శ్లో.) 3. స్వాత్మనిరూపణమ్ (154 శ్లో.) 4. శతశ్లోకీ (101 శ్లో.) 5. మహావాక్యదర్పణమ్ (308 శ్లో.)—అను ఐదు ప్రకరణ గ్రంథములు కలవు. ఈ ఐదును ఐదు రత్నములు. శ్రీ శంకర భగవత్పాదులు స్వయముగా రచించినను లేకున్నను, ఇవి నిస్సందేహముగా వారి భాష్యములను కరతలామలక మొనర్చి సామాన్యులకు గూడ అనుభవమునకు తేగల గ్రంథములు. భాష సులభసంస్కృతము. అద్వైత స్వరూపము తెలిసికొనుటకును అనుష్ఠించుటకును ఏమాత్రమైన శ్రద్ధ కలవారు అవశ్యముగా మరల మరల పఠించి మననము చేయవలసిన గ్రంథ రాజములు.

ఈ గ్రంథములకు శ్రీ హరి సాంబశివశాస్త్రి వ్రాసిన వివరణము తేటగాను సంక్షేపముగాను ఉన్నది. మూలములో వేదవేదాంత వాక్యములు సూచింపబడిన పట్టులలో నెల్లెడ, వానికి సంబంధించిన భాగములు ఉదాహరించి చదువ దలచినవారికి స్థలనిర్దేశ మొనర్చిరి. అట్లే విశేషములుకూడ అవసరమైన తావులనెల్ల వానిని సంగ్రహముగా వివరించిరి. సర్వమును 'నానపేక్షిత ముచ్యతే' అను మల్లినాథ సూరి ప్రతిజ్ఞను పాటించుచు వివరణరచన సాగినది. వివరణకర్త ఎక్కడను పాండిత్యప్రకర్ష చేసికొనుటకు ప్రయత్నింపలేదు కాని, సూక్ష్మముగా చూడగలవారికి, ఈ గ్రంథ రాజములకు వివరణ వ్రాయుటకు అవసరమైన సర్వతోముఖ పాండిత్యము వారికి కలదని గోచరించును. ముముక్షువులును జిజ్ఞాసువులును అగు సాధారణ పాఠకులకు ఎక్కడ ఏ సందేహము కలుగునో భావించి ఆ సందేహములు తీరునట్లు రచన సాగించిరి. 'తొలి పలుకు'లో తమకు కలిగిన సందేహములను నివృత్తి కావించిన గురువర్యులు శ్రీ సూరి రామకోటిశాస్త్రి గారిని, వ్రాతప్రతిని సవరించుచు సూచన లిచ్చిన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిని స్మరించుట వారి వినయసంపదను గూడ ప్రకటించుచున్నది.

అద్వైత సిద్ధాంతములో బ్రహ్మానుభవము పరోక్షమైనదికాదు కావున మొదటి గ్రంథమునకు 'అపరోక్షానుభూతి' యను నామము పెట్టబడినది. ఈ గ్రంథ ప్రాశస్త్యమునకు ఉదాహరణ ప్రాయముగా ఇందులో యోగశాస్త్ర ప్రసిద్ధములైన యమనియమాదులకు (శ్లో. 102—103) చెప్పబడిన విశేష లక్షణములను బేర్కొందుము.

"దృష్టిం జ్ఞానమయీం కృత్వా
పశ్యే ద్బ్రహ్మమయం జగత్
సా దృష్టిః పరమోదారా
న నాసాగ్రావలోకినీ" 116

"తా॥ జ్ఞానమయమగు దృష్టితో (అఖండ బ్రహ్మాకార వృత్తితో) జగత్తును బ్రహ్మమయముగా దర్శింపవలెను. అదియే పరమోదారమగు దృష్టి; అంతియేకాని నాసికాగ్రావలోకనము కాదు."

పై వివరణములో కుండలీకృత భాగము చేర్చుట వివరణకర్త సమర్థతకు ఉదాహరణము.

"నిషేధనం ప్రపంచస్య
రేచకాఖ్యః సమీరణః
బ్రహ్మైవాస్మీతి యా వృత్తిః
పూరకో వాయురీరితః" 119

"తా॥ ఆత్మ జ్ఞానముచేత ప్రపంచ నిషేధము చేయుటయే రేచకము. 'అహం బ్రహ్మాస్మి' యను అఖండాకారవృత్తి యుదయించుటయే పూరకము."

ఇందులో అహం శబ్దముచేర్చి మహావాక్యము పూరింపబడినది.

"భావ వృత్త్యాహి భావత్వం
శూన్యవృత్త్యాహి శూన్యతా
బ్రహ్మవృత్త్యాహి పూర్ణత్వం
తథాపూర్ణత్వ మభ్యసేత్" 129

"తా॥ భావవృత్తిచే భావత్వము, అభావ (శూన్య) వృత్తిలో శూన్యత్వము. బ్రహ్మాకారవృత్తితో పూర్ణత్వము సిద్ధించును. కాన పూర్ణత్వమునే యభ్యసింపవలెను."

పై తాత్పర్యములో 'అభావ' ప్రక్కన 'శూన్య' లని కుండలీకరించుటచే, మూలములో అభావము అనునదియే 'శూన్యము' అని నిర్దేశింపబడినదని ముచ్చటగా సూచింపబడినది.

రెండవదగు 'ప్రబోధ సుధాకరము'లో దేహ నింద, విషయనింద, మనోనింద, విషయనిగ్రహ, మనో నిగ్రహ, వైరాగ్య, ఆత్మసిద్ధి, మాయాసిద్ధి, లింగ దేహాది నిరూపణ, అద్వైత, కర్తృత్వభోక్తృత్వ, నాదానుసంధాన, మనోలయ, ప్రబోధ, ద్విధాభక్తి, ధ్యానవిధి, సగుణనిర్గుణయోరైక్య, అనుగ్రాహికము లని 18 అంతరప్రకరణము లున్నవి. వాని నామములే విషయమును సూచించుచున్నవి. వీనిలో 15 వ దగు 'ద్విధాభక్తి'నుండి గ్రంథము అకస్మాత్తుగా శ్రీకృష్ణ భక్తిపరమై సాగుటయు, శ్రీకృష్ణభక్తి అద్వైతపర ముగా అన్వయింపబడుటయు గమనింపదగినది. ఈ చివరి నాలుగు ప్రకరణములే శ్రీ నారాయణతీర్థులవారి వంటి అమలినాద్వైతకృష్ణభక్తులకు మూలమేమో అనిపించును. ఈ గ్రంథములో నాదానుసంధాన ప్రకరణములో ఆరే శ్లోకము లున్నను, అన్నియు అనర్ఘ రత్నములు.

'భేరీమృదంగశంఖా ద్యాహతనాదే
మనఃక్షణం రమతే
కింపున రనాహతేఽస్మిన్ మధుమధురేఽ
ఖండితే స్వచ్ఛే. 146

'తా॥ భేరీ మృదంగ శంఖాదులను ప్రయోగించుట వలన నేర్పడు ధ్వనులు విని క్షణికానందమును పొందు మనస్సు మధురాతి మధురము, అఖండితము, స్వచ్ఛ మును అగు అనాహత నాదానుసంధానముచే నిరతి శయానందము పొందదా?'

పై దానిలో 'కింపునః' అను దానిని ఎంత చక్కగా వివరించిరి!

'చిత్తం విషయోపరమా
ద్యథాయథాయాతి నైశ్చల్యమ్
వేణోరివ దీర్ఘతర
స్తథాతథా శ్రూయతే నాదః. 147

'తా॥ విషయోపరతిచే చిత్తము నిశ్చలమగు కొలది ఆ యనాహతనాదము వేణునాదమువలె ఎక్కువగా అనుభూతమగుచుండును.

'స్వాత్మ నిరూపణ' మను మూడవది ఎంతో ఉత్తమ గ్రంథము. అందులో 'తత్త్వమసి వాక్యార్థ నిరూపణ'మనే అంతర ప్రకరణములో అవసరమైన చోటుల (ఉదా: 35—37 శ్లో.) దీర్ఘవివరణము విశేషములు ఇచ్చిరి. గ్రంథము చివరి శ్లోకములో ప్రకరణము అను శబ్దము వచ్చినందున వివరణ కర్త ప్రకరణ శబ్దార్థమును విష్ణు ధర్మోత్తరమునుండి ఉద్ధరించిరి.

'శాస్త్రైకదేశ సంబద్ధం
శాస్త్రకార్యాంతరే స్థితమ్
ఆహుః ప్రకరణం నామ
గ్రంథభేదం విపశ్చితః.'

ఇందులో ముఖ్యముగా 'అపరోక్షానుభవచింతన' మను అంతర ప్రకరణములో గ్రంథకర్త అద్వైతా నందము పొందువాని అనుభవము శబ్దార్థాలంకార ఘటితములైన కవితాసూక్తులతో అద్భుతముగా చిత్రించిరి.

'ఝుంకృతి హుంకృతి శింజిత బృంహితముఖ
వివిధనాద భేదోఽహమ్
ఝటితి ఘటితాత్మవేదన దీప పరిస్ఫురిత
హృదయ భవనోఽహమ్.' 125

'వర్ణాశ్రమ రహితోఽహం
వర్ణమయోఽహం వరేణ్యగణ్యోఽహమ్
వాచా మగోచరోఽహం
వచసా మర్థేన గమ్యమానోఽహమ్.' 139

ఈ మూడు ప్రకరణములవలెనే తక్కిన రెండు ప్రకరణ గ్రంథములును (శతశ్లోకి, మహావాక్య దర్పణము) ఉత్తమ గ్రంథములు.

పంచరత్నము లనదగిన ఈ ఐదు ప్రకరణము లను శ్రీ హరి సాంబశివశాస్త్రిగారి వివరణముతో ముముక్షువులైన వారందరు పఠించి, గ్రహించి, మనన

మొనర్చి, ఆనందింపదగిన గ్రంథరాజములు. ఈసంపు టమును మనోజ్ఞమైన ఆకారముతో ప్రచురించిన సాధన గ్రంథమండలివారిని హృదయ పూర్వకముగా నభినందించుచున్నాము.

నోరి నరసింహశాస్త్రి

## కొనకళ్ల కథలు

[రచన : కొనకళ్ల వెంకటరత్నం. ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ—2. పుటలు : 274 వెల : రు. 4.]

ఇందులోని కథలు : అతనిక రాడు, పెళ్లి సన్నాహం, బుద్ధిమంతుడు, ఆఖరి గుణపాఠం, తగిన సమంధం, అపస్వరం, చివరికి మిగిలిన రంగడు, సంక్రాంతి కానుక, అపోహ, దాగనిసత్యం, అడ్డదారి, సంప్రదాయం, ఖయిదీ—జవానూ, దొంగా - మనిషీ, కత్తిమీదసాము— మొత్తం పదిహేను. పుస్తకంలో 'సూచిక' వేరుగా లేకపోవడంవల్ల ఈ జాబితా అవ సరమైంది.

పై కథల్లో చాలవరకు స్త్రీ పురుష సంబంధంలో వైయక్తిక మనస్తత్వాల విన్యాసాన్ని పరిశీలించేవి. చక్కని పదనుతేలినభాష, వ్యక్తులనూ, సన్నివేశాలనూ రూపు కట్టించగలశక్తి, మానవుని ఒడిదుడుకుల్ని ఔదార్యంతో అవలోకించగల ఓర్పూ ఈ కథలకు ఉత్తమస్థాయిని ప్రసాదించాయి.

పెళ్లికిముందు యువతీ యువకుల మనస్సుల్లోని అర్థాలూ అపార్థాలూ వర్ణించిన కథలు : (1) 'అతనిక రాడు' కాల్పనికతావాదం (Romanticism) ప్రభావం ఎక్కువగానే సోకినా, ఆ పద్ధతిలో విషాదాంతమైన ఉత్తమకథ. (2) 'తగిన సమంధం', 'సంప్రదాయం'—యువతీ యువకులు ఒకరినొకరు 'సై' అంటే 'సై' అనే అలరింపుల కథలు, వాస్తవికతను ప్రదర్శించేవి.

పెళ్లైన స్త్రీ పురుషుల మధ్య పొరపొచ్చాలను వర్ణించే కథలు: (1) పెళ్లి సన్నాహం—ఈ కథ ముగింపు, ఇబ్సెన్ వ్రాసిన 'బొమ్మరిల్లు' (Doll's House) నాటకంలోలాగా, స్త్రీ స్వాభిమానంతో వివాహ వ్యవస్థమీదచేసే తిరుగుబాటుతో, ఆలోచన రేకెత్తిస్తుంది. భార్య ఆరోగ్యం కోలుకొని తిరిగి రావటంతో, భర్త చేసుకోవాలనుకున్న రెండవ పెళ్లి సన్నాహానికి స్వస్తి చెబుతాడు; కాని రెండవ పెళ్లికి సిద్ధపడిన భర్తకూ తనకూ మధ్య మిగిలిందేమీ లేదంటూ వీడ్కోలు చెప్పి విశాలప్రపంచంలోకి వెళ్ళిపోతుంది భార్య. ముగింపు సేపుగా ఉండటానికి వీల్లేదా? (2) 'ఆఖరి గుణపాఠం'—[illegible] కొల్లగొట్టే మిలిటరీ ఆఫీసరు, విచిత్రమైన విధి విలాసం కారణంగా [illegible] తన భార్య మరణానికి తనే కారణం కావటం కథ. [illegible] గుణపాఠం నేర్చుకోలేదు కాబోలు! (3) 'దాగనిసత్యం'—చిత్తసంస్కారం లేకుండా సంస్కరణ వివాహం చేసుకుంటే, సత్యాన్ని దాచిపెట్టి ఆ దాంపత్యాన్ని నిర్మించబోతే, పర్యవసానం దుఃఖమేనని తెలిపే కథ. ఈ కథలోనూ, 'చివరికి మిగిలిన రంగడు' అనే కథలోనూ మాతృత్వానికీ; పుత్రవాత్సల్యానికీ విలువ పట్టాడు రచయిత. రెండు కథల్లోనూ విధి ఎదురుదెబ్బ తీయటం గమనిస్తాము. (4 'అపోహ' అనే కథలోనూ 'విధి' నిర్వహించిన పాత్ర పెద్దది. భర్త ఆత్మహత్యలో ముగిసిన ఈ కథ సంతృప్తికరంగాలేదు.

'అతనిక రాడు', 'పెళ్లి సన్నాహం', 'అపోహ' అనే కథల్లో రచయితలోని ఒకవాక తీవ్రవాదదృష్టి (Uncompromising attitude) ఆ కథల ముగింపులకు కారణంగా తోస్తుంది. స్త్రీ పురుష 'ప్రేమ' విషయంలో సందేహమేకాదు, సందేహంయొక్క ఛాయ కూడా సోకడానికి వీల్లేదనీ, పొరపాటు జరిగితే దాన్ని సరిదిద్దుకోవటం లేక దాన్ని క్షమించటం అనేది సాధ్యం కాదనీ, 'ప్రేమ'కు తిరుగులేని ఉదాత్తతనూ, అకలంకతనూ ఆపాదించిన రచయిత తీవ్రవాదపు ఆదర్శభావన ఈ కథల్లో ద్యోతకమౌతూవుంది.

పురుషుని స్వార్థాన్నికూడా అలాగే చాలకథల్లో చూపెట్టాడు రచయిత. 'అపస్వరం' అనే కథలో ఈ రకం విమర్శ వ్యంగ్యంతో సాగింది.

'సంక్రాంతి కానుక' ఆడవాళ్ల పసుపు కుంకుమల కథ.

'బుద్ధిమంతుడు' కాలేజి కుర్రవాళ్ల అల్లరి కథ.

'లడ్డదాక', 'ఖయిదీ—జవాను', 'దొంగా—మనిషి', 'కత్తిమీద సాము' నేటి సాంఘిక పరిస్థితుల్లో న్యాయాన్నిగూర్చి, ధర్మాన్నిగూర్చి నిశితమైన పరిశీలన. ఉత్తమ రచన. తతిమా ప్రేమ కథలూ, స్త్రీ పురుషుల కథలూ ఎంత చక్కగా ఉన్నా, ఈ చివరి నాలుగు కథలలో రచయితలో వచ్చిన ఒక మార్పు పరిణామం, పరిణతీ గోచరిస్తాయి. ఈయన మంచి యింకా కథలువస్తే బాగుండుననే ఆకాంక్ష ముఖ్యంగా చివరి నాలుగు కథలూ కలిగిస్తున్నాయి.

—ఆర్. ఎస్.

## సో మ రా జు క థ లు

[కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్. రాజమండ్రి—1. 396 పేజీలు. పది కథలు. పది రూపాయిలు.]

శ్రీ రంధి సోమరాజు కథలలో ఆదర్శం వుంది. ఆ ఆదర్శం, తత్త్వబోధం, కథాత్మలోనో, కథాపథకంలోనో, సంభాషణలలోనో, ధ్వనిగా వినిపిస్తూనో బాహాటంగా కనిపిస్తూనో వుంది. కథలు చదివి ఆ ఆదర్శం పాఠకులు పోల్చుకొంటారు. ఒక్కొక్కచోట ఆదర్శం శ్రుతిమించి రాగాన పడుతుంది. అయినా, కథలు వ్రాయటంకోసమే వ్రాసేవారికంటే ఒక ఆదర్శంకోసం కథారచనకు పూనుకొన్న రచయిత రచనాజీవితం ధన్యమయింది.

'వారికలం ఎవ్వరినీ చిన్నచూపు చూడదు.' పుస్తకం చివరి అట్టమీద రచయిత పరిచయంలో కనిపించే వాక్యం ఇది. పూర్తిగా అంగీకరింపరానిది. పతితులను, దరిద్రనారాయణులను, దీనజనులను, కుమిలి, కృశించి నశించిపోయేవారిని రచయిత చిన్నచూపు చూడలేదు. సంఘాన్ని, అధికారులను, ధనవంతులను, రచయిత సంపూర్ణ సానుభూతితో చూడలేదు. తను చిత్రిస్తున్న పాత్రనుగానీ, పాత్రలను మినహాయించి, మిగతా పాత్రలలో అల్పంగా కనిపించే దోషం, దుష్టతలను, భూతద్దంలోంచి చూచి, చిత్రించటం గమనించి, ఎవరూ 'చిన్నచూపు చూడదు' అన్న వాక్యంతో ఏకీభవించలేరు. అయితే పీడితులు, తాడితులు, శ్రమజీవులు, అమాయకులు, వీరిని జాగ్రత్తగా తీర్చిదిద్ది చక్కని కథలు అందించిన శ్రీ రంధి సోమరాజుకలం ఎవరినీ చిన్నచూపు చూడలేదు అంటే సాక్షికంగా సత్యం. ఒక్కటి గమనార్హంగా వుంది. దుర్మార్గతనూ, సన్మార్గతనూ రెండు కోణాలలో విపరీతంగా పెంచి, అల్పతమంగా ఉన్నవాటిని అధికతరంగా చూడటం పాఠకులు గమనిస్తారు.

మధుసూదనరావు పాత్రలో ఉన్న స్వార్థం అర్థం లేనిదే అయినా పరిమిత మయింది. ఆ పాత్రలో బూర్జువా తత్త్వం ప్రవేశపెట్టి, అతని దుష్టతను ఇంతలింతలు పెంచి, అనంతంగా చిత్రించటం, ఎంత అమానుషంగా ప్రవర్తించే వ్యక్తి అయినా సొంత తమ్ముడి విషయంలో అలా చేశాడని చిత్రించటం,

లేడీ రామారావు చేసిన తప్పుపనిని సావిత్రి సమర్థించటం, ఆ సావిత్రి, అకారణంగా శశిపై నింద మోపటం,

శంకరం కోరిక సహజమే అయినప్పుడు, అతను అనవసరంగా ఆత్మశాంతి కోల్పోయే పరిస్థితులు ఎదుర్కొని పశ్చాత్తాపపడటం.

శశి చంద్రహారం తీసుకుపోయి, తాకట్టు పెట్టుకొని, తిరిగి ఇవ్వకుండా మొరాయించిన లక్ష్మీదేవి చేసినపనికి కారణం సానుభూతితో ఆలోచింపక పోవటం,

గయిరమ్మకు రిక్షావాళ్లు చేసిన అపకారాలలో ప్రథమం సహజమే అయినా ద్వితీయం క్రూరంగా చిత్రించటం,

గమనించిన పాఠకులు 'రచయిత కలం ఎవరినీ చిన్నచూపు చూడదు' అన్న వాక్యంతో ఏకీభవించరు. ఒకవర్గం జనం చేసిన మంచిపనులు చెడ్డపనులు అన్నీ మంచిపనులుగా చూచినా, మరోవర్గం చేసే సత్కృత్యాలు దుష్కృత్యాలు అన్నీ దుష్కార్యాలుగా చూచినా రచయిత కలం చిన్నచూపు చూచినట్లే అవుతుంది సిద్ధాంతరీతిలో 'వర్గపోరాటం' అక్షరాలా నమ్మినా లోకశాస్త్ర కావ్యాదవేక్షణంలో వర్గదృష్టి ఉండకూడదు. నమ్మిన సిద్ధాంతంకంటే బలమయింది

చూస్తున్న జగత్తు, జగత్తులోని పరిణామాలు నిర్ణయించటానికి సిద్ధాంతాలు ఆరాధ్యాలుకావచ్చు. కాని, సిద్ధాంతాలు స్వీకరించి, ఆదృష్టితో లోకంవైపు దృష్టి మళ్లించకూడదు. ఒక భావతీవ్రతకు కట్టుబడిన వ్యక్తి కార్యకర్తగా ప్రవర్తించవలసిన తీరుకంటే రచయితగా జీవించవలసిన పద్ధతి భిన్నమయింది.

రచయిత సత్యం తిలకించాలి. లోకం పరిపూర్ణంగా అర్థంచేసుకోవాలి. ఉన్న సంఘం ఉన్నట్లుగా స్వీకరించాలి. రచనలో సమాజం యధాతథంగా చిత్రించబడాలి. రచయితే ఒక సిద్ధాంతానికి కట్టుబడిన కార్యకర్త మనస్తత్వంకల వ్యక్తి అయితే, వర్గదృష్టివుంటే వుండవచ్చు కాని, కార్యకర్తకంటే రచయిత సంఘ శ్రేయస్కామి. శ్రీ రంధి సోమరాజు రచయితగా జీవించాలని పాఠకులు కోరుకొంటారు. అంతేకాదు, రచనలో కార్యకర్తమనస్తత్వం లేకుండావుంటే బాగుండుననికూడా ఆశిస్తారు.

బాధలతో పీడితులయి, తాడితులయి, పతనోన్ముఖంగా వున్నవాళ్ళు, నిరాశానిస్పృహలమధ్య నలిగిపోతున్న వాళ్ళు, చెప్పుకోలేని, చెప్పుకొన్నా వినేవాళ్ళు లేని మూగబాధ అనుభవిస్తున్న వాళ్ళు, దారిద్ర్యంతో సతమతమయి, అంతులేని వ్యథపొందేవాళ్ళు, చాలా మంది ఈ కథలలో ప్రత్యక్ష మవుతారు.

తాను పొందే మానసికక్షోభకు, గోదావరీ జలాలపై మమకారానికి కారణం తెలుసుకోలేని జగన్నాథం,

తాను ఎందుకింత అసమర్థుడయ్యాడో, పంజరంలో చిక్కుకొన్న చిలుకలా ఎందుకు వెలుపలికి రాలేనివాడయ్యాడో తెలుసుకోలేని పిరికివాడయిన నారాయణరావు,

గుండెకు రంధ్రంపడి, ఆనకట్ట తెగిన గోదావరిలా బాధామయ రక్తం కారిపోతున్నా, అంతా తన మంచికే అని తలపోసి అభివృద్ధిలోకి వచ్చినా, తన ఉనికి ఉన్నతత్వం తెలియని రామూ,

ఎవరికీ ఎదురుచెప్పలేక, ప్రత్యల్ప విషయానికీ పరితపించిపోతూ, చివరికి మానధనాలు ప్రశ్నింపబడితే పలవించిన శశీ,

నమ్మిన ధర్మం నలుగురికీ చెప్పలేక బాధపడి, చెప్పినప్పుడు కూడా ఋజువు చేసుకోలేక క్షోభతో భవిష్యదాశతో ప్రాణం అర్పించిన సీలూ,

తన పరిధిలో తాను నివసిస్తు సహజవాంఛకు అసహజ పరిస్థితులలో ఎదురుదెబ్బతిని, పుండుమీద కారం జల్లినట్లయి, కుమిలిపోయిన శంకరం,

ఇష్టంఉన్న సూర్యంతో పెళ్ళికాక, ఇష్టం లేని పెళ్ళిచేసుకొని, దిగుళ్ళదిబ్బయి, రెంటికీ చెడ్డ జలహీనురాలు సుమతి,

కొడుకును మంచిమార్గంలో పెట్టుకోవాలని తాపత్రయపడి, కన్న కొడుకునే దూరంచేసుకొన్న మోహనరావు,

భర్త చనిపోగా, పిల్లల్ని పోషించుకోటానికి వెతుక్కొన్న ధర్మమార్గంలో అకాలం కారణంగా ఎదురైన వెతలు తట్టుకోలేక బతికిపోయిన గయిరమ్మ,

వీళ్ళందరినీ చూస్తున్న పాఠకులు వాళ్ళు చిక్కుకుపోయిన విషాదంకూడా చూస్తారు. పాఠకులు బాధపడతారు. శ్రీ రంధి సోమరాజు కరుణామయపాత్ర సృష్టిచేసి, పాఠకులలో రసప్రభావం కలిగించటం ముదావహం.

అన్ని రసాలలోనూ ఆధిక్యం 'కరుణ'కు ప్రసాదించారు ప్రాచీన సంస్కృతాలంకారికులు. ఆ దృష్టితో చూస్తే కథలన్నీ కరుణాత్మక మైనవే! ఆలంకారిక సంప్రదాయ బద్ధమయిన ఈ కథలు అందరినీ ఆకర్షిస్తాయి.

సమాజంలోని మనిషి మనిషికీ భౌతికంగా ఎంత సాన్నిహిత్యంవుందో, మానసికంగా అంతదూరం వుంది. మనిషిలోని లోపాలు సానుభూతిలో స్వీకరించి, పాత్ర సృష్టిచేయటం రచయిత ఉదాత్త మనస్తత్వానికి నిదర్శనం.

సీతమ్మలో ఉన్న సంకుచితత్వం వెనుకదాగివున్న పుత్రప్రేమను రచయిత చక్కగా అర్థంచేసుకోవటం పాఠకులు గమనిస్తారు.

దారిద్ర్యంపట్ల సహనత ప్రదర్శించి, పతనం కాకుండా పైకివచ్చేట్టు రాము పాత్ర తీర్చిదిద్దటంలో,

కట్టుకొన్న భర్తను వదిలి, పరాయి మగాడితో లేచిపోయి, అకారణంగా మనస్సు మార్చుకొని,

మళ్ళీ భర్త దగ్గరకు రావాలని లేఖ రామారావు చేసిన ప్రయత్నం విందుగాంచెదో అంగీకరించి రచించటంలో,

పెళ్ళి చేసుకోబోయే యువకుడితో అక్రమ సంబంధంవున్నా దోషం కాదనే ఊహతో కావేరి పాత్ర సృష్టించటంలో,

సిగరెట్లు తాగి చెడిపోతున్నాడని అనుకోబడుతున్న కొడుకుతో తండ్రి మోహనరావు ప్రవర్తించే పద్ధతిలో,

రచయిత హృదయౌన్నత్యం వ్యక్తమవుతుంది. తన పాత్రలపై రచయితకు సానుభూతి జాలి ఉన్నాయి. కొన్నిభావాలపట్ల విశాలదృక్పథం, కొన్ని పాత్రల విషయంలో విశాలమనస్తత్త్వం ప్రదర్శింపగల రచయిత, తన కిష్టంలేని పాత్రలపట్ల ఆ సంయమనం. ఓర్పు ప్రదర్శింపలేదు.

ఎక్కువ కథల్లో పాత్రల్లో రచయిత రెండు వైపులు చూడలేదు. ఒకవైపే చూచి చిత్రించినా, చూచినభాగం రచన శుద్ధంగా వుంది.

సమాజ జీవిత చిత్రణ చేయటంలో రచయితకు నేర్పువుంది. ఆనేర్పు ద్వివిధంగా విభక్తం కాలేదు. ఏక మార్గాన సాగింది. వక్రమార్గం పరికింపబడలేదు.

ఈ రచయితపైన కమ్యూనిజం ప్రభావం ఉంది. కొన్ని వాక్యాలు ప్రచార ధోరణిలోనూ కనిపిస్తాయి.

పరిమితంగా దర్శించిన జీవితం చిత్రించటంలో అవాస్తవికత లేదు. జీవితంలోంచి ఛేదించుకు వచ్చిన సహజతను అల్లుకుపోయిన కవితాత్మకత ప్రతి కథలోనూ ప్రత్యక్షమవుతుంది.

సంభాషణలు వ్రాయటంలో రచయితకు ప్రత్యేకతవుంది. ఒకమాట అనుకొని, మరొకమాట అనే వ్యక్తులమధ్య సంభాషణకోసం పాఠకులు తహ తహ చూపవచ్చు.

అనుకొన్నమాట అనుకొన్నట్లు అనలేని, అనని; చేయదలచినపని తలచినట్లు చేయలేని, చేయని; వ్యక్తుల మానసికతత్త్వ చిత్రీకరణంలో రచయిత చూపిన నేర్పు అభినందనార్హం.

కథకు ముగింపు ప్రాణంతో సమానం. కథ అంతా చక్కగా వున్నా, ముగింపు ముచ్చటగా లేకపోతే కథ ఆయువుపట్టు దెబ్బతిన్నట్లు అవుతుంది. మనస్సు మీద కథవేసే ముద్ర ముఖ్యంగా ముగింపుమీద ఆధారపడి వుంటుంది. ఈ సంపుటిలోని కథానికల ప్రారంభ ప్రస్తావన లేదుగాని, పర్యవసాన ప్రసక్తి వుంది.

సంపుటి ఆద్యంతాలలో కథల ముగింపులు ఆలోచన రేకెత్తించుతాయి. 'బలహీనులు' ముగింపు కథనంతా మళ్ళీ చదివిస్తుంది. కథ అంతా ఒకెత్తు. ముగింపు ఒకెత్తు. కథంతా ఒకపాత్రను గూర్చి చెబితే, ముగింపులోని మూడుమాటలు మరో పాత్రను గూర్చి పూర్తిగా చెప్పాయి. తరువాత ఏమయిందో ఆలోచింప జేస్తుందీ ముగింపు. 'బలహీనులు' కథ ముగింపు పాఠకుల్ని ఆలోచించండి అని ధైర్యంగా చెప్పే ముగింపు.

ఓ. హెన్రీ కథ ఎలా ముగించాలని అభిప్రాయ పడ్డాడో, అలావున్నాయి కథానికలు. ఒక్క ముగింపు కోసం, తదభిముఖంగా కథ అంతా, అన్ని పాత్రలు, సంఘటనలు సాగిపోతాయి. ముగింపు ఏర్పాటుచేసుకొని కథానిర్మాణంచేస్తే ఎలాంటి రచనలు వెలువడతాయో ఉదాహరణకు ఈ రచనలు చూడవచ్చు.

వాక్య నిర్మాణంలో రచయితకు నేర్పువుంది. వర్ణనలు కవితాత్మకంగా వున్నాయి. కొన్ని భాషా దోషాలు, ముద్రణలో దోషాలు లేకపోలేదు. అందంగా వాక్యం వ్రాయటం, చక్కగా భావ వ్యక్తీకరణ చేయటం ఈ రచయితకు బాగాతెలుసు.

రచయితకు ఆవేశం వుంది. బాధవుంది. లోకం లోని దుష్కృతి చూచి రచయిత పొందిన వ్యథ, ఆత్మ ఘోష ప్రతి కథలోనూ ప్రత్యక్షమవుతాయి.

ఈ సంపుటిలోని కథలు అనేక కారణాలవల్ల మరుపురానివిగా వుండిపోతాయి. ఆంధ్ర సాహిత్యంలోని అత్యుత్తమ కథలు ఎన్నుకో ప్రయత్నించే విమర్శకులు 'దేవుడైన మానవుడు', 'ఎదగని మనుష్యులు' స్వీకరించటానికి వెనుకాడక పోవచ్చు.

పదేళ్లపూర్వం కథా వ్యాసంగంలో ఉన్నవారికీ పాఠకులకు శ్రీ రంధి సోమరాజు కథలు, 'తెలుగు స్వతంత్ర' మూలంగా బాగా పరిచయం. ఈసంపుటిలో ఉన్న కథలు, అప్పుడు చదివి ఆనందించిన వాళ్ళు, ఇప్పుడు, ఈ రూపంలో చదివి అంతగా ఆనందించవ

లేకపోవటానికి కారణం, అప్పుడీకథలు సంక్షిప్తంగా హృదయంలో నిలిచిపోయే రూపంలో ఉన్నాయి. ఇప్పుడా కథలు సంకోచం లేకుండా వ్యాకోచించాయి. ఈకథలలో పనికిరాని పేరాలు, పేజీలు కోకొల్లలు. అంతగా ఎందుకు పెంచవలసి వచ్చిందో అర్థం కాదు.

396 పేజీలతో, 10 కథలతో 10 రూపాయిల వెలవున్న ఈ సంపుటి, 200 పేజీలకు కుదించి, 2 లేక 3 రూపాయల వెల నిర్ణయించి ఉన్నట్లయితే, ఆర్థికంగా ఏమాట అనే అవకాశం లేదుగానీ, హార్దికంగా రచయితకు ఎంతోమేలు జరిగివుండేది.

## గంటలు

[కవితా సంపుటి. శ్రీ కరెళ్ల సత్యనారాయణ మూర్తి ఎమ్. ఎ., ప్రచురణ కర్తలు : శ్రీమతి కరెళ్ల అమ్మాణి. రతన్ పబ్లిషింగ్ హౌస్, మార్కెట్టువీథి, కాకినాడ-2. ప్రాప్తిస్థానము : శ్రీ నట్ల మల్లికార్జునరావు, నట్లవారివీధి, కాకినాడ — 2. వెల : రు. 2—50 పైసలు]

కొన్ని కవితా సంపుటులు చదువుతుంటే పరమానందం అయినా కలుగుతుంది. కాదంటే పరమాసహ్యం అయినా కలుగుతుంది. అలాలేదీ సంపుటి.

కొన్ని కావ్యాలు చదువుతుంటే ఎక్కడో దోషాలు కనిపించి దిగులుగానయినా వుంటుంది, లేకపోతే ఎక్కడో కవితా సౌందర్యాలు కనిపించి ఆనందంగానయినా వుంటుంది. అలాలేదీ సంపుటి.

కొన్ని కవితా సంపుటాలలో అధికంగా దోష సమూహాలు ఎదురై బాధ అధికంగా నయినా వుంటుంది, కాకపోతే, ఎక్కువగా గుణాలు, చక్కని భావాలు గోచరమై, ఆనందం అధికంగానయినా వుంటుంది.

శ్రీ కరెళ్ల సత్యనారాయణమూర్తి రచించిన కవితల సంపుటి—గంటలు—ఈ చివరికోవ రచన.

ఈ కవితా సంపుటిలో ప్రయుక్త భాషను గూర్చి చెప్పక తప్పదు. వ్యావహారిక భాష ఏదో, గ్రాంథికభాష ఏదో స్పష్టంగా వేరుపరుచుకొని, లబ్ధప్రతిష్ఠులే వ్రాయటం లేదు. శ్రీ మూర్తి అలాగే వ్రాస్తే ఎక్కువగా బాధకలగదు. పదస్వరూపమూ, పదార్థస్వరూపమూ అర్థవంతంగా ఆలోచితాలు కావు. ఇంగ్లీషు తెలుగు పదాల్ని కలగా పులగంగా వాడవచ్చు. అయితే అలా ప్రయోగించటంలో నేర్పులేదు. లేకపోయినా ఫరవాలేదు. అలా ప్రయోగించటంలో ఏం అవసరం వుందో కూడా అర్థంకాని తావులున్నాయి. పద ప్రతిపత్తిలో పతనం కనబడుతుంది. ఈ కవితా సంపుటి సంతరించుకొన్న భాష, సర్వ సహృదయ హృదయామోదకరం కాకపోవటం బాధాకరం.

భావాల విషయంలో శ్రీ మూర్తికి వెనకడుగు లేదు. కాని, ఏభావం ఎంతవరకు చెబితే సొగసో తెలియదు. చిన్నభావం వ్యక్తంచేయటానికి 'అనేకపదాలు వాడుకొంటే, భావదారిద్ర్యం లేకపోయినా, భాషా సంయమనం లేకపోవటంవల్ల భావతీవ్రత దెబ్బ తినటమే కాకుండా, అర్థరహితమయిపోయింది. ఏ భావమయినా ఎంతోదూరం సాగలాగటం అనవసరం. హృదయం ఉగ్రూతలూపగలిగిన భావాలు, శబ్దశుద్ధి లేమివల్ల వ్యర్థమయిపోయాయి. వ్యక్తీకరణలో ఉదాత్తత లేదు. వ్యక్తిగతమయిన శైలి లేదు.

శ్రీ కరెళ్ల సత్యనారాయణమూర్తిని, ఈ కవితా రచనకు ప్రోత్సహించిందీ, వ్రాయించిందీ, ప్రచురింపించిందీ ఆవేశం. ఈ ఆవేశం శ్రీ శ్రీ దగ్గర్నుంచి కొంత వచ్చింది. ఆత్మగతావేశం అధికంగా వుంది. ఆవేశం అనాధీనమయినప్పుడు ఆలోచన త్రోవ తప్పే అవకాశం లేకపోలేదు. ఆలోచనా మార్గం నిర్ణయించే ఛందస్సు శ్రీమూర్తికి సమగ్రంగా తెలియదు. ఛందస్సు ఉన్నట్లు కనిపించటం ఆభాసం! ఆభాసం అనటం సూక్తిమంతం. ఆధునికాంధ్ర కవితావిహారానంతరం కలిగే హృదయపరిణామమ్ ఈ కవితా సంపుటిలోని ఛందస్సు.

శ్రీ మూర్తి ఆవేశం మువ్వన్నెల రామచిలుక. ఆ వన్నెలు అగ్నిశిఖలు, కిన్నెరవీణ, పాంచజన్యం. అభ్యుదయకవిత్వం, భావకవిత్వం, దేశభక్తి కవిత్వం. కిన్నెరవీణలో పలికిన భావకవిత్వం కొంతలో కొంత మెరుగు! పాంచజన్యం ధ్వని ప్రక్కవాడికి వినిపించక పోవచ్చుగానీ, అగ్నిశిఖలు మాత్రం చాలామంది చూడగలరు.

సర్వ మానవతాభ్యుదయమయావేశం గల శ్రీమూర్తి భాషను 'భద్రం'చేసుకొంటే వెలువడే రచనలు సర్వజనప్రీతి పాత్రాలవుతాయి.

ఈ సంపుటిలోని 'వివేకాగ్ని', 'విశాలాంధ్రో

దయం' 'కౌహళి' 'జనశక్తి' 'రాగరసమగ్నుడు' 'కవితాప్రియుడు' శ్రీ మూర్తిలోని భావావేశానికేకాదు, ఉత్తమ కవితా హృదయానికి నిదర్శనాలు. పెద్దలను సహితం తల వూపించగల కవితా ఖండికలు.

'వెళుతున్నా ఒక్కణ్ణీ
వెలుగు జాడలు తీయి!
వెళుతున్నా వెళుతున్నా
సృష్టిగంటలు మ్రోగాయి!'

అని 'అన్వేషణ'లో బయలుదేరిన కవ్యాత్మ మ్రోగించిన గంటల్లో గంటలు ఎక్కువగానీ మ్రోత తక్కువ. అయిదు పేజీల 'గంటలు' లో

'ధరిత్రినిండా పలికే గంటలు
చరిత్ర అంతా తెలిపే గంటలు' వంటివి, హృదయధ్వనితో మిళితమై వెలువడేవి, అల్పంగా మాత్రమే వున్నాయి. ఇటువంటి భావాలు వేరుచేస్తే మిగతావి అన్నీ గంటలే! చెవులు గింగుర్లెత్తించే గంటలు, కన్నుల గిరగిరతిరిగే గంటలు, మూడున్నర పేజీల గంటలు.

'క్రాంతి పురుషుడు'లో 'శత్రుబాంబు విష గొంతు తెరిచింది' అని తెలుసుకొన్న శ్రీ మూర్తి, 'ఐక్యతాయుధమెత్తి' 'సమిష్టిగా వడచి'

'ఎగిలాలోచన పరుల
దొంగ పూజా ప్రభుల' దండించాలని. అందుకు 'నేడే! ఈనాడే!!' లో

'తరతరాల సోమరితనాన్ని వీడి,
నియమితమైన అక్షరాల్ని కూడి,
అనంతమైన పదాంతో ఆడి,
శ్రేయోగీతాలను పాడా'లని తలపోయటంలో దోషంలేదు!!

పై ఆలోచన పరమరమణీయంగా వుంది.



కాని ఆచరణ గూర్చి ఆలోచన కలుగుతుంది. సహృదయులకు.

'సీతీ
నిజాయితితో
జీవించమంటే
సోదరా
వాటికి సమాధులు
కట్టిన
ఈ లోకంలో
బాధగా!' అని 'వక్రరేఖ'లో వ్యక్తీకరించిన భావం సరసులు స్వీకరిస్తారు. 'బాధగా!' అన్నదానిని 'బాధకదా!' అనుకోవచ్చు. అలా అయినా ఆ విధంగా వ్రాయటంవల్ల కలిగే ప్రయోజనం మాత్రం అర్థంకాదు.

శ్రీ మూర్తి ఛందస్సును, లేదంటే ఒక క్రమ తను, అలవరచుకొంటే, ఇటువంటి చక్కని భావాలు ఎంతో ముచ్చటగానో చెప్పివుండవచ్చుకదా అనుకొంటారు.

'హేపీ న్యూయియర్'లో
'సరిగా వాడిన మానవ ఎనర్జీ
అస్తమించు ఈ కరువుల మురార్జీ
(ముర+ఆర్జీ)'

అంటే అర్థం తెలియలేదు. ఒక చక్కని భావం, వ్యక్తీకరణలో అర్థరహితం అయిందా అనిపిస్తుంది.

'రవి గాంచనిచో' లో
'చలువరాతి తాజమహలులో
పేదవాని పూరిగుడిసెలో
కనుపించును నాకు రవిత్వం!
వినిపించును నాకు కవిత్వం!!' ఈ దృష్టి విశిష్టమయింది. ఇది అందరికీ అలవడవలసిన దృష్టి!

'సంక్రాంతి — శోకముద్ర'లో
'క్రాంతి పథంలో' నడిచే
లోకపు సంక్రాంతినాడు
'శోకపథంలో నిలచిన
లోకపు విభ్రాంతి చూడు' ఆ దృష్టితో ఈ దృశ్యం చూపటం, మనుష్యుల మనుగడకే అవసరం. ఆ సత్యం—సత్యసందర్శనం—తత్త్వప్రదర్శనం—ప్రశంసాపాత్రం.

'కలికాలం'లో
'మానవతకి భరతంపట్టే

క్రూరతకి హారతిపట్టి
వెలివేస్తున్నది పాడు ప్రపంచం!

కల చేస్తున్నది నేటి ప్రపంచం!!' ఈ బాధను మనస్సులో వుంచుకొని,

'సేల్యూట్! సే...లూ(య్)...ట్...!' లో
బూర్జువాల విడివాదుల
చీకటియుగ ధర్మస్మృతుల
శిధిలాలయ శిలాస్మృతుల
చినికి నలిగి చితికి పడిన
గత చరిత్ర ఖజానాల
ప్రియమిత్రా రక్షకభట
రాజకీయ గజదొంగల

చదరంగం ఫేడౌట్!' చెప్పి, భారతదేశంలో సైనిక ప్రభుత్వం (Military government) ఆవశ్యకం అనే సూచన చేస్తున్న శ్రీమూర్తిని ఆత్మ పరిశీలన చేసుకోమంటూ, చేసుకొంటూ ఆశ్చర్యంతో చూడటంతప్ప గత్యంతరంలేదు.

పై పంక్తులు శ్రీ శ్రీ చదివితే 'తమ్ముడూ నువ్వు పైకి వస్తావుఅని ఆశీర్వదింపవచ్చు. అందుకు మరొక కారణంకూడా వుంది. అది 'లోకాలకు చలుగు చూపు, రష్యాకు లేదుసాటి!' అని శ్రీ మూర్తి అభిప్రాయం.

'కాలంతోపాటు' మనుష్యులు మారిపోవచ్చునని ఒప్పుకోవచ్చు. భావాలు మారుతాయిఅనీ ఒప్పుకోవచ్చు. అయినా...

'అనార్కలి ప్రణయంలో నాడు ఉండేకళ
అన్నార్తుల కదలికలో ఉందిలే నేడు'

ఈ భావం సహృదయులకు ఒక ప్రశ్న! ఒక ఆశ్చర్యార్థకం! ఒక సమన్వయ తాపత్రయం!

'నను కలచిన అనుభూతులు
ప్రస్ఫుటముగ కాంచువరకు
నిజముగ నే పొంగువరకు
— — — —
— — — —
ఇటులే పొగింతు తపము

నిజమిదియే నా వ్రతము' అని కవితాప్రియత్వం వ్యక్తంచేసి,

'నిర్దయ నయనాలతోటి

'చూచెదేల చెలీ' అని సరస్వతిని అర్థిస్తున్న శ్రీ మూర్తి సత్యగ్రహణశీలిగా, తన ఉనికి గుర్తెరిగిన వ్యక్తిగా సరసులు గుర్తిస్తారు. ఈ తెలివిడి, శ్రీ మూర్తి భావి రచనా జీవితానికి అత్యంతావశ్యకం! అందుకు పాఠకులు ఆనందిస్తారు.

ఆంధ్రుల ఆత్మధనం అయిన ఆవేశం అధికంగాగల, అభ్యుదయ సమాజ సందర్శనం కాంక్షిస్తున్న శ్రీ కరెళ్ల సత్యనారాయణమూర్తి భావాలకు చక్కగా రూపరేఖలు దిద్దుకొని, మంచిభాష అలవర్చుకొని, క్రమబద్ధంగా కవితా వ్యాసంగం సాగిస్తే భవిష్యత్తులో ఒక ఉత్తమకవిని దర్శించే భాగ్యం ఆంధ్రదేశానికి వుంటుంది.

— మనోరాణి

## మాతా - భూ మాతా !

['గ్లేడిస్ హాస్టీకరోల్' నవల 'ఏజ్ ది యర్ టర్న్స్'కు శ్రీ యస్. ఆర్. చందూర్ అనువాదం. ప్రచురణ : ప్రతిమా బుక్స్, 3, పూణాకతాల్ వీధి, మద్రాసు—7; వెల : రూ. 4.00.]

ఈ నవలలో ప్రధాన విషయాలు రెండు. ఒకటి అమెరికాలో పల్లెవాసులు జీవిత విధానం; రెండు ఋతువర్తియై ప్రకృతి పొందే మార్పు.

ఈ నవల అంతా ఒక సంవత్సరకాలంలో జరిగింది. ఇందులో కథకంటే కాలానికి విలువ ఎక్కువ. ఒక కుటుంబం ఒక్కొక్క ఋతువులో పొందిన పరిణామం, ప్రకృతిలో పరిణామం, మానవ ప్రకృతిలో మార్పు, ఆ కుటుంబం ఆ సమయంలో ఎలా జీవించిందో చిత్రించే నవల ఇది.

ఈ నవల చదువుతున్నంతసేపు పాత్రల వ్యక్తిత్వాకంటె, ప్రకృతి తత్త్వంలో పాఠకులు లీనమయి

పోతారు. ఒక్కొక్కసారి పాత్ర మనస్సులో వచ్చిన మార్పును ప్రకృతిలో వర్ణించారు రచయిత.

అమెరికాలో పల్లెప్రజల అలవాట్లు, పొలంలో ఇంటిలో జరిగే తీరులు, ఎన్నో వివరంగా తెలుసుకోగోరే ఆంధ్రులకు ఇది కొంతవరకు ఉపయోగపడుతుంది. జనవరినుంచి ప్రారంభమయి, డిసెంబరులో అంతమవుతుంది నవల. మళ్ళీ జనవరిలో ప్రారంభమయ్యేకాలం ప్రకృతిలో క్రొత్తగావచ్చే మార్పు ఏమీ వుండదు. అలాగే కుటుంబ జీవితాలు అని ధ్వనిస్తుంది నవలలో.

అన్నిరంగాలలో ద్వంద్వాలను చూపాలని రచయిత ఆశించినట్లు అర్థమవుతుంది. ఉదాహరణకు, ఇద్దరు అమ్మాయిలలో, ఒక అమ్మాయి (లిజీ) పట్టణంపోయి, ఉద్యోగం చేసుకొంటూ స్నేహితులతో విహరించేస్తూ వుంటుంది; రెండో అమ్మాయి (జెన్) పల్లెటూరులో కుటుంబం దిద్దుకొంటూ వుంటుంది. ఇలా అన్ని విషయాలలో రెండువైపులా దర్శించటం సుగుణం. పల్లెల్లో మాట అనని 'జార్జి' భార్యను, నలుగురు పిల్లల తల్లిని సరిగ్గా చూచుకోకపోతే ఆమె భర్తను వదిలేయాలనుకొని వూరుకొంటుంది. పెళుసుగా మాట్లాడే 'ఎడ్' భార్యను కంటికి రెప్పలా కాపాడుకొన్నా, అతన్నామె అర్థం చేసుకోటానికి, పిల్లవాడి తల్లి అయిందాకా వీలు కాలేదు. భార్య ఉద్యోగం చేయకపోతే ఉండే కష్టం ఒకవైపున చెబుతూ, భార్య ఉద్యోగంచేస్తే కలిగే నష్టం మరో విధంగా వ్రాస్తాడు రచయిత. ఈ ద్వంద్వాలు చూపటం రచయిత ధ్యేయంగా కూడా అనిపిస్తుంది.

'మార్క్షా' ద్వంద్వాలకు అతీతుడు. పట్టణంలో పనిచేసే 'లిజీ' 'మే'లు కారులో ఇంటికి వచ్చినా రాకపోయినా, ప్లీడరు కాబోయే 'ఓలీ' మంచి ఉపన్యాసకుడై, విదేశాలు పోయినా పోకపోయినా, 'రాల్ఫ్' 'ఎడ్' పెళ్ళికి వివాహం నడుపుకొంటూ వూరులోకి వచ్చినా, విమాన ప్రమాదంలో దూర దేశంలో మరణించినా, 'మార్క్షా' చలించడు. అంతా నిర్లిప్తతే! కాని పొలంలో ఏదైనా వ్యతిరిక్తం జరిగినా, ఇంటిదగ్గరున్న ఆవుకాలు విరగ్గొట్టుకుంటే కాల్చి చంపుకోవలసివచ్చినా మామూలు మనిషి అయిపోతాడు. 'స్టాన్'తో ఆత్మీయత పెరగటానికి కారణం అతడు విదేశీయుడనీకాదు, కూతుర్ని చేసుకోబోతాడనీ కాదు. పొలం పనిలో రైతుగా సలహా తీసుకొంటాడనీ, అండగా వుంటాడనీను.

ఈ నవలలో సజీవపాత్ర 'జెన్.' ఈ రచనకు ఆ పాత్రచిత్రణ ప్రాణం పోసింది. అనువాద కర్త శ్రీ యన్. ఆర్. చందూర్ నేర్పువల్ల కావచ్చు, ఈమె తెలుగింటి అమ్మాయిలాగా కనబడుతుంది. ఈమె 'మార్క్షా' కుమార్తె. పెళ్ళికాలేదు. తల్లిదండ్రులలో వృద్ధురాలైనా ఇంటిలో వుంది. నలుగురికీ తలలో నాలుకలాగా మసలుకొంటుంది. 'జాన్' 'బన్'లకు (పిల్లలు) ఆప్యాయంగా, తల్లిదండ్రులకు విధేయంగా, అన్నదమ్ములతో స్నేహంగా, వదినలతో ప్రేమగా పెళ్ళిచేసుకోబోయే 'స్టాన్'తో వ్యక్తిత్వంవున్న తల్లిచాటు బిడ్డలాగా ప్రవర్తించింది. అందరినీ ఆపదలో ఆదుకొంది. ఎవరినీ కష్టపెట్టలేదు. పైగా ఆమె సంటింటి మహారాణి!

ఇది ఉత్తమ నవలకాదుగానీ, సమకాలీన జీవితం ప్రతిబింబించిన నవల. పాత్రల మనస్తత్వం పట్ల పాఠకులు పొందే అనుభూతికంటే ప్రకృతి పరిణామంపట్ల పొందే పారవశ్యం అధికతరం.

అమెరికాలో వెలువడే నవలా స్థాయి ఎలా వున్నా, ఈ నవలకున్న స్థానం ఎటువంటిదయినా తెలుగులోకి దీన్ని అనువదించటంవల్ల తెలుగు నవలా ప్రపంచంలో ఎటువంటి మార్పూ ఇది తేలేదుగానీ, అమెరికాను అర్థం చేసుకోవటానికి ఆంధ్రుడికి కొంతవరకు ఉపయోగపడుతుంది.

అనువాదకర్త శ్రీ యన్ ఆర్. చందూర్, అనువాదంలో చూపిన నేర్పువల్ల ఈ నవల పఠన యోగ్యంగా వుంది. అనువాదంలో తెలుగుదనం, పలుకుబడి వుండటంవల్ల ఇది అమెరికా జీవితం తెలిసిన తెలుగు రచయిత స్వతంత్రంగా వ్రాసిన రచన అనుకొనేంత చక్కగా వుంది. చదవదగిన పుస్తకం.

'రవి'

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna**
**The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras 1**
**Editor : S. Sambhu Prasad**

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

లెంక శంభుప్రసాద్

# విషయానుక్రమణిక

పూలపిల్లలు ఎ!
గాలిపట
ఈ బయళ్ళల
వ్రాలి
పచ్చనైనవి!
నలి

## అక్టోబరు 1967

# సీతాకోక చిలుకలు

శ్రీ మిరియాల రామకృష్ణ

పూలపిల్లలు ఎగురవేసిన
గాలిపటములు వోలె నున్నవి!
ఈ బయళ్ళల నీ యుషస్సున
వ్రాలి వ్రాలక యాడుచున్నవి!

పచ్చనైనవి! ఎఱ్ఱనైనవి!
నల్లనైనవి! రంగుచిల్కలు!
గోరువెచ్చని యెండలోపల
చూచి నిల్చితి వింతగా!

ఎవరు వ్రాసిన వీసువర్ణము
లీ మహాశిల్పంబు లెవరివి?
కీర్తికోసము ప్రాకులాడక
దాగె నెచ్చట శిల్పివర్యుడు?

'నాకు నీకును స్నేహ మేదో
నాటి నటులై నిల్చిపోతిని!
మహాశిల్పి! రమ్మ! నీతో
స్నేహభాగ్యము ప్రసాదింపుము!'

ఆకులందున, చివురులందున
తీగలందున మొగ్గలందున
ఎవరి దర్శనమైనదో మఱి
పూలదోసిలి పట్టుచున్నవి!

సాంధ్యకాంతులయందు నిలబడి
మౌను లట్టులు వెదకుచున్నవి!

మనఃకీటక తతులు వ్యథలకు
కారణములై పోయెనేమో!
వనములందున మధువు త్రావుచు
పూలమీఁదనె మోహపడునివి!

ఆకుపై సుధవోలు వెల్గులు
పూసి నవులు సిదేమి చిల్కలు?
భోగ మెఱుగక ముందె ముక్తికి
యోగ్యపదవి లభింపజాలదా?

ఇవి వనేందిర కొప్పుబూలో?
ఇవి వసుంధర ఆశయములో!
నడచివెళ్ళెడి పడతి తలపై
నూగుపూలో నన్ను లాగును!

పోదునా వెన్నంటి వీనిని
పుణ్య మెఱుగని జగతి వీడ్కొని!

వే నాకండనె సుఖము పొందగ
పుట్టినాను నరుని కందునె
వీని హృదయములందు పొంగే
విశ్వజనతానంద రేఖలు!

ఒక అసూయాద్వారమందున
దూరి, ఆనందాలు దోచే
జ్ఞానబాహ్యుల కందునా ఈ
మౌన మోహన రాగ రేఖలు!

ఈ వనంబున పూలు చిల్కలు
కలసిపోయిన కారణముగా
పూవులే విహరించుచున్నటు
కానబడు నా కంటి కిప్పుడు

తీగ పొన్నల మీఁది నిద్దుర
మోము మొత్తినదేమొ పూలకు?
కష్టసుఖములు రెండు గూడా
బరువులేనా జీవకోటికి!

తీగయుయ్యెలమీద నిలబడి
యూగు కన్నెలు బాలసుమములు!
మన్మథాకృతులైన చిల్కల
కాళ్ళు త్రొక్కుచు నవ్వుచున్నవి!

కామ వాసన రేగునప్పుడు
కల్గునా మఱి త్రపావాసన!
ఈ సుమాంగన స్నానమాడుచు
విప్పివైచిన పట్టుకోకయొ!
ఆ లతాంగన తొడుగుకొనుటకు
మడతవిప్పిన బుటారవికయొ!
మంచుకొలకుల గట్టులందున
మనోహరముగ మెఱయుచున్నవి!

వీనివలెనే నేను గూడా
విరహలోచన మెపుడు మూతును?
కాలమెల్లను పూలకడనే
గడపివేయగ నెటు నోతును?

నౌక వెడలగ దారి చూపే
వాక పోలిక కాల మెప్పుడు
బ్రతుకు నావది నెకి జేర్చును!
బాధ లలి గట్టు చూపును!

దినముదినము సమస్యలందే
ఈదు నాకును భావి గలదా?
దినము దినము ప్రసూన వాసన
మునుగు వీనికి బాధ యెక్కడ?

ఎపుడు వీనిని చూచినానో?
అపుడె యేదో కలచు వేదన!
నా ప్రియాస్మితరేఖ నాలో
జ్ఞాపకింమను రహోవేదన!

తలపుగుమ్మములందు ప్రేయసి
వలపుబూవులు రాలుచుండును!

కనులమీదికి రెప్పకప్పలు
జారి నన్ను సమాధి జేర్చును!

భగ్నమైనదా ప్రేమ! పాపము
ప్రియుల రూపులు వ్రాయునట్టులు
ఆకులందున గీయు గీతలు
చిత్రరేఖల బోలె తోచును!

ఇంతగా శృంగార భారము
మోయగా తలకట్లు కట్టిన
రీతి సుందర కిసలయంబులు
తలల కంటగ నిలిచి యూగును!

ఇవట నిలబడి యుగము నిమిషము
లాగు ముచ్చట చూడవచ్చును!
మున్ను నేనిది యెచటొ చూచిన
దృశ్యమే అనిపించుచుండును!

ఒక్కడే ప్రేక్షకుడనైతిని!
ఊహలోకము చేరుచుంటిని!
వాస్తవపు పొలిమేర లోనికి
వచ్చి, పోవుచు, వచ్చుచుంటిని!

తపస్సిద్ధినలోని చిత్తము
పొందు చిద్విలసనము కలిగెను!
భూమి త్రవ్వినయపుడు బంగరు
గనులు కనబడినట్లు పొంగితి!

ఇట్టిదేదో సాంద్రరసమయ
భావవేగి తరంగ మూగగ
భావదాస్యము నన్ను ముంచగ
జాలునా యని పాడుకొంటిని!

పండుటాకున తెక్కసాగిన
చిల్క గాలికి కదలియాడగ
విరిని జాబిలివోలె దాల్చిన
పార్వతీ మండిత మహేశుడు
తాండవించిన రీతి తోచెను!

---

# మిలోవాన్ జిలాస్‌తో గోష్ఠి

శ్రీ హెచ్. జె. స్టైహెల్

మిలోవాన్ జిలాస్ భార్యతో, కుమారు... బెల్‌గ్రేడ్‌లో వుంటున్నాడు. వారి ... పాల్మోటిచేవా వీధిలో వుంది. తప్పాలు... మీద ఆయన పేరు లాటిన్ భాషలో ... వుంది. ఇంటి తలుపుమీద సిరిల్లిక్ భాష... వుంది—మిలోవాన్ జిలాస్ అని. పధ్నా... సంవత్సరాల క్రింద జిలాస్ పట్ల్సే జిలాస్కా... అప్పుడు ఆయన యుగోస్లావియా ఉపాధ్యక్షు... మంత్రి. పొలిట్‌బ్యూరో సభ్యుడు. 1956 జిలాస్ ఒక పుస్తకం వ్రాశాడు—'న్యూ ...' అని. అందులో ఆయన కమ్యూనిస్టు అధికారవర్గంలో ప్రాదుర్భావంచెందిన కొత్త తరంగతిని లేక వర్గాన్ని గట్టిగా విమర్శించాడు ఆయన ఏమో మాంటినీగ్రో ప్రాంతీయుడు. ఆ మాంటినీగ్రోనులకు ఆవేశము, కల్పనా చమత్కృతి అధికం. విప్లవతత్వాన్ని గురించి చెప్పనే అక్కరలేదు. అది వారికి వంటబట్టేవుంటుంది. ఆ వ్రాసిన ఆ క్రొత్త గ్రంథంలో ఈ సర్వ లక్షణాలను ఆయన ఒలకబోశాడు. 1961 లో 'స్టాలిన్‌తో సల్లాపం' అన్నగ్రంథం వచ్చింది. ఇదిగూడా విమర్శాగ్రంథమే.

కమ్యూనిస్టుగా వున్నప్పుడు, కమ్యూనిస్టుతత్వాన్నివిమర్శించునప్పుడు గూడా జిలాస్ కారావాసం చేయవలసి వచ్చింది. మొత్తం మూడువరుసలు ఆయన ఖైదులో వున్నాడు. చివరిసారి ఐదు సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించాడు. మొన్న 1967 జనవరిలోనే జైలు నుంచి బయటికి వచ్చారు. జిలాస్‌ను వది పెట్టారు.

ఇప్పుడు జిలాస్ చేస్తున్న పని ఏమిటి అంటారు! మిల్టన్‌గారి 'పేరడైజ్ లాస్ట్'ను తర్జుమా చేస్తున్నాడు. తన్ను చూడ్డానికి వచ్చిన వారిని చూస్తాడు. మాట్లాడుతాడు. ఇచ్చట అరమరికలు అవీ లేవు. జిలాస్ వయస్సు 56 సంవత్సరాలు. కాని అంతకుమించిన వయస్సుకల మనిషిలాగా కన్పిస్తాడు. జైలు జీవితం ఆయన్ను కొంత వృద్ధుణ్ణి చేసింది. నేను ఆయన్ను చూచాను. అతిథుల గదిలో ఆయన అటూ, నేను ఇటూ కూర్చున్నాను. నాకు ఎదురుగా సోఫామీద ఆయన కూర్చున్నాడు. ఆయన ఎదురుగా 'మోనోలిసా' పటం వుంది. జిలాస్ నెమ్మదిగా. తూచి తూచి మాట్లాడుతున్నాడు. కంఠం గంభీరమైంది. ఆ కంఠ ధ్వనిలో అలసట కూడా విన్పిస్తున్నది.

మేము మాట్లాడినదంతా 'టేప్ రికార్డు' అయింది. నేను ముందు సోషలిజము, కమ్యూనిజము—వాటి భవిష్యత్తు, వాటిలో సంస్కరణలు మొదలైన విషయాలను గురించి ప్రశ్నలు వేశాను. ఎటువంటి మొగమోటమి లేకుండా ఆయన సమాధానాలు చెప్పాడు. సోషలిజం అంటే, ఆయన దృష్టిలో, విశదమైన, మూర్తస్థితినిపొందిన సమాజధర్మం కాదు. అది ఒక 'మార్పు; ఒక పరివర్తనం. పాతవి అయిన సమాజధర్మాలు చెందుతూవున్న మార్పు

అది. ఆ మార్పుయొక్క పద్ధతి. ఆ సమాజాలు కొత్త రూపాలను పొందుతూవున్నదాని యొక్క ప్రవృత్తి ఇది. ఇవి పూర్వంకన్న స్వేచ్ఛ, స్వాతంత్ర్యము కలవిగా పరివర్తనం చెందడమే సోషలిజం అని జిలాన్ అన్నాడు. పాశ్చాత్య రాజ్యాలలోను, ప్రాచ్య రాజ్యాలలోను గూడా ఈ పరివర్తనం జరుగుతూ వుంది. ఇది నెమ్మదిగా జరిగే పని అన్నాడు.

**అయితే సోషలిజం అంటే, ఈ రోజున, దాని అర్థం ఏమిటి ?**

ఈ ప్రశ్నకు జిలాన్ ఇట్లా సమాధానం చెప్పాడు: 'సోషలిజం అంటే ఏమిటో, ఆమాటకు వస్తే కమ్యూనిజం అంటే ఏమిటో, ఎవ్వరూ స్పష్టంగా ఇది, ఇది అని చెప్పలేరు. ఇవి అన్నీ ఈ నాడు పెద్దపరివర్తనం చెందుతున్నాయి. ఇప్పుడు వీనిని గురించి ఏ విధంగా నిర్వచించాలన్నా ఆయా దేశాలలోవున్న తేడాలను తెలియవలసి వుంటుంది. అంతేకాక తాత్వికమైన ఊహాపోహల విషయంలోగూడా తేడాలువున్నాయి. ఆ తేడాలనుగూడా మనస్సులో పెట్టుకోవాలి. సోషలిజం నిర్వచనం వీటి అన్నింటిమీదను ఆధారపడి వుంది. అసలు సోషలిజం పని ఏమిటంటే, ఎక్కువ స్వాతంత్ర్యాన్ని, ఎక్కువ స్వేచ్ఛను, అధికమైన న్యాయాన్ని సాధించడం; ముఖ్యంగా ఆర్థిక రంగంలో.

**లెనినిస్టు సిద్ధాంతాల ప్రకారం అయితే సోషలిజంకు, అధికారం సమస్యకు విడదీయరాని సంబంధం వున్నది గదా ?**

జిలాన్ : ఉంది. కొన్ని ప్రత్యేక రకాలైన అధికార పద్ధతులు అన్నవిలేకుండా, లెనినిస్టులకు సామ్యవాదం అన్నదేలేదు. అది వారికి అచింత్యం. ఇప్పుడు ఆ రకమైన ఆలోచనా పద్ధతికి కాలదోషం పట్టింది. ఈ రోజుల్లో ఆ ఆలోచన పొసగదు. కమ్యూనిస్టు దేశాలలో సిద్ధాంతులు అయినా ఈ సమస్యను గురించి వేరువిధంగా ఆలోచనలు చేస్తున్నారు. రాజకీయంగా వారి దృక్పథం వేరు; నా దృక్పథం వేరు అనుకోండి.

**వారికి, మీకు తేడా ఎక్కడ వస్తున్నది?**

జిలాన్: పట్టువిడుపులేక, ఏకాండ పద్ధతిలో వుండే లెనినిస్టు లేక స్టాలినిస్టుపద్ధతి పార్టీ అంటే నాకు గిట్టదు. అందుకు నేను వ్యతిరేకిని. ఇది ముఖ్యమైన తేడా. ఇంకో తేడా కూడా వుంది. మార్క్సిజంకు మడి కట్టడం నాకు ఇష్టంలేదు. గతితర్కం లేక Dialectics అంటే నాకు గిట్టదు. నేనూ లోకాయతుణ్ణే; మార్క్సిస్టులు అందరిలాగా. అంతేగాని నేనుగతితర్కికలోకాయతుణ్ణిమాత్రం కాదు. ఇప్పుడు, ఈ రోజుల్లో—ఈ Dialectics అనే దాంట్లో ప్రతీపపద్ధతులు ప్రవేశించాయన్న నమ్మకం నాకు బలుస్తున్నది.

**అంటే ఆలోచనా పద్ధతిలో గతితర్కం అనా, ప్రభుత్వ పద్ధతిలో గతితర్కంఅనా, మీ ఉద్దేశం?**

జిలాన్ : పాతకాలపు గ్రీసు దేశంలో dialectics ను చర్చకు మీమాంసకు పద్ధతిగా ఉపయోగించేవాళ్లు. ఇప్పుడూ ఆ dialectics అట్లావుంటే, ప్రయోజనం వుంది. భూతార్థానికి సంబంధించి dialectics అంటూ వుండవు. విశ్వము, జీవితము వున్నాయంటే, అవి బహుభంగులుగా వున్నాయి. అవి అన్నీ జటిలమైనటువంటివి. శ్లిష్టము, క్లిష్టము ఐనటువంటివి. వానియందలి ప్రవృత్తిధర్మం గూడ వివిధంగా వుంటున్నది. అట్టిదానిని ఒక నిబంధనతో పడతాముఅంటే అర్థం ఏమిటి! ఆ నిబంధన « తార్కికమైనది కావచ్చు, ఇంక రకమైనది కావచ్చు—అది ఎట్టిదైనా భూతార్థాన్ని పట్టడానికి చాలదు. సంసారం అ

వృక్షం ఎప్పుడు పచ్చపచ్చగా, పడుచుగా వుంటుంది. మరి సిద్ధాంతమో, దాని తల ఎప్పుడూ నెరిసే వుంటుంది.

**సోషలిజంలో సిద్ధాంతానికి, భూతార్థానికి సంఘర్షణ జరుగుతూవుండటమే ఇచ్చట ప్రధాన ప్రతిబంధకం అని మీ అభిప్రాయమా?**

జిలాస్: అవును. అన్నిరకాల సిద్ధాంతాలున్నా ఒక రకమైన ప్రవిలీయతను పొందుతున్నాయి. ఇది పాశ్చాత్యదేశాలలోను జరుగుతున్నది. ప్రాచ్యదేశాలలోను జరుగుతున్నది. ఇప్పుడు మనం ప్రపంచం అంతా ఒక్కటి అయ్యే పద్ధతియొక్క ప్రారంభదశావిశేషాన్ని దర్శిస్తున్నాము. అట్లా జరుగుతున్నదని నా నమ్మకం. తగాదాలతో, సంఘర్షణలతో, చివరికి యుద్ధాలతో వలనుపడి ఇది కొనసాగుతూ వుంది. కాని దాన్ని ఎవ్వరూ ఆపలేరు. అది జరిగి తీరుతుంది. ఆ అవశ్యంభావిత్వ లక్షణం అందులో వుంది. ఇప్పుడు మనం ఒక విచిత్రమైన కాలంలో వున్నాము. మనకు అవిజ్ఞాతమైన సిద్ధాంత ప్రపంచం ఏదో ఇప్పుడు రూపు కడుతున్నది. ఆ సిద్ధాంత ప్రపంచంయొక్క స్వరూపలక్షణం ఏమిటో, ఎట్లా వుంటుందో మాత్రం మనకు ఇంకా అందడంలేదు. గోచరం కావడంలేదు. మతాలను తీసుకుందాము. వానిలో కూడా మార్పు వస్తున్నది. అవికూడా శిథిలం అవుతున్నాయి.

**యుగోస్లావియాలో ఒకప్పుడు చర్చికి, రాజ్యాంగవ్యవస్థకు తగాదా వచ్చింది. అప్పటికి మీరు ఇంకా రాజకీయాలు వదిలిపెట్టలేదు. ఆ తగాదానుగురించి ఇప్పుడు మీ అభిప్రాయం ఏమిటి?**

జిలాస్ : నేను మేధావివర్గానికి చెందినవాణ్ణి. మనిషిఅయినవాడికి మతం అంటూ వుండి తీరుతుందన్న నమ్మకం నాకు ఏర్పడిపోయింది. మతంలేని మానవలోకమే అచింత్యం. నేను మతంలేనివాణ్ణి. నాస్తికుణ్ణి. అయితే ఈ నాస్తిక్యము, ఈ లోకాయతవాదము — వాని అంతట అవే ఒక విశ్వాసం క్రింద, ఒక మతం క్రింద జమ. మానవలోకంలో బహుళసంఖ్యాకులు ఎప్పుడు మతబుద్ధి కలవారే అయి వుంటారు. ఇప్పుడు, యుగోస్లావియాలో మతం ఇప్పుడు పెద్దసమస్యకాదు. ముందు ఇది సమస్యకాదని అనలేము. అవుతుంది. సమాజం అధికంగా ప్రజాతంత్రీకరణం అవుతూ వున్నకొద్దీ, మనుష్యుల మనస్సులలో ఈ సమస్య పెద్దదై కూర్చుంటుంది.

**ప్రజాజీవనంలో మతంకూడా ఒక ప్రధాన విషయం అని మీ అభిప్రాయమా? ఈ విషయాన్నిగురించి ఘర్షణలు రావచ్చునని మీరు అనుకుంటున్నారా?**

జిలాస్ : అనుకోవడంలేదు; ఈ వ్యవహారం సంఘర్షణలదాకా పోతుందని నేను అనుకోను. ప్రజాజీవితంలో చర్చి ఏదో పెద్దగా పని చేస్తుందన్న నమ్మకంకూడా నాకు లేదు. ఈ సమస్య ఇట్లా తలఎత్తదు. మతానికి విస్తృతమైన స్వాతంత్ర్యంకావాలి అనే రూపంలో అది తలఎత్తుతుంది. ముఖ్యంగా మతసంబంధమైన ఆలోచనాధారకు సంబంధించి ఈ స్వాతంత్ర్యం వాంఛచేయబడుతుంది — అది గూడా తాత్వికదృష్టిని అవలంబించి. ఇంకా ఈ రకమైన ఎరుక పుట్టలేదు. యుగోస్లావియాలో చర్చి ఇప్పుడు తన స్థితికి సంబంధించిన సమస్యలతోనే 'ఇదిఅయి' పోతున్నది— డబ్బు— చర్చిలుకట్టడం మొదలైనటువంటి సమస్యలు.

**మీరు దర్శిస్తూవున్న సమాజధర్మాన్ని, వ్యవస్థను "సోషలిస్టు" ధర్మంఅనే, వ్యవస్థఅనే అంటారా?**

జిలాస్ : తప్పకుండాను. అందులో ఎటువంటి అరమరికగానిలేదు. నేను ఇప్పుడు

పూర్వంకన్నా సోషలిస్టుని. పిడివాదపు పద్ధతిలో మాత్రం కాదనుకోండి.

**మీరు 'సోషలిజం' అని భావిస్తున్నదానికి, మేము 'సోషల్ డెమాక్రసీ' అంటున్నదానికి నిజమైన తేడా ఏమిటి?**

జిలాస్: నాకు సంబంధించినంతవరకు సమస్య ఇది. ప్రస్తుతంవున్న కమ్యూనిస్టు సమాజాన్ని శాంతియుతంగా డెమాక్రాటిక్ సోషలిస్టు సమాజంగా మార్చడం ఎట్లా? ఇది నా సమస్య. సోషల్ డెమాక్రాట్స్ యొక్క సమస్య వేరు. పశ్చిమదేశాలలో వారికి రాజకీయ స్వాతంత్ర్యము, స్వేచ్ఛ వున్నాయి. వారి ఎదుట పెట్టుబడిదారీసమాజం వుంది. ఆ సమాజాన్ని సోషలిస్టు సమాజంగా మార్చడం ఎట్లా అన్నది వారి సమస్య. నా మనస్సులో ఏమి వున్నవో, బహుశా అది, ఇది ఒకేరకమైనవి అయితే కూడా అయివుండవచ్చు. కాని ఇచ్చట ఉపాయాల విషయంలో, తాత్విక వైఖరుల విషయంలో తేడా వుండి తీరుతుంది. అవి ఒక్కటి కాదు.

**అయితే 'సోషల్ డెమాక్రసీ'ని గురించి మీరు ఏమనుకుంటున్నారు! అది ఫలానుమేయ ప్రామాణ్యం కలదనా? అనుభవమూలకమైనదనా? లేక పట్టి అవకాశవాదకబలమైనట్టిదనా?**

జిలాస్ : ఈ సమాజంలో నాకు నేనే అవకాశవాదిని. నేను ఫలానుమేయప్రామాణ్యవాదిని. కమ్యూనిజంలో ఉపప్లవాత్మకమైన మార్పులు నాకు ఇష్టంకాదు. అటువంటి మార్పుల అవసరం కూడా కన్పించదు. కమ్యూనిస్టు సమాజంలోకూడా నిరుప్లవమైన పద్ధతిలో, ప్రజాస్వామ్యధర్మరూపంలో ఆ జరిగే మార్పులు జరగవచ్చు.

**యుగోస్లావియాలో ఇప్పుడు ఏవోమార్పులు జరుగుతున్నాయిగదా! వానిని గురించి మీ అభిప్రాయం ఏమిటి?**

జిలాస్ : ఆ మార్పులకు సంబంధించిన సంకల్పాలయితే బాగానే వున్నాయి. భావనలు కూడా ఉచితంగా వున్నాయి. కాని ఇచ్చట ఒక్కవిప్రతిపత్తి కన్పిస్తున్నది. మార్పులకోసం అయిన లక్షణాలకు రాజకీయ జీవితానికి నడుమ సంవాదం గోచరించడంలేదు. ప్రాచీన మార్క్సిజంలో ఇటువంటి విరోధాభాస ఒకటి వుంది. అందులో అధిష్ఠానానికిన్నీ, ఆవరణానికిన్నీ పడదు. ఇప్పుడు యుగోస్లావియాలో ఆర్థిక జీవనం ఏవో త్వరితగతిని ముందుకుపోతూ వుంది. రాజకీయవ్యవస్థ ఏమో కుంటినడక నడుస్తూవుంది. మరి సంస్కరణం అన్నది వున్నదంటే అది తొందరమీద జరిగే పని కాదు, దీర్ఘకాలంమీదగాని దాని ఫలితం కన్పించదు. ఇచ్చట దేశంలో మిశ్రమ ఆర్థికత చెల్లుతూవుంది. ప్రభుత్వరంగము, ప్రైవేటు రంగము, సమిష్టిరంగము అన్నీ వున్నాయి. మరి ఆర్థికవిధానంవంకచూస్తే, అచ్చట సోషలిస్టురంగం అన్నదితప్ప మరి ఇంకోరంగం వున్నదన్న స్ఫురణ లేకుండా, ఆ విధానం కొనసాగుతున్నది. ఉదాహరణకు వ్యవసాయం వుంది. అది ప్రైవేటురంగం. లక్షలకొద్దీ జనం ఆ వ్యవసాయంలో పనిచేస్తున్నారు. కాని వారినిగురించిన శ్రద్ధే ఇక్కడ కన్పించదు. వారంటే అవధానం వహించడం అన్నదేలేదు. రైతు జనానికి స్వేచ్ఛ వుండాలి. స్వాతంత్ర్యం వారి అనుభవానికి రావాలి. వ్యాపారంలోనేమి, సహకార వ్యవస్థలలోనేమి వారికి స్వేచ్ఛ స్వాతంత్ర్యం వుండాలి. వారికి ఎక్కువభూమి వుండాలి. పది హేక్టారులు—అది ఒక భూమియా? అది చాలదు. కార్మికులకు సంబంధించివున్న స్వయంపాలనం పద్ధతి వున్నదంటే, అక్కడ ఆ కార్మికులకు వస్తూత్పత్తి విషయంలో ఎక్కువ అవధానము, అధికారము ఏర్పడేట్లు చూడాలి. ఈ విషయంలో నాకునాకే ఇంకా స్పష్టమైన అభి

ప్రాయం కుదరలేదు. మేనేజర్లకు ఎక్కువ అధికారాలు, ట్రేడ్ యూనియన్లకు ఎక్కువ హక్కులు ఇవ్వడం బాగుంటుందేమో నని పిస్తున్నది. స్వయంయాజమాన్యం ప్రజాస్వామ్యానికి ప్రతినిధానం కాజాలదు. వర్కర్స్ కౌన్సిళ్లంటే నాకు ఎటువంటి విరోధమున్నూ లేదు. ఎక్కువ స్వాతంత్ర్య లబ్ధికి దారితీసే స్థిత్యంతరపరిణామ దశావిశేష సందర్భంలో వాని ప్రయోజనం అధికమై వుంటుంది కూడాను. యుగోస్లావియాలో ఇప్పుడు ప్రతిపక్షం అవసరం వున్నదని నేను అనుకొనడం లేదు. ప్రజాస్వామ్య శక్తులు ఏమి వున్నాయో అవి కమ్యూనిస్టు ఉద్యమంలో వుండే పని చెయ్యాలి; దానికి ప్రతికూలంగామాత్రం కాదు.

**చైనాలోవారు ఒక పద్ధతి సోషలిజము, కమ్యూనిజము గురించి చెబుతున్నారు. అదే ఆదర్శప్రాయమైనది అంటున్నారు మీ అభిప్రాయాలు వానికి పూర్తిగా విరుద్ధంగా వున్నాయి. చైనాయొక్క ఈ అభిగ్రహంమూలంగా ఐరోపీయ కమ్యూనిజంలో ప్రజాస్వామ్య విహితమైన మార్పులు వస్తాయని అనుకుంటున్నారా?**

జిలాస్: ఆ ప్రశ్నను వేయవలసింది అట్లా కాదు. చైనా విషయం పూర్తిగావేరు. ఆ చైనాలో నిజంగా అంత అవ్యవస్థ వున్నదని నేను అనుకొనడంలేదు. మనకు వూరికే అటువంటి అభిప్రాయం కల్గుతూవుంది. అటువంటి అభిప్రాయాన్ని ఆ పరిస్థితి మనయందు సృష్టిస్తున్నది. చైనాలో అధికారంకోసం అంతరంగికమైన పోరాటం ఒకటి నడుస్తూవుంది. 1930 ప్రాంతాలలో రష్యాలో నడిచిన పోరాటం లాగానే. కాని చైనా స్టాలినిష్టు మార్గంలో పోదు. చైనా కమ్యూనిజంలో ఎప్పుడు మత సంబంధమైన తత్వాలు ప్రబలాలై పనిచేస్తూ వుంటాయి. అధికారంకోసం జరుగుతున్న ఈ పోరాటంలో మావో గెలుస్తాడు. చైనా ప్రపంచ రాజ్యం అవుతుంది. అది అట్లా కావడంఅన్న దానిని ఎవ్వరూ ఆపలేరు. ప్రపంచ రాజ్యం కాదగిన నైతికమైన అధికారము, చారిత్రకమైన హక్కు చైనాకు వున్నాయి. ఇది నా నమ్మకం.

**అది ప్రమాదభూయిష్ఠం కూడా అవును కదా?**

జిలాస్: కాదు. ప్రచారంలో మాత్రం వున్న ఔద్ధత్యం; చైనా అసలు లక్షణంలో లేదు. ప్రచారంలో కన్పిస్తున్న ఔద్ధత్యం చైనా లక్షణంలో వున్నదంటే నేను నమ్మను. పైగా ఏదో సాయుధ సంఘర్షణ తటస్థం అవుతుందన్న అభిప్రాయంకూడా నాకు లేదు ప్రపంచం అద్వయస్థితికి అభిముఖంగా పోతున్నది. ఆ స్థితిలో చైనా కూడా ఇమిడివుంది.

**అయితే చైనాతో సాగుతున్న సిద్ధాంతరూప వివాదానికి పరిష్కారం వున్నదంటారా?**

జిలాస్: ఆ తగాదా ఇంకా వట్టికుటుంబ వివాదమాత్రంగా మాత్రమే వుంది. అయితే వచ్చే ఏభై యేళ్లలో ఎన్ని మార్పులన్నా జరగవచ్చు ఆ మార్పులలో ఈ కుటుంబపు తగాదా నమసిపోవచ్చు. చైనామార్గం చైనాది. ఆ మార్గంలో చైనా పోతుంది. తూర్పు ఐరోపా రాజ్యాలు, సోవియట్‌రష్యాతోసహా, ఎన్నోమార్పులకు లోనవుతాయి. అప్పుడు ఈ తగాదాకే అర్థం వుండదు. ప్రాముఖ్యం పోతుంది.

**అయితే ఐరోపా విషయంలో రష్యా విధానం కూడా మారుతుందంటారా?**

జిలాస్: చైనా, రష్యాల మధ్య తగాదాను తమ స్వప్రయోజనాలకు ఉపయోగించుకోవచ్చునని కొంతమంది పశ్చిమజర్మన్ రాజకీయవేత్తలు అనుకుంటున్నారు. అది సరియైన ఆలోచన కాదు. అదో భ్రాంతి. ఆ తగాదాకంటేముందే

జర్మన్ సమస్య పరిష్కారం అయిపోతుంది. శాంతియుతంగాకూడా పరిష్కారం అవుతుంది. తూర్పు జర్మనీపట్ల పశ్చిమ జర్మనీ విధానం ఇప్పుడు సంకుచితమై, పిడివాదం పద్ధతిలో పట్టువిడుపులేనిదిగా వుంటున్నది. మరి ఈ పిడివాదాలకు తగూలలోమాత్రమే పుష్టి లభిస్తూవుంది. తూర్పు జర్మన్ పిడివాదాల సంగతి కూడా అంతే. అన్నిపిడివాదాల విషయం కూడా అంతే. బంధుత్వాలు పెరుగుతూవున కొద్దీ, లేక ఉద్రేకాలు తగ్గుతూవున్నకొద్దీ, అవి మార్పు చెందుతాయి. ఆ పరిస్థితులలో పిడివాదాలు వుండవు, పోతాయి.

**మీ యుగోస్లావియాలో కూడా పిడివాదాలకు దూరంగా మసలడం అనే పద్ధతి ప్రబలంగా వుంది. ఇప్పుడు మీరు అట్లా ఒక్కసారి వెనక్కు చూచుకొని, మీయొక్క పెరుగుదల లేక వికాసం ఎట్లా వున్నదని అనుకుంటున్నారు?**

జిలాస్: నేను విప్లవోద్యమంలోంచి ఆవిర్భవించాను. అట్లా అని నేను నీతిసంబంధమైన బోధను ఎప్పుడూ పోగొట్టుకోలేదు. ఏదో ఒక తప్పు చేసినప్పుడుగూడా ఈ నీతిబోధ నా యందు వుంటూనేవుంది. నేను ఒక్కసారి ఈ నా గడిచిన జీవితాన్ని వెనక్కితిరిగి తేరిపార చూచుకుంటాను. అప్పుడు నా జీవితం అంతటా హేతుస్ఫూర్తి సూత్రపట్టినట్లు గోచరం అవుతుంది. నన్ను ఎరుగని వారికి ఈ విషయం చెప్పినా అర్థం కాదు నేను ఒకప్పుడు మరీ అతివాదిని. కమ్యూనిస్టుఉద్యమంకన్నా కూడా అతివాదిని. ఇప్పుడు నా అభిప్రాయాలు వేరు. మారిపోయినాయి. ఏమైనా నా జీవితంలో ఒక సూత్రం వుంది. అది అనుస్యూతమైంది. నేను ఇప్పుడు వెనక్కు తిరిగి చూచుకున్నప్పటికీ, నేను ఎప్పుడు ఎట్లావున్నానో అప్పుడు అట్లాకన్నా వేరుగా వుండటం ప్రధానం కాదనిపిస్తుంది. అది నాకు ఇష్టమూకాదు. నేను విప్లవకారుణ్ణి. యుగోస్లావియామనిషి అది కాకతప్పదు. నా జీవితంలోగూడా అది తప్పనిసరి. నా గడిచిన జీవితంలో గనుక, ఆ అనుభవము, అనుభూతి లేని పక్షంలో, నేను ఈ రోజున ఏ విధంగావున్నానో ఆ విధంగా వుండేవాడిని కాదు.

**ఇది ఒకవిధమైన "dialectic" కాదంటారా?**

జిలాస్ : అవును. కాని హెగెల్‌పద్ధతిలో కాదు. ఇందులో చాలా విషయాలు పెనువడి వున్నాయి. మానవీయమైనవి, మనస్సంబంధమైనవి, విద్యకు సంబంధించినవి, కుటుంబ సంబంధమైనవి; నేను మాంటినిగ్రోనును కావడం అన్నది ఇంకొకటి వుంది. నేను వెనక్కుతిరిగి అట్లా చూచుకుంటే, నాజీవితంలో ఒక్క మార్క్సిజమే కాదు కన్పించేది. యుగోస్లావ్ ప్రజాసాహిత్యం కన్పిస్తుంది; మాపూర్వులు న్యాయంకోసం, దారిద్ర్య నిర్మూలనకోసం టర్కీవారితో సాగించిన పోరాటాల సంగతి వుంది. నేను మార్క్సిష్టునుగావున్న రోజులలో ఇవి అన్నీ తమ ప్రభావాన్ని నాపై చూపించాయను కోలేదు; తీరా ఇవ్వాళ్ల చూచుకుంటే, అది అట్లాకాదని, అవి అన్నీ నాపై తమ ప్రభావాన్ని చెల్లించుకున్నాయని విశదం అవుతున్నది.

**పూర్వం మీరు కొంతమంది మిత్రులతో కలిసి పనిచేశారు. పోరాటాలు సాగించారు. వారితో కలిసి అధికార నిర్వహణంలో భాగస్వాములుకూడా అయినారు. తిరిగి ఒక్కరోజున వారితో కలిసి పనిచేయగల పరిస్థితి వస్తుందని ఏమైనా అనుకుంటున్నారా?**

జిలాస్ : బహుశా వారిలో కొందరితో కలిసి పనిచేయువచ్చు. అదికూడా రాజకీయంగానే కాని పూర్వంవున్న ఆప్యాయతలు, గాఢతలు అవీ ఇప్పుడు రమ్మంటే రావు. రాజకీయంగా మేమంతా పరస్పర విధేయభావంతో కలిసి పని చేయువచ్చు—ఒక విధమైన రాజీ పద్ధతిలో.

నేను ఖైదులోవున్న చివరి నాల్గు సంవత్సరాల ఎనిమిది నెలలు ఎంతో శాంతిని అనుభవించాను. నాలో నేనేకాక, బయిటి ప్రపంచంతోకూడా ఆ శాంతిని అనుభవించాను. జైలు జీవితంతో నేను ఇంతగా ఎప్పుడు సరిపెట్టుకు పోలేదు. ఇంతగా శిక్షను తుదివరకు అనుభవిద్దామని ఎప్పుడూ అనుకోలేను. 1950 లో నేను పరమ ఉద్ధతంగా వున్నాను. ప్రకోపనచిత్తుణ్ణై వున్నాను. నన్ను ఖైదులో పెట్టండి అని అడిగినట్లే నడిచాను. 1961 లో అట్లా కాదు. అది అంతా వేరు. నేను పుస్తకం వ్రాశాను. దాన్నిఒక సవాలుగా ఉద్దేశించలేదు; సంకల్పించలేదు.అందులో అన్నీ అప్పటికి తెలిసిన విషయాలే వున్నాయి. ప్రచురింపబడిన విషయాలుకూడాను అవి. అవే వ్రాశాను.నేను ఆ గ్రంధం ప్రచురణను ఉపసంహరించుకున్నాను.అప్పుడు ఇకవెనక్కు తిరగడంఅన్నది లేదు. వెనక్కుతిరగలేను. వ్యక్తిగా నాకువున్న స్వాతంత్ర్యం,ప్రతిష్ఠ — వీని సంగతి ఏమిటని వచ్చింది. అవి సంశయనిపతితాలై, కాపాడుకోవలసినవి అయిపోయినాయి.

నన్ను మొదట అరెస్టు చేసినప్పుడు బెల్‌గ్రేడ్‌లోని సెంట్రల్‌జైలులో పెట్టారు. అది ఒక భయానకప్రదేశం. నేను ఒక గదిలో నిద్రపోయేవాణ్ణి. అది నిజానికి ఇరవైఅయిదుమంది పడుకోడానికి సరిపోయేఅంత పెద్దగది. అంత గదిలో, గిది నడిమధ్యంగా నా మంచం ఒక్కటే వుంది. తరువాత నన్ను అచ్చట వాకిట్లో తిరగనిచ్చారు. నేను ఒక్కణ్ణే. ఇతర ఖైదీలు ఎవ్వరూలేకుండాచూచి నన్ను అట్లా తిరిగేందుకు వదితే వాకిలి. ఆ వాకిలి చిన్నది. చుట్టూ గోడలు. ఐదేసి అంతస్తుల ఎత్తు. పైకిచూస్తే ఆకాశంలో కొస్తమాత్రం కన్పించేది. నేను అక్కడ తారుతుంట్లాడే వాణ్ణి. గోడలకు కిటికీల వరుసలు పైదాకా వున్నాయి. ఐదు వరుసలు కిటికీలు. వాటిని చూచేవాణ్ణి. అవి నిశబ్దంగా, అధికారాలైనట్లు వుండేవి. శూన్యంగా, నిస్సారంగా వుండేవి.హఠాత్తుగా నాకో ఆలోచనవచ్చింది. ఇది అసమగ్ర సమాజం. నా కున్న సంకల్ప విశేషాలను గురించి ఎప్పుడన్నా పుస్తకం వ్రాస్తే ఆ పుస్తకాని కాపేరు పెట్టాలి- అనుకున్నాను: అసమగ్ర సమాజం — అది ఆదర్శం : అసమగ్రము, ప్రకృతిసిద్ధము, స్వతంత్రమైన అభ్యున్నతికి స్థానమైనది, సంఘర్షణలతో, క్లేశాలతో పెరిగేది.

పూర్వం నాకు వుండే అభిప్రాయాలన్నీ తెలుపు,నలుపు పద్ధతిలోవుండేవి. The New Classలో కూడా కొంత పిడివాదం వుంది.ఆ పుస్తకాన్ని వ్రాసినప్పుడు నా కళ్లముందు జనం ఆడారు. ప్రపంచంలో సర్వ దౌష్ట్యాలను నివారించేందుకు పతాకాలు పట్టుకొని, శిరస్త్రాణాలు పెట్టుకొని జనం కన్పించారు. ఆ దౌష్ట్యాలు ప్రపంచంలో పెరిగాయి. వాటిని శిక్షించి, ఈ ప్రపంచాన్ని సమగ్రంచేసే వారుగా ఆ జనం కన్పించారు.

1949 లో న్యూయార్కుకు ఒక్కసారి వెళ్లాను. కొద్దికాలంపాటు వున్నాను. అప్పుడు చూచింది ఏమి వుంది! నిజంగా చూచింది ఏమీ లేదు. కాని నా కొకటి అనిపించింది. ఆందోళనకూడా చెందాను. అమెరికా ఇంతగా విద్వేశములు పెంపొందిన

దేశం కదా! ఇక్కడ లక్షలకు లక్షలుగా కార్మికులు వున్నారే! అయితే కమ్యూనిష్టు లెందుకు లేరు? నిజం చెప్పాలంటే నాకు న్యూయార్కు బాగా గుర్తులేదు. గుర్తు వున్నది ఇదే. ఈ బాధ. అంతమంది కార్మికులు వున్న ఆదేశంలో కమ్యూనిష్టులు ఎందుకు లేరు?

(టాయ్‌లెట్ కాగితాలతో నిండివున్న రెండు పెద్ద ప్లాస్టిక్ పెట్టెలను చూపించి)- అవి నేను వ్రాసిన రెండు క్రొత్త నవలలు. వ్రాతప్రతులు. నేను ఖైదులో వున్న రోజుల్లో 'టాయ్‌లెట్' కాగితం మీదనే వ్రాయవలసివచ్చింది; మరేమీ దొరక లేదు. ఈ రెండూ గూడా చరిత్రాత్మక నవలలు. మాంటినీగ్రోలో క్రైస్తవులకు, ముస్లింలకు మధ్య నడిచిన తగూలు, వారిలో పెరిగిన విభేదాలు గురించి వ్రాశాను. మాంటినీగ్రో నేను పుట్టిన రాష్ట్రం.

నేను ఇప్పుడు ఒక శిక్ష అనుభవిస్తున్నాను. బాహాటమైన పద్ధతులలో ప్రజకు నా భావాలను చెప్పుకునే వీలులేదు. నామీద ఆ నిషేధం విధించారు. ఈ నవలలను విదేశాలలో ప్రకటన చేయించుకోడానికి యుగోస్లావ్ అధికారులు అభ్యంతరం చెప్పరనుకుంటాను. అటువంటి అనుమతికోసం దరఖాస్తు చేసుకున్నాను. సమాధానంకోసం నిరీక్షిస్తున్నాను. నాకు విదేశాలకు వెళ్ళిరావాలనివుంది. ప్యాస్‌పోర్టుకు కూడా దరఖాస్తు వేశాను. ఇస్తారనే అనుకుంటున్నాను. దేశం విడిచి అట్లా విదేశాలకు వెళ్ళిరాగల నా హక్కును మన్నిస్తారనే **అనుకుంటున్నాను.** ఇది నా దేశం. నా ఇల్లు. నేను విదేశాలలో వుండను. చూచి వచ్చేస్తాను.

నేను వ్రాసిన యీ రెండు నవలల్లో పెద్దది—'Bridges and Worlds' అన్నది. ఇంకా చిత్తులో వుంది. 1923 లో మాంటినీగ్రోలో జనహత్య జరిగింది. ముస్లింలను హతమార్చివేశారు. అది నా చిన్నప్పుడు. నాకు ఇంకా జ్ఞాపకం వుంది. అది ఈ నవలలో ఇతివృత్తం. మా తండ్రి గారు ఆ జనహత్యలో పాల్గొన్నారు. నేను ఆయన్ను ఎప్పుడూ అడిగేవాణ్ణి. 'ఆ పని ఎందుకు చేశారు? ఎట్లా చేయగల్గారు?' ఆయన ఏమీ చెప్పలేకపోయేవాడు. ఒక్క మాట మాత్రం అనేవాడు: 'మేము ఒళ్లు తెలిసి చేశామంటావా? ఏమి చేశామో మాకే తెలియదు. అదో **పూనకం.'** గ్రంథం శీర్షికలో "Worlds" అన్నమాట వేరువేరు మతాలకు, వర్గాలకు ప్రతీక. వీరంతా తెగ చేత, భాషచేత, మతంచేత, ఐహిక సంబంధమైన విశ్వాసాలచేత కట్టుబడినారు. "Bridges" అన్న పదం-శేషమానవతకు సంబంధించింది—నాగరికతకు ఆధారాలైన విషయాలకు గుర్తు.

'యుగోస్లావియాలో వేరువేరు జాతుల వారు వున్నారు. వారందరు ఒక్కటిగా ఎట్లా వున్నారు అంటే, దురాక్రమణను గురించిన భయంచేతను, సామ్రాజ్యవాదాన్ని గురించిన భీతిచేతను—అని సమాధానం. మొదట టర్కీ సామ్రాజ్యము, హాప్స్‌బర్గ్ సామ్రాజ్యములవలన; తర్వాత నాజీ జర్మనీ, ఫాసిష్టు ఇటలీల వలన; అటుపిమ్మట స్టాలిన్ గారి రష్యా వలన. ఇప్పుడు అటువంటి భయ

భీతు లేమీలేవు. ఈ దేశంమీద ఎవ్వరూ తమ దృష్టిని పరపడంలేదు. అందువల్లనే స్లొవెనీలు, క్రోటులు, మాసిడోనియన్‌లు మొదలైన యుగోస్లావియనులంతా, తమ్ము తాము చూచుకుంటున్నారు; తమ సంస్కృతిని పట్టుకుంటున్నారు. ఒకవిధమైన స్వాతంత్ర్యేచ్ఛ వారిలో ప్రబలం అవుతున్నది. అది సహజం కూడాను. టోగో వంటిది తనంతట తానుగా ఒక రాజ్యం కాగల్గినప్పుడు, మాకు కూడా ఒక రాజ్యం ఎందుకు వుండకూడదు? ఇదీ వారికి పట్టిన ప్రశ్న. ఒకవిధమైన వైవిధ్య విస్ఫూర్తి ఇట్లా కల్గుతున్నది. ఇది ప్రకృతిసిద్ధమైంది. ఈ వైవిధ్యాన్ని వైయక్తికవ్యక్తిత్వంతో సమన్వయంచేసి ఐరోపా ఏకీకరణంతో అనుసంధించాలి. ఈ ఏకీకరణం విధిన్నీ; సహజమున్నూ. ఈ సర్వాన్ని ఎట్లా సాధించడం అన్నదే ఇప్పుడు సమస్య.

ప్రపంచం అద్వయస్థితికి అభిముఖంగా పోతున్నది. ఆ లక్షణంయొక్క ప్రథమ దశయొక్క ఆవిర్భావాన్ని ఇప్పుడు మనం చూస్తున్నాము. ఏదో ఒక సిద్ధాంతాన్ని పెట్టుకొని సర్వానికి అర్థం చెప్పడం ఎట్లా? అది సాధ్యవిషయంకాదని ఇప్పుడు ఎక్కువమంది గ్రహిస్తూవున్నారు. వేరు వేరు సిద్ధాంతాలు, వేరువేరు పద్ధతులు, వ్యవస్థలు వున్నాయంటే, అవి అన్నీ సన్నికర్షం చెందుతున్నాయి. ఒకదాని కొకడు దగ్గరకు వస్తున్నాయి. సోషలిజం ఔదార్యాన్ని నేర్చుకుంటున్నది. పెట్టుబడిదారీ పద్ధతి సమసమాజధర్మాయత్తి పొందుతున్నది. మన యీ కాలంలో జరుగుతూ వున్న మహత్తర సంఘటనలలో ఇది ఒకటి. చైనా వున్నదే అనుకోండి. అది కూడా మారుతుంది. ఇప్పుడు ఆ చైనీయులు మార్పుకైన మార్గంకోసం అన్వేషణ చేస్తున్నారు. రష్యాకు, చైనాకు అభిప్రాయభేదాలు రావడం లోకానికి మంచిదైంది. ఇందుమూలంగా సిద్ధాంత చర్చ సాగుతోంది. ఇందువల్ల యుద్ధప్రమాదం తగ్గుతోంది.

స్వరూపం అల్పం. సారం శ్రేష్ఠం. రాజ్యంయొక్క స్వరూపవిశేషాలకన్నా నాకు స్వాతంత్ర్యము, స్వేచ్ఛ ముఖ్యం.

పెట్టుబడిదారీ విధానం తిరిగి రావాలని నేను చెప్పడంలేదు. కాని వైయక్తిక శక్తికి ఎక్కువ ఎడం వుండాలి. వ్యక్తులకు, గ్రూపులకు, కోఆపరేటివ్‌లకు, కంపెనీలకు పనిచేయడానికి తగిన ఉత్సాహం అబ్బేట్లు చెయ్యాలి. రాజ్య వ్యవస్థకన్నా స్వతంత్రంగా, కమ్యూనిస్టుపార్టీకి అతిరిక్తంగా అవి పనిచేయగలగాలి. ప్రభుత్వం హోటళ్లు, రెస్టారెంటులు నడుపుతున్నది. ఎందుకు నడపాలిట?

నేను కొంచెం పిడివాదం మనిషిని అయితే కావచ్చు. పిడివాదాలను పిడి పద్ధతిలో వ్యతిరేకిస్తాను నేను.

నాకు అధికారం అన్నది ఒక సమస్య కాదు. ముఖ్యమూ కాదు. నాకు—నా అభిప్రాయాలను చెప్పడం ముఖ్యం; పుస్తకాలు వ్రాయడం ముఖ్యం; ప్రతీక్ష ముఖ్యం.

తలఒగ్గడంకాదు. చెప్పదలచుకున్నదానిని చెప్పడం విషయంలో నేను ఎప్పుడూ భయ పడలేదు. ఖైదుకు పోవడంఅన్నా భయం లేదు. నేను గెలుస్తాను అన్న నమ్మకం నాకు కుదరలేదు. ఒక్కటిమాత్రం కుదిరింది నేను చెప్పదలచుకున్నది ఏమో, దానిని నిర్భీకంగా చెబుతాను. చెబుతూనే వుంటాను.

నేను తిరిగి అధికారంలోనికి రావడం అంటూనే సంభవం అయితే—ఆ అధికారంలో ఎంతకాలం వుంటాను...ఆ ట్టే కాలం వుండకపోవచ్చు—ఏమి చేయవలసి వున్నదో అది చేస్తాను. ఆ తర్వాత పోతాను. పూర్వం అధికారంలో వున్నానుగాని, అప్పుడు ఆ అధికారం నాకు సుఖం అనిపించలేదు. ముందు సుఖంగా వుంటుందని అనుకోను.

ఈ మార్పులను అన్నింటిని నేను అవగతం చేసుకోవాలి. ఒక్కటి మాత్రం స్పష్టంగా తెలుస్తూవుంది. నేను చచ్చినా ఎక్కటి జీవనం నడపను. అనామకుణ్ణిగా వుండను. అంతకన్నా జైలు జీవితం అభిలషిస్తాను.

—ఇటీవలి కొన్ని గోష్ఠులనుండి

(ఎన్‌కౌంటర్ సౌజన్యంతో)

---



పెద్దకథ:

# శీతారామయ్య పథకం

శ్రీ కొనకళ్ల వెంకటరత్నం

యాభై అయిదు శీతువుల మంచుపేరుకున్నదాయెను, శీతారామయ్య తల పండిపోయింది. పక్కటెముకలు మేదరబుట్ట పేళ్లల్లే పొడుచుకొస్తున్నాయి. మొహమ్మీద ముడతలు నాగేటిచాళ్లల్లే లోతుగా స్ఫుటంగా అవుపిస్తున్నాయి. దవడలు నీళ్లింకిపోయిన దొరువులల్లే నొక్కుకుపోయినై. నెత్తిన చిక్కగావున్న జుత్తు మొదట తెల్లబడి, తరువాత పల్చనై, కొసకి బట్టతల పడిపోయి ఏవో నాలుగు పోచలు మిగిలినై.

శీతారామయ్య 'రిటైరు'కాగానే ఆఫీసులో ఒక చిన్న టీపార్టీ ఇచ్చారు లాంఛనప్రాయంగా. మంచివాడన్నారు. నిజాయితీపరుడన్నారు. పెద్దమనిషన్నారు. ఆపనికిరాని మూజువాణీ యోగ్యతాపత్రాలకి ఉబ్బితబ్బిబ్బయిపోక, గడచిన ముఫ్ఫైమూడేళ్ల 'సర్వీసు'లోనూ తను తిన్న తిట్లూ, చివాట్లూ, నెత్తినపడ్డ అన్యాయాలూ, అభాండాలూ ఆ టీ నీళ్లల్లో ప్రక్షాళనచేసుకుని, నిర్లిప్తంగా ఇంటికి తిరిగివచ్చాడు. రోజా భోంచేసి, ఒక పెద్దకునుకుతీసి, కాఫీసేవించి, నలభై నంబరు నేతపంచె కుచ్చిళ్ల ముడిచినవే ముడిచి, లంక పుగాకుచుట్ట తాపీగా చుట్టిందే చుట్టి, బట్టతలమీద రాలగా మిగిలిన నాలుగుపరకలూ దువ్విందే దువ్వి, ఏమీతోచక, టైముగడవక, ఆంధ్రపత్రికలో వారఫలాలు చూస్తున్న రెండో అమ్మాయి వాణీని పిలిచి, "చదువుచదువు: ప్యాస్‌మార్కు లేమయినా వచ్చేనా ఈయేడు ? అస్తమానూ పత్రికలూ నువ్వూనూ." అని నొక్కగదుము గదిమి, "ఏమేవ్—బజార్లో ఏమయినా కావాల్నా?" అని ఒక్కసారి కేకపెట్టి, ఎంతకీ సమాధానం రాక, "ఈపిడ అంతఃపురంలోనించి ఊడివడదు" అని గట్టిగానసిగి, ఆకుచెప్పు లేసుకుని, ఏ శంకరమఠానికో, ఏ గీతాభవనానికో, ఒకహరికథనీ, ఒక ఉపన్యాసమో, ఒకపురాణశ్రవణమనీ ఏదో కాలక్షేపంచేసి చక్కా వస్తున్నాడు.

* * *

శీతారామయ్యకి ఇద్దరు కొడుకులూ ముగ్గురు కొమార్తెలూ. పెద్దవాడు నళినీమోహన్. నళినీ అని పిలుస్తారు వాడిని. రెండోవాడు రామచంద్రం. రామూ అని పిలుస్తారు. పెద్దమ్మాయి హైమావతి; హేమూ అని పిలుస్తారు ముద్దుగా. రెండో అమ్మాయికి అసలు పేరూ ముద్దుపేరూ కలిసొచ్చేలా వాణీ అని పేరు పెట్టారు. మూడో అమ్మాయి రాధారాణి. రాధీ అని పిలుస్తా రామెని ఇంటెల్లపాదీ.

శీతారామయ్య తన వృద్ధాప్యంలో కృష్ణా రామా అనుకొంటో చీకూచింతాలేకుండా కాలక్షేపం చెయ్యడానికి అనువైన ఏర్పాట్లన్నీ చేసుకొంటో వస్తోనే వున్నాడు. నళినికి బి. ఇ. పూర్తికావచ్చింది. పి.యు.సి.లో 'క్లాస్' వస్తుందేమో బి.యి లో సులభంగా 'సీటు' సంపాయించవచ్చునూ అనుకున్నాడు మొదట్లో. నళిని మాటదక్కించలేదు. తెలివితేటలైనవాడే. కాని, స్నేహితాలెక్కువ. పుస్తకం ముందువేసుకోవడం తరవాయి, ఎవడో ఒకప్రబుద్ధుడు, 'ఒరేయ్ మోహన్' అని గేటుదగ్గర, సైకిలు దిగకుండానే, ఒక కాలు 'పెడల్'మీదనించితీసి నేలమీద ఆన్చి, అతిజరుగురు

పని ఏదోవున్నట్టు తయారయ్యేవాడు. దానిలో, హడావుడిగా, ఏదో మునిగిపోయినట్టు, తెరిచిన పుస్తకం తెరిచినట్టే వుంచేసి, 'వాచ్చెవాచ్చె' అంటూ గబగబా 'బుష్‌షర్టు' వేసుకుని, 'హవాయీ స్లిప్పర్లు' తొడుక్కుని, సైకిలెక్కి 'జై పరమేశ్వరా' అంటో అదేపోకగా పొయ్యేవాడు. ఆ పోక పోక ఎక్కడెక్కడ బలాదూరు తిరిగేవాడో మరి, రాత్రి పదింటికి ఇల్లు జ్ఞాపకంవచ్చేది కళ్ళు నులుపుకొంటో పెద్దచెల్లెలు హేమా తలుపుతీసేది. 'ఒరేయ్ నాయనా, ఇంటి పట్టున ఉండరా, శ్రద్ధగా చదివి 'క్లాసు'తెచ్చుకోరా, 'బి యి'లో 'సీటు' వస్తుందీ, అని చెవినిల్లుగట్టుకొని నతపోరేవాడు సీతారామయ్య. మొహానికి 'అయిటెక్స్' రాసుకొంటో, నెత్తికింత 'బ్రిల్ క్రీమ్' పులుము కొంటో, పీకుగా అద్దాని కెదురుగుండా 'పాంట్ క్రీజు' సరిచేసుకొంటో, 'ఆ - తమ్ముడు తెగచదువు తున్నాడుగా!' అని ఎద్దేవాలకి దిగేవాడు నళిని.

రెండోవాడు రామం తెగచదివేమాట నిజమే. కాని చదువు తలకెక్కదు వాడికి. పుస్తకాలుమాత్రం ఎప్పుడూ ముందేవుండేవి. ఒక ఆటకనీ, ఒక సినిమాకనీ, ఒక నిమిషంకనీ ఎగబడేవాడుకాదు. ఇంతకీ, చదివితే నాలుగు మార్కులు తెచ్చుకోగల నళిని చదువడు; ఎంత చదివినా మార్కులుతెచ్చుకోలేని బుద్ధావతారం రామూ విరామంలేకుండా రుబ్బుతోకూచుంటాడు. ఏతావాతా, నళినికి 'పి. యు. సి'లో 'క్లాస్' రాలేదు. సీతారామయ్యకి పొణంగిరోడ్డు కెగువని పంటకాలవపక్కని పెద్దలు సంపాయించిపెట్టిన కొండ్ర, సుక్షేత్రమైన మాగాణి అయిదెకరాలుంది. రెండెకరాలు కరణం సుబ్బారాయుడికి తెగనమ్మి మూడువేలు 'డొనేష' నిచ్చి మణిపాల్‌లో 'బి యి'లో 'సీటు' సంపాయించాడు నళినికి. తతిమ్మా మూడెకరాలూ సత్తిరెడ్డికి బేరం పెట్టాడు సీతారామయ్య. సత్తిరెడ్డిది కడుపునిండిన బేరం. సీతారామయ్యకి పైకం అత్యవసరమని ఎట్లా కనిపెట్టాడో కనిపెట్టాడు. పైకం నగదుగా ఇవ్వ గలవాళ్ళు అమరలేదు. బేరం నాలుగురోజులు నలగనిస్తే నలుగురిమధ్యా ధరపలికేదే. కాని వ్యవధిలేదు. జాప్యంచేసేందుకా వీలులేదు. అయినకాడికి సత్తిరెడ్డికే అమ్మాలిసొచ్చింది. సీతారామయ్య తలవొగ్గాడు. ఆరువేలు 'డొనేష'నిచ్చి 'మెడికల్ కాలేజీ'లో చేర్పించాడు రామచంద్రాన్ని. భూమిపుత్రా కొంపా గోడీలేదని ఫారాలునింపి దరఖాస్తు దాఖలు చేస్తే గవర్నమెంటు 'లో'నిచ్చింది రామం 'ఎం. బి' చదువుకని. ఉద్యోగం వచ్చినతరవాత నెలజీతంలోనించి దఫాలవారీగా ఆ లోను తీర్చుకుందుకు సదుపాయమొకటి అమిరివచ్చింది. సీతారామయ్య అదృష్టవంతుడు. నెలానెలా రామూకి పంపవలసిన డబ్బులో కొంత కలిసొచ్చింది. అదే మహద్భాగ్యమనుకుని తలతడిమి చూచుకున్నాడు సీతారామయ్య.

ఒక కొడుకు ఇంజనీరూ ఒక కొడుకు డాక్టరూ కావాలని సీతారామయ్య ఆశయం.

ఆ కోరిక నెరవేరింది.

*　　　*　　　*

సీతారామయ్య ముప్ఫయిమూడేళ్ల క్రితం స్కూల్ ఫైనల్ ప్యాసయి డి. యి. వో. ఆఫీసులో నెల 1 కి 30 రూపాయల జీతమ్మీద 'లోయర్ డివిజన్' గుమాస్తాగాజేరి, అప్పట్లో అర్ధరూపాయీ, రూపాయీ లెఖ్ఖనా, దిమిలా పెరిగి మూడూ అయిదూ రూపాయిల లెఖ్ఖనా, సాలుసరి 'ఇంక్రిమెంట్ల'తోసహా, దఫాలవారీగా తాబేటినడకమీద సాగిన జీతాల 'స్కేళ్ళ'మీద, కరువు బరువుతో పొంతనలేని కరువుభత్యం కలుపుకోగా, ముప్ఫయి మూడేళ్ల సర్వీసయింతరువాత రెండువందలపైచిల్లర అంకె అందుకున్నాడు. ఇక యాభైఅయిదేళ్ళు నిండినై. తప్పుకోమన్నారు. 'పెన్షన్' డెబ్బయిమూడు వస్తోంది.

పొలం క్రియదస్తావేజు వ్రాసి తలవంచుకుని మౌనంగా ఇంటికి తిరిగివస్తుంటే సాక్షి సంతకాలకని కూడా వచ్చిన రైతు సుబ్బయ్య, 'ఏందట్టా దిగులుగా ఉండావు పంతులూ? - ఈ గుప్పెడు నేలా ఆర్చేనా తీర్చేనా, జగజ్జెట్టీల్లాంటి కొడుకులిద్దరు అటూ యిటూ ఉండగా నీకొచ్చిన లోటేందయ్యా?' అని భరోసా ఇచ్చాడు. ఇంటికొచ్చి హాలులో బెంచీమీద కూలబడి కండవాతో కళ్లొత్తుకుంటుంటే భార్య పార్వతమ్మ తలుపుదగ్గర ఓరగానిల్చుని, 'రిజిస్ట్రయిందా?' అని పరామర్శించింది. తల వూపాడు సీతారామయ్య. పార్వతమ్మ తడిచేతులు పైటకొంగుని

తుడుచుకుంటూ, 'ఏమిచేస్తాం. మనేదపెట్టుకోకండి. ఇన్నాళ్ళా ఆ గడ్డమీదనే బ్రతికామా గంపెడు కామాటంతో ? ఏదో వేన్నీళ్ళకి చన్నీళ్ళుగా ఇన్నిగింజలు తెచ్చుకున్నాం ఏటేటా. ఈనాటిలో ఆ భూదేవికీ మనకీ రుణంతీరిపోయింది. పిల్లలు చేతికంది వస్తే మన కష్టాలు గట్టెక్కకపోతయ్యా?' అని ఓదార్చింది.

హేమా, వాణీ, రాణీ, అప్పుడే బడినించీ వస్తూ పుస్తకాలు అరమరలో సర్దేసుకుని, దిగులుపడి పోయివున్న ఇద్దరివంకా బితుకూబితుకూ చూస్తూ నిలబడిపోయారు.

శీతారామయ్య తేరుకున్నాడు.

వేసుకున్న అంచనాలకి అనుగుణంగానే, శీతారామయ్యకి యాభయ్యయిదేళ్ళా నిండి రిటైరయ్యే టప్పటకి ఇద్దరు కొడుకులూ 'కోర్సులు' పూర్తిచేసుకుని ఒకడు భిలాయ్‌లో 'అసిస్టెంట్ ఇంజనీరు' గానూ, ఒకడు హైదరాబాదులో ఉస్మానియా మెడికల్ కాలేజీ హాస్పెటల్‌లో 'సబసిస్టెంట్ సర్జన్‌గానూ' ఉద్యోగాలు సంపాయించుకున్నారు. ఎవరెవరిని ఎట్లా పట్టాలో అట్లా పట్టాడు శీతారామయ్య. ఉద్యోగానంతరం మూడువేలు 'గ్రాట్యుయిటీ' వస్తే దానితో హేమాపెళ్ళి చేశాడు బెజవాడలో రాచర్లవారి సంబంధం. సారసంప్రదాయాలుగల కుటుంబం. కుర్రవాడు గుంటూరు కాలేజీలో 'ఇంగ్లీషు లెక్చరర్'. పెళ్ళిచూపులయిం తరవాత, ఈ పిల్లని తప్ప ఇంకెవతిస్తీ ససేమిరా చేసుకోనని భీష్మించుకుని కూచున్నాడు వరుడు ఆ రహస్యం తలిదండ్రులతో గుంభనగా అని చక్కా ఊరుకోక అలవుకికంగా బైటపెట్టే సందువల్ల, పిల్లిమీదబెట్టీ పీటమీదబెట్టీ కట్నం అంతకు కొంత గుంజే అవకాశం బొత్తిగా సన్నగిల్లిపోయింది వియ్యాలవారికి. అంచాత కట్నాల ప్రసక్తి లేకుండానే సమంధం అమిరినా, ఆనవాయితీ ఉన్నవీ లేనివీ, జ్ఞాపకంలేనివాటిని అడిగి తెలుసుకొనీ, కాలదోషం పట్టినవాటిని తిరగదోడీ, ఆ ప్రాంతంలో ఉన్న రివాజులూ, ఇతర ప్రాంతాలలోఉన్న ఆచారాలూ అన్నీ కలగలిపి, పురోహితుణ్ణీ బంధువర్గాన్నీ గుచ్చి గుచ్చి ఆరాలడిగి, సూచనలందుకుని, అడుగడుక్కీ లాంఛనాలు కొన్ని రుద్దీ, కొన్ని గుంజి, కొన్ని దౌర్జన్యంగా రాబట్టుకునీ, వియ్యాల్వారు చేసిన దాష్టీకానికిలోబడి పెళ్ళి అయిందనిపించేసరికి తలప్రాణం తోకకొచ్చింది శీతారామయ్యకి. చేతికొచ్చిన మాడలేం కానుకలూ ఖాళీఅయి బట్టల కొట్టులోనూ, పచారీకొట్టులోనూ, పుల్లల అడితిలోనూ, అక్కడక్కడ కొన్ని చిల్లర అప్పులు మిగిలినై. 'హేమా మెరుపుతీగలాంటిపిల్ల— విడిపి దీపంపెట్టొచ్చును: ఇంటికే ఒకవెలుగు... అని పెళ్ళివారయితే మురిసారు కాని, లత్తు ఆడబడుచులమాత్రం, కట్నాలగొడవా, కానుకలతో మాత్రం కాదనకగా టెంకరంగా అటో ఇటో అడుగుపెట్టిన కోడలినిమాత్రం పీప ప్పసి ప్రసించలేదు. మూతి విరుపులతో, ముక్కువిరుపులతో, నిష్ఠూరాలతో శాపనార్థాలతో, ఎద్దేవాలతో హేళనలతో ఎట్లాగో ఆమూడుమాసాలూ పడింపు గ్రసించి హేమాని కాపరానికి పంపించేశాడు శీతారామయ్య. కార్యంపట్ల తాపంచుకుంటే రంకాలమూ తల ఎత్తుకుని తిరగవచ్చు ననిపించాడు మొత్తమ్మీద

ఆ పెళ్ళి హడావుడిలో అప్పైకున్నభాగం చాలక నెలకి యాభై ఇచ్చి, ఒక చిన్న దాబాయిల్లు అశోకనగరంలో ప్రత్యేకంగా తీసుకోవాల్సొచ్చింది. అక్కడక్కడ పేరుకుపోయిన అప్పులు దఫాలవారీగా తీర్చేశాడు. ఆయన పెన్షన్ సరేసరి ముష్టి డెబ్బయిమూడు రూపాయిలు. అంచాత కొడుకులు పంపుతున్న పైకంలో కొంతకు కొంత కుటుంబపోషణ క్రిందనే సరిపెట్టవలసి వచ్చింది.

వాణి 'యస్. యస్. యల్. సి' ప్యాసయి 'పి. యు. సి'లో కొచ్చింది. రాధారాణి 'యస్. యస్. యల్. సి'లోకి వచ్చింది. వాణి చామనచాయయినా ఒక 'డిగ్రీ' హెచ్చించి కొంచెం ఎరుపు అని చెబుతో వుంటాడు శీతారామయ్య. కోటేరేసినట్టు ముక్కూ, 'టేబిల్‌టెన్నిస్' బంతిలాంటి గుండ్రని చిన్ని గడ్డమూ, ఎంచక్కా వుంటుంది అని తలిదండ్రులయితే మురిశారుగాని, పెళ్ళిళ్ళమార్కెట్టులో విడుదలకి సిద్ధంగావున్న, వరుళ్ళ తలిదండ్రులుమాత్రం, ఆకర్షించవలసిన కట్నాలస్థాయి ఎక్కడ దిగజారుతుందోనని ఆ కన్య అందచందాలు అంతంతగానే ఒప్పుకుని చక్కా వూరుకుంటున్నారు. రాధారాణి విచ్చిన ముద్దబంతి పువ్వులా వుంటుంది. 'క్లాసు'లో మణిపూస అనిపించుకుంటున్నది. రవంత పెంకెతనం

మాంచి జబర్దస్తైన వాళ్ళు. గెడ్డానికి మధ్య చిన్న నొక్కు. నవ్వితే బుగ్గలమీద సొట్టలుపడతాయి. అప్పుడు ఆమె లావణ్యమంతా ఆచిన్ని సుడిగుండాంలో కుదించుకుపోయిందా అనిపిస్తుంది. రెండు జడలు వేస్తుంది. అంపోకగా ఒక జడ ముందుకీ ఒక జడ వెనక్కీ కేటాయిస్తుంది. 'పెద్దదానవయ్యావు-- ఇక రెండుజడలు మానవే మా తల్లీ' అని నసిగింది పార్వతమ్మ. 'ఊ-చెప్పొచ్చావులే,' అని ఒక్క ఉరుమురిమి, ముందున్న జడకూడా వెనక్కివచ్చేలా విదిల్చి కొట్టి శం ఎగేసి, 'హైహీలు బూట్లు' గచ్చువేల మీద టకటకలాడించుకుంటూ వెళ్ళిపోయింది రాధ.

*    *    *

దీనికితోడు కొత్త యిబ్బంది ఒకటి వచ్చి పడింది శీతారామయ్యకి. కొడుకు లిద్దరూ పెద్ద చదువులు చదివి హుందాగల ఉద్యోగాలలో ఉన్నారూ అనగానే, మాపిల్లనిస్తామంటే మాపిల్లనిస్తామని మోతుబరి సమంధాలే కోకొల్లలుగా వస్తున్నాయి. సెలవలలో వళినీ రామూ ఇంటికివచ్చినప్పుడు కొందరూ, అంతవరకూ ఆగలేక అటు భిలాయ్‌కీ, ఇటు హైదరాబాదుకీ, హుటాహుటిని ప్రయనమై కొందరూ, కుర్రవాళ్ళని చూచుకుని వచ్చి పిల్ల కాయల్ని చూచుకోమని మరీమరీ చెప్పి చక్కాబోతున్నారు. వాళ్ళకి కాఫీలూ, టిఫిన్లూ అందించా, హుందాగిరీగా గౌరవమర్యాదలూ జరపా శీతారామయ్య పాలబడినై. దానాదీనా ఊపిరాడడంలేదు. ఇంటో చూడబోతే ఒక కుర్చీలేదు, ఒక టేబిల్ లేదు. నాజూ కయిన సామానేలేదు. ఇన్నాళ్ళూ ఏదో సంసార పక్షంగా చ్రకం దొర్లించేస్తూవచ్చాడు. ఇహ నామర్దా అనిపించింది. స్టైయిన్‌లెస్‌స్టీలు సెట్లు కొన్నాడు. 'సోఫా కుం బెడ్డ్'కటి తీసుకున్నాడు. రెండు 'ప్లాస్టిక్ కేన్ గార్డెన్ ఛెయిర్లూ', మంచాలకి దోమతెరలూ, ఒక 'ట్రిపాడ్', ఒక అందమైన 'టీసెట్టు'—నాగరిక మైన కొత్త వాతావరణం కలిపించాడు. హాలులో 'ఉషాసీలింగ్‌ఫాన్' వేయించాడు. వీటన్నిటికీ డబ్బయింది.

కుర్రవాళ్ళేమో అక్కడా అక్కడా ఉద్యోగాలు చెలాయిస్తున్నారు. వాళ్ళూ వీళ్ళూ శీతారామయ్య మీద వచ్చి పడుతున్నారు. 'దాహ మేమాత్రం?' అని వేగించి చూచుకుంటున్నారు. 'కుంటిమింటి కోలిని తెచ్చుకోమన్నారు. డబ్బు శాశ్వతమటయ్యా, కుటుంబ సాంప్రదాయమూ మంచీ చెబ్బరా చూచుకోవాలి గానీ,' అని ధర్మపన్నాలు ఏకరువు పెడుతున్నారు. హేమూ పెళ్ళి 'సెటిల'య్యే ముందు ఇట్లాంటి చవక వేదాంతాలే వల్లించాడు తనూ. ఇక వాళ్ళకి సంబంధాలు వెతుక్కునే సందర్భంలో ఎట్లాగూ అక్కర కొస్తాయి గదా అని ఆ శ్రీరంగనీతులు మళ్ళీ ఒకసారి నెమరుకి తెచ్చుకుని మననం చేసుకున్నాడు శీతారామయ్య. అప్పుడు తన ఆర్థికస్తోమతూ గట్రా ఏదో గుంభనగా బైటపెట్టి నీళ్ళు నములుతుంటే, 'చాల్ చాల్లే వయ్యా—ఇద్దరు కొడుకులు 'గెజెటెడ్ ఆఫీసర్ల'యి బరాబరులిస్తుంటే పేదరుపులూ నువ్వూను' అని గదమాయించి తన నోరు మూయించారు. ఇక పోతే, వచ్చినవాళ్ళు ఇంకో ఎత్తు ఎత్తారు. 'హేమూకి ఏమాత్రం కట్నమిచ్చావేమిటి?' అని నిగ్గదీస్తున్నారు మధ్యవర్తుల ద్వారా. హేమూ పెళ్ళికిచ్చిన కట్నం పూర్ణానుస్వారం కాబట్టి, ఆ సున్నాకి పైనే ఏదో ఒకటి ముట్టజెప్పి, లఘువుగా పైనలు చేసుకుందా మనీ కొందరు ముగ్గులోకిదింపాలనీ చూశారు శీతారామయ్యని. ఈ యుక్తులన్నీ గ్రాహ్యమవుతోనే వున్నాయి. ఎవరెన్నివిధాల తొందరపెట్టినా, 'కుర్ర వాళ్ళు సంక్రాంతి శలవలకి వస్తారు. అప్పుడు పిల్లకాయిలని చూచుకుని, వాళ్ళు అవునంటే తతిమ్మా వ్యవహారకాండ చూచుకోవచ్చును,' అని నచ్చజెప్పి పంపేస్తున్నాడు. అయితే, వచ్చినవాళ్ళు ఇంట్లో పరిచిన తివాచీలూ, తివాచీలమీద 'పాలిష్' చేసిన 'ట్రిపాడ్', 'ట్రిపాడ్'మీద 'టీ సెట్టూ', టీ నీడలలో మెరుగులుచిమ్మే 'సీలింగ్ ఫానూ', మొదట్లో కళ్ళు జిగేల్మనిపించినా, అది అద్దె కొంపనీ, వెనకాల ఉండుకున్న స్థిర చరాస్తులు పూజ్యమనీ, వాకబు మీద తెలిపోవడంలో, కొంత చప్పరించేసినా, కుర్రవాళ్ళ సుఫుర్రద్రూపమూ, చదివిన గొప్ప చదువులూ, చేస్తున్న పెద్ద ఉద్యోగాలూ, కేవలం ఆస్తులు కాకపోయినా, చెప్పుకోతగ్గ తత్తుల్యమైన ఐశ్వర్యాలుగానే వేసుకుని చక్కాబోతున్నారు.

అనుకున్నట్టుగానే కొడుకులిద్దరూ శలవలకి ఇంటికి రానే వచ్చారు.

రెండు పెళ్ళిళ్ళూ నిశ్చయమైపోయినై

రామచంద్రానికి విజయరాఘవంగారి అమ్మాయి సెటిలయింది. ఆయనకి విశాఖపట్నంలో ఒక 'ఆయిల్ మిల్లూ' ఒక 'రైస్‌మిల్లూ' ఉన్నాయి. అమ్మాయి. 'బి. యె' 'ప్యాస'యింది. చక్కని చుక్క. నళినీ మోహన్‌కి చక్రధరంగారి అమ్మాయిని ఫైసలు చేసుకున్నారు. ఆయన హైదరాబాదులో 'సెక్రటేరియట్'లో సీనియర్ సూపరింటెండెంటుగా ఉంటున్నారు. విజయ రాఘవంగారూ, చక్రధరంగారూ షడ్డకులు. ఇద్దరూ కూడబలుక్కుని చెరో పదిహేనువేలూ ముట్టజెప్ప డానికి సిద్ధంగానే వున్నారు. కాని చట్టరీత్యా కట్నాలు నిషేధం కాబట్టిన్నీ, 'రూల్సు'కి వ్యతిరేకంగా నడ వడం ఇద్దరికీ సుతరామూ ఇష్టంలేకా, పైకం యావత్తూ విజయరాఘవంగారి రైస్ మిల్లులో రూపాయివడ్డీమీద జమకట్టి ఖాతా పుస్తకంమీద పద్దులు యధాలాపంగా చూపించారు శీతారామయ్యకి. పదిహేనువేలు కట్నం, పదిహేనువేలని ఊరూనాడూ మోగిపోయింది.

శీతారామయ్య తల గోక్కున్నాడు. అసలు ఆయన అనుకున్న దొకటీ, జరుగుతున్న తంతు వేరూను. కట్నాల సొమ్ము కొంతయినా చేతిలో పడితే పెళ్ళి ఖర్చు లెత్తిపోతయ్యని ఊహించాడు. కాని పడనియ్యలేదు వాళ్ళు. తను కూడబెట్టుకున్న 'జి. పి. ఫండు' తాలూకు పధ్నాలుగువందలూ, కుర్రవాళ్ళు పంపిన మనియార్డర్లలోనూ, దేవుడు మేలుచేస్తే పొలం అమ్మగానూ మిగిలిన మూడువేలూ వెరశి నాలుగువేల పైచిలుకు అట్టే పెట్టివుంచాడు, వాణి పెళ్ళికి అవసరం కావచ్చని. అక్కడికి ఆ పెళ్ళి వెళ్ళ మారిస్తే, ఇహను రాధమ్మకి సమంధాలు విచారించుకో వచ్చును; అని అంచనాలు వేసుకుని కూచున్నాడు. ఆ నాలుగురాళ్ళూ చేజారిపోయేలా వున్నాయి కుర్ర వాళ్ళ పెళ్ళిఖర్చుల కింద.

పార్వతమ్మ పూర్వోత్తరపు మనిషి. చదవనూ, వ్రాయనూ రాని ముత్తయిదువు. ఏదో లంకా యాగమూ, గోవిందనామాలూ పాడుకొంటోవుంటుంది. ఏ వ్రతాని కెంతమంది బ్రాహ్మల్ని పెట్టుకోవాల్నో, ఏ నోముల కెన్ని వాయనా లివ్వాల్నో, పురుళ్ళకీ పుణ్యాలకీ జరగాలిసినతంతేమిటో తుణ్ణంగా తెలుసును. తరతరాలుగా వస్తున్న సంప్రదాయ విజ్ఞానం ఆమె సొత్తు. తిధి వార నక్షత్రాలకని ఇరుగూపొరుగూ వస్తుంటారు. కాలునొచ్చినా, కడుపునొచ్చినా ఇంత విభూది పెడుతుంది. ఆచారమూ మడీ పూజా పున స్కారమూ—ఇదీ ఆమె లోకం. పాతకాలపు మంగళ హారతులూ, వరసపాటలూ నేర్పబోయింది ఆడపిల్లలకి. వాళ్ళు వెక్కిరించారు.

ఇంటి వ్యవహారాలలో ఎన్నడోకాని జోక్యం కలగజేసుకోదు పార్వతమ్మ. ఈ హంగామా ఆమెకి నచ్చలేదు. 'పెళ్ళికెదిగొచ్చిన ఆడపిల్లలు ఇంటో మసులుతుండగా మొగపిల్లల పెళ్ళిళ్ళకేమి తొందరొచ్చిందీ ?' అని దీర్ఘంతీసిం దొకనాడు, చాటలో బియ్యం పోసుకుని బెడ్డలేరుతూ. శీతారామయ్య చెప్పు లేసుకుని ఎక్కడికో బయలుదేరుతున్నవాడల్లా, 'ఊరు కోవోయ్—అన్నిపాములూ పడగలెత్తినయ్యని బురద పామూ తలెత్తిందట !' అని ఒక్క విదుపు విదిపి చక్కాబోయాడు. దానితో పార్వతమ్మ నోరుమూసుకుంది. సన్నాయి నొక్కులు నొక్కనూ, మాటకి మాట రెట్టించనూ ఆమె ఇంటావంటాలేదు.

దానికితోడు నళిని ఆ పిల్లే కావాలని ఒకటే పట్టు. ఆ సమంధంగాని పరిష్కారం కాకపోతే నా కసలు పెళ్ళే అఖ్ఖర్లేదు అనేదాకా వెళ్ళింది అతగాడి ధోరణి; ఆ మాట కాస్తా 'పబ్లిగ్గా' అనకురా నాయనా, వాళ్ళు ముట్టజెప్పదలుచుకున్నది కాస్తా మురిగిపోగలదు, అని వాణ్ణి వప్పించేసరికి బ్రహ్మ ప్రళయమయింది. దానితో శీతారామయ్య కాళ్ళూ చేతులూ కట్టేసినట్టయిపోయింది. ఇంతకీ కళ్యాణాలు తోసుకొచ్చేస్తున్నాయి అన్నారు పెద్దలు.

తాంబూలాలు పుచ్చుకున్నారు. ప్రధానమయింది. రెండు పెళ్ళిళ్ళూ హైదరాబాదులోనే జరిగినై.

ఇక విజృంభించారు ఆడపెళ్ళివారు. అంతంత డబ్బు వళ్ళోపోసుకున్నావు పెట్టవయ్యాపెట్టు అని నౌబత్ఖానా, వాదమునిబ్యాండు, పిచ్‌హరిసన్నాయి, భరత నాట్యం అన్నీ పెట్టించారు. బాణాసంచా తగలేయించారు. ఊరేగింపు దర్జాగా ఉండాలన్నారు. బంధు వర్గంకన్న, 'ఆఫీసర్లే'నా, స్నేహితబృందమేనా ఒక్కపెట్టున ముట్టడించేశారు పెళ్ళిపందిరి. వాళ్ళ దర్జాలకి హోదాలకీ దద్దరిల్లిపోయాడు శీతారామయ్య.

పెళ్లివారు పెద్దఎత్తున నడిచారు. శీతారామయ్య ఆ ఫాయాకు తగ్గట్టు నడవాలిచొచ్చింది. వాళ్లు రెండు వందలుపెట్టి 'గ్వాలియర్‌ట్వీడ్ సూటు'తెస్తే, తను మూడువందలు విరజిమ్మి ఆగ్రాచీర తియ్యాలిచొచ్చె. అప్పట్లో కొంత వొళ్లూపైతెలీలేదు కూడా. పెళ్లిళ్లలో అంతే. అవతల జట్టు విరబోసు కుంటుంటే, ఇవతల గంగవెర్రు లెత్తుతాయి.

పెళ్లికొడుకులు మనుగుడిచారు! వియ్యాలవారు పెట్టిన ఘనమైనసారెతో కోడళ్లని కొడుకులతో సాగనంపేసరికి ప్రాణం చాలొచ్చింది శీతారామయ్యకి. తృప్తిగా నిట్టూర్చాడు.

రెండు రోజులు విశ్రాంతి తీసుకుని సావకా శంగా పెట్టెలోంచి పర్సుతీసి లెఖ్ఖపెట్టుకుంటే రూ. 260/— ఉన్నాయి. కొన్నాళ్లదాకా మామూలుగా చెరోవందా పంపారు కుమాళ్లిద్దరూ.

వాణికి సమంధాలు చూస్తున్నాడు శీతారామయ్య. ప్రయాణపు ఖర్చులే బోలెడయి పోతున్నాయి. దానా దీనా పైకం వెనులబాటు కాలేదు. ఇప్పుడే కొంత వెనకవెయ్యాలికూడాను. అట్లాగే నెట్టేస్తున్నాడు.

ఆ తరవాత అదేమిటో కూడబలుక్కున్నట్టు, చెరోయాభై పంపించడం ప్రారంభించారు కొమాళ్లిద్దరూ. కోడళ్లా అయినింటి బిడ్డలాయెను—కొత్తకాపరాలు—పడుచులకాపరం చితుకులమంట—ఇళ్ల అద్దెలే బోలెడు పొయ్యాలిగావును - ఆ మహానగరాలలో- ఎవడికెవడు? ఎట్లా కాలక్షేపం చేస్తున్నారో ఏమిటో చిన్న సన్నాసులు, అని ఏక ఇదయిపోయారు, శీతారామయ్యాను, పార్వతమ్మాను.

కొన్ని నెలలయిం తరువాత ఆ యాభై పాతికకి దిగింది.

శీతారామయ్య గుండె ఆగింది.

ఉత్తరాలు అటూ యిటూ నడుస్తోనేవున్నాయి. డబ్బు ప్రస్తావనమటుకు ఎవరూ తేవడం లేదు. ఎబ్బెట్టుగా వుంది.

ఆ తరవాత నళిని వక్కడే ఒక పాతిక పంపించడం సాగించాడు. తనకి తప్పుతుంది గనకనా. శీతారామయ్య రాశాడు—కుటుంబ ఖర్చులికే కిచాటుగా వున్నదని—ముక్తసరిగా. రామచంద్రం దగ్గరనించీ సమాధానం వచ్చింది. తన 'యం. బి' చదువుకని తెచ్చిన 'లోను' నెలవారీగా తీరుస్తున్నాడట. అంచేతనేవీగా పంపలేకపోతున్నాడట. ఆ మాత్రం వంక దొరక లేదు పాపం నళినికి. అంచేత గప్‌చిప్పుగా మాట్లాడ కూరుకున్నాడు.

అసలు వీళ్ల జీతాలెంత? ఎంత ఖర్చవుతోంది? ఎంత మిగల్చడానికి సాధ్యమవుతుంది? అని తవిశీలుగా ముఖాముఖీగాని, ఉత్తరాలమీదగాని అరా లడిగే సాహసం ఏనాడో చచ్చిపోయింది శీతారామయ్యలో. పెళ్లిళ్లకి ముందు రెండురోజులు కద్దనంగానే వాళ్లిద్దరూ ఇంటికొచ్చినా, 'బనియన్ల'తో చారల 'పైజమాలతో' నిక్కి నీలిగి తొమ్మిదింటికి లేచే వాళ్లు. లేచి కాలకృత్యాలు తీర్చుకోగానే ఠివ్వున ఎక్కడికో ఎగిరి చక్కాబోయేవాళ్లు. పెద్దపెద్ద ఆఫీసర్లు స్నేహితులాయెను! ఇంటికివస్తూనే 'ట్వీడ్‌సూట్లూ' 'గోల్డ్ రిమ్డ్ గాగులూ' వేసుకున్న పదిమంది ఆఫీసర్ల సజ్జు అమాంతం బిళ్లపెట్టుగావచ్చి పడేవాళ్లు. కాస్త వివరా లడుగుదామంటే వీలుచిక్కకనేపాయె, వేశ్రప్నలకి ఒకటీ అరా సమాధానం రాబట్టడం గగనమయిపోయింది. తను కొంచెం లోతుగా గుచ్చిగుచ్చి అడిగేందుకు సంకోచమయ్యేది. వాళ్లేదో కొండశిఖరంమీద వున్నట్టూ, తను నేలబారుగా పోతున్నట్టూ 'ఫీ' లవుతున్నాడప్పుడే.

తరవాత తరవాత ఉత్తరాలకి ఆలస్యంగా జవాబులు రావడమూ, వొచ్చినా, అందులో తనక్కావాలిసిన ముఖ్యాంశమాత్రం లోపించడమూ జరుగుతోంది. అసలు తన వుత్తరాలు అందుతున్నయ్యో లేదో నన్న మీమాంస అంకురించేలా, ఆకుకి అందకుండా, పోకకి పొందకుండా ఉంటున్నాయి జవాబులు.

వాణికి సమంధంకోసమని గోపాలపురం వెళ్లి రావాలి. అక్కడ 'రివిన్యూ ఇన్‌స్పెక్టర్'గారి అబ్బాయి ఎవరో ఉన్నారని 'హెడ్మాస్టరు'గారి తమ్ముడు వర్తమానం తీసుకొచ్చాడు మొన్న. అదుగో ఇదుగో అని వాయిదాలు వేసుకుంటూ కూచున్నాడు తను.

'ఒక పది రూపాయి లిట్లా ఇవ్వవే' అని అరిచాడు శీతారామయ్య. కండవా భుజమ్మీద వేసు

కుని చాకింటిమడత విప్పడంలో రాలిన ఇసక దులుపుకున్నాడు. లోపలనించి సమాధానం రాలేదు. 'ఎవ్వరూ ఫికరులేరేమే? బండి దాటిపోతుంది మళ్లీ' అని కసురుకున్నాడు ఆకుచెప్పులేసుకొంటూ. 'కర్టెన్' సన్నగా తొలిగించి, 'డబ్బులేదుట నాన్నా...' అన్నది రాధారాణి బిక్కు బిక్కుమంటో. అని 'కర్టెన్' వేసేసింది. నిర్ఘాంతపోయి ఆపాటన నిల్చుండిపోయాడు శీతారామయ్య. ఆ క్షణం గుండెలో పోటొచ్చినట్టు చురుక్కుమంది లోపల. తన 'పెన్షన్' డెబ్భయ్ మూడు రూపాయలన్నీ, అటు భిలాయ్‌లోనూ ఇటు హైదరాబాదులోనూ ఉద్యోగాలు వెలిగిస్తున్న ఇద్దరు ఆసాముల తాలూకూ దయారసం తనమీదకి అంతో ఇంతో ప్రసరిస్తే సరేసరి, లేకపోతే, తన జీవితపు పరిధి ఆ డెబ్భయిమూడు రాళ్ళా దాటిపోరాదనీ అందాకా తెలిసి రాలేదు మరి!

సాలోచనగా బెంచీమీద కూలబడి, చొక్కా విప్పుకుని 'సరేలే—'ఫస్టు' తారీఖున 'పెన్ష'నందిన తరవాతనే వెడతాను—మించిపోయిందేముందీ? నేనక్కడికి చేరేసరికి అష్టమి వస్తుంది కూడాను' అని పైకి అన్నాడేగాని గుండెలో ఏదో వేన్నీళ్ళజల ఊరుతున్నట్టయింది శీతారామయ్యకి. నాన్న ఎంత ఉద్వేగం అణుచుకున్నాడో రాధ తలుపుసందులోనించి గమనిస్తూనే వుంది.

ఉద్యోగం అహోరించినప్పట్నించీ వొచ్చిందంతా ఒక బొట్టు పెట్టెలోపోసి, ఖర్చులూ గట్రా పార్వతమ్మమీద వొదిలేశి ఊరుకోవడం అలవాటయిపోయింది తనకి. ఇహను ఆ అలవాట్ను మార్చుకోవాలి. బ్రతుకూ, బ్రతుకుమూల్యమూ ఎంతవరకూ కుదించుకోవాలో అడుగడుగునా లెఖ్ఖలువేసుకొంటో పోవాలి గావును. చాపక్రింద నీళ్ళల్లే, తనకి తెలీకుండానే దరిద్రం ఇంట్లోకి జొరబడుతోంది!

నిజానికి ఇంటో వాళ్ళే తనని మభ్యపెట్టారు చాలావరకు. తన చుట్టలూ, సోడాలూ, రాత్రి చపాతీలూ నాగాలులేకుండా యధావిధిగానే వచ్చేస్తున్నాయి. ఏ కొరతా తనదాకా రానీలేదు వాళ్ళు. ఆదమరిచి ఏదో కొంత నిర్లక్ష్యంగానే, రిక్షాలకని తను డబ్బు వెచ్చిస్తున్నాడు. నెమరుకి తెచ్చుకుంటున్నాడు శీతారామయ్య.

మర్నాడు చుట్టచుట్టుకొంటూ అరుగుమీద బాసీపెట్టు వేసుకుని కూచున్నాడు శీతారామయ్య. ఇంటిముందు కసవూడ్చి కళ్ళాపి జల్లుతోంది వాణి. 'పనిమనిషి రాలేదా అమ్మా?' అని అడిగాడు శీతారామయ్య. 'దాన్ని రావద్దన్నాం నాన్నా' అన్నది వాణి, చెరిగిన జుత్తు ఎగసన దోసుకుంటూ. 'ఏమీ?' అన్న ప్రశ్న నాలికదాకావచ్చి 'అనవసరం' అని అర్థం చేసుకున్నాడు శీతారామయ్య. పెద్దమ్మవారు తక్కుతో తారుతో ఇంట్లోకి తమాషాగా అడుగుపెడుతోంది!

అసలు ఇట్లాంటి పరిస్థితి రాబోతుందని ఉద్యోగముండగానే పసిగట్టాడు శీతారామయ్య. అట్లాంటి రోజు రాకుండా ఎన్నో కాపుదలలు పెట్టుకొంటో వచ్చాడు పాపం. ఎన్నోయాతనలు సహించాడు. ఎంతో కంజాయింపుగా, ఒక 'ప్లాను' ప్రకారం జీవితానికి గట్లు వేసుకొంటూ వస్తున్నానని అనుకున్నాడు. ఆ కష్టాలూ, నిష్ఠురాలూ, మాటిమాటికీ లెఖ్ఖవేసుకోడాలూ, ఆ గణింపులూ గుణింపులూ, మీదబడ్డ ఖర్చుల్ని ముందు వొదిలించేసుకుని అత్యవసరం కాని ఖర్చులు వెనక్కి నెట్టా చెయ్యా—ఆ బాధలన్నీ బాధాకరంగా అవుపించనే లేదానాడు. ఎప్పుడో సుఖపడతామని శ్రమించడంలోనే వున్నదేమో సుఖం! ఇప్పుడు శ్రమించడం చాలించి, సుఖాన్ని కేటాయింపుగా నొల్లుకోవాలని హైరానపడుతున్నాడు గావును. గీతాభవనంలో అప్పుడప్పుడు స్వాములవారి ముఖతా విన్నా, 'ఏదో ఊకదంపుడు వేదాంతం!' అని తను 'సుపీరియర్‌గా' చప్పరిస్తో వచ్చిన సత్యాలు కొన్ని కళ్ళముందు భరతనాట్యం చేస్తో వచ్చాయీమధ్య. కొడుకులింత అన్యాయం చేస్తారా తనని! – కలకరిగిపోతోంది.

ఇహనేమి చెయ్యాలీ తను? 'ఎవళ్ల చాతనయినా వ్రాయించనా కుర్రకుంకలికి?' అనుకున్నాడొకసారి. 'కొడుకులేమీ పంపడంలేదు' అని తన గోడు వెళ్ళబోసుకుని, రాయబారాలు నడిపి వాళ్ళని ప్రసన్నులుగా చేసుకోవాలా తను? వుగాకుపాయలు తీసుకొంటో, కాడ లవతలికి విసిరేస్తో హాలులో తచ్చాడుతున్నాడు శీతారామయ్య. 'ఏమండీ'అని పిలుపు వినిపించింది వెనకాతల. 'ఇట్లా రండి' అని మూల గదిలోకి దారితీసింది పార్వతమ్మ. అడుగులో అడుగు లేస్తూ నడిచివెళ్ళాడు శీతారామయ్య. రాధారాణి,

'ఏమిటా' అని కూడా రాబోయింది. 'పోయి పాలు పొంగొచ్చినయ్యేమో చూడు తల్లీ' అని పంపించేసింది పార్వతమ్మ. వేలుముడిలో మందారపువ్వు తురుము కొంటో, 'చూడండి — ఇంత యిల్లు మన కెందుకూ? క్రితానికి మళ్లే ఒక చిన్నభాగం అద్దెకు తీసుకుంటే సరిపోయె. ఇదివరకు గడవలే? ఇప్పుడు గడవక పోతుందా?'...అర్థమయింది శీతారామయ్యకి. తను సరేసరి, ఇన్నాళ్లూ కొడుకుల దగ్గరనించీ అంతకు కొంత రాబట్టే సూత్రమేమిటా? అని మల్లగుల్లాలు పడిపోతున్నాడు. ఇంకా తన దృష్టి మబ్బులవెనక విమానయానం చేస్తోనేవుంది. పార్వతమ్మకి చదువూ చట్టుబండలూ లేవుగాని, ఒక్కొక్కసారి దాని బుర్ర మహచురుగ్గా పనిచేస్తుంది, అనుకుని దవడలు కొన గోట సన్నగా గీరుకున్నాడు శీతారామయ్య.

'అవును—అంతకన్న చిన్నభాగమే తీసుకోవా లీదఫా' అని నిట్టూర్చాడు.

'వెళ్లి చూడండి మరి — అవతల వీధిని రాజన్న గారింటో ఒక చిన్నభాగం ఖాళీఅయింది. మొన్న పేరంటానికి వెళ్లినప్పుడు చూశాను. చిన్నగదులైనా ఒబ్బిడిగా వున్నాయి. నూతినీళ్లు కొబ్బరినీళ్లల్లే చవ్వలుగా వున్నాయి. పప్పు ఉడుకుతుంది. ఫరవా లేదు' అని చక్కాబోయింది పార్వతమ్మ. అంటే అప్పుడే ఇల్లు మార్చాలన్న నిర్ణయమూ, కొత్త యిల్లు పరామర్శించడమూ జరిగిపోయినయ్యన్న మాట. 'సరే' అన్నాడు.

ఇల్లు మారారు. గది వెనకాల గది వొకటీ, దాని నంటిపెట్టుకుని పెంకుటి వసారాలో చిన్న వంటఇల్లూ ఏదో వుంది. అవతలవాటాలో ఇంటివారు ఉంటున్నారు. గాలి ఆడదు. నసిగింది వాణి. కిటికీలు తక్కువ. పెదిమ విరిచింది రాధ. వంటయింటో అరమరలు లేవు. పార్వతమ్మ వంటసామగ్రి చకచకా సర్దేస్తోంది. ఈ 'ఫర్నిచ' వొకటి వచ్చిపడిందిగదా అని విసుక్కున్నాడు శీతారామయ్య. దాని పుణ్యమా అని వంటింటికి ఒక చిన్నఅటక వుంది పుల్లాపిడకా పేర్చుకుందుకు. అక్కడికీ, 'పొరుగింటో 'ఇన్‌కం టాక్సు ఆఫీసరు'గారి భార్య నాగమణి మన తివాచీ చూసి ఎంత మురిసిపోయిందనుకున్నారూ, 'కావాల్నంటే' తీసుకోండి కొన్నధరకి కొంచెం తగ్గించే ఇస్తాము' అనిచెప్పా' అని అందించింది పార్వతమ్మ. అర్ధాంగీకారంగా మౌనం వహించాడు శీతారామయ్య. అది పూర్ణాంగీకారంగా ఎంచుకొని తివాచీ అమ్మేశారు. ఇంకా నయం, విరుచుకుని వివాదపడతాడేమో ఈయన అనుకున్నది పార్వతమ్మ. దాని తరవాత ఒకదాని తర వాత వొకటి 'టీసెట్లూ,' 'రౌండు' అద్దాలూ, 'టేబిలు'ముందు 'రాకింగ్ ఛెయిరూ', 'ఎక్కోరేడియో సెట్టూ' అన్నీ విడుదలకానూ, ఇల్లు విశాలమైనట్టు సదుపాయంగా అమరనూ జరిగింది. 'లేకపోతే ఇల్లు చూడబోతే కోళ్లగూడూ — ఇంటో 'ఫర్నిచ' రేమో తలకి మించిపోయెను — హమ్మయ్య' అని ఊపిరి తీసుకుంది పార్వతమ్మ.

సంసారం పుష్పక విమానంలాంటిది. ఎక్కడికక్కడే కుంచించుకుంటుంది, విస్తరిస్తుంది పరిస్థితుల వొత్తిడినిబట్టి......

కాఫీలు కట్టిపెట్టారు. చిరుతిళ్లు తగ్గించారు. సినీమాలకి తిలోదకాలిచ్చారు. చెట్టుకింద బ్రతికేవాళ్లు లేరూ అనుకున్నాడు శీతారామయ్య. ఖర్చులు బొటాబొటీగా సరిపోతున్నాయి.

* * *

ఉద్యోగ మున్నన్నాళ్లూ సంసారచక్రం హుందాగానే తిప్పాడు శీతారామయ్య. అప్పుడు జీతపురాళ్లు కళ్ల జూచేవాడు. భూమివివాదవచ్చే అయివేజు ఇంటికి కావలసిన గింజలమేరకేలయినా, అంతకు కొంత ఆదుకొనేవి. తను ఉద్యోగం చలాయిస్తున్నప్పటికన్న, ఉద్యోగం విరమించిన తరవాతనే రాజదర్బారుగా వెళ్లమార్చుకోగలనుఅని, ఒకప్పుడు కొడుకు లిద్దర్నీ చూచుకుని గర్వంగా తిరిగిన రోజు లున్నాయి. కుర్చీలో కూచుని కాళ్లు ఊపుకొంటో పుగాకుపాయలు తీసుకొంటోవుంటే, 'నీకేమయ్యా—నీ పిల్లలు సింహప్పిల్లలు' అని ఎదటింటి కంట్రాక్టరు విశ్వేశ్వరయ్య తనని అగ్గిస్తుంటే ముసిముసిగా నవ్వుకున్నాడు శీతారామయ్య.

* * *

వాణి 'పి. యు. సి.' ప్యాసయింది. ఎవర్నీ అడక్కుండానే చదువు చాలించి ఇంటో అమ్మకి సాయంగా వుంటోంది. రాధారాణి 'పి. యు. సి.' లోకి

వచ్చింది. పెరట్లో మెట్లమీద కూచుని, మోకాళ్ల మధ్య అరచేతుల్లో చంద్రబింబంలాంటి తల పెట్టుకుని, 'ఇక నన్ను చదివించరలే?' అని ఆడిగింది పార్వతమ్మని. స్నానానికి నీళ్ళు తోరుపుతున్న పార్వతమ్మ ఉలిక్కిపడి, 'హయ్యోరాత— నిన్ను చదివించాలనే అనుకున్నారమ్మా నాన్న—నోచిననోము లిట్లా తగలడినై' అని కంట తడిబెట్టింది. ఆ దెబ్బతో రాధ మరి తీసుకురాలే ద్రావసక్తి.

మొదట్లో రాధారాణి భిలాయ్‌లో అన్నయ్యతో వుంటూ అక్కడ 'బి. యస్.కి' చదువుదామనుకుంది. అది నిర్ణయమై పోయినట్టే అనేసుకుందికూడా. తన 'క్లాస్‌మేట్స్'తో గప్పాలు కొట్టనూ కొట్టింది. పెళ్లిలో పెదవదిన చెవిలో చల్లగా వూదనూ వూదింది. పానుపుమీద అన్నయ్యమీద పితూరీలుచెప్పి, సంప్రదాయ విరుద్ధంగా వదినపక్షం వహించి, ఆవిణ్ణి కొంచెం మంచి చేసుకుని పునాది కట్టుదిట్టం చేసుకుంది కూడా. 'భిలాయ్‌లో వొదినా—నువ్వూ నేనూ వొకటి. అన్నాయికి సిగరెట్లు తగ్గించే పని నా వంతూ, స్నేహాలు తగ్గించే పని నీ వంతూ—సరేనా?' అని వదినగారి బుగ్గగిల్లి, గడ్డం మునివేళ్లతో పైకెత్తి కళ్లల్లోకి చూస్తో తను కవ్విస్తే, 'సిగరెట్లా? పాడువాసన! ఆ అలవాటు నేను వొదిలిస్తాగాని, స్నేహితాలు తగ్గించడమెందుకోయ్ – అందులో నీకు కాబోయే వరుడున్నా ఉండవచ్చును' అని ఎదురు ఛలోక్తి విసిరింది కూడా ఆవిడ.

పెద్దన్నయ్య పెళ్లికనీ, చిన్నన్నయ్య పెళ్లికనీ భారీగా ఒక్కబిగిని పురమాయించి తీసుకున్న 'ఫేరగాన్ ప్రింట్' వోణీలూ, నైలాన్ పరికిణీలూ, క్రేప్ సిల్కుచీరలూ, సాటిన్ జంపర్లూ, మొఖమల్ స్లిప్పర్లూ అన్నీ చిరుగుపట్టినై. వాటిస్థానే, చీటీగుడ్డలంగాలూ అంబికా పాప్లిన్ వోణీలూ వచ్చినై. తలగడలకీ, పరుపులకీ, పందలపాకమిల్లుగుడ్డ అవతరించినై ఒకదాని తరవాత వొకటి. శీతారామయ్య మామూలుగా ఇరవై నంబరునేత పంచెలలోకి దిగినా, కొమార్తెలని చూచుకుందుకని వారూ వీరూ వచ్చి పోతున్నారాయెను, అప్పుడు పైకి తియ్యవచ్చును అని ఆనాడు కొన్న గ్లాస్కో పంచె వకటీ, మెర్సిరైజ్డ్ పాట్నా మెయిల్ మల్లు పంచె వకటీ ట్రంకుపెట్టె అడుగున భద్రంగా అట్టేపెట్టుకున్నాడు.

ఆ మధ్య పండగలకనీ పబ్బాలకనీ ఆ మామయ్య అక్కడినించీ ఈ మామయ్య ఇక్కడినించీ సరాసరి ఆహ్వానాలుపంపా, అల్లుళ్లిద్దరూ భార్యాసమేతూ అత్తవారిళ్లకి తర్లివెళ్లా, వాళ్లు తిరిగి వెళ్లిపోయిం తరవాత సెలవచాలక మధ్యేమార్గంతో దిగడం పడలేదని చల్లగా తనకో ఉత్తరం ముక్కపడెయ్యా, శీతారామయ్య గమనిస్తోనే వున్నాడు. ఒకసారి విజయరాఘవంగారు ధాన్యం బేరమ్మీద ఏలూరు వచ్చేసినప్పుడు దీపావళి బహుమతికింద అల్లుడు వెయ్యిన్నూట పదహార్లు డిమాండు చేస్తున్నాడని ఫిర్యాదుచేసి, 'ఒక ఉత్తరం వ్రాయండి దయచేసి' అని తన సిఫార్సుకోసం అంగలారుస్తున్నట్టు మొహం పెట్టాడు. భోజనానంతరం తమలపాకులు నములుతో వాళ్లిద్దరూ ఎన్నిపండగలకి ఎంతెంత గుంజుకొనిపొయ్యారో అనుకోకుండానే బైటపెట్టేశాడాయన. దానితో మామా అల్లుళ్లు ఎంత దోస్తీగా ఉంటున్నదీ పూర్తిగా అవగాహనయింది శీతారామయ్యకి. ఎటొచ్చీ తనూ, తన భార్యారత్నమూ, పెళ్లికెదిగున్న ఆడకూతుళ్లూ కేటాయింపయినారన్నమాట. వియ్యంకుడయినా ఇంటికి వచ్చినప్పుడు విలువగల 'ఫర్నిచ'రుండాల్నే ఏమయిందీ అని అడగకుండావుంటాడా అని ఎదురుచూశాడు శీతారామయ్య. కానీ, అదేమీ పట్టినట్టులేదాయనకి; ఏదో దూరపుచుట్టంలానూ, పనిమీదవచ్చి పనిలో పనిగా పలకరించిపోతున్నట్టూ, ఆయనకీ తనకీ ఉండుకున్న బంధుత్వం ఏదో నిమిత్తమాత్ర మయిందన్నట్టూ ఉన్న దాయన ధోరణి.

కొడుకులదగ్గరికి వెళ్లిరానా ఒకసారి? అనుకున్నాడు శీతారామయ్య. కాని ఎక్కడ భిలాయి? రైలుఛార్జీలే బోలెడయిపోత్తై. ఏమిదారి? ఆలోచనలో పడ్డాడు.

*　　*

అంతలో ఒక చిన్న అవకాశం చిక్కింది. విజయరాఘవంగారి ఏకైకపుత్రుడు పురుషోత్తానికి ఏలూరులో సమంధం నిశ్చయమయింది. రెండూ జమిందారీ కుటుంబాలే. శీతారామయ్యకి ఆహ్వానం వచ్చింది. శుభలేఖలు నేరుగా అటు భిలాయ్‌కీ ఇటు

హైదరాబాదుకీ రవానా అయ్యేవుంటాయి. కుర్రవాళ్లిద్దరూ, కోడళ్లని వెంటబెట్టుకుని రానేవస్తారు అనుకున్నాడు శీతారామయ్య. వచ్చి తిన్నగా విడిదిలోనే అత్తవారి బలగంతో కొంతసేపు ఐక్యమై, పెళ్లిఅయింతరవాతగాని తన యింటికి రాకపోవచ్చని రూఢి చేసుకున్నాడు. అనుకున్నట్టు అక్కడే దిగారు. కాని విడిదిలో పెళ్లి వారి రద్దీమూలాన, స్నానపానాదులు సదుపాయంగా అమరవనిపించి, ఇద్దరూ తక్షణం ఇక్కడికే వచ్చేశారు. రిక్షా దిగీదిగగానే తిన్నగా వంటింటోకి వెళ్లిపోయి, బాణలిలో మూనె వేస్తున్న అమ్మమ్మపక్కకి పీట జరుపుకుని 'అమ్మా, వచ్చేశా' అని చతికిలబడ్డాడు నళిని. పార్వతమ్మ ఉలిక్కిపడి, 'అయ్యో నాయనా ఎప్పుడు వచ్చావురా?' అని వంటావార్పు అలానే వొదిలేశి, కొడుకుని అమాంతం వాటేసుకుని, తల నిమురుతో, 'ఎంత నల్లబడిపోయావురా తండ్రీ—అక్కడ తిండిపడలేదా? ఆ ఉక్కుఫ్యాక్టరీలో నిప్పు కొలిమిలపక్క నేమిట్రా ఉద్యోగమూ?' అని ప్రశ్న తరవాత ప్రశ్న పుంఖానుపుంఖంగా విసురుతోనే వుంది. 'ఒక్కొక్కటే అడగవమ్మా చెబుతాను—అన్నీ ఒక్కసారే అడిగితే ఎట్లా?' అని ప్రీతిగా నవ్వుతో నిలబడ్డాడు నళిని. ఆమె కాలర్ సరిచేస్తోంది. చొక్కా గుండీలు తెగతిప్పేస్తోంది. పూలుకోటుమీద చెదురుగా రాలిన రైలుబొగ్గు కొనగోట దులుపుతోంది.

రామూ వచ్చాడు భార్యా సమేతూ.

శీతారామయ్యకి లోపల చిమచిమలాడుతోంది. పరకాయించి చూచాడు. పిల్లలిద్దరూ కండపట్టి, నేవళంతేరి, లంకగుమ్మడికాయలల్లే వున్నారు. నళిని 'సాటింజన్ సూటు' మీద వున్నాడు. రామం 'త్రీకాసిల్స్ ఫుల్ ట్వీడ్ సూటు' మీద వున్నాడు. ఒకడు చిక్కిపొయ్యాడంటుంది. ఒకడు నల్లబడ్డాడంటుంది ఈవిడ! ఎంత నిగ్రహించుకొందామనుకొన్నా నవ్వు ఆపుకోలేక పోతున్నాడు శీతారామయ్య. తనకేమీ పంపకపోతేమానె, పిల్లలిద్దరూ, చక్కా, ఆరోగ్యంగా, ఉల్లాసంగా, 'గెజెటెడాఫీసర్' హోదాలో వెలిగిపోతున్నారు అనిపించి శీతారామయ్యకి ఒక క్షణం తన్మయత్వం కలిగిందికూడా. పెరట్లో తులసికోటలో నీళ్లు పోస్తున్న వాణి వెండిగ్లాసు తులసికోటలోనే వొదిలేసి ఒక్క ఉదుటన పరిగెత్తుకొచ్చింది. కుంపటి పొయ్యిదగ్గిర చతికిలపడిన రాధారాణి, ఊదుతున్న వెదురుగొట్టం నేలమీద పెట్టే బదులు కుంపట్లోనే వొదిలేశి బిలబిలలాడుతూ వొచ్చేశింది. అన్నయ్యలిద్దరూ కుర్చీల మీద కూచున్నారు. వదినలిద్దరూ ఎదురుగా చిరిచాపమీద కూచున్నారు. అన్నయ్యలిద్దరి మధ్యా చోటుజేసుకుంది వాణి. వదినలిద్దరి మధ్యా ఇరుక్కుని కూచుంది రాధారాణి. నళినిమోహన్ 'ఫస్ట్ క్లాసు కంపార్టుమెంటు'లో తాముపడ్డ ఇబ్బందుల్ని పెద్దగలభాగా అదోకథలా, చెప్పుకుపోతున్నాడు. పెద్దవదిన విజయ ఇంగ్లీషులోనేగాని తెలుగులో మాట్లాడదు. మధ్య మధ్య, 'పొండి—మీతో ప్రయాణం చెప్పొచ్చారూ ఎక్కడపడితే అక్కడ హాల్లో అని ఎవరో ఒక యంత్రబ్రహ్మ తారసిల్లా, వాడితో కకపికలూ పకపకలూనూ. 'ప్లాట్‌ఫారంమీద!' బండి కదులుతోంది మహాత్మా అని జ్ఞాపకం చెయ్యాలయ్యే అదుగడుక్కీ—అబ్బ పగవాడికైనా వద్దు' అని జడలో డిసెంబర్లూ, బుగ్గలమీద గులాబులూ ఏకమయ్యేలా ఒక్కవరసని ఎగతాళి పట్టేస్తోంది. డా॥ రామచంద్రం సరేసరి, బయల్దేరేటప్పుడు తన పెట్టే బేడాతోపాటు తనపెళ్లాన్నికూడా ఒక శాల్తీ కింద లెఖ్ఖపెట్టుకుని, ప్రయాణంలో మధ్యస్తంగా ఆరాతీసుకునేటప్పుడు మాత్రం ఆవిడగారిని లెఖ్ఖలో వొదిలేసుకుని గాబరాపడిపోయిన ఘట్టాన్ని, తన తెలివి తక్కువ కప్పడేలా, ఆదేఒక ప్రజ్ఞకిందా, పెళ్లానికి పెద్దనవ్వొచ్చేలా, హాస్యంగా, మార్చి, మలిచి, విడ్డూరంగా చెప్పుకుపోతున్నాడు. అన్నయ్యలెట్లా మాట్లాడుతున్నారో, వదినలు అన్నయ్యలనెట్లా తురస్కరిస్తున్నారో, వాళ్లచేతులు, పెదిమలు కళ్లు......ప్రతిచలనమూ, ప్రతిభంగిమా, అస్తారుబతంగా, అమాయికంగా పరిశీలనగా చూస్తో కూచుండిపోయారు అక్కచెల్లెళ్లు. అన్నయ్యలిద్దరూ తమ ప్రపంచంలోకి రావడానికి కొంత టైము తీసుకుంటారని అర్థమయిపోయింది ఇద్దరికీ. మధ్య మధ్య 'లెదర్‌బాగ్' తెరిచి పెద్దవదిన ఏవో తీసి నరుకులు నములుతోంది. 'పీన్‌పాపిడి' డైమన్ అచ్చొకటి విరిచింది. పక్కనవుంటే దేవిరిగొట్టు మోహాలనుకుంటుందేమోనని లోపలికి తప్పుకున్నారు వాణీ

రాధారాణీ. తరవాత మెల్లిగా వచ్చిచేరారు. వాళ్ళు కాస్త అటూ ఇటూ యధాలాపంగా చూస్తే చాలు, ఏమి కావాల్సో అని వాణికి వాణీ రాణికి రాణీ రివ్వునలేచి తయారైపోతున్నారు. అన్నయ్య చేతి 'రిస్టువాచీ' చూపోంది వాణీ. మణి కట్టు పైకెత్తి పట్టుకుని ఇందులో 'క్యాలెండరు' కూడా ఉందేవ్ అని ఒక్కఅరుపు అరిచింది. వొదిన రాళ్ల నెక్‌లెస్ పతకంలో పొదిగివున్నది కెంపా, పగడమా అని ఆలోచిస్తోంది రాధ.

పిల్లలొచ్చారని అరటిపువ్వు పాటోళీ చేస్తోంది పార్వతమ్మ. నేతి తాలింపు ఘుమఘుమలు రెపరెపలాడుతున్నాయి. ఫలహారాలు నేను తెస్తానంటే నేను తెస్తానని వంతులుబోయారు వాణీ, రాధారాణీ. కొంతసేపటికి 'సరే నువ్వే తీసుకురావే అంటే నువ్వే తీసుకురా' అని ఇద్దరూ బిడాయించుక్కూచున్నారు. చివరికి ఇద్దరికీ తప్పలేదు. పెదవదినకి పెద్దన్నయ్యకీ పెద చెల్లెలువాణీ, చిన్నవదినకీ చిన్నన్నయ్యకీ చిన్న చెల్లెలు రాధా ఖాయం చేసుకున్నారు.

ఫలహారాలయినై. కాఫీలు సేవించారు. మూతి పళ్లెందగ్గర 'ప్లేట్లు' కడుగుతో 'పెదవదిన మూతి మీద చిన్నమీసముందేవ్' అని కిసుక్కున నవ్వింది రాధారాణీ. 'ఓసి నీ దుంపతెగా—వింటారే' అని ఒక మొట్టికాయ మొట్టింది వాణి. పెద్దన్నయ్య మాట్లాడేటప్పుడు తల వోరగా పెడతాడనీ, చిన్నన్నయ్య తల ఎగరేస్తాడనీ, పెదవదిన చకచకా మాట్లాడుతుందనీ, చినవదిన మాటలు మింగేస్తుందనీ అనుకున్నారు. ఆంతవరకూ 'ఎగ్రిమెంటు' కుదిరింది ఇద్దరికీ. పెద్దన్నాయి కొంచెం వొళ్ళుచేశాడని వాణీ, కాదు చిన్నన్నాయే లావెక్కాడని రాణీ—ఇద్దరికీ వాదోపవాదాలు చెలరేగినయి. చివరికి 'నీది మట్టిబుర్ర' అంటే 'నీది చవిటిపర్ర' అని తెగనాడుకుని, 'అమ్మ నడుగుదాంపద' అని పందేలు వేసుకున్నారు. దొడ్లో ఏదో గలాటా జరుగుతోందనుకుని, పార్వతమ్మ పని వొదిలి వొచ్చేసింది.

అరుగుమీద కూచుని సూరపరాజుగారి దగ్గర ఎరువు తీసుకున్న దినపత్రిక చదవకుండానే మడిచి పట్టుకుని, 'వీళ్లంతా ఎట్లా ఇంత ఉల్లాసంగా ఉండగలుగుతున్నారా?' అని ఆశ్చర్యపోతున్నాడు శీతారామయ్య. కటికిచీకట్లో గూడా కొంతసేపటికి చుట్టూ వున్న వస్తువులు ఒకదానితరవాత ఒకటి, నెమ్మ నెమ్మదిగా లీలగా అవుపించడం ప్రారంభిస్తాయని శీతారామయ్య కింకా అనుభవంలోకి రాలేదు. జీవితం ఎట్లా ఎదురయితే అట్లా స్వీకరించగల సహనం ఆడదానికున్నట్టు మొగాడికి సాధ్యం కాదేమోనని మొట్టమొదటిసారి తెలుసుకున్నాడు కూడా. అంతే. కంచం ఖాళీ అయింతరవాత కంచంకింద మెతుకుల మీదకి దృష్టి పోతుందిగావును! గాఢంగా ఊపిరి తీసుకున్నాడు శీతారామయ్య. మాటల సందర్భంలో వాళ్లిద్దరూ భార్యా సమేతంగానూ, బావమరుదుల్నీ మామగార్లనీ వెనకేసుకునీ, ఒకసారి ఢిల్లీ, ఒకసారి కలకత్తా, ఏ స్నేహితుడిపెళ్లి అనో, ఏ అఖిల భారత ప్రదర్శనమనో, అడపాతడపా, ఏ మొక్కుబళ్ల వంకనో, ఇటుకంచీ, కాళహస్తీ, మహాబలిపురం, మద్రాసూ చక్కర్లుకొట్టి వస్తోపోతో ఉండడమూ గట్రా అక్కడి వింతలూ విశేషాలూ వాళ్లు చెప్పుకోవడంలో గ్రాహ్యమవుతోనే వుంది. ఇన్నిటికి దస్తు అమరగా లేంది. తనకి పంపాలిసిన యాభైకీ పాతికకీ మినహాయింపు లొచ్చినయ్యా? రాస్కెల్స్! పైపెదిమ కిందపంటితో నొక్కిపెట్టి తలపంకించి ఊరుకున్నాడు శీతారామయ్య.

తరువాత తనూ కొడుకులిద్దరూ ఎంతోసేపు ఇష్టంగానే మాట్లాడుకున్నారు. నళిని తను పని చేస్తున్న ఉక్కు ఫ్యాక్టరీలో ఉద్యోగ నిర్వహణకి సంబంధించిన వివరాలూ, తన అజమాయిషీలూ, తను కనిపెట్టిన కొత్త ఇంజనీరింగు పద్ధతులూ, 'రష్యన్ ఇంజనీర్ల' కలుపుగోలుతనమూ, తనకి తెలియని 'టెక్నికల్' పదాలు దొర్లిస్తో ఏకవర్ణించాడు. డాక్టర్ రామం తన ఆస్పత్రిలో 'డ్యూటీలూ', నర్సుల వేషభాషలూ, 'ఆపరేషన్లూ', మొన్న నీమధ్య పెద్దడాక్టరు మీదొచ్చిన అభాండాలూ, 'మెటర్నిటీ వార్డు'లో పసిబిడ్డలు మారుగుళ్లయిన కేసు వివరాలూ ఆషామాషీగా చెప్పుకుపోతున్నాడు. సావధానంగా వింటో పోతున్నాడు శీతారామయ్య. ఎంతకీ వాళ్ల జీతాలెంతో, ఖర్చులేమాత్ర మవుతున్నాయో, ఖండితంగా తేల్చుకోలేక పోయాడు. ఒకడు అదేదో

స్పెషల్ పే' అంటాడు. ఒకడు 'కంపెనీ ఎలవెన్స్' అంటాడు. ఇకపోతే ఖర్చులు — ఒకడు 'డెవలెప్ మెంట్ నెస్' అంటాడు. ఒకడు 'మేగజీన్ కాన్ట్రిబ్యూషన్' అంటాడు. అదీ ఇదీ కలిపి, అందులోనించి ఇది పారేశి, కురదలా తేల్చుకోమన్నట్టు గడబిడగా చెప్పుకుపోతున్నారిద్దరూ. పాలకి రూ. 40/— అని వొకడూ, కాదు నాకు యాభై అవుతున్నాయని ఒకడూ—ఏ రేటున కొంటున్నదీ ఒక్కడూ తేలడు. మరి ఆ అంకెని ఈ అంకె పెట్టి భాగారిస్తే, దినానికున్న ఇరవై నాలుగుగంటలలోనూ ఎవరెన్ని శేర్లు తాగేస్తున్నారో నికరంగా తేలసే తేలుతుందా యెను. ఆ నళిని మరీనూ. నక్కజిత్తులు వాడివి. పాలసంగతి ఎత్తుకొని, పాలసరఫరా కంపెనీలలో జరుగుతున్న అన్యాయాలు విమర్శించి, ఉత్తరాది వాళ్లు పాలతోనూ పంచదారతోనూ ఫీల్ మోహన్ అనీ, బాసంతి అనీ ఎన్నెన్ని తీపి సరుకులు చేసు కుంటారో ఉటంకించి, అయినా పంచదార అంత ఆరోగ్యకరమైన పదార్థం కాదన్న ఉపదేశంతో శాఖా చంక్రమణాలుపోయి, 'నాన్నా, నీకు షుగరన్నావు ఎట్లా వుందీ?' అన్న కుశలప్రశ్నలతో ఉపసంహారాని కొచ్చి, అసలు సంగతి తప్పించేశాడు. శీతారామయ్యకి విసుగ్గా వుంది.

ఏటొచ్చీ రామచంద్రం కొంచెం మెతక. కల్పనా కథలు చకచకా అనర్గళంగా అల్లడం చాత గాక, మధ్య మధ్య నట్టుతో, 'మారిదేవుడు మేలు చేస్తే' అని గెడ్డాన్ని బొటనవ్రేలూ చూపుడు వ్రేళ్ల మధ్యని పుణుక్కొంటో, అయోమయంగా, ఏమీ పాలు పోక 'మీ కోడలు కొంచెం ఖర్చు మనిషి' అని నాలిక జారాడు. మరి ఆ మాట, ఆ కోడలు ఎక్కణ్ణించీ విన్నదో, ఎంత జాగర్తగా విన్నదో, రివ్వున హాలులోకి దూసుకొచ్చి, 'చూశారా మామయ్యా—ఆయన దుబారా లన్నీ దాచుకుని నామీదకి నెట్టేస్తున్నారు. ముప్ఫయ్యారు సూట్లెందుకు చెప్పండి? తాజమహల్ ఒకసారి చూస్తే చాలదూ? ఎండలో ఒకసారీ, వెన్నెట్లో ఒకసారీ చూడాల్నా? మొన్నటికి మొన్న పుస్తకంలో వందరూపాయిలనోటు పెట్టి, మర్చిపోయి, 'లైబ్రరీకి' వాపసు చెయ్యలేదూ' అని బి. యె. ప్యాసయినా, కళ్లూ చేతులూ తిప్పే అలవాటు అంత రాళంలోనించీ పైకుబికి వచ్చినట్టయి, ఆయనగారి అవకతవకలన్నీ ఒక్క పెట్టున చెరిగిపోసింది. డాక్టరు రామంగారుమాత్రం తక్కువ తిన్నారూ? తన భార్య రత్నం పెట్టెలో ఎన్ని చీర లున్నయ్యో, 'టాక్సీ' మీద నెల కెన్నిసార్లు 'షాపింగు'కి వెడుతుందో ఎన్ని 'టేబిల్ ఫాన్స్' కొనిపించిందో, 'వద్దే మనకెందుకు? మనం సామాన్యకుటుంబీకులం, సంసార్లమా గుండా గొయ్యలమా?' అని శతపోరినా అదిగో ఆ 'రిఫ్రిజిరేటర్' కొనేదాకా ఎట్లా గుంజిపెట్టిందో, ఆ ఘట్టాలన్నీ, కొళాయి తిప్పగానే నీళ్లొచ్చినట్టు. ఏకధాటీని ఏకరువు పెట్టేశాడు. దానాదీనా, చిలికి చిలికి గాలివానయింది. మాటకి మాటతెగులూ, నీటికి నాచు తెగులూ అన్న సామెతగా, ఇద్దరూ ఛీ అంటే ఛీ, నువ్వంటే నువ్వు అని చెలరేగిపోయి, ఒకళ్లమీద ఒకళ్లు విరుచుకునిపడి, నానారభసాచేసి వదలి పెట్టారు. అటు వాణీ రాణీ పార్వతమ్మా రెక్క పట్టుకుని ఇద్దర్నీ వెనక్కిలాగినా వినలేదు. పైసెచ్చు వారించినకొద్దీ రెచ్చిపోయారు కూడా. ఆఖరికి చిత్రంగా, ఎంతకీ సమవుజ్జీ అయిపోతున్నదే, అని పించి గావాల్ను, ఆ కోడలు ఇహ వాక్చాతుర్యం చాలించి, గప్పున కన్నీళ్లలో కరిగిపోయి ఆడంగుల చేతిలోని అమోఘమైన అస్త్రాన్ని గురిచూచి మరీ ప్రయోగించింది. దానితో సద్దుమణిగింది. వాణీ చినవదినని లోపలికి బలవంతాన తీసికెడుతూ, 'చాల్లే ప్రతాపాలు' అని చిన్నన్నయ్యవంక ఉగ్రంగా చూచింది. ఎర్రని మొహం మరీ ఎర్రబడిపోయి, పైటకొంగుతో కళ్లొత్తుకొంటూ, భుజమీ్మదవేసిన వాణీ చేతులు విదిలించుకుంది కోడలు. అక్కడికి, ఇందాకట్నించీ పేట్రేగిన కలహానికంతకీ తామే కారణమైనట్టూ, అన్నయ్యని పనిగట్టుకుని తామే ఉసిగొలిపినట్టూ మొహం పెట్టిందావిడ. ఆ నేరంలో తనూ ఒక భాగస్వామినే అన్నట్టు వంటింటోనించీ చెమట తుడుచుకొంటోవచ్చి, కోడల్ని అనునయిస్తూ కూచుంది పార్వతమ్మ.

ఈ రణరంగంలోకి ప్రవేశించకుండా ఆసింటా వుండి గమనిస్తున్నది శీతారామయ్య. ఆయనకి పట్టుకున్నది ఒకేఒక్క సందేహం. ఈ రగడంతా —ఎత్తుగడా, నిర్వహణా, ముగింపూ అన్నీ ముందే పన్నుకుని, 'రిహార్సల్స్'తోసహా 'ప్రాక్టీసు' చేసుకుని ఇక్కడ తెర ఎత్తారా వీళ్లు? ఏమో ఎంతకి తగరు! ఇదంతా నెల

నెలా తనకి పంపడానికి సాధ్యమయ్యేదెంతా అన్న సమస్య తెగకుండా, అస్పష్టంగా, అట్లా వుంచేసి, ఆఖరికి అడుగున పడెయ్యాలని ఎత్తా? కాని అనుకోకుండా చిలవలు పలువలుగా పెరిగిపోయిన ఆ 'డయలాగు'తో నించీ వీళ్ళలో లోపల సాగుతున్న స్వయంపాకాలూ, చేస్తున్న దుబారాలూ, బహిర్గతమైన మాట మాత్రం నిజం! నళిని అట్లా దొరకని మాట నిజమే. వాడి భార్య విజయ సరేసరి అదొక కూపి. ఇద్దరిద్దరే నిష్ఠురంగసముద్రాలు. తొణకరు బెణకరు!

అక్కడ పెళ్ళి అయిపోయింది. పెళ్ళి వారింటికి వెడుతోవస్తో కోడళ్ళిద్దరూ మార్చి మార్చి కట్టుకొన్న డెకరాన్ జరీచీరెలూ, ప్రింటెడ్ నైలాన్ చీరలూ, రుద్రాక్షంచు క్షీరాబ్ది పట్టు చీరలూ, 'ట్వింక్లింగ్ టెరెలిన్ జంపర్లూ కళ్ళు జిగేల్మనిపించి, వెనక్కి తిరిగి తిరిగి మరీ చూచారు అక్కచెల్లెళ్ళిద్దరూ. చూచి చూచి కొయ్యబారిపోయారు. ఇంతవరకూ కోడళ్ళిద్దరూ వంటయింటో అడుగుపెట్టు లేదు సరిగదా, ఆ ధరిమేనా వెళ్ళిన పాపాన పోలేదు. కోడళ్ళు చదువుకున్న దొరసాన్లు కాబట్టి వాళ్ళు వంటింటోకి వెళ్ళకపోతే మానె, కొడుకులైనా, చెల్లాయిలిద్దరూ తమకి వొత్తులు వొత్తుతూ తమ దగ్గరనే ఉండిపోయిరి, వంటింటో ఆ తల్లి ముండవక్కర్తి సతమతమవుతోందికదా, తమ మాటా మన్ననా, అత్తమామలంటే తమకి ఉండు కున్న భక్తిప్రపత్తులూ, ఒలకబోసేది ఈ మూడు రోజులేకదా, కనీసం నటనకయినా ఒక్కరవ్వ అటు తొంగి చూడండే అని కలగజేసుకుని సూచించారా? అదీ లేదు.

రామూని పిలిచి ఒక చిన్నపని పురమాయించాడు శీతారామయ్య. పడమటి వీధిని కుటుంబయ్యని ఒకతనికి పదేళ్ళయి ప్రోనోటుమీద బదులిచ్చాడు తను. వడ్డీ వాసనపురమూ ఏమీ అఖర్లేదు. అసలియ్యవయ్యా అంటే దిక్కూ దివాణమూ లేదింతవరకు. 'నువ్వేమో ఆఫీసరివి కాబట్టి, ఒకసారి ముదలకించు' అని పంపాడు. కుటుంబయ్యని రామూ ఎరుగును.

'వాడా? దొంగ రాస్కెల్! పలుకుతాడా? ఈ నోట్లేమిటి? బదుళ్ళేమిటి?' అని నసుగుతోనే బూటూ సూటూ కోటూ బనాయించి, అరగంట 'టూయిలెట్టుయి' బయల్దేరి వెళ్ళాడు డా. రామచంద్రం.

వెళ్ళి ఒక గంటలో రిక్షామీద దూకుడుగా వచ్చాడు వస్తూనే జుయ్యిమంటూ, 'వాడా—దగుల్బాజీ—బాబూ నాయనా అంటే వాడిస్తాడా? ఇవ్వకపోనీ చెప్తాను. 'డొక్క వాలికలు చేస్తాను—ఖబడ్దార్' అని చెప్పి వచ్చా—చేతిలో హంటరు లేదు. తాట వొలిచేవాణ్ణి' అని కోటు గబగబ విప్పేసి వంకీకి తగిలించి బూట్లు విప్పేసుకుంటున్నాడు. కుర్చీలో కూచుని, ఎవరికో ఉత్తరం వ్రాస్తున్న వాడల్లా, ఆపి, పక్కకి తిరిగి 'ఏమయింది?' అని ప్రశ్నిస్తున్నాడు శీతారామయ్య. 'ఎనిమిది వందలు కాదు ఆరు వందలట—దొంగ చూపులూ నంగిమాటలూ వాడూను. నోటు చూపించమంటే లేదట — లుచ్ఛా — ఆస్పత్రిలో 'స్పెషల్ వార్డు'ల్లో పోలీసు సూపర్నెంట్లు నాకోసం పడిగాపులు పడివుంటారు - ఒక్క 'ఆఫీసర్ని' తగిలించానంటేసరి సఫా—ఏమనుకుంటున్నాడో బద్మాష్' అని అక్కడలేని కుటుంబయ్యమీద అదేపనిగా ఎగిరి పడుతున్నాడు డాక్టర్ రామచంద్రం.

నోటు వాడిదగ్గ రెందుకుంటుంది? మనం వాడి కప్పిస్తే నోటు మనదగ్గరుంటుంది—ఇదుగో— అని డ్రాయరులోనించీ ప్రోనోటుతీసి, వేలుపెట్టి అంతవరకూ పసివ జమలు భయంభయంగానే చూపించాడు శీతారామయ్య. వాడు తనమీద ఎక్కడ పడతాడోనని భయంగానేవుంది లోపల. 'ఇదుగో వంద ఒకసారీ, యాభై యాభై దఫదఫాలుగానూ జమ లిచ్చినట్టు వమోదయినై. ఆ పద్దులు అసలు క్రిందనే ముట్టజెప్పినట్టు లెఖ్ఖపెట్టుకుంటున్నాడు గావును,' అని వేలితో నిర్దేశిస్తూ ఇష్టంగా నవ్వాడు శీతారామయ్య. 'ఎట్లాగయినా దొంగలెఖ్ఖలు నాన్నావాడివి. వాడికి నీతీ నిజాయితీలేదు. దెబ్బ దేవేంద్రలోకమని అదే వాడికి మందు. ఇక్కడికి రానీ చెమడా లెక్క దీశేస్తాను. ఈ అసలేమిటో, వడ్డీలేమిటో అదీ యిదీ కలిపి అందులోంచి ఇది తీసెయ్యడమేమిటో అంతా రావణా గోలగా వుంది. ఏమే బనియనిట్లా ఇవ్వు' అని లోపలికి చక్కాబోయాడు రామం. మొన్న భార్యతో కలబడినప్పట్నించీ వాడెత్తిన నరసింహావతారం ఇంతవరకూ ఉపసంహరించలేదు. మాట్లాడితే చిమ్మెట్టులా మీదపడుతున్నాడు.

(సశేషం)

# పూజావనము

## [దివ్యమానుష దృశ్యము]

### శ్రీ నోరి నరసింహ శాస్త్రి

[సెప్టెంబరు నెల సంచిక తరువాయి]

భర్త : ఎక్కడో వంశీనాదము శ్రావ్యంగా వినవస్తున్నది. విను!

భర్త : ఆహా, ఎక్కడినుంచో ప్రణవనాదం వినిపిస్తున్నది?

భార్య : ఎవరో మహర్షులు వాల్మీకివలెనో చ్యవనునివలెనో తపస్సు చేస్తూఉంటే, చుట్టూపొదలూ పుట్టలూ పెరిగిపోగా, ఆ మధ్యనుంచి ప్రణవనాదము లాగా వినవస్తున్నది.

భర్త : అక్కడ, ఆ పొదలోనుంచి తుమ్మెద జంటలు జుం జుం నాదముచేస్తూ చుట్టుకోలుచేస్తూ ఉంటే ప్రణవనాదమువలె వినిపిస్తున్నది.

భార్య : అంతేనండీ, ఆ పొదలోనుంచే!

భర్త : అంతేకాదు. ఆ తుమ్మెదల ఝుంకారధ్వని ఆ పొదలోనుంచి వస్తున్న ప్రణవనాదానికి అనుకరణే కాని స్వతంత్రమైనది కాదు.

భార్య : అవునండీ, ఆ ప్రణవనాదము వచ్చేది ఆ ములుగోరంట పొదలోనుంచే!

భర్త : ఎంత అపచారం మాట అన్నావు! అది ములుగోరంట కాదు, మునిగోరంట! రుద్ర ప్రీతికరమైన పూలవి! గీర్వాణభాషలో 'ఝుంటీ' అని పేరు. ఝుం అనే శబ్దము చేస్తుంది కనుకనూ, సహచారిణులైన భ్రమరులతో భ్రమరము దీనిలో చరించును గనుకనూ వచ్చినది గనుకా ఆ పేరు వచ్చినది. ఎంత నేవళంగా ఉన్న వీ పూలు!

భార్య : ఈ పొదనిండా సన్నని ముళ్ళు ఉండి ఏ పువ్వు కోయబోయినా, అవి గుచ్చుకుంటూ ఉంటవి. అందువల్ల దీనికి ములుగోరంట అనే పేరు వచ్చినదనుకుంటున్నానే నేను!

భర్త : మళ్ళీ ఆ అపచార వాక్కేనా! అది మునిగోరింట! మునీశ్వరులు స్థిరాసనాలు వేసుకొని ఝుం ఝుం అని ప్రణవనాదము బోరు కలిగేట్లు ఎట్లా జపాలు చేస్తున్నారో చూడు!

> దుఃఖే ష్వనుద్విగ్న మనాః
> సుఖేషు విగత స్పృహః
> వీతరాగభయ క్రోధః
> స్థితధీ ర్ముని రుచ్యతే॥

అని గీత వర్ణించిన మునులు వీరు! ముందు వీళ్ళకు భక్తితో నమస్కరిద్దాము!

[ఒక్కపెట్టున ప్రణవ ఝుంకార నాదముతో వనము నిండి నిబిడీకృత మవుచుండగా భార్యాభర్తలు నమస్కరిస్తూ మునిగోరంట పూలు గ్రహిస్తారు.]

భార్య : [ఉలికిపడి] ఎక్కడినుంచో బుసలు వినబడుతున్నవి.

భర్త : అవా, బుసలు కాదులే భయపడకు! అవి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. మహాయోగులెవరో ప్రాణాయామము చేస్తున్నారు.

భార్య: ఆ శబ్దము నాగుమల్లె పూలలోనుంచండీ!

భర్త: మన మిప్పుడు నిలుచున్న చోటును తన దీర్ఘ శాఖలతో ఆవరించిన ఈ మహావృక్షములోనుంచి కూడా, ఆ శబ్దమే వినవస్తున్నది. పాన వట్టము, నాగాభరణముతోసహా శివలింగాకారముగా అవతరించిన పుణ్యమూర్తులు ఈ నాగలింగపూలు కూడా ప్రాణాయామము చేస్తున్నవి.

[భార్యాభర్తలు నాగమల్లెలు నాగలింగ పూలు గ్రహిస్తారు.]

భర్త: ఎక్కడో పెద్దనార్యునిపేరు వినవస్తున్నది. కాళిదాసు కంఠముతో కలసి!

భార్య: ఆ దిరిసెనపు చెట్టుమీది నుంచండీ! — శిరీష కుసుమపేశలసుధామయోక్తుల పెద్దనార్య! — అని.

భర్త: ఓదంస అంతి దఅమాణా
పమదా ఓ శిరీస కుసుమాఇం—
అని కాళిదాసు కంఠం కూడా వినిపిస్తున్నది.

[దంపతులు శిరీషకుసుమాలు గ్రహిస్తారు]

భార్య: ఎవరండీ ఆ తాగుబోతులు ఈ పూజావనంలో?

భర్త: [ఆలకించి] చిత్రంగానే ఉన్నవి వాళ్ల మాటలు!

భార్య: ఒళ్లు మరచిన వాళ్ల మాటలమధ్య పాట కూడా ఏదో వినవస్తున్నదే.

ఆవల పాట [తెరలో]

ఎగురుచు చిందెడి ఈ మధుచషకము
ఎఱ్ఱని పెదవుల ముదిడుమా!
చక్కిలిగింతలా శరీరమంతయు
సంచలింపనీ మధురసమున్!

భర్త: [ఆలకిస్తూ] మదిరామదమో యౌవనమదమో తెలియడంలేదు. శ్రద్ధగా విందా ముందు!

ఆవలపాట [తెరలో]

కణకణలాడెడి కారుచిచ్చువలె
కాదంబరి యిది క్రమ్మంబు,
శరాలఘాత మటు సూటిగ హృదయము
చూడి పోసనీ సుమ మధువున్!

భార్య: ఏమిటా తాగుబోతులపాట అంత శ్రద్ధగా ఆలకిస్తారు? — మీకు కూడా ఏమన్నా —

భర్త: కాదు కాదు. ఉండు. అందులో దూరార్థము ఏదో స్ఫురిస్తున్నది. ఏదో మాత్రము స్పష్టముగా బోధపడడం లేదు. విను!

ఆవల పాట [తెరలో]

పొడిచిన బుసబుస పొంగెడి రక్తము
పోలుపు గలది ఈ పువురసము,
నరనరమ్ము బలు ఛురికధారవలె
నరుకనీయనీ నవమధువున్!

భార్య: ఏమిటండీ, మీకూ—

భర్త: ఉండు. పూల పాట అది. ఎక్కడినుంచి వస్తున్నదో బాగా పరికించు, నా హృదయాన్ని ఆకట్టివేస్తున్న దా పాట!

ఆవల పాట

కనుమీ మెరసెడి కనకపాత్ర మిదె
కన్నుల కరవులు తీరన్
యౌవనదీపిక యార్ద్రత వెలిగెడి
నందు లోవలను హాలాగ్ని!

భార్య: మధూక వృక్షములలోనుండి వస్తున్న దాపాట.

ఆవల పాట

పంచ బాణముల చంచల రసముల
వంచుకొన్న దీ వారుణము
ఉదయభాను ఖర కరంబు తమ మటు
విదల్చు జడిమము మధు ధారన్!

భర్త: ఇప్పుడు కొంచెము సూచనగా అర్థమవుతున్నది.

భార్య: మీకు మధ్య మధ్య కవిత్వము వింటే మతి కూడా పోతుందల్లే ఉన్నదే! ఏమిటి మీకా ఆనంద తన్మయత్వము, ఆ తాగుబోతుల పాట వింటూంటే? మీకు కూడా—

భర్త: వెర్రిదానా, షష్టి పూర్తి ఐనతర్వాత, రవిబాబు అంత మహాకవి, మధూక పుష్పాలమీద ఖండ

కావ్య సంపుటమే ప్రచురించాడు. స్వయంవర సమయంలో వధువు మధూకములతోనే వరుణ్ణి వరిస్తుంది.

భార్య: స్వయంవరానికీ పూజాపుష్పాలకూ సంబంధ మేమిటండీ? మత్తు కలిగిస్తుంది కదూ, మధూకపుష్పము?

భర్త: మధూకములు మత్తుకలిగించే మాట నిజమే కాని మధూకమాల పవిత్ర మైనది.

భార్య: మీ మాటలు అసందర్భంగా ఉన్నవి.

భర్త: అయ్యో, ఏ మనేది నిన్ను! కాదంబరీప్రియా, మదవిహ్వాలా, మధుప్రీతా, మాధ్వీ పానాలసా, మత్తా—ఇత్యాది నామాలు గుర్తులేవా?

భార్య: శ్రీదేవి రహస్యనామా లవి.

భర్త: అవును. అవి రహస్యనామాలని గుర్తుంచుకో! అవి బ్రహ్మానందమూ అమృత సేవనమూ వర్ణించే పవిత్రనామాలు. పంచతన్మాత్ర సాయకా, నిత్యయౌవనా—ఇత్యాదినామాలు కూడా జ్ఞాపకం చేసుకుంటే, ఈ ఇప్పపూలు కీర్తించేది శ్రీదేవినే అని తెలుస్తుంది.

భార్య: బాగా అర్థం కాలేదు.

భర్త: శ్రీకల చదువు! సౌభాగ్య భాస్కరం మరచిపో! శ్రీదేవి పూజ ఆనందంతో ఉత్సాహంతో కూడుకొన్నది కాని, జవసత్వా లుడిగిన వాళ్ళు మూలుగుతూ చేసేదికాదు. ఈ ఇప్పపూలు భక్తితో గ్రహింపవలె సుమా!

[ఇద్దరూ ఇప్పపూలు గ్రహిస్తూ ఉంటారు.]

భార్య: మీరు చెప్పినట్లే చేస్తున్నానుగాని అన్ని పూలలో శ్రేష్ఠమైనవి ఏవని మీ ఉద్దేశము?

భర్త: పుణ్యములో హెచ్చు తగ్గు లెన్నడముకష్టమే. కాని సుగంధముగల శ్వేతపుష్పాలు పూజకు ఉత్తమమైనవని శాస్త్రవచనము.

భార్య: ఎందువల్లనో?

భర్త: ఏమోగాని బహుశః తెలుపు సాత్త్వికవర్ణ మంటారు గనుక!—మన మిక స్వచ్ఛమైన పూలు—మాలతులు, జాజులు, విరజాజులు, గరుడవర్ధనలు, నందివర్ధనలు కోసుకొని ఇక దేవమందిరానికి బయలుదేరుదాము పద!—

[ఇద్దరూ ఆ పూలు చకచక కోస్తూఉంటారు.]

భార్య: చూచారా? మనము వెళ్ళిపోతున్నామని, మధ్యాహ్నమయితేకాని విచ్చుకోని ఈ మధ్యాహ్న మల్లెలు—ఎర్రనివీ తెల్లనివీ—కోయమంటూ విచ్చుకొని పిలుస్తున్నవి.

భర్త: వాటినీ కోదాము—చిత్రము చూశావా? ఆ సూర్యకాంతము సూర్యబింబమువలెనే విప్పారి మనవంకే చూస్తూ పిలుస్తున్నది.

భార్య: అయ్యో, అది కోయకపోతే ఎట్లా? [కోస్తుంది]

భర్త: ఆశ్చర్య మాశ్చర్యము! కలువలు పగలు వికసించవని కవులంతా అంటారు. కాని మన సరోవరంలో ఈ కలువలు ఎంత ముద్దుగా విప్పారినవో చూడు!—తెల్లటివి, ఎర్రటివి, నీలపువి—ఆ పద్మాలకు ప్రతిస్పర్ధులుగా ఇవి కూడా కేవలం శ్రీదేవీ స్వరూపంగానే ఉన్నవి.

భార్య: కలువలు పగలు నిద్రపోతవని తోస్తుంది. కళ్ళు తెరచుకుని నిద్రపోయేవాళ్ళలాగే! నిద్రపోయే పూలను కోయరాదేమో!

భర్త: వెర్రిదానా, దేవతాప్రతిష్ఠలు సరిగా తెలియక పోయినా చూడనైనా చూడనివారి మాటలవి! ప్రతిష్ఠాచార్యులు ఏ దేవతాప్రతిష్ఠ చేసినా, ముందా దేవతవద్ద నిద్రాకలశం పెట్టి నిద్రా దేవతను ఆవాహనచేసి నిద్రపుచ్చి—ఆ తర్వాత పీఠస్థానంలో ప్రతిష్ఠిస్తారు.

భార్య: ఓహో, ఆ తర్వాత కనకశలాకతో నేత్రోన్మీలనం చేస్తారు కదూ, ప్రతిష్ఠాచార్యులు!

భర్త: అవును. దేవత ప్రథమదృష్టి తీక్ష్ణమై ఉంటుందని ఆచార్యుడు దేవతాప్రతీకకు ప్రక్కనో వెనుకవో ఉండి చేస్తాడు. ఎదురుగా ఎవరూ లేకుండా అడావిడిచేసి ప్రక్కలకు నద్దుతారు కనుక నేత్రోన్మీలనం తతంగ మందరికీ తెలుస్తుంది.

భార్య: మరి ఆ తీక్ష్ణదృష్టి ఎట్లా శమిస్తుందో?

భర్త: ఆ దృష్టిపాతము భరించగలది జీవజ్జంతువులలో గోమాతా, దేవతలలో అగ్నిహోత్రుడూ మాత్రమే!

భార్య: నిద్రపోయే పూలుకూడా దేవతాస్వరూపాలు కాబట్టి పూజలోపల కళ్లు తెరిస్తే, ఆ దృష్టి ఎవరిమీదనైనా పడితే బాధ కలుగుతుందనే నిద్రపోయే పూలను కోయవద్దంటారేమో!

భర్త: అవును. నీ వన్నది నిజమే కావచ్చు! నిద్రపోయే పూలను కోయగూడదనే ఇప్పుడు నాకూ తోస్తున్నది. కాని—

భార్య: ఏమిటి ఆ కాని—? నిద్రపోయే కలువలను కోయవద్దు లెద్దురూ!

భర్త: బుద్ధిమంతురాలవే కాని అంత తొందరపడతావేమి? ఆ కలువల మాటలు వినబడటంలేదా?

భార్య: నాకేమీ వినబడడంలేదు. నిద్రలో కలవరిస్తున్నవేమో! పాపము వాటికి నిద్రాభంగము చేయకండి! మాట్లాడకండి!

భర్త: ఇవ్వాళ నీ మాటలవల్లనే నా లోపలచెవి కాస్త తెరుచుకున్నది. ఇప్పుడు నీకు చెవుడు వచ్చినట్లున్నదే చిత్రంగా!

భార్య: ఇస్! కలువలకు నిద్రాభంగం చేయకండి, ఇస్!

భర్త: ఆ కలువలు, మేము మేలుకొన్నాము, మేలుకొనే ఉన్నాము, మేలుకొన్నాము అని ఘోషిస్తున్నవి. వాటి పాటైనా విను!

[తెర ] కలువల గీతము

హృదయనాథ, శశీ, సుధామృదులహృదయ
నీవు కామేశ్వరు తదంకనిలయరాజ్ఞి
నంబ కామేశ్వరిని నిజబింబ పీఠి
భక్తి ధరియించి పోకార్తు ప్రజల రుజలు!

నీ కలాలేశ మేము నిర్నిద్ర భక్తి
నిచ్చలు ధరించి యెదల ధ్యానింప మాకు
ఎడనెడ నవస్థాధిదశయు ప్రాపింప గాంచి
నిద్రయంచు నిద్రాణు లెంచెదరు భ్రమసి!

నిన్ను ధ్యానించువారికి నిద్ర యున్నె!
పాలసంద్రంపు తరగల పడకలవలె
చిరురొదలతోడ నమృతంబు చిలుకు, మాకు
మృదుగతుల నల్పు నీ లాస్య పదము లెదల!

భార్య: పాటకాదు. ఏవో పద్యాలవలె ఉన్నవి.

భర్త: అవును. అవి గీతాలు, తేటగీతాలు!

భార్య: అయితే ఈ కలువలు ఏమంటున్నట్లు?

భర్త: వాళ్ల పాట విను!

[తెరలో] కలువల పదము

కవి కవీశ్వరులార గ్రహియించపరండి
కువలయేశుని భక్తకోటుల మేము!

భార్య: మనకిద్దరికి బిరుదులుకూడా చేర్చి ఈ కలువలు ద్విపద పాడుతున్నవి! వెంటనే వాటిని కోసుకురండి, ఈ కమలాల పక్కన ఉంచుదాము.

[భర్త కలువపూలు కోస్తూ ఉలిక్కిపడతాడు.]

—ఏమిటండీ, అట్లా ఉలిక్కిపడ్డారు?

[భర్త మౌనమువహించి ఆర్ద్రమైన కన్నులతో దిక్కుల చూస్తూఉంటాడు.]

భార్య: [ఆదుర్దాతో] ఏమండీ, ఏమిటండీ? అట్లా వెర్రి చూపులు చూస్తున్నారు! అట్లా కన్నీళ్లు కారుస్తారేమి?–ఇవ్వాళ మనకు కలిగిన ఈ అభినవానుభూతివల్ల — మనస్సు తిరిగిపోయి వికలము కాలేదు గదా!—అయ్యో, మాట్లాడరేమి?—

[భర్త వెర్రి చూపులతో తోటంతా కలయజూస్తూ ఉంటాడు]

భార్య: [మరింత ఆదుర్దాతో] అయ్యో, ఏమండీ?

[భర్త తెప్పిరిలుకుని ఒడుకుచేరి చేతిలో కలువలు భార్యవద్ద సజ్జలో జారవిడిచి నిట్టూర్పుతో కూర్చుంటాడు.]

భార్య: [నీటితో కన్నులు ముఖము తుడిచి దేహమంతా చిగురు చేతులతో చల్లగా నిమురుచు] ఒంట్లో ఎట్లా ఉన్నది?

భర్త: [లీలగా చిరునవ్వుతో] ఊం!

భార్య: ఏమిటండీ, అట్లా గాభరా పెడుతున్నారు?

భర్త: పాపము! పాపము! పాపము!

భార్య: పాపమేమిటి?

భర్త: నీవు వృథాగా ఆదుర్దా పడక, పాప మా దీనాలాపాలు కాస్త విను!

భార్య: ఎక్కడ?

భర్త: మన తోటలోనే. ఏదో భాషలో పిలుస్తున్నారు?

భార్య: ఎక్కడండీ? నాకేమీ వినబడడంలేదే!

భర్త: ఈ తోటలో పూలభాష వినగలిగేట్లు నా లోపలి చెవి విప్పారజేసిన నీకే వినబడడంలేదా?

భార్య: ఎబ్బే. ఎక్కడా సడేలేదు. మీా విభ్రాంతి ఏమెరా!

భర్త: అయ్యో! ఆ దీనాలాపాలు ఒక్క భాషలో లేవు. ఏ ఏ భాషవో కూడా తెలియడంలేదు. కాని అంతా భగవంతుణ్ణి సంకీర్తనం చేస్తున్నట్లున్నది!

భార్య: తెలియని భాషలలో చేసేది భగవత్సంకీర్తన మని ఎట్లా చెప్పగలరు?

భర్త: అదే చిత్రము. నాకేమాత్రం సందేహంలేదు.

భార్య: మన తోటలోనుంచేనా?—ఎటుగా వస్తున్నవి?

భర్త: మనము సరదాకోసము దేశదేశాల పూలచెట్లా వేశామే, ఆ మూలనుంచి.

భార్య: గులాబీలలోనుంచి కూడానా?—పేర్లేవి చెప్పైనా వినవస్తున్ననా పోనీ?

భర్త: ఆ! ఖయాం—రూమీా—సాదీ—హాఫీజ్—

భార్య: వాళ్లెవరో ఎరుగుదురా? కుబ్జాక మని వివిపిస్తున్నదే.

భర్త: ఆ. వాళ్ల కావ్యాలు భాషాంతరీకరణాలలో చదివాను. పారశీక భక్తులూ, సూఫీలూ—సంస్కృతంలో ఈ మధ్యకాలపు కవులు గులాబిని కుబ్జాక మన్నారు.

భార్య: అయితే పాపము, వాళ్లంతా ఏరి కోరి వరించి కృతార్థతకోసము మన ఈ తోటలో జన్మ లెత్తితే, మమ్ము పరమేశ్వరి పూజకు కోయక విదేశీ పుష్పాలమని పరిహరిస్తారా, అని ఘోషిస్తున్నవేమో!

భర్త: కావచ్చు. ఇతర దేవతలను శ్రద్ధగా భజించే వాళ్లుకూడా నన్నే అవిధిపూర్వకంగా యజిస్తున్నారనీ, భక్తుడైనవాడు ఏ ఏ రూపముగా దేవతను ధ్యానము చేస్తాడో, ఆ రూపమందే వాని భక్తిని దృఢముచేస్తాననీ, శ్రీ కృష్ణ భగవానుడు ఉపదేశించలేదా?

భార్య: ఏమిటి?—

భర్త: ఇంకా ఏమని ఉపదేశించాడో తెలుసునా?

> 'సమోఽహం సర్వభూతేషు
> నమేద్వేష్యోఽస్తి నప్రియః
> యే భజంతి తు మాం భక్త్యా
> మయి తే తేషు చాప్యహమ్.'

తెలుసున్నదికదా? శ్రీ కృష్ణభగవానుల ప్రతిజ్ఞ కూడా విను! ఆయన ప్రతిజ్ఞకూడా కాదు అర్జునునిచేత ప్రతిజ్ఞ చేయించాడు.

భార్య: ఏమని?

భర్త: 'కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి.'

భార్య: నిజమా?

భర్త: నిజమే. సందేహం కూడానా? వేదపురుషుడూ అంటున్నాడు:

> 'ఆకాశాత్పతితం తోయం
> యథా గచ్ఛతి సాగరమ్
> సర్వదేవ నమస్కారః
> కేశవం ప్రతి గచ్ఛతి.'

భార్య: ఐతే ఆ విదేశీపుష్పాలు కూడా స్వర్గసౌఖ్యమనుభవిస్తున్న మహాభక్తులే నంటారా?

భర్త: సందేహమా? ఇందులో పారశీకులే కాదు, అరబ్బులు, యూరపియనులు, ఐగుప్తులు, ఆఫ్రికనులు, యూదులు, చీనులు, బ్రహ్మదేశీయులు, సింహళులు,—ఆ చెర్రీబ్లాజమ్సులో నిప్పానులూ—ఇంకా ఎందరెందరో భక్తులు ఉండవచ్చు!—

భార్య: ఆ పచ్చికపరకలలో ఏదో గలగల మంటున్నది?

భర్త: మాచావా, ఎంత అపరాధమయ్యేదో!-పశ్చిమార్ధ గోళమని మమ్మలను మరచిపోయినారా అని కాబోలు, అక్కడ గడ్డిఆకులలోనుంచి వాల్టు విట్‌మన్—మానవుణ్ణి గురించి—పూర్ణమానవుణ్ణిగురించి పాడతాను—అంటూ ఆ పచ్చికపరకలలోనుంచి వచనపద్యాలు పలుకుతున్నాడు. ఆ ప్రక్కనే థోరో స్వచ్ఛమైన కలవరము కూడా స్పష్టంగా వినవస్తున్నది!—

భార్య: ఈ విశ్వమంతా శ్రీ దేవీమహిమనే గానము చేస్తున్నదన్నమాట!—ఎవరి కెంతవరకు కానవస్తుందో అంతవరకూ!—ఇవి అవి అనకుండా అన్నిపూలూ కోసి శ్రీ శివార్చనకు వినియోగిద్దాం ఇక!

[ఇద్దరూ విచక్షణ లేకుండా పూలన్నీ కోస్తూ ఉంటారు.]

*

తోటలో వేరువేరుచోట్లనుంచి ధ్వనులు

హావుహావు హావూ!—సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్-తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః—వాసనా ద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్ సర్వభూత నివాసోఽసి వాసుదేవ నమోఽస్తుతే—సర్వస్వరూపే సర్వేశే సర్వశక్తి సమన్వితే—పుణ్యో గంధః పృథివ్యాం చ తేజస్తేజస్వినా మహమ్—సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే!—

*

భార్య: ఏమండీ, చిటుకుచిటుకుమనే ఆ శబ్దము విని పిస్తున్నదా?

భర్త: వినబడకేమి? ఈ పూలతోటలోనే అంతా చిటుకుచిటుకుమని చిట్లుతున్నది!

భార్య: [భయముతో] అయ్యో, ఏమండీ, ప్రళయమువలె నేలలోనుండి చీకట్లు మొలుచుకొని వస్తున్నవేమి! అయ్యో, అయ్యో!—కాలనాగాల నాలుకలవలె ఏమిటివి?

భర్త: పాతయ వా పాతాలే
స్థాపయ వా సకలలోక సామ్రాజ్యే
మాత స్తవ పదయుగలం
నాహం ముంచామి నైవ ముంచామి.

భార్య: [వణుకుతూ] నాకు భయము వేస్తున్నదండీ!

భర్త: భయమెందుకు?—పాతాలలోకవాసులు శ్రీ దేవీ పదపూజకు పైకి వస్తున్నట్లున్నారు!

భార్య: ఎంత నిబ్బరమండీ మీకు! నాకు మనస్సు వికలమై ఏమీ తోచడం లేదు. భయమేస్తున్నది.

భర్త: భయము దేనికి? శ్రీదేవి వాత్సల్యం మనమీద పరిపూర్ణంగా ప్రసరిస్తున్నదనుకో! 'నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా' అని వేదమాత పలుకుచున్నది గదా! ఆ నీలతోయదమే ఏమో ఇది!

భార్య: కాదండీ! లోకాల పాపమంతా పండి ఈ విధంగా మన తోటలో మొలకెత్తుతున్నట్లున్నది.

భర్త: కావచ్చు కాని, మనము కొంచెము నిదానించవలె. శ్రీ దేవి అర్చనలో రౌరవాది నరకాలలో ఉండే పాపకర్ములకు మాత్రము భాగమెందుకు ఉండ రాదు?

భార్య: శ్రీ దేవిని అర్చించవలె ననే బుద్ధే గనుక వాళ్ల కుంటే, నరకంలోకి ఎందుకు పోవలసి వచ్చేది?

భర్త: అసలు వాళ్లను నరకంలోకి పంపిన దెందుకనుకొంటావు?

భార్య: ఏమో మరి!—వాళ్లను శిక్షించడానికి కాదూ?

భర్త: నేనట్లా అనుకోను! వాళ్లకు పశ్చాత్తాపము కలిగించడంకోసమని నా తలంపు.

భార్య: కరుణా స్వరూపుడైన భగవంతునికి తప్పుచేసిన కుమాళ్లవిషాదమాత్రము దయే ఉంటుంది కాని కోపమెందుకుంటుంది? — అయితే వీరంతా

నరకబాధతో పశ్చాత్తాపమంది, భగవతిని ఆరాధన చేసేవారినిచూచి ఐనా పరిపూతులు కావలెననే ఉత్కంఠతో వస్తున్నారల్లే ఉన్నది!

భర్త: అవును. ఇంకొక విషయము. లలితారహస్య నామాలలో ఒక్కనామము కీర్తించినా మహాపాపాలుకూడా నశిస్తవంటూ ఉత్తర పీఠికలో ఇంకా ఏ మున్నదో తెలుసునా?

భార్య: ఏ మా విశేషము?

భర్త: విను!

'అత్రైకనామ్నో యాశక్తిః
పాతకానాం నివర్తనే
తన్నివర్త్య మహత్కర్తుం
నాలం లోకాశ్చతుర్దశ'

భార్య: అంటే?

భర్త: ఏమున్నది! పాతకాలను పోగొట్టడములో రహస్య నామాలలో ఒక్కొక్క నామము మాహాత్మ్యము ఎంత గొప్పదంటే, దాని శక్తిని పోగొట్టడానికి చతుర్దశ భువనాలూ చాలవట! —

భార్య: మనము మన రహస్య నామాలు చెబుతూ పూజ చేస్తాము కనుక నారకుల పాపాలు కూడా నశిస్తవా?

భర్త: అవును. మరి లోకంలో ఏ పువ్వుకూలేని కారు నలుపురంగు వీరికున్నది చూచావుగా! మనము స్వర్గము ఎక్కడో దూరంగా లేదు, విశ్వమంతా వ్యాపించి ఉన్నదనుకున్నాముగదా!– మరి నరకము మాత్రమో!

భార్య: అంటే మన పూజావనంలోనే నరకము కూడా ఉన్నదనా? సరే, సరే, సరే – మీ పాండిత్యాలు చాలుగాని ఇక దేవమందిరానికి వెళదాము బయలుదేరండి!

భర్త: నాకు ఆబుద్ధి పుట్టడము లేదు. ఈ పూజావనములో మధురాతిమధురమైన శబ్దాలు వినవస్తున్నవి. అవి ఆలకిస్తూ ఇక్కడే ఉండిపోతాను. విను ఆ మధురమైన కోకిలాలాపము వాల్మీకి మహర్షి వాక్కు! ఆ బంభరఝుంకారము విను, వేదవ్యాస మహర్షి ఓంకారనాదము! ఆ చిలుకల కలకలం విను, శుకమహర్షి భాగవత గానము! ఆ శారికల కలవరము విను, కాళిదాసాది మహాకవులవాణి!—ఆ పూల పాటలు ఎన్నెన్ని రాగాలతో ఎంత శ్రావ్యంగా ఉన్నవో విను!—ఆహా!—

భార్య: నాకేమీ వినబడడము లేదే!—ఇక క్షణము తీరిక లేదు. సంధ్యావందనాది నిత్యకర్మలకు వేళదాటినది. దేవపూజకు వేళ అవుతున్నది. మీరు కూడా త్వరగా లేచిరండి!—

భర్త: రాను. ఈ పూజావనములో కూచోవడమే సంధ్యావందనాది నిత్యకర్మలుగాను, శ్రీ దేవ్యర్చనగానూ, నా కున్నది. రాను – రాను – ఇక్కడే ఉంటాను.

భార్య: మీ కవిత్వాలు చాలించి నా మాట విని, రండి!

భర్త: రాను – రాను—ఆహా! ఆ పూల మృదుమధుర కలరవాలు విను, విను! ఆహా!– ఆహా—

భార్య: నాకేమీ వినబడడం లేదు. ఈ ఎండకు ఒళ్లంతా చిటచిట లాడుతున్నది—నేను వెళ్లుతున్నాను!—

[పూలసజ్జలతో నిష్క్రమిస్తుంది]

తోటలో మూల మూలలనుంచి నానావిధానంద శబ్దాలు—.

హావు హావు హావూ! — హంస స్సోహం — హాల్లేలులా హాల్లేలులా హాల్లేలులా – ఓం మణి పద్మేహుం—నమా నమా సెబేసియో—లాయిలాహ ఇల్లల్లాహు—అనల్ హక్—శివోహం, శివోహం, శివోహమ్ —

భర్త: ఆహా! ఆహా! ఆహా! ఈ వనమంతా బృంద గానముతో మారుమ్రోగుతూ గొల్లుమంటున్నది!—ఆహా!

[ఆకస్మికముగా నిశ్శబ్దమవుతుంది]

భర్త : ఏమిటిది? చెవులు గింగురుమని ఒక్కపెట్టున చెవిటితనము వచ్చినదేమి? ఆ పూలపాటలేవి? మాటలేవి? గుసగుసలేవి? — ఇందాకటినుంచీ వినబడ్డట్లున్నది భ్రాంతి ఐఉంటుందా? ఏమిటబ్బా!— [దిక్కులు చూస్తాడు. నిశ్శబ్దం] ఏమి టబ్బా ఇది! [చెవులు చేతులతో విప్పదీసుకుంటాడు – నిశ్శబ్దం] ఆహా! ఈ పూంభాష ఏదో సుకృత విశేషంచేత ఇవ్వాళ కాస్త లీలగా వినిపించింది. అంతమాత్రాన ఈ తోటలోనే ఎల్లకాలమూ కూచుంటే వినబడుతుందా? — ఆ భాగ్యము ఏ జ్ఞానులకో?— మనకా అంత భాగ్యము! హుం!

[విరక్తితో నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ బిల్వదళాల సజ్జతో పూజామందిరము వైపుకు నిష్క్రమిస్తాడు.]

(అయిపోయింది).

---



# ద్విపద వాఙ్మయము

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

తెలుగు సాహిత్యము అనువాద రచనలని, స్వతంత్ర రచనలని రెండు విశాల విభాగాలుగా ఉన్నది. స్వతంత్ర రచనలు ద్విపద, ఉదాహరణము, యక్షగానము సంకీర్తనము అనునవి. వీనిలో మొదటిదైన ద్విపదను గూర్చి జరిగినకృషి ఫలితమే యీ గ్రంథము. ఇందులకా గ్రంథకర్తకు పి. హెచ్. డి. పట్టము లభించినది.[1]

ఇట్టి గ్రంథములు ప్రాయికముగా పరిశోధనాత్మకములు. గ్రంథకర్త ఏదైనా ఒక విషయమును గూర్చి విశేషముగా పరిశీలనచేసి, మూలగ్రంథాలనామూలాగ్రముగా అవలోడన కావించి ఒక క్రొత్త సిద్ధాంతమునుగాని — దృక్పథమునుగాని ప్రతిపాదింపవలెను. ఇట్టి పరిశ్రమకు 'మౌలికత' ప్రధాన లక్షణము.

కాని ప్రస్తుత గ్రంథములో అట్టి మౌలికతా లక్షణ మంతగా గోచరించుటలేదు. ఏలననగా, ఈ రీతి గ్రంథములలో నియతముగా నుండదగిన—

"గ్రంథ సూచిక"

ఇందు లేదు[2]—ఇది ఒక వాఙ్మయమునకు సంబంధించిన గ్రంథము కాబట్టి ఇందు ముద్రితాముద్రిత గ్రంథ వివరములను సమగ్రముగా దెలుపునట్టి 'గ్రంథ సూచిక' ముఖ్యముగా చేర్చుట అత్యంతావశ్యకము. ఇట్టి గ్రంథ సూచినే ఇంగ్లీషులో "Bibliography" అందురు. అయితే గ్రంథకర్త ఈ గ్రంథము 8 వ పుటలో కొన్నిగ్రంథముల నిచ్చి వాని కీ క్రింది శీర్షిక నుంచియున్నాడు.

'ఉపయుక్త గ్రంథములు (Bibliography)'

'Bibliography' అనగా 'గ్రంథ వివరణ పట్టిక' అని అర్థము. కాని ఉపయుక్తగ్రంథములన్న యర్థము కాదే? ఇక సమన్వయమెట్లు? ఈ సందర్భమున ద్విపదగ్రంథసూచికను గూర్చియు గ్రంథకర్త దానినెట్లు సంగ్రహించినదియు లోకమెఱుంగుట యావశ్యకమైనది.

'ద్విపద వాఙ్మయ సూచిక' ఈ గ్రంథకర్త పరిశోధన ప్రారంభింపకముందే ముద్రితమైనది. ఆ వివరము లివి.

ద్విపద కావ్యములను గూర్చి నేను పరిశోధన చేయుట క్రీ. శ. 1950 లో ప్రారంభించి రెండేండ్లు పరిశ్రమించి పై వాఙ్మయ సూచికను ప్రకటించితిని. అముద్రితములకు, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము - తంజావూరి పుస్తకశాల, ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారము, గోలుకొండ కవుల సంచిక పరిశీలించితిని. ముద్రితములకు ఆంధ్రవాఙ్మయ సూచిక—బ్రిటిషు మ్యూజియము లైబ్రరీ కేటలాగు (లండను) సంప్రతించినాను, అన్నింటికి, సంఖ్యలిచ్చియున్నాను. అలభ్యములైనవాని కాకరములు తెలిపి, ఆ ఆకరముగల గ్రంథములు ముద్రితమో అముద్రితమో

---

1. ఇట్టి పట్టములకు మూలములగు రచనలకు ఇంగ్లీషుభాషలో "Thesis" అని యందురు—తెలుగున 'సిద్ధాంత వ్యాసము' అనియు 'పరిశోధక వ్యాసము' అనియు వ్యవహారము గలదు.

2. దీనికి బదులు 'ద్విపద గ్రంథముల జాబితా' ఒకటి గ్రంథాంతమున అనుబంధమున గలదు—దాని విమర్శన మీ వ్యాసాంతమున గలదు.

3. A bibliography of Dwipada Kavya Literature in Telugu. Annals of the oriental Research, University of Madras. Vol IX 1951—52 Part I Pages 1—33; Vol X 1952—1953-Part I Pages 33-62.

తెలిపినాము. కొన్నిపట్టుల అముద్రితములలోని విశేషములు తెలిపాము. ఆ సూచికారచన యెట్లున్నదో ఒక ఉదాహరణముమ చూపుచున్నాను.

'పుట 52.'

1. కవి—నరసింహకవి ఎల్లకర (కృష్ణయామాత్యుని పుత్రుడు.)

2. కాలము—క్రీ. శ. 1580.

3. కవి కృతులు—భారత సావిత్రి వచనము.

4. ద్విపద కృతులు—మార్కండేయ పురాణము (కవి స్తుతిలో నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, పెద్దన, తిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు గలరు.)

5. కృతి విషయము—కొమరవోలు రాజగోపాలరాయనికి కృతి. గ్రంథము పద్మసావిహా కృతి కాలువసేనని రణరంగమున గూర్చిన ప్రస్తావన గలదు—కాలువసేనుడు కాడవసేనుడు పల్లవరాజు కాదగును.

6. కృతి వివరణము.

అ. ముద్రితము—ముద్రాక్షరశాల.

ఆ. అముద్రితము-ప్రా.భా—సంఖ్య R 132 డి. 980.

పై యుదాహృతినిబట్టి యిది కేవలము వాఙ్మయ సూచికగాక, వివరణాత్మకమైనదని కవి కాలనిర్ణయాది విశేషములతో నున్నదని స్పష్టమగు చున్నదిగదా! ప్రస్తుత గ్రంథకర్త పై గ్రంథములోని విషయము లన్నింటిని తూ. చా. తప్పకుండా, ఆయాస్థలములలో ఉదాహరించుటయేగాని వేఱొండు లేదు. అముద్రిత ద్విపద గ్రంథముల విషయమై, గ్రంథకర్త, పై సూచికలోని గ్రంథములకంటె, వేఱు క్రొత్త గ్రంథముల నేవియు నీయలేకపోవుటయే యిందుకు తార్కాణ. మఱియు నీ వ్యాసమునందే గ్రంథకర్త విడిచిపెట్టిన—ముద్రితాముద్రిత ద్విపద కావ్యములను పరిశీలించినచో నాతడు—పై వాఙ్మయ సూచికతప్ప—దానికి మూలమైన వివరణాత్మక గ్రంథములను చూడనేలేదని విశదమగుచున్నది.[4]

ఇక గ్రంథ విషయ ప్రస్తావన.

ద్విపద—మధుర కవితలు

ఉపక్రమణిక 2 వ పుటలోనే గ్రంథకర్త ద్విపద, పదకవితలో దేశిశాఖకు చెందినదని యిట్లు వ్రాసియున్నాడు.

'పదశాఖలో (1) శుద్ధదేశిశాఖ (2) దేశిశాఖ అని రెండు భేదము లున్నట్లు ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు విభజించియున్నారు.[5] ఆ వెనుక వీని వివరణము గలదు—ఆ వివరణము పెద్దదిగా నుండుటచే ముఖ్యభాగముల నుదాహరించుచున్నాను.

'శుద్ధదేశిశాఖలోని పదములు సామాన్య ప్రజలలో, ప్రజలకొఱకే పుట్టి వారి ఆదరాభిమానములతో తరించి తర్వాత తరముల వారిని తరింపజేయు ప్రజాకవిత్వ మనదగినది. తెలుగులోని బాలనాగమ్మకథ, లక్ష్మమ్మకథ, కామమ్మకథ, అంకమ్మకథ, చిన్నమ్మకథ, బొబ్బిలికథ, ఆరు మరాటీల కథ, కాపుకథ, బంగారు తిమ్మరాజుకథ, కుమారరాముని కథ, దేశింగురాజు కథ యిత్యాదులు-ఈ శాఖలోనివి. ఇవి ప్రౌఢసాహిత్య రచనలుగా పరిగణింప వీలులేనివి.

పాడదగిన పదకవిత్వమైనను, పఠనయోగ్యమైన పద్యకవిత్వముతో సమానమనదగు సారస్వత ప్రతిష్ఠను పొందినట్టిది దేశిశాఖ.........ద్విపద కావ్యములు, రగడలు, ఉదాహరణలు, గద్యలు, శతకములు, యక్షగానములు, దండకములు, మున్నగు తెలుగు సాహిత్యప్రక్రియలు ఈ దేశిశాఖలో చేరదగినవి.'

---

4. ఇట్లు సంపూర్ణముగ నీ సూచిక నుపయోగించియు గ్రంథకర్త తా నొక్కమారే, ఈ సూచికను సంప్రతించినట్లు 319 వ పుటలో నదియు నధోజ్ఞాపికలో వ్రాసియున్నాడు!

5. పుట యడుగున యధోజ్ఞాపిక.

1. చూ. గౌతమవ్యాసములు—పుట 112.

2. చూ. గౌతమవ్యాసములు—పుట 113

అని కలదు.

పై వాక్యముల నాధారముగా చేసికొని, గ్రంథకర్త గ్రంథమును ప్రారంభించి ద్విపదను దేశికవితా శాఖయందు జేర్చి, దానిపై గ్రంథ మంతటిని విర్మించియున్నాడు. కాని పదకవితలలో పై శుద్ధ దేశి దేశిశాఖా విభజనము ప్రాచీనలాక్షణిక మతమునకు అత్యంతమూ విరుద్ధము—సాహిత్యమున పదపద్య కవితా ప్రక్రియల నన్నింటిని, ఏకాకారముగా గ్రహించి వానివాని రచనా తత్త్వమునుబట్టి—నాలుగు విధములుగా లాక్షణికులు విభజించియున్నారు. వీనికే 'చతుర్విధ కవితలు' అని పేరు. ఈ చతుర్విధ కవితలనే ఆశు, మధుర, చిత్ర విస్తర కవిత్వములు' అని యందురు.[6]

ఆంధ్ర లాక్షణికులలో అప్పకవికి పూర్వుడగు వార్తాకవి రాఘవయ్య అనునతడు, తన లక్షణ దీపికలో ఈ చతుర్విధ కవితలను వర్గీకరణముచేసి వివరించియున్నాడు. అది చాలా దీర్ఘముగ నుండుటచే, మధుర కవితలను గూర్చి పూర్తిగా దెల్పి తక్కిన వానిని గూర్చి సంగ్రహముగా దెలిపెదను.

ఆశుకవిత్వం బన్నది

ఏకపాద, త్రిపాద, కఠిన విషమ సమస్యాపూర్తులు, వ్యస్తాక్షరి, న్యస్తాక్షరి, నిషేధాక్షరి రచనా చమత్కృతులు, అష్టావధానంబులు, ఘటికాశత గ్రంథకల్పన, ఆకాశ పురాణంబు, తత్కాలోచిత గీతి రచన అనునవి యాశుకవిత్వంబు—

మధురకవిత్వం బన్నది

నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యాది దేవతోదాహరణములు, సప్తతాళనటనలు, వట్టొట్లు, గీతప్రబంధములు, చతుర్భద్రిక అష్టభద్రికలు, బిరుదావళి, నామావళి భోగావళి, జయఘోష, చతురుత్తర సంఘటనలు, యక్షగానంబున వెలయుపదంబులు, దరువులు లీలలు ధవళంబులు మంగళహారతులు శోభనంబులు, ఉయ్యాలజోలలు, దక్కులతేకుపదంబులు, చందమామ సుద్దులు అష్టకంబులు ఏకపద ద్విపద చతుష్పద షట్పదాష్టపదులు నవి యాదిగాగలవన్నియు లయప్రమాణంబుల నొప్పి మృదు మధుర వచన రచనల ప్రసిద్ధంబైనయవి మధుర కవిత్వంబులు.

చిత్రకవిత్వంబన్నది—

పాదగోపనంబును, పద్యభ్రమకంబును, పాదభ్రమకంబును, అనులోమ విలోమ గతి పద్యంబులు, కందగీత కందద్వయ గర్భిత వృత్తంబులు.......... అష్టదళ, షోడశదళ, ద్వాత్రింశద్దళ పద్మబంధంబులు, చక్రాందోళికాచ్ఛత్రబంధంబులు...... కంకణ సర్వతోభద్ర కల్పిత కల్పవల్లరి నవి యాదిగా గలుగు బహువిధ రచనా చమత్కారంబులు చిత్రకవిత్వంబు.

విస్తర కవిత్వంబన్నది—

ఇష్టదేవతా ప్రార్థనంబును, కృతికర్త వంశావళియు, పుర గిరి మృగయా యాత్ర వన జలనిధి...... రణక్రీడ దిగ్విజయంబు నాదిగా గలుగు నష్టాదశ వర్ణనలు, అలంకారంబులు, రీతులు, శయ్యలు, వృత్తులు—పాకంబు లుత్ప్రేక్షలు, శ్లేషలు ధ్వనులు వ్యంగ్యబులు నివి యాదిగా గలుగు కావ్యలక్షణంబులు గలిగి పంచలక్షణ దశలక్షణంబులనొప్పి కథాసరణి వర్తిల్లుటంజేసి యది విస్తర కవిత్వంబన్నది మహాప్రబంధంబు.'[7]

---

6. ఈ సంప్రదాయము నన్నయనాటినుండి వచ్చుచున్నదే—భారతావతారిక 1—8 లో నిది గలదు. శ్రీనాథుడు నైషధమున (1—11) లో దీని ననుసరించియున్నాడు. ఇది నన్నయ కాలముననే యున్నట్లు తమిళభాషలో—'యాప్పిరంగళ్ కారికై' అను ప్రాచీన గ్రంథమువలన తెలియవచ్చుచున్నది. ఈ వివరములకు—చూడుడు. తెలుగు కవుల చరిత్ర—ఇంగ్లీషు ఉపోద్ఘాతము. క్రీ. శ. 1656 లో అప్పకవికాలమునుండి ఈ సంప్రదాయము మఱుగుపడి ఆశు బంధ గర్భ చిత్ర కవిత్వములని ప్రచారములోనికి వచ్చినది.

7. లక్షణదీపిక అముద్రితము. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. సంఖ్య డి. 1929. దీని నుండి క్రీ. శ. 1950 లో నా ఉదాహరణ వాఙ్మయ చరిత్రలో పై విషయమును పూర్తిగా ముద్రించి యున్నాను. కాని యిప్పుడు ఆ పుస్తక మలభ్యము. నేటి సాహితీ విమర్శకులలో నే యిద్దరు ముగ్గురో తప్ప ఈ విషయమును గుర్తించిన వారే లేరు—

పై వివరణమునుబట్టి ద్విపద మధురకవితా శాఖకు జెందినదని స్పష్టమగుచున్నది. ద్విపదయే కాదు. నేడు మనము దేశిగా పరిగణింపుచున్న పద వాఙ్మయమంతయు నీ మధుర కవితాశాఖయే యని నిర్ణీతమగుచున్నది. మఱియు దేశిమార్గ కవితా భేదములను సమన్వయించుచు సాహిత్యక్రమ పరిణా మానుకూలముగనున్న పై విభాగమెంతో, సము చితముగను, సహేతుకముగను, శాస్త్రీయమునై యున్నది.

వాస్తవికస్థితి యిట్లుండగా, ఈ శుద్ధదేశి—దేశివిభాగ మెట్లుత్పన్నమైనదని దురూహ్యముగ నున్నది. ఇక ఈ శుద్ధదేశిశాఖకు సంబంధించినవని యిచ్చిన కథలు—పదునేడు పదునెనిమిదవ శతాబ్దుల వాటివి. ఈ నాటికి పై సంప్రదాయమే లుప్తమై నందున నీ విభాగము కేవల మూహాజనితమవి నిరా ధారమని యెన్నదగినది.

## ద్విపద కావ్యములు : భాషావ్యాకరణ సంప్రదాయములు

పాల్కురికి సోమనాథుని బసవపురాణ పండితా రాధ్య చరిత్రములు[8] ప్రకటింపబడినతోడనే, అందలి కవిత్రయ విలక్షణ భాషాసంప్రదాయములు – తెలుగు భాషా చరిత్రమున నొక పరివర్తనము గల్పించినవి. భాషావేత్తలందఱును నేకగ్రీవముగా శివకవులభాష—ఆంధ్రభాషా పరిణామ చరిత్రమున నొక ముఖ్య ఘట్టమని గుర్తించిరి. వ్యాకరణ సంహితా సర్వస్వాది మహాగ్రంథములలో దీనినిగూర్చి విమర్శలు సాగినవి.[9]

ఇట్లున్నను—ప్రస్తుత గ్రంథమున 'ద్విపద కావ్యములు—భాషా సంప్రదాయములు' అను ప్రకర ణమే లేదు. ఇది యీ సిద్ధాంత వ్యాసమున నొక గొప్పలోపము. ఏవో కొన్ని వ్యాకరణ విశేషములను, 'సింహావలోకనము' అను శీర్షిక క్రింద జేర్చుట జరిగి నది. దీనినిబట్టి గ్రంథకర్త ప్రణాళికలో నీ ప్రకర ణము మొదటనుండి లేనేలేదని చెప్పవలసియున్నది.

ఒక్కభాషా విషయముననేగాక, తక్కిన విషయ ములలోను, ద్విపద వాఙ్మయమున పై రెండు గ్రంథ ములకుగల విశిష్టత యీ గ్రంథమూలమున నభి వ్యక్తము కాలేదు. వానిలో కొన్ని —

## జాతీయ సమైక్యత

బసవపురాణ పండితారాధ్య చరిత్రలలో తెలుగు దేశమునందలి శివభక్తుల చరిత్రలేకాక, తమిళదేశము నందలి అరువతుమువ్వురునయనారుల కథలను, కన్నడదేశమునందలి బసవన మొదలగు మహాభక్తుల కథలును ప్రపంచింపబడుటచేత నవి ప్రథమముగా దక్షిణభారతదేశమున, తెలుగుల, తమిళుల, కన్నడుల జాతీయ సమైక్యతాభావమును నిరూపించినవి.

## భాషాసమైక్యత

దక్షిణదేశమున, శ్రీశైలక్షేత్రమునకు శివ రాత్రికి తెలుగు, తమిళ, కన్నడ, మహారాష్ట్ర దేశ ములనుండియేగాక ఉత్తరహిందూస్థానమునుండి శివ భక్తులు వచ్చెడివారు. పాల్కురికి సోమనాథుడు పండితా రాధ్య చరిత్రలో తమిళ, కన్నడ, ఆరె (మహారాష్ట్ర), సంస్కృతభాషలలో వారెట్లు సంభాషణ నెఱపి నదియు, శివుని స్తుతించినదియు నాయాభాషలలోనే వ్రాసి తెలుగున భాషాసమైక్యతను మొదట ప్రపంచించియున్నాడు.[10] పండితారాధ్య చరిత్రమునుబట్టి సంస్కృతభాషకూడ ఆ కాలమున నిత్యవ్యవహారములో నున్నట్లు తెలియుచున్నది. క్రీ. శ. 778 లో ఉద్యోతన మహాకవి, ప్రాకృతభాషలో, 'కువలయమాల' అను కావ్యమును వ్రాసి—అందు పదునెనిమిది భాషల ప్రసక్తి తెచ్చియున్నాడు. దీనివెనుక దేశభాషలలోగాని

---

8. ఈ రెండు గ్రంథములను, విపులపీఠిక లతో ప్రకటింపజేసి కవితావిశేషములతోపాటు, భాషా విశేషములను నలువదేండ్ల క్రిందట పండితలోకము దృష్టికి తెచ్చిన కీర్తి ఆంధ్రగ్రంథమాలవారిది. ఇప్పటికిని నీ భాషనుగూర్చి కూలంకషముగా వ్యాసం గము జరుగనేలేదు.

9. బసవపురాణ ప్రయోగాల సమర్థన—ఆంధ్రపత్రిక వికారి సంవత్సరాది సంచిక.

10. దీని ననుసరించియే నేను కన్నడాంధ్ర ముల పరస్పర ప్రభావమునుగూర్చి, ఒక ప్రత్యేక గ్రంథము వ్రాసి, యీ రెండింటికిగల సన్నిహిత సంబంధము విశదపఱచితిని.

సంస్కృతమునగాని ఇతర దేశభాషల ప్రపక్తి తెచ్చిన కావ్యము పండితారాధ్య చరిత్ర తప్ప వేఱొకటిలేదు.

## వి జ్ఞా న స ర్వ స్వ ము

ఈనాడు ప్రచురమగుచున్న, విజ్ఞానకోశ, విజ్ఞాన సర్వస్వములకు నాంది గావించినది పండితారాధ్య చరిత్రమే. అది తెలుగువారి తొలి విజ్ఞాన సర్వస్వము[11]. దీనివలన నీ ద్విపదకృతులను, కేవలము తెలుగు సాహితీ పరిణామదృష్టితోనేగాక భారతీయ సాహిత్య దృష్టితో పరిశీలింపవలెనని స్పష్టమగుచున్నది.

## ద్విపదచ్ఛందో విశేషములు

'ద్విపద చ్ఛందస్సు పాల్కురికి సోమనాథుడే సృష్టించెనని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు 'సోమన సృష్టించిన ఛందస్సు' అను వ్యాసమునందు వ్రాసిరి...... కాని సోమనాథునికి చాల పూర్వకాలమునుండియే తెలుగున కలదని నిరూపింపవచ్చును.' పుట 36). 'సోమన సృష్టించిన ఛందస్సు' అనగా సోమనాథుడంతకు ముందున్న ద్విపదచ్ఛందస్సులో కొన్ని ప్రత్యేక లక్షణముల నేర్పఱచి ఆ ఛందస్సున నొక నూతన మార్గమునకు సృష్టికర్తయయ్యెనని యర్థమేకాని ద్విపద యంతకుముందు లేదను నర్థముకాదు. కవిత్రయములో ఎఱ్ఱన, తిక్కననుగూర్చి చెప్పుచు 'తను కావించిన సృష్టితక్కొరులచేతంగాదునా' అని ప్రశంసించినాడు. అప్పుడు తిక్కనకన్న ముందు కావ్యములే లేవని, తిక్కనయే మొదట కావ్యసృష్టి చేసెనని యర్థమా ?

## ద్విపది—ద్విపద

ఇందీ శబ్దములను గూర్చిన విచారణ సరిగా చేయబడ లేదు. సంస్కృత నిఘంటువులలో బుక్కున కర్థమయినప్పుడు 'ద్విపద' అనియు, మాత్రాచ్ఛందో విశేషమగునపుడు 'ద్విపది' అనియు కలదు.

'ద్విపదా(స్త్రీ ద్వాపాదావస్యాః పాదస్యాన్త్యలోపః టాది భత్వాత్పదాదేశః – బుగ్విశేషే—ఛందోభేదే—జీప్ – ద్విపదీ' (శబ్దస్తోమ మహానిధి)

ద్విపదా—(స్త్రీ బుగ్విశేషేద్వౌపాదస్యాః సంఖ్యా పూర్వస్యేతి పాదస్యాన్త్య లోపః టాబృచీతి టాపి పాదఃపత్.

ద్విపదీ—(స్త్రీ—మాత్రా వృత్తాంతరే: ఆదౌ షట్కలోసంగత మేత త్తదను పంచచతుష్కలశ్చ గుర్వంతమ్ ద్విపదీ భవతీహ వింశత్యష్టకలందలమ్.

(శబ్దార్థ చింతామణి)

పై సంప్రదాయము ననుసరించియే విన్నకోట పెద్దన ద్విపది యని వాడియుండును. పాల్కురికి సోమనాథుడు దీని నెఱిగియుండియు తెలుగు ద్విపదను, వేదముతో సమానప్రతిపత్తి గడింపదలచినవాడు. గావున – ద్విపదిని విడచి – ద్విపద శబ్దమునే నిర్ధారించియున్నాడు. ద్విపది మాత్రాచ్ఛందో విశేషము గావున—నీ ద్విసంప్రదాయములను సోమనాథుడు సమ్మేళనము చేసినాడని చెప్పనగును.

సోమనాథుడు ద్విపదను, అటు మహాకావ్యోపయోగియగు భాషగాను, ఇటు గేయరూపముతో పాటగా పాడదగినట్లుగాను ఎట్లు దిద్దితీర్చెనో, ఆ వివరణ మిందులేదు.

'అరుదగు దాసయ్య యఱువత్తుమువుర
చరితంబులును శ్రీ బసవపురాణంబు
నేలలు వెట్టుచు నింపు సొంపార
కైలిమై(గాలుచు చదివెడివారు.'

పర్వత ప్రకరణము పుట 433.

బసవపురాణమును ఏలలు వెట్టుచు చదువుట యెట్టిదో యిందు తెలుపబడలేదు. ఈ విషయము వేఱొకచో తెలుపబడినది.[12]

## ద్విపద వాఙ్మయ పరిణామము

తెలుగున ద్విపద వాఙ్మయమునకు హేతుభూతమైన వీరశైవ మత సంప్రదాయములను గూర్చి గాని, మత సాహిత్యములకుగల యవినాభావ సంబంధమును గూర్చిగాని గ్రంథకర్తకు నిశ్చితాభిప్రాయములు లేకపోవుటచేత — ఈ ప్రకరణమునందలి విషయము లసంగతములైనవి. ఉదాహరణ కీ క్రింది వాక్యము చూడుడు.

---

11. చూడుడు—పరిశోధన – పాల్కురికి సోమనాథ సంచిక—శ్రీ తిమ్మావఝల కోదండరామయ్య.

12. చూడుడు కిన్నెర జాన్యువరి 1955 పత్రిక— జానపదగేయ వాఙ్మయము.

'శైవమతానుయాయులలో పాశుపతులు, కాపాలికులు, కాలాముఖులు, గోరక్షనాథులు — రాసేశ్వరులు మున్నగు తెగలు తర్వాత నేర్పడినవి.' వీనిలో పాశుపతులు, తర్వాత ఏర్పడుట యేమి? శైవమున పాశుపత సంప్రదాయ మతి ప్రాచీనమైనది. ఈనాటికి ఆరాధ్యశైవము, పాశుపత సంప్రదాయమే. కాపాలికులు, కాలాముఖులు, వామాచారము లేక తాంత్రిక సంప్రదాయమునకు జెందినవారు. ఇక 'గోరక్ష నాథులు' అనునది శైవములో వేఱు తెగకాదు. అది నవనాథసిద్ధ సంప్రదాయమునకు చెందినది. గోరకుడు నవనాథ సిద్ధులలో నొకడు. నాథ పదీయ లేక సిద్ధ సంప్రదాయము. ఇక్లే రాసేశ్వరులు—అనగా రసవాదులు. వీరిది సిద్ధసంప్రదాయమే— రసవాదసిద్ధులని పేరు. పై వివరణనుబట్టి, ఒక్క పాశుపత సంప్రదాయము తక్క తక్కినవి భక్తి ప్రధానమైన వీరశైవముతో సంబంధములేదని తెలియవలెను.[13]

## వ ర్గీ క ర ణ ము

వీరశైవమత సంప్రదాయము లవగాహన కాక పోవుట నీ గ్రంథమున వర్గీకరణ విధానము తప్పినది. కేవలము మతప్రాధాన్యముగల, ఈ ద్విపద వాఙ్మయమును నీ క్రింది విధముగ విభజించుట సరికాదు.

1. పౌరాణికములు 2. కావ్యప్రబంధములు 3. క్షేత్ర మహాత్మ్యములు 4 భక్తి ప్రబోధకములు 5. చారిత్రకములు 6. వంశకీర్తనలు 7. కల్యాణాత్మకములు 8. వ్రతమహాత్మ్యములు 9. తాత్త్వికములు 10. చిత్రాఖ్యానములు.

మత ప్రాధాన్యము ననుసరించి పై రెండు ప్రకరణములను నీ క్రింది రీతిని విభజింపవలెను.

## పరిణామ ప్రకరణము

1. మతము — సాహిత్యము.

శైవమతము— ద్విపద కావ్యోత్పత్తి.

## వ ర్గీ క ర ణ ము

1. శైవము 2. వైష్ణవము 3. అద్వైతము 4. నాథపదీయము. ఇట్లు విభజించిన పైవర్గీకరణములలోని 2. క్షేత్రమాహాత్మ్యములు 4. భక్తి ప్రబోధకములు 8. వ్రతమహాత్మ్యములు 9. తాత్త్వికములు పై నాల్గింటిలో నంతర్గతములగును. ఆపైని లౌకిక సాహిత్యమునకు జెందిన పురాణ ఉపాఖ్యానములు చారిత్రకములు ప్రకీర్ణములు అను విభజన చేయనగును.

## ద్విపద కవిత్రయము

కావ్య వాఙ్మయమున కవిత్రయమువలె ద్విపద వాఙ్మయమున కవిత్రయమున్న సంగతి గ్రంథకర్తకు గుర్తులేక పోవుటచేత, నీ ప్రకరణములలో చర్విత చర్వణముగా చెప్పిన వానినే తిరిగి చెప్పవలసి వచ్చినది. ద్విపద కవిత్రయము ముగ్వురు.

## పాల్కురికి సోమనాథుడు

సోమనాథుడు ద్విపద చ్ఛందోరచనకేకాక, తరువాత తెలుగున వెలసిన, వీరశైవ వాఙ్మయమునకంతటికి సృష్టికర్త. ఆతడు తన గ్రంథములలో సంగ్రహముగా ప్రపంచిన విషయములను నావెనుకటివారు విపులీకరించిరి. ద్విపద కవిత్రయమున— ఆద్యుడు - యాజ్యుడుకూడ సోమనాథుడే.

## తాళ్లపాక చిన్నన్న

ద్విపద కావ్య చక్రవర్తులగు తాళ్లపాకవారు వైష్ణవమును ద్విపద మూలమున వ్యాప్తి జెందించిరి. వారిలో చిన్నన్న సోమనాథుని వెనుక ద్విపద చ్ఛందస్సులో ప్రత్యేక లక్షణముల నేర్పఱిచిన మహాకవి[14]. దినమునకు వేయి ద్విపదలు చెప్పగలదిట్టు.

## కట్టా వరదరాజు

వైష్ణవ మతానుయాయియైన వరదరాజు రామాయణము, తెలుగున ద్విపద రామాయణము

---

13. దీనినిబట్టి గౌరన నవనాథ చరిత్ర శైవ పౌరాణికశాఖలో చేర్చుట యనుచితము.

14. చిన్నన్న ద్విపద లక్షణములు— 'ద్విపద చ్ఛందో విశేషములు' అను ప్రకరణముననే గ్రంథకర్త చెప్పవలసియుండెను. అట్లుగాక, ఆ విషయమును 'ద్విపద వాఙ్మయ పరిణామమున' (పుట 89) దానిని చెప్పుటచేత, అది అస్థాన పతితమైనది.

లన్నింటికన్న పెద్దది. సంఖ్యా పరిగణమున తెలుగు ద్విపద కావ్యములలో రెండవది.

ఒక శాఖా వాఙ్మయము ఉత్పత్తి వికాసమును గూర్చి, రచన చేయుచున్నప్పుడు తత్కర్తకు సమగ్ర దృష్టియుండుట యావశ్యకము.

ఇక కొన్ని గ్రంథములను గూర్చి. —

## శివ రహస్యఖండము

పుట 137. 'శివరహస్య ఖండమును వంకాయలపాటి వీరభద్రకవి, కోడూరి వెంకటాచలపతి, ముదిగొండ బ్రహ్మయలింగారాధ్యులు – అనువారు పద్య కావ్యములుగా రచించినారు. వీనిలో ముదిగొండ బ్రహ్మయలింగారాధ్యుల శివరహస్యఖండము మాత్రము ముద్రితము.'

శివరహస్యఖండ కృతికర్త కోడూరి వెంకటాచలకవిగాని వెంకటాచలపతి కాడు. ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యులకృతి వచనము కాని పద్య కావ్య మెంతమాత్రముగాదు[15]. కోడూరి వెంకటాచల కవి ('ఆశ్వాసాంతగద్యలో' బాలసరస్వతీ నామాంక వేంకటాచల నామధేయ' అని కలదు) శివరహస్య ఖండము 28 ఆశ్వాసముల మహాగ్రంథము. లోకారాధ్యులు కొడిమేల రాజలింగారాధ్యులవారిచే, స్వకీయ శైవప్రచారిణీ ముద్రాక్షరశాలయందు వరంగలులో క్రీ. శ. 1931 లో ముద్రితమైనది.

## మార్కండేయ పురాణము

'మార్కండేయమునిచరిత్రమును మార్కండేయ పురాణము' అనుపేర 8 ఆశ్వాసముల ద్విపద గ్రంథముగా పర్వతమంత్రి లింగన రచించినాడు'......

పర్వతమంత్రిలింగన రచితమగు 'వీరమాహేశ్వరాచార సంగ్రహము' అను ద్విపద గ్రంథము సప్తమాశ్వాసమునందు మార్కండేయ మునిచరిత్రము సంగ్రహముగా కలదు. దానినే లింగకవి ప్రపంచించి 8 ఆశ్వాసములుగా రచించినాడు.'

లింగకవి రచించిన 'మార్కండేయ పురాణము' అను 8 ఆశ్వాసముల గ్రంథమే లేదు.[16]

'అనుచు మార్కండేయ మునిపురాణమున
మునినాథుడగు సూతమునియు మార్కండ
మునివల్లభు చరిత్ర మునుల కందఱకు
వినజెప్పె.......................................
.....................................................
లీల పర్వతమంత్రి లింగనామాత్య
ధారుణి నాచంద్ర తారకంబుగను
శ్రీ రమ్యమై సర్వ సంసేవ్యమగుచు
వీరమాహేశ్వరాచార సంగ్రహము
నందు మార్కండేయు డను మునిచరిత
నందమై తగ సప్తమాశ్వాసమయ్యె.

మూలగ్రంథమున స్పష్టముగా మార్కండేయ పురాణము '8 ఆశ్వాసము' అని తెలుపగా, ఈ గ్రంథకర్త 8 ఆశ్వాసముల గ్రంథముగా భావించి, రెండు చోట్లను తప్పుగా వ్రాసినాడు. ఇది పది యాశ్వాసముల గ్రంథము. 1. విభూతి మహిమ 2. రుద్రాక్ష మహిమ 3. పంచాక్షరి మహిమ 4. హరనామ మహిమ 5. శివరాత్రి మహిమ 6. శంఖచక్రోత్పత్తి 7. విష్ణుశాప విమోచనము 8. మార్కండేయ చరిత్ర 9. శరభేంద్ర మహిమ 10. వ్యాసశిక్ష—ఈ శీర్షికలను బట్టి మార్కండేయ చరిత్ర 8 వ ఆశ్వాసమే.

పై వివరణమునుబట్టి యిది ఒక పెద్ద గ్రంథములో ఒక భాగముకాగా గ్రంథకర్త దీనిని ప్రత్యేక గ్రంథముగా[17] పరిగణించుట సరికాదు. వీరమాహేశ్వరాచార సంగ్రహము వివరము తీ గ్రంథమున 309, 310 పుటలలో గలవు. వానిని గ్రంథకర్త సమన్వయము చేయలేదు.

ఇట్లే యందలి 'రుద్రాక్ష మహిమ' అను ద్వితీయాశ్వాసమును—ప్రత్యేక గ్రంథముగా పరిగణించియున్నాడు.[18]

---

15. చూ. ఆంధ్రవచన వాఙ్మయము, పుటలు 86—89.

16. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము—ఆర్ 630.

17. చూ. జాబితా—145. మార్కండేయ పురాణము (అము) పర్వత మంత్రి లింగన.

18. ,, ,, 176 రుద్రాక్ష మాహాత్మ్యము (అము) పర్వత మంత్రి లింగన.

ఈ రుద్రాక్ష మాహాత్మ్యముయొక్క వ్రాత ప్రతి చివరభాగమును చూడుడు.

ఖండేందుధరభక్తి కామ్యాంతరంగ
శివకృపాంచితగాత్ర శ్రీవత్సగోత్ర
ప్రవిమల నిగమోక్త భవ్యచారిత్ర
..........................................
శ్రీలపర్వతమంత్రి లింగనామాత్య
విరచితముగ సర్వవేదోక్తమగుచు
శ్రీకరమై సర్వసేవ్యమై యొప్పు
వీరమాహేశ్వరాచారసంగ్రహము
నందులో నొప్పు రుద్రాక్షమాహాత్మ్య
మందమై యొప్పును నఖిలలోకముల
ధరణిని నాచంద్రతారకంబుగను'

పై పంక్తులనుబట్టి రుద్రాక్షమహాత్మ్యము ప్రత్యేక గ్రంథముగాక, వీరమాహేశ్వరాచార సంగ్రహములోని భాగమే యని విస్పష్టమగుచున్నది. పైని వివరించిన గ్రంథాశ్వాస విభజనమునుబట్టి యిది అందు ద్వితీయాశ్వాసము. ఇక నీ గ్రంథము పూర్తిగా అముద్రితమనుటకు వీలులేదు. క్రీ. శ. 1885 లో ముద్రితమైన యొక శైవసంకలన గ్రంథమున నిందలి సగము భాగము మొదటి యైదాశ్వాసములు ముద్రితములైనవి. అందు రుద్రాక్షమాహాత్మ్యము ద్వితీయశ్వాసనమనియేకలదు. దీనినిబట్టి, మార్కండేయ పురాణము, రుద్రాక్షమహాత్మ్యము గ్రంథాంతర్భాగములే కాని వేఱువేఱు గ్రంథములు కావని నిశ్చయింపవచ్చును.

## రఘునాథనాయకుని నలచరిత్ర

మూలగ్రంథములను చూడక, ఒకరు వ్రాసిన వ్రాతపై నాధారపడినచో, నెట్టి పొరపాట్లు కలుగునో నిరూపించుటకు పై గ్రంథము చాలును.

'దాక్షిణాంధ్ర యుగ వాఙ్మయచరిత్ర ప్రథమ భాగమున (పుట 65 లో) డాక్టరు కె. వి. ఆర్ నరసింహముగారు [19] ఎవరిచేత రచింపబడినదీ తెలియని ఒక ద్విపద నలచరిత్రను పురస్కరించుకొని యిట్లు వ్రాసియున్నారు.

'రఘునాథ నాయకుని యితర కృతులగు వాల్మీకిచరిత్ర రామాయణము మున్నగు వానిలో సాధారణముగ గన్పించు సంగీత సాహిత్యాభిమానము, శృంగారము, హాస్యచతురత ఈ నలచరిత్ర ద్విపదయందు లేకుండుటచే నిది రఘునాథనాయకుని కృతమేనా అని కొందరు శంకించిరి. రఘునాథ రాయలు [20] నలచరిత్రను వ్రాసినమాట నిజమే కాని యీ గ్రంథ మిదియేయని నిరూపించుట కాధారములు చాలతక్కువ.'

డాక్టరు గారింతకుముందు - రఘునాథనాయకుని నలచరిత్ర [21] 'ఆంధ్రభాషోల్లాసిని'లో కొంత భాగము ప్రకటితమైనదని-తాము చూచిన గ్రంథము 8 ఆశ్వాసములున్న పూర్తి ముద్రణగ్రంథమని వ్రాసి యున్నారు. దీనినిబట్టి డాక్టరుగారు రఘునాథ నలచరిత్ర చూడలేదనియు, తాము చూచినది ఆతడు వ్రాసినదేయనుట సరికాదని వారి యభిప్రాయమని స్పష్టమగుచున్నది.

పై దాని ననుసరించి ప్రస్తుత గ్రంథకర్త ఎట్లు వ్రాసెనో చూడుడు. 'దక్షిణాంధ్రయుగ సారస్వత లక్షణములైన భాషాసౌలభ్యము కథాకథనము నందలి దృష్టియు నీ నలచరిత్ర ద్విపదయందు సంపూర్ణముగనున్నవి. పైగా నిది కరుణరసోపేతమగు కావ్యమగుటచే శృంగార రసపోషకములగు వర్ణనలు మిక్కుటముగా నుండుట కవకాశమేలేదు. కనుక ఈ ద్విపద నలచరిత్ర రఘునాథనాయకుని రచితమే యని విశ్వసింపవచ్చును'. (పుట 197).

పై విషయాలనుబట్టి డాక్టరు లామనరసింహముగారుగాని ప్రస్తుత గ్రంథకర్తగాని రఘునాథనాయకుని నలచరిత్ర ద్విపదను చూడకుండగనే దానినిగూర్చి వ్రాసిరనుట విస్పష్టము. వారి తెలివిడికొఱకు రఘునాథ నాయకుని ద్విపద నలచరిత్రను గూర్చి తెలుపుచున్నాను.

---

19 వీరు ఆంధ్రవిశ్వవిద్యాలయములో తెలుగు శాఖకు అధ్యక్షులు.

20 రఘునాథనాయకుడుగాని రఘునాథరాయలు కాదు.

21 పత్రికపేరు – 'ఆంధ్రభాషావిలాసిని' గాని ఆంధ్రభాషోల్లాసిని కాదు.

## ద్విపద నలచరిత్ర

రఘునాథ నాయకుని ద్విపద నలచరిత్ర క్రి. శ. 1929 లో చిత్రాడ రామవిలాస ముద్రాక్షరశాలలో ముద్రితమైనది. డెమ్మీ సైజున 120 పుటలలో నున్నది. ద్విపదలు చిన్నయక్షరములతో నొకే పాద ముగా ముద్రితములైనవి. గ్రంథమునగల ఎనిమిది ఆశ్వాసములలో, ఎనిమిదవ యాశ్వాసము చివర కొంత భాగము మూలతాళపత్రప్రతిలో ఖిలమగుటచే, నిందును అట్లే ముద్రితము. కాని కథలో చాలా భాగము నించుమించుగా పూర్తియగుటకు స్వల్పభాగమే లుప్త మగుటచేత, నిది పూర్తిగా నున్నదనియే చెప్పవచ్చును. ఇది రఘునాథ నాయకుని రచనయే యని నిస్సందేహ ముగా నిరూపించుటకై అందు ప్రథమాశ్వాసాంత మునగల గద్య నీ క్రింద నిచ్చుచున్నాను.

ఇది రామచంద్ర మహిత దయాసాంద్ర
విదిత సౌహిత్య నవీన సాహిత్య
చినచెవ్వయాచ్యుత క్షితిపాల తనయ
వినయాది శుభగుణ విభవ సనాథ
రఘునాథ భూపాల రమ్య వాగ్జాల
సంఘటిత నవరస స్ఫుట శబ్దమహిమ
దనరెడు నలచరిత్రమను ప్రబంధ
మునఁ బ్రథమాశ్వాసమును దగు శ్రీల.

ఇట్లే ఏడాశ్వాసముల యంతమందును గద్య లున్నవి. గ్రంథావతారికనుబట్టి రఘునాథుడు 'అచ్యుతా భ్యుదయము' అను ద్విపద కావ్యము రచించిన తరువా తనే నీ నలచరిత్రను రచించినట్లు తెలియుచున్నది[22]. గ్రంథము నలునికథ సంపూర్ణముగ తెలుపును.

### విడిచిపెట్టిన ద్విపదకావ్యములు

ఈ గ్రంథ మెంత యపరిశీలితముగా వ్రాయ బడినదో చూపుటకు నుదాహరణములు చూపుచున్నాను.

### 1. తత్త్వ చంద్రోదయము

'ఇది వేదాంతగ్రంథము. దీనిని ద్విపదలో రచించినవాడు ముమ్మడి మల్లనార్యుడు (1650 A D).' 'యేను బాల్యంబున సకలసిద్ధాంత సార సంగ్రహంబైన తత్త్వార్థంబుల తత్త్వచంద్రోదయం బనుకృద్విపద కావ్యంబు రచించి యా తత్త్వ చంద్రో దయమునకు జానకీనాథు నాథుగా నియోగించి సంత సిల్లితి' అని మల్లన తన శ్రీరామస్తవరాజ మను పద్య కావ్యావతారికలోని వాక్యము దీని కాధారము - గ్రంథము అలభ్యము' పుట 299.

ఇది యలభ్యముకాదు — అభ్యమే—

"శ్రీ లీల వైభవాంచితమైన యట్టి
భూలోకమందు జంబూద్వీపమందు —
అని ప్రారంభమై

.....................................

అని శేనుకొండ తిమ్మార్యప్రసాద
మున కొప్పురావూరి ముమ్మడి రాజు
గంగనామాత్యుడు కన్న పుత్రుండు
శృంగార నిధియైన కృష్ణమంత్రికిని
రఘుపతెమ్మకును గారాబుసుతుండు
అఘనాశమైన బ్రహ్మానంద పూర్ణ
మఖిల వైభవయోగి మల్లనయోగి
సహజ కోదండ దీక్షా గురుపేర

.....................................

పావనాకృతిపేర పరమాత్మపేర

......................

జానకీపతిపేర సదయాత్మపేర
శ్రీనిధానముపేర శ్రీరాముపేర
ధర నెంచగా నంకితము చేసినట్టి
సరసమౌ నీ'తత్త్వ చంద్రోదయంబు'
ఆ చక్రవాళాద్రి యంత పర్యంత
మా చంద్ర తారార్కమై యొప్పుగాత—

ద్వారకలో రుక్మిణి శ్రీకృష్ణుని వేదాంతము బోధింపు మనగా నాతడు బోధించిన విషయ మిందు గలదు. ఈతని శిష్యులు వ్రాసిన యీ క్రింది రెండు ద్విపద గ్రంథము లిందులేవు.

### 2. జ్ఞాన సూర్యోదయము

వేదాంత విషయికమైన నాలుగాశ్వాసముల ద్విపద కావ్యము. కృతికర్త ఢిల్లీ వెంకటకవి. ఈతడు తత్త్వ చంద్రోదయము, రామస్తవ రాజము మున్నగు వేదాంత గ్రంథములు రచించిన ముమ్మడి మల్లనార్యుని

22. దీనిని గూర్చిన సంపూర్ణ వివరములకు దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము, పుటలు 36—41 చూడుడు.

శిష్యుడు. కాబట్టి ఆతని కాలమువాడే. ఇది చాల పెద్ద గ్రంథము. ఇది

'శ్రీకరు మోక్షలక్ష్మి మనోహరు
ప్రాకట నిజపరబ్రహ్మావతారు' అని మొదలిడి,

..........................................

ఇది విన్న జదివిన నిష్టార్థసిద్ధి
కొదవక సిద్ధించు గురు కృపచేత

అని అంతమొందును.

'సతత ముమ్మడి రాజ సత్కుల ధీరు
ధృతి కృష్ణయారఘుపతెమ్మకుమారు
డగు మల్లనాచార్యు నాత్మ సుస్థైర్యు
నిగమోక్తి హృద్వీధి నిలిపి సేవించి'

అని గ్రంథ ప్రారంభమున నున్నది.

## 3. తత్త్వదీపికా ప్రబోధము

ఇది వేదాంత గ్రంథమే. మారేపల్లి వెంకట యోగి ప్రణీతము. ఈతడును మల్లనయోగి శిష్యుడే. గ్రంథాంతమున

అనుచు శ్రీ మల్లనాచార్య ప్రసాద
ఘనత మారేపల్లి కామార్య సుతుడు
స్తుతుడు వేంకటభట్టు సూనృతవ్రతుడు
అతని యిల్లాలు ధర్మాంబ వారలకు
గారాబు సుతుడు వెంకటయోగి వరుడు
సారత వెంకటాచలపతి పేర
నారూఢులెంచగా నంకింతంబైన
ధీరత నీ తత్త్వ దీపికా బోధ.

ఈ మూడు గ్రంథములును ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారము 77 వ సంఖ్యగల తాళ పత్రప్రతి యందున్నవి. (చూడుడు. పరిషత్పుస్తక భాండాగారము, ద్వితీయభాగము—పుటలు 34–38.)

పై మూడేకాక యింకను గ్రంథకర్త విడిచి పెట్టిన ద్విపద కృతులను వివరించుచున్నాము—

## 4. నాసికేత పురాణము

ఇది దక్షిణ దేశీయాంధ్ర సాహిత్యమునకు సంబంధించినది. తంజావూరియందు వెలసిన శ్రీ కృష్ణున కంకితముగా శృంగారకవి తిరుమలనాథకవిచే అనంతశెట్టి తిమ్మాశెట్టి అను మల్లుని ప్రేరణచే రచింపబడినది. నాలుగాశ్వాసముల కృతి. కథ దగ్గ పల్లి దుగ్గన నాసికేతూపాఖ్యానము నందలిదే. ఆ పద్య కృతియందు లుప్తమైన అశ్వాసములలో కథ యిందు కలదు. 23

## 5. కపిల చరిత్రము

దీనిని రచించిన కవి చెన్నయ. ముష్టిపాల గోత్రుడు. పాటూరి తిమ్మాంబ, అనంతయ్యల పుత్రుడు. ఇది వేదాంతవిషయికము. భాగవతము నందలి కపిల దేవహూతి సంవాదము దీనికిమూలము. 24

## 6. మాతపురాణము.

మాతపురాణము, శక్తి కథలలోనిది. దీనిని రచించినవాడు బడబాగ్ని రామచంద్రుడు లేక బడ బాగ్నిభట్టు.

మొదలు

శ్రీరామచంద్రుండు శ్రీకరంబుగను
వారిల నుండెడివారల దలతు
ముదముతో శ్రీలక్ష్మి యా లోకమాత
(ముల్లోకమాత)
మోదంబుతో నంత మునిదత్తు దలతు
వినుతి కెక్కిన యట్టి వీరశైవులకు
మతు లనగించి సమర్థించినట్టి
కత విన్నవించెద క్రమమెల్ల దెలియ.

వినిపింతు వీనుల విందులుగాను
రక్షించు శ్రీమాత రమణి చరిత్ర
ఆ కథా వృత్తాంత మది యెట్టిదనిన
చేకొని బడబాగ్ని రామచంద్రుండు
చెప్పదొడంగెను శాశ్వతంబుగను'

'ఒరుగల్లు పట్నంబు వొప్పునిలలోన' అని యుండుటయేగాక ఏకవీరా కాకతిశక్తి కథలుండుట చేత నిది కాకతీయ చరిత్రకు సంబంధించిన కథ.

---

23 చూడుడు. దక్షిణదేశ యాంధ్ర వాఙ్మయము. పుట 291.

24. ఆంధ్ర సాహిత్యపరిషత్తు. అముద్రిత గ్రంథ సంఖ్య.

గొల్లలు, పిచ్చుకుంట్లు పాడుటచేత రచన బహు వికారములను పొందినది.[25]

## 7. మాపురమ్మ కథ

మాపురమ్మ కథ యనగా మాహురమ్మ కథ. ఇదియును పైదానివలెనే శక్తి కథలలో చేరినది. ఈ మాహురమ్మ ప్రశంస క్రీడాభిరామమున గలదు. ఇది ఎవరిచే రచింపబడెనో తెలియరాదు.

"శ్రీ రాజాధిరాజు గిరిరాజు
కలునందికలుబెంక గలిగినరాజు
కలనవోయిన భవులు కలిగినరాజు
రామకుంభిణి రక్తకుంభిణి
కలన కుంభి గజకుంభి
ఏకచ్ఛత్రంబుగా భోగావతి యేలినరాజు
అటువంటి రాజుకు అవని కులాంగి
అతి పుణ్యశాలి జమిలిదేవికి పుత్ర
సంతానమె కాని'
వ్రాత చాలా దోష భయిష్ఠము.[26]

## 8. సత్యభామావిజయము

ఈ గ్రంథ మలభ్యమని జాబితా 9 వ పుటలో నిట్లు వ్రాయబడియున్నది.

'215. సత్యభామావిజయము (అల) ఘట్టు ప్రభువు'. ఇది లభ్యమే.

సత్యభామ నరకాసురునితో యుద్ధము చేసి జయించిన కథను మూడాశ్వాసముల ద్విపద కావ్యముగా ఘట్టు ప్రభువు రచించియున్నాడు. ఈ గ్రంథము నితడు భానుముక్కల విశ్వేశున కంకితముగా, నా పురవాసి నాళ్లగట్టు ఎల్లయామాత్యుని ప్రేరణమున రచించియున్నాడు. ఇందు ఎల్లయామాత్యునివంశము విస్తారముగా వర్ణితమైనది.

మొదలు

"శ్రీగిరిజావధూ చిత్తసంచారు
భోగికులాధీశ భూషణోదారు
..............................
మల్లికార్జునదేవు మదిసన్నుతింః

కృతిప్రేరకుడగు ఎల్లయామాత కవిని గూర్చి చెప్పియున్నాడు.

"కరమును రాణించు ఘట్టువంశమున
పరసుడవయ్య శేషకవీంద్ర నీవు
కావున నొక్క ప్రఖ్యాతకావ్యంబు
విశ్వరక్షకుడగు విశ్వేశ్వరునకు
నంకితంబుగ జేయుమనిన నమ్మంత్రి
వంశంబు వర్ణింతు"

గ్రంథాంత గద్య

ఇది భ్రమరాంబా సమిద్ధప్రసాద
విదిత సారస్వత విఖ్యాతఘట్టు
వీరసత్పుత్ర నవీనసాహిత్య
సారాభిలాష శేషకవీంద్ర భవ్య
శేముషీరచితమై చెలువగు సత్య
భామావిజయమని ప్రఖ్యాతిగాంచి
యనుపమంబైన మహాప్రబంధమున
ననఘమై ఖరి తృతీయాశ్వాసమయ్యె
చెలువుమీఱగ లిఖించి పఠించినను
జనులకు సంపదల్ సకలపొందికలు
వనజనేత్రుం డపవర్గంబు నొసగు

కృతిపతి ఎల్లయామాత్యుడు కృతికర్త ఘట్టుప్రభువువలె యాజ్ఞవల్క్య శాఖీయుడు. కృతిపతి వంశములో పెదలింగరాజు శ్రీశైలమార్గమున వనము నాటించి, బావి త్రవ్వించెనను కొన్ని చారిత్రక విషయమున లీ వంశవర్ణనమునుండి తెలియుచున్నవి.[27]

## 9, కన్యకాపురాణము

వైశ్యపురాణమునకే కన్యకాపురాణము అని నామాంతరము. ఈ కన్యకాపురాణము రచించిన కవి కంభగిరి నివాసి కొండమడుగు పుల్లయికవి (పురుషోత్తమ కవి)[28]. ఈతడు సానందగణేశ్వరమను పద్య

---

25. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము సంఖ్య R 693.

26. సంఖ్య R 694.

27. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము, 4వ సంపుటము ఆర్. 871.

దీనినిగూర్చి ఈ సంపుటమున 2012 మొదలు 2020 వఱకును 9 పుటల వివరణము కలదు.

28. ఇందే ఆర్ సంఖ్య 885.

౦వ్యము రచించియున్నాడు. "కవిగంధ సింధురము" అను బిరుద మీతనికి గలదు. ఇది మూడాశ్వాసముల కృతి.

మొదలు

శ్రీమన్మహీజ రంజిత దివ్యతేజ
మామోదముగ వక్షమందు నధ్యక్ష
లీలాప్తిగా గౌగలించి సద్యోగ
పాలకుండగు ధాటి పరగినమేటి
..........................

గద్య

శ్రీ కంభగిరి నారసింహాంఘ్రిపద్మ
సాకల్యసేవా విచక్షణాక్షీణ
మహనీయమతి కొండమదుగు సద్వంశ
విహితసంభవ కళాన్విత గిర్యపార్య
మణి సతి వెంగమాంబా గర్భశుక్తి
మణి పుల్లకవి సుధామయ చాకచక్య
వాక్య వైఖరులచే..............
..........................
తతలీల నాచంద్ర తారార్కమగుచు
నతులితంబుగ తృతీయశ్వాసమయ్యె.

## 10. బిల్హణోపాఖ్యానము

బిల్హాణీయము లేక యామినీపూర్ణ తిలకా విలాసము అను నీ ద్విపదకృతిని రచించిన కవి అరుణాచలము.[29] ఇతడు కాశ్యపగోత్రుడు. సుబ్బమాంబానారనలపుత్రుడు.

మొదలు

'శ్రీమించు రఘుకుల క్షీరాబ్ధిసోము
సోమసమానుని సుందరాకారు
కారుణ్యఘనమూర్తి కరుణావిహారు
హారరాజితవక్షు నహివైరివాహు
వాహినీ భరణ దుర్వార సుబాహు
బాహు గర్వ వినాశ భవ్య ప్రతాపు.

కవివిషయము

నారాయణాఖ్యచే (నలరినవాడు)
..........................
వరుస కల్వలపల్లి వారిధి సోము
డరిగజకేసరియై యొప్పువాడు
నగునట్టి పుణ్యాత్మునకు జనియించి
అగణిత సమ్మతి హరిహర సేవ
ధరణిపై జేయుచు దనరినవాడ
గురుతర కాశ్యపగోత్రుడు జూడ
నరుణాచలాఖ్యచే నలరినవాడ'

గ్రంథ మసమగ్రముగా లభించినది.

## 11. బేతాళ పంచవింశతి

ప్రాచీనాంధ్ర వాఙ్మయమున 'బేతాళ పంచవింశతి' అను పద్యకావ్యము ప్రసిద్ధము. ఇది ద్విపదకృతి.

'శ్రీ సర్వ మంగళశ్రితభూమి యగుచు
నా సదాశివునకు నాలయంబైన
వారాణసీపుర (వర) మేలు విభుడు
వారిత రిపుడు...ప్రతాపశాలి
సూనాస్త్రు రతిబోలు సుందరి యతని
మానిని యొప్పు సోమ ప్రభ యనగ
మఱి కుమారుడు చంద్రమకు టాహ్వయుండు
నెఱి వసంతుని బోలు నిజరూపరేఖ
బుద్ధిమంతుడు మంత్రి పుత్రుల ఘనుడు
బుద్ధిశరీరాఖ్య బొలుపారువాడు
నరనాథ సుతుడొక్క నాడు నమ్మంత్రి
వరతనూజుని తోడ వనీభూముల కును
..........................
అని చెప్ప బేతాళు డాక్షణంబునను
జని శింశుపావృక్షశాఖతో ప్రేలె
వెలయ నీకథ పంచవింశతి లోన
నలరు ద్వితీయమై యభినుతంబగను.

ఇందిట్లున్నను దీనియందుగల వేఱుతాళపత్రములలో 2, 5, 6, 7, 8, 9 కథలు గలవు. గ్రంథ మసమగ్రము.[30] ఈ గ్రంథమున 387వ పుటలో నీయబడిన బేతాళ చరిత్రకన్న నిది వేఱైనది.

---

29. ఇందే ఆర్ సంఖ్య 1011.

ద్విపదగ్రంథముల జాబితా 115 సంఖ్యలో 'బిల్హణకథ' (అము) అని మాత్రమేగలదు.

30. తంజావూరి పుస్తకశాల సంఖ్య 824. రెండవ సంపుటము. సంపాదకుడు. వి. సుందరశర్మ.

## 12. సీతాకళ్యాణము

ఏ కవి కృతమో తెలియని సీతాకల్యాణ ద్విపద యొకటి లభ్యమగుచున్నది[31]. అందుండి కొన్నిపంక్తుల నుదాహరించుచున్నాను.

"వినవోయి దశరథ విపులాధిపేంద్ర
తనయుడ యగణితసద్గుణసాంద్ర
రవికులంబున బుట్టు రాజశేఖరులు
వివరులు చాల నభీష్టదాయకులు
.........................
జనపాల ధౌరేయ సత్పుత్రులైన
తనయుల నడసితి తథ్యంబుగాను
ఇలలోన నీభాగ్య మెట్టిదోగాని
తలచి చూడగ నీవు ధన్యుడౌ ధరను
అవనీశ విను మింక నమరంగనేను
సవగాను యాగంబుసేయ నేమించు
.........................
వరుసతోడుత స్వయంవరము జూడగను
నరుదెంచి హరువిల్లు నవలీల ద్రుంచి
ఎల్లరాజులు సన్నుతింపగ రాము
డల్లుడాయను ధన్యుడైతినినంచు.

పైవన్నియు ప్రాచీనములు. అముద్రితము. ఈ క్రిందివి నవీనములు ముద్రితములు.

## 13. మడుకత

మంజరీ ద్విపద. మంగిపూడి వెంకటశర్మ రచితము. క్రీ. శ. 1935 లో 'భారతి' పత్రికలో ప్రకటితము. మంచి రచన. ఒక హరిజన స్త్రీ సాహసగాధ యిందు వర్ణితము.

## 14. రతి విలాపము

ద్విపద. కళాప్రపూర్ణ త్రిపురాన సూర్య ప్రసాదరాయకవి రచితము. క్రీ. శ. 1940 లో భారతిలో ప్రకటితము.

## 15. వీరసింహుడు

మంజరి ద్విపద. కళాప్రపూర్ణ వఝ్ఝుల చిన సీతారామస్వామిశాస్త్రి విరచితము. ఇందు 1490 పంక్తులున్నవి. ఇందలి కథ ఆర్వీటి రామరాజునకు సంబంధించినది. కొంత కల్పితముకూడ కలదు. పండితకవి ప్రౌఢరచన.

## ద్విపద గ్రంథముల జాబితా

ఇందు 245 ద్విపద గ్రంథములున్నవి. గ్రంథములకు (అము) అముద్రితమని, (అల) అలభ్యములని సాంకేతికము లీయబడినవి. కొన్నిటి కేసాంకేతికములు లేవు. కొన్ని రెండు పేళ్లతో నున్నవి ఒకే గ్రంథముగా నున్నది. దీని నంతటిని విమర్శించుట కిట తావులేదు. స్థాలీపులాక న్యాయంగా కొన్నింటిని మాత్రమే విమర్శిస్తున్నాను.

1. అగుమంచికథ (అము). ఇది పరిశోధన పత్రిక 1955 ఫిబ్రవరి మొదలు నాలుగు సంచికలలో ముద్రితమైనది.

14. అధ్యాత్మ రామాయణము—మామిడమ్మ సుభద్రమ్మ. ఇది 1911 లో ముద్రితము. గ్రంథకర్త్రి మామిడిన్న సుభద్రమ్మ

28. కాటమరాజుకథ (అము). నందుల కాటమరాజు. క్రీ. శ. 1917 లో కృష్ణా ముద్రాక్షరశాలలో చెన్నపురిలో అచ్చయనది. పరిష్కర్త యం. సంజీవకవి.

35. కృష్ణకథామృతము—తురగా పురుషోత్తమకవి. ముద్రితము. 1907.

38. కృష్ణార్జున సంవాదము. నాదిండ్ల గోపన మంత్రి. దీనిని విపుల పీఠికలో వావిళ్లవారు క్రీ. శ. 1950 లో అచ్చువేసియున్నారు.

43. గణమాలిక (అము). వివరములు లేవు. ఇది పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర నుండి గ్రహింపబడిన సహస్రగణ మాలిక. ఇది 1895 లో ఏలూరిలో నొక శైవసంకలనమున ప్రకటితమైనది.

46. గోపికాంశుకాపహారము (అము). గ్రంథము ముద్రితమైన యెచ్చట నున్నది?

52. జాంబవతీ కల్యాణము (అల). కాళాధరకవి. కవి పేరు కళాధరుడు.

---

31. తంజావూరి పుస్తకశాల సంఖ్య 825.

65. దేవాంగపురాణము. (అము). భద్రకవి లింగన— ఇది 1879 లో చెన్నపురిలో ఆరాధ్యుల వీరేశలింగంగారిచే అచ్చువేయించబడినది.

73. నలచరిత్ర: రఘునాథ నాయకుడు. ముద్రణ— 1929.

74. నలచరిత్ర: చక్రపురి రాఘవాచార్యులు— ప్రథమ ముద్రణము 1841 American; Mission Press—Edited by C. P. Brown.

77. నలచరిత్ర: (అము). కాకర్లపూడి రాఘవాచార్యులు—ముద్రణ 1916.

83. నవనాథ చరిత్ర: గౌరన—ప్రథమ ముద్రణము—1842. Mission Press: Vepery-(Brown). B. M. C. 14174. K. 28.

88. పండితారాధ్య చరిత్ర: ప్రథమ ముద్రణము— 1909; శివధర్మేశ్వర రామలింగ ముద్రాక్షర శాల, వరంగలు.

ద్వితీయ ముద్రణము: పసపుల వాగయ: నిడుదవోలు సుందరము. విజయరామచంద్ర ముద్రాక్షరశాల, విశాఖపట్టణము 1914.

89. పతివ్రతా చరిత్ర: మద్రాసు. ప్రా. భా. నెం. 60. పరిశర్త. పరిష్కర్త ఎవరు?

90. పతివ్రతా చరిత్ర: (అము). కారాణ వైరాగ్య రావు, ముద్రితము 1909.

99. పుష్పహారము: కోదండరామయ్య—ముద్రితము 1913.

100. పెద్దబొబ్బిలి మహారాజుకథ (అము). కాడవారి చెంగల్వరాజు వీరయ్య.

ఇది అముద్రిత మనుటతప్పు. దీని ముద్రిత ప్రతి లండనులో బ్రిటిషు మ్యూజియములో నున్నది. చూడుడు. B. M. C. 14174 K. 51 (S) B. M. C. అనగా British Museum Library Catalogue.

108. బసవ పురాణము. పాల్కురికి సోమనాథుడు. మద్రాసు వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ 1952.

బసవ పురాణమును వేటూరి వారి విపుల పీఠికతో క్రీ. శ. 1929 లో ఆంధ్రగ్రంథ మాల వారు ప్రకటించియున్నారు. దానివలననే ఆ గ్రంథ విశిష్టత లోకమెఱిగినది. ఆ వెనుక ద్వితీయ ముద్రణము క్రీ. శ. 1952 లో ప్రస్తుత వ్యాసకర్త విపుల పీఠికతో ప్రకటిత మైనది. ఈ రెండింటిని పరిశోధకులు, విమర్శకులు చారిత్రకులు ప్రమాణముగా గైకొన్నారు. ప్రస్తుత గ్రంథకర్త వావిళ్ల ముద్రణము నుదాహరించుటచే, పై రెండింటిని చూచియుండలేదని స్పష్టము.

110. బాల భాగవతము (అము). దోనూరు కోనేరునాథకవి. ఇది అముద్రితము కాదు. అవతారిక తక్క తక్కిన గ్రంథమంతయు క్రీ. శ. 1914 లో మద్రాసులో కృష్ణా ముద్రాక్షర శాలలో ముద్రితమైనది.

114. బ్రహ్మోత్తర ఖండము – పిడుపర్తి బసవన. ఏ సాంకేతికము లేదు.

116. భక్తస్తవము (అము) పాల్కురికి సోమనాథుడు. ఇదే 'సోమనాథస్తవము' అను సంగతి తెలియక పోవుటచే గ్రంథకర్త వేఱుగానిచ్చినాడు. ఇదియును 1895 లో గణసహస్రమాలికతో ముద్రితమైనది.

118. భగవద్గీత (అము). వావిలికొలను సుబ్బారావు. ఇది ముద్రితము. చూడుడు – ఆంధ్రవాఙ్మయ సూచిక – ఆంధ్రగ్రంథమాల వారిది. 134 వ పుట.

127. భల్లాణ చరిత్ర: (అల) మేధాతిథిభట్టు— దీని కాకర మెక్కడ?

133. మనుచరిత్ర: (అము). పూండ్ల వెంకటరమణయ్య—ఇది ముద్రితము. క్రీ. శ. 1904 లో నెల్లూరి శ్రీ రంగనాయక ముద్రాశాలలో అచ్చైనది.

134. మనోబోధ (అము). కొలని గణపతిదేవుడు— ఇదీ ముద్రితమే. చూడుడు—Bulletin of the Government Oriental Manuscript Library, Madras 1950—పుటలు.

61–77, పరిష్కర్త. యస్. యస్. సుంద రేశ్వరరావు.

141. మాయాచిదానంద మంజరి (అము). నాదిండ్ల ఉమాపతి. ఇందే 49 వ సంఖ్యలో నిట్లున్నది. 49. చిదానంద మంజరి - (అము). ఉమాపతి. ఈ రెండును వేర్వేరు గ్రంథములా?

144. మార్కండేయ పురాణము ఎల్లకర నరసింహ కవి. అముద్రితమనిలేదు.

157. యోగీశ్వర విలాసము—(అము) సిద్ధేంద్ర యోగి—ఇది ముద్రితము.

Bulletin of the Government Oriental Manuscript Library, Madras. Vol. X No. (1957) 33 పుటలు. పరిష్కర్త – మల్లంపల్లి శరభయ్య.

168. రామాయణము—(అల) భోసల యేకోజీ—ఇది అలభ్యమా! లభ్యము—చూడుడు. ఇదే పుట 155.

191. విష్ణుమాయా విలాసము – (అము). కంకంటి నరసింహకవి. ఇది ముద్రితమే—క్రీ. శ. 1868 లో మద్రాసు విశ్వవిద్యాలయ ముద్రాక్షరశాలలో—

201. శశిరేఖాపరిణయము (లేక) అభిమన్యు కల్యాణము—శేషము చెన్ను భట్టారకుడు— అని ముద్రణ వివరణము తీయబడినవి. కాని ఈ గ్రంథము పేరు అభిమన్యు కల్యాణము గాని—శశిరేఖాపరిణయ మెంతమాత్రమును కాదు. ఇది అకారాదిక్రమమున 6 వ సంఖ్యగా నుండవలెను. చూ. ఇందే పుట – 241. ఇది క్రీ. శ. 1892 లో ముద్రితము.

212. శ్రీరంగ మాహాత్మ్యము : (అము). ముకుంద యోగి. ఇది ముద్రితమే. 1892. చెన్నపురి విద్యారత్నాకర ముద్రాక్షరశాల.

217. సర్వేశ్వర ద్విపద : (అము) పిండము అప్పల స్వామి—ఇది ముద్రితమే – 1912. చూ. ఆంధ్రవాఙ్మయ సూచిక– పుట 221.

220. సానందచరిత్ర : (అము). భద్రకవి లింగకవి. ఇది ముద్రితమే చూడుడు. ఇందే పుట 194; అథోజ్ఞాపిక.

222. సారంగధర చరిత్ర : (అము) బాణాల శంభు దాసుడు. ఇది ముద్రితమే. 1885 – ఏడు నూతుల ముత్తయ్యగారి శైవ సిద్ధాంత ముద్రాక్షరశాల, మద్రాసు.

223. సావిత్రీ చరిత్ర : (అము). ఎలమందరాజు. ఇది ముద్రితమే. 1913. చూడుడు, ఆంధ్ర వాఙ్మయ సూచిక, పుట 224.

224 సావిత్రీ చరిత్ర : ముప్పిరాల సుబ్బరాయకవి. ఏ సాంకేతికము లేదు.

231. సుజ్ఞానోపాఖ్యానము : (అము). తోటాకోటయ్య. ఇది ముద్రితమే. 1907. ఆంధ్రవాఙ్మయ సూచిక, 220 పుట.

238. సోమనాథస్తవము :(అము) పాల్కురికి సోమ నాథుడు.

ఇది మూడు పర్యాయములు ముద్రితమైనది.

1895. సంకలన గ్రంథము.

1930. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక.

1965. సోమనాథుని లఘుకృతులు.

---

[ద్విపద వాఙ్మయము; గ్రంథకర్త : డా॥ జి. నాగయ్య, ఎం. ఏ. పిహెచ్. డి., తిరుపతి వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి; వెల. 15–00.

ప్రతులకు — యూనివర్సిటీ బుక్ సెంటరు ప్రకాశంరోడ్డు, తిరుపతి.]

# నిర్ణయం

శ్రీమతి ఆర్. వసుంధర

'రామయ్యన్నా' అని చిన్నగా పిలిచి తలుపు చప్పుడు చేసేడు కృష్ణమూర్తి. ఎవరూ వచ్చి తలుపు తీయలేదు. వినపడలేదేమోనని మరి కొంచెం పెద్దగా తలుపు తట్టేడు.

ఎక్కడో లోపల వసారాలోంచీ 'భానూ, భానూ...ఆ బాసిగాడో ఎవడో వచ్చినట్లున్నాడు, తలుపు తియ్...ఇంతలోనే వెయ్యకపోతే ఏం?' అంటూ కేక లేశాడు రామనాథం విసుగ్గా.

'ఎవరో నేను వెళ్ళిచూస్తాను...మీరు ఖంగారు పడకుండా పడుకోండి...ఈ పల్లెకొంపకి వచ్చినప్పటి నుండీ తలుపులు వెయ్యనూ తియ్యనూ సరిపోతోంది... ఏం గోలో, ఏమో! యిక్కడి మనుష్యులకి ఒక టైమనీ ఏమీ వుండదు' అని మాట్లాడుకుంటూనే వచ్చి తలుపుతీసింది.

వచ్చిన మనిషిని చూసి ఒక క్షణం మాట్లాడ కుండా నిలబడిపోయింది. ముఖం విసుగుతో ముడు చుకుపోయింది. లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ 'రా, లోపలికి' అన్నది.

కృష్ణమూర్తి లోనికివచ్చి బురద పేరుకు పోయిన చెప్పులు తలుపువారగా విడిచి నిలుచున్నాడు. భానుమతమ్మ బావిప్రక్కగా చూసి 'బాసిగాడు గొడ్లు తోలుకుపోయాడు...ఇంట్లోంచి కాళ్ళు కడుక్కోవ డానికి నీళ్ళు తెచ్చిస్తానుండు...'అన్నది కటువుగా. కృష్ణ మూర్తి కాస్త ఖంగారుగా 'ఎందుకమ్మా, చెంద్రమ్మోదినా, నేను బావిలోంచి తోడుకొని కడు క్కుంటాగా...నీకెందుకూ శ్రమ' అంటూనే బావి దగ్గరకు వెళ్ళిపోయాడు.

కిష్టయ్యని చూస్తే అందుకే భానుమతమ్మకి మంట. ఏకాలంనాడో ఒదిలేసిన పేరుతో 'చెంద్ర మ్మోదినా' అంటాడు. అలా అనటంలో కిష్టయ్య మడ్డితనమేకాకుండా తనను కించపరచాలనే భావం కూడా వున్నదని ఆమె అనుమానం. పెళ్ళవగానే చంద్రమ్మ అనే పేరు బాగాలేదని భానుమతిగా మార్చుకున్న విషయం అందరికీ తెలుసు! మరి యీ కిష్టయ్యమాత్రం పాతపేరును వదలలేదు.

'ఈ పల్లెటూరి మరియాదలతో నాకు చచ్చే చావుగా వుందనుకో కిష్టయ్యా...ఒక్కొక్కరూ వేళాపాళా లేకుండా పరామర్శకు వస్తుంటే వాళ్ళకు కాళ్ళకు నీళ్ళదగ్గర్నుండీ కాఫీ ఫలహారాలూ, భోజనాలవరకూ అమర్చాలాయెను. లేకుంటే ఫలా నావిడ మనుషుల్ని పలకరించదని చుట్టుప్రక్కల వాళ్ళు మొత్తం గుప్పుమని పోతాయాయెను... ఆయనకు యీ విషయం పట్టింపుగా వుంది, నాకేమో చావుగా వుంది...' అన్నది. కృష్ణ మూర్తికి తగలాలనే అన్నది. కాని కిష్టయ్య పట్టించుకోకుండా బక్కెట్లో తోడిననీళ్ళు ధారాళంగా కాళ్ళమీదకు ఒంచుకుంటూ బురద కడుగుతూనే 'మీకేమో అల వాటు లేదాయెను...ఈ పల్లెటూళ్ళల్లో యింతే నమ్మా' అన్నాడు అనునయంగా.

భానుమతమ్మకు గడిచిన రోజులు జ్ఞప్తికివచ్చి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. తన భర్త రామనాథం మంచి పేరుగల గవర్నమెంటు డాక్టరుగావున్న రోజుల్లో నలుగురు పనివాళ్ళు యింట్లో నిండుగా తిరుగుతూ వునప్పుడు ఈ కిష్టయ్య తాము వుద్యోగరీత్యావున్న పట్టణానికి నాలుగుసార్లు వచ్చాడు. 'వూరు చూడ టానికి'. అంత హోదాగల యింట్లో తిరగటానికి, శుభ్రంగా యిస్త్రీ కవర్లు వేసిన సోఫా దిండ్లమీద

కూర్చోవడానికి సంకోచించి బయట అరుగుమీదనే యింటికొచ్చిన రోగుల్తో కబుర్లు చెబుతూ కాలం గడిపేవాడు...యిప్పుడు కొడుకు ఢిల్లీలోనూ కూతురు అమెరికాలోనూ వున్నారు; ఆయన రిటైరవగానే తామిద్దరూ యీ స్వగ్రామానికి రావలసి వచ్చింది. ఇక్కడుండే పల్లెటూరి మొద్దుల్ని, బంధువులనటానికి పనికిరాని వాళ్లని మనుష్యులుగా మన్నించవలసివస్తోంది. కిష్టయ్యకు స్వయంగా కాళ్లకు నీళ్లిచ్చి మర్యాద చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడింది!

హైదారాబాదులో మంచి యిల్లొకటి తీసుకొని అక్కడికే తరలి వెళ్లిపోవాలని అనుకుంటుండగానే తెచ్చుకున్న సామాన్లు విప్పకుండానే ఎనభై ఏళ్ల ముసలి అత్తగారికి జబ్బుచేసి చావటం, మూడు నెల్లు తిరక్కుండానే ఆయనకు స్ట్రోక్ రావటం జరిగిపోయింది. మనశ్శాంతివుంటే ప్రాణభయం లేదన్నాడు గుంటూరులో డాక్టరు. 'ఇహ ఎన్నాళ్లకో హైదాబాదు వెళ్లేది!—' అని నిట్టూర్చుతూ లోనికి వెళ్లింది భానుమతమ్మ – కృష్ణమూర్తికోసం తవ్వెడు బియ్యమూ గిద్దెడు పప్పూ వుడకబెట్టడానికి.

ముందు గదిలో పాతకాలపు పెద్దపట్టెమంచం మీద నాలుగంగుళాల మందపు పరుపుమీద పడుకుని వున్నాడు రామనాధయ్య. పైపంచెతో ముఖం తుడుచుకుంటూవచ్చిన కృష్ణమూర్తిని చూసి చిన్నగా నవ్వి 'కూర్చో' అన్నాడు.

దూరంగావున్న గిలకల కుర్చీని మంచం దగ్గరగా లాగి పై పంచెతో దులిపి కూర్చున్నాడు కిష్టయ్య. 'ఒంట్లో ఎట్లా వుంది?' అన్నాడు. 'గుంటూరులో డాక్టర్లు మనశ్శాంతి వుండాలన్నారంటగదా...ఇంతకీ నీ కొచ్చిన కష్టమేమిటో...' అంటూ పెత్తండ్రి కొడుకు రామనాధయ్య మొహంలోనికి పరిశీలనగా చూశాడు. సమాధాన మేమీ రాకపోయేసరికి 'ఎప్పుడూ నలుగురు పెద్దమనుషుల్లో పేరుగా పట్టణాల్లో తిరుగుతుండేవాడివి, యీ పల్లెటూళ్లో ప్రొద్దుపోవటంలేదేమో...పోనీ అబ్బాయి దగ్గరకెళ్లి నాలుగునాళ్లు వుండిరారాదా...ఈ వూళ్లో కొచ్చి ఏడాది కావస్తోంది, బయట కాలుపెట్టకపోతివి ..' అన్నాడు సానుభూతితో.

తమ్ముడి మాటలు విన్న రామనాధయ్యకు ఎక్కడో దూరంలోవుండి అదృశ్యమైపోతున్నట్లున్న పాత రోజులు జ్ఞాపకంవచ్చి సంతోషం కలిగింది. ఏడాది నుండీ తానూ యీ పల్లెటూరి రైతుల్లో ఒకడై అనామకుడై పోయినట్లుగా కించపడ్డాడు. కిష్టయ్య రాకతో తాను మళ్లీ ఒక హోదాగల డాక్టరైనట్లు అనుభూతి కలిగింది. 'కాస్త ఆరోగ్యం కుదుటపడగానే హైదరాబాదుకు వెళ్లిపోవాలనుకుంటున్నానురా కిష్టాయ్. నా స్నేహితులు చాలమంది అక్కడే వున్నారు...యిప్పట్లో అబ్బాయిదగ్గరికి వెళ్లటానికి వీలుకాదులే...ఆరోగ్యం చూసుకోవద్దూ' అన్నాడు.

కిష్టయ్యకు ఒంటరిగాడైన అన్నమీద సానుభూతి ముంచుకొచ్చింది. 'ఏవిటోలే అన్నా... అందరూ చదువులు చదువులని ఎగబడ్డమేగాని ఆఖరికి చూస్తే కష్టానికీ సుఖానికీ దగ్గరలేకుండా ఆ పిల్లలెక్కడో మన మెక్కడో!...' అంటూ పుగాకుపాయ తీశాడు. దాన్ని చదునుచేసి నిలువుగా రెండు సగాలుగా చీల్చాడు. ఒక సగం చక్కగా సాఫీ చేసి కాలిమీద పెట్టుకున్నాడు. రెండోసగం సమమైన పొడవులో ముక్కలుగా తుంచి, ఆ ముక్కలన్నీ సాఫీచేసిన పాయలో పెట్టుకొని తాపీగా చక్కగా చుట్టచుట్టాడు.

ఈ ప్రయత్నమంతా కించిత్ తిరస్కారంగా చూస్తూ 'చదువుల సంగతి వీడికేం తెలుసు!' అనుకున్నాడు రామనాధయ్య. కిశోర్ ఢిల్లీలో వెయ్యిరూపాయిల జీతంతో మంచి వుద్యోగంలో వున్నాడు. శాంతి అమెరికాలో భర్తతోపాటుగా వుద్యోగంచేస్తూ నెలకు ఆరువేలు తెచ్చుకుంటున్నది. ఆ డబ్బూ సుఖమూ గొప్పదనమూ లక్షలో ఒకరికే, అదృష్టవంతులకి దక్కేవి. ఇప్పుడుదగ్గరలేకున్నా, ఎక్కడోవున్న వాళ్లిద్దరూ తన రెండు కళ్లు; ఆశాజ్యోతులు! తన ఆశలన్నీ వాళ్లలో రూపొందుతూంటే తాను పొందుతున్న ఆనందం పిచ్చి కిష్టాయ్ కేం తెలుస్తుంది!

కిష్టయ్య చుట్టచేతిలో పట్టుకొని గుండ్రంగా త్రిప్పి చూసుకుంటూ 'అసలు నేనొకమాట చెప్పా

లనే వచ్చాననుకో...అహ, నీకు తెలియదని కాదులే... అయినా...' అంటూ సాగదీశాడు.

రామనాథయ్య నవ్వుతూ 'అంత సందేహిస్తా వేమిట్రా. చెప్పు' అన్నాడు.

కిష్టయ్య కొంచెం ఆలోచించి 'అందరూ నానా రకాలుగా మాట్లాడుతారు...అవన్నీ నీవు మనసులో పెట్టుకోవద్దు...పెద్ది సంగతిగాని, నీ జబ్బు సంగతి గాని ఎవరైనా ఏమైనా చెవిలోవేస్తే పట్టించుకోబోక. ఇక్కడ తలకో వెర్రి మొర్రి ఆలోచన. ఇవన్నీ యిక్కడ మామూలేలే'...అన్నాడు.

రామనాథయ్యకు వూళ్ళో వాళ్ళు అనుకుంటు న్నారని బాసిగాడు చెప్పిన విషయం జ్ఞాపకం వచ్చింది. ఎనభై ఏళ్ళు బ్రతికి చచ్చిపోయిన తల్లి ఏకైక పుత్రుడైన తనమీద ఆశ చొప్పున దయ్యమై పట్టిందనీ, అదే యీ జబ్బుకు కారణమనీ అనుకుంటున్నారట! 'ఇంత చదువు కున్న వాడిని...అందులో డాక్టర్ని...నీవు చెప్పక పోతే తెలియదనుకున్నావా?' అన్నాడు. నవ్వుతూ తేల్చే ద్దామని ప్రయత్నించినా గొంతులో విసుగు వ్యక్త మైంది.

భానుమతమ్మ వచ్చింది. 'అన్నానికి లే' అన్నది కిష్టయ్యతో. ఇప్పుడెందుకు చేశావమ్మా...ఇంటి దగ్గర చద్దిఅన్నం తినే వచ్చాను' అన్నాడు. 'ఎండన బడి నాలుగుమైళ్ళు మీ వూరినుండి నడిచే ఒచ్చా వుగా, లే' అన్నదామె. పైపంచె కుర్చీలోవేసి లేచి వెళ్ళాడు కిష్టయ్య.

* *

రామనాథయ్యకు ఒళ్ళంతా పీకుతున్నట్లు తిమ్మిరిగా అనిపించింది. దిండ్లు సర్దుకొని కళ్ళు మూసుకొని పడుకున్నాడు. తనకు ఆరోగ్యం సరిగా లేనప్పుడైనా పిల్లలు వచ్చే పరిస్థితి లేనందుకు కించిత్‌బాధ కలిగింది. పల్లెటూరి అమాయకుడైనా కిష్టయ్య అన్న మాటల్లో కొంచెం సత్యం వుందేమో అనిపించింది. సత్యంతో సంబంధం లేని ఆశల్లాగా ఎక్కడో దూరాన ఆ పిల్లలు! అను కున్నాడు.

ముసలితల్లి మంచంలో వున్నప్పటి మూలుగు చెవుల్లో హోరెత్తుతోంది. కిష్టయ్య మాటలు జ్ఞాపకం వచ్చాయి. దయ్యం, దయ్యం! దయ్యమంటే ఏమిటి? చచ్చిపోకముందు అమ్మపడిన బాధ, అప్పటి ఆవిడ మూలుగూ ఆరునెల్లయ్యాక యిప్పుడూ మనసును వికలం చేస్తోందంటే, అది దయ్యం కాదా? దీని కంతటికీ కారణమైనది...కారణం... అబ్బ! అంటూ నుదుట నిండిన స్వేదబిందువుల్ని వేలితో పోగుచేసి క్రిందకు విసిరేశాడు. ప్రక్క నున్న టవలుతో ముఖం, మెడా తడిలేకుండా తుడుచు కున్నాడు. ఓ ప్రక్కనుంచీ తుడుస్తూవుండగానే మళ్ళీ చెమట చిన్నచుక్కలుగా ఏర్పడుతోంది. గుండె దడ దడ లాడుతున్నట్లుగా వేగం హెచ్చించుకున్నది. 'జబ్బు అనేది రాకూడదుగాని వచ్చిందంటే అన్నీ బాధలే' అనుకున్నాడు డాక్టర్ రామనాథం నిస్పృహాయంగా...

ఆమె, అమ్మ, ఎనభై ఏళ్ల వయసులోకూడా, వేదనాభరితమైన అంత్యసమయంలోకూడా స్వతఃసిద్ధ మైన ఠీవిని పోగొట్టుకోలేదు. ధువ్వి ముడివేసిన తెల్లనైలాన్‌దారాల్లాంటిజుట్టు, విశాలమైన నుదురు, ముసలితనంలో మరింత స్ఫుటంగా కన్పిస్తున్న కోటేరులాంటి ముక్కు, వయస్సులో తెల్లపొరలు క్రమ్మటంవలన ఎదుటివాళ్ల మనసుల్లో మరింత జంకు గలిగించే పెద్దకళ్ళు—ముసలితనంలో ఆమె శక్తి ఏమాత్రం తగ్గలేదు! తాను గుర్తెరిగినప్పటి నుంచీ ఆ కంచుగంటలాంటి అధికారపూర్వకమైన స్వరమూ, మనసు లోతుల్లోకి చూసే నిశితమైన చూపూ, నిర్లక్ష్యాన్ని సహింపలేని మానసిక తీవ్రతా-అన్నీ తన మనసులో తిరుగులేనివిగా మాయని ముద్రగా నిలిచిపోయాయి. తనఎడల ఆమె ప్రేమనే చూపినా ఎందుకో తాను సహజంగా ఆమె దగ్గరకు వెళ్ళలేక పోయాడు. ఆ ప్రేమ మానసికమైనది, హృదయం నుండి వచ్చేదికాదు; అందుబాటుదూరంలో నిలబెట్టి వుంచేది!

ఆపరేషన్‌కు అనువుకాని వయసులో, పొటిలో కాన్సర్‌వచ్చి బాధతో వుండచుట్టుకొనిపోతూ, జంతువు లాగా అమానుషమైన గొంతుతో మూలుగుతూ వున్నప్పుడూ ఆమె బలహీనురాలైన ముసలి మనిషి లాగా కన్పించలేదు! మూడుసార్లు 'నాయనా, నీవు

డాక్టరువి, నా బాధ అంతంచేసి మాతృఋణం తీర్చుకోరా' అన్నది—కాదు, ఆజ్ఞాపించింది. మొదట తానా మాటలు పట్టించుకోలేదు. డాక్టరుగా తాను ఎన్ని రూపాల్లో ఎంతబాధను చూడలేదు గనుక! కాని... అనంతమైన శక్తికి, ఠీవికి మూర్తిగా జ్ఞానంరాని పసితనంనుండీ తన మనసులో నిలిచివున్న అమ్మ యిప్పుడు యింత ఘోరంగా మూలగటం, బాధ పడటం, తన మనసులో ఒక అసామాన్య స్థితిని తెచ్చి పెట్టింది...మార్ఫియా మత్తులోవున్న కొద్దిసమయం తప్పించి రాత్రింబవళ్ళూ, నెలరోజులు...నెలరోజులు! 720 గంటలు...43,200 నిమిషాలు...ఇరవై ఆరు లక్షల సెకండ్లకాలం నిర్విరామంగా ఆ అమానుషమైన మూలుగును భరించాడు, అనుభవించాడు! పిచ్చెక్కిపోతోందేమో అనిపించింది...ఆమె యింత అర్థంలేనిబాధను అనుభవించటం అసంగతంగా తోచింది.

'ఎట్లాగూ పోయే ముసలావిడ ఆ ప్రకారం బాధపడుతూవుంటే చూస్తూ వూరుకుంటారా! ఏమైనా చెయ్యకూడదూ...అంతగా అడుగుతోంది మరి...' అన్నది భానుమతి. సాభిప్రాయంగాచూస్తూ, అర్థం కానట్లు చూస్తూ వుండిపోయాడు తాను. తరువాత క్రమంగా ఆ వుద్దేశ్యం బలపడి, నాలుగో సారి అమ్మ కోరినప్పుడు వణుకుతున్న చేతులతో యిచ్చాడు ఆమె మొయ్యలేని మార్ఫియా ఇంజక్షను.

వున్నట్లుండి, తీవ్రమైన రెండు ఎండ తెరల మధ్యన ఉబ్బవేస్తూవుండే వాతావరణంలోని అసహజ ప్రశాంతత లాంటిది ఏర్పడింది. బాహ్యప్రపంచంనుంచి మూలుగు అస్తమించింది.

ఒక ప్రాణాన్ని అంతం చెయ్యడానికి మరో మనిషికి హక్కు వున్నదా? అంత అవాలోచితంగా ఆవిణ్ణి ఎట్లా చంపగలిగాడు తాను! ఒక హంతకుడికీ తనకూ భేదం ఏమిటి? ఆ మూలుగు తనలో కల్గించిన మానసిక వైకల్యాన్నుంచీ తప్పించుకోవడానికే అట్లా చేశాడా తాను?

హార్దికమైన ప్రేమను అందించని తల్లిని చంపాడా తాను?

ఒక అనిశ్చిత మానసికస్థితిలో భార్య చెప్పిన పనిని చేశాడా తాను?

భాను తననుగురించి ఏమనుకుంటోంది?

ఏం జరిగింది? ఈ నిర్ణయం ఎందువలన జరిగింది??

ప్రతి విషయాన్నీ పూర్తిగా భిన్నమైన రెండు కోణాల్లోంచీ చూడవచ్చును అట్లాంటప్పుడు 'సరియైన నిర్ణయం' అనేది ఏది? ఎట్లా తెలుసుకోవటం? అయోమయంలో పడిపోయాడు రామనాథయ్య.

క్రమంగా బాహ్యప్రపంచంలోంచీ అంతరింప జేసిన ఆ మూలుగు మనసులో నిండిపోయింది......

భోజనం చేసివచ్చాడు కిష్టయ్య, తృప్తిగా త్రేనుస్తూ. 'అరె, చెమట కారిపోతోందే' అంటూ ప్రక్కనున్న విసనకర్రతో విసరటం ప్రారంభించాడు. రామనాథయ్యకు చల్లటిగాలి తగలటంతో కాస్త తేరుకున్నట్లనిపించింది.

'బోలెడన్ని తత్వాలు పాడతావు, వేదాంత చర్చలు చేస్తావు...కిష్టయ్యా, మనిషి తీసుకునే నిర్ణయానికి సబబు ఎట్లాంటిదో చెప్పు, చూద్దాం...' అన్నాడు రామనాథయ్య సగం నవ్వులాలుగా ధ్వనింప జేస్తూ.

చొక్కాజేబులోంచీ యిందాక చుట్టిన చుట్ట బయటికితీశాడు కిష్టయ్య. రెండు అగ్గిపుల్లల సహాయంతో ముట్టించాడు. అన్నను పరిశీలనగా చూసి 'అదేమిటన్నాయ్, వేదాంతంమీద దృష్టి మళ్ళింది!... నవ్వులాలుకా?...నిర్ణయాలు తీసుకోవడానికి మనమెంతటివాళ్ళం గనక! అంతా వాడి లీల!' అన్నాడు.

మెట్టవేదాంతం. కిష్టయ్య కింకేం తెలుస్తుంది ఇంతకంటే! అనుకున్నాడు రామనాథయ్య. నవ్వు వచ్చింది. 'అయితే ఏంచేసినా ఫరవాలేదంటావ్!' అన్నాడు.

కిష్టయ్య కాస్త ఆలోచనలో పడ్డాడు. 'మనస్ఫూర్తిగా చేస్తేసరి. ఒకళ్ళకి బాధ కలిగించకుండా...' అంటూ ఆగి 'యివాళ నన్ను బాగా ఆట పట్టించాలనుకున్నావ్!' అన్నాడు.

భానుమతమ్మ వచ్చింది. 'కిష్టయ్యా. ఆచుట్టపొగ ఇంజన్‌లాగా ఒదుల్తున్నావ్' అన్నది నాసలు చిట్లిస్తూ.

కిష్టయ్య చుట్టచివర్ని నేలమీదరుద్ది, ఆర్పి జేబులో వేసుకున్నాడు నవ్వుకుంటూ. 'ఆయన కసలే మనసు బాగుండలేదు..మీ పెద్ది నెలరోజులు గోండ్రించి చెవులు హోరెత్తించింది. అదే మనసు పాడుచేసిందని అంటు న్నారు...ఇహ నీ వేదాంతం కాస్త జోడించావంటే బాగానే వుంటుంది' అన్నది.

'ఆ, కాస్సేపు వుబుసుపోక...' అన్నాడు రామ నాథయ్య. 'చేసేదంతా భగవంతుడే నన్నావ్; అంతలోనే మనస్ఫూర్తిగా యితరులకి బాధ కలిగించకుండా చెయ్యాలంటున్నావ్. మరి అన్నీ నడిపిస్తుండేది నీవా, భగవంతుడా?' అడిగాడు కొంచెం వుత్సాహంగా, కిష్టయ్యను బోల్తా కొట్టించానన్నట్లు.

'అంతా వాడే చేయించేది. మనం చేస్తున్నా మని అనుకొని సబబులకోసం చూడబోతాం, తాప త్రయపడతాం. చేయించేది వాడేనని తెలుసుకుంటే బాధేవుండదు...' అన్నాడు కిష్టయ్య, వెనక ఎప్పుడో ఒక స్వాములవారు చెప్పిన విషయం జ్ఞాపకం చేసు కొంటూ.

రామనాథయ్య నవ్వేశాడు. 'చాలా అద్వైతంగా వుండే వ్యవహారం...యిదంతా కనిపెట్టిన వాళ్లెవరో గాని మొత్తానికి పని చాలా సులువు చేసేశారు... మేము అట్లాగ కాదు. చేసిన పనికంతా బాధ్యత వహిస్తాం, యింకోళ్లమీద తోసెయ్యం, అదీగాకుండా నా యాభై ఆరేళ్ల జీవితంలోనూ నీవు వున్నావని చెబుతున్న భగవంతుడు నాకు ఎప్పుడూ కన్పించలేదు' అన్నాడు.

అంతలోనే ఒళ్లంతా లాగేస్తున్నట్లు గుండె పిండేస్తున్నట్లు బాధ కలిగింది. 'పిల్లలు, పిల్లలు' అనుకున్నాడు ఆదుర్దాగా, అస్పష్టంగా మనసు లోతుల్లోకి దూసుకుపోయిన ఆలోచనలో. 'వాళ్లు రాలేరు రారు' అనుకున్నాడు. మనసులో నిస్పృహ నిండి పోయింది. 'అబ్బ, నొప్పి, నొప్పి...' అంటూ వుండ చుట్టుకు పోయాడు.

'ఎక్కడ, ఎక్కడ...' అంటూ ఖంగారు పడ్డాడు కిష్టయ్య.

'త్వరగావెళ్లి డాక్టరును పిల్చుకురా...అల్లా నిల్చున్నావే' అంటూ భర్త దగ్గరకి పరుగెత్తుకు వచ్చింది భానుమతమ్మ. చేతులూ కాళ్లూ బారచాపు కొని నిఃవారుగా పడుకుండిపోయాడు రామనాథయ్య నిలువు గుడ్లతో చూస్తూ. కిష్టయ్య గాభరాగా డాక్టరు కోసం పరుగెత్తాడు......

* * *

శిలాప్రతిమలా కూర్చుండిపోయింది భాను మతమ్మ, అనుకోని పరిణామానికి తట్టుకోలేక. ఢిల్లీలోవున్న కొడుకూ, అమెరికాలోవున్న కూతురూ, హైదరాబాదులో గడపవలసిన జీవితం, హోదా, ప్రదనం—అన్నీ గాలిలో దూదిపింజల్లాగ అంద కుండా ఎగిరిపోగా ముక్కలైపోయిన మనసు యీ పనికిరాని పల్లెటూరు, కిష్టయ్యా, నిస్సహాయత, ఒంటరితనం అన్న కఠిన సత్యాన్ని ఎదుర్కోలేక దీనంగా ఏడ్చింది......

ఢిల్లీనుండి కొడుకు రావటానికి రెండు రోజులైనా పడుతుంది గనుక, ఎండాకాలం శవాన్ని నిలపటం కష్టం గనుక, ఐస్‌లోపెట్టినా వికృతమైపోతుందిగనుక, కృష్ణమూర్తి అన్నశవానికి అంత్య క్రియలు నిర్వర్తించాడు. 'ఈ పని చెయ్యటానికే నన్ను యిప్పుడు యిక్కడికి రప్పించావా స్వామీ!' అను కున్నాడు కళ్లు వొత్తుకుంటూ.........

---

# 'ఏదో తళుకు!'

## శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

ఎద తుదల ఏదో తళుకు
కదిలెనే కదిలెనే—

రుచిరారుణ స్వర్గ
లోకాలదో ఏమొ
ఏదో చల్లని నవ్వు
ఎడద వెన్నాడెనే—

ఏ దయా మృదు పాద
మీ హృదిని తాకెనో
గుండె పట్టని వెలుగు
గోళమై పోయెనే—

తరళ వ్యధా తపన
తప్తమీ బ్రతుకుపై
సిరి వెన్నెల యేదో
జాలిగా వాలెనే—

ఆ కులికి పడురేల
ఈ కుటిని ప్రేమగా
చందనానిల మొకడు
స్పృశియించెనే—

విడని చీకటి రెక్క
విడిపోయె., ఇపుడు ఈ
ద్వారముఖమున, ఉష
స్తోరణము వ్రేలెనే—



## నున్నటి అంచులు - ప్రవహించే ఉద్యోగాలు :

# సాహిత్యోద్యమాల వెనుక అదృశ్య శక్తులు

—డా. ధర్మవీర్ భారతీ

అర్థరాత్రి; లక్షలాదిమందిని చుట్టుకొని చడీ చప్పుడులేని బస్తీలతో నిద్రిస్తున్న లండన్ నగరం. కాని అక్కడే కొందరు నిద్రించడం లేదు.

చెలసీ ప్రాంతంలోని ఫులహమ్ రోడ్డుపై వున్న కాఫె ద ఆర్టిస్ట్. సిగిరెట్లతో మసిబారిన చిన్న—చిన్న బల్లలచుట్టూ దాదాపు ఐదువందల మంది కూచోడానికి ప్రయత్నిస్తున్నారు. బల్లలపై ఖాళీ సీసాలు. సీసాలపై నిలుచున్న కొవ్వొత్తుల పాలిపోయిన వెలుగు. వాళ్లంతా అసాధారణమైన బొహిమియన్‌లుగా మారిపోవడానికి అక్కడ ఎంత గానో యత్నిస్తున్నారు.

ఇక్కడ ఈ కాఫెలో కళాకారులందరు పాపం, ఎంతో కష్టంగా కాఫీకాకపోతే కోకాకోలా మాత్రమే తాగ గలుగుతున్నారు.

బయట నిశ్శబ్దంగావున్న రోడ్డుపై కొన్ని మోటారుకార్లు వెళ్లిపోయిన చప్పుడు. ఆ తర్వాత అకస్మాత్తుగా రోడ్డు సాంతం నిండిపోతుంది. ఒక పోలీసు లారీ, రెండు నల్లనికార్లు, ఒక స్క్వాడ్ కారు. పోలీసులంతా చుట్టుముట్టి వేసారు. కాఫెపై దాడి చేశారు. అపాయకరమైన మత్తు పదార్థాల నిషేధచట్టంకింద వాళ్ళచేతుల్లో వారంట్. ఇంతకీ పోలీసులంతా నల్లమందు, గంజాయి దాగివున్న స్థలా లను వెతుకుతున్నారు.

కాఫెలోవున్న కళాకారులలో కొందరిని మోటారు కార్లలోకి బలవంతంగా నెట్టివేసారు. ఈ రోజు కోర్టులో వారిపై కేసు. మరో వాదలాదిమంది పేర్లను—చిరునామాలను పోలీసులు వ్రాసుకున్నారు. ఇదంతా ఒక బొహిమియన్ పాయంత్రాన్ని గడపడానికి గాను చెల్లించవలసి వచ్చిన ఒక అల్పమైన మూల్యం.

కాఫె ఖాళీగాపడి వుంది. ఎక్కడినుండోవచ్చి గుమిగూడిన గుంపు, ఎక్కడికో మళ్లీ చెదిరిపోయింది. లోన కొవ్వొత్తులు మసక మసగ్గా వెలిగి ఆరి పోయాయి.

— డెలీ ఎక్స్‌ప్రెస్ : లండన్ :
14 మే 1962.

ఉదయమే చాంబర్‌మేడ్ చాయ్‌తోబాటు వార్తా పత్రికల కట్టను ఇచ్చి వెళ్లిపోయింది. వాటిలోని అంతర్జాతీయ వార్తలను వదిలివేసి పై వార్తలో నేను మునిగిపోయాను. పత్రికల్లో మరికొన్ని వివ రాలు కూడా వున్నాయి. నిన్నరాత్రి అక్కడ కొందరి వద్దవున్న సిగిరెట్లలో మరిజువానా, మరికొందరివద్ద నల్లమందు, ఇంకా కొంతమంది జేబుల్లో భాంగ్ పొట్లాలు పట్టుబడినట్టు డేలీ టెలిగ్రాఫ్ కథనం. ఆరుగురు కళాకారులు రిమాండ్‌లో వున్నట్టు, వారి చిరునామాలతోబాటు పేర్లుకూడా ప్రకటించారు. టెలిఫోన్ మోగగానే రిసీవర్ చేతిలోకి తీసుకొన్నాను. అటువైపునుండి వాసిఫ్! మాట్లాడుతున్నాడు— యా ఖుదా (హే భగవంతుడా). భారతీగారు వెంటుక

వాసిలో తప్పిపోయాము. మా చిన్నకారు దారిలో చెడిపోబట్టి సయమైనది. నిన్నరాత్రి ఆ కాఫెని మీకు చూపెట్టాలని మా ప్రోగ్రాం. ఇక్కడి నవకవులు, రచయితలు, కళాకారులు గుమిగూడే ప్రసిద్ధమైన చోటది. ఆ ముఖాలని చూడవలసిందే!'

నా కిప్పుడు జ్ఞాపకం వస్తోంది. ఆనాడు వాషీఫ్ నన్ను ఆ ప్రాంతాలవైపే తీసుకెళ్ళాడు. అక్కడే ఒక విశాలమైన షామియానాలో విశ్వవిఖ్యాతమైన—చెలసీ పుష్పప్రదర్శనంకోసం ఏర్పాట్లు సాగుతున్నాయి. అక్కడికి దగ్గర్లోనే ఈ కళాకారులు వుండే ప్రత్యేక ప్రదేశం కనపడింది. చిరిగిన దుస్తుల్లో, చెరిగిన జుత్తుతో మగవాళ్ళమాదిరి కనపడే ఆడవాళ్ళు, ఆడవాళ్ళమాదిరివుండే కుర్రాళ్ళు. వీళ్ళంతా సంఘానికి వ్యతిరేకంగా యుద్ధాన్ని ప్రకటించారు.—వీళ్ళే ఆ బీటనీక్‌లు, నిరాశ చెందిన యువకులు.

నేను 'బియాండ్ ది ఫ్రింజ్' నాటకాన్ని చూడకుండావుంటే, ఆస్బోర్న్, గిన్స్‌బర్గ్ రచనల్లోని నిశితమైన విక్షోభాన్ని గుర్తించకుండావుంటే ఈ యువకులపట్ల నా అభిప్రాయం కూడా లండన్ వాసులతో, పురాతన పాశ్చాత్య సమాజంతో సమంగా వుండేది. ఈ వైముఖ్యానికి గురైన యువకులందరు కేవలం తాగుబోతులని, నల్లమందుభాయిలని, వీళ్ళ అసలు చికిత్సాస్థానం పిచ్చాసుపత్రి లేక పోలీసుస్టేషన్ అని నేనుకూడా భావించివుండేవాణ్ణి. కాని... గిన్స్‌బర్గ్ వీళ్ళ ప్రసక్తితెస్తూ తన ప్రఖ్యాత కవితను ఇలా ప్రారంభిస్తాడు:

—'నేను చూసాను నా తరానికి చెందిన మహా మేధావులని పిచ్చెక్కి ధ్వంసమై, ఆకలితో, బాధతో నగ్నంగా......' అయితే ఈ కూలిపోవడంలో శరత్ సృష్టించిన దేవదాసు కరుణగాని, గోర్కీపాత్రలు ఓడిపోతూ ధ్వనింపచేసిన విప్లవ భావాలుగాని లేవు ఇందులో ఒక విచిత్రమైన నిరర్థకత గురించి బోధ, ఆకస్మికమైన విస్ఫోటనం గురించి బాధ వున్నాయి. ఈ తరుణంలోనే అమెరికాలో గిన్స్‌బర్గ్ తన ప్రఖ్యాత కవితకు 'హవుల్' (క్రోధ పూరితమైన అడవి జంతువు ఆర్తనాదం) అని శీర్షిక పెడుతూ వుండగా ఇంగ్లాండ్‌లో జాన్ ఆస్బోర్న్ నాటకం 'లుక్ బ్యాక్ ఇన్ ఏంగర్'లోని నాయకుడు దానికే వ్యాఖ్యానం చేస్తున్నాడు—'ఈ మనస్సులో, మెదడులో ఒక జ్వలించే శక్తి వుంది. ఈ శక్తి తనలా జ్వలించే మరో సత్తాను వెదుకుతుంటుంది. ఈ ప్రపంచంలో అన్నింటికంటే విరాట్ స్వరూపంతో వున్న శక్తివంతమైన ప్రాణం బహుశా అందరికంటే ఏకాకిగావున్న ప్రాణమే. ఆ జీవి బలమైన ముసలి ఎలుగుబంటిలా ఆదిమ అరణ్యంలో తన శ్వాస వేమ కాలే తిరుగాడుతూ వుంటుంది. దానికి ఎవరి ఆసరా లేదు, ఏ గుంపు లేదు, హామి ఇచ్చే జనం లేదు.'

'హవుల్'లోని ఆ అగ్ని, పై వాక్యాల విస్ఫోటక శక్తి. అయితే వీటిలోనుండి సక్రియ—విప్లవ కారుడి, ప్రపంచాన్ని మార్చాలనే సంకల్పంతో, అదమ్య నిష్ఠతోవున్న నాయకుడి స్వరూపం ఎందువల్ల ఉబికి రావడం లేదు? టాల్‌స్టాయ్ సృష్టించిన పియరే లేక రోమారోలా సృష్టించిన క్రిస్టోఫ్ ప్రతిమ ఎందుకు ఉబికి రావడం లేదు? హెమింగ్వే సృష్టించిన బేస్తముసలివాడి చరమ—నిర్వేదం ఎందుకు వ్యక్తం కావడం లేదు? ఇప్పుడు నా ఎదుట పై విక్షోభ పూర్ణితమైన వాక్యాలు వున్నాయి, వాటితోబాటు ఉదయమే వచ్చిన దినపత్రిక; లండులో దాడి జరిగిన తర్వాత నిశ్శబ్దం ఆవరించిన కాఫె ద ఆర్టిస్ట్‌లో నిశ్శబ్దంగా పడివున్న బల్లలు, (కొంచెం పూర్వమే కొందరు నల్లమందుభాయిలు అక్కడ మోహచేతులు ఆనించి కూచున్నారు) ఇపుడు అక్కడ ఖాళీసీసాలు వున్నాయి. వాటిపై ఆరిపోయిన కొవ్వొత్తుల కొవ్వు జారి—జారి కూరుకపోయింది. ఆ కళాకారులు—ఆ నవయుగ విక్షోభ ప్రణేతలు నల్లమందు తిని రిమాండ్‌లో తలలు వంచుకొని కోర్టువేళకోసం నిరీక్షిస్తున్నారు.

న్యాయస్థానాల్లో ఎన్నోమార్లు తీర్పులు ఇచ్చారు. పుస్తకాలు నిషేధించారు. ఈ కళాకారులను శిక్షించారు. అయినా వీళ్ల పరిధి విస్తృతం అవుతూనేవుంది. అమెరికాలో బీట్ జెనరేషన్, ఇంగ్లాండులో కోపోద్రిక్త యువకులు. వీళ్ళు ఏర్పర్చుకొన్న కొత్తకొత్త గుహల్లాంటి హోటళ్ళు, నల్లమందు,

భాంగ్, గంజాయి చివరికి ఇప్పుడు ఎల్. యస్. డి. వగైరా జడలు కట్టుకపోయిన వెంట్రుకలు, చిరిగిన దుస్తులు, అప్పుడప్పుడు అవికూడా లేకుండా సమ లైంగిక మైథునంతో, బహిరంగ యోన్యాచారాలతో జీవించే వీళ్ళు ఈ చేష్టలను అసహ్యంతో ఉమ్మివేసి నట్టు, పదాలను ఇటుకలు—రాళ్ళమాదిరి విసిరి నట్టు...తర్వాత...మళ్ళీ నిరర్థకత నిండిన అను భూతి ఆ నైరాశ్యాన్ని ముంచివేయడానికి రెండిం తల నల్లమందు మోతాదు, అపాయకరమైన ఇంజె క్షన్లు తీసుకోవడం. వాటిద్వారా ఒక నూతన సృష్టిని—ఒక ఇంద్రజాలాన్ని చూడడం!...ఆదిమ పశువులతో కామక్రీడ సలుపుతున్న నగ్నస్త్రీలు—బురదలో కుళ్ళిపోయిన అంగాలు,—అందులో వున్న కళ్ళు మాంసపుపొరలను చీల్చి చూస్తుంటాయి—మళ్ళీ ఆ భయాన్ని ముంచివేయడానికిగాను మరో నల్లమందు డోసు.

అసహ్యాన్ని కలిగించే వీళ్ల వ్యవహారాలకు వ్యతి రేకంగా ఎంతో విమర్శ జరిగింది. పోలీసులు చట్టం, మతం, చర్చీలు, ఛాందసులు, ప్రతికొత్తదాన్ని విమ ర్శించేవాళ్లు ఎంతో వ్యతిరేకించారు. వాళ్ల విమ ర్శలకేంగాని చివరికి అవసరమైనప్పుడల్లా కొందరు మేధావులుకూడా విచారాన్ని వ్యక్తం చేశారు. ఈ ఉద్యమాల చర్చ జరిగిన ఒక సంవత్సరంలోగానే 'పార్టిజన్ రివ్యూ' అనే ప్రఖ్యాత పత్రికలో నార్మన్ పొడోరెజ్ ఈ యువకుల ఆదిమప్రవృత్తిపూజను, లజ్జావిహీనతను విమర్శిస్తూ ఇదంతా కేవలం వాళ్ల అంతరంగవైరుధ్యాన్ని కప్పిపుచ్చుకోడానికి తెరమాత్రమే అని అన్నాడు. వీళ్లలోవున్న భావదారిద్ర్యాన్ని మరుగు పరచడంకోసమే ఈ తిరుగుబాటని ఆయన విమ ర్శించాడు. వీళ్ల తిరుగుబాటుకు విశ్లేషణగా ఆయన ఇంకా ఇలా వ్రాసాడు:—'వీళ్ళు తప్పకుండా తిరుగు బాటుదారులే. కాని మధ్యతరగతి, పెట్టుబడిదారి వ్యవస్థ అనే సాంఘిక లేక చారిత్రక తత్వంపట్లకాదు వీళ్ల తిరుగుబాటు. ఈ తిరుగుబాటు కేవలం మాన సిక దారిద్ర్యం, అంతరంగంలో కుంటి—అవిటి వాళ్ళుగా వున్నవాళ్లు జరుపుతున్నారు. సహజధోర ణిలో ఆలోచించలేని అసమర్థులైనవాళ్ళు, సహజంగా ఆలోచించేవాళ్లను అసహ్యించుకునేవాళ్లు ఈ యువ కులు. తమ 'స్వ' అనే బురదగుంటలోనుండి బయటపడ లేనివాళ్లు.'

ఒకసారి 'టైమ్' పత్రిక వీళ్లను 'నిశ్శబ్ద తరం' అని సంబోధించింది. ఈ తరం యువకులు బుద్ధికి వ్యతిరేకులుగాని సుముఖులుగాని కాదు. వీళ్లకు బుద్ధి అనేది అసంగతమైనది. బీట్‌తరం మన యుగస్వభావాన్ని వ్యక్తం చేస్తున్నదని, దీని వ్రేళ్లు సాంఘిక గందరగోళంలో, దిశాహీనత్వంలో వున్నా యని ఈ తరం వ్యాఖ్యాకారులు అన్నారు. నైతికత్వం అబద్ధమని తేలిపోయిన రాజనీతి, ఆదర్శవాక్యాలు పెడదారిపట్టిన, మానవవివేకపు హద్దులు విరిగిన, పాప—పుణ్యాల నమ్మకాలు డొల్లగామారిన, ఇంత వరకు మానవసభ్యత తన బుద్ధి, విజ్ఞానం, నీతి, ధార్మికభావన ద్వారా వికసింపచేసిన వ్యవస్థ—సాంతం ప్రస్తుతం అర్థహీనమైపోయిన సంఘంలోనుండి ఈ తరం ఉద్భవించింది. ఇప్పుడు మనిషి ఎదుట ప్రతి ప్రశ్నకు ఒకేఒక్క జవాబు మిగిలిపోయింది: 'అణు బాంబుద్వారా సామూహిక వినాశనం!'

అందువల్ల వీళ్లకు లభించిన ఈ వార సత్వాన్ని, భావాలను ఏమాత్రం వీళ్లు నమ్మరు. అన్నింటిని తిరిగేసి చూడా లనుకుంటున్నారు. అతి శయపు రెండు హద్దులవరకు వెళ్లాలని ప్రయత్నం—నల్లమందు మత్తునుండి సన్యాసుల సమాధివరకు. ఒకసారి జాక్ కెరువాక్ (బీట్‌తరానికి చెందిన ప్రఖ్యాత కథకుడు)ను టెలివిజన్ ఇష్టాగోష్టిలో ఈ తరాన్ని అన్వేషించే తరమని అంటున్నారు; మరి దేనిగురించి అన్వేషణ అని ప్రశ్నించారు. అప్పుడు ఆయన ఏ మాత్రం తడుముకోకుండా ఇలా అన్నాడు—'భగవంతుడికోసం! ఆ భగవంతుడు కాస్త తన ముఖాన్ని చూపిస్తే చాలని నా కోరిక.' గిన్స్‌బర్గ్ తన 'హవుల్' కవిత గురించి చెబుతూ అన్నాడు—'అది భగవంతుడు, మైథునం, నల్లమందు, అర్థ హీనతయొక్క విశ్వాస స్వరము'. ఎందువల్ల నంటారా? ఇప్పుడు మురికి మర్యాదలతో—వ్యవస్థతో నిండిన ఈ బాహ్యప్రపంచంనుండి లభించే ప్రతి అనుభూతి ఒక ఉచ్ఛిష్టమని, అబద్ధమని వీళ్ల నమ్మకం. అందువల్ల అసలైన అనుభూతి లోపలి నుండి వస్తుంది. ఒక చరమ విస్ఫోటక ఉద్దీపనతో

అది లభిస్తుంది. అది మైథునంవల్లగాని, జాజ్ సంగీతంవల్ల, హత్య, హింసద్వారా లేక నల్లమందు ఇంజెక్షన్‌ద్వారా అయినా ఆ అనుభూతి దొరక వచ్చును.

కెరువాక్ ఇంకా ఇలా అన్నాడు—'మేము ఈ ఆంతరికమైన చీకటి అనుభూతుల గుహామార్గం గుండా వెళ్లి రెండో చివరవున్న విశ్వాసంవైపు చేరు కుంటాము. ఆ చివరనే భగవంతుడి ముఖం వుంది. అయితే హింస, ఉద్భ్రాంతి కలిగించే సంగీతం, అప్రాకృతికమైన మైథునం, చీలిన తొడల ఆ సెమ అరణ్యాలు, నల్లమందు, మరిజువానాతో తెరుచుకొనే చీకటి గుహాద్వారాలగుండా పయనించి ఎంతమంది రెండోవైపునున్న 'విశ్వాసాన్ని' చూసారో, ఎంతమంది ముసుగులేని భగవంతుని ముఖాన్ని దర్శించారో చెప్పలేము! కాని అమెరికాలో నేరాల రిపోర్ట్సను చది వితేమాత్రం మరో దృశ్యం కనపడుతుంది. వీళ్లలో ఎంతోమంది గుప్తరోగాలఆసుపత్రులద్వారాలలోకి, జైలుద్వారాలలోకి, పిచ్చాసుపత్రి ద్వారాలలోకి చేరి పోయారు. ఎంతోమంది మళ్లీ అసలు తిరిగి రాలేదు.

ప్రతితరం తన తిరుగుబాటుకు ప్రతిఫలంగా ఎంతో మూల్యాన్ని చెల్లిస్తుంది. బీట్‌తరంనుండి నియతి అతిక్రూరంగా ఈ మూల్యాన్ని వసూలుచేసింది.

అయితే ఈ మూల్యాన్ని వాస్తవంగా నియతి మాత్రమే లాగిందా? లేక ఇంకెవరో వసూలుచేశారా? ఎవరో ఒకరు ఈ ఉద్యమాన్ని లెక్కగడుతూ, పరమ శాంతంగా నల్లమందు మోతాదుల లెక్కలను గుణిస్తూ ఈ మూల్యాన్ని వసూలు చేశారా? నల్ల మందు మార్గానికి ఆవల నిజంగా భగవంతుడి ముఖమే వుందా లేక కెరువాక్, గిన్స్‌బర్గ్‌లకు తెలి యని మరో ముఖమేదైనా వుందా? ఇంతకి ఎవరిది ఆ ముఖం?

*  *  *

నడవండి — కాస్సేపు నల్లమందు, జాజ్, చెమట దుర్గంధం, నిస్సంకోచమైన వాక్యావళి, వేలాడే జటలు, భూగర్భంలోని వినోదస్థావరాలనుండి దూరంగా మరో రకమైన వాతావరణంలోకి వెడదాము.

దక్షిణప్రాచ్య (ఆగ్నేయ) ఆశియాలోవి ఆకు పచ్చచేలతోనిండిన ప్రదేశం. బ్యాంకాక్‌నుండి సింగా పూర్ వెడుతున్న జెట్ విమానంలో కూర్చొన్న ఒక ప్రయాణీకుడు. చేతిలో ఆనాటి దినపత్రిక వుంది. కాని అతను ఆలోచనల్లో మునిగివున్నాడు. ఆ ప్రయాణీకుడైన రచయిత కంబోడియాలో జరిగిన అంతర్జాతీయ రచయితల సమావేశావంతరం అనుకో కుండా సంభవించిన సంఘటనలను నెమరు వేసు కుంటున్నాడు.

'గియోవాన్ వార్తాపత్రికను పక్కన పెట్టేసాడు. కళ్లు మూసుకోగానే అతని ఎదుట శైలా ముఖం ప్రత్యక్షమైంది...ఆ ముఖం ఇప్పటికీ మసకగా వణు కుతూ, కరిగిపోతున్నట్టు కనపడుతూవుంది. అతను శైలా శరీరాన్ని జీవించివుండగా, చనిపోయాక కూడా చూసాడు. ఆమె సంపర్కంలోవున్న ఆ కాస్సేపట్లోనే తాను తన భావనాత్మక దారిద్ర్యాన్ని, తన నిష్క్రియ తను, తననూ కూడా తెలుసుకున్నాడు...ఇంతలో నల్లమందు పండే పొలాలు కళ్లఎదుట చేలతో ఊగు తున్నాయి. ఆ అందమైన మృత్యువుతోనిండిన పూలు. వాటిలో నిండిన భయంకరమైన విషం. అదే నల్ల మందు. దీనిద్వారా యుద్ధం ఖర్చులు సమకూరు తున్నాయి! లోయల్లో వరుసగా పెరిగిన చేలపై ఊగు తున్న ఎర్రని నల్లమందు పూలు. తాను చూస్తు న్నాడు......అక్కడికి అజ్ఞాతంగా హెలికాప్టర్‌లు వచ్చి నల్లమందు మూటలని తీసుకెడతాయి. అక్కడ ఈ తస్కర వ్యాపారం అంతర్జాతీయ వాణిజ్య నియమాలను ఉల్లంఘించి, రాజకీయ ఉద్దేశ్యాలను రహ స్యంగా దాచుకొని, కొనసాగుతూ వుంటుంది. ఆ నల్ల మందును అమ్మి—బదులుగా తుపాకులు, ఇతర ఆయు ధాలు కొనబడుతుంటాయి. ఈ నల్లమందును అమ్మి తుపాకులు చేయలేని పనిని చేస్తున్నారు. మహానగ రాల్లో ఎంతోమందిని సూక్ష్మమైన పద్ధతిద్వారా మెల్లి మెల్లిగా చంపుతున్నారు—ఎవరు? కేవలం

కొంతమంది భయంకరమైన మూథులు—అధికారాన్ని తమ చేతుల్లోకి లాక్కోవాలని ప్రయత్నిస్తున్నవాళ్ళు.'
—('ది ఫోర్ పాసేజ్': రచన—హేన్ సుయిన్)*

......ఈ నాటికి నాకు ఆ పాయంత్రం జ్ఞాపకం వుంది జకార్తానుండి తిరుగు ప్రయాణంలో బ్యాంకాక్‌లో కొన్ని రోజులు ఆగాను. ఈ కొన్ని రోజుల్లోనే బ్యాంకాక్ నన్ను ముగ్ధుణ్ణి చేసింది. బ్యాంకాక్ విమానాశ్రయంలో రంగురంగుల దుస్తులు ధరించిన బహు రకాల ప్రయాణీకులమధ్య నిశ్శబ్దంగా కూర్చున్నాను. స్వదేశానికి తిరిగి వెడుతున్నాననే సంతోషానికి బదులు బ్యాంకాక్‌ను విడిచిపెడుతున్నాననే విచారం. మనస్సు అంతా ఖాళీగా వుంది. అప్పుడే మైక్‌లో మాటలు వినపడ్డాయి—'నోమపెన్హా వెడుతున్న ప్రయాణీకులు తమ విమానంవైపు వెళ్లవలసిందని కోరుతున్నాము.' ఒక చైనా వ్యాపారి, ఒక అమెరికన్ పురుషుడు, ఇద్దరు స్త్రీ టూరిస్టులు, కెమెరా వేలాడేసుకొన్న ఒక జపాన్ పత్రికా విలేకరితోబాటు ఎంతోమంది ప్రయాణీకులు లేచి నిలుచున్నారు. అకస్మాత్తుగా నా స్మృతిలో రెండు సంవత్సరాలక్రితం నేను చదివిన హేన్ సుయిన్ నవల 'ది ఫోర్ పాసేజ్' మెరిసింది. ఆ నవలలోని సంఘటన ఈ బ్యాంకాక్ విమానాశ్రయంనుండే మొదలవుతుంది. కథానాయకుడు గియోన్, ఇద్దరు భారతీయ రచయితలు—చందర్‌దాస్, మునీ ముల్తానీ; ఒక అమెరికన్ యువతి శైలా హెన్‌లే, ఆమె తండ్రి చార్ల్స్ హెన్‌లే, ఆమె పినతల్లి ఎలిజా హేన్‌లే ఇంకా మరికొంతమంది నోమపెన్హా (కంబోడియా)లో జరిగే 'తటస్థ రచయితల అంతర్జాతీయ మహాసభ'కు వెడుతున్నారు. ఈ మహాసభ ప్రఖ్యాత దేవాలయాల నగరం అంగకోర్‌లో జరుగబోతుంది. అంగకోర్‌లో చతుర్ముఖ శివుడి విరాట్ ప్రతిమ వుంది. (దీనికి సంకేతంగానే హేన్ సుయిన్ తన నవలకు చతుర్ముఖం—The Four Passage అని పేరు పెట్టాడు.) విమానం బయలుదేరేముందు ఒక బౌద్ధభిక్షువు శైలాకు ఒక అందమైన డబ్బాను ఇచ్చివెడతాడు. శైలా స్నేహితురాలైన ఒక రాజకుమారి అంగకోర్‌లో వున్న తన బంధువుకు విలువైన చాక్‌లెట్లను ఆ డబ్బాలో పంపుతున్నది.

రచయితల మహాసభలో కొన్ని విచిత్రమైన సంఘటనలు జరుగుతాయి. అమాయకురాలైన శైలా కామగ్రంధి పీడితురాలు. ఆమె ఆ విమానంలోని ఫ్రెంచి పైలట్‌తో, మునీ ముల్తానీతో ఇంకా అనేకులతో శయ్యాభోగాన్ని అనుభవించినతర్వాత గియోన్ సంపర్కంలోకి వస్తుంది. ఒకరోజు రహస్యంగా శైలా పినతల్లి ఎలిజా, చాక్‌లెట్లువున్న గదిలోకి వస్తుంది. కారణమేమిటో తెలియదు. ఆ మహాసభకు ప్రపంచం నలుమూలలనుండి ప్రతినిధులు వచ్చారు. అంగకోర్‌పై తీయనున్న చిత్రానికి సినేరియో వ్రాస్తున్న ఒక ఇంగ్లీషు రచయిత ఎషల్ బెసిల్‌డన్; సాహిత్యం నామమాత్రమే గిరికినా, 'కాశ్మీర్ మాదే' అనే నినాదాన్ని అరిచే ఒక పాకిస్తాన్ రచయిత అహ్మద్‌ఫౌద్; ఒక యువ అల్జీరియన్ కవి, (ఇతను కవిత్వం తక్కువ వ్రాసినా గెరిల్లా పోరాటంలో ఆరితేరినవాడు) వగైరా వచ్చారు.

ఈ మహాసభ ముగుస్తూవుండగానే కంబోడియాలో హఠాత్తుగా రహస్యంగా సైనికవిప్లవం చెలరేగుతుంది. అక్కడి ఒక ప్రాంతానికిచెందిన గవర్నర్ జనరల్ వామ్ బైరంగ్ అకస్మాత్తుగా తిరుగుబాటు లేవదీసాడు. అప్పుడు వీళ్ళ నందరిని రిమాండ్‌లోకి తీసుకున్నారు. ఈలోగా తిరుగుబాటును అణచివేసిన తర్వాత వీళ్ళ నందరిని విడుదల చేసారు.

అప్పుడే తెలుస్తుంది శైలా మాయమైన సంగతి.

శైలా ముసలి ఫ్రెంచి పురాతత్వవేత్తతో అంగోర్‌వాట్ దేవాలయాల అడవుల్లోకి వెళ్లివుంటుందని ఒక అనుమానం. కాని ఆ అనుమానం నిజం కాదని తేలిపోతుంది. గియోన్ కంబోడియన్ టాక్సీవాలా సహాయంతో అంగకోర్‌లోని శిథిలాలలో, అరణ్యాలలో తిరుగుతూ వుంటాడు......

---

* హేన్-సుయిన్ వ్రాసిన ఈ పుస్తకం ప్రసక్తి తెచ్చినప్పుడు అతను తన రచనలను తన అనుభవాలు ఆధారంగా చేసాడని చెప్పవలసి వుంది. ఆయా పుస్తకాల్లో ఆయా దేశాల రాజకీయ, ఆర్థిక పరిస్థితులను అతను విస్పష్టంగా వివరించాడు. అతను పేర్లను, స్థలాలను కొన్ని కల్పించినా, దాదాపు ఇతివృత్తం సొంతం అతని సొంత అనుభవాల సారం.

'ఏనుగు శిల్పాలపై వెన్నెల విస్తరించి వుంది. గియోన్ శిథిలాలలో తిరుగుతూ తిరుగుతూ చివరికి కుష్టి సమ్రాట్టు విశాల విగ్రహంవున్న ఆవరణలోకి చేరుకున్నాడు. వెన్నెలలో ఆ విగ్రహం పేలవంగా కనపడుతోంది. సాల్వడార్—డాలీపైపు మీసాలు అందవిహీనంగా వున్నాయి. ఆ సమ్రాట్టు విగ్రహం మెడలో ఎవరో నవ్వులాటకు కాబోలు సిల్కుస్కార్ఫ్‌ను కట్టివేసారు. గియోన్ స్కార్ఫ్‌ను విప్పడం మొదలు పెట్టాడు. ఎన్నో ముడతలు—ముళ్ళుపడివున్న ఆ స్కార్ఫ్‌ను విప్పుతూ అతను కిందికిచూసాడు......

నాలుగువైపులాచూసి అతను కెవ్వున కేకవేసి—'శైలా! శైలా! నా డార్లింగ్!' అని అరిచాడు. ప్రతి ధ్వనికూడా వినిపించ లేదు. యాంత్రికంగా అతను ఒకవైపు మూలలోవున్న మెట్లవైపు సాగిపోయాడు. ఈ మెట్లు సుందరీమణుల వీధి అని యాత్రికులచే పిలవబడే ఒక ఇరుకైన సందులోకి కిందికి దారితీస్తాయి. ఈ మెట్లకు ఇరువైపుల వరుసగా అనింద్య సుందరీమణుల విగ్రహాలు వున్నాయి. ఒక్కరు తప్ప ఈ ఇరుకైన దారిగుండా ఇద్దరు పోడానికి వీలులేదు.

అక్కడే మొట్టమొదట మలుపులో ఆవిడ. నిస్పందంగా. తాను మొదటినుండి శంకిస్తున్నట్టుగానే జరిగింది. శైలాను ఇలాగే హత్య చేస్తారనే అనుమానం నిజమై పోయింది.' —(ది ఫోర్ పాసేజ్—పు: 226)

ఒక చాకలెట్ల డబ్బావల్ల శైలా ప్రాణం అపాయంలో వుందనే అనుమానం గియోన్‌కు ఎందుకో కలుగుతుంది. బ్యాంకాక్ విమానాశ్రయంలో శైలాకు ఒక రాజకుమారి తరఫున బౌద్ధభిక్షువు ఇచ్చివెళ్లిన ఆ డబ్బా అతనికి జ్ఞాపకం వుంది.

క్రమంగా అల్జీరియన్ కవి—గెరిల్లా సైనికుడైన ఇబ్రాహీం మలిక్ సహాయంతో అసలు రహస్యం బహిర్గత మవుతుంది. ఈ కుట్ర వెనుక రెండు అంశాలు దాగివున్నాయి: ఒకటి ఆకస్మిక సైనిక విప్లవంద్వారా జనరల్ వామ్ బైరంగ్‌కు అధికారాన్ని కట్టబెట్టాలని. రెండోది నల్లమందు దొంగ వ్యాపారం. నల్లమందు వ్యాపారం చేస్తున్నవాళ్లు చాలా తెలివైనవాళ్లు. వీళ్లల్లో బ్యాంకాక్ రాజకుమారి, కంబోడియా జనరల్ వామ్‌బైరంగ్ కూడా వున్నారు. వీరితోబాటు ఆ ఫ్రెంచిపైలట్, కొందరు గుఢచారులు కూడా వున్నారు. ఈ ఫ్రెంచివాళ్లు అపఖ్యాతిపాలైన ఫ్రెంచి సైనికజట్టు ఓ. ఎ. యస్‌కు చెందిన రహస్య సభ్యులు. డిగాల్‌కు వ్యతిరేకంగా పనిచేస్తూ అల్జీరియాలో ఫ్రెంచివాళ్ల శాసనాన్ని తొలిగించకూడదని ఈ ఓ. ఎ. యస్. అనే రహస్య సంస్థ రక్తపాతాన్నికూడా జరిపింది. ఇదే సంస్థ మాజీ ఫ్రెంచి ఉపనివేశ (వలస) ప్రాంతమైన ఇండోచైనా (లావోస్, కంబోడియా మొదలైన దేశాలు)లోకూడా తన వలను వేసింది. ఈ రహస్య సంస్థకు కావలసిన వివిధ ఆయుధాల కొనుగోలుకు ఈ నల్లమందు దొంగవ్యాపారంనుండి ధనం సమకూరేది. దీనికిగాను ఈ సంస్థకు చెందిన పైలట్లు విడిగా "Air Opium" (నల్లమందు విమానయానం) అనే రహస్య ఎయిర్‌లైన్‌ను నడిపేవాళ్లు. ఈ నల్లమందు తస్కరవ్యాపారంలో ఈ విమానయాన సంస్థ ఏజంట్లు ఎంతోమంది వున్నారు. శైలా పినతల్లి మిసెస్ ఎలిజబెత్ హెన్‌లే కూడా ఈ సంస్థ సభ్యురాలే. రాజకుమారి తరఫున శైలాకు అందిన డబ్బాలోని చాక్లెట్లలో నల్లమందు వుంది. ఈ విషయం శైలాకు బొత్తిగా తెలియదు.

ఆ చాక్‌లెట్ల డబ్బాను ఎలిజబెత్ చాటుగా శైలా గదిలోనుండి తీసుకువెళ్లి ఓ. ఏ. ఎస్ వాళ్లకు అందజేయాలని ప్రయత్నించింది. ఈ లోగా శైలాకు ఛాయామాత్రంగా ఆ డబ్బా వ్యవహారం తెలిసిపోయింది. అయితే ఆమె నోటిని మూయించాలంటే ఒకేఒక పద్ధతి—అది ఆమె నోటిని శాశ్వతంగా మూసివేయడం.

ఆ తర్వాత మరెన్నో విషయాలు తెలుస్తాయి. నెత్తురు రుచిచూసిన ఈ మాజీ ఉపనివేశవాదులు (వలసవాదులు) తమ అధికారాన్ని అంత సునాయాసంగా వదులుకోడానికి సిద్ధంగా లేరు. ఎక్కడైతే శాసనాన్ని నిర్వహించే వీలుందో అక్కడ తమ అధికారాన్ని క్రూరంగా, హింసాపూరితంగా అమలు చేస్తారు. ఎక్కడైతే తమ అధికారం చలాయించే అవకాశం లేదో అక్కడ కుట్రలుపన్ని ప్రభుత్వాలను కూలదోసి కీలు

బొమ్మ ప్రభుత్వాలను ప్రతిష్టిస్తారు.

ఆ తర్వాత మరో అంశంకూడా బహిర్గత మవుతుంది. జనరల్ వాన్ ఫై రంగ్ స్వయంగా నల్లమందు పొలాలకు యజమాని. ఈ ప్రత్యేక సైనిక విప్లవం కుట్ర వెనుకాల అంతర్జాతీయ ఖ్యాతివున్న భారతీయ రచయిత శ్రీ ముని ముల్తానీకికూడా ఒక పని అప్పగించారనే విషయం బయటపడు తుంది. ఇతను సైనిక విప్లవం జరగగానే ఒక వజ్రాలు పొదిగిన చేతికడియాన్ని ఎత్తుక వచ్చేయాలని అసలు పథకం. ఆ విధంగానే ముల్తానీ తన క్యామెరాలోవున్న ఒక సొరగులో ఈ వజ్రాల కడియాన్ని దాచేస్తాడు.

ఈ కుట్ర వెనుకాల ఎన్ని విచిత్రమైన ఎత్తులు?

అధికారాన్ని చేతుల్లోనుండి జారిపోనీకుండా చేయడంకోసం అమానుషమైన తంత్రాలు – యుద్ధాలు. రహస్యంగా ఆయుధాలను కొనడంకోసం, సైనికుల జీతాలకోసం నల్లమందు దొంగ వ్యాపారం. దీనిపై తెరవేయడంకోసం అందుబాటులోవున్న ప్రతి వస్తువును చాకచక్యంగా ఉపయోగించుకోవడం. చివరికి శైలాలాంటి వికసిస్తున్న, పథభ్రష్టురాలైన (కాని నిరపరాధమైన యౌవనం) యువతినిగాని లేక అంతర్జాతీయ రచయితల మహాసభనుగాని ఏదో విధంగా వినియోగించుకోవడం.

అయితే ఇదంతా చతుర్ముఖ శివుని సమక్షంలో, నిశ్చలమైన సాక్షి నీడలో జరిగిపోయింది.

కెరువాక్ ఈ తరం ఒక అన్వేషణను కొనసాగిస్తోందని, ఆ అన్వేషణకు నల్లమందు ద్వారాలు తెరుస్తోందని అంటున్నాడు. కాని ఈ నల్లమందు మసక వెలుగు వెనుకాల ఒక ప్రభుసత్తావుందని, దాని అసలు ముఖం ఎంత వికృతంగా వుందో అతనికి ఎవరైనా చెబితే బాగుండును. ఒక వికృతమైన ముఖం – స్వార్థాంధ పశ్చిమ ఉపనివేశవాదుల ముఖం. ఆసియా, ఆఫ్రికాలలో అధికారాన్ని పోగొట్టుకొన్నా, పోనీకుండా చేయడంకోసం ఎలాంటి బర్బర అమానుషిక పద్ధతులనైన అనుసరిస్తుంది ఈ ముఖం. రెండో ముఖం: ఎవ్వరితోనైనా ఎలాంటి ఒప్పందానికైనా దిగి పాలనాసూత్రాన్ని తన హస్తగతం చేసుకోడంకోసం ప్రయత్నించే ఆశియాలోని అధికారలోలుపతకు గురైన రాజకీయుల్లాని ముఖం. మూడో ముఖం: తన దేశం మట్టినుండి పెకిలివేసుకొని ఆకాశంలో వేలాడుతున్న లతలా అంతర్జాతీయ మహాసభల, ఇతర ఆర్థికకృత్యాలద్వారా డాంబికమైన యశాన్ని ఆర్జించ ప్రయత్నించే ఛద్మ బుద్ధిజీవియైన రచయిత ముఖం. ఇతను ఏలకమైన నైతికమైన పట్టింపులు లేకుండా చివరికి ఏ విదేశీ సంస్థల ఏజంటుగానైన పనిచేసి తన ఖ్యాతిని గడించుకోడానికి యత్నిస్తున్నాడు.

* * *

ఇంతకు ఈ మూడు ముఖాలేనా? లేక ఈ నల్లమందు మసకవెలుతురుకు అవల నాలుగో ముఖమేదైనా వున్నదా?

పశ్చిమ ఉపనివేశవాది, భ్రష్టుడైన ఆశియా రాజనీతిజ్ఞుడు, స్వార్థుడైన బుద్ధిజీవితోపాటు ఈ విచిత్రమైన నల్లమందు దొంగవ్యాపారంలో నాలుగో ముఖం ఎర్రచైనాదని చెబితే ఎవరు నమ్ముతారు!

అయినా ఇది విచిత్రమైన వాస్తవం. ప్రజా విప్లవాలను, ఆశియా పునర్జాగృతిని లేకెత్తిస్తానని ప్రతిజ్ఞలుచేసే ఎర్రచైనా నల్లమందు దొంగవ్యాపారానికి అత్యధికంగా ఆశ్రయం కల్పిస్తోంది. ఐక్యరాజ్య సమితి స్వయంగా జరిపిన సర్వేక్షణలో ఈ అంశం స్పష్టంగా అంగీకరించబడింది. సమితివర్గాల ననుసరించి ఉత్తరబర్మా, థాయిలెండ్, లావోస్, ఎర్రచైనా ఆగ్నేయప్రాంతం నల్లమందుకు పెట్టని కోటల్లాంటివని విదితమవుతోంది. ముఖ్యంగా చైనాలోని యన్నాన్, క్వీచావు, శ్వాసీప్రాంతాలు దీని ప్రత్యేకమైన ఉత్పత్తి కేంద్రాలు. చైనాలోని పర్వత ప్రాంతమైన యున్నాన్‌లో ప్రపంచంలో ఎక్కడా ఉత్పత్తికానంత నల్లమందు పండుతుందని ఐక్యరాజ్య సమితి పర్యవేక్షకులు చెబుతున్నారు. జెమావో, చెలీ ప్రాంతాలలోవున్న పెద్ద పెద్ద గిడ్డంగులనుండి కూలీలు, కంచరగాడిదలద్వారా నల్లమందును బర్మా పరిహద్దులకు చేరవేస్తారు. అక్కడినుండి బర్మా దొంగవ్యాపారస్థులు ఈ నల్లమందును జాగ్రత్తగా దాచి సాల్విన్‌నదీతీర ప్రాంతంగుండా థాయిలెండ్,

లావోస్ పరిహద్దులకు చేరవేస్తారు. అక్కడవున్న రహస్య గిడ్డంగులనుండి ఆగ్నేయాసియానుండి వచ్చే ప్రవాస చైనా వ్యాపారులు ఈ నల్లమందును అనేక ప్రాంతాలకు తిరిగి పంపిస్తారు. ఆ తర్వాత ఇదే నల్లమందు బ్యాంకాక్, సింగపూర్, హాంగ్‌కాంగ్, టోక్యోలగుండా అమెరికా యూరప్ దేశాలకు చేరుకుంటుంది. చైనాకు విదేశీద్రవ్యం అవసరం ఎంతగానో వుండేది. కేవలం తన ప్రణాళికల అమలుకే కాకుండా అణుబాంబు ఉత్పత్తికి ఆ ద్రవ్యం అవసరమైంది. రష్యా తదితర దేశాలనుండి ఆయుధాలు, ట్యాంకులు, యుద్ధవిమానాలుకొని, పాకిస్తాన్ తదితర మిత్రదేశాలకు కానుకగా ఇవ్వడంకోసం ఆ విదేశీ ద్రవ్యం కావలసి వచ్చింది. అయితే ఈ విదేశీ ద్రవ్యం చైనాకు మామూలు వ్యాపారంవల్లగాని విదేశీసహాయంవల్లగాని లభించే అవకాశాలు లేవు. అందువల్లే ఈ నల్లమందు తస్కర వ్యాపారంద్వారా సువర్ణరాసులను సులభసాధ్యంగా రాబట్టుకో గలుగుతున్నది.

ఇక ఎర్రచైనా, అమెరికా, యూరప్‌దేశాల మధ్య జరుగుతున్న ఈ నల్లమందు దొంగ వ్యాపారానికివున్న లంకెలుకూడా ఆసక్తి జనకంగా వున్నాయి. ఆగ్నేయాసియా రాజకీయాలను విశితంగా పరిశీలిస్తున్న వాళ్లకు ఒక విషయం స్పష్టంగా తెలుస్తుంది. ఉత్తర బర్మా అడవుల్లో కమ్యూనిస్టు వ్యతిరేకి అయిన చ్యాంగ్‌కాయిషేక్ సైన్యానికి చెందిన ఒక పెద్ద డివిజన్ ఈ నాటికీ అక్కడే వుంది. ఈ డివిజన్ అసలు చైనా సివిల్ వార్‌లో మావో సైన్యంతో ఓడిపోయి ఈ అడవుల్లోకి పారిపోయివచ్చి చిక్కుకొని పోయింది. రష్యా, అమెరికా, భారత దేశాలముందు తన బల ప్రదర్శనం చేస్తున్న ఎర్రచైనా ఈ చ్యాంగ్‌కాయిషేక్ మామూలు సైనికుల జట్టును ఓడించలేకపోతోంది. చివరికి కవ్వించనైనా లేకపోతోంది. కారణం వింటే ఆశ్చర్యంగానే వుంటుంది. నేషనలిస్టు చైనా 93 వ డివిజన్‌కు చెందిన ఈ 500 మంది సాయుధ సైనికులు ఒక రకంగా చైనా నల్లమందు దొంగ వ్యాపారానికి సాయుధులైన రక్షకులు. వీళ్లు ఇక్కడ నల్లమందును చేరవేసే జట్లను షాన్ ప్రదేశానికి చెందిన బందిపోటు దొంగలనుండి కాపాడుతుంటారు. ఈ డివిజన్‌కు చెందిన ఎంతోమంది సైనికాధికారులు ఈ నల్లమందు గిడ్డంగులకు యజమానులు. ఒకసారి థాయిలాండ్‌లోని ఒక గ్రామంలో కమ్యూనిస్టు వ్యతిరేకి అయిన నేషనలిస్టు చైనా సైనికాధికారిని అమెరికన్ పత్రికా విలేకరి స్టేన్లీ కార్నావో అనే అతను కలుసుకున్నప్పుడు ఇలా అడిగాడు—'మీరు ఎర్రచైనా నల్లమందు దొంగ వ్యాపారంలో ఎందుకు సహాయపడుతున్నారు?'

అప్పుడు ఆ సైనికాధికారి నవ్వి ఇలా అన్నాడు—'ముందు బ్రతికివుంటేకదా మావోత్సే తుంగ్‌తో పోరాడడం! ఆ బంజరు పర్వతప్రాంతాలలో మేము జీవించాలంటే, నూతన ఆయుధాలను సమకూర్చుకోవాలంటే డబ్బు ఎక్కడినుండి వస్తుంది?'

ఫ్రెంచి ఉపనివేశవాదులసంస్థ అయిన ఓ. ఎ. ఎస్. తన విమానయానంద్వారా వీళ్లకు ఎలా సహాయపడుతుందో హేన్‌సుయ్యాన్ వివరించాడు. కాని విచిత్రమేమిటంటే అమెరికన్ వైమానికబలానికి చెందిన అధికార్లుకూడా ఈ వ్యాపారంలో చేదోడుగా వుంటారని అమెరికన్ సైనిక రిపోర్టులద్వారా వెల్లడవుతున్నది. కొన్నిరోజుల క్రితం అమెరికన్ వైమానిక బలానికిచెందిన ఒక సార్జంట్ అకస్మాత్తుగా వైభోగాలలో జీవించడం ప్రారంభించాడు. అతను హాంగ్‌కాంగ్, టోక్యోలలో అన్ని సౌకర్యాలున్న రెండు ఫ్లాట్‌లను; ఒక చైనా, ఒక జపాన్ ఉంపుడుగత్తెలను ఏర్పాటుచేసుకున్నాడు. అమెరికన్ గూఢచారిశాఖకు అనుమానం వేసింది. ఒకరోజు అతని విమానంలో నల్లమందుపెట్టెలు దొరికాయి.

ఈనాటి అరాచకత్వానికి వెనుక ఇలా అంతర్జాతీయ దొంగనాటకం సాగిపోతోంది. అందరికీ బంగారం కావాలి. చైనా పెట్టుబడిదారి బలాలను నాశనం చేయడంకోసం అణుబాంబును నిర్మిస్తోంది. ఆ నిర్మాణానికి బంగారం కావాలి. నేషనలిస్టు చైనాకు ఎర్రచైనా సైన్యాలను ఓడించడానికి బంగారం కావాలి. మాజీ వలసలపై తమ వలస సామ్రాజ్యాధిపత్యాన్ని సుస్థిరం చేయడంకోసం ఓ. ఎ. యస్. కు కూడా బంగారం కావాలి. ఇలా ఒకరిని ఒకరు సర్వనాశనం చేసుకోడానికి వీళ్లకు బంగారం కావాలి. ఈ బంగారం నల్లమందు దొంగవ్యాపారం ద్వారా సునాయాసంగా లభిస్తుంది. ఈ నల్లమందు దొంగవ్యాపారం చేస్తున్నప్పుడు ఎర్రచైనా కమిస్సార్

లకు, ఓ. ఎ. యస్. పైలట్లకు, చ్యాంగ్‌కాయ్ షేక్ సైనికాధికారులకు రాజకీయాల, సిద్ధాంతాల, దేశ సరిహద్దుల, ఆదర్శాల అవసరం ఏమాత్రం లేదు. నల్లమందు వ్యాపారం మాత్రమే వాళ్లకు వృత్తి— అదంతా రాజకీయాలకు అతీతంగా జీవించే మరో ప్రపంచం.

ఇప్పుడు ఇలాగే న్యూయార్క్‌లోని బీట్‌నిక్‌లు, వాళ్లను అనుకరిస్తున్న ఇతర దేశాలలోని యువకులు కూడా తమకు ఒక దేశం, ఒక జాతి అనేదిలేదని, ఏ సరిహద్దు తగాదాలు లేవని, ఏ సైద్ధాంతికమైన పట్టింపులు లేవని అంటున్నారు. ఇది కేవలం ఆ నల్లమందు దొంగవ్యాపారుల ప్రతిధ్వనిగానే భాసిస్తున్నది. ఆ నల్లమందు తస్కర వ్యాపారం సాగించే కమ్యూనిస్టులు, నేషనలిస్టులు, ఓ. ఎ. యస్. సభ్యులు కూడా ఒక స్థాయిలో తమకు దేశం, సైద్ధాంతికమైన పట్టింపులు లేవనే అంటున్నారు.

*           *           *

ప్రకటనలు, వస్తువుల అమ్మకానికి వున్న పరస్పర సంబంధాన్ని మనోవైజ్ఞానికస్థాయిలో అధ్యయనం చేసినవారికి ఒక అంశం సువిదితమే. ఏదైనా వస్తువుకు గిరాకీని పెంపొందింపే సులభమార్గం — దానిని ఉన్నతవర్గాలకు చెందిన గౌరవప్రతీకగా మార్చివేసి, దానిపై చర్చలను లేవదీయడం ఒక ముఖ్యమైన పద్ధతి. నల్లమందు గురించి పాత ధోరణిలో ఆలోచిస్తే మనకు వెంటనే విలాసత్వంలో మునిగిన నల్లమందుభాయిలు, కునికిపాట్లు పడుతున్నవాళ్లు, ఈగలు ముసురుతున్నా చేతులు ఊపుతూ కూచునేవాళ్లు, మూర్ఖంగా మాట్లాడేవాళ్లు జ్ఞాపకం వస్తారు. కాని అదే నల్లమందును ఈ నాటి యుగబోధతో, విక్షోభంతో, గాఢ ఆంతరిక అనుభూతితో, భగవంతుని ముఖాన్వేషణతో, కవిత్వంతో, జాజ్ సంగీతంతో, స్వేచ్ఛావర్తనతో, అరాచకవాదంతో, ఆకర్షణీయమైన పదజాలంతో, తత్వంతో జోడిస్తే వెంటనే అది ఉన్నతమైన విశిష్టవర్గానికి చెందిన సంకేతంగా లోకులు భావిస్తారు. దీనితో ఇక నల్లమందు స్థాయి అకస్మాత్తుగా పైకిలేచి, బజారుధర కూడా విపరీతంగా పెరిగిపోతుంది.

దానితోబాటు 'నల్లమందు దుకాణం' అనిగాని, 'గంజాయి, భాంగ్‌కొట్టు' అనిగాని పేర్లు కనపడవు. వాటి స్థానంలో 'కాఫె ద ఆర్టిస్ట్' అని దర్శనమిస్తుంది. ఎట్రచైనా, ఓ. ఎ. యస్. లకు తమ నల్లమందువ్యాపారానికి ఒక నూతన అంతర్జాతీయ వాణిజ్యరంగపు ద్వారాలు తెరుచుకొంటాయి. తమ వ్యాపారాన్ని పరోక్షంగా సమర్థించి, ప్రోత్సహించే ఒక—ఉద్యమం ఊత లభిస్తుంది. ఈ ఉద్యమం ప్రబలినకొద్దీ ఈ నల్లమందు వ్యాపారంకూడా వృద్ధిచెంది తనకుతానే ప్రసరిస్తుంది.

19 వ శతాబ్దంలోని పద్ధతితో పోల్చి చూస్తే ఈ పద్ధతి ఎంత సులభం! ఆ రోజుల్లో పాశ్చాత్యులు (ముఖ్యంగా ఇంగ్లాండ్) తమ నల్లమందును చైనాలో ఎక్కువ మోతాదులో ఎలా అమ్మాలా అని ప్రయత్నించేవాళ్లు. భారతదేశం మొదలైన వలసలలో నల్లమందును పెద్దఎత్తున పండించి చైనాలో అమ్మాలనే పథకం వేసింది ఇంగ్లాండు. అయితే ఆ నాటి చైనాప్రభుత్వం దీన్ని వ్యతిరేకించింది. అయినా—"1820–1830 మధ్య చైనాలో ఇంగ్లాండు వర్తకం ముమ్మరంగా సాగింది. ముఖ్యంగా నల్లమందును దిగుమతిచేసే వ్యాపారం పెద్దఎత్తున జరిగింది. చైనా సామంతులు, ధనికులు, ప్రభుత్వ అధికారులు నల్లమందును వాడుకోడం పెరిగినకొద్దీ చైనాలో నల్లమందుపట్ల వున్న వ్యతిరేకభావం నశించలేదుకాని బొత్తిగా పనికిరానిదైపోయింది.' ('ది రెడ్ బార్‌బేరియన్స్'; రచన: రాయ్ మెగ్రెగర్ హెస్టి).

ఆ తర్వాత చైనీయులు దృఢంగా వ్యతిరేకించడం ప్రారంభం కాగానే ఇంగ్లీషువాళ్లు యుద్ధం ప్రకటించారు. దీనినే చరిత్రలో 'నల్లమందు యుద్ధమని' సంబోధించారు. ఏమైనా మొత్తంపై చరిత్ర తన విచిత్ర వ్యంగ్యభావాన్ని ప్రస్తుతం పాశ్చాత్యులపై అక్షరాల విరూపిస్తున్నది. ఇప్పుడు ఎట్రచైనా సామ్రాజ్యవాదులు మాజీ ఇంగ్లీషు—సామ్రాజ్యవాదుల ద్వారా తమ నల్లమందును లండన్, న్యూయార్క్ మార్కెట్లలో అమ్మిస్తున్నారు. 19 వ శతాబ్దంలో చైనీయులను నల్లమందుభాయిలుగా తయారుచేయడానికి ఆనాటి ఇంగ్లీషు రణవీరులు చైనాలో ఫిరంగులు ప్రేల్చారు. ఈనాడు వాళ్ల మనుమలు, ముని

మనుమలు చెలసీలోని కెఫేలలో కొవ్వొత్తి వెలుగులో కూర్చొని నల్లమందును సేవిస్తున్నారు. కటకటాల వెనక్కి వెడుతున్నారు.

ఈ రోజుల్లో నల్లమందు వ్యాపారాన్ని విస్తృతం చేయాలనుకుంటే సైన్యాన్ని పంపించే అవసరంలేదు. ఒక బీట్‌నిక్‌- ఏస్క్రీస్తు కలకత్తా, పాట్నా, బనారస్‌లలో తీర్థయాత్ర జరిపితే చాలు; ఆ ప్రాంతాల్లోకూడా కొంతకాలానికే ఊరుపుల అర ణ్యాల్లో, నల్లమందు పొరలకు ఆవల భగవంతుని ముఖాన్ని వెతికేవాళ్ల ఒక సంప్రదాయం జనిస్తుంది. వీటితోబాటు ఆ విచిత్రమనోభావాలు, ఆ పదజాలం, ఆ వివిధభంగిమలు కూడా పుట్టుకొస్తాయి. వీటి వ్రేళ్లు మన—చారిత్రక పరిస్థితుల్లో లేకున్నా మనకు ఒకరకమైన మిథ్యా ఆధునికత్వాన్ని, ఒక అల్పఆత్మసంతృప్తిని ఇస్తున్నాయి.

* * *

ప్రస్తుత యువతరాన్ని పీడిస్తున్న తీవ్ర విక్షోభం, తిరుగుబాటు వాస్తవంగా బీట్ ఉద్య మంలో మౌలికంగా వుంది. ఇన్ని క్లిష్టపరిస్థితుల్లో ఈ మౌలిక తపనను ఒక రచనాత్మకమైన దిశవైపుకు మళ్లిస్తే అసలు ఈ విధంగా వుంటుంది—'ఈ ధరిత్రి వినాశనానికి దారితీస్తోంది. ఇక్కడ జీవితాన్ని—జీవించాలంటే యథార్థాన్ని అలాగే రంగులు పూయ కుండా చూడాలి. ఇది తప్ప మిగతాదంతా కేవలం మోసం, భ్రమ. వ్యావహారిక ప్రపంచం ఒక విధంగా బూటకమైన మానసిక లోకంలో జీవిస్తున్నది. ఈ ప్రపంచంలోని విచిత్ర వాతావరణంలో సమాధులు, అక్కడ గోడలపై రాజకీయ నినాదాలను వ్రాస్తున్న వాళ్లు కనపడతారు. కాని బీట్ అయినవాడు తాను 'కేవలం ఏకాకి' అనే సత్యాన్ని గ్రహించినవాడు. ఈ సత్యాన్ని అవధరించి అలా జీవించడం నేర్చుకోడమే వాడికి అసలు సమస్య.' (Beat Generation and Angry young men)

కాని యథార్థంగా నిజ జీవితంలో వీళ్లు వాస్తవాన్ని దర్శించ గలుగుతున్నారా? నల్లమందు మొదలు ఎల్. యస్. డి. వంటి మత్తు ద్రవ్యాలు సృష్టిస్తున్న ఒక మిథ్యా ఇంద్రజాలిక విశ్వాన్ని అనుభవించి వీళ్లు దానిని తమ ఆంతరిక వ్యథగా వ్యక్తం చేస్తున్నారు. ఆ వ్యథను మళ్లీ మళ్లీ వర్ణి స్తున్నారు.

ఎలాంటి వ్యంగ్యాత్మకమైన పరిణామమో—గమనించండి! బుద్ధి, వివేకం నశిస్తున్న ప్రపంచానికి వ్యతిరేకంగా, ముసుగులు, డాంబికమైన విలువలున్న ప్రపంచానికి వ్యతిరేకంగా తిరుగుబాటును లేవనెత్తు తున్న వీళ్లు చివరికి మళ్లా నల్లమందు, మరిజువానా ఎల్. యస్. డి. సృష్టిస్తున్న కాల్పనిక లోకాలకు ఎగిరిపోతున్నారు. ఆ కాల్పనిక ప్రపంచంలో కార్య కారణ సంబంధాలుగాని, ముసుగులుగాని లేవు. కేవలం అంతటా వాయవీయమైన మానసిక—అరా చకపు ప్రతిబింబాలు. భ్రాంతి కలిగించే ప్రపంచం నుండి వెళ్ళిపోడానికి మళ్లీ భ్రాంతి కలిగించే ప్రపంచంలోకే పలాయనం.

అయితే ఇంతకు ఈ ధూమవ్యాంతర్గత—విలాస గృహాలకు కేవలం వ్యథాపీడితులు, తిరుగుబాటు వర్గానికి చెందిన అగ్రనాయకులే వస్తారా? నిరితో బాటు ప్రతిభావిహీనులు, నిజమైన సృజనాత్మకశక్తి లేనివాళ్లు, నిర్భయంగా తిరుగుబాటు చేయలేని వాళ్లు, పరాజయపీడితులుకానివాళ్లుకూడా తమ మిథ్యా ఆత్మబింబాన్ని ప్రస్ఫుటంచేసి ఒక క్షణికమైన 'థ్రిల్' (Thrill) కోసం వస్తారు. మొదట్లో చెప్పి నట్టు చెలసీలోని 'కాఫె ద ఆర్టిస్ట్'లో ఆ రాత్రి జరిగిన దాడిలో పట్టుబడిన ఆ ఆరుగురి, పేర్లను, వృత్తులను వయస్సులను 'డేలీ టెలిగ్రాఫ్' ప్రచు రించినది. ఈ ఆరుగురి దగ్గర నల్లమందు బయట పడింది. ఆ పట్టిక ఇలా వుంది: పీటర్‌జాన్ ఎలిస్, వయసు 28, మోటారు మేస్త్రీ; బర్నార్డ్ వెల్డ్స్ మ్యాన్, వయస్సు 24, మోటారు మెకానిక్కు; కెనెత్ బ్రవున్, వయస్సు 24, దర్జీ; ఇయాన్ లాఫాయే, వయస్సు 21, గిడ్డంగి కాపలాదారు; పీటర్ డోనాల్ డాసన్, వయస్సు 30, గుమాస్తా; టోనీ టామస్. వయస్సు 19, క్లర్కు!

ఈ మెకానిక్, దర్జీ, గుమాస్తా, కాపలాదారు లాంటి వ్యక్తులు రోజంతా పనిచేసి సాయంత్రం కాగానే తమ కల్పితమైన తిరుగుబాటు వ్యక్తిత్వాన్ని ఊహించుకొని 'కాఫె ద ఆర్టిస్ట్'లో నల్లమందు

సేవించి కాస్సేపు విముక్తి పొందినవాళ్ళు అవుతారు. ఉదయం కాగానే మళ్ళీ తలవంచుకొని పనిలోకి వెళ్ళి పోతారు. ఇలా నల్లమందు వీళ్ళలో పనిచేసే సమర్థ తను మిగిల్చేవరకు ఈ క్రమం సాగిపోతుంది.

అబద్ధపు ముసుగుతో ఘర్షణ పడతానని బయలుదేరిన ఈ శక్తివంతమైన ఉద్యమం స్వయంగా మరొక ముసుగులోకి ఎలా పరిణమించింది? ఈ ఉద్యమం (తిరుగుబాటు) ఎందువల్ల ఒక నూతన సంకల్పశక్తినుండి పుట్టే దృఢత్వాన్ని ఇవ్వలేదు? ఎందువల్ల ఈ తిరుగుబాటు మిథ్యావిలువలను చిన్నా భిన్నంచేసి నూతన ఉజ్వలమైన వివేకాన్ని సంతరించ చేయలేదు? యదార్థం, కటువైన యదార్థం, కేవలం యదార్థాన్ని కళ్ళారా నిర్భయంగా వీక్షిస్తామనే ప్రతిజ్ఞ ఏమైపోయింది?

చివరికి వీళ్ళకి భగవంతుడు లభించాడా?

కొన్నిరోజులక్రితం ఈ ఉద్యమం ఒక ఆసక్తి కరమైన మలుపు తిరిగింది. అక్టోబర్ 24 నాటి ఉదయం. న్యూయార్క్‌లోని లోయర్ ఈస్ట్‌సైడ్ పార్క్‌లో ఆడుతున పిల్లలు, విహరిస్తున్న వీరులు ఒక కొత్త దృశ్యాన్ని చూచారు. ఒక పెద్ద చెట్టు క్రింద దాదాపు 50 మంది వ్యక్తులు హార్మోనియం, గంట, మృదంగం, సితార్ వగైరాలను మోగిస్తూ, ఊగిపోతూ కీర్తన చేస్తున్నారు ',హరే కృష్ణ, హరే కృష్ణ, కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే! హరే రామ, హరే రామ. రామ, రామ హరే, హరే!'' కీర్తనబృందానికి ఎదురుగా భారతీయస్వాములు ఎ. సి. భక్తివేదాంత్ కూర్చున్నారు. బృందంలో ప్రముఖవ్యక్తి బీటనిక్ శిరోమణి ఎలెన్ గిన్స్‌బర్గ్ కూడా వున్నాడు.

కీర్తన జరుగుతున్నప్పుడు మధ్యలో గిన్స్‌బర్గ్ అక్కడ కూడిన జనాన్ని ఉద్దేశించి కీర్తన ఒక అద్భుతమైన ఆంతరిక ఉల్లాసాన్ని కలుగజేస్తుందని, ఈ ఉల్లాసంతో పోల్చితే నల్లమందు, ఎల్. యస్. డి. ఇచ్చే ఉల్లాసం వ్యర్థమైనదని, కీర్తన చేశాక మళ్ళీ బాహ్యమైన మాదకద్రవ్యాల అవసరం ఏమాత్రం వుండదని చెప్పాడు. ఆ తరవాత అతను హరేకృష్ణ, హరేరామ పదాల అర్థాన్ని విడమర్చి చెబుతూ ఈ కీర్తనవల్ల ఉద్భవించే ఆధ్యాత్మిక మైన ఉచ్చారణశ్వాసకు ఒక ప్రాణమయమైన ఒక యోగశక్తిని ప్రసాదిస్తుందని అన్నాడు.

అయితే చివరికి తిరుగుబాటు నాయకుడు గిన్స్‌బర్గ్‌కు నల్లమందు మసకనీడల్లోకాకుండా, ఆ నీడలను వదిలేశాకనే భగవంతుడు లభించాడు. కాని హతవిధీ! ఇంతటి నూతనమైన తిరుగుబాటు ఉద్యమానికి చివరికి ఇలాంటి పురాతనమైన సాధారణమైన భగవంతుడు లభించడం...హరేరామ!హరేరామ!

ఈ సంఘటన జరిగిన తరవాత మరి బీటనిక్‌లను అక్షరాలా అనుకరించే ఇతరదేశాల తిరుగుబాటు దారుల నవీనమ్యానిఫెస్టోలలో ఎలాంటి మార్పు వచ్చిందో చెప్పలేము. అయితే, ఒకటిమాత్రం నిజం. ఏ విప్లవ భావనాజగత్తులో స్వకీయవివేకం, సాహసం, దృష్టి, దృఢసంకల్పం లోపిస్తాయో ఆ జగత్తు ఇలాగే ఒక నల్లమందులోనుండి మరొక రకమైన నల్లమందులోకి దారితప్పి తిరుగుతుంటుంది. ఈ పెడదారి రాజకీయ నల్లమందునుండి నల్లమందు తస్కర వ్యాపారంలోకి వెడుతుంది. అలాగే గుడ్డి అనుమానాల నల్లమందునుండి, అంధభక్తితోకూడిన నల్లమందులోకి వెడుతుంది. ఈ దారి తప్పడం అనేది ఇలాగే కొనసాగుతుంది. తాను మనిషినని, తనకు ఒక సమాజం, పరిపరాలు, చారిత్రకగతం, తన స్వంతదనే వాతావరణం వున్నదనుకునేవరకు; తనలోని వివేకం, సాహసం, సంకల్పం మొదలైన వాటితో తన ఉనికిని సార్థకం చేసుకునేంతవరకు సాగుతుంది—తప్పదు.

# అరాచకత్వపు రాజనీతి

## సాహిత్యోద్యమాల వెనుక పరిగెడుతున్న భారతీయ బుద్ధిజీవులు

దాదాపు రెండు సంవత్సరాల క్రితం మన దేశం అన్యాయంగా మనపై దాడెత్తిన దురాక్రమణ దారుని సవాలును విజయవంతంగా ఎదుర్కొని, రెండో దురాక్రమణదారు బెదిరింపులను లెక్కచేయక ఒక సామాన్యవ్యక్తి నాయకత్వంలో జనసామాన్యం

సొంతం ప్రదర్శించిన ఉదాత్తభావం, నిశ్చలమైన విశ్వాసదీప్తిని మనం చూశాము. ఆ తర్వాత మరో ఊపు. రూపాయి విలువ తగ్గింపు, పెరుగుతున్న ధరలు, ఆకలి చావులు, విద్యార్థుల ఆందోళన, కొట్లాటలు, మళ్లీ ఎన్నికలు. ఎన్నికల్లో ఆశించని— మలుపు తిరిగిన దేశం.

ఇలా మనచుట్టూ వందలాది జ్వలించే సమస్యలను చూస్తూ అనుభవిస్తున్నాము. అయినా కొందరు యువరచయితలు తిరుగుబాటు పేరిట కేవలం వణుకుతున్న తొడలను, మర్దన కావించబడుతున్న నితంబాలను వర్ణిస్తున్నారు. దేశాన్ని, ప్రేమను చర్చించకుండా ఆడవాళ్లను మార్చుకొనే వ్యవస్థ గురించి వ్రాస్తున్నారు. 'దేహ రాజనీతి తప్ప మరో వికటమైన, సన్నిహితమైన రాజనీతి లేదు – సంజయ'. ఇది తప్ప వీళ్లకు మరో జీవనోద్దేశం లేదు.

వీళ్లంతా ఒక రకంగా 'ఏమీ లేదు' అనే స్థితిలో జీవిస్తున్నారు. 'ఏమీ లేదనే శూన్యస్థితిలో జీవిస్తూ తమ నడుం ఎముకల్లో వియత్నాం యుద్ధాన్ని రచిస్తూ, ప్రతిఒక్క ఛిద్రంతో కామేచ్ఛను ప్రకటించే ఈ రచయితలు తమ స్వంత జీవితంలో ద్వైధీభావంతో బ్రతుకుతున్నారు. సంభోగంకాని వాటిపట్ల తిరుగుబాటు లేవదీయని మరికొందరు నిజజీవితంలో చాలా భయస్థులు.

ఒక అనుకరణలో ఒక అరాచకపు వివేకవంతమైన బిందువునుండి బయలుదేరిన ఈ ఉద్యమాలు మానవతను వ్యతిరేకించే రాజకీయాల దుమ్ములో కొట్టుకొంటున్నాయి.

కొంతకాలం క్రితమే కొన్నిదేశాల్లో సాహిత్యంపై రాజకీయాలు నెరపుతున్న నిరంకుశత్వాన్ని మనం చూశాం. కొన్ని దేశాల్లో జాతి, ఉత్తమజాతి తదితర వాదాల పేరుతో సాహిత్య స్వేచ్ఛను అరికట్టాలనే ప్రయత్నం జరిగింది. సమాజం అనే సాకుతో రాజకీయ స్వార్థాలను దాచి సాహిత్యాలను శాసించే దుష్ప్రయత్నాన్ని ఇంతక్రితమే 'God that failed' అనే గ్రంథంలో కెస్లర్, స్పెండర్‌తోబాటు; థామస్ మాన్‌కూడా 'Seven Arts' అనే పుస్తకంలో బహిర్గతం చేసారు.

ఈ రచయితలే కాకుండా రష్యాలోకూడా, పాస్టర్‌నాక్‌నుండి ఎతుషెంకోవరకు రాజకీయపు సంకెళ్లను తెంచివేయడానికి జరిపిన ప్రయత్నం అందరికి తెలిసిందే. సంకీర్ణ రాజకీయాలు, మతాలు వివేకవంతమైన సాహిత్య స్వేచ్ఛను అపహరించాలని యత్నించినప్పుడల్లా ప్రతిభావంతులైన రచయితలు ప్రతిఘటించారు. దాదాపు 20 సంవత్సరాల క్రితమే థామస్‌మాన్ రాజకీయాలను వ్యతిరేకిస్తూ రచనాధర్మాన్ని ఇలా నిర్వచించాడు –'రచయిత తాను సమాజాన్ని ఉద్ధరించే బాధ్యతను తలపై వేసుకోలేదని అంటే - అతన్ని నేను తప్పుపట్టను. రచయిత (కళాకారుడు) ప్రపంచాన్ని నైతిక ఉపదేశాలద్వారా కాకుండా ప్రత్యేక విధానంద్వారా బాగుచేస్తాడు. ఆధ్యాంతరికమైన అర్థాన్ని ప్రయుక్తంచేసి రచయిత తన జీవితానుభూతిద్వారా భావాల్లో, పదాల్లో, పదచిత్రాల్లో జీవిస్తాడు. ఒకరకంగా సమగ్రమైన జీవితానుభూతిని ముద్రించడంకోసం కళాకారుడు (రచయిత) వీటి నన్నింటికి లోపలినుండి జీవం పోస్తాడు.' ఇలాగే ప్రఖ్యాతహిందీ కవయిత్రి మహాదేవి వర్మ కూడా రచయితను సంస్కర్త, రాజకీయవేత్త, తత్వవేత్తనుండి భిన్నంగా చూస్తూ ఇలా అన్నారు—'జీవితాన్ని చైతన్యవంతంచేసే మార్గాలు రెండున్నాయి. ఒకటి–బాహ్యక్రమశిక్షణద్వారా; రెండు–అంతర్‌జగత్తులో ఒక స్ఫూర్తిని కలుగజేయడం ద్వారా—సామంజస్యపూరితమైన చైతన్యాన్ని ఉద్దీపింపచేయవచ్చును. అంతర్‌జగత్తులో ప్రేరణ కలుగజేసేవి బీజరూపంలో వుంటాయి. ఈ బీజాలు ఇతర బీజాల సమిష్టిని వదులుకోలేదు. అది ఒక నూతన సమిష్టిని సృష్టించడంకోసం ఆ స్థితిని స్వీకరిస్తుంది. ఒకవేళ అదే బీజం తన అసాధారణత్వాన్ని నిలుపుకోడంకోసం గాలిలో ఎగురుతూనేవుంటే అది ప్రపంచం ఎదుట తన మామూలు పరిచయాన్ని కూడా కోల్పోతుంది.'

వీటిని ఉటంకించవలసిన అవసరం ఎందుకు కలిగిందంటే—రాజకీయాలను మాత్రమే వ్యతిరేకించడం అనేది కొత్త ఏమీకాదు, గర్హ్యనీయం అసలే

కాదని స్పష్టం చేయడంకోసం. అయితే ఆ రాజకీయ వ్యతిరేకత రచయితలను పతనోన్ముఖంగా, మానవతను ద్వేషించే విధంగా, పాశవికతవైపు దిగజార్చలేదు. కాని అది మనుష్యుని ఆంతరిక అనుభూతిని, చారిత్రక చైతన్యాన్ని వ్యక్తంచేసి నూతన ద్వారాలను తెరిచింది. కాని పైన తిరుగుబాటు చేస్తున్నామనుకునే కొందరు యువరచయితల రాజకీయ వ్యతిరేకత క్రమంగా అనర్గల ప్రలాపంలోకి దిగజారి ఒకవిధంగా క్రూరచేష్టగా, మామూలు అశ్లీల రుగ్ణావస్థలోకి దారి చేసుకుంది.

మళ్ళీ మనం మొదట్లోకి ఈ తిరుగుబాటు ఉద్యమం ప్రారంభమైన అనంతశక్తిలోని ప్రాథమిక మౌలిక ధ్వనిలోకి తొంగిచూస్తే కొంత నిజాయితీని, వేదనను అర్థం చేసుకోగలుగుతాము. బీట్‌కవి ఎలెన్ గిన్స్‌బర్గ్ తన విక్షోభాన్ని, విలువలను మింగుతున్న రాజకీయాలను గర్హిస్తూ ప్రసిద్ధ చిత్రకారుడు 'విన్సెంట్ వాన్‌గో'ను సంకేతంగా తీసుకొని ఒక కవితను రచించాడు. ఇందులో అతను వచ్చున్న యుద్ధానికి అతీతంగాలేచి రష్యాలోని పాలనా వ్యవస్థకు, అమెరికాలోని పాలనావ్యవస్థకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసాడు. ఈ రెండు వ్యవస్థలు కవితా గళాన్ని నులిమి వేస్తున్నాయన్న తన ఆవేదనను గ్రిన్స్‌బర్గ్ వ్యక్తం చేస్తూ—

"అమెరికా ఆత్మను ధనం ధ్వంసం చేసింది......
విట్‌మెన్ ధర్మపుత్రుడైన లార్కాను ఫ్రాంకో హత్యచేసాడు
రష్యానుండి తప్పించుకోవాలని మెకోవస్కీ చేసిన ఆత్మహత్యా యత్నం,
వైట్ హవుస్ సౌరంగాల్లో మానవుని గొదుమలను భస్మం చేస్తున్నప్పుడు
భారతదేశం ఆకలితో చస్తూ, అరుస్తూ, పిచ్చికుక్కలను తింటూ జీవిస్తూవుండగా...
నేను నడుస్తున్నాను. నడుస్తున్నాను....
ఆశియా—ఆఫ్రికాలు నాతోబాటే;
ఈ రోజుకాకున్నా రేపైనా అమెరికా నాతో నడుస్తుంది.
నేను రక్షణనిచ్చే రాజ్యవ్యవస్థను
కేవలం అపాయాన్ని ముందు సూచించే వాణ్ణి,
కేవలం నాకు అణుబాంబులు కనపడుతున్నాయి,
ఆశియాను ఆశియా కాకుండా చేయడంలో నాకేమి ఆసక్తి?
ఆశియా, రష్యా ప్రభుత్వాలు వస్తాయి—విలీనమవుతాయి
అయినా ఆశియా, రష్యాలు విలీనం కావు
అమెరికా ప్రభుత్వం అంతే కాని అమెరికా మాత్రంకాదు.
అన్నీ శక్తులు మాయమవుతాయి ప్రభుత్వాలు తప్ప
అదృష్టవశాత్తు అన్నీ ప్రభుత్వాలుకూడా మాయంకాక తప్పదు
విలుప్తంకాని ప్రభుత్వాలు మాత్రమే మంచి ప్రభుత్వాలు
మంచి ప్రభుత్వాలు ప్రపంచంలో ప్రస్తుతం ఎక్కడా లేవు
అయినా మంచి ప్రభుత్వాలు అస్తిత్వ ధారణ చేసుకుంటున్నాయి
నా కవితలలో,

చరిత్ర నిరూపిస్తుంది ఈ కవితను ప్రవక్త వాణిగా,
మనిషి అవాస్తవమైన ఆదర్శాల ఆకలిని ఇక సహించలేడు
యుద్ధం ఒక అవాస్తవికమైన ఆదర్శం
ప్రపంచం నశించిపోతుంది
కాని ప్రపంచాన్ని రక్షించే నా కవితకోసం అసువులు అర్పిస్తాను
ఇప్పుడిక రాక్షసునికోసం ఒక్కనిమిషమైనా ప్రచారం వద్దు
కవులు రాజకీయాలనుండి దూరం వెళ్ళాలి కాకపోతే రాక్షసులుగా మారాలి.
ధనం—ధనం—ధనం—అరుస్తున్న ఉద్భ్రాంతమైన అలౌకికమైన ధనం!
భ్రమలతోనిండి, శూన్యంలోంచి, ఆకలి చావుల్లోంచి,
ఆత్మహత్యలలోంచి రూపమెత్తిన ధనం. ఓటమికి గుర్తు ధనం. చావుకు గుర్తు ధనం.
("Death to Van Gogh's Years" By Allen Ginsberg).

---

గిన్స్‌బర్గ్ వ్రాసిన ఈ కవిత నిస్సందేహంగా ప్రచ్ఛన్న యుద్ధంలో చిక్కుకొని, ధనం—అధికార దాహంతో పిచ్చెత్తిన ఒక సంస్కృతిని నిశితంగా దుయ్యబడుతున్నది. అధికారం—ధనం మత్తులోవున్న సంస్కృతి ఏ ముద్రనైనా వేసుకోవచ్చును. ఈ మానవ వ్యతిరేకి అయిన వ్యవస్థనుండి కవిని వేరుచేసి విముక్త మానవునిగా దర్శించే అతని ప్రయత్నం తప్పకుండా ప్రశంసనీయం.

అయితే ఈ బీట్ కవులు మానవుణి ఏ దిశలో—ఎందుకు విముక్తుణ్ణి చేస్తున్నారు? కవి తన బాధ్యతను ఏ స్థాయిలో సార్థకం చేసుకుంటున్నాడు? అతని కవితలలో అస్తిత్వధారణ చేసుకుంటున్న ఆ మంచి ప్రభుత్వాలు ఏవి?

ఇక్కడే బీట్ కవులు శూన్యంలోకి జారిపోయారు. ఒక ఉదాత్తమైన మలుపులోకి తిరుగవలసినవాళ్ళు తప్పిపోయారు. బీట్ రచయితలు తిరుగుబాటుదారులేకాని నిరుద్దేశ్యులు, దిశావిహీనులు.

బీట్ కవులు దిక్కుతోచనివారై తమ ఏకాకితనపు బాధను, ఉనికిలోని ఆవేదనను విస్మరించడానికి సంభోగం, నల్లమందు, జాజ్ సంగీతంలోకి పలాయనం చిత్తగించినట్టు వాళ్ల రచనలద్వారా, ప్రకటనలద్వారా విస్పష్టంగా వ్యక్తమైనది.

అయినా ఈ విమర్శకు ప్రఖ్యాత రచయిత నార్మన్‌మేలర్‌లాంటివాడు ఇలా సమాధానం ఇస్తున్నాడు—'ఈ ఉద్యమం ఈ శతాబ్దంలోని రెండో మహావిప్లవానికి నాంది. ఈ విప్లవం మనను మళ్లీ సమ—విభజనపై ఆధారపడిన వ్యవస్థవైపు కాకుండా వెనక్కి నడిపిస్తుంది. మన ఆదిమ సత్వాలవైపు, మన శక్తియొక్క ఆదిమ స్రోతస్సువైపు తీసుకెడుతుంది.

నార్మన్‌మేలర్ ప్రతిపాదించిన ఈ తర్కాన్ని బీట్‌నిక్‌లు అనేకమార్లు వల్లెవేశారు. కామోద్దీపితమైన దేహంలోకి, ఆదిమశక్తిలోకి, ముక్తికోసం అన్వేషణచేస్తూ వెడతామని వీళ్లు వాదిస్తున్నారు.

కాని వీళ్ళకు పూర్వమే నాలుగు దశాబ్దాల క్రితమే వర్తమాన నాగరికతనుండి విముఖుడై ఆదిమ సత్వం, ఆదిమశక్తివైపు తిరిగి వెళ్లిపోవాలని ఒక ప్రతిభావంతుడైన రచయిత ఎంతో గంభీరంగా, కళాత్మకంగా, పరిపక్వతతో చెప్పాడు — అతనే డి. హెచ్. లారెన్స్. ఈ యాంత్రిక సభ్యతలో మానవుడు విడిభాగంలా, తయారుకాకుండా మళ్లీ మనిషిగా మారి, తన సత్వాన్ని ప్రస్ఫుటితం చేసుకోవాలని, దానికి మార్గం వెనక్కి ఆదిమ స్రోతస్సులోకి వెళ్ళాలని, రక్తంలోవున్న ఆదిమ సూర్యుణ్ణి ఉదయించనివ్వాలని, ఈనాటికి మన రక్తం ఆ ఆదిమ ఊర్జకు వాహనంలాంటిదని చెబుతూ లారెన్స్ ఇలా అన్నాడు—'నాకు రక్తంలో, మాంసంలోవున్న విశ్వా

సమే వా మతం. కారణం, అవి బుద్ధికంటే జ్ఞానవంత మైనవి. ఈ రక్తం రక్తాన్ని, మాంసం మాంసాన్ని, పిలుస్తోంది. పురాతన పురుషుడు ఆడమ్ అగ్ని ఈనాటికీ జ్వలిస్తోంది. అగ్ని, అగ్నిని పిలవడమే దాని ప్రత్యేకత ఈ దేహంలోని కామాగ్ని ఆ దేహం లోని కామాగ్నిని రేకెత్తిస్తుంది.' ("Sex Versus Loveliness"—Collected Essays). చివరికి లారెన్స్ ఇంకా ఇలా అన్నాడు—'ఆశక్తి నన్ను స్పృశించి, నా అంధకారంలోని మూలాన్ని తాకాలని నేను కోరు తాను. అది నాపైనుండి విలీనమవుతూ వెళ్లాలి— దానిపైనుండి నేను విలీనమవుతున్న వాడిలా! అప్పుడు మేమిద్దరం వేరువేరుగా విడిగా వుంటాం. మా ఇద్దరికి ఒక అనామకమైన సత్తా వుంటుంది. అదే పరిశుభ్రం కావడం—అదే వాస్తవిక విముక్తి.' ("Manifesto")

లారెన్స్ ప్రవచించిన ఈ జీవన—దర్శనంపట్ల ఎంతో చర్చ జరిగింది. కాడ్వెల్ ఈ సందర్భంలో చెప్పినట్టు ఇది సరియైన రోగనిదానమేకాని సరి యైన చికిత్సమాత్రం కాదు. సాధారణంగా న్యూరాటిక్ రోగిని, చికిత్స జరిపేముందు అతని వికసించని శైశవమానసికావస్థలోకి తీసుకువెళ్లి వదిలివేస్తారు. కాని అదే చికిత్సకాదు. దీనివల్ల అతణ్ణి ప్రౌఢచింతనలోని ఆంతరికమైన బాధనుండి తప్పించి తాత్కాలికంగా మామూలు మనిషిగా మార్చినా అతను భావనాచింతనస్థాయిలోకి వెళ్లి విలువలను గ్రహించే స్థితిలోకి పోలేదు. ఇది ఒకరకంగా రుగ్మతకు గురైన సభ్యతను ఆదిమగుహల్లోకి తీసికెళ్లి కూచోబెట్టడం లాంటిది. ఒక న్యూరాటిక్‌ను సహజమైన శిశువుతో పోలిస్తే అనారోగ్యంగా ఎలా కనపడుతాడో అలాగే ఈనాటి సభ్యతను ఆదిమవ్యవస్థలోకి లాక్కెళ్లితే అది కూడా రుగ్మతతో అనారోగ్యంగా కనపడుతుంది. పిల్ల వాడు ఎంత చిన్నవాడైనా, తన తల్లి గర్భకోశంలోని ప్రశాంతతలోకి తిరిగి పోదలచుకొన్నా ఒకేఒక మార్గం వుంది: అది ప్రౌఢత్వాన్ని వహించి జీవిత యథా ర్థాన్ని ప్రత్యక్షంగా ఎదుర్కోవడం. ("Studies in a Dying Culture.")

ఆదిమసత్వంవైపు తిరిగి వెళ్లాలనే ఈ నలభై సంవత్సరాల పాత, ఎంగిలిపడిన తర్కాన్ని ఈనాటి అమెరికన్ మట్టిలో మళ్లీ వైభవంగా బీజారోపణ చేయడానికి యత్నిస్తున్నారు. దీనినే ఇతరదేశాల్లోని డాంబిక ఆధునికవాదులు గుడ్డిగా అనుకరిస్తున్నారు. అసలు ఈ వాదం అమెరికా పగిలిన అద్దంలో ఎలాంటి వంకర—టింకర రూపాలను ధరిస్తున్నదో నార్మన్ పోధోరోజ్ మాటల్లో గ్రహించవచ్చును. అమెరికన్ జీవిత పద్ధతి యౌవనేచ్ఛను కేవలం తళతళతో రేకె త్తించి మనిషిని ఆడిస్తున్నది. యౌవనేచ్ఛ (కామేచ్ఛ)ను ఆరోగ్యకరంగా అనుభవించే వీలులేకుండా చేస్తున్నది. దీనివల్ల అమెరికన్ యువతీయువకులు కామవాంఛ తీరక, అసంపూర్ణమైన వాంఛలతో తల్లడిల్లి తమ కల్పనా జగత్తులో సంభోగాన్ని వివిధ బింబాలద్వారా ఊహించుకొంటున్నారని పోధోరోజ్ వర్ణిస్తున్నారు.

ఈ అసంపూర్ణ కామవాంఛ అమెరికన్ యువతీ—యువకులను పాశవికమైన చేష్టలవైపు, క్రూరమైన నేరాలవైపు, అమానుషమైన ప్రవర్తన వైపు తీసుకువెడుతున్నది. అయితే ఇదేనా ఆదిమసత్వం వైపువెళ్లే తత్త్వంయొక్క అంతరార్థం అని నార్మన్ మేలర్‌ను పోధోరోజ్ ప్రశ్నిస్తున్నాడు.

ఇక భారతదేశంలోకూడ ఈ మానసిక ప్రవృత్తి కొందరు యువ రచయితల ఊహాజగత్తులో ప్రతిఫలి స్తున్నది. ఈ రచయితల తలలో ఆడుతున్న భయంకర మైన పాములను సవిస్తారంగా చూపించవచ్చును.

'దేహరాజనీతి'వల్ల బీట్‌నిక్‌లు, Camp నాటక కర్తలు, చివరికి ఇక్కడ భారతదేశంలోని కొందరు బెంగాలీ, హిందీ రచయితలుకూడా తమ అసలు పరి స్థితులను, బాధ్యతలను విస్మరిస్తున్నారు. ఈ దేశం లోని కొందరు రచయితలు వాటిని అనాలోచితంగానే అవధరించి ఆత్మప్రదర్శనం ప్రారంభిస్తున్నారు. వీళ్ళు కూడా చివరికి:—

'పాలమ్‌కానీ సఫదర్‌జంగ్ కానీవ్వండి
గాలిలోనుండి సంస్కృతులు దిగుతాయి,
గాలిలోనే విలీనమవుతాయి.'

[హిందీ వ్యాసానికి స్వేచ్ఛాను సరణ—" నిఖిలేశ్వర్ "]

# నే నొం ట రి నై

## శ్రీ భైరవయ్య

జీవిత ప్రాంగణం ముందర
ఆశల కళ్ళాపిజల్లి
ఎదురు చూపుల ముత్యాలు పే
ఏరుకుంటూ,
జీవిత ప్రాంగణాంతర నందనవనంలో
ఈడేరిన కోర్కెల గులాబులు పరచి
చిరునవ్వులతో నడుస్తూ,
జీవిత ప్రాంగణాని కావల
కోర్కెలు విసిరిన ఎంగిలాకులపై
కాకులతో కుక్కలతో
కుస్తీపడుతూ,
ప్రపంచంలోకి
తత్సంవిధానంలోకి
అవకాశ శూన్య కీకారణ్యాల్లోకి
నిర్దయ నిరుత్సాహం ఎగతాళి వెటకారం
బ్రహ్మ చెముళ్లు కప్పుకున్న సంఘంలోకి
ఆశలు చావక
గుండెలో కొండంత ధైర్యం కరుడుగట్టక
మొండితనం బండకత్తితో నరుక్కుంటూ
నడక—పరుగు

---

# షేక్‌స్పియరు - చైనా

## శ్రీ ఎరిక్ చౌ

చైనాలో సాంస్కృతిక విప్లవం అంటూ ప్రారంభం అయిన అనంతరం కళలకు, సాహిత్యాలకు అదోరకమైన గతిపట్టింది. జగత్ ప్రసిద్ధులయినరచయితలు పనికిమాలినవారై పోతున్నారు. ఉదాహరణకు షేక్‌స్పియర్ మహాకవి వున్నాడు. ఆయన రచనలను చైనా పూర్వం అంతగా పట్టించుకోలేదు. తరువాత ఆ రచనలు నిరాదరణ పాత్రాలయి. నాయి. కాని ఆయన్ను చైనా ఎప్పుడు ప్రత్యేకించి విమర్శించలేదు. ఇప్పుడు తైవాన్‌లో ఒక పండితుడు షేక్‌స్పియరు నాటకాలను పూర్తిగా చైనా భాషలోనికి ఒక్కచేతి మీదుగా అనువదించారు. ఇక్కడ ఈ వ్యాసంలో శ్రీ ఎరిక్ చౌ– చైనాలో షేక్‌స్పియర్ ప్రశస్తిని గురించి, అధికారిక దృష్టిలో ఆ రచనల హెచ్చుకుందులను గురించి వివరిస్తున్నారు. శ్రీ చౌ 1940 ల లోను, 1950 ల లోను చైనా విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా పనిచేసి వున్నారన్న విషయం ఇక్కడ చెబితే, ఆయన ఈ విషయాన్నిగూర్చి వ్రాయడానికి అధికారం కలవారని చెప్పినట్లు అవుతున్నది.

ప్రొఫెసర్ లియాంగ్—షి—ఛియు, షేక్‌స్పియర్ రచనలను అన్నింటిని చైనా భాషలోనికి అనువదించారు. ఈమధ్య ఆ పని పూర్తి అయింది. ప్రొఫెసర్ లియా తైపేలో వుంటున్నారు. ఆయన ఉభయభాషలలోను పండితుడు. ఆయన షేక్‌స్పియరును తర్జుమాచేయడం ఫార్మోజాలో అందరికి ఆనందసంధాయకమైన విషయంగా వుంది. ఈ అనువాదంలో ఆయన ముప్ఫైఆరేళ్లు గడిపారు. పాఠాలు చెబుతూ, ఉపన్యాసాలు ఇస్తూ, జీవితం పోసుకుంటూ తన జీవితం యొక్క ధ్యేయం అయిన ఈమహాకార్యాన్ని— షేక్‌స్పియర్ గ్రంథాలను చైనాభాషలోనికి అనువదించడం అనే గురుతరకార్యభారాన్ని – ఆయన సాధించగల్గారు. తన జీవితంలో సాధిద్దామని ఆయన పెట్టుకున్న పని ఇది. ఇది చిన్నపనికాదు. షేక్‌స్పియరు ముప్ఫైయేడు నాటకాలను ఒక్కచేతిమీదుగా ఆయన అనువదించారు. ఆ అనువాదం లోకోత్తరంగావుంది. షేక్‌స్పియరు రచనలోని సర్వమైన అందచందాలను ప్రొఫెసర్ లియా తన యీ అనువాదంలో సాధించగల్గాడు.

నిజం చెప్పాలంటే ఎందరో పాశ్చాత్య రచయితలు వుంటే వారి అందరిలోను చైనీయులు షేక్‌స్పియర్‌నే అధికంగా మన్నిస్తూవచ్చారు. షేక్‌స్పియరును వారు మెచ్చుకున్నారు. గౌరవించారు. చైనాలో లిపో అని, తుఫు అని ఇద్దరు మహాకవులుండేవారు. తాంగ్‌వంశం చైనాను పాలించిన రోజులలో ఆ ఇద్దరు రచనలు చేశారు. వారిద్దరిని చైనా ఇప్పటికీ మహాకవులుగా ఆరాధిస్తున్నది. చైనీయులు షేక్‌స్పియర్‌ను ఆ ఇద్దరి మహాకవుల సరసనుపెట్టి మెచ్చుకొనడం వుంది. షేక్‌స్పియరు వారి అంతకవి అనడం వుంది. చైనా విశ్వవిద్యాలయాలలో పూర్వం— 1949 దాకా కూడా – రెండు సంవత్సరాలు విధిగా షేక్‌స్పియర్ గ్రంథాలు పాఠంచెప్పేవాళ్లు. ఆ 1949లో మావోసేటుంగ్ అధికారంలోకి వచ్చారు. ఆయన షేక్‌స్పియరు గ్రంథాలను చదివివున్నవాడు కాదు. షేక్

స్పియరును ''అభివృద్ధి నిరోధకుడు'' క్రింద ఆయన జమకట్టిందిమాత్రంలేదు. 1950 అనంతరం రోజులలో పెకింగ్ అధినేతలు షేక్స్పియరుపట్లకొంత మమకారం కూడా ప్రదర్శించారు. ఆయన గ్రంధాలను అనువదించవలసిందిగా పండితులైన ఆచార్యులను కోరారు. వారికి ఇచ్చిన ఆ ఆదేశంలో షేక్స్పియరు నాటకాలను—''గతితార్కికంగాను, విచక్షణతోను' అనువదించవలసిందిగా చెప్పబడివుంది. అయితే ఆతర్వాత ఆ ఆలోచన ఏమైందీ తెలియదు.

1957 లో మావ్‌సేటుంగ్ ''వెయ్యి పుష్పాల ఉద్యమం'' ప్రారంభం చేశారు. ఆ రోజుల్లో మేధావి వర్గం కొంచెం వడగవిప్పింది. ఆరోజులలో షాంఘైలో వున్న పీపుల్సు పబ్లిషింగ్ కంపెనీ చైనాభాషలో షేక్స్పియరు నాటకాలను ఒకఇరవై ఏడింటినో, లేక ఇరవై ఎనిమిదింటినో ప్రకటించివుంది. వానిని ఛు—షెంగ్ – హావో అనువదించారు. చైనా జపాను యుద్ధం రోజుల్లో ఆయన ఆపనిచేశారు. ప్రొఫెసర్ లియాా వలెనే, హావో కూడా షేక్స్పియరు రచనలను పూర్తిగా అనువదించాలని అనుకున్నారు. ఆయన ఆకోరిక తీరలేదు. రాజయక్ష్మవ్యాధి వచ్చింది. చనిపోయారు.

చైనాలో ఎక్కువగా ప్రదర్శింపబడిన షేక్స్పియరు నాటకము 'రోమియో అండ్ జూలియట్.' దానిని త్సావోయు అనే ఆయన చాలాఅందంగా తర్జుమా చేశారు. వ్యావహారిక భాష వాడారు. అసలు 'యు' స్వయంగా రచయిత. ఆయన నాటకాలు గొప్పగా వ్రాస్తారు. షేక్స్పియరు గ్రంధాలన్నీ ఆయనకు కంఠోపాఠంగా వచ్చు. ఆయన ఊూా 'రోమియో అండ్ జూలియట్'ను అనువదించారు. ఆ కథ, ఆ రచన, అందులోని సొగసులు యువతరాన్ని బాగా ఆకర్షించాయి. 1941 రోజుల్లో నేను త్సింగ్ హువా విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్నాను. అప్పుడు 'రోమియో' పేర్లు పెట్టుకున్న కుర్రవాళ్లను, 'జూలియట్' పేరు పెట్టుకున్న విద్యార్థినులను చాలామందిని చూశాను. ఆడపిల్లలలో 'జూలియట్' పేరు ఎక్కువ ఆదరాన్ని పొందింది.

చైనాకు 'విముక్తి' కల్గిన అనంతరం నాకు తెలిసినంతవరకు 'రోమియో అండ్ జూలియట్' నాటకం ఒక్కసారే పెకింగ్‌లో ప్రదర్శింపబడింది. 'పెకింగ్ అకాడమీ ఆఫ్ డ్రెమెటిక్ ఆర్ట్స్'వారు వేశారు. ఒక్కరోజుమాత్రమే వేశారు. ఆ తర్వాత వెయ్యలేదు. పార్టీ పద్ధతికి వ్యతిరేకంగా వున్నదని ఆ నాటకాన్ని ఇహవెయ్యవద్దన్నారు. యువకులలో ప్రేమ, శృంగారము పెరగడం చైనా నాయకులకు ఇష్టం లేకపోయింది. ప్రేమ చెయ్యడానికి, శృంగారంలో పడడానికి వాళ్లు ఎవ్వరు? వాళ్ల శరీరాలే కాదు; ఆత్మలు గూడా పార్టీవే. పార్టీయే సర్వాధికారి. పెకింగ్‌లో ఆ నాటకాన్ని త్సావోయు వేయించాడు. ఆయన తర్జుమాయే ఆ వేసింది. ఆ వేసిం తర్వాత అది పాపం అయిపోయింది. అధికారులు ఆయన్ను 'ఆత్మవిమర్శ'—వ్రాపి ఇమ్మన్నారు. కొంచెంగా పనికి రాదన్నారు. ఆయన వ్రాసి ఇచ్చాడు. చెంపలు వేసుకున్నాడు. పార్టీకి, ప్రజలకు 'క్షమాపణ' చెప్పుకున్నాడు. అధికారులు ఆయన్ను అంతటితో పోనీయలేదు. సాహిత్య విమర్శకులు త్సావో వ్రాసిన గ్రంధాలపై విమర్శలు వ్రాశారు. ఆయన స్వంతంగా వ్రాసిన నాటకాలు 'థండర్ స్టారమ్' అన్నది చాలా ప్రసిద్ధమైంది. ఆ నాటకానికిన్నీ, షేక్స్పియర్ 'హామ్లెట్'కున్నూ కొన్ని పోలికలు వున్నాయి. ఈ విమర్శకులు ఆ పోలికలను బయటికి లాగారు. 'త్సావో' షేక్స్పియరును గుడ్డిగా అనుసరిస్తున్నాడు, చైనా ప్రజల ఆలోచనలలో విషం నింపుతున్నాడు' అన్నారు. ఆ 'పాపానికి' పరిహారంగా త్సావో ఇంకో నాటకం వ్రాశాడు. అది 'బిగ్ స్కై'. వట్టి చపట నాటకం. ఆ తర్వాత త్సావో మళ్లీ ఇంకో గ్రంథాన్ని వ్రాసిన జాడ కన్పించదు.

చైనాలో 'రోమియో అండ్ జూలియట్'కు పట్టిన గతి ఇది. అయితే షేక్స్పియరు ఇతర నాటకాలు అన్నింటికి ఈ గతి పట్టలేదు. 'మర్చెంట్ ఆఫ్ వెనిస్'కు చైనాలో పెద్దపీట వేశారు. అధికారులకు ఆ నాటకం నచ్చినవిధంగా ఇంకో నాటకం నచ్చింది అనలేము. జనంలో ఆ నాటకం అంటే మన్ననే. ఇక విమర్శకులు వున్నారు అంటే, వారిని గూర్చి చెప్పవలసింది ఏమి వుంది! ఆ నాటకం పార్టీకి నచ్చింది. కనుక అందులో వారికి 'వర్గ

పోరాటం' దగ్గరనుంచీ అన్నీ కన్పించడం మొదలు పెట్టాయి. మావో విచారధారతో సమానమైన విచార ధార వారికి అందులో గోచరించింది. అసలు మావో ఆలోచనల్లాగానే ఆ గ్రంథం వుంది. అన్నింటికంటే ఈ విమర్శనలలో తెలియతగిన విషయం ఒకటి వుంది. అమెరికాలో 'వాల్ స్ట్రీటు'కు చిహ్నంగా షైలాక్‌ను షేక్స్పియరు సృష్టించాడు అని వాళ్ళు అన్నారు. కాబట్టి షేక్స్పియరు వ్రాసిన 'మర్చెంట్ ఆఫ్ వెనిస్'—ఈ విమర్శకుల దృష్టిలో—సారవుధర్మం చేత అమెరికా వ్యతిరేక గ్రంథం అయిపోయింది. నేను పెకింగ్‌కు వెళ్ళినప్పుడు—అచ్చటి వైదేశిక భాషాపరిషత్తు విద్యార్థి ఒకడు—ఆ విమర్శలలో ఒక విమర్శను తెచ్చి నాకు చూపించాడు. నేను అలవోకగా ఇట్లా అన్నాను: 'షేక్స్పియరుకాలంనాటికి అమెరికాయే లేదాయిరి; ఇక 'వాల్‌స్ట్రీటు' సంగతి ఎట్లా వస్తుంది.' ఆ విద్యార్థి నా మాటలోవున్న ఎత్తిపొడుపును గమనించినట్లులేదు. ఆ విద్యార్థి ఇట్లా అన్నాడు: 'అయితే షేక్స్పియరు ఇంకా గొప్పవాడన్నమాట. ఆయన గొప్పగ్రంథకర్తే కాదు; గొప్పవిప్లవప్రవక్త కూడాను. దాదాపు చేర్మన్ మావో అంత గొప్పవాడు.'

1957 వరకు కూడా చైనాలో విద్యార్థులకు షేక్స్పియరు నాటకాలు పెట్టేవాళ్ళు. అందుకు కొన్ని నాటకాలను ఎంచారు. కొన్ని వద్దనుకున్నారు. 'జూలియస్ సీజర్' పై నిషేధం; అందులో 'వైయక్తికవాదం' ఉత్కర్షింప బడినదట; బహుశా ఆ నాటకంలో అధికారంకోసం బ్రూటస్‌కు, సీజర్‌కు మధ్య నడిచిన 'పోరాటం' చేర్మన్ మావోకు నషాళానికి అంటివుంటుంది. అదేవిధంగా 'మేక్‌బెత్'ను గూడా విద్యార్థులకు పెట్టడం మానివేశారు. అందుకుకూడా పై విషయమే కారణమై వుండవచ్చు. రాజకీయ కారణాలను పురస్కరించుకొని జరిగే హత్యలు ఆ నాటకాలలో వున్నాయి. అవి ప్రజలలో 'విషపు పాదులు' పెట్టవచ్చునని చైనా నాయకుడు అనుకొని వుంటాడు. 'హామ్లెట్' 'కింగ్ లియర్'లకు యీ బాధలేదు. అవి 'రాజకీయ ఆర్జవం' కల్గిన నాటకాలు. వానిలో రాజరికంయొక్క కుళ్ళు కడుగబడింది. చైనా సిద్ధాంతులు కొందరు—'హామ్లెట్'—నాటకాన్ని ఎక్కువగా మన్నించారు. ఇందుకు ఒక కారణం కన్పిస్తుంది. చైనాలో ఒకవిధమైన 'కుటుంబపు పద్ధతి' వుంది. ఆ పద్ధతి, ఎటువంటి విప్లవాన్ని తెచ్చిపెట్టాలన్నా ప్రతిబంధకం అవుతూ వచ్చింది. ఆ కుటుంబ పద్ధతిని నాశనం చెయ్యడానికి యీ నాటకం బాగా ఉపయోగపడుతుందని ఆ సిద్ధాంతులు భావించి వుంటారు.

'ఏజ్ యు లైక్ ఇట్' 'ఏ మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్' వంటి నాటకాలను అధికారులు విద్యార్థులలో ప్రోత్సహించారు. వీనిలో ఒక నాటకంలో—'ఏజ్ యు లైక్ ఇట్'—లో—చైనా అధికారులకు 'విప్లవ విశ్వాసంతో కూడిన 'స్వస్థశృంగారం' కన్పించింది. 'మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్' వున్నదంటే, 'అది అందమైన కథ'. 'ప్రజలకోసం ఆ కథ సృష్టించబడింది.'—1957 రోజుల్లో ఈ రెండు నాటకాలను తీసుకొని ఎప్పుడో తీసిన రెండు బ్రిటిష్ చలన చిత్రాలనుకూడా తెప్పించి పెకింగ్‌లో ఆడించారు. ఆ రోజుల్లోనే చేర్మన్ మావో ఇంగ్లీషు నేర్చుకుంటున్నాడన్న మాట పుట్టింది. దానితో పార్టీ మనుష్యులకు అందరికీకూడా ఇంగ్లీషు నేర్వడం అవసరమూ అయింది. దానియందు ఆదరమూ పెరిగింది. వేలకువేలు జనంవచ్చి అదో ధర్మకార్యంగా ఆ రెండు చలన చిత్రాలను చూస్తూ వచ్చారు. ఇంగ్లీషు భాషను అభివృద్ధి చేసుకోడానికి చూస్తున్నాము అన్నారు. వారిలో అధిక సంఖ్యాకులకు అప్పుడు ఇంగ్లీషు అక్షరాల ముక్కు మొగము తెలుసుననికూడా అనలేము. వైదేశికభాషాపరిషత్తు విద్యారులవిషయం అట్లాకాదు. వారికి ఇంగ్లీషు బాగావచ్చు. వాళ్ళు ఆ రెండు సినిమాలను ఉత్సాహోన్మత్తులై చూచారు. ఆ నాటకాలను వెంట తెచ్చుకొన్నారు. ఆ సినిమాలలో మాటలు, నాటకంలో వ్రాసినట్లు చెప్పబడింది లేనిది సరిచూచుకున్నారు. ఏమైనా ఆ రెండు చలనచిత్రాలు మంచి వ్యాపారం చేశాయి. ఆ రెండు సినిమాలను ప్రభుత్వమే కొన్నది. ప్రభుత్వమే ఆడించింది. ముందుగానే వానిని ఆడడానికి అధికారంగూడా ఇచ్చివుంటుంది.

1957 లో ఇంకో పని గూడా జరిగింది. పెకింగ్‌లో షేక్స్పియరు ఉత్సవాలు జరుపబడినాయి.

గోష్ఠులు ఏర్పాటు అయినాయి. త్సావో—వై—ఫెంగ్ ఆ గోష్ఠులలో మాట్లాడారు. ఆయన నాతో కలిసి చదువుకున్నాడు. ఆక్స్‌ఫర్డ్‌లోనో, కేంబ్రిడ్జిలోనో బాగా గుర్తులేదు. షేక్స్పియర్‌ను అధ్యయనం చేశాడు. అది 1930 నాటి సంగతి. చాలాకాలంగా ఫెంగ్ కమ్యూనిష్టుపార్టీలో సభ్యుడుగా వున్నాడు. షేక్స్పియరు నాటకాలను ఒక పదో ఎన్నో చైనాభాష లోనికి ఆయన మార్చాడు కూడాను. ఆ రోజుల్లో ఆయన 'సాంస్కృతిక' శాఖలో పనిచేస్తూవుండేవారు. 'ప్రజాదృష్టి'తో షేక్స్పియరును గురించి వ్యాఖ్యానాలు, అవీ వ్రాశాడు. ఆ 1957 లో జరిగిన గోష్ఠులలో మరికొంతమంది పండితులు, షేక్స్పియరును గట్టిగా అధ్యయనం చేసినవాళ్లు పాల్గొన్నారు. కాని వాళ్లు ఎవరు ఫెంగ్ చెప్పిన వ్యాఖ్యానాలను పూర్వపక్షం చెయ్యలేదు. అవును. ఫెంగ్ అధికారి. వాళ్లు కాదు.

1958 లో 'గ్రేట్‌లీప్ ఫార్వర్డ్' ఉద్యమం ప్రారంభమైంది. దానితో షేక్స్పియరుమీద మోజు తగ్గింది. ఆయన రచనలమీద ఆదరానికి అంకుశం వేశారు. ఇంగ్లీషు చదువును నిరుత్సాహపరిచారనికాదు. ఆ భాష జీవద్భాష; దాన్ని నేర్వవలసిందేనని అధికారులు అన్నారు. కాని అప్పుడు ఒక్క విషయం వారికి తెలిసింది. ఇప్పుడు ఇంగ్లీషువాళ్లు ఎవ్వరూ షేక్స్పియరు ఇంగ్లీషును మాట్లాడరు; వ్రాయరు. అందువల్ల వైదేశిక భాషాపరిషత్తులో షేక్స్పియరు పఠనాన్ని మూలకునెట్టి, బ్రిటిష్ కమ్యూనిష్టుపార్టీ పత్రిక— ఆ రోజులలో దానిపేరు 'డెయిలీ వర్కరు' ఇప్పుడు 'మోర్నింగ్ స్టార్' అయింది—తెప్పించి, ఇక దానిని పఠించమన్నారు. అంతా విధేయతతో దాన్ని పఠించారు.

ఇక అప్పటినుంచి కమ్యూనిష్టు చైనాలో విద్యార్థులకు షేక్స్పియర్‌తో సంబంధం అంతరించినట్లే కన్పిస్తుంది. అందుచేతనేనేమో ఇప్పుడు సాగుతున్న సాంస్కృతిక విప్లవం సందర్భంలో షేక్స్పియరు మాట ఎక్కడా విన్పించడంలేదు. అట్లా అని షేక్స్పియర్‌లో చైనా ప్రజల ఆసక్తి, ఆదరణ తగ్గాయని అనలేము. షేక్స్పియరు ప్రపంచ మహాకవులలో ఒకడు. షాంఘైలో, ఇంకో ఇద్దరో, ముగ్గురో ప్రొఫేసర్లు షేక్స్పియర్ గ్రంథాలను తర్జుమా చేస్తూనేవున్నారు. ఇటీవల వారిలో ఒకరు, హాంకాంగ్‌లోవున్న తమ ఒక మిత్రునికి ఆ తర్జుమా విషయం వ్రాశారు. 'ఈ పని పూర్తిఅయితే, షేక్స్పియరు గ్రంథాల అనువాదం ఎంతో నికషంగా జరిగినట్లే.' ఇది ఆ వ్రాసినాయన అభిప్రాయం.

(ఫోరమ్ వరల్డ్ ఫీచర్స్)



# గతి - స్థితి

## శ్రీ కొండిపర్తి శేషగిరిరావు

ఒకనాడు ఏదైనా చిత్రాన్ని చిత్రించుదామని అనుకున్నాను. కానీ క్రిందటి క్షణంవరకూ సాహిత్యంలో తిరిగిన నా మనస్సు ఓ పట్టాన నా చేతిలోనికి రాక అనేక భావాలలో విహరిస్తోంది.

ఎంత ప్రయత్నించినా నా మనస్సు చిత్రనిర్మాణానికి కావలసిన ఏకాగ్రతను పొంది, రూపనిర్మాణ భావంలో లగ్నం కాలేక పోతోంది. ఎంతసేపూ రసవిమర్శనతోకూడిన భావాలు మెదులు తున్నాయేకానీ, రూపనిర్మాణాన్ని ప్రేరేపించే ఒక్కభావనైనా నాలో మెదలటం లేదు.

అలాంటి స్థితిలో సాహిత్య నిర్మాణాన్నీ, రూపనిర్మాణాన్నీ ప్రక్కప్రక్కల ఉంచి పరిశీలిస్తే కలిగిన భావన ఇది—

రూపనిర్మాణంలో ఏకాగ్రతను పొందినప్పుడే రూపాన్ని రూపొందించ గలుగుతాడు, రూపకారుడు. ఎప్పుడైతే అతనిలో అనేక భావాలు మెదులుతుంటాయో అప్పుడు అతని మనస్సు వికలమై, రూపనిర్మాణ భావన శకలాలై పోతుంది. అందుకే ఒక సుందరమైన భావాన్ని ఓ రూపంగా రూపొందిస్తున్నప్పుడు ఏ విధమైన భావసంచలనమూ లేక ఏకాగ్రచిత్తుడై ఉంటాడు చిత్రకారుడు.

సామాన్యమైన విషయాలనుండి తప్పించుకొని ఏకాగ్రతను సులభంగా పొందవచ్చు. కానీ విజ్ఞానముతోకూడిన భావపరంపరలనుండి తప్పించుకొని స్థిరత్వాన్ని పొందాలంటేమటుకు అది తనకు సాధ్యంకాని పనిగా తోస్తుంది, రూపకారునికి.

సాహిత్య సాధనలో, లౌకికానికి దూరమైన ఏకాగ్రత కావాలి. ఐతే భావపరంపరలులేని స్థిరమైన ఏకాగ్రతమాత్రం సాహిత్యానికి అనవసరము. సాహిత్యసాధనయందు భావపరంపరలు ఎప్పుడూ కలుగుతూ ఉండాలి. అవి ఎంత ఉధృతంగా సాధకునిలో ఊరుతుంటే అతనికి అంత శ్రేయోదాయకము. అందుకే భావుకుడు ఎప్పుడూ సంచలనాత్మకుడై కదులుతుంటాడు. ఐతే ఆ భావ సంచలనము సక్రమమైనదిగామాత్రం ఉంటుంది.

చిత్రకారుడు కూడా భావుకుడే ఐనా అతని భావన రూపనిర్మాణంలో కదలక స్థిరత్వాన్ని పొందుతుంది. సాహితీపరుడు సాహిత్య నిర్మాణంలో నిలకడగా ఉంటాడేకానీ, భావనలోమాత్రం స్థితిరూపంలో వుండక గతిరూపంలో ఉంటాడు.

అందుకే చిత్రకారుడు గతిరూపంలోఉన్న భావపరంపరలను ఏకాగ్రతద్వారా రూపంలో రూపొందిస్తే, సాహితీపరుడు గతిరూపంలోఉన్న భావాల గతిని ఇంకా అందంగా మలచి కమ్మని సాహిత్యంగా సృష్టిస్తాడు.

చిత్రకారుడు నిర్మాణంలో భావాల గతినుండి తప్పించుకొని స్థిరచిత్తుడైతే, సాహితీపరుడు ఒక చోట నిలబడి భావపరంపరలలో మునిగి తేలుతుంటాడు.

అందుకని రూపాన్ని రూపొందించుటకు భావసంచలనాలనుండి తప్పించుకొని స్థిరత్వాన్ని పొందడం ఎంత కష్టమో, గతిరూపంలోనున్న సాహితీభావసంచలనాలను ఒక క్రమంలో పొందడమూ అంతే కష్టం.

కనుకనే రూపకళ తన నిర్మాణంలో త్రోసివేసిన భావగతిని సాహిత్యం ఆహ్వానిస్తే, సాహిత్యం తన నిర్మాణంలో నెట్టివేసిన భావస్థిరత్వాన్ని రూపకళ ఆహ్వానిస్తుంది.

కనుకనే అందంగా మాటలను వ్రాయడం ఎంత కష్టమో, రూపాలను అందంగా మలచటమూ అంతే కష్టం.

'పదం' తన్మయత్వాన్ని కలిగించినా, సంవేదనను మాత్రం అది ఎక్కువగా కలిగిస్తుంది.

'రూపం'లో సంవేదనఉన్నా, అందులో తన్మయత పాలే అధికంగా ఉంటుంది.

ఎందుకంటే పదం భావంనుంచి కలిగింది. రూపం వస్తువునుంచి కలిగింది. ఇక్కడే ఒక అపరిష్కృతమైన సమస్యకూడా ఉంది. భావం వస్తువు కన్నా ముందో, లేక వస్తువు భావంకన్నాముందో మరి. అందుకే భావాన్నిబట్టి వస్తువు పుడుతుందనిగానీ, వస్తువునుండి అనేక భావాలు పుడతాయనిగానీ చెప్పలేము.

పోనీ భావనే మొదటి దనుకొంటే, ఒక భావన, ఆ భావనకు పూర్వం చూచిన వస్త్వనుభవంవల్ల కలిగినదే ఔతోంది. అలాగే ఒక వస్తువుకూడా ఆ వస్తువుకు పూర్వం మెదిలిన భావానుభవంవల్ల జనించిందే ఔతోంది.

కనుక భావము వస్తువుతోనూ, వస్తువు భావములోనూ పందెం వేసుకొని మహావేగంతో ప్రయాణిస్తున్నాయి.

అందుకే వస్తువుకు రూపాంతరమైన రూపాన్నీ, భావానికి రూపాంతరమైన పదాన్నీ, ప్రేమించే రసద్రష్టలలో సర్వసాధారణంగా అభిప్రాయభేదాలు కనిపిస్తుంటాయి.

అందమైన పదమువల్ల కలిగే రససంవేదనా, సుందరరూపమువల్ల కలిగే రసతన్మయతల వల్ల పొందబడే ఆనందాలలో వ్యత్యాసం కనిపిస్తూంటుంది. అందుకు ఈ రమణీయ పద రూపాల నేపథ్యంలో ఉన్న వాని లక్షణాల ప్రభావమే కారణము.

కానీ కొంచె మాలోచిస్తే సాహిత్యం కలిగించే రససంవేదనా, రూపం కలిగించే రసతన్మయతా బాహ్యరూపంలో విభిన్నంగా కనిపించినా, సాహిత్యంనుండి పొందే రస సంవేదన ఎలాంటిదో, రూపమునుండి పొందే రసతన్మయతతోకూడిన మౌనమూ అలాంటిదే.

కాకపోతే సంవేదన మనిషిని తేలికపరచి ఎక్కడికో తీసుకొని పోతుంది. మౌనం మధురానుభూతులతో మానవ హృదయాన్ని బరువెక్కిస్తుంది.

అందుకే భావస్ఫోరకమైన ఓ అందమైన మాటను వింటుంటే, ఆనందంతోనూ, రసపూరితమైన ఆలోచనలతోనూ, రససంవేదనలను పొందుతుంటాము.

అలాగే ఓ అందమైన రూపాన్నో, మూర్తినో, చూస్తుంటే మధురమైన భావాలతో పారవశ్యతను పొంది, హృదయః సంతృప్తితో ఒక్కసారి నిటూర్పు విడుస్తాము. అందుకే కాబోలు రూపముముందూ, రంగుముందూ, రసతన్మయతతో మౌనంగాఉంటాము.

పోతే మౌనం స్థాణువుగాఉన్నా, సంవేదన మెదిలేదిగాఉన్నా, రసవస్తువులనుండి అని బయటకు వచ్చేటప్పటికి రసమయమైనవిగానే ఉంటాయి.

కాకపోతే వాటి రూపాల్లో కొంత విభేదం ఉంటే ఉండొచ్చు. ఏది యేమైనా రసతత్వముగల సంవేదనా, మౌనమూ రసమయపదానికీ, వస్తువుకూ, ఆవలనున్నవారిమీద పనిచేసి, వారిలో విలీనమైపోయేవిగానో, లేక వారిని తమలో కలుపుకొనేవిగానో ఉంటాయి.

అందుకని ఒక రసానుభూతి అవతలివారిలో సంవేదనగా లీనమైతే, మరొక రసానుభూతి మౌనంగా విలీనమౌతుంది.

---

# బుచ్చిబాబు

## శ్రీ వింజమూరి శివరామరావు



ఎవర్ని పలకరించినా ఒకటేమాట. మనవాడు బుచ్చిబాబు వెళ్లిపోయాడు—అని. బరువుగుండెల నిట్టూర్పులతో కలిసి, బొంగురుపోయిన గొంతుకలతో ఆ మాట అంటున్నారు. ఆత్మీయుడు కరువైపోతే బాధకాదూ మరి!

బుచ్చిబాబంటే శివరాజు వేంకటసుబ్బారావు. ఇంగ్లీష్ లిటరేచర్‌లో ఎం. ఏ. పాసయి, స్వల్పకాలం కళాశాలాధ్యాపకుడుగా పనిచేసి, ఆకాశవాణిలో అధికారిగా ఉద్యోగంచేస్తూ, ఏభైయేళ్లు నిండకుండా కన్నుమూసాడు. సంస్కారం కలవాడు; మానవత కలవాడు. గడసరియైన మంచివాడు; పదిమందినీ కూడగట్టుకునేవాడు.

'ఓ' అని గమ్మత్తుగా కేకపెట్టి, పకపకా విరగబడి నవ్వుతూ, అందరినీ యెంతో ఆప్యాయంగా పలకరించేవాడు; తాను నొవ్వక, ఇంకొకరిని నొప్పించక, బ్రతుకంతా పూలబాట చేసుకున్నాడు; అందరిచేతా 'మనవాడు' అనిపించుకున్నాడు బుచ్చిబాబు.

అతనితో నాకున్న యిరవైయేళ్ల సన్నిహిత పరిచయంలోనూ, అతనెప్పుడూ ఎవరినీ కసరడం గాని ఎవరిమీదా కన్నెర్ర చేయడంగాని నే నెరగను. అసూయతో ఎవరేనా నిందిస్తే లోలోపల బాధపడేవాడు గాని పైకేమీ అనేవాడు కాదు. ఇతరుల చెడ్డతనాన్ని మరిచిపోవడం అతని స్వభావం. A healthy mind in an unhealthy body. ఉదార హృదయుడు. మంచి సలహా కావాలంటే బుచ్చిబాబు దగ్గరకు వెళ్లాలనుకునే వాళ్లం. అతను చిరునవ్వుతో ఆత్మీయతతో బుజంమీద తట్టుతూంటే, మనలో ఏదో శక్తి నిండుతూన్నట్టనిపించేది.

బుచ్చిబాబు చాలా తెలివైనవాడు. బాగా చదువుకున్నవాడు. తాను చెప్పదలచుకున్నది సూటిగా తెలుగులో చెప్పగల పలుకుబడి గడించుకున్నాడు. అతని భాషలో ఒక ప్రత్యేకత వుంది. భావాలలో ఒక విశిష్టత వుంది. అతని రచనా విధానం చమత్కారమైంది.

కథలుగాని, నవలలుగాని, రూపకాలుగాని, నాటకాలుగాని, వ్యాసాలుగాని, గద్యపద్యాలు (Prose Poems)గాని, ఏది వ్రాసినా, చివరిదాకా వదలకుండా చదివిస్తాడు. రేడియో ప్రసారానికి ఏవి యెలా వ్రాయాలో అతనికి తెలిసినంత బాగా ఏకొద్దిమందికోగాని తెలియదు. నాటకాలు నిర్వహించడంలో ఆరితేరినవాడు.

నవ్వు పుట్టించే చమత్కారాలు పైకి కనిపించినా, అతని రచనలలో గుండెను పట్టించే ఉద్రేకాలు కదులుతూంటాయి. రచయితను ప్రతిబింబింపజేసేవి రచనలు—అనే మాట నిజమైతే, బుచ్చిబాబు

పారిజాతపుష్పంవంటివాడు. 'రక్తహృదయముక్క హిమ పాండుర ప్రశాంత వపు రుపరిమూర్తి' అని పారిజాత పుష్పాన్ని కృష్ణశాస్త్రి వర్ణించాడు.

సరదాగా కబుర్లు చెప్పేవాడు; హుషారుగా కూనురాగాలు తీసేవాడు, పేకా చతురంగం బాడ్మింటన్ ఆడ్డానికి ముందువచ్చి నిలబడేవాడు. ఎక్కువగా చదువుకునేవాడు. తోచినప్పుడు వ్రాసుకునేవాడు. మామూలుగా ఒక పేజీలో పట్టేది, బుచ్చిబాబు ఎడంయెడంగా, పెద్దపెద్ద అక్షరాలతో అయిదారు పేజీలు వ్రాసేవాడు. నడకలోనూ, చూపులోనూ కూడా చురుకుతనముండేది. అతని కన్నీ రుచి కావాలి. తా నెక్కువగా తినలేకపోయినా, పదిమందికి బాగా పెట్టడమంటే అతని కెంతో సరదా. 'అతని యిల్లాలు 'అన్నపూర్ణకు నుద్ది.'

గొప్ప రచయిత అని బుచ్చిబాబును ప్రజలు గౌరవించారు. పరిషత్తులు సన్మానించాయి. ప్రభుత్వం సత్కరించింది. అతను రచయిత మాత్రమే కాదు. చిత్రలేఖకుడు కూడా. తైలవర్ణచిత్రా లందంగా గీసి, స్నేహితులకు పంచిపెట్టాడు. పేరుకోస మతను ప్రాకులాడలేదు. అన్నికళలూ వరించాయని గర్వించ లేదు. అహంకారం లేకుండా, సమాజంలో హెచ్చు తగ్గులు పాటించకుండా, మార్గదర్శకంగా బ్రతికాడు.

పేరుకి లోపంలేదు; డబ్బుకి లోటులేదు. బంధుమిత్రులు పరమాప్తులు. అనుకూలవతియైన భార్య—సుబ్బలక్ష్మిగారు—అన్నివిధాలా సహధర్మచారిణియై, అతని ప్రాణంలో ప్రాణమై, బుచ్చిబాబు కళాతపస్సుకి ప్రోత్సాహ మిచ్చింది. అజాతశత్రువుగా జీవించాడు; అల్పాయుష్కుడైనా బుచ్చిబాబు అదృష్టవంతుడు. దురదృష్టం అతను కరువైన లోకానిది !

# అప్పుడే వెళ్లిపోయారా !

ఆంధ్రపత్రిక 21—9—'67 లో బుచ్చిబాబు గారి మరణవార్త చదివి ఎక్కడ వాణ్ణక్కడే నిలబడిపోయాను. మనసు గొప్పగా ఆక్రోశించింది.

వారి నవలా, కథలూ, నాటికలూ అన్నీ వొక ఎత్తు—భారతిలో ఆల్డస్ హక్స్లీ, టీ. యస్ ఈలియట్, సమర్‌సెట్‌మామ్ వంటివారిపై వ్రాసిన వ్యాసాలు వొక ఎత్తు. ప్రపంచంలోని ఒక గొప్ప రచయిత—కాలధర్మం చెందాడంటే—వెంటనే ఎంతో బాధతో, ఆ రచయితను గురించిన చరిత్ర, ఆయన సాహిత్య ప్రతిభ వ్రాసేవారు. అంత వెంటనే అంతవోపికగా వ్రాసేవారు ఏరీ మనకిక.

వారు జూన్ భారతిలో వ్రాసిన 'మనసులో మారుమూలలు' అన్న వ్యాసం చదివి—'బెర్ట్రాండ్ రసెల్ భావప్రపంచం' వలెనే 'ఫ్రాయిడ్ భావ ప్రపంచం' అన్న వ్యాసాన్ని వ్రాయవలసిందిగా విజ్ఞాపన (సెప్టెంబరు భారతిలో) చేశాను. త్వరలో ఆ వ్యాసం వొస్తుందనీ ఎంతో ఉవ్విళ్లూరుతున్నాను. యింతలోనే ఘోరమయిన ఈ మాట వినవలసి వస్తుందను కోలేదు.

బుచ్చిబాబుగారు లేని లోటు తీరేందుకు ఎంత కాలం పడుతుందో!

బుచ్చిబాబుగారూ !
మీ కథ పూర్తిచేసుకోకుండానే
వెళిపోయేరా?
నా కథ వ్రాయవూ అన్నవారి కథ వ్రాసిన
బుచ్చిబాబుగారూ
మీ కథ పూర్తిచేసుకోకుండానే
వెళిపోయేరా?
నూరేళ్ల కథని యేభయ్యేళ్లకే
ముగించి వూరుకున్నారా?
'మామ్ వ్రాయని కథ'లు
తెలుగులో వ్రాయడానికి
యింకెవరున్నారండీ

బుచ్చిబాబుగారూ మాకు?
మిమ్మల్ని మార్చిన పుస్తకంతో
మమ్మల్ని మార్చి
ప్రపంచ కవుల్ని
తెలుగులో చాటడానికి
కంకణం కట్టుకున్న
బుచ్చిబాబుగారూ
అయ్యో అయ్యో
అప్పుడే అస్తమించేరా?
పాత నీటిపై కొత్త వంతెనలు
కట్టేందుకు
ఎల్లోరాలో పగిలిన గాజుమేడ
అతికి అందాలు తెలిపేందుకు
దేశం మీకిచ్చిన సందేశాన్ని
మాలో నింపేందుకు
నిచ్చెన మెట్లు ఎక్కించి
దిశదిశల సాహిత్యాన్ని చూపేందుకు
మరమేకుల్లో చిరమడతలు
విప్పేందుకు
అయ్యయ్యయ్యో—
'మా కింకెవరున్నారండి'?
బెర్ట్రాండ్ రసెల్ భావప్రపంచాన్ని
తెలుగులో విప్పిన బుచ్చిబాబుగారూ
ఏయేభావప్రపంచాలు
చుట్టివొచ్చేందుకు బయల్దేరారు?
అతిత్వరలో అకాలమరణం
కమ్మకు రాబోతున్నదని
అనుమానించే
జీవితాన్ని
అడవికాచిన వెన్నెల కాకుండా
నిండుగా పండించుకున్నారా—
మొదట్నించీ
చివరకు మిగిలేదేమిటి అని
ప్రశ్నించి ప్రశ్నించి,
చివరికి మా గుండెల్లో
నీళ్ళు మిగిల్చి,
నా కథ వ్రాయవూ
అన్నవారి కథ వ్రాసి
బుచ్చిబాబుగారూ
మీ కథ పూర్తిచేసుకోకుండానే
వెళిపోయేరా?

—మానేపల్లి సత్యనారాయణ.

# స్మృత్యంజలి

అయ్యో! ఎంత ఘోరం!!
ఇంత చిన్నవాడికి—నేటితో సరిపోయిందా—
చక్కని కథలు రాసే చేయి
ప్రక్కకు వాలి పోయిందా?
గీస్తూన్న చిత్రం పూర్తికాక మునుపే
కుంచె జారిపోయిందా?
సన్మానం అందుకోని మనిషికి
సంతాప సభలు జరిగేనా!

* * *

ఎందుకు జీవితంపై నీ కంత విరక్తి?
ఎవరికో కురువృద్ధునికి మృత్యువు పంపిన చీటీ
పొరపాటున నీకు చేరింది—
అయితే యింత తొందరా?
'అంతరంగ కథనం' పూర్తిగాక మునుపే
నీ గుండె ఆగిపోయిందా?
జీవితం పేర్చిన 'మెట్లు' ఎక్కలేక
'గాజుమేడ' పగలగొట్టుకొంటావా?
'చివరకు మిగిలే దేమిటి?

* *

'బుచ్చిబాబు' కలం ఇక కథలు చెప్పలేదు—
ఆయన కుంచె యిక చిత్రాలు గీయలేదు.
ఆయన వాణి వినపడదు
ఆయన రూపు కనపడదు.

# చైతన్యస్రవంతి

అందుకే కాబోలు, అంతుతెలియని బాధ ఎద్దుర్గొమ్ముల్లో కుతకుతలాడిం దీ రోజు;
అందుకే కాబోలు, ఆకాశం మేఘచ్ఛన్నమై కన్నీరు కార్చి గుబగుబలాడిం దీ రోజు,
అక్కడ, అల్లంతదూరాన ఉస్మానియాలో
ఆ మూల మీ లోలోపలి పంజరంలోని ప్రాణహంస గిలగిల లాడుతున్నందుకే కాబోలు!

ఆంధ్రసాహితీవనాన్ని గుబాళింపజేసిన పారిజాతం రాలిపోయింది
ఆంధ్ర కాల్పనిక సాహిత్యాన్ని సుసంపన్నంచేసిన కలం వట్టిపోయింది
ఆత్మ విశ్లేషణాత్మక రచనా ప్రక్రియకి సంధి కొట్టింది
ఆలోచనల్ని రేకెత్తింపజేసే సృజనాత్మక వ్యాసాలకు కాలం తీరింది.

వేలవేల అభిమానుల వదనాలు చిన్నపోయాయి
వీటవీట ఏకలవ్య శిష్యుల గళాలు మూగపోయాయి
అక్కడ—శ్రీమతి, బంధుకోటి; ఇక్కడ—మేము,
అంతా ఆలోచనాంధకారంలో చిక్కుకుపోయేము.

**2**

ఆహా, ఎంత అర్థవంతమైంది సామెత—'కమింగ్ ఈవెంట్స్ కాస్ట్ దైర్ షాడోస్'!
అందుకే కాబోలు, ఆనాడు
ఆర్నెల్ల క్రితం జాబు—'నా రచనలపై సమగ్రవిమర్శ నాకళ్లతో చూసుకునే
అదృష్టం నాకు లేనట్టుంది. కథలపై మీరే ఎందుకు వ్రాయకూడదూ ?

అందుకే కాబోలు, నిన్న మొన్న—జూలై ఇరవై అయిదు
అందమైన సాయంత్రాన చల్లని మాటల్తో సేదదీర్చి
ఆతిథ్యంలో ఆత్మీయత నింపి, అపస్వరాన్ని హీనస్వరంలో
ఆలపించింది—'మీరు మీ వ్యాసాలతో వచ్చేసరికి పరిస్థితు లెలావుంటాయో'

బాబూ, బుచ్చిబాబూ! ఎందుకు కలిగాయి బాబూ నీకీ అనుమానాలు!
ఎందుకేమిటి?—ఆంధ్రసాహితీ రంగస్థలాన చీకటి తెరలు పరుచుకుంటున్నందుకు!

బుచ్చిబాబూ!
మీరు లేరనే భావంతో గుండెల్ని పిండుకోలేం మేము
మీ అక్షరముత్యాలమాల తెగిపోవటం చూడలేం మేము
షేక్స్పియర్ కవితా మాధుర్యాన్ని చవి
చూడాలనుకున్నా; రస్సెల్ భావప్రపంచంలో విహరించా
కథల్లోని అంతర్యాన్ని మననం చేసుకోవాలనుకున్నా—మీ

కలం అందించిన చిందించిన అర్థాలే మాముందు నిలుస్తాయి!
మనసు బాగుండక, జీవితాన్ని తమస్సు వెంటాడినప్పుడు
మృదువుగా వెన్నుతట్టి, ఆత్మశాంతి కలిగించేది—
భగవద్గీత, వేస్ట్‌లేండ్, గీతాంజలితో పాటు 'చివరకు మిగిలేది!
ఎలా తప్పించుకు పోగలం మేము—మీ స్మృతి కిరణ ప్రసారం నుంచీ!

రేపటినెలనుంచి నెలనెలా 'భారతి' రాగానే మీ
రేమైనా వ్రాసేరేమోనని ఆత్రంగా చూసి
అంతలో ఈ ఘోరం తలచుకుని, కన్నీరు విడిచి
నిరాశగా నిట్టూర్పు విడవాలి మేము!
ఎంతటి దురదృష్టాన్ని మా పరంచేసి పోయావయ్యా?
అంతరంగ కథనాన్ని అసంపూర్ణంగా వదలి
మరో మనో వైజ్ఞానిక నవలకు తొలిపలుకు పలుకక వదలి, నీ
మనోయవనిక మీద రూపు దిద్దుకుంటున్న ప్రకృతి దృశ్యాల చిత్రీకరణను వదలి
ఎలాగ వెళ్లిపోయావయ్యా?

## 3

అందమైన ఆ తోటలో విరిసిన కథా ప్రసూనాలకి సౌరభం మెండు
ఆ తోటలో ప్రవహించిన రసధుని ప్రభావం అది
ఆ తోటమాలే అప లోక 'చైతన్య ప్రవంతి'!
ఆతడొక నిత్య సౌందర్యాన్వేషి—జిజ్ఞాసువు!

ఆశాప్రియని ఆదరిస్తాడు, నిన్నుగురించి కథ వ్రాస్తాడు
ఆమె నీడని నీ కళ్లల్లోకి ప్రసరింపజేస్తాడు
దేశం తన కిచ్చిన సందేశాన్ని తెలుగువారికి వినిపిస్తాడు
నిరంతరత్రయంలో సత్యంశివంసుందరం చూపిస్తాడు
వీరేశలింగం ఏమయ్యేట్టని నిలవేస్తాడు
పొగమంచు తెరల్ని తొలగిస్తాడు
వ్యక్తి అజ్ఞానాన్ని రాగవీణపై మీటి జ్ఞానతరంగాల్ని జాలువారుస్తాడు!

ప్రాచ్యపాశ్చాత్య సాహిత్యరీతుల్ని మథించిన ఆ మహామేధావి
పాత్రౌచిత్యం చెడకుండా కథను ఒడుపుగా నడపనూ గలడు
ఉరికంబానికి వెళ్లే నేరస్థుని 'చేతన'ను విశ్లేషించనూ గలడు
మరమేకులకూ చీరమడతలకూ గల సంబంధాన్ని వివరించనూ గలడు.

**4**

'ది గ్రేట్ ఇంటెలెక్చువల్ మోడర్న్ తెలుగు నావెలిస్ట్' —
మరో ప్రపంచంలోకి వెళ్ళిపోతున్నాడు!
ఇక్కడ ఈ తెలుగు సాహితీ మాగాణానికి తన ఆత్మీయతాముద్రనూ
ప్రత్యేక రచనాశిల్ప చమత్కృతినీ, శైలినీ బహూకృతిగా వదలి
సాగిపోతోం దా చైతన్య స్రవంతి!
దాని మధురసాస్వాదనంచేసి ఆనందించండి!
మనకు చివరకు మిగిలింది—'చివరకు మిగిలేది.'!!

—విహారి & శాలివాహన.

---



# గ్రంథ విమర్శలు

## పన్నీటిజల్లు

(ఖండకావ్య సంపుటి)

[కర్త:— కాటూరి వేంకటేశ్వరరావు; వెల: సాదాప్రతి —5 రూపాయలు, బైండుప్రతి— 6 రూపాయలు. ప్రాప్తిస్థానము: కాటూరి కవితా లత, దుర్గా అగ్రహారము, విజయవాడ—2]

కాటూరి వేంకటేశ్వరరావు గారు ప్రసిద్ధులయిన నవీనాంధ్ర కవులలో నొకరు. తిరుపతి వేంకటకవుల శిష్యుడగుటచే ఆయనకు పేరు రాలేదు. పురాణ కవితాశయ్యతో నవీన కవిత్వమునకు నాంది పలికిన వారు తిరుపతి వేంకట కవులు. కాటూరి వేంకటేశ్వరరావు గారందురా! సహకవియగు పింగళి లక్ష్మీకాంతము గారితోకూడి, యుగానుకూలమయిన భావములను భజించి, రసమయమగు కవితా మార్గమును చేపట్టి 'తొలకరి'తోపాటు ఒక మహోత్తమ కావ్యమును రచించిరి. ఆ కావ్యమే సౌందరనందము. నాలుగు కాలాలపాటు విలువగల్గిన నవీనాంధ్ర కావ్యములలో నది యొకటి. మఱి వేంకటేశ్వరరావుగారు సొంతముగా వ్రాసిన లఘుకృతులు రెండు గలవు. మొదటిది 'గుడిగంటలు'. రెండవది 'పౌలస్త్య హృదయము'. ఈ రెండును ఆంధ్రుల నవీన భావములకు ప్రతిబింబములు. మహాత్ముని సదాశయమును హరిజనోద్యమము కవితా వీణపయి గానము చేయునది 'గుడిగంటలు'. ఆది కావ్యమునందలి ప్రతినాయకుని వైరభక్తి మాధుర్యమును పంచునది, 'పౌలస్త్య హృదయము.' కవితా వ్యవసాయము మొదలుపెట్టినప్పటినుండి నిర్యాణము వఱకు, ఆయా సన్నివేశములను పురస్కరించికొని, వేంకటేశ్వరరావుగారు రచించిన ఖండకావ్యములెన్నో కలవు. వాని నన్నిటి నొకచోటచేర్చి యచ్చొత్తించినదియే ఈ 'పన్నీటిజల్లు'. ఇది కవిగారి మరణానంతరము వెలువడిన ఖండకావ్య సంపుటి. దీనిని ప్రకటించినవారు తెలుగువారి ప్రశంసలకు పాత్రులైరి. 'పన్నీటిజల్లు' అను పేరిందు రెండు ఖండకావ్యములకు గలదు. ఆ పేరే యీ కావ్యమునకు పెట్టబడినది.

రవీంద్రకవి గ్రంథములు పఠించి, ఆంగ్ల సాహితీ మాధుర్యమును చూఱలాడి ధన్యుడనైతినని భావించిన వారిలో మొగదలనున్నవారు వేంకటేశ్వరరావుగారు. సంస్కృతాంధ్ర సాహితీ సంపదయు పైతృక ధనముగా చేతికందినది. ఇంక కావలసినదేమి? 'కవితా సామగ్రి'ని అమ్మగా పూనుకొనిరి. పెట్టుబడి పెద్దది గావచ్చు. చేసిన వ్యాపారము చిన్నది గావచ్చు. ఆంధ్ర రసిక లోకమునకు ఆహ్లాదము చేకూర్చిరి. నిజాయితీకి పేరుపొందిరి. గ్రంథములను బండ్లకెత్తిన వారికంటె మిన్నగనే శాశ్వతకీర్తిని సంపాదించిరి. ఆ కీర్తి మచ్చలేనిది· తఱుగనిది.

ఆంగ్లభాషా స్వభావమువల్లనేమి, రవీంద్రుని మహిమవల్లనేమి వేంకటేశ్వరరావుగారు నూతన కవితోద్యమములలో పాల్గొంచుకొనిరి. మానవతా వాదమునకు పట్టము గట్టిరి. వారు భావకవిత్వము మువ్వగువానిని వ్రాసినవారే. సమకాలిక సమాజమును మానవతా దృక్పథమునుండి చూచినవారే. కుళ్లి కంపు గొట్టిన ధర్మమునకు రంగులుపూసి తెలుగువారి కనులముందు నిలబెట్టుటకు వారు ఆరాటపడిన జాడ కానరాదు. సమాజపరిణామమును లెస్సగా గుర్తించిరి. ఆ పరిణామము కొనితెచ్చిన భావములకు స్వాగత మొసగిరి. ఆ భావములను పాడిరి. ఏవిధముగా? సమకాలిక సాంఘిక భావములను తాను వ్రాయుచున్న కావ్యములకు బీజములుగా చేసికొని కావ్యకళాశిల్పములతో రసస్థాయికి తీసికొనిపోయిరి. అందుచేతనే యా కావ్యములు కాలావధులను దాటినవి. నవీన కవుల మనుకొన్నవారి కెందఱకో యీ విద్య అబ్బలేదు. తాత్కాలికమైన యావేశముతో సమకాలిక సమస్యలను గూర్చి కవితలల్లి చరితార్థులమైతిమని భ్రమించినవారే పెక్కుమంది కలరు. అందుచేతనే యా కవితలు కావ్యత్వమును, అజరామరమైనదానిని కోల్పోయినవి. కాలబద్ధమైనవి. వేంకటేశ్వరరావుగారు రచించిన కావ్యముల యితివృత్తము

ఐతిహాసికము గావచ్చు. ఆ చారిత్రకము గావచ్చు. ఇదానీంతనము గావచ్చు. ఆ యితివృత్తమును స్వీకరించుటకు నవభావములు హేతువులు. అది కావ్యత్వసిద్ధిని పొందును.

వేంకటేశ్వరరావుగారి కవిత్వము ప్రసాదగుణము గలది. ఆ కవిత్వము నందెక్కడను హద్దులుమీఱిన యావేశము కానరాదు. శాంత గుణరాశియగు సౌజన్యమూర్తియొకడు రమణీయ బోధనము చేయుచున్నట్లుండును. తెనుగుదనము, తెనుగు పలుకుబడి హెచ్చుగా నుండును. ఎక్కడోగాని, అక్కఱనుబట్టి సుదీర్ఘ సంస్కృత సమాసములు వచ్చిచేరవు. అన్వయమునకందని పలుకుబళ్లను గుప్పించి, విచిత్రకారకమును సృష్టించి, యిదియే కావ్యశిల్పమని యెలుగెత్తి చాటు పోకడ వేంకటేశ్వరరావుగారి సృష్టిలో గోచరింపదు. వారు ఎఱ్ఱాప్రెగ్గడ వంశీయులట! ఎఱ్ఱన కవితయందలి తీరుతెన్నులు వారి కావ్యములలో సాక్షాత్కరించును. పై మాటల కన్నిటికిని ఈ 'పన్నీటిజల్లు' తార్కాణము.

ఈ కావ్యమునందలి విషయము బహుముఖముగా నున్నది. విజయవాడ సీతానగరమున వేంచేసియున్న ఆంజనేయస్వామి స్తోత్రముతో కావ్యము మొదలగును. వేంకటేశ్వరరావుగారు తిరుపతి వేంకటకవుల శిష్యులుగదా! ఆ జంటకవుల కవితామార్గము పట్టిన ఖండకావ్యములు నున్నవి. సమస్యాపూరణము, గురుసన్మానార్థము గద్వాల రాణిని, తాటికొండ రామారెడ్డి దేశాయిని దర్శించినపుడు చెప్పిన పద్యములు, అవధానము చేయగా మెచ్చుకొన్న మేనమామకు వ్రాసిన పద్యలేఖ—యివి యన్నియు తిరుపతి వేంకటకవుల పద్ధతితో వ్రాయబడినవి. వేంకటశాస్త్రిగారిని గూర్చియు కవితాగానము చేయబడినది. కవులను, కళాకారులను ప్రశంసించిన పద్యము లున్నవి. ప్రణయలేఖ లున్నవి. భావకవిత్వమున్నది. జీవనస్మృతు లున్నవి. చాటుపద్యములు గలవు. బందరునకు వేంకటేశ్వరరావుగారికి గల పొత్తు సామాన్యమయినది గదా! అచటి మిత్రులను, సహచరులను, గురుతుల్యులను పొగడిన కవిత్వము కలదు. రవీంద్ర రాధాకృష్ణులను, తదితర మహాశయులను మెచ్చిన ఖండకావ్యములు కలవు. 'మే మాంధ్రులం' అన్న వ్యంగ్యరచనము, చల్లపల్లి రాజా నుద్దేశించి వ్రాసిన 'ఓటుపాట' చమత్కారముగా నున్నవి. రెండవది జమీందారుల జులుమును చూపెట్టును. ఇంకను చిల్లరమల్లర రచనలున్నవి.

వేంకటేశ్వరరావుగారి ఆస్తిక్యమును గూర్చి ప్రత్యేకముగా చెప్పవలయును. ఈ ఖండకావ్యముల సంపుటిలో తీర్థదైవతక్షేత్రస్తుతు లున్నవి పీఠాధిపతుల కైవారములు కలవు. అన్నిటినిమించి భగవంతునకు దూరమయిన జీవునివేదన యిందు కలదు. వారు మొదటి ప్రొద్దులలో వ్రాసిన కవిత్వములో ఈవేదన—శిశుదైన్యము—స్పష్టముగా కన్పట్టును. దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రము, శివాపరాధ క్షమాపణ స్తోత్రము, సౌందర్యలహరి మున్నగునవి కాటూరివారి యాస్తిక్యమునకు తార్కాణములు. దీనికితోడు ప్రకృతిని స్వాధీనము చేసికొనుచున్న మానవుడు, వినాశకారియగు త్రోవ త్రొక్కుచున్నాడను గుర్తింపు, దాని వలన కలిగిన బాధ అక్కడక్కడ దోబూచులాడుచుండును.

తన భావములను వ్యక్తీకరించుటకు కాటూరివారవలంబించు ప్రత్యేకమార్గ మీ సంపుటిని కొట్టవచ్చినట్లు కన్పించుచున్నది. వారు రవీంద్రుని గూర్చి వ్రాయవచ్చునుగాక! రాధాకృష్ణుని గూర్చి వ్రాయవచ్చునుగాక! నోములను గూర్చి వ్రాయవచ్చును గాక! ఆచార్య బంధు మిత్రాదులను గూర్చి వ్రాయవచ్చును గాక! ప్రత్యక్షముగా ఎవరిని గూర్చిగాని, దేనిని గూర్చిగాని వ్రాయరు. వారియొక్క లేక వానియొక్క మూలతత్త్వమును ముందు ప్రత్యక్షీకరించికొని, ప్రకృతిని ఆలంబనముగా చేసికొనియో, ఊహకల్పితమయిన దృశ్యమును చాటుగా చేసికొనియో, ఆ మూలతత్త్వమును ప్రతిపాదింతురు. రాధాకృష్ణ ప్రశంస, నివేదనము, విజయవాణి, మున్నగునవి యిందు కుదాహరణములు. ఆ కవి మనీషుల జీవనతత్త్వము, ఆంధ్రుల యుత్సాహము, భంగ్యంతరముగా ప్రకృతి దృశ్యములను ఆధారము చేసికొని వర్ణింపబడినవి.

సంప్రదాయబద్ధమయిన ఛందస్సులతోడనే యీ సంపుటియందలి కవిత్వము చాలభాగము సాగినది. గీతికాప్రాయమయిన రచన లొండు రెండు గలవు. అనిబద్ధ కవిత్వమున కుదాహరణముగా నుండదగిన రచనయు

కలదు. శ్రీ రమణమహర్షి స్తోత్రము, విమలానంద యతీంద్రస్తుతి ఉదాహరణ కావ్యలక్షణములతో కూడి యున్నవి. ఇందు ఒక్కొక్క కందపద్యము ఒక్కొక్క విభక్తిపరముగా రచింపబడినది. ప్రాచీనకవులీ యుదాహరణములను దేవతాస్తుతిపరముగా, మహాత్మప్రశంసాపరముగా వ్రాసిరి కదా! వేంకటేశ్వరరావుగారా సంప్రదాయము పాటించిరి. కళికోత్కళికాదులను మాత్రము వీడిరి. ఒక సమయమున వ్రాసిన పద్యములనో, పద్య పాదములనో మఱియొక సమయమున—తుల్యము లయినప్పుడు—వాడుట కవుల కలవాటే. వేంకటేశ్వరరావుగారు నట్లే చేసిరి. 'రాగరసావతారు'డను ఖండము నందలి 'జన్నపువేదులన్' అను పద్యభాగము యథాతథముగా 'అమృతపాణి'యందు కలదు. 'నెల్లూరి ఆంధ్ర పరిషత్సాహిత్యసభ'యందలి మొదలి పద్యము తొలి మూడు పాదములు 'విజయవాణి'లో చివరి పద్యములలో నొకదానియందు గలవు.

తప్పొప్పుల పట్టిక కావ్యాంతమున కలదు. దానజేరని తప్పులు కలవు. 161 పుటలో చంపక మాలయందు మూడవ పాదమున 'జడిగ గఱంగి పాటె కళావతికిన్ జయపరౌత! అని కలదు. 'పాటేడి' అని యుండదగుననుకొందును.

నవ్యాంధ్ర కవితారీతులను, నవయుగ భావపరిణామమును, వేంకటేశ్వరరావుగారి కవితాసంస్కృతిని తెలిసికొనగోరువారీ 'పన్నీటిజల్లు'లో అవశ్యము ఓలలాడుదురు గాక!

—శాక్యసింహ.

## భార్గవానందలహరి

[కవి: కీ. శే. సిరిప్రెగడ భార్గవరావు: ప్రచురణ: సాహితీ మేఖల, చండూరు; ప్రతులకు: శ్రీ అంబటిపూడి వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రి, ఏదుబాడు, అన్నంభొట్లవారిపాలెం (పోస్టు) వయా పర్చూరు, గుంటూరుజిల్లా; 82 పేజీలు; వెల: రూ. 2.]

'మాతృభాష మన యిల్లు
తెనుగు కవిత పన్నీటిజల్లు
ఏ వొక్కరు కలం పట్టినా చాలు
పరిమళాల జాలు' పాలక్రొవిమ్మగడలు పచ్చి వెన్నయి విచ్చి తీయని నునుపూసలు'గా మారిన తెనుగు పదాల పొందికను, మాధుర్యాన్ని అనుభవించి సచేతనమైన మనస్సుతో పలవరించి భవ్యకవితావేశంతో కవితా సరస్వతిని ప్రత్యక్షం చేసికొని గానంచేసిన, అమేయ ప్రతిభావంతులైన కవికుమారులు అకాల మృత్యువు వాతబడటం సాహిత్యాభిమానులెల్లరకూ హృదయాన్ని ద్రవింపజేసే విషయం. అందునా త్యాగమయమైన జీవితాన్ని గడిపి, ఎప్పటికప్పుడు ప్రగతిశీలమైన భావాల నాకళింపు చేసికొని, ఆ భావాలకంటె మున్ముందుగా తాను పరుగులుతీస్తూ సమాజాన్ని తీర్చిదిద్దే సంస్కర్తలు కవులలో అరుదు. అరుదైన యీ భాగ్యాన్ని పొంది తనకు బహిః ప్రాణంగా మెలిగిన మిత్రులను శోకసముద్రంలో ముంచిన శ్రీ సిరిప్రెగడ భార్గవరావుగారు యశఃకాయులైనారు. ఋషివంటి జీవితంతో ఆదర్శమూర్తులైన శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు తమ భావాలకు ఆచరణప్రతిరూపమైన శ్రీ భార్గవరావుగారు దివంగతులయిన శోకంలో గర్భశోకాన్ని అనుభవించి, శ్రీ భార్గవరావుగారిలోని ఉత్తమ కవితా వేశాన్ని గమనించి, దోహదం చేసినవారు కావటం వలన, ఆ కవిత్వాన్ని తెలుగు పాఠకులందరికీ అందజేయాలన్న స్థిరసంకల్పంతో యీ కవిత్వానికి పుస్తక రూపం కల్పించారు. తెలుగుభాషలో ప్రసిద్ధులయిన కవి, పండితులెందరికో వీరి కవిత్వాన్ని పరిచయంచేసి, అభిప్రాయాలను సేకరించి, 'ఇదీ మా భార్గవుని ప్రతిభ' యని లోకానికి చాటి చెప్పారు. కావ్య సంపుటి చిన్నదైనా అభిప్రాయాలు కొల్లలుగా ముందు

నిలిచాయి. అభిప్రాయాలనిచ్చిన వారందరూ ముక్త కంఠంతో శ్రీ భార్గవరావు కవి హృదయాన్ని గుర్తించి కొనియాడారు. ఎవ్వరూ యీ కావ్యంలోని లోపాలను పేర్కొనలేదు. ఇది యీ కవి ప్రతిభను తెలియ జేస్తుంది. 'తెలుగుకవి చనిపోయిన తరువాతనే జీవించటం ప్రారంభవౌతుంద'నే సూక్తి వీరి విషయంలోనూ యధార్థమైంది. కాని ఒక్కటే తేడా. శ్రీ భార్గవరావు జీవించియుండగా వీరి కావ్యాలు వెలుగు చూడలేదు.

ఈ కావ్యప్రారంభంలో సాహితీమేఖల కార్య క్రమాలు వివరంగా తెలియజేశారు శ్రీ అంబటిపూడి వెంకటరత్నం. స్వంతవిషయాలనే ఏకరువు పెడు తున్నట్లున్నా శ్రీ భార్గవరావు వ్యక్తిత్వం వెంకట రత్నంగారి సాహితీమేఖలతోనూ, సమాజ వికాస కార్య క్రమాలతోనూ పెనవేసికొన్నది. మంచిగురువుకు అంత కంటె మంచిశిష్యుడు లభించటం అన్నివిధాలా అదృష్టమే. 'తెలుగెవ్వరిపాలుచేసి తిరిగెద వాంధ్రా' అని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు వెంకటరత్నంగారి నొకప్పుడు హాస్యం చేశారట. తర్వాత కాలంలో శ్రీ వెంకటరత్నం తెలుగు సాహిత్యంలో మిక్కుటమైన పరిశ్రమచేసి, కవిగా పేరుతెచ్చుకొని గురువుగారికే గర్వకారణమయ్యారు. అదేవిధంగా భార్గవరావుగారు కూడ వెంకటరత్నంగారికి గర్వకారణమయ్యారు.

'సాహితీమేఖల' ఉత్తమగ్రంథ ప్రచురణకు పూనుకొన్నది. 'అగ్నిధార', 'దక్షిణ'వంటి పుస్తకాలను ప్రచురించింది. 'దక్షిణ' నాటకంలో శ్రీ భార్గవరావు పాత్రధారియట. కళాత్మకమైన శ్రీ భార్గవరావుకవి హృదయాన్ని కాలపురుషుని కబంధహస్తం కలచి వేసిందంటే, యీ కావ్యసంపుటం చదివిన వారందరికీ విచారం కలుగుతుంది. సాహిత్యాచార్య శ్రీ పిల్లలమర్రి వారి మాటల్లో చెపితే 'భార్గవకవి నూటికి నూరు పాళ్ళూ హృదయంగల అచ్చపుకవి. భవ్యకవితావేశం కల్గిన అచ్చపు ఆంధ్రకవి కుమారుడు. కవితోన్మాది. సంప్రదాయాభిరతి మిక్కుటంగా గల సంస్కృతీ సంపన్నుడు. 'బతికి బట్టకడితే' మహాంధ్ర సాహిత్య పరిషత్తులో మహాకవిగా దుశ్శాలువలను అందుకొని సంస్తవనీయుడు కాగలిగేవాడుగదా!'. భార్గవకవిని నూటికి నూరుపాళ్ళూ హృదయంగల అచ్చపుకవి యన టానికి 'కన్నీరు' కావ్యఖండిక తార్కాణ. సతీ వియోగం వలన హృదయంనుండి తోసుకొచ్చిన 'కన్నీరు' కావ్యంగా మలిచారు. కవు లెందరకు వియోగం కలుగలేదు? ఎందరు సతీవియోగ వ్రాయలేదు? కాని భార్గవకవివలె భార్య ఆత్మీయురాలిగా భావించి, శూన్యమై వ్రేలాడ్డ యెడదభారాన్ని వెడలబోసినట్లున్న 'కన్నీరు' చిరస్థాయిగా నిలుస్తుంది.

'నా యానందమవై దరస్మితవై  
నా వెల్గువై చూడ్కివై  
నా యుత్సాహమవై సుధారజనివై  
నా శయ్యవై సుప్తివై  
నా యిష్టంబుల ప్రోవువై మనసువై  
నా సర్వమై నేనయై మాయంబైతివి  
నీవు లేని జగతి మధ్యాన నే మిథ్యగాన్  
ఈ నిట్టూర్పుల వేడి గాడ్పులను  
నిట్లే వాడి యల్లాడి నా  
ప్రాణాంకూరము మాడిపోవు నిక  
నీవారావు కన్నీటిలో స్నానంబాడితి  
నిండుగుండియ కరంగన్ బాడితిన్

దైన్యకం తానన్ వేడితి................

మైన వీరి దాంపత్యం అపురూపమే కాదు వస్తువై కాలప్రవాహాని కెదురీది మహాకావ్య స్తుంది. 'కన్నీరు'కు దీటైనది పన్నీరు. ఖండికలో

'ఆడెద నొక్కసారి భువియంతయు  
నా హృదయాన నాడగా  
బాడెద నొక్కసారి త్రిదివం బది  
నా కనుముందు వ్రేలగా  
వీడని యైహికోహ నెడవీడని  
దివ్యతరోహ కూడి కో  
రాడగ స్వర్గసీమ గృహమై కుటియై  
సుమశయ్య యైనచో?'

వంటిపద్యాల నుదహరించటం ప్రార అన్నింటినీ ఉదహరించవలసి వస్తుంది.

'ఆమె పదాబ్జ కింకిణీ  
నతామృతనాదవియన్నదీయ  
వీచీమధునర్తనంబు విరబిందగ